





# జీవిత చరిత్ర

## ఆత్మయోగి సత్య కథ - 1 , 2





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆత్మయోగి సత్యకథ

శ్రీ శార్వరి

ప్రచురణ

మాస్టర్ యోగాశ్రమం

ప్లాట్ 90, "యోగాలయ " ఇందిరానగర్,

తిరుమలగిరి, సికింద్రాబాద్ 500 015.

ఫోన్ : 7790094

# జీవన కెరటాలు

# మా నాన్నగారు

మా నాన్నగారి జీవితం తనకు తెలిసింది ఒక వైపు అయితే, వారి పిల్లలమైన మేం చూచింది రెండవ వైపు వారి జీవితానికి, భావాలకు, ఆదర్శాలకు మేము నాలుగు అద్దాలవంటి వాళ్లం.

అక్షరాలు జీవితాన్ని జల్లెడ పడితే, అనుభవాలు మంచి ముత్యాల వలె పైకొస్తాయి. ఆ అనుభవాల లోతుల్ని స్పృశిస్తే సత్యాలు కథలుగా రూపుదిద్దుకుంటాయి జీవితం యోగపూర్ణం అయినపుడు అనుభవాల సంపుటి 'ఆత్మయోగి' సత్య కథనం అవుతుంది.

మన దేశంలో యోగులకు కొదవ లేదు. మనకున్న యోగమార్గాలూ తక్కువ కాదు. అయితే ఆత్మ సాక్షాత్కారం పొందిన యోగులు బహు అరుదుగా కనిపిస్తారు గడ్డాలు, మీసాలు పెంచడం వల్ల ఎవరూ యోగి కాడు కాషాయ బట్టలు కట్టిన ప్రతివాడు సన్యాసి కాలేడు భేషజాలు, ఆడంబరాలు లేకుండా అందరిలో తామూ కలిసిపోయే మాన్యులు, సామాన్యులలో అనేకమంది ఉంటారు. వారు నిరాడంబరంగా జీవిస్తూ ఆత్మను అన్వేషిస్తుంటారు. మనం వెతకాలి గాని, సామాన్యులలో నిజమైన యోగులు కనిపిస్తారు యోగ సాధనలో పండిపోయినవారు యోగులవుతారు. తమదైన మార్గాన్ని ఎన్నుకుని, తమ బాటన పదుగురిని నడిపించేవారు ఆత్మ యోగులవుతారు

సామాజికంగా అనేక రంగాలలో కొందరు ప్రముఖంగా కనిపిస్తారు. కొందరు ఆదర్శంగా ఉంటారు. అలాంటి వారి కథలు చదవ దగినవి, స్వయంగా తన అనుభవాల్ని రాసుకుంటే జీవిత కథలవుతాయి ఆత్మాన్వేషణలో పొందే అనుభూతులు, అనుభవాలు కలబోసినప్పుడు ఆత్మకథలవుతాయి. తన 'ఆత్మ'ను తాను దర్శించిన వ్యక్తి మాత్రమే ఇతరుల ఆత్మల్ని ప్రబుద్ధం చేయగలడు. ఆత్మకథల్లో సొంతగోడు ఎక్కువై పాఠకులకు విసుగు కలిగించే ప్రమాదం వుంది. అందుకే జీవితకథలు వచ్చినంతగా ఆత్మకథలు రావడం లేదు. ఆత్మ యోగి అయిన వ్యక్తి సొంత కథ రాయడు. 'సత్యకథ' రాస్తాడు. ఇది అలాంటి ఒక ఆత్మయోగి సత్యకథ.

ఇది మా నాన్నగారి సత్యకథ. అంత మాత్రాన ఇది మా ఇంటి కథ ఎంత మాత్రం కాదు. కారణం మా నాన్నగారి జీవితం మా కుటుంబానికి పరిమితమై ఎన్నడూ లేదు.

మాకు తెలిసినంత వరకు మా నాన్నగారు మొదటి నుండి పరమకోపిష్టి ఆ కోపం మాపైన అని చిన్నప్పుడు అనుకునే వాళ్లం కాని, మా అంచనా సరైంది కాదు. ఆయన కోపం సమాజంపైన, వ్యవస్థపైన, ఇంకా ఇంకా వేటిపైననో గాని మాపైన మాత్రం కాదని పెద్దయ్యాక గ్రహించగలిగాం. అప్పటికి నాన్నగారు ఒక మహాయోగంలో మునిగి తేలుతున్నారు. మా ఇల్లు ఒక యోగాలయంగా మారింది. మా నాన్నగారు ఎక్కడ సన్యాసుల్లో కలిసిపోతారో పిల్లల్ని సాకటం ఎలా అని మా అమ్మగారు అప్పుడప్పుడు బెంగపడేవారు. మాట్లాడితే ఉద్యోగానికి రాజీనామా చేస్తుండేవారు.

నాన్నగారు మాస్టర్ సి.వి.వి గారి యోగంలో చేరేనాటికి మేమంతా చిన్నవాళ్లం. తాను ఏ కారణంగా యోగంలో చేరినా మాకు మంచే జరిగింది. మా అమ్మగారు కూడా యోగం చేస్తారు. వాళ్లిద్దరు పొద్దున్నే యోగంలో కూర్చుని ఏడుగంటల వరకు లేవరు. కనుక అప్పటి దాకా మమ్మల్ని నిద్ర లేపే చాన్స్ లేదు. యోగంలో చేరిన కొద్దిరోజుల్లోనే నాన్నగారికి అనుభవాలు ఇబ్బడి ముబ్బడిగా వచ్చేవి. ఎప్పుడూ అంతర్ముఖులై ఉండేవారు. ఎవరినీ పట్టించుకునే వారు కారు. మౌనంగా ఉండకపోయినా మితభాషిత్వం బాగా అలవడింది. కోపం పోయి గంభీరంగా ఉండడం అలవాటైంది. ఎప్పుడూ ఏదో రాసుకోవడం, చదువుకోవడం వారికి అలవాటు.

కుటుంబాన్ని పోషిస్తూ, సాంసారిక జీవనం సాగిస్తూ యోగంచేయడమన్న ఒక కొత్త అనుభవం. గత ముప్ఫయి సంవత్సరాల కాలంలో మా నాన్నగారు ఒక వేయిమందికి ఉపదేశం చేయడం మా కళ్లతో చూచాం. రోజూ ఇంటికి యోగ సాధకులు వస్తుంటారు. వారికి యోగం గురించి ఎలా తెలుస్తుందో, ఎలా వస్తారో అర్థం కాదు. మా నాన్నగారు తనను తాను ఒక యోగిగా, గురువుగా మలచుకున్న తీరు అత్యద్భుతం అనిపిస్తుంది

నాన్నగారి జీవితం పూలబాట కాదు. నల్లేరుపై బండి నడక అంతకన్నా కాదు. అది గతుకుల బాట, ముళ్లకంచెల్ని త్రోసుకుంటూ ముందుకు సాగిన జీవన యాత్ర. ఇటు సమాజంలోనూ, అటు ఆధ్యాత్మిక జీవనంలోనూ అనేక సవాళ్లను ఎదుర్కొన్న వైనం మాకు తెలుసు. ఎదురు దెబ్బలు తగిలిన కొద్దీ పాదాలు గట్టిపడి నడక వేగం హెచ్చింది. అవమానాలు పొందిన కొద్దీ గుండె బండబారింది. అపజయాలు విజయసోపానాలైనాయి. అటు భౌతికజీవనం, ఇటు యోగసాధన సమ ఉజ్జీగా సాగాయి. చివరకు ప్రవృత్తి వృత్తిగా మారింది. అసలు వృత్తి నివృత్తి అయింది. కలంజీవి ఆత్మయోగంలో లయించి, పరాన్వేషణకు బదులు సత్యాన్వేషణ చేసి సత్యయోగి అయినారు.

నాన్నగారి ఆత్మకథ తొలి అధ్యాయాలలో భౌతిక జీవన సంఘర్షణ ఎంత తీవ్రంగా

ఉండేదో, మలి అధ్యాయాలలో యోగంలో ఘర్షణ అంత తీవ్రంగానూ ఉంది రెంటిని సంధాన పరిచింది రచన. తొలినాళ్లది సాహిత్య ప్రస్థానం. తర్వాతది ఆత్మాన్వేషణ నాన్నగారు రచయితగా 50 సంవత్సరాల పాటు తెలుగు పాఠకులకు పరిచయం ఎవరైనా రచయిత కావడానికి జీవిత సంఘర్షణ, సామాజిక దురన్యాయాలు, శాపాలు కారణాలు మామూలుగా బ్రతకడానికి అంత ఘర్షణ అవసరం లేదు సంఘర్షణ అవసరం లేదు. అన్యాయంపైన పోరాడవలసిన పని ఉండదు. తలవంచితే చాలు, సర్దుకుపోవచ్చు కానీ నాన్నగారికి సర్దుకు పోవడం, అన్యాయానికి తలవంచడం చాత కాదు. జీవితంలో ఒక లక్ష్యం లేనివారు సర్దుకు పోతారు ఒక గమ్యం ఏర్పరచుకోనివారు తలవంచి బ్రతికేస్తారు తపన ఉన్న మనిషికి నిశ్చలత ఉండదు. మొదట కరకరలాడే ఆకలి తిరుగుబాటు నేర్పింది. పెద్దయ్యాక సమాజంలోని అసమానతలు, పక్షపాతం, కులద్వేషం ఎదురు నిలిచి, పోరాటం సాగించే ధైర్యాన్నిచ్చాయి. నాన్నగారు వేసిన ప్రతి అడుగు, తిరిగిన ప్రతి మలుపు తన తరానికి మా తర్వాతి తరానికి స్ఫూర్తినిచ్చాయి. వారి జీవితం ఒక తెరిచిన పుస్తకం. ప్రతి పుటలోను 'సత్యం' పురుడు పోసుకుంటుంది.

తెలుగు పల్లెల పచ్చదనం, అందచందాలు మాకు తెలియదు. కాస్త ఊహ తెలిసేటప్పటికి నాన్నగారు మద్రాసు చేరుకున్నారు. నాన్నగారు పుట్టిన పల్లె కోపల్లెను మేము ఎఱగం. కానీ అదొక వ్రేపల్లె ఒక మహాయోగిని కన్న పల్లె. స్వాతంత్ర్యానికి ముందు ఈ దేశం ఎలా ఉండేదో, మనుషులు ఎలా జీవించే వారో ఈ పుస్తకం చదివి తెలుసుకుని, కన్నీరు కార్చాం. దురదృష్టం గుండె పగుళ్లలో దాగి, సలపరం చేస్తున్నా, నిబ్బరంగా, ఆధ్యాత్మిక సంపన్నులు వెన్ను చరిచి ఆశీర్వదించినపుడు నిటారుగా నిలబడడం వారి అదృష్టం. చీకట్లలో చిరు వెలుగు కిరణం కోసం తడుముకోవడం గొప్ప స్ఫూర్తి. రెండు పదుల జీవితంలో కాసుల కోసం రాత్రింబవళ్లు కష్టించడం, అక్షరాల గవాక్షాల తలుపులు తెరచుకోవడం, నేటి కాలం వారు ఊహించలేని అనుభూతి. జీవితం ఇంతటి వేదనామయమా? సంఘర్షణల మయయా అనిపిస్తుంది.

ఆ నాటి సాంఘిక వ్యవస్థ, ఉమ్మడి కుటుంబాలతీరు నాన్నగారి జీవితాన్ని హేళనకు గురి చేసినా, అవమానాల పాలు చేసినా, అవి భవిష్యత్తుకు మల్లె పందిరులే వేశాయి. పరిమళాలు వెదజల్లాయి. యోగాభివృద్ధికి అనుకూల దాంపత్యం, అనురాగ భరితం కావాలన్న సూత్రానికి మా అమ్మగారిని, నాన్నగారిని ఆదర్శంగా తీసుకోవచ్చు. మాకు తెలిసినంత వరకు మా ఇల్లు ఎప్పుడూ యోగ సాధకులతో కళకళ లాడుతుంది. రోజూ సత్సంగాలు జరుగుతుంటాయి. సాహిత్య చర్చలు, ఆధ్యాత్మిక చర్చలు

జరుగుతుంటాయి. జీవితాన్ని యోగజీవితం చేసుకోవడం, పూర్ణత్వం సాధించడం జీవిత లక్ష్యం అని నమ్మారు మా అమ్మానాన్నలు.

నాన్నగారి ఉద్యోగం అతి నిరాడంబరంగా సాగింది. కుటుంబం కోసం, తన పిల్లల కోసం ప్రామోషన్లు వదులుకున్నారు. పేదరికంలో ఉన్నా చదువుల విషయంలో ఎన్నడూ అశ్రద్ధ చూపలేదు. ఉన్నంతలో మాకు అన్నీ అమర్చేవారు ఆ సింప్లిసిటి, డిసిప్లిన్ కారణంగా, మేమూ అతిగా ఏమీ కోరేవాళ్లం కాదు ఆ డిసిప్లిన్ ఇప్పుడు మా జీవితాలకు ఒరవడి అయింది. నాన్నగారు ఉద్యోగ కాలంలో పై పదవులు, అధికారాలు ఆశించింది లేదు. తన యోగసాధనకు ఆటంకం అనిపిస్తే దేనినైనా వదులుకునేవారు.

డబ్బు చుట్టు ప్రదక్షిణాలు చేసే నేటి లోకంలో నాన్నగారు ఏనాడు డబ్బు కోసం కక్కుర్తిపడలేదు. అక్రమ సంపాదనకు అర్రులు చాచలేదు. లేమిని ఆనందంగా అనుభవించడం నేర్చుకున్నారు. కాంక్షలు లేవు కనుకనే యోగి కాగలిగారు. మాస్టరు కాగలిగారు. ఆత్మను అన్వేషించడం కొందరికే వీలవుతుంది. అందునా సత్యదర్శనం బహుకొద్ది మందికి లభించే వరం. నాన్నగారినిచూచి మేం నేర్చుకున్నది జీవితంలో నిరాశా నిస్పృహలకు క్రుంగి పోకూడదని, చీకటిని చూచి భయపడరాదన్నది వారి జీవనసూత్రం. చీకటిలో నడుస్తూ వెలుగును వెతకాలి.

జీవితంలో ఎల్లకాలం చీకటి ఉండదు. దైన్యం పోతుంది. కష్టాలు కడచిన తర్వాత ఆనందం మనదవుతుంది. అందుకు ఓర్పు, సహనం అలవరచుకోవాలి. ఆశయం ఉన్నతంగా ఉన్నప్పుడు ఏనాటికైనా లక్ష్యాన్ని సాధించగలం. ఎదురు దెబ్బ తగిలినప్పుడు ఎవరైనా 'అమ్మా' అంటారు. కష్టాలువచ్చినప్పుడు భగవంతుని స్మరిస్తారు. నాన్నగారు ఒక సందర్భంలో 'మృత్యువు' గుమ్మం తలుపు తట్టినప్పుడు సత్యాన్వేషణకు ఉపక్రమించారు. అందుకు యోగం ఆధారమైంది. యోగజీవనం అవసరమైంది. తదాది అమ్మానాన్నల జీవితం యోగమయం అయింది. అందుకే ఇది నాన్నగారి ఆత్మకథ కాదు. సత్యకథ అయింది. సత్య యోగ చరిత్ర అయింది. యోగం వేరు, జీవితం వేరు కాదు. నాన్నగారి యోగాశ్రమం యోగచైతన్యంతో నిండి వుంటుంది వారి హృదయంలాగా. మా అమ్మగారి తేజస్సు, వర్చస్సు నాన్నగారి జీవనంలోనే కాక, యోగంలోనూ అణువణువున కలిసిపోయి కనిపిస్తుంది. ఈ సత్యకథ చదువరులందరికీ కనువిప్పు కలిగిస్తుందని, మార్గదర్శకం అవుతుందని మా నమ్మకం.

- డా. వసంతకుమార్, శ్యాం సుందర్

- డా. వెంకట రమణ, పద్మప్రియ

# మా పల్లె కోపల్లె

**కథ కానిది, కల కానిదీ జీవితం.**

కథల లోతుల్లోంచి, కలల అంచుల మీదికి దూకే జీవితాలు కొన్ని వుంటాయి అలాంటి జీవితాలు సత్యశిఖరాల్ని అధిరోహిస్తుంటాయి. కొత్తవెలుగుల్ని చూస్తాయి. కొంగ్రొత్త ఉదయాల్ని దర్శిస్తాయి.

ఇది నా జీవితం కాదు. నా చుట్టూ, నన్ను అల్లుకున్న, అలముకున్న సమాజం, అందులో నేను, నాలాంటి మీరు, మనలాంటి మనుషులు కనిపిస్తారు. కనుక ఇది...సత్యకథ మనిషికి జీవితం ఒక వరం అంటారు కొందరు. శాపం అనేవారూ ఉన్నారు. జీవితాన్ని ఒక వరంగానో, శాపంగానో భావించగలిగినది మనిషి మాత్రమే. మనస్సు, బుద్ధి వున్న మనిషి మాత్రమే ఆలోచించగలడు. విచక్షణ చేయగలడు. పూర్వజన్మల కర్మఫలాలు అనుభవించడానికే మళ్లీ జన్మిస్తాం అనేవారున్నారు. పూర్వజన్మస్మృతి మనకు వుంటే పూర్వజన్మలు ఉన్నాయని నమ్మవచ్చు తల్లి కడుపులో ఉన్నంతవరకు పూర్వజన్మ జ్ఞానం వుంటుందని చెబుతారు. తలుపు తెరుచుకొని, ఈ భూమిపైకి వచ్చిన క్షణంలో కెవ్వుమన్న అరుపుతో ఆ జన్మల స్మృతి మరుగున పడుతుంది. ఆత్మను ఒక మాయతెర కమ్మి వేస్తుంది, కనుక జ్ఞాపకాలు వెనక్కి పోతాయి. జన్మజన్మల సంస్కారం, కర్మల తాలూకు శేషం, సంక్షిప్తీకరించబడి కుండలినిలో దాగి వుంటుంది. ఆ కుండలిని అతి భద్రంగా, రహస్యంగా, అభేద్యంగా వుంటుంది. అసలు 'కుండలిని' అనేది మనలో ఒకటి వున్నదని తెలియనంతటి మాయపొర మనల్ని కమ్మివేస్తుంది. కప్పి వుంచుతుంది.

మనిషి మాత్రమే ఆలోచించగల జీవి. కనుక జీవితం వరప్రసాదమో, శాపఫలమో తెలుసుకోగలడు. తన జీవితాన్ని ఒక వరంగా, ఒక స్వర్గంగా మార్చుకోగలడు.

మనస్సుతోపాటు, మనిషికి భగవంతుడు ప్రసాదించిన వరం హృదయం. మనిషి తన రుణం తీర్చుకోవలసింది హృదయంతో గాని మనస్సుతో మాత్రం కాదు.

హృదయాన్ని ప్రేమతో, కరుణతో, అనురాగంతో నింపుకున్నప్పుడు భగవంతుని ఋణం తీర్చుకోడానికి అవకాశం ఏర్పడుతుంది. ప్రతి తల్లి తన బిడ్డకు పంచిపెట్టేది ఆ ప్రేమనే. కన్నబిడ్డల్ని ప్రేమించని తల్లులు అరుదుగా వుంటారు. కొందరి ప్రేమ వెనుక కసి, ద్వేషం వుంటాయి.

నేను అమ్మ ప్రేమకు దూరమైనానేమో అనిపిస్తుంది నా అంచనా నిజం కాకపోవచ్చుకాని, నన్ను పెంచిన తీరు ఆ అభిప్రాయాన్ని నాలో ముద్రించింది. అమ్మ అయిష్టతకు కారణం నాన్న. ఆయన అసమర్థత. ఆయన వైరాగ్యం. భార్యాభర్తల మధ్య వుండవలసిన ప్రేమ, సఖ్యత, యిష్టం కుంటినడక నడిస్తే, దాని ప్రభావం కన్నబిడ్డలపైన వుండితీరుతుంది. తల్లిదండ్రులు అన్యోన్యంగా, ప్రేమగా, మమతానురాగాలతో వున్నప్పుడు వారి బిడ్డలు కడిగిన ముత్యాల్లా తయారవుతారు. నాన్న వైరాగ్యానికి, అమ్మ కన్నీటికి నేను కారణం కాదు. నేను లోకంలోకి రాకపూర్వమే నాన్న వైరాగ్యం పెంచుకున్నాడు. అమ్మను పుట్టింట వదలి, ఇల్లు విడిచి వెళ్లిపోయాడు. నల్లమల అడవుల్లో తపస్సు చేసుకోవడం ఆయన లక్ష్యం.. తపస్సు చేసి ఏదో సాధించాలని ఆయన కోరిక. ఆ దిగులు అమ్మది. భర్త అడవులు పట్టిపోతే నిజానికి ఏ ఇల్లాలు ఆనందంగా ఉండగలదు. కథలు వేరు, జీవితం వేరు. నేను కడుపులోపడ్డ సమయాన నాయన ఇల్లు వదలి, ఇల్లాలిని వదలి వెళ్లిపోవడం వల్ల, ఆ నేరం పుట్టని నాపైన పడ్డది. ఆయన వైరాగ్యానికి నేను కారణమా! ఇంకా నాకు అమ్మ కాని అమ్మ కన్నీటికి నేను కారణమా! నన్ను కనడం ఇష్టం లేకపోయినా సృష్టి ధర్మంగా బిడ్డను కనక తప్పలేదు. కన్నవారు కసి పెంచుకున్నా, భగవంతుని రక్ష వుంటుంది. బిడ్డ పుట్టిన తర్వాత దిగులు దిగమింగి కన్నబిడ్డను అక్కున చేర్చుకోక తప్పదు. అక్కడ సృష్టిలో మాతృహృదయం విశిష్టత కనిపిస్తుంది. నా గురించిన జ్ఞాపకాలు నన్ను వదలిపోలేదు. అనేక విషయాలు మరచిపోదామని ప్రయత్నించినా మరచిపోలేక పోయాను. తల్లిగర్భంలో వున్నంతవరకు పూర్వప్రజ్ఞ వుంటుంది. ఆ తొమ్మిదినెలలూ తపస్సే. భూప్రపంచం గురించి తెలియదు. అయితే బయట ఒక ప్రపంచం వుందని తెలియకపోయినా, బయటవారి మాటల ప్రభావం బిడ్డపైన వుంటుంది. ఏడవనెల నుండి మెదడు బయటనుండి అందుకునే సంకేతాల్ని, భావాల్ని రికార్డు చేసుకుంటుంది. అది చైతన్యం తొలిమెట్టు. అలా వున్న చైతన్యం, ప్రజ్ఞ, శిశువు భూమిపైనపడ్డ క్షణంలో మాయమవుతాయి. ఈ ప్రపంచం వేరు - ప్రతి జీవుని జననం గతానికి ప్రస్తుతానికి సరిహద్దు. ఎన్నో జన్మల ప్రజ్ఞ యావత్తు, కుండలినిలో దాచిపెట్టబడుతుంది. మన పూర్వజన్మల సొత్తు మనలోనే వుంటుంది. అదే సృష్టివైచిత్రి. అదే కుండలినీ రహస్యం.

ఆ కుండలినిలో దాగివున్న రహస్యాన్ని భేదించి, తెలుసుకోవాలంటే చాలాచాలా సాధన చేయాలి. తపస్సు చేయాలి. ప్రాపంచిక మాయతెరను తొలగించుకోవడం, సత్యాన్ని తానుగా దర్శించడం మనిషి పరమలక్ష్యం ప్రతిమనిషిపైన గ్రహాల ప్రభావం వుంటుంది. ఆ గ్రహాల ప్రభావానికిలోనై అందరూ జీవిస్తారు. వాటి ప్రభావానికి అతీతంగా, ఆ శక్తుల్ని అదుపుచేసి, స్వశక్తితో జీవించగలవారు మహాత్ములు, యోగులు అవుతుంటారు.

మాపల్లె కోపల్లె. తెలుగునాట అన్ని పల్లెల వంటి ఓ చిన్న పల్లె. పట్టుమని నూరు గడప వుంటుందేమో! మనదేశంలో ప్రతిపల్లె ఒక వ్రేపల్లె. మా కోపల్లె ఒక బృందావనం వంటిది. ప్రక్కన యమునలాంటి ఓ పెద్ద కాలువ పోతుంది ఆ కాలువకు ఇరువైపుల గట్లపై పెద్ద మామిడి చెట్టు. . అటు ఇటు అరటితోటలు, కొబ్బరి చెట్లు.. చాలా అందంగా వుండేది ఊరికి రెండువైపుల కాలవలు. నాలుగుదిక్కుల తోటలు అరణ్యం మధ్యవున్న ఋషివాటిక అనిపించేది. కణ్వాశ్రమాన్ని తలపింపచేసేది. కాస్తంత పట్నం నాగరికతకు మూడుమైళ్ల దూరం. ఊరంతా రైతుకుటుంబాలు మధ్య మధ్య నాలుగు సనాతనపరుల కొంపలుండేవి. ఊరికంతా ఒక్కటే పాఠశాల, ఒకే ఉపాధ్యాయుడు. అయిదు తరగతులు కలిసి ఓ వందమంది పిల్లలు. ఊరికో గుడి .. వేణుగోపాలుడి కోవెల. ఊరిమధ్యలో ఓ రచ్చబండ . వేపచెట్టు క్రింద అల్లంతదూరాన మంచినీళ్లబావి ఊరికంతా ఒక్కటే బావి. పెద్దరైతుల ఇళ్లకు సొంత బావులుండేవి. ఊరికి నాలుగు వీధులు. రచ్చబండపైన పులిజూదం, పేకాటలు.

ఆ ఊళ్లో పుట్టాను నేను నవంబరు నెలలో ఏడవరోజు అర్ధరాత్రిని చీల్చుకుంటూ వచ్చాను. శ్రీకృష్ణుడు కారాగారంలో జన్మించాడు. నేను కారుచీకటిలో జన్మించాను. కృష్ణుని కన్నందుకు యశోద ఏడ్చింది. నన్ను కన్నందుకు మా అమ్మ ఏడ్చింది యశోదలా. కారణాలు వేరు కన్నీటికి. అప్పుడు యశోద ప్రక్కన వసుదేవుడున్నాడు ... కన్నీరు తుడవడానికి. ఇక్కడ అమ్మ కన్నీటికి కారకుడైన నాన్న పక్కన లేడు. అసలు ఎక్కడున్నాడో తెలీదు. ఆయన నిజంగా తపస్సు చేసుకుంటూ వుంటే పుట్టినప్పటి నా ఏడుపు ఆయనకు వినిపించి వుండాలి. తన బిడ్డను ఎలా బ్రతికించుకోవడం అన్నది యశోదమ్మ సమస్య. పుట్టిన బిడ్డను ఎలా సాకగలనన్నది మా అమ్మ సమస్య.

మా నాన్నగారి ఊరు వేజెండ్ల. అక్కడ నేనెప్పుడూ వున్నది లేదు, అక్కడ పెరిగిందీ లేదు. మా పితామహులు ఎలా వుండేవారో నాకు తెలియదు. కోపల్లె మాతామహుల ఊరు. మా అమ్మ తండ్రిగారు కోటయ్య గారు. ఊరివారందరు

పెద్దబ్బాయి అని పిలిచేవారు. మా అమ్మమ్మను నేనెరగను. ఎప్పుడు పోయిందో మరి. తాతగారు నైష్ఠికులు. శివారాధకులు తెల్లవారుఝామునే కాలవకు పోయి, కాలకృత్యాలు తీర్చుకుని, కాల్వలో స్నానంచేసి, సంధ్యావందనం పూర్తి చేసుకుని ఇంటికి వచ్చేవారు ఆయనకు బంగారం పనితో పాటు ఆయుర్వేదమూ తెలుసు. తానే రకరకాల మందులు తయారుచేసి యిచ్చేవారు. చుట్టుపక్కల ఊళ్లకు ఆయన వైద్యుడు. అందరికీ ఇష్టుడు. కాస్త భూవసతి వుండేది. చేతివృత్తి వుండేది

మా అమ్మకన్న పెద్దామె ఒకరున్నారు ఆమె భర్త నాటకాలరాయుడు ఆయన కృష్ణలీలలు నాటకంలో వసుదేవుడి వేషం వేసేవాడట ఆయనకు పిల్లలు లేరు. మా నాన్న దేశాంతరం వెళ్లిపోయిన కారణంగా మా అమ్మకు మగపిల్లవాడు కలిగితే తాము తీసుకుని పెంచుకుందామని అనుకున్నారుట. పెద్దమ్మ భర్త అయినా, మరొక వరసలో పెదనాన్న గారే ఆయన. నాకు కృష్ణుడని పేరు పెట్టాలనుకున్నారట. పుట్టకముందే నామకరణం చేసేశారు నాకు నేను పుట్టిన మూడవరోజున ఆ శుభవార్త ఒక మనిషి ద్వారా పెదరావూరు పంపారు. అదే సమయాన ఆ ఊరి నుండి మరొక వ్యక్తి బయలుదేరి వచ్చి 'ఆయన' హఠాత్తుగా చనిపోయినట్లు వార్త చెప్పాడు. అది నా తొలి దురదృష్ట సంఘటన. నన్ను పెంచుకుందామని అనుకున్న కారణంగా, నేను పుట్టగానే ఆయన గిట్టడం ఏమిటి? దానికి ఓ 'పసిబిడ్డ' కారణం ఎలా అవుతాడు? ఆ నీడ నాపై పడ్డది. పెద్దమ్మగారు వైధవ్యభారంతో పుట్టింటికి చేరింది. ఆమె 'నన్ను' పెంపుడు తీసుకోలేదు కాని నా మంచిచెడులు చూచేది. ఆమెనే రెండోమ్మ అని పిలిచేవాడిని. తరువాత అమ్మగా మార్చుకున్నాను ఎప్పుడో.

బారసాలనాటికి మా నాన్న తిరిగి వచ్చాడు. నేను భూమ్మీద పడగానే వేసిన కేక ఎక్కడో నల్లమల కొండల్లో తపస్సు చేసుకుంటున్న ఆయన చెవులకు వినిపించి వుంటుంది. తపోభంగమై వుండాలి. పరుగున వచ్చాడు. మా అమ్మ ససేమిరా వేజెండ్ల రానని మొండికెత్తింది. మా తాతగారు, పెద్దమ్మ కూడ 'నన్ను' సాకుగా చూపించి, నాయనగారి మకాం కోపల్లెకు మార్చమని వత్తిడి చేశారు. వేరే ఇంట్లో అమ్మానాన్నల కాపురం. నేను ఎక్కువభాగం తాతగారింటనే వుండేవాడిని .

పురిటిగదిలోనే ఒక విచిత్రం జరిగింది. నా కంటే ముందు ఒక ఆడపిల్ల పుట్టిపోయిందట. అందుకని రెండవకాన్పులో పుట్టిన బిడ్డను ఎంగిలి విస్తరాకులో చుట్టచుట్టి పెంటకుప్పపైన పారవేశారు. ఆ పెంటకుప్పలో ఏడుస్తున్న బిడ్డను ఓ ఇల్లాలు తీసుకువెళ్లి, ఒక రాత్రి తన పాలిచ్చి నిద్రపుచ్చింది. మరునాడు ఆమెకు చాటలో

దోసెడు రూకలు, ఇంత బంగారం వేసి ఇచ్చి, తీసుకున్నారు. ఇది ఒక పథకం ప్రకారమే జరిగినా, పిచ్చి నమ్మకమే అయినా జరిగింది అది. నన్ను తీసుకువెళ్లిన మాతృమూర్తి పేరు కోటమ్మ. మా తాతగారి ఇంటి పక్కఇల్లే వారిది. అదొక ప్రహసనం.

ఆ కోటమ్మకు ఓ కొడుకున్నాడు. నాలుగునెలలవాడు ఆమె నన్ను తిరిగియిస్తూ ఒక షరతుపెట్టింది. బాబుకు తను రోజూ పాలివ్వాలని. మా తాతగారు సరేనని ఒప్పుకున్నారు. తాతగారింట్లో వున్నా ఇబ్బంది లేదు... నేను దూరంకావడం వల్ల మాఅమ్మ సంతోషంగా వుండేది. ఎందుకో ఒక విధమైన అయిష్టత నేనంటే. ఒక్క కోటమ్మకే నాకు పాలిచ్చే అవకాశం రావడం ఊళ్లోని కొందరికి అసూయగా వుండేది ఏదో పని వున్నట్టు తాతగారింటికి వచ్చి పాలు పట్టి పోతుండేవారు. ఆ ఊళ్లో ఎందరో నాకు తల్లులు అందరి ప్రేమను పాలలో కలుపుకుని తాగాను ఊరందరికీ ఎత్తుబిడ్డనైన అదృష్టం నాది.

మా తాతగారింట్లో ఒక వంటామె వుండేది. ఆమె కూడా నన్ను ప్రేమగానే చూచుకునేది మా మేనమామకు పెళ్లి అయింది. ఆయనగారి భార్య గుమ్మటంలాగా 'గొబ్బెమ్మ' వుండేది. మామయ్యకు ఆమెకు పడేది కాదు ఆయన పొడవుగా ఎర్రగా వుండేవాడు. ఆమె పొట్టి, లావు. భార్యమీది కోపంతో ఆయన తెనాలి వెళ్లి సంస్కృత కళాశాలలో చేరాడు.

నా పేరు కృష్ణ అని పెట్టారు మా నాన్నకు తాతగారికి పడేది కాదు. ఇద్దరూ మాట్లాడుకునేవారు కాదు. వారి మధ్య ఆసులో గొట్టంలా నేను తిరగవలసి వచ్చేది. పంతాలు పట్టింపులు మామా అల్లుళ్ల మధ్య ఆ రోజుల్లో మజాగా వుండేవి మా నాన్న కాస్త కుదురుగా వున్నాడని అందరూ సంతోషించారు అంతలో ఆయనగారి గురువుగారు ఊడిపడ్డారు. ఆయనపేరు హనుమయ్యగారు. ఎర్రటి కళ్లు .. భయంకరంగా కనిపించినా మనసు మెత్తనివాడు. ఆయనగారు మా నాన్నగారికి బావగారి వరస అవుతాడట. ఏడాదికోమారు శిష్యుల ఇళ్లకు వస్తుండేవారు. ఏ బుద్ధిన వున్నదోగాని మా అమ్మకూడా ఆయన వద్దనే ఉపదేశం తీసుకున్నది. భార్యాభర్తలిరువురూ ఒకే గురువువద్ద ఉపదేశం పొందడంవల్ల కాస్త జపతపాలు సాగించడం వల్ల ఇంట్లో పోట్లాటలు సద్దుమణిగాయి. నాన్న సంపాదన మెరుగు కాసాగింది. సమాజంలో పలుకుబడి పెరిగింది. ఇద్దరూ గురూపదేశం పొందడంవల్ల సంసారం కలతలు లేకుండా సాగింది. ఆ తరువాత పుట్టిన ముగ్గురూ ఆడపిల్లలే అపర్ణ, విమల, పార్వతి... మా అమ్మ దృష్టిలో వారు త్రిమూర్తులు...

నా మూడవఏటనే నా యోగజీవనానికి బీజంపడ్డది. అది యాదృచ్ఛికం. మా మేనమామ రాఘవయ్య సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్రాలు చదువుతున్న రోజులు.

అప్పుడు ఇంగ్లీషు చదువులకన్న సాంప్రదాయ కుటుంబాల పెద్దలకు సంస్కృతంపైన మోజు పండితుడు కావడం గొప్ప. పద్యాలు రాయడం సాహిత్య పరాకాష్ట. మా మేనమామగారు నాకు భగవద్గీత శ్లోకాలు నేర్పారు. అక్షరాభ్యాసం కాకుండానే గీతా శ్లోకాలు నేర్పారు. ఆయనలా శ్రావ్యంగా చదవడం నేర్పారు అవే కాదు, భాగవతంలోని కమ్మని పద్యాలు చాలా నేర్పారు. పద్యం హృద్యంగా చదవడంలో ఒక ఆనందం వుండేది. పద్యానికి ఒక లయ వుండేది నాకు పద్యాలు బాగా చదవడం నేర్పింది ఆయనే.. ఆయనకు వేదాంతంపట్ల కాస్తంత ఆసక్తి వుండేది. రామకృష్ణపరమహంస, స్వామి రామతీర్థ, మళయాళస్వామి ప్రచారం ఎక్కువగా వుండేది. పల్లెలలో దైవభక్తి ఎక్కువ. వేదాంతోపన్యాసాలంటే పదివూళ్ల వాళ్లు బళ్లు కట్టుకువచ్చేవారు. మళయాళస్వామి మా ఊరు వచ్చారు. మా తాతగారు వైవభక్తులు ఏర్పాట్లు ఆయనే చేయించారు. అలాంటి సత్కార్యానికి ఊళ్లోని రైతుకుటుంబాల వారంతా కలసికట్టుగా పనిచేసేవారు. ఒక్కతాటిపైన నిలబడి, ఒకే కుటుంబంలా మెసిలెవారు. మా నాన్నగారు, మేనమామ కార్యనిర్వాహకులు ఊరిబయట కాలువపక్కన ఒక కొబ్బరితోటలో పర్ణశాల ఏర్పరచారు. పది ఊళ్లలో డప్పు వేయించారు... స్వామీజీ వచ్చారని. రోజూ సాయంత్రం వేళల్లో సత్సంగాలు, గోష్టులు జరుగుతాయని. కొన్నిరోజులపాటు స్వామిగారి ప్రసంగాలు సాగాయి. నేను గీతాశ్లోకాలు చదివేవాడిని. ఆయన ఆనందంగా విని, వాటికి వ్యాఖ్య చేస్తుండేవారు. ఒక మూడు సంవత్సరాల కుర్రవాడు పుస్తకం చూడకుండా శ్లోకాలు చదవటం చూచి జనం ముచ్చటపడేవారు. ఆయన నన్ను తన ఒడిలో కూర్చోబెట్టుకుని ప్రేమగా నాపేరు 'రామకృష్ణ' అని మార్చారు అది ఒక మహాత్మునితో నాకు కలిగిన తొలి పరిచయం. అది నా పూర్వజన్మ సుకృతం. అదే నా భవిష్యజీవితానికి దివ్యమైన ఆశీర్వచనం

నా అయిదవ ఏట జరిగిన మరొక సంఘటన నా జీవితానికి మరొక చుక్కాని అప్పట్లో ఆంధ్రప్రాంతంలో రామకృష్ణ పరమహంస, వివేకానంద స్వామిల ప్రచారం బాగా జరుగుతోంది. ఆధ్యాత్మికచింతన, యువతలో నైతికత - ఆ బోధనల్లో వుండేది. అది ఒక సామాజికచైతన్యం, ఒక ఉద్బోధ, ఒక ఉద్గీత. సామాజికంగా భావవిప్లవానికి, ఆధ్యాత్మిక వికసనానికి స్వామీజీ బోధలు ఉపకరించేవి. మావాళ్లే రప్పించారు. ఆయన పేరు తత్వానందస్వామి. మా వూరు మొత్తానికి చదువుకుంటున్న వ్యక్తి మా మేనమామ ఒక్కరే. మిగిలినవారి చదువులు ఎలిమెంటరీస్కూలుతోనే ఆగిపోయాయి. ఈయన తెనాలి వెళ్లి చదువుకునేవారు.

సంస్కృతం, వేదం చదవడం ఆ రోజుల్లో గొప్ప. వారు శాలువాలు వేసుకుని

తిరిగేవారు వారిని జనం గౌరవించేవారు పంతులుగారు అని పిలిచేవారు. ఇంగ్లీషు చదువుకన్నా సంస్కృతం చదివినవారికి సమాజం యిచ్చే గౌరవం భిన్నంగా వుండేది మా మేనమామకు సంస్కృతం చదువు వల్ల తాత్త్వికచింతన కాస్త అలవడింది మా తండ్రిగారు సరేసరి. గురూపదేశం పొంది, ఏదో ధ్యానం, తపస్సు చేసుకునేవారు స్కూలు చదువు తక్కువే అయినా వేదాంత గ్రంధాలు చదివేవారు. ఆయన వద్ద సనారీ విశ్వేశ్వర సంవాదం, అధ్యాత్మ రామాయణం, సత్యార్థ ప్రకాశిక లాంటి పుస్తకాలు ఉండేవి ఆయనకు ఓ పెద్ద రుద్రాక్షమాల, పులిచర్మం, తంబూరా వుండేవి. ప్రతిఏడాది ఒకమారు ఆయన గురువుగారు వచ్చి, వారం పదిరోజులుండేవారు. గుర్వు రాకవల్ల మానాయనగారి పేరు చుట్టుపట్ల గ్రామాలకు బాగా పరిచయం అయింది. మంచిపేరు సంపాదించారు. ఆ పరపతి చేతివృత్తికి సహకరించింది ఇంట్లో దరిద్రం నీడలు తొలగిపోయాయి. సంసారపక్షంగా జీవి. ంలోని ఉదాత్తతను ఆయన గ్రహించి మళ్లీ సన్యాసం మాట ఎత్తేవారు కారు.

త్వానందస్వామి పూర్వాశ్రమంలో మాకు బంధువు ఆయన సన్యసించి రామకృష్ణమ ంలో చేరారు. ఆరోజుల్లో సాధుసన్యాసులంటే సంసారులకు గొప్ప పూజ్యభావం వుండేది బైరాగులకు సైతం జరుగుబాటు బాగా వుండేది తత్వానంద, గృహస్తుల ఇండ్లలో బసచేసేవార్ధు కాదు అదొక నియమం. భోజనానికి మాత్రం వచ్చివెళ్లేవారు. ఆయన విడిదికి ఒక ఆశ్రమంలాంటి పర్ణశాల నిర్మింపచేశారు.. ఊరి చివరన, కాలవ ప్రక్కన వున్న కొబ్బరితోటలో. రోజూ రామకృష్ణపరమహంస బోధనలు, జీవితకధలు వినిపించేవారు. జనం వందలకొద్దీ వచ్చేవారు. ఆయనే నాపేరు రామకృష్ణ పరమహంసగా మార్చారు. భవిష్యత్తులో రామకృష్ణునివలె గొప్పగా ఆత్మజ్ఞానం పొందగలనని అన్నారు. అయిదేళ్ల వయస్సులో ఆత్మజ్ఞానం అంటే ఏం తెలుస్తుంది అప్పటికింకా స్కూలులోనైనా వేయలేదాయె. ఇప్పటిలాగా మూడోసంవత్సరం రాగానే ఎల్.కె.జి.లో వేయడం లేదు. అయిదు సంవత్సరాలు పూర్తిఅయితేనే స్కూలులో ప్రవేశం. నాకు అక్షరాభ్యాసం చేసింది స్వామి తత్వానంద. 'ఓం నమః శివాయ' అని పలకమీద రాసి, 'శ్రీరామకృష్ణాయ నమః' అని పలికించారు. మహాత్ముల ఆశీస్సులు వృధా కావన్నది సత్యం.

అప్పట్లో కాన్వెంటు స్కూల్సు లేవు. పల్లెల్లో ఇంగ్లీషు నేర్పేవారు కాదు. మాలపల్లెలో ఒక స్కూలు వుండేది. ఊరిమధ్యలో ఒక స్కూలు వుండేది స్కూలులో చేరేసమయానికి నాకు అయిదు బడులు ఇంట్లోనే నేర్పారు. వాణీవాచకంతో నాచదువు మొదలైంది. కృష్ణశతకం, సుమతీశతకం పద్యాలన్నీ కంఠతః వచ్చేవి. భగవద్గీత సరేసరి!

అది నిత్యపారాయణం నాకూ, మా మేనమామగారికీ. అయిదు శతకాలు పిల్లలందరికీ నేర్పేవారు. స్కూలులో పెద్దబ్బాయిగారి మనవడు అంటే ఒక ప్రత్యేకమైన మన్నన. చదువులో వెనకబడడం అనేది లేనేలేదు. ఒక్కసారి టీచరు చెబితే వచ్చేసేది. ఆ స్కూలులో నేను చదివింది నాలుగు సంవత్సరాలు. అంటే నాల్గవ తరగతి పూర్తి అయ్యేవరకు పల్లెచదువు

పల్లెజీవితం పరమప్రశాంతంగా వుండేది నాగరికతకు చాలా దూరం. ఎదుగుబొదుగు వుండదు. మార్పు రాదు. ఆ ఊళ్లో ఒక పోస్టాఫీసు లేదు, కరెంటు లేదు, రోడ్లు లేవు. అన్ని ఇళ్లలోను కిరోసిన్ దీపాలు. ఊరు మొత్తానికి మూడో, నాలుగో డాబా ఇళ్లు. మిగతవన్నీ పెంకుటిళ్లు, పూరిళ్లు. ఉన్నవారు, లేనివారన్న తేడా కనిపించేది కాదు అందరూ తృప్తిగా, సుఖంగా జీవించేవారు ఎవరిలో నిరాశకు తావుండేది కాదు. సహజీవనం, సామ్యవాదం అంటే ఆ గ్రామాలు చూచి లెక్కించవచ్చు. ఊరిలో రాజకీయాలు లేవు. ఉన్నదల్లా ఒకే చైతన్యం .. గాంధీజీ స్ఫూర్తి. గాంధీజీ పేరు వినడం తప్ప మరో రాజకీయ వాసన వుండేది కాదు. చాలామంది ఇళ్లలో రాట్నాలు వడుకుతుండేవారు అది జాతీయతకు చిహ్నం కొందరు ఖద్దరు కట్టేవారు ఖద్దరు వాడటంలో ఆ ఊళ్లో మానాన్నగారే మొదటివారు. పెద్దరైతులు, చిన్నరైతులు వున్నా, చిన్న పెద్ద తేడా వుండేది కాదు. అందరూ అన్నయ్యలు, బాబాయిలే ... ఏక కుటుంబ వ్యవస్థ. అన్ని కులాలు ఒకే ప్రేమతో కలిసిపోయి జీవించేవి. ఎవరిలోను అహంకారం, గర్వం, పొగరు కనిపించేవి కావు. పొలాలలో పనులు చేసుకోవడం పంట పండించుకోవడం హాయిగా, తృప్తిగా జీవించడం. పండగలప్పుడు వేణుగోపాలుడి గుడిలో ఉత్సవాలు జరిగేవి. అన్ని పండుగలకు ఊరంతా పండుగే. ఏడాదికోమారు మూడుమైళ్లలో వున్న సంగం గుళ్లలో జరిగే ఉత్సవాలకు వెళ్లడం గొప్ప సరదా. పిల్లలకు చదువు భారం కాదు రెండుమూడు పుస్తకాల కంటే ఎక్కువ వుండేవి కావు. పలక, బలపం, లెక్కలు తప్పనిసరి. నాలుగు అక్షరముక్కలొచ్చి, లెక్కలు వేసుకోగలిగితే చాలనేవారు అదీ చదువుల ధ్యేయం

మా బడి ఏకోపాధ్యాయ పాఠశాల. ఒకటి నుండి అయిదు క్లాసుల వరకు ఒక్కడే టీచరు. అష్టావధానం చేసేవాడు. కాని అందరి విషయం శ్రద్ధగా చూచేవాడు. డిసిప్లిన్ చాలా కఠినంగా వుండేది. సరిగా చదవకపోతే ఎండలో నిలబెట్టి చదివించేవాడు. అక్షరాలు దిద్దటం ఇసుకపైన. నేలపైన ఇసుక చల్లి వేలితో రుద్దించేవాడు. వేళ్లు మంటపుట్టి ఎర్రపడేవి చదువు చెప్పడం కన్న కొట్టడం ఎక్కువ. జవాబు చెప్పకపోతే గంటసేపు గోడకుర్చీ వేయించేవాడు. లేకపోతే కోదండం. పైన దూలానికి తాడుకట్టి,

ఉయ్యాల వలె, దానిని పట్టుకుని వేలాడాలి. క్రిందపడితే కాళ్లు విరుగుతాయి. సాయంత్రం ఆటలు, తోటపని వుండేవి. అయ్యవారింటి పనులు సరేసరి. కూరలు, పాలు, పెరుగు, వెన్న ఫ్రీగా యివ్వవలసిందే వేప, తుమ్మ పుల్లలు విరిచి, బెత్తాలుగా వాడేవారు. నాకు ఆ శిక్షలు ఏవీ పడలేదు. ఇంటిదగ్గర బాగా చదువు చెప్పేవారు. ఎవరిళ్లలోనూ పెద్దలు పిల్లలకు చదువుల విషయంలో సాయం చేసేవారు కారు. స్కూలు వదలడం తడవు పొలం పనులు పురమాయించేవారు. గడ్డివాములకు వెళ్లి ఎండుగడ్డి కట్టలు కట్టి మోసుకురావడం తప్పనిసరి. అలాగే కాలువగట్టుకు వెళ్లి పచ్చగడ్డి కోసుకురావాలి. సెలవల్లో గేదెల్ని మేపుకు రావడం పిల్లలందరికీ అలవాటే. ఫక్తు పల్లెజీవనం .. భేషజాలకు అవకాశం లేదు ఈ పనిచేస్తే నామోషీ, చిన్నతనం అనే ఆలోచన కలగడానికి అవకాశం లేదు. అయిదు సంవత్సరాలు చదవడమే గొప్ప. మధ్యలో మానివేసినా అడిగేవారు లేరు. పిల్లలు ఎదుగుతున్నకొద్దీ పొలంపనులకు సాయపడాలన్నది సంప్రదాయం ఉద్యోగాలు చేయించాలన్న ఆలోచన ఎవరికీ వుండేది కాదు చదువు అలంకారమేనని, అవసరం అంతగా లేదని అనుకునేవారు పల్లీయులు.

మన ప్రయత్నం, ప్రమేయం లేకుండానే జీవితం చిత్రమైన మలుపులు తిరుగుతుంది తర్వాత ఎప్పటికో గాని, అది విధి విచిత్రమని, అదృష్టమని గ్రహించం. ఒక్కొక్క మలుపు ఒక్కొక్కరిని పైకి తీసుకుపోతుంది. మరొకరిని క్రిందికి దిగలాగుతుంది. ఎవరి అదృష్టాన్ని బట్టి, పూర్వజన్మ సుకృతిని బట్టి అలాంటి మలుపులు తిరుగుతాయి. అయినవారి బాధ్యత, కన్నవారి బాధ్యతలు అందుకు దోహదం చేయవనిపిస్తుంది. మా మేనమామ సంస్కృత కళాశాలలో చదవడమే గొప్ప అనిపించింది. మా ఊళ్లో పట్నం వెళ్లి చదువుకుంటున్న వ్యక్తి ఆయన ఒక్కరే. ఆయన చదువు ఊరికే గర్వకారణం. ఇప్పుడంటే ఇంగ్లీషు చదువులపై మోజుకాని అప్పట్లో తెలుగు, సంస్కృతం చదవడం గొప్ప. కవి, పండితుడు కావడం గొప్ప. పైగా ఆయనకు పెళ్లి అయినతర్వాత చదువుకోవాలనిపించడం విచిత్రం. ఆయన భార్య గుమ్మడికాయలా, పొట్టిగా, లావుగా వుండేది. ఈయన సన్నగా, పొడవుగా వుండేవాడు. పెద్దలు కుదిర్చే పెళ్ళిళ్లు కాదనే దమ్మూ, నచ్చలేదని చెప్పే ధైర్యమూ ఆడపిల్లలకే కాదు, మగపిల్లలకూ వుండేదికాదు. నేను పుట్టిన ఏడాదికి ఆయన ఓ ఆడపిల్ల తండ్రి అయినాడు. అయినా చదువు ఆపలేదు. నాకు సంస్కృతం నేర్పాలని ఆయన ప్రయత్నించాడు. 'యస్య జ్ఞాన దయా సింధో'తో ప్రారంభించిన నా సంస్కృతం 'గోడ దూకితే అదే సందు'తో ఆగిపోయింది. 'శబ్దమంజరి' చదివిస్తే, రామశబ్దంతో ఫుల్‌స్టాప్ పెట్టాను. మా నాన్నగారికి ఆ చదువు నచ్చింది కాదు. చదివిస్తే ఇంగ్లీషు స్కూల్లో

చదివిస్తానని పట్టుపట్టారు. అప్పుడొక విచిత్ర సంఘటన జరిగింది. అప్పటివరకు వున్న టీచర్ బదిలీ అయి వెళ్లిపోగా, ఆయన స్థానంలోకి ఒక చౌదరిగారు వచ్చారు. ఆయన మహాపొగరు మనిషి. వచ్చిన కొత్తలో, ఎవరెవరో తెలియక, నా వీపు బద్దలు కొట్టాడు అకారణంగా. నేనెన్నడూ దెబ్బలు తిన్నది లేదు. చొక్కా రక్తసిక్తమైంది. వీపుపై తాట లేచింది. మా తాతగారు, నాన్నగారు వచ్చి టీచర్ని తిట్టిపోశారు. ఆ స్కూలులో చదవనని నేను పట్టుబట్టాను. దాంతో పంతులుగారు రాత్రికి రాత్రి ఊరు వదలి వెళ్లిపోయాడు. నాకోసం మావాళ్లు తెనాలికి మకాం మార్చారు.

అప్పట్లో పల్లెలలో భేషజాలు లేవు. ఈ పని చేయవచ్చు, ఆ పనిచేయకూడదు అనేది లేదు. అందరూ అన్ని పనులూ చేసుకోవలసిందే. మాకు ఒక గేదె వుండేది. పల్లెలలో ప్రతిఇంట్లో పాడిగేదెలుండటం సహజం. ఆ గేదె పనులన్నీ నేను స్వయంగా చేసుకోవలసిందే. దానికి కుడితి పెట్టడం, గడ్డి వేయడం, పచ్చగడ్డి కోసుకురావడం, వామిదొడ్డికి వెళ్లి గడ్డి, జనుం తీసుకురావడం, పాలేరు రాకపోతే కాలవకు తోలుకు పోవడం చేసేవాడిని. ఆ పనులు చేయనంటే మానాయన చావగొట్టేవాడు. ఒకసారి పాలు పిండవలసి వచ్చింది. చెంబు తీసుకుని, దాని కాళ్ల దగ్గర కూర్చుని, ఎంత సాగదీసినా అది చేప లేదు. తీరా చేపు కొచ్చాక పాలు పిండబోతే లాగి తన్నింది. నా తలకు బొప్పి కట్టింది. ఆ చిన్నపని చేయలేనందుకు ఆ రోజు దెబ్బలు తిన్నా, మళ్లీ జన్మలో గేదె జోలికి పోలేదు.

మా ఊళ్లో బడికోసం తన ఇంటిని ఉచితంగా యిచ్చిన వ్యక్తి జానకిరామయ్య గారని పరమ ధార్మికుడు, నిష్టాగరిష్ఠుడు, భక్తుడు- అప్పుడు పల్లెల్లో ఇళ్లు అద్దెకివ్వడం వుండేది కాదు. ఎవరి ఇల్లు అయినా ఖాళీగా వుంటే ఉచితంగానే యిచ్చేవారు. ఇంట్లో దీపం పెట్టుకుంటారని, ఇల్లు శోభగా వుంటుందనీ ఆశ. మేం వున్న ఇంటికీ అద్దె లేదు. అద్దె తీసుకోవడం పాపం, సాంఘికనేరం ఆ రోజుల్లో.

జానకిరామయ్యగారికి ఓ అందమైన కూతురుండేది. ఆ పిల్లంటే నాకు బలేయిష్టం. మాస్కూలుకు వచ్చేది కాదు. చదువు అనవసరం అనుకున్నారేమో! కమ్మవారిళ్ల ఆడపిల్లలు స్కూలుకు వచ్చేవారు కారు. ఆ అమ్మాయికీ నేనంటే ప్రేమే. నాకన్న పెద్దదే ... 'అక్కా' అని పిలిచేవాణ్ణి. జానకిరామయ్యగారిని తాత అనేవాళ్లం. ఆయన చొక్కా తొడిగేవాడు కాదు. ఒంటిమీద విభూది రేకలు మెరుస్తుండేవి. సొంతడబ్బుతో బకింగ్‌హాం కాలువ ప్రక్కన ఒక రామాలయం కట్టించాడు. ఆ గుడికి పూజారి ఆయనే. భక్తుడూ ఆయనే. కాలవమీద వెళ్లే పడవలవాళ్లకు అది ప్రధానమైన కోవెల. రాత్రిపూట అక్కడే పడవల్ని నిలిపి వుంచేవారు. ఆ జానకీరామయ్యగారు నూరుసంవత్సరాలు పైగానే

జీవించారు. ఇటీవల నాగురించి, నాయోగం గురించి విని, నన్ను చూడాలని కబురుచేశారు. తనకు ధ్యానంలో నేను కనిపిస్తానని, యోగిగా నన్ను దర్శించవచ్చని, భౌతికశరీరంతో చూడనవసరం లేదని సమాధానం పంపాను నా సూక్ష్మ శరీరం ఒక మహర్షిగా ఆయనకు దర్శనం యిచ్చింది. ఆయన నా చిన్నతనంలో ఒక ప్రజ్ఞను చూడగలిగారు. నూరేళ్ల వయస్సులో నాలోని పరిణతి చెందిన 'ఋషి'ని మానసభూమికలో దర్శించగలిగాడు. ఆయన సహజయోగి. అలాంటి మహాపురుషులు మన పల్లెలలో ఎందరో వున్నారు. అలాంటి మహాత్ములందరికీ నా నమస్కారం. జానకిరామయ్యగారికి ప్రేమతో నాఫొటో ఒకటి ... ధ్యానంలో ఉన్నప్పటిది, నాపుస్తకం ఒకటి పంపాను. అలాంటివారు ప్రాతః స్మరణీయులు. అలాంటి పుణ్యమూర్తుల ఆశీస్సులు నావంటివారి ఆధ్యాత్మికపురోగతికి తొలిసోపానాలు.

మాతండ్రిగారు చేసిన మంచిపనుల్లో ఒకటి నన్ను తెనాలిలో ఇంగ్లీషుబడిలో చదివించడం. ఆయనకు పట్టుదల జాస్తి. మా తాతగారు వారి అబ్బాయికి సంస్కృతం చెప్పిస్తే, తాను తన కొడుక్కి ఇంగ్లీషు చెప్పించి, మామగారి కంటే తాను అధికుడు కావాలని అలా చేశారు. ఆయన ఎవరి మాట వినేవారు కాదు. తను పట్టిన కుందేలుకు మూడు కాళ్లే. మా మేనమామకు నాన్నగారికి మంచి స్నేహం. బావ, బావమరదులు కన్నా స్నేహితులుగా మెలిగేవారు. మా నాన్నగారు, తాతగారు మాట్లాడుకునేవారు కాదు చాలాకాలం ... ఏదో పట్టుదల. మా నాన్నగారికి ఒక గురువుగారుండేవారు... వాలిచర్ల హనుమయ్యగారని. వారివద్ద దీక్ష తీసుకున్నారు. తాను అనేకమందికి గురువైనారు. ఆ గురువుగారికి నేనంటే యిష్టం. "ఒరే, పార్వతీశం .. వీడిని పనిలో పెట్టకురా ... బాగా చదివించు" అని సలహా యిచ్చారు. ఆ సలహా నాపాలిట వరమైంది. కులవృత్తి ఛాయలకు పోలేదు. తర్వాత 'కులం' నీడ నాపైన పడలేదు. 'కులాల' ఉచ్చుల్లో పడకుండా నన్ను నేను రక్షించుకున్నాను.

ఫలితంగా మా మకాం తెనాలికి మారింది. కోపల్లెకు తెనాలి క్రోసున్నర దూరం. అది టౌను, ఇది పల్లె. అది నాగరిక ప్రపంచం, ఇది అచ్చం తెలుగుపల్లె. పొలాల మధ్యగా నడిచివెళ్లేవాళ్లం. అటు అంగలకుదురు మీదగా రోడ్డుపైన వెడితే కాస్త చుట్టు, దూరం. చిన్నతనం నుండి నడక అలవాటే. టౌనుకు వెళ్లి వస్తువులు, పుస్తకాలు తెచ్చుకోవడం చేసేవారం. ఇప్పుడు సరాసరి పట్నం చేరాం. జీవితం ఒక మలుపు తిరిగింది. నిక్కర్లు మాని పంట్లాములు వేసుకోగలిగిన నాగరికత. పట్నంలో బ్రతుకు మనిషికి బ్రతుకు తెరువును నేర్పుతుంది.

మనిషి బాల్యాన్ని మరచిపోలేడు. మనస్సు కల్మషం ఎరగని రోజులవి. ఆ చిత్రాలు చెరగనివి. ఆ రంగులు మాసిపోవు బరువు, బాధ్యతలు తెలియని వయస్సు భవిష్యత్తులోకి ఆశలు తొంగిచూడని దశ. అసూయలు, ద్వేషాలు వేళ్లపాతుకుపోవు. అందుకే ప్రతివ్యక్తి బాల్యాన్ని ప్రేమిస్తాడు, మరచిపోడు. మా ఊరికి ఒక దేవాలయం వుండేది. వేణుగోపాలస్వామి వారిది ఎప్పుడోగాని పూజారి వచ్చేవాడు కాదు. పండుగరోజుల్లోనే మనుషులకు సంబరం దేవునికి సంబరం. వెన్నెలరాత్రుల చల్లదనం, ఆటపాటలు మరువరానివి. మా ఊరికి కరెంట్ లేదు. ఏ పల్లెకు కరెంట్ దీపాలుండేవి కావు పట్నంలోనైనా పెద్దబజారులో కొన్ని షాపులకు వుండేవి. వెన్నెలే రాత్రిపూట ఆకర్షణ కాలువగట్టుకు షికార్లు వచ్చేపోయే పడవలు, అస్తమించే సూర్యుడు, పచ్చనిపొలాలు, మామిడినీడలు, పడవలవారి పాటలు సరంగులు పడవకు పెద్ద తాడుకట్టి, అయిదారుగురు భుజాలపైన తాడువేసుకుని లాగుతుండేవారు. ఊరిదగ్గరగా రాత్రిళ్లు నిలిపి వుంచేవారు.

పిల్లలకు చద్దన్నాలు తప్ప, కాఫీలు టిఫిన్లు తెలియదు. ఉదయం ఏడునుండి పన్నెండు గంటల వరకు సాయంత్రం ఒంటిగంటనుండి నాలుగువరకు స్కూలు ఇళ్లలో కూడా ఎవరూ కాఫీలు, టీలు తాగేవారు కాదు. హోంవర్కు అంతా స్కూలులోనే చేయించేవారు. సాయంత్రం తోటపని, ఆటలు కంపల్సరీ. స్కూలు ఇన్‌స్పెక్టర్ వచ్చినప్పుడు మాత్రం అందరూ విధిగా కొత్తబట్టలు కట్టుకొని వచ్చేవారు. దసరా పండుగకు నెలరోజుల ముందునుండే పాటలు, పద్యాలు ప్రాక్టీసు చేయించేవారు. టీచర్ విల్లంబులు తెచ్చిపెట్టి, గులాములు చల్లిస్తూ ఇంటింటికీ తిప్పేవాడు. అయ్యవారికి చాలు అయిదు వరహాలు, పిల్లవాండ్రకు చాలు పప్పుబెల్లాలు ... విజయీభవ, దిగ్విజయీభవ అని పాడాలి ఒక రూపాయి నుండి అయిదు రూపాయల వరకు అయ్యవారికి సమర్పించుకునేవారు .

ఊరి జీవితం విచిత్రంగా వుండేది. ఒకటి రెండు పచారి కొట్లు వుండేవి. రెండెడ్ల బళ్ల మీద సరుకులు తెచ్చి అమ్మేవారు. చింతపండు, ఉప్పు వగైరాలు డబ్బుతో కొనడం తక్కువ. ధాన్యం పోసి తీసుకోవాలి. చిల్లరకొట్లో కూడా వడ్లుగాని, బియ్యంగాని యిచ్చి అందుకు సరిపడే సామాను తెచ్చుకునేవారం. కానీ డబ్బు కంటబడేది కాదు. బస్తావడ్లు పదిరూపాయలుండేవి. మా నాన్నగారి సంపాదన చిత్రంగా వుండేది. ఎప్పుడైనా ఒక రూపాయి మిగిలితే ఒక డబ్బాలో వేసేవాడు. అన్నీ వెండిరూపాయలే. కరెన్సీ చూచింది లేదు. సంవత్సరం మొత్తం మీద ఓ వందరూపాయలు నిల్వచేయడం గగనం. మా ఊరిలో అప్పుడప్పుడు నాటకాలు ఆడేవారు. తోలుబొమ్మలాటలు, యక్షగానాలు వచ్చేవి. వేదాంతం రాఘవయ్యగారు కూడా మాఊళ్లో ఒకసారి డాన్సుచేశారు. హరికథలు

ముమ్మరంగా సాగేవి. నాటకం తెల్లవార్లూ ఆడేవారు తెల్లవారి పొద్దున ఆ మేకప్ వేషాల తోనే ఇంటింటికి వచ్చి యాచించేవారు సినిమా చూడాలంటే తెనాలి బళ్లు కట్టుకుని వెళ్లి, రెండు సినిమాలు చూచి వచ్చేవారు. తెనాలిలో ఒక్కటే హాలు వుండేది. మరోటి చెరువులో డేరాహాలు ఆ హాలులో అంజలీదేవిలాంటివారు డాన్సులు చేశారు. వేమూరి గగ్గయ్య, కన్నాంబ వేసిన నాటకం చూచాను అప్పుడే. దగ్గర అయినా గుంటూరు, బెజవాడ చూడడం అరుదు. జిల్లా కోర్టు పనులుంటే గుంటూరు వెళ్లేవారు కృష్ణానదీ స్నానాలకు బెజవాడ వెళ్లేవారు ఊరికి ఒక్క దినపత్రికా వచ్చేది కాదు అప్పట్లో దినపత్రికలు తెలుగులో వున్నాయో లేదో నాకు తెలియదు

1939లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది తెనాలిలో నా ఇంగ్లీషు చదువు ప్రారంభమైంది జర్మనీ నియంత హిట్లర్ ఇంగ్లండుపైన యుద్ధం ప్రకటించాడు అప్పటికి మనదేశం ఇంగ్లీషువారి పాలన క్రిందనే వుంది. యుద్ధంలోకి సైనికులుగా జనాన్ని తీసుకోడం ప్రారంభమైంది చాలామంది యువకులు యుద్ధంలో చేరిపోయారు బ్రిటిష్‌వారు మన ప్రభువులు, మన పాలకులు .. వారు ఓడిపోకూడదు ఇంగ్లండు ఓడిపోయేపక్షంలో మన దేశాన్ని హిట్లర్ కాజేస్తాడు. హిట్లర్ అంటే ఓ నియంత, ఒక రాక్షసుడుగా చిత్రీకరించేవారు. బ్రిటిష్‌వారికి శత్రువు మనకూ శత్రువే కదా! హిట్లర్ పేరు చెబితే జనం గజగజలాడేవారు. యువకులు హిట్లర్ మీసాలు పెట్టుకునేవారు. అలాంటి మీసాలున్నవారిని బ్రిటిష్‌వారు దండించి, హింసించేవారు హిట్లర్ ప్రతాపం చూచి, బ్రిటన్ ఓడిపోవడం ఖాయమని, జర్మనీతో స్నేహంగా వుంటే హిట్లర్ ఇండియాను స్వతంత్రం చేస్తాడని ఆశించి, నేతాజీ సుభాష్ చంద్రబోస్ జర్మనీ వెళ్లాడని చెప్పుకునేవారు. అంతవరకు కాంగ్రెసులో వుండి గాంధీజీతో చేతులు కలిపిన బోసు జర్మనీ వెళ్లాడు.. ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించడం కోసం. యుద్ధం ముమ్మరంగా సాగుతోంది యూరప్‌లో. మనదేశంలో తిండిగింజలకు కరువు ఏర్పడ్డది. కట్టెపుల్లలు దొరికేవికావు. కిరసనాయిలుకు రేషన్. ఇళ్లలో ఆముదపు దీపాలు పెట్టుకునేవారు. అన్నింటికీ రేషన్. అన్నింటికీ కరువు. తిండిలేక జనం చనిపోయేవారు. ఏదేశం నుండో వచ్చిన ముక్కిపోయిన బియ్యం, జొన్నపిండి, బంగాళాదుంప ముక్కలు రేషన్‌లో యిచ్చేవారు. రొట్టెలు చేసుకుని ఆ బంగాళాముక్కలతో బతకాలి. సామాన్యుని జీవనం నరకంగా మారింది. తెల్లవాడిక్రింద బానిసబ్రతుకు మహాదుర్భరం అయింది.

గాంధీగారి సత్యాగ్రహాలు తగ్గాయి. స్వాతంత్ర్యోద్యమమూ కాస్త చల్లబడింది. కాంగ్రెసు నాయకులంతా విడుదలై వచ్చారు. యుద్ధం పూర్తిఅయ్యేవరకు స్వాతంత్ర్యోద్య

మాన్ని ఆపి ఆ తర్వాత అమీతుమీ తేల్చుకోవాలనుకున్నారు. యుద్ధంలో ఇంగ్లీషువాడు గెలిస్తే తప్పక మనకు స్వాతంత్ర్యం యిస్తాడని జనం ఆశించారు. కారణాలు ఏవైనా, వేలమంది సైన్యంలో చేరసాగారు. నెమ్మదిగా ఎక్కడో వున్న జపాన్‌కూడా యుద్ధంలో దిగి, జర్మనీకి వత్తాసు పలికింది ఆ రోజుల్లో జర్మనీ, జపాన్ దేశాల పేర్లు అందరి నాల్కలమీద నానేవి! రష్యా, చైనాల గురించి పెద్దగా పట్టించుకునేవారు కాదు. అమెరికా తటస్థంగా వుండేదేమో! చివరకు ప్రపంచదేశాలన్నీ రెండుకూటములుగా మారడంతో అది ప్రపంచయుద్ధం అయింది. ఇంగ్లండు, అమెరికా, రష్యా, ఫ్రాన్సు మిత్రపక్షంలో చేరాయి. జర్మనీ, జపాన్, ఇటలీ ఒకపక్షం అయినాయి. రష్యాపైకి జర్మనీ దండెత్తేవరకు వార్తలు జర్మనీకి అనుకూలంగానే వచ్చాయి. జపాన్‌లోని హిరోషిమాపై ఆటంబాంబులు పడి సర్వనాశనం అయితే తప్ప, యుద్ధజ్వాలలు తగ్గుముఖం పట్టలేదు.

ఈ నేపథ్యంలో నా చదువు మొదలైంది. తెనాలి చిన్నపట్టణమే అయినా కళలకు కాణాచి. కవితలకు కళ్యాణవేదిక. ఊరంతా రంగస్థలమే అన్నట్లు, అన్ని పేటల్లోనూ నటీనటులు నడయాడేవారు. అది ఆంధ్రాపారిస్. మా మకాం కేవలం నా చదువుకోసం తెనాలి మారింది. పదివేలలోపు జనాభా. గంగానమ్మపేటలో నివాసం. ఆ గుడి వీధిలోనే కోలవెన్ను పరబ్రహ్మంగారని, ఆయన వానప్రస్థం స్వీకరించి, తీర్థులైనారు. ఆయన దుకాణం మానాన్నగారికిచ్చివేశారు. ఆయన పలుకుబడి, పరపతి, మంచితనం మానాయనగారి పనితనానికి మేలిమిబంతులైనాయి. పరబ్రహ్మంగారు గొప్ప మనస్సు కలవారు. ధార్మికుడు. మహర్షివలె జీవించేవాడు. నా చదువు మార్వాడి గుడి వీధిలో ఒక ప్రయివేట్ టీచరు వద్ద ప్రారంభమైంది. ఒక్క రెండుసంవత్సరాల కాలంలో నాలుగైదు క్లాసులు, ఫస్టుఫారం చెప్పి, హైస్కూలులో సెకండ్‌ఫారంలో చేర్పించారు. 1942లో హైస్కూలులో ప్రవేశించాను. అది తాలూకా హైస్కూలు. తెనాలి తాలూకా మొత్తానికి అది ఒక్కటే హైస్కూలు. ఒక్కొక్క క్లాసుకు నాలుగైదు సెక్షన్లు వుండేవి. చచ్చే డిసిప్లిన్ అమలు జరిగేది. మంచి బిల్డింగ్, అర్హతగల టీచర్లు. పిల్లల మంచిని కాంక్షించే మాస్టర్లు వారు.

1942లోనే తెనాలి ప్రపంచవార్తల్లోకి ఎక్కింది. స్వాతంత్ర్యోద్యమకారులు తెనాలి రైల్వేస్టేషను తగులపెట్టారు. ఊరు రణరంగంగా మారింది. బ్రిటిష్ సైన్యాలు ఊరినిండా దిగి కాల్పులు జరిపాయి. ఆ కాల్పుల్లో మానాన్నగారికి తుపాకి దెబ్బ తగిలింది. కాల్పులు జరిగిన ప్రదేశం రణరంగచౌక్ అయింది. చనిపోయినవారి పేర స్మృతిచిహ్నాలు వెలిశాయి. ఇప్పటికీ ఆ స్మారకచిహ్నాలు కనిపిస్తా యక్కడ. భారత జాతీయోద్యమంలో తెనాలిది విస్మరించరాని పాత్ర అయింది. అది ఆంధ్రదేశంలో పెద్ద రాజకీయ సంచలనం సృష్టించి, మహామహానాయకుల దృష్టిని తనవైపు తిప్పుకుంది.

తెనాలిని చూడాలన్న కోరిక మహాత్మాగాంధీకి కలిగింది. ఆయన మద్రాసు వెడుతూ తెనాలిలో ఆగి ఉపన్యసించడానికి ఏర్పాట్లు జరిగాయి. వార్ధా నుండి గాంధీరైలు బయలుదేరింది. గాంధీజీని చూడాలని చుట్టుపట్ల గ్రామప్రజలంతా బయలుదేరారు. రైలు ఉదయం ఆరుగంటలకు స్టేషన్‌కు రావాలి. అన్ని వేల మంది జనం స్టేషనులో పట్టరు కనుక ఊరి చివర రైలు ఆపే ఏర్పాటు చేశారు. తెల్లవారు ఝామున లేచి పిల్లలు, పెద్దలు కాలినడకన రైలుపట్టాల వెంట నడక సాగించాం. అయిదారుమైళ్ళు అవతల వలివేరు సమీపంలో డయస్ ఏర్పాటైంది. లక్షమంది జనం వచ్చారు. ఆరోజు సోమవారం కావటాన గాంధీజీ మౌనవ్రతం. మాట్లాడరు. రైలు దిగివచ్చి, వేదికపై నుండి జనానికి నమస్కరిస్తూ దర్శనం యిచ్చారు. అదొక మరపురాని మధురానుభూతి.

అప్పట్లో హైస్కూలు చదువంతా తెలుగుమీడియంలోనే. గుంటూరులో ఓ కాన్వెంట్ వుండేది. అందులో క్రిస్టియన్స్‌కే ప్రవేశం. కాలేజీలో ఇంగ్లీషు మీడియం. సబ్జెక్టులు ఆరు. ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు, హిస్టరీ, జాగ్రఫీ, సైన్సు అయిదారు ఫారాలలో ఆప్షనల్స్ అదనంగా వుండేవి. కాంపోజిషన్, ట్రాన్స్‌లేషన్, డ్రాయింగ్ చిన్నక్లాసులలో తప్పనిసరి. కాంపోజిషన్, ట్రాన్స్‌లేషన్ ఎస్.ఎస్.ఎల్.సి వరకు వుండేది. ఎక్కువ మార్కులు సంపాదించే అవకాశం వాటిలో ఎక్కువ. వారానికి రెండుసార్లు, ఉదయం ఆరుగంటలకే డ్రిల్ క్లాసులు, సాయంత్రం నాలుగు నుండి ఆరువరకు గేమ్స్. వాలీబాల్, కబడ్డీ, బాట్‌మింటన్, ఫుట్‌బాల్ ఆడించేవారు. వాటిల్లో పోటీలుపెట్టి బహుమతులిచ్చేవారు.

గాంధీగారు వచ్చివెళ్లిన తర్వాత ప్రతి ఇంట్లో ఒక రాట్నం వెలసింది. రాట్నంమీద నూలు వడకటం, ఖద్దరు కట్టడం జాతీయత. గాంధీజీపై పిచ్చి ప్రేమ. కాంగ్రెసు అంటే భక్తి. అప్పుడే కాస్త కమ్యూనిజం దేశంలో ప్రవేశించింది. రష్యాభక్తులు ఎక్కువై కార్మిక, కర్షక వర్గాల్ని ఆకట్టుకున్నారు. చిత్రంగా ఆర్.ఎస్.ఎస్. పట్ల యువకులకు ఆసక్తి పెరిగింది. విద్యార్థుల్లో కాంగ్రెసు, కమ్యూనిజం, ఆర్.ఎస్.ఎస్.ల ప్రభావం ప్రబలంగా కనిపించేది.

మాపేటలోనే శివాలయం ఆవరణలో ఆర్.ఎస్.ఎస్. శిక్షణ యిచ్చేవారు. నేనూ నాలుగురోజులు వెళ్లాను. కాకీ యూనీఫాం కొనడానికి మానాయన డబ్బు యివ్వలేదు. మానివేశాను. ఆయన కాంగ్రెసువాదిగా మారాడు. గాంధీ అంటే యిష్టం పెరిగింది. ఖద్దరు తప్ప కట్టకూడదు. భారతమాతపైన భక్తి వున్నట్లు ఆర్.ఎస్.ఎస్.లో చేరితే. మానాన్నగారి దేశభక్తికి ఖద్దరు సాక్ష్యం. రాజకీయాలలో ఆసక్తి పెరగడం వల్ల ఆయన పనిచేయడం.

తగ్గించారు ఎప్పుడూ మీటింగులు సామాన్యునికి రాజకీయాలు పొట్టనింపవు. ఉన్నవారికే రాజకీయాలు ఇల్లు గడవడం కష్టమైంది. మా ఇంటికి కాంగ్రెసునాయకుల రాకపోకలు ఎక్కువైనాయి. కల్లూరి చంద్రమౌళిగారు, మంతెన వెంకట్రాజు, మహమ్మద్ ఇస్మాయిల్, చెంచయ్య వీరు మా ప్రాంతం కాంగ్రెసునాయకులు. మానాయనకు దోస్తులు ఇస్మాయిల్ గాంధీగారి శిష్యుడు. గుంటూరుజిల్లా కాంగ్రెసువారిలో మానాన్నగారు ఒకరు. కాసు బ్రహ్మానందరెడ్డిగారు మానాన్నగారు ఫిరంగిపురంలో స్నేహితులు, కలసి చదువుకున్నారుట

ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీ మోత అన్నట్లు వుంది మా బ్రతుకు రాజకీయం కారణంగా ఆయనగారి పేరు పెరిగింది. నా పరిస్థితి .. ఏ నెలా స్కూలు ఫీజు కట్టటానికి డబ్బులుండేవి కావు. లోయర్‌ఫారాలకు రెండురూపాయల పన్నెండణాలు, హయ్యర్ ఫారాలకు అయిదు రూపాయల పావలా ఫీజు. అందులో నాది స్కాలర్‌షిప్ కనుక సగం జీతమే కట్టాలి అదీ దొరికేది కాదు. ప్రతినెల అణా, బేడా పైను కలిపి కట్టవలసివచ్చేది కొత్తపుస్తకాలు కొంటే పదిరూపాయలవుతాయని, సగం ధరకు ఎప్పుడూ పాతపుస్తకాలే కొనుక్కునేవాడిని. అలా అలా నాలుగు సంవత్సరాలపాటు హైస్కూలు చదువు సాగింది. అన్ని గృహావసరాలకు కరువే. వీధి దీపాల క్రింద కూర్చుని చదువుకోవలసిన దుర్గతి - కొనాలన్నా కిరోసిన్ దొరికేది కాదు. వీధి దీపాలంటే ఇప్పటిలా కరెంటు దీపాలు కాదు. ఊరి వీధుల్లో మున్సిపాలిటీవారు స్తంభాలు నాటి చిన్నచిన్న కిరోసిన్ దీపాలు వెలిగించేవారు. అయిదారుగంటలకు సరిపడ కిరోసిన్ మాత్రమే పోసేవారు. వెన్నెలరాత్రులైతే అసలు వెలింగించేవారు కాదు. అలాంటి దీపాలక్రింద చదువు.

అప్పట్లో అంగలకుదురు గ్రామంలో ఒకసారి విశ్వకర్మ యజ్ఞం చేశారు. మరొకసారి చేబ్రోలులో యజ్ఞం జరిగింది. మరోసారి కొల్లూరులో, బెజవాడలో. మొత్తం నా జీవితం తొలినాళ్లలో అయిదు యజ్ఞాలు చూచాను.

ఇంట్లో పెద్దవారు కాంగ్రెసు అభిమానులైనా పిల్లల మనస్సులను కమ్యూనిజం ఆకట్టుకునేది. గాంధీగారి సత్యాగ్రహం, అహింస కన్న కమ్యూనిజంలోని విప్లవం రుచిగా వుండేది. ఆర్.ఎస్.ఎస్. అప్పటికీ ఇప్పటికీ ఒకేలా వుంది. ఎదుగుబొదుగు లేదు 'హిందుత్వం' చదువుకున్నవారిని కట్టిపడవేయదు. జనంలో కాంగ్రెసు కన్న కమ్యూనిస్టు భావాలు బాగా చొచ్చుకుపోసాగాయి. కారణం కమ్యూనిజం పేదవారిని, కార్మికుల్ని, కర్షకుల్ని ఉద్ధరిస్తుందన్న నమ్మకం. జమీందారీ వ్యవస్థను, భూస్వామిక వ్యవస్థను రద్దుచేసి, కమ్యూనిస్టులు అందరినీ సంపన్నులను చేస్తారన్న ఒక నమ్మకం. అది అసంభవమని కాలం నిరూపించింది. అయితే గాంధీ సత్యాగ్రహంతోనే దేశానికి స్వాతంత్ర్యం

వస్తుందనే ఆశ పెరిగింది సుభాష్ చంద్రబోస్ అంతర్ధానం కావడం, జర్మనీ ఓడిపోవడం, జపాన్ శిధిలం కావటం, ప్రపంచపటంలో అమెరికా, రష్యాలు అగ్రదేశాలు కావడం విచిత్ర పరిణామం.

ఇంకా దేశానికి స్వతంత్రం రాకపోయినా వచ్చినంత ఆనందం, తృప్తి ప్రజలలో కారణం యుద్ధం ఆగిపోయింది. మిత్రదేశాలు విజయం పొందాయి

పదహారు వయస్సుకు పసితనం మరచిపోతాం బాల్యం గడచిపోతుంది. యవ్వనం గడపలో అడుగిడుతున్న వయస్సులో వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటుంది. పెద్దవాళ్ల మాటను కాదని స్వతంత్రంగా వ్యవహరించడం. తానుగా తనదైన రీతిలో ఆలోచించడం మొదలవుతుంది. స్వంతనిర్ణయాలు హద్దులు మీరటం కాదు హద్దులు గీయడం పెద్దవారికి ముద్దు. అక్కడే మనిషిలో సంఘర్షణ తలెత్తుతుంది. ఆ ఘర్షణ పెరిగి పెరిగి తరాల అంతరం సృష్టిస్తుంది. ప్రతిమనిషి తన బొమ్మ తనే వేసుకోవాలి. కాగితం రంగులు, బ్రష్షులు పాతవే ప్రతి బొమ్మ కొత్తగా వుంటుంది ఏ చిత్రకారుడైనా ఒక బొమ్మను సృష్టించినట్లు మరొక బొమ్మను సృష్టించడు భగవంతుడు ఏ ఇద్దరినీ ఒకటిగా సృష్టించడు. అందుకే అయినవారిలోనూ అనేకత్వం కనిపిస్తుంది టీనేజ్ గడచి రెండుపదుల ప్రాయం వచ్చేసరికి ఈ చిత్రరచన పూర్తి అవుతుంది భవిష్యత్తు అనే అద్దంలో తన ప్రతిబింబాన్ని చూచుకుని ఘురిసిపోతాడు మనిషి.

మన సమాజం ఒక అద్దం లాంటిది. అది మసకబారినా, దానిపై దుమ్ము పేరుకున్నా మన ప్రతిబింబం సరిగా కనిపించదు. లోపం మనలో వున్నదని దిగులుపడతాం. కానీ అసలు లోపం అద్దంలో వుంది సమాజంలోనే వుంది. కాలం మారుతూ వుంటుంది. కాలాన్నిబట్టి మనుషులు మారరు, మనస్సులు పెరగవు. ఆచారాలు, సంప్రదాయాలు మనిషిని మారనీయవు, పెరగనీయవు. మనిషి మరుగుజ్జుగా బ్రతకడమే సమాజం కోరుకుంటుంది. మా ఇంటి వాతావరణం భిన్నత్వంలో ఏకత్వం లాంటిది. మానాన్నగారు, అమ్మగారు దీక్ష తీసుకుని, గురుసంప్రదాయంలో వున్నవారు నాన్నగారికి కాంగ్రెసుతీర్థం బాగా పనిచేసి, సర్వసమానత్వం ఆచరణీయమైంది. ఆయనలో ఇప్పుడు పరిణామ సంస్కారం ... మారే ప్రపంచానికి ఆయన ఒక ప్రతినిధి. సంప్రదాయంపై తిరుగుబాటు ఆయనది.

మా మేనమామగారు సంస్కృతాంధ్ర పండితుడు కావడం వల్ల సంప్రదాయ బద్ధుడైనాడు. మంత్రాలు, పూజలు, వేదాలు, ఉపనిషత్తులు ఆయనకు సందుగొందులు. క్రాపుసందులో పిలకను దాచుకునే దొంగసంస్కారం. పురాణాలు సైతం చెప్పేవాడు.

తెలుగు పండితుడు కనుక ఆయనకు పురాణాలు నప్పుతాయి. ప్రాచీనత ఆయనకిష్టం. పద్యాలు రాసేవాడు. క్రమంగా పుస్తకాలు రాయసాగాడు. భారతి, ప్రతిభ, కృష్ణాపత్రికలు తెప్పించుకునేవాడు. వాటిల్లో పద్యాలు, వ్యాసాలు వ్రాసేవాడు. ఆ రోజుల్లో అవే గొప్ప పత్రికలు. వాటినిండా కవితలు, సాహిత్యవ్యాసాలు వుండేవి.

మేం పేదవాళ్లం. మా కుటుంబం పేదది. కష్టపడి పనిచేస్తేగాని ఇల్లు గడవదు. ఒక ఇల్లుగాని ఒక ఎకరం పొలంగాని లేదు మాకు. ఆ 'లేమి'తనం అయినవారిలో 'చులకన' చేసింది. మానాన్న మొండిమనిషి. మాటపట్టింపు జాస్తి, ఆత్మాభిమానం ఎక్కువ. సొంతిల్లు లేదని చిన్నచూపు చూచిన మామగారితో మాట్లాడేవాడు కాదు. స్వంతసంపాదనతో ఆరువందల రూపాయలతో ఒక స్థలం కొని, అయిదారు వందలతో చిన్నఇల్లు కట్టించాడు. అప్పుడు మాఇంటివిలువ వేయి రూపాయలు. అదీ గొప్పే. మా మేనత్తకు వైధవ్యం ప్రాప్తించింది చిన్నవయస్సులో. ఆమెకు మళ్లీ పెళ్లిచేయాలని మా నాయనగారి సంకల్పం. రాజమండ్రిలో కందుకూరి వీరేశలింగంగారి విధవా వివాహోద్యమ స్ఫూర్తి ఆయనలో. రాజారామమోహనరాయ్ ప్రభావం ఆయనపై వుంది. అయినవారంతా వ్యతిరేకించారు. 'వెధవముండకు మళ్లీ పెళ్ళేమిటి' అన్నారు. ఎందరు వ్యతిరేకించినా నాయనగారు చెల్లెలికి మళ్లీ పెళ్లిచేసి పంపారు. కులంవారు మాకుటుంబాన్ని వెలివేసారు. తాతగారు, మేనమామగారు మా ఇంటిగడప తొక్కమని ప్రతిజ్ఞ చేశారు.

ఆ రోజుల్లో బహిష్కరణ ఒక శాపం లాంటిది. ఎవరూ మమ్మల్ని భోజనాలకు పిలిచేవారు కాదు. పెళ్లిళ్లకు, తద్దినాలకు కట్టడి. మా ఇంటికి బంధువులు వచ్చేవారు కారు. ఓ ఆడపిల్లకు భర్త చనిపోతే రెండవపెళ్లి చేయడం నేరం. నిజానికి ఆ పెళ్లి మానాయన జరిపించలేదు. ఆమెను ఇష్టపడ్డవాడు తీసుకువెళ్లి చేసుకున్నాడు. ఆ పెళ్లికి మేం వెళ్లలేదు. పెళ్లి అయ్యాక వాళ్లు మా ఇంటికి రాలేదు. అయినా ఆమోదించడం నేరమైంది. ఆ పెళ్లిని సమర్థించిన ఏకైకవ్యక్తి మా పెద్దమ్మగారు. ఆమె నేను పుట్టినప్పుడే వైధవ్యం పొంది పుట్టింట వుంటున్నా నాగేంద్రమ్మగారు తండ్రిగారింట్లోనే వుండేది. ఊళ్లోవాళ్లకు నాలుగు మంచిమాటలు చెప్పేది. మధ్యాహ్నం వేళ, ఆడవారిని పోగుచేసి భారత, భాగవతాలు చదివి వినిపిస్తుండేది. అదొక సత్కాలక్షేపం ఆమె పట్ల అందరికీ గౌరవమే. ఊరిలో ఆమె మాత్రం మా మేనత్త రెండవపెళ్లిని సమర్థించింది హర్షించింది. తను మాత్రం తెనాలి వచ్చినపుడు మా ఇంటికి వస్తుండేది. నేను సెలవులకు తాతగారింటికి వెళ్లేవాడిని. మా పిన్నమ్మగారి ఊరువెళ్లేవాడిని. బహిష్కరణ వాళ్లు రావడానికి తప్ప, నేను వెళ్లడానికి కాదు!

తెనాలి నుండి కోపల్లె వెళ్లడానికి కఠెవరం వైపు ఒక డొంక వుంది. ఆ డొంకలో ఒక ఆశ్రమం వుండేది. ఇప్పటికీ వుంది. ఓంకార ఆశ్రమం అది అక్కడ ఎవరో ఒక ఓంకారస్వామి వుండేవారు. వచ్చేపోయేవారు ఆ ఆశ్రమంలో సేదతీర్చుకునేవారు. అది మూడూళ్ల మధ్యన పొలాలలో వుంది. ఎటువెళ్లినా ఒకటి రెండుమైళ్లు నడవాలి. తెనాలి ప్రాంతానికి ఏ స్వామీజీ వచ్చినా, ఓంకారాశ్రమంలో విడిది చేసేవారు. తెనాలి తూర్పుగా ఒక వ్యాసాశ్రమం వుంది. అది మళయాళస్వామికోసం కట్టించారు స్థానికులు.

మా పెద్దమ్మగారు అప్పడప్పుడు ఆశ్రమాలకు వెళ్లి వస్తుండేది. తెనాలి తత్వానందస్వామి వచ్చినప్పుడల్లా తను వచ్చేది. బందరు దగ్గర పెదకళ్లేపల్లిలో పిచ్చమ్మగారని ఒకామె వుండేది. మాలపిచ్చమ్మ ... వెళ్లి ఆమెను దర్శించి వచ్చేది. మాలపిచ్చమ్మ, అవధూత పిచ్చమ్మగా మారిన తర్వాత రేపల్లె ప్రాంతంలో వుండేది. అక్కడ వారం పదిరోజులు మా దొడ్డమ్మగారు మకాం వేసేవారు. వాళ్ల కథలు నాకు చెబుతుండేది. ప్రసిద్ధ రచయిత గుడిపాటి వెంకటచలం, సౌరిస్, వేలూరి శివరామశాస్త్రిగారు ఆ మాల పిచ్చమ్మగారి శిష్యులే.

శ్రీశాస్త్రిగారి సోదరి రమణమహర్షి భక్తురాలు సూరి నాగమ్మగారు మా పెద్దమ్మ నాగమ్మగారు, సూరి నాగమ్మగారు ఒక్కటే అనిపిస్తుండేది. సూరి నాగమ్మగారు తెలుగున 'రమణ భగవాన్ లేఖలు' అనే గొప్ప గ్రంథం రచించారు. పిచ్చమ్మగారికి కృష్ణ, గుంటూరు జిల్లాల్లో చాలమంది భక్తులు వుండేవారు. ఆమె దిగంబరంగా వుండేదిట. ఎప్పుడూ నిర్వికల్ప సమాధిలో వుండేది. భక్తులు నిరీక్షించి ఆమె సమాధి నుండి బయటకు వచ్చినపుడు దర్శించి ఆశీస్సులు పొందేవారు. ఆమె సహజయోగిని.

మా నాన్నగారికి, గాంధీజీ పుణ్యమా అని సంపాదనపై ధ్యాస తగ్గిపోయింది. ఎప్పుడూ పూజలు, జపతపాలు. వేదాంతం బాగా తలకెక్కింది. సత్యార్థప్రకాశిక, సనారీ విశ్వేశ్వర సంవాదం, రామతీర్థ, రామకృష్ణ రచనలు చదివేవాడు. ఆయన దగ్గర ఒక తంబూరా వుండేది పెద్దది. అది మీటుతూ రాత్రుళ్లు పాటలు పాడుకుంటుండేవారు. క్రమక్రమంగా ఆయనకు శిష్యులు సమకూడసాగారు.

గురువు ముద్ర పడితే వేదాంతం తలకెక్కినట్లే. పైగా శంకరాచార్య అద్వైతం ఒంటబడితే, సగం సన్యాసి అయినట్లే లెక్క. రామకృష్ణ పరమహంస మార్గం ఆయనది. కలకత్తా కాళీమాత పటం సంపాదించి, కాళీపూజ చేసేవారు. ఒక పెద్దరుద్రాక్షమాల వుండేది. దానిని మెడలో వేసుకుని తిరిగేవాడు కొంతకాలం. అప్పుడే భూతవైద్యం మొదలైంది. దయ్యాలు పట్టినవాళ్లు వచ్చి తీసుకువెళ్లేవారు.

స్కూల్‌ఫైనల్ పూర్తి అయితే నాకు ఉద్యోగం వస్తుందని ఆశించారు. ఆ రోజుల్లో సర్వీస్‌కమీషన్ పరీక్షలకు స్కూల్‌ఫైనల్ చాలు. నాకు మంచిమార్కులే వచ్చాయి. మా మేనమామ, మాతామహులు అప్పుడు మా ఇంటికి వచ్చి, నన్ను కాలేజీ చదువుకు పంపమని పట్టుబట్టారు అది మాపైన ప్రేమకాదని, నాకు ఈడైన కూతురు ఆయనకు ఉన్నది కనుక, మేనల్లుని అల్లుడు చేసుకోడానికి ఎత్తువేస్తున్నాడని మానాన్న అనుమానించారు నన్ను చదివించనని, చదివింది చాలనీ, మనవాళ్లలో ఈ మాత్రం చదవడమే గొప్ప అనీ ఏవేవో అన్నాడు. నాకు ఇంకా చదువుకోవాలనే వుంది. ఉద్యోగమైనా వెంటనే రాదుకదా! సర్వీస్ కమిషన్ పరీక్ష పాసవ్వాలి, సెలక్షన్ రావాలి, ఈ లోపల ఊరికే వుండటం ఎందుకని కాలేజీలో చేరడానికి ఒప్పుకున్నాడు. ఎప్పుడు సర్వీస్ కమీషన్ పరీక్షలు పడితే అప్పుడు చదువు ఆపివేసే కండిషన్

హైస్కూలు చదువు కాలంలో ఎప్పుడూ నాకు ట్యూషన్ చెప్పించలేదు. ఎప్పుడైనా సినీమాకు వెళ్లనిచ్చేవారు అదీ నేలతరగతి. పాతసినిమా అయితే అణా, కొత్త సినిమా అయితే రెండణాలు టికెట్టు ఖరీదు. బెంచీ పావలా, కుర్చీ ఏడణాలు, రిజర్వ్‌డ్ తొమ్మిదణాలు ఉండేది. అప్పట్లో కాంచనమాల, కన్నాంబ పెద్ద గ్లామర్ హీరోయిన్లు., ప్రతిఇంట్లోను కాంచనమాల 'మాలపల్లె' కాలెండర్లుండేవి. కాంచనమాలది మావూరే. హైస్కూలు రోజుల్లోనే ఒకసారి ఆమెను బజార్లో చూచాను. ఓహ్! స్వర్గం నుండి దిగివచ్చిన దేవత అనిపించింది. కళ్లు చెదిరిపోయే అందం, కాంతి ఆమెలో కనిపించింది

# ఆంధ్రా పారిస్

**క**ళలకు కాణాచి తెనాలి.

అది 'ది పారిస్ ఆఫ్ ఆంధ్ర'. కళాకారులకు ఆట విడిది కవితలకు పుట్టిల్లు, రసికులకు విహారకేంద్రం. చాలా వీధుల్లో కళావంతు లుండేవారు ఊరినిండా కళాకారులు తిరుగుతుండేవారు. పిల్లల్ని భోగం వీధుల్లోకి పోనిచ్చేవారు కాదు. ఆ రోజుల్లో చాలా పట్టణాలలో భోగం వీధులుండేవి. విలాస పురుషులు చీకటి పడే వేళకు అక్కడకు చేరుకునేవారు ముఖ్యంగా పిల్లల నుండి వచ్చే పెద్దలు, రసికులు, భోగం వాళ్ళ ఇళ్లకు వెళ్లడం గొప్పగా భావించేవారు పట్నంలో ఫలానా భోగం అమ్మాయిని ఉంచుకున్నాడంటే, పల్లెలలో అసహ్యించుకునేవారు కాదు అది ఒక గొప్ప. టౌన్‌లోను పరిస్థితులు అంతే ఎవరికి వారు నీతివంతులు కావలసిందే తప్ప, సమాజం గర్హిస్తుందని, వేలెత్తి చూపుతుందని మాత్రం కాదు. ఆ వీధులన్నీ క్రమంగా మారిపోయాయి వారంతా ఏమైనారో తెలీదు. ఊళ్లో అందగత్తెలంటే భోగంవారినే చెప్పుకునేవారు. ఇప్పటికీ తెనాలికి అలాంటి పేరే ఉంది. అప్పటికి ఈ వివరాలు తెలుసుకునే పాటి వయస్సుకాదు. నాటకాలంటే మక్కువ లేదు గానీ నాటకాల్లో నటించే వాళ్ల పేర్లు తెలుసు గనక వారిని గాంధీచౌక్‌లో చూడడం గొప్పగా వుండేది. శ్రీరామ నవమి ఉత్సవాలకు ఊరంతా పందిర్లే. ఎన్నో సంగీత కచ్చేరీలు, హరికథలు, విద్యుద్దీపాలంకారాలు, తాజ్‌మహల్, బావుటా బీడీల కంపెనీలు విద్యుత్ దీపాలతో, అప్పుడప్పుడు త్యాగరాజస్వామి ఉత్సవాలు జరుగుతుండేవి ఆంధ్రాలోని విద్వాంసులంతా వచ్చి పాడేవారు ఇప్పుడు తెనాలి పౌరులలో అంతటి కళాపిపాస కానరావడం లేదు. కళలన్నీ గతకాలపు వైభోగాలుగా చరిత్రకే పరిమితమైనాయి.

తెనాలిలో ఒక హరికథ చెప్పి, మెప్పుపొందాలని హరికథకులు ఉవ్విళ్ళూరేవారు. అలాగే హరికథకుల్ని బంగారు గండపెండేరాలతో సత్కరించి, ఏనుగుపై ఊరేగించేవారు.

కళాకారులు అందరకు గజారోహణం రాజసత్కారమే అనిపించేది. అప్పటికి నృత్య కళాకారులు తక్కువ. శైవా అని ఒకాయన డాన్సు నేర్పేవాడు. సంగీతం నేర్పేవారు చాలామంది వుండేవారు. చిత్రకారులు, వాద్యకారులు, పద్యకారులు, పండితులు ఎందరో వుండేవారు.

'కళ' పేరుతో వున్నా కళావంతులందరూ కళాకారులు కాదు. సంగీత సాహిత్యాలు తెలిసినవారు వాచ్యం బాగుండి, రూపురేఖలున్నవారు, నాటకాల్లో వేసేవారు. వారిలో సంస్కృతాంధ్రాలు బాగా చదివిన వారుండేవారు. మహా మహాపండితులను, కవులను పాండిత్యంతో ఓడించగలిగేవారు శృంగారాన్ని ఒకకళగా ఆరాధించేవారు కనుక వారు కళారాధకులైనారు. శృంగారం నవరసాలలో ప్రధానమైనది. కవి పండితులకు ప్రీతికరమైనది. మన ప్రాచీనకావ్యాలు, ప్రబంధాలు అన్నీ శృంగారమయమే. ప్రబంధ నాయికలు, కావ్య నాయికలు, ఆయా కవులు ఆరాధించి, అనుభవించిన కళావంతులే.

పారిస్ నగరం నాటికీ నేటికీ ప్రపంచం మొత్తానికి శృంగార కేంద్రం. విలాసాలకు ఆటపట్టు. ఏ వీధికి వెళ్లినా నాటకాలు, నృత్యాలు, సంగీతాలు, శృంగారాలు. అది భూతల స్వర్గం. అలాంటి పారిస్ పేరు తెనాలికి దక్కిందంటే అన్నిటా శృంగారం తొణికిసలాడినట్లే తెనాలికున్న చారిత్రక ఆకర్షణ శ్రీకృష్ణదేవరాయలు ఆస్థానకవి, విదూషకుడు అయిన రామకృష్ణుడు ఇక్కడివాడు కావడం ఎంతవరకు నిజమో తెలియదు కాని, ఊరి మధ్యన ఉన్న లైబ్రెరీ వెనుక ఆయన ఇల్లు చూపించేవారు ఆ ఇంటికి ఎదర ఆంజనేయస్వామి ఆలయం, వెనుకగా శివాలయం ఉన్నాయి. ఈ రెండు ఆలయాలు పడమటివేపు సింహద్వారాలు కలవే. సాధారణంగా దేవాలయాలు ప్రాగ్దిశను చూస్తుంటాయి. ఇవి రెండు పశ్చిమాభిముఖంగా వున్న దేవాలయాలు. 1946లో నా హైస్కూలు చదువు ముగిసింది. నా చదువుకు బ్రేక్ పడుతుందనుకున్నాను. మా నాన్నగారికి రాజకీయాలు, సంఘ కార్యక్రమాలు ఎక్కువై సంపాదన సన్నగిల్లింది. ఇల్లు గడవడమే కష్టంగా వుండేది. మంచిమార్కులతో పాసైనందువల్ల కాలేజీలో చేరడానికి గ్రీన్‌సిగ్నల్ యిచ్చారు.

అప్పటికి తెనాలిలో కాలేజీ లేదు. గుంటూరు జిల్లా మొత్తానికి ఒక్క గుంటూరులోనే కాలేజీలున్నాయి. ఒకటి ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీ, రెండవది హిందూ కాలేజీ. హిందూ విద్యార్థులు హిందూ కాలేజిని అభిమానించేవారు. అయితే అందులో ఇంటర్ ఒక్కటే వుండేది. డిగ్రీ చదవాలంటే ఎ.సి. కాలేజీలో చేరవలసిందే. బందరులో కాలేజీలుండేవి. ఇంకా దేశానికి స్వాతంత్రం రాలేదు. వస్తుందని, వచ్చి తీరుతుందని కలలు కంటుండేవారు. నేను డబ్బు సమకూర్చుకుని వెళ్లేసరికి హిందూ కాలేజీలో సీట్లు

అయిపోయినవి పొమ్మన్నారు. ప్రిన్సిపాలు బుద్ధిరాజు రామచంద్రరావుగారింటికి వెళ్లి మార్కులు చూపించి సీటు కావాలని అర్థించాను ఆయన ఒంటికన్నుతో ఎగాదిగా చూచి అప్లికేషన్ మీద సంతకం చేసి వెళ్లి జీతం కట్టు అన్నారు. ప్రిన్సిపాల్‌గారింటికి ఎవరూ అలా వెళ్లరట. నాకు తెలియక వెళ్లాను. ఆయన చాలా స్ట్రిక్టు అంటారు. ఇంటర్‌లో సీటు దొరకడంతో ఏనుగును ఎక్కిన సంబరం దర్జాగా పొడుగు లాగూలు (పాంట్లు) పొడుగుచేయి చొక్కాలు కుట్టించుకున్నాను.

హైస్కూలు వదలి కాలేజీలో అడుగుపెట్టడం ప్రతి విద్యార్థి జీవితంలోను ఒక మలుపు, ఒకవెలుగు, అదొక థ్రిల్. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ ఆ అనుభూతి కొత్తగానే వుంటుంది హాయిగానే వుంటుంది. కాలేజీలో అంతా కొత్త హిందూ కాలేజీలో అంతా మగపిల్లలే. ఆడపిల్లల్ని చేర్చుకునేవారు కాదు హిందువులైనా ఆడపిల్లలు ఎ.సి. కాలేజీలో చేరేవారు. లేడీహోప్ కాలేజీ అని ఒకటి ఆడపిల్లల కోసం పెట్టారు అందులో చేరేవారు. ఎ.సి కాలేజీకి, హిందూ కాలేజీకి పోటీ. అక్కడ విద్యార్థులు సూట్లు, బూట్లు వేసుకుని వచ్చేవారు. హిందూ కాలేజీలో అంతా సింపిల్‌గా వుండేవారు. బోడిగుళ్లు, పిలకలు ఎక్కువ. నాది ఎం పి.సి గ్రూపు. ప్రిన్సిపాల్ మారిపోయాడు. ఇంగ్లీషు లెక్చరర్‌గా వున్న శ్రీవల్లభ జోశ్యులు సుబ్బారావు ప్రిన్సిపల్ అయినారు చాలా గొప్ప లెక్చరర్స్ వుండేవారు. మారేమండ రామారావు చరిత్ర చెప్పేవారు ఇంగ్లీషు సుబ్బారావుగారు పి.ఆర్ శ్రీనివాసన్, వై.యస్.ఆర్.చంద్రన్ చెప్పేవారు. తెలుగు మందలపర్తి ఉపేంద్రశర్మ, పిల్లలమర్రి హనుమంతరావు, వావిలాల సోమయాజులుగారు, సంస్కృతానికి పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్య వుండేవారు. లెక్కలు ఇల్లిందల రంగనాయకులు చెప్పేవారు. వీరందరూ అప్పుడు లెక్చరర్లు అయినా, తర్వాత జీవితంలో విచిత్రంగా అనుబంధాలు ఏర్పడ్డాయి.

హిందూ కాలేజీ పిల్లలెవరూ ఇంగ్లీషులో మాట్లాడేవారు కాదు. ద్వేషం వల్ల కాదు. రాక. ఎ.సి. కాలేజీ పిల్లలు విధిగా ఇంగ్లీషులో మాట్లాడేవారు. వాళ్లను చూస్తే మాకు అసూయగా వుండేది. టిప్‌టాప్‌గా వుండేవారు మరి! మేం అర్భకులంగాను, పురోహితుల్లా వుండేవారం. అక్కడ డిసిప్లిన్ చాలా ఎక్కువ, మా కాలేజీలో కాస్త తక్కువ - స్వతంత్రం ఎక్కువ.

హాస్టల్స్ అందరికీ కుదిరేవి కాదు. చుట్టుపట్ల పట్నాల నుండి విద్యార్థులు రైళ్లలో సీజన్ టికెట్ పైన వస్తుండేవారు. ఉదయం, సాయంత్రం రైళ్లు అన్నీ మా విద్యార్థుల కోసమే అన్నట్లుండేవి. డ్రయివర్లు, గార్డులు మేం చెప్పినట్లు వినేవారు. తెనాలి, విజయవాడ, అటు సత్తెనపల్లి, మాచర్ల, నరసారావుపేటల నుండి రైళ్లలో

వచ్చేవారు. తెనాలి విద్యార్థులెవరూ హాస్టల్‌లో వుండేవారు కారు. రెండువందల మందికి సీజన్ టికెట్లే. ఉదయం ఎనిమిదిన్నర ట్రెయిన్‌కు రావడం, సాయంత్రం అయిదు గంటల రైలుకు వెళ్లిపోవడం. సైన్సు ప్రాక్టికల్స్ ఉన్న రోజుల్లో తెల్లవారుఝాము రైలుకు వెళ్లవలసి వచ్చేది స్టేషన్ పక్కనే వుండే శ్రీరామ సత్రంలో టిఫిన్‌బాక్సులు పెట్టుకుని, మధ్యాహ్నం వచ్చి తినేవాళ్ళం.

హిందూ కాలేజీ చదువు వల్ల నాలో తెలుగుపై ఆసక్తి కలిగింది. మొదట సంస్కృతం తీసుకున్నాను కానీ, శబ్దాలు వల్లించలేక తెలుగులోకి మారాను పిల్లల మర్రి హనుమంతరావు, వావిలాల సోమయాజులు తెలుగు బాగా చెప్పేవారు. కవిత్వంపై ఆసక్తి కలిగింది. నేను ఫలానా రాఘవాచార్యగారి మేనల్లుడనని తెలిసి మరీ ప్రేమగా చూచేవారు. ప్రబంధాలు, పద్యకావ్యాలు తెగచదివేవాడిని. పద్యాలు శ్రావ్యంగా చదవడం అలవాటైంది. రాయడమూ అలవాటైంది. ఆ సంవత్సరం తెలుగులో పద్య రచన, వ్యాసరచన పోటీలు పెట్టారు. రెండింటిలో నాకు మొదటి బహుమతులు వచ్చాయి. అదొక విజయం, తొలివిజయం సాహిత్యపరంగా అప్పుడొక మరపురాని సంఘటన జరిగింది. చిలుకూరి నారాయణరావుగారికి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చింది. అదే మొదలు అనుకుంటాను 'కళాప్రపూర్ణ' ప్రదానం చేయడం. వారు వాల్తేరు నుండి తిరిగి వస్తుండగా మా కాలేజీలో సత్కారసభ ఏర్పాటు చేశారు. విశ్వనాథ సత్యనారాయణగారిని సభాధ్యక్షులుగా పిలిచారు. ఆ సందర్భంలో మాకు బహుమతులు యిప్పించారు. విశ్వనాథ నా తల నిమిరి ఆశీర్వదించారు 'చిన్నవాడా, వృద్ధిలోకి వస్తావు' అన్నారు. అది మహాకవి ఆశీస్సు. అది మరపురాని సంఘటన. ఆ బహుమతి నా జీవితంలో ఒక మలుపు. నాకు వల్లమాలిన తెలుగుపిచ్చి పట్టుకుంది. లెక్చరర్ల ప్రేమాభిమానాలు మరింత పిచ్చివాడిని చేశాయి. నేను ఇంటర్ రెండవ సంవత్సరం చదువుతుండగా దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఇంటర్ పాసై మెడిసిన్ చదవాలను కున్నాను. కానీ ఇంటర్ పరీక్ష తప్పాను. కెమిస్ట్రీలో పోయింది. ఒకటి రెండు గ్రూపులు మాత్రం పాసైనాను. సెప్టెంబరుకు చదవడం తప్పలేదు. సెప్టెంబరులో మళ్లీ పోయింది. మళ్లీ మార్చి. అప్పుడూ తన్నింది. ఇంక చదువుకు స్వస్తిచెప్పక తప్పింది కాదు.

మా నాన్నగారికి కాలు విరిగి మంచాన పడ్డారు. పని మానివేశారు. ఇల్లుగడవడం కష్టంగా వుంది. ఉద్యోగం యిచ్చే నాథుడేడీ? దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆశలు పల్లకీలలో ఊరేగుతున్నాయి. అవకాశాలు అందిరావడంలేదు. సర్వీస్‌కమిషన్ పాసైతేనే

ఉద్యోగం, లేకపోతే మున్సిపల్ ఆఫీసు, రైల్వే, పోస్టల్ ఉద్యోగాలు ఇవే ఎంత చేసినా పరీక్షలు రాయడమే తప్ప ఒక్కటీ అందిరాలేదు. మరోపని చేతకాక మా ఇంట్లోనే ఒక కిరాణాకొట్టు పెట్టాం. బజారునుండి ఉప్పు, పప్పులు ఫాక్టరీ నుండి బియ్యం తీసుకు వచ్చి లాభానికి అమ్మడం. మా అమ్మ, నేను చేస్తుండేవాళ్లం వ్యాపారం. అయినా ఇల్లు గడవడం కష్టమే అయింది. స్వరాజ్ టాకీసు అని, మా ఊళ్లో వెలసిన నాలుగవ సినిమా హాలు. అక్కడ కిళ్లీ, సిగరెట్లకొట్టు పెట్టాను. రాత్రి పన్నెండు గంటల వరకు ఆ కొట్టు చూచుకునేవాడిని నామోషీ అనిపించినా తప్పనిసరి. ఇంటర్ చదివి కిళ్లీ కొట్టు నడపడం ఏమిటని అనేవారు. మా పరిస్థితి అది దాదాపు చదువు మూలపడినట్లే. మూడుసార్లు ఒకే సబ్జెక్ట్ తప్పడం, మిత్రులంతా డిగ్రీలోకి వెళ్లిపోయారు. నేను మాత్రం బడ్డీకొట్టుకు బదిలీ అయ్యాను

ఎంత వ్యాపారం జరిగినా రోజుకు పది రూపాయలు బేరం అయ్యేది కాదు. అందులో మిగిలేది ఒక రూపాయి, రెండు రూపాయలు. సొంత ఇల్లు కనుక అద్దె బాధ లేదు. తెనాలికి చేరిన కొత్తలోనే మా నాయనగారు దాచుకున్న డబ్బుతో 300 గజాలు స్థలం కొన్నారు. . గజం రెండు రూపాయలలోపే. అయిదారు వందల రూపాయలతో స్థలం, మరో అయిదారు వందల రూపాయలతో ఇల్లు ఏర్పడ్డాయి. ఊరి చివరన పొలాల్లో ఇల్లు. వర్షాకాలంలో బురదలో నడవ వలసి ఉండేది రాత్రిళ్లు కాలవలోంచి మట్టి గంపలతో మోసుకు తెచ్చుకునేవాళ్లం. కష్టపడి చెమటోడ్చి కట్టుకున్న ఇల్లు అది. వేయి రూపాయలకు ఇల్లా అంటారు ఇప్పటివారు. అప్పుడు బస్తా బియ్యం 30 రూపాయలు. బంగారం సావరిన్ 13 రూపాయలు. వెండి తులం రూపాయి. అసలు రూపాయి బిళ్లలన్నీ వెండివే. కరెక్టుగా తులం బరువు వుండేవి. యాభైఅరవై రూపాయలతో సామాన్యుడు సంసారం వెళ్లదీసేవాడు.

దరిద్రం వల్ల కవిత్వం రాయడం కట్టిపెట్టాను. మేనమామ తెలుగు పండితుడు. మా ఇంటికి రావడం తక్కువ. ఎప్పుడైనా అక్కగారిని పలకరించి వెళ్లేవాడు. భోజనానికి ఉండేవాడు కాదు. అయినవారెందరున్నా దరిద్రుడికి అందరూ లేనట్లే. మాది దరిద్రపు కుటుంబం. దరిద్రపు బ్రతుకు. పెద్దల నిస్సహాయత, దారిద్ర్యం పిల్లలపైన పడుతుంది. కలవారింట పుట్టిన పిల్లలవలె పేదింటి పిల్లలు పెరగరు. అవకాశాలు రావు. సమాజం శపించి, శరించిన వారు దరిద్రులు, అసహాయులు. రోజూ కన్నీరు తప్పేది కాదు. ఆకలైతే అన్నం దొరకదు. ఇంటికి వెడితే ఖాళీ గిన్నెలు ... రెండు రూపాయలు సంపాదించ లేకపోతే. అర్థరూపాయి అమ్మకం లేదు ... ఒకరోజున.

జీవితంపైన విరక్తి కలిగింది. ఎంత ఏడ్చానో! పన్నెండు గంటలకు కొట్టు కట్టేసి, కొత్త వంతెనలు దాటి, చాలా దూరం వెళ్లాను. అక్కడ రేపల్లె బ్రిడ్జి వుంటుంది. అది ఎక్కి చచ్చిపోవాలని నిశ్చయించుకుని కాలవలో దూకాను ఉక్కిరిబిక్కిరి అయింది తర్వాత ఎప్పటికో కళ్లు తెరిచాను. ఆ ప్రక్కన గుడిసెలు వేసుకుని వున్న దొమ్మరివాళ్లు, యానాదులు ఎవరో నీళ్ళలో పడ్డ శబ్దానికి పరుగెత్తుకు వచ్చి, నన్ను వడ్డున చేర్చి, స్పృహ లేని స్థితిలో వాళ్ల గుడిసెకు చేర్చారు. తెల్లవారే సరికి బ్రతికి బయటపడ్డాను. బట్టలు తడిసిపోయి వున్నాయి. నెమ్మదిగా ఇంటికి చేరాను.

కష్టాలలో దేవుడు జ్ఞాపకం వస్తాడు. పరమ భక్తితో మా ఊళ్లోని దేవాలయాలన్నీ తిరిగాను ఎంతో ఆశ చూపాను లంచం యిస్తానన్నాను. ఏ గుడి దేవుడు నా మాట మన్నించలేదు మనుషుల మాటలు దేవుళ్లకు వినిపించవు వాళ్లు ఎప్పుడో రాళ్లుగా మారిపోయారు మనుషులే దేవుళ్లను రాళ్లుగా మార్చి వేశారు. అప్పటితో దేవుళ్లపై కోపం ఏర్పడ్డది. చస్తే గుడికి వెళ్లకూడదని ఒట్టు పెట్టుకున్నాను. కష్టపడి బ్రతకాలి. కష్టమైనా, సుఖమైనా మనిషి తనకు తాను ఏర్పరచుకోవలసిందే. ఏ దేవుడు మనం దణ్ణం పెట్టినంత మాత్రాన పొంగిపోయి వరాలివ్వడు.

ఒక్కొక్కసారి జీవితం విచిత్రంగా మలుపు తిరుగుతుంది. అలాంటి మార్పు ఫలితాలు ముందుగా ఊహించలేం. ఇరుకు సందుల్లోంచి రహదారిలోకి ప్రవేశించినట్లు - చీకటిలో చిరుదీపం వెలిగించి, ఆ వెలుగు చాటున పయనించినట్లు తెనాలిలో అప్పుడు ఆలపాటి రవీంద్రనాథ్‌గారు 'జ్యోతి' మాసపత్రిక ప్రారంభించారు. ధనికొండ హనుమంతరావు సంపాదకుడు. కాస్త సాహిత్యవాసన అబ్బినందువల్ల, పైగా ఆ పత్రికలో మంచికథలు రావడం వల్ల అది చదివేవాడిని. చాలా బాగా వుండేది పత్రిక. రెండువందల పేజీలు కథలు, నవలలు, గేయాలు వేసేవారు. సెక్సువ్యాసాలు ఉండేవి. ఆ పత్రికకు తోడుగా 'రేరాణి' అనే సెక్సు పత్రిక రాబోతోందని తెలిసి వాళ్ల ఆఫీసుకు వెళ్లాను. నే రాసే పద్యాలు చూచి, మురిసి, ఉద్యోగం యిస్తారని ఆశ. ఏ చెట్టు లేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షం. అప్పట్లో ఆలోచన అంతే. కావ్యాలు చదివి, పద్యాలు రాయడమే గొప్ప సాహిత్యపరునిగా తీర్చిదిద్దుతుందని నమ్మకం. మెయిన్‌రోడ్డులో లోపలగా వుండేది జాకొబిన్ ప్రెస్ ఓ సాయంత్రవేళ ఆ ప్రెస్‌లోకి అడుగుపెట్టాను. అప్పటివరకు ప్రెస్‌లతో పరిచయం లేదు. పత్రికలు కట్టలు కట్టలుగా పడివున్నాయి. పుస్తకం క్రిందపడితే, కాళ్లకు తగిలితే 'అమ్మో సరస్వతి' అని కళ్లకద్దుకునేవారు. అక్కడ ఎంతమంది సరస్వతుల్ని కాళ్లతో తొక్కుతున్నారో! ఎడిటర్ కోసం మేడపైకి వెళ్లాను. ఆయన లేరు. బయటి గదిలో

కుర్చీలో ఒకాయన కూర్చుని బీడీ కాలుస్తూ, ఏదో చదువుకుంటున్నాడు .. జలుబు చేసిందేమో ముక్కు ఎగపీలుస్తున్నాడు ఆయన దృష్టి మళ్లించడానికి నమస్కారం అన్నాను

"రావోయ్ కూర్చో" అని "ఒక్క నిమిషం" అని మళ్లీ ఏదో రాయడం మొదలెట్టాడు. ఆయనగారి రాత పూర్తి కావడానికి అరగంట పట్టింది. అప్పుడు తలెత్తి "ఇప్పుడు చెప్పవోయ్ .. ఎవరు నీవు? ఏం పనిమీద వచ్చావు" అడిగాడు పెద్ద నేను తెలిసినట్లు 'ఏవోయ్' అని పలకరించిన పెద్దమనిషికి నన్ను పరిచయం చేసుకున్నాను . పద్యాలు రాస్తానన్నాను.

ఆయన ఫక్కున నవ్వి "ఇదిగో శర్మా! మరోలా అనుకోకు ఈ రోజుల్లో పద్యాలు పట్టెడన్నం పెట్టవు. నేనూ రాశాను పద్యాలు ఏంలాభం! రూపాయి డబ్బు మొహాన విదిలించరు. సన్మానాలు చేస్తారు చచ్చే వయసు వచ్చేక, శాలువాలు కప్పుతారు చచ్చాక శవం మీద! కనుక నే చెప్పొచ్చేదేమిటంటే నీవు బాగుపడదలచుకుంటే పద్యాలు మానెయ్. పైకి రాదలచుకుంటే నే చెప్పినట్లు చెయ్.." అని హితోపదేశం చేశాడు నాకు కళ్లంట నీరు తిరిగింది. ఈ దుర్మార్గుడు కవితాసరస్వతిని ఎంత అవమానించాడని లోపల్లోపల ఏడ్చాను. నన్ను ఊరడించడం కోసం 'కాఫీ తాగి వత్తాం పద' అని బయటకు నడిపించాడు. తన డబ్బుతో పెసరట్టు, కాఫీ యిప్పించాడు. మమ్మల్ని చూచి లోపలకు వచ్చిన కుర్రాణ్ణి పరిచయం చేశాడు "వీరి పేరు నటరాజన్ ... కథలు రాస్తుంటారు."

"ఇంతకీ మీ పేరు చెప్పారు కాదు" అన్నాను.

"నాపేరు గోవిందాచారి .. అలా అని చెప్పాననుకో నాపని గోవిందా! కనుక పేరు మార్చుకున్నాను. నన్ను భరద్వాజ అని పిలువ్ చాలు."

అలా భరద్వాజ, శారద (నటరాజన్), శర్మ (శార్వరి) త్రిమూర్తుల కలయిక తెనాలి 'జ్యోతి' నీడన జరిగింది. తనే రవీంద్రనాథ్‌గారికి చెప్పి చిన్న ఉద్యోగం యిప్పించాడు. జీతం 40 రూపాయలు. బడ్డీ కొట్టుకంటే బెటర్.

భరద్వాజతో మైత్రి 50 సంవత్సరాలు దాటింది. అయినా ఆ పిలుపు, ఆత్మీయత, అనురాగం వన్నె తగ్గలేదు.

"మీవంటి గొప్ప రచయితను కలుసుకోవడం నా అదృష్టం" అన్నాను.

పొగడ్తలకు, స్తోత్రాలకు దేవుళ్లు, దేవతలే పడిపోతుంటారు. వరాలు పడేస్తుంటారు. కోర్కెలు తీరుస్తుంటారు. మనుషులు ఎలా తప్పించుకోగలరు! మీ రచన బావుంది అని మెచ్చుకునే పాఠకుడు రచయితకు అవసరం. లేకపోతే నీరు కారి,

నీరసించిపోతాడు. ఆడవారిని చూడండి ... ఎంత అందగత్తె కానీండి "అబ్బ మీరెంత అందంగా వున్నారు" అంటే ఓ నాలుగు కె.జి.లు అమాంతం పెరుగుతుంది. తన అందాన్ని గుర్తించినట్లు తనను చూడాలి అలా చూడకపోతే ఎంత అందగత్తె అయినా దిగులుపడుతుంది. రచయితలు అలాంటివారే! ఆరోజు నుండి భరద్వాజ కథలకు నేనే మొదటి శ్రోతను... చాలా సంవత్సరాల వరకు పొగడ్త కోసం కాదు కాని నిజంగానే అతని కథలు నాకు నచ్చేవి. అలాగే శారద కథలు కూడా. జీవితంలో ఎదురయ్యే సంఘటనలు, పరిచయమైన మనుషుల్లోంచి కథల్ని పుట్టించడం అతని స్నేహంలో లభించిన వరం.

ఉద్యోగం సంపాదించడానికి ఒక చిన్న 'ట్రిక్' చేశాం. ఏదైనా ఓ కథ రాసుకురా అన్నాడు. నాకు కథలు రాయడం రాదన్నాను.

"రేరాణిలో ఒక పేజీ జాగా వుంది. రేపు ఉదయానికి ఒక పేజీకి సరిపడా ఏదో రాసుకురా, కథలాంటిది. నే చూసుకుంటాను" అన్నాడు.

ఆ రాత్రికి రాత్రి తొలిసారిగా కథ రాశాను 'తొలిరాత్రి' అని దానికి పేరు పెట్టాను మర్నాడు ఆఫీసుకు వెళ్లి భరద్వాజకు యిచ్చాను. అప్పటికప్పుడు నాముందర్నే ఎడిట్ చేసి కంపోజ్‌కి పంపాడు. సాయంత్రానికి ఆ కథ అచ్చయింది రేరాణిలో. ఆ బుల్లి పేజీ కథను అడ్డం వేసి నాకు ఉద్యోగం యిప్పించాడు. కథ పేరు 'శోభనరాత్రులు' అని మార్చిన గుర్తు. ఆ తర్వాత రవీంద్రనాథ్‌గారే స్వయంగా 'జ్యోతి'కి రాస్తుండు అన్నారు కోటలో పాగా వేశాను.

ధనికొండ హనుమంతరావుగారు స్వంత పత్రిక 'అభిసారిక' ప్రారంభించి, జ్యోతి వదిలిపెట్టారు. జ్యోతి, రేరాణి రెండు పత్రికలు భరద్వాజ చూచేవాడు. మా ఇద్దరి కలయిక తెనాలిలో సాహిత్య పునరుద్ధరణకు నాందివాచకమైంది అంతకు ముందు సాహితీపరులు లేరని కాదు. మహామహులకు పుట్టిల్లు తెనాలి. ఈకాలం మహాకవులలో శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారిది ఈ ఊరే. శ్రీయుతులు గోపీచంద్, కొడవటిగంటి కుటుంబరావు, చక్రపాణి, జి.వి. కృష్ణారావు, పి.వి. సుబ్బారావు, ధనికొండ వీరంతా కథ, నవల సాహిత్యంలో అగ్రగణ్యులే. మాతరం వచ్చేసరికి వారంతా సాహిత్యపరంగా వలసపోయారు. నాలాంటి పసివాళ్లం భరద్వాజను ఆశ్రయించాం ఆయన కథలతో బాగా ప్రచారం పొందాడు. నేను, భరద్వాజ, శారద కలసి మాఇంటిని సాహితీకుటీరంగా మార్చి, చిన్న సమావేశాలు ఏర్పాటుచేశాం. పట్నంలోను, చుట్టుపక్కల వుండే చిన్న పెద్ద రచయితలు సమావేశాలకు రాసాగారు. మాకు పెద్ద దిక్కు జి.వి. కృష్ణారావు. ఆలూరి భుజంగరావు, కవిరావు, తాళ్లూరి నాగేశ్వరరావు మాతో కలిసినవారు. భరద్వాజ నివాసం

కూడా మాఇంటికి మారింది. ఒకే చోట పనిచేయడం, ఒకే ఇంట్లో ఉండడం .. అతని ప్రోత్సాహం వల్ల మళ్లీ సెప్టెంబరు పరీక్షలు రాశాను. పాసైనాను. చచ్చేట్లు చదివినపుడు తప్పాను అసలు పుస్తకం ముట్టనపుడు పాసైనాను.

నేను ఆఉద్యోగం ఎక్కువకాలం చేయలేదు. తనూ మానివేయవలసి వచ్చింది కారణం రవీంద్రనాథ్‌గారు ప్రెస్‌ను హైదరాబాద్‌కు మార్చారు భరద్వాజ కొంతకాలం 'అభిసారిక' పత్రికలో ధనికొండ వద్ద పనిచేసినట్టు జ్ఞాపకం. ఆయన ఆ పత్రికను మద్రాసుకు తరలించడంతో ఇతనికి మరొక ఉద్యోగం వెతుక్కోవలసి వచ్చింది. తెనాలి మహాపట్నంలో ఉద్యోగాలు ఏముంటాయి! అతనికి కథలు రాయడం, ప్రూఫులు దిద్దటం తప్ప రాదు. నలందాప్రెస్‌లో చేరాడు. కోగంటి రాధాకృష్ణమూర్తిగారి ప్రెస్ ఆయన 'సమీక్ష' అని ఓ మంచి పత్రిక నడుపుతున్నారు రాడికల్ హ్యూమనిస్టు. గొప్ప మనసున్నవాడు. అదే సమయంలో నేను ఎ.సి. కాలేజీలో బియ్యేలో చేరడం జరిగింది.

తెనాలి పత్రికలలో పనిచేసింది తక్కువే అయినా ఎడిటర్లతో, రచయితలతో స్నేహం ఏర్పడ్డది. 'సినిమా' పత్రికకు మద్రాసునుండి మాగాపు రామన్, కొలను బ్రహ్మానందరావు 'రేరాణి'కి ఎడిటర్లుగా వచ్చారు 'మాన్సు' జ్యోతి చూచేవాడు ధనికొండ 'అభిసారిక', కోగంటి రాధాకృష్ణమూర్తిగారి 'సమీక్ష' ఇంకా చిల్లర మల్లర పత్రికలు వెలువడేవి. ఉత్పల సత్యనారాయణాచార్య ఒక పత్రికలో పనిచేస్తుండేవారు. వారి వద్ద కొంతకాలం పనిచేశాను. ఒక 'వాణిజ్య'పత్రికలోనూ కొంతకాలం పనిచేశాను. కె. రోశయ్య (మంత్రి), గోవిందరావు (విజడం) లకు ఆ పత్రికతో సంబంధం వుండేదని జ్ఞాపకం. ఎలాగో పత్రికల వాసన బాగా పట్టింది. ఎడిటర్లు, రచయితలు ఎలావుంటారో తెలిసివచ్చింది ఈ పత్రిక లన్నింటికీ కథలు, వ్యాసాలు, అవీ ఇవీ రాస్తుండేవాడిని. అప్పుడే రాంషా, సోమసుందర్, ఉషశ్రీలతో పరిచయం అయింది.

అభ్యుదయ రచనల పట్ల ఆకర్షణ పెరిగి, కవితలు మొదలుపెట్టాను. సోమసుందర్, ఆరుద్ర, శ్రీశ్రీల బాణీలో కవితలు రాస్తే పత్రికలు వేసేవి. అప్పుడే బాలగంగాధర తిలక్ ఒకసారి మా ఇంటికి వచ్చాడు. తెనాలి వాడైన 'బైరాగి'తో తర్వాత ఎప్పుడో మద్రాసులో పరిచయం ఏర్పడ్డది.

ఎ.సి. కాలేజీలో బి.ఏ.లో చేరేనాటికి 'విజయప్రభ' అనే దినపత్రికలో నా నవల సీరియల్‌గా రాసాగింది. ఆ పత్రిక న్యాయపతి రాఘవరావుగారిది అనుకుంటాను. జి.వి. కృష్ణారావు, బి.ఎస్.ఆర్.కృష్ణ, వట్టికొండ రంగయ్యగార్లు ఆ పత్రికలో పనిచేసేవారని తర్వాత తెలిసింది. ఒక దినపత్రికలో నవల సీరియల్‌గా రావడం వల్ల గుంటూరులోని

మూడు కాలేజీలలో నాకు మంచి పేరు వచ్చింది పెద్దపెద్ద సాహితీపరులు సైతం నా పరిచయాన్ని వాంఛించారు. ఎ.సి. కాలేజీలో లెక్చరర్ జమ్మలమడుగు మాధవరాయ శర్మగారు. హిందీ పండితుడు జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు మరీమరీ ప్రేమగా చూచేవారు. హిందూ కాలేజీ వారంటే పాతకాపులే. అప్పుడే జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు 'సుభాషిణి' అని ఓ సాహిత్య పత్రిక ప్రారంభించారు. అది తెనాలిలో అచ్చయ్యేది. నేను రోజూ తెనాలి గుంటూరుల మధ్య తిరిగేవాడిని కనుక ఆ పత్రిక ప్రెస్ పనులు నా కప్పగించారు.

అవతల సాహితీసమితి కార్యక్రమాలు పెరిగాయి. జి.వి.కృష్ణారావు లాంటివారు ఉండటంతో ప్రాచుర్యం పొందింది. ఇటు పత్రికలు పెరిగాయి తెనాలికి రచయితల రాకపోకలు అధికమైనాయి స్థానికంగా వున్న మాలాంటి కుర్ర రచయితలకు అది పండుగ. నిత్యం సాహిత్యగోష్ఠులనే అనిపించేది

భారతీయ జీవనంలోను, ఆలోచనలోను పరిణామం కలుగుతున్న రోజులు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక, జీవన పునరుజ్జీవనంతోబాటు జాతీయ దృక్పథం మారసాగింది. మనిషి ఆలోచన మారసాగింది. భారతీయుడు స్వతంత్రంగా ఆలోచించడం, వ్యవహరించడం నేర్చుకుంటున్నాడు. దాని ప్రభావం యువతరంపైన బాగా కనిపిస్తోంది. అప్పటివరకు ప్రతివాడికి గాంధీయిజం వేదం. స్వాతంత్ర్యం వచ్చాక, గాంధీజీ మరణంతో గాంధీయిజం మరణించింది. చరకాలు, రాట్నాలు మూలపడసాగాయి ఖద్దరు బదులు మిల్లుబట్టలు కట్టసాగారు జనం. ఖద్దరు అవసరం తీరిపోయింది. దేశం స్వతంత్రం అయ్యేంతవరకే ఖద్దరు, గాంధీల అవసరం. జాతీయపతాకం త్రివర్ణమే అయినా, రాట్నం బదులు ధర్మచక్రం వచ్చి కూర్చున్నది. కాంగ్రెసు విలువ తగ్గింది. కేంద్రంలో, రాష్ట్రాలలో అధికారం కాంగ్రెసుదే అయినా యువతలో కమ్యూనిజం ప్రేరణ ఎక్కువైంది. సోషలిజం కూడా మేధావుల్ని ప్రభావితంచేసింది. వీటికి తోడు ఎం.ఎన్.రాయ్ రాడికల్ హ్యూమనిజం చదువుకున్నవారిని ఆకట్టుకుంది. ఇంటర్, బి.ఏ. చదువుల సంధికాలంలో నాలోనూ వచ్చిన మార్పు దేశంలోనూ వచ్చింది. ఎటు మొగ్గాలి, దేనిని అభిమానించాలి, దేనిని ఆశ్రయించాలి, దేనిని ఆచరించాలి?

గాంధీజీపైన, కాంగ్రెసుపైన లభించినన్ని పుస్తకాలు చదివాను. కమ్యూనిస్టు సాహిత్యం చాలా చదివాను. మనస్సు రామమనోహర్‌లోహియా, అశోకమెహతాలపైకి మళ్లింది. సోషలిస్టు సాహిత్యం అధ్యయనం చేశాను. రాత్రింబవళ్లు చదవడమే పని. సాహితీసమావేశాలు కారణంగా తెనాలి మేధావివర్గంతో పరిచయం అయింది.

రాడికల్ హ్యూమనిస్టుల 'హేతువాదం' నచ్చింది. ఆ గ్రూపులో ప్రతిఒక్కడు ఒక మేధావిలా కనిపించారు. దానికి రాజకీయ రంగు లేదు. కనుక మేధావులకే

పరిమితమైంది ఎమ్.ఎన్.రాయ్ గొప్పమేధావి. మనదేశంలో నెహ్రూకు ధీటైన వ్యక్తి రాయ్. హేతువాదులతో మైత్రి కారణంగా రాడికల్ హ్యూమనిజం గొప్ప అనిపించింది. ఈ ఇజాల గురించి తెలుసుకోవాలంటే, చదవాలంటే తెలుగులో పుస్తకాలు లేవు. ఉన్నవి పరిమితం. ఇంగ్లీషులో చదవడం తప్పనిసరి. ఇంగ్లీషులో చదివి తెలుగులో అర్థం చేసుకునేవాడిని. అప్పట్లో ఇంగ్లీషు రానివాళ్ల చేతుల్లోను, సోషలిస్టు కమ్యూనిస్టు రాయిస్టు పుస్తకాలు నలుగుతుండేవి. అదొక భావవిప్లవం. అదే సాంఘిక విప్లవం. అదే సామాజిక చైతన్యం.

నాలాంటి వాళ్లను, హేతువాదుల్ని ముఖ్యంగా ఇంగ్లీషులో ఆలోచించి, తెలుగులో రాస్తారని హేళన చేసేవారు. దానివల్ల సిగ్గుపడవలసింది లేదనిపించింది తెలుగులో చదవదగిన పుస్తకాలు లేవు కవిత్వాలు, కావ్యాలు, ప్రబంధాలు ఇవే కదా తెలుగు సాహిత్యం. ప్రోజ్ చదివితే ఇంగ్లీషులోనే చదవాలి ఇలాంటి గొప్ప పుస్తకాలన్నీ ఇంగ్లీషులోనే వుండేవి. చదవక ఏం చేయాలి? రెండు సంవత్సరాల కాలంలో ఎన్ని వందల పుస్తకాలు చదివానో చెప్పలేను కానీ విపరీతంగా చదవడం మాత్రం అలవాటైంది ఇంగ్లీషు పుస్తకాలు ధారాళంగా చదవగలిగిన వాడికి, తెలుగు పుస్తకాలపై మోజు తగ్గిపోతుంది క్రమంగా ఇంగ్లీషు కథలు, నవలలు, కవితలు చదవడం అలవాటైంది. మేధావుల్లో చేరిపోయినట్లే!

పస్తులుండడం కవులకు, రచయితలకు అలవాటు. అండర్‌గ్రౌండ్ జీవితం రాజకీయనాయకులకు అలవాటు. కవిత్వం కడుపునింపదని ఎప్పుడో తెలుసుకున్నాను. కవిత్వాన్ని కట్టిపడేశాను. పత్రికలు ప్రచురించేవి రాయాలి, పాఠకులు చదివేవి పత్రికలు వేస్తాయి. అవి నీతికథలో, బూతుకథలో పదిరూపాయలు సంపాదించిపెట్టేవి కథలు. ఆదర్శాలను అవతల పెట్టి ఒక్కపూట అయినా తిండిపెట్టగల కథారచనను ఆశ్రయించాను.

ఇంటి పరిస్థితి నాకు పట్టేది కాదు. నా బ్రతుకు నేను బ్రతికితే చాలనుకునేవారు. ఏ అర్ధరాత్రికో ఇంటికి చేరితే, ఆకలికి తట్టుకోలేక 'అమ్మా అన్నం వుందా?' అంటే "నువ్వు ఎక్కడో తినేసి ఉంటావని మిగల్చలేదు" అని సమాధానం. చెంబు మంచినీళ్లు తాగి పడుకోవడం. ఊళ్లో పత్రికలున్నాయి. ఏదైనా రాయగల సత్తా ఏర్పడ్డది. సాహిత్యమే కాదు, రాజకీయం, వ్యాపారం ... 'రాత' రాతే. చాలా వేగంగా రాయడం, ఇంగ్లీషులోంచి అనువదించగలగడం నాకున్న ప్రత్యేకత. బి.ఏ. చదవాలనే తపన చావలేదు. ఇంట్లో రూపాయి ఇవ్వరు. మా ఇంట్లో నేను తెచ్చుకున్న 'కమ్యూనిస్టు సాహిత్యం' పోలీసులు పట్టుకెళ్లారు. నేను కమ్యూనిస్టుననే ముద్రపడిపోయింది. అయినవాళ్లు, బంధువులు ఒక

దొంగను చూచినట్లు చూడసాగారు. కాదు మొర్రో అంటే వినరే! ఏపూట ఎక్కడ తింటానో, ఎ రాత్రి ఎక్కడ పడుకుంటానో తెలీదు. ఏ పత్రికాఫీసులో వీలైతే అక్కడ. పత్రికల నుండి వచ్చే పది పాతిక కూడబెట్టి జూన్ వచ్చేసరికి గుంటూరు ఎ.సి. కాలేజీలో చేరాను స్పెషల్ ఇంగ్లీషు గ్రూపు మిగత అన్ని గ్రూపులకు పోటీ ఎక్కువ. నేను ఎం.ఎస్.ఎం మధ్య రెండు సంవత్సరాల గాప్ ఏర్పడ్డది ఇంగ్లీషు గ్రూపులో ఎక్కువమంది చేరేవారు కారు. నాకేమో కాస్త ఇంగ్లీషు పుస్తకాలు చదివే అలవాటు వుంది అడ్మిషన్ సమయంలో రెండు.బరువైన ఇంగ్లీషు పుస్తకాలు చేతపట్టుకుని వెళ్లాను. వెంటనే సీటు యిచ్చారు. ఒక్క ప్రశ్న అడగలేదు రోజు ఉదయం వెళ్లి సాయంత్రం రావడం కనుక మావాళ్లకు అనుమానం కలగలేదు. నేనేదో పత్రికల్లో అఘోరిస్తున్నాననే అనుకున్నారు. నా సంపాదనలో కాస్త ఇంట్లో యిచ్చేవాడిని అనుమానం రాకుండా. అప్పటికి చాలా పత్రికలకు రాయడం అలవాటైంది మద్రాసు పత్రికలు కొన్ని డబ్బులిచ్చేవి వీటికి తోడు భరద్వాజ పుణ్యమా అని బెజవాడ రేడియోలో అడిషన్ టెస్టు పాసై ఆర్టిస్టుగా నమోదైనాను. నెలకు కనీసం ఒక నాటికలో పాల్గొనే అవకాశం వచ్చేది. అదీ సంపాదనే. ఇలా సంపాదిస్తూ చదువు సాగించడం అనే ప్రక్రియ చోటుచేసుకుంది. రాత్రింబవళ్లు కష్టపడేవాడిని. కాస్త సమయం దొరికితే ఏ కథో రాయడం పదిపదిహేను పత్రికలకు విరామం లేకుండా రాస్తుండేవాడిని. దాధాపు పంపిన ప్రతి రచన అచ్చయ్యేది తిరిగి రావడం అంటూ ఎన్నడూ జరగలేదు, అసలు అప్పట్లో రచయితలే తక్కువ. నేను లేనప్పుడు ఒకరిద్దరు స్నేహితులు నాకోసం వచ్చేవారు. వారివల్ల తెలిసింది నేను ఉద్యోగం చేయడం లేదని, బి.ఎ. చదువుతున్నానని. దాంతో నాపైన మరీ కోపం పెరిగింది. వాళ్లకు ఇష్టం లేకపోయినా, పైకి చదవడం నాతప్పు. మా అమ్మగారు మాత్రం పరోక్షంగా ప్రోత్సహించేవారు.

మేధావివర్గం నిట్టనిలువునా చీలిపోయింది అప్పుడే. అంతవరకు పద్యాలు రాస్తే గొప్ప. ఇప్పుడు వచనం, కథ, నవల రాయడం మరీ గొప్ప. వచనానికి, పద్యానికి మధ్యలో 'వచనపద్యం' వచ్చిపడింది. శ్రీశ్రీ 'మహాప్రస్థానం' అచ్చయింది. పద్యం చచ్చిపోయింది. పద్యాలు మహా బాగా రాయగల యువకులంతా గద్యకవిత్వాన్ని ఆశ్రయించారు. ఒక్క దాశరథి తప్ప అందరూ వేషం మార్చారు. భావం మార్చారు. ఎమోషన్స్‌ని ఆశ్రయించారు. అంతవరకు సాహిత్యం బ్రాహ్మణుల సొత్తు. కవులు వారే. నవలాకారులు వారే. ఈ వర్గాన్ని చీల్చి చెండాడిన వ్యక్తి త్రిపురనేని రామస్వామిచౌదరి. ఆ తర్వాత హేతువాదులు. అంటే కమ్మవర్గం. హేతువాదులంతా మహామేధావుల మనుకునేవారు. వారిలోంచి రచయితలు, కవులు పుట్టుకొచ్చారు. ఈ విప్లవం చాపక్రింద

నీరులా పాకింది కమ్మమేధావులకు ధనబలం, రాజకీయబలం తోడైంది పైచేయి వారిదైంది. అంతవరకు బ్రాహ్మణమేధావులు అలక్ష్యంచేసి, అవమానం చేసి, అణగదొక్కబడిన మిగిలిన కులాల మేధావులు, కవులు, రచయితలు కమ్మమేధావివర్గాన్ని అభిమానించసాగారు. అది భావవిప్లవం. అది గొప్ప వర్గపోరాటం. ఈ పోరాటం యాభై ఏళ్లుగా ఇంకా సాగుతూనే వుంది చాలామంది గుర్తించని భావవిప్లవం ఇది. గుర్తించినా బాహాటంగా చెప్పటానికి భయపడతారు. అవసరాలు తీరడం కోసం నక్కవినయాలు ప్రదర్శిస్తారు. దొంగ నమస్కారాలు చేస్తుంటారు

రెండు పదుల వయస్సులో కష్టాల పుంతలలో కదలాడడం, లేమితో జీవించడం శాపం. సాటివారు, ఈడువారు హాయిగా సుఖంగా వుంటే చూస్తూ నోరు చప్పరించడం ఎంత బాధ ఒకప్రక్క పొట్టనింపుకోవడం కోసం కష్టపడాలి, మరొకప్రక్క చదవాలనే ఆశ తీరడం కోసం శ్రమించాలి. రాతలవల్ల చదవడానికి సమయం చిక్కేది కాదు డిగ్రీ క్లాసులో చిరిగిన బట్టలతో కూర్చోవడం! ఎవరిని నిందించాలి .. నా విధిని తప్ప, దురదృష్టాన్ని తప్ప. కలవారింట పుట్టినట్లయితే జీవితం మరోలా వుండేది. ఇంట్లో రోజూ అమ్మ నాన్న తగవులు, దెబ్బలాటలు .. అకారణంగా కొట్టుకోవడం... అమ్మ అలక ... ప్రొద్దుటే రైలుకు వెళ్లే సమయానికి వండిపెట్టకపోతే, పెట్టలేకపోతే, కాళ్లీడ్చుకుంటూ వెళ్లడం, డబ్బులుంటే హోటల్లో తినడం, లేకపోతే సాయంత్రం వరకు పస్తు. మానాయనగారి వేదాంతం నాపాలిటి శాపమైంది. జగత్తు మిథ్య, సంసారం మిథ్య అని బోధిస్తూ సోమరితనంగా జీవించడం! మళ్లీ ఏవీ వదలరు. సంపాదించడం, కష్టపడడం మాత్రం కూడని పనులు జీవితంపై అసహ్యం వేసేది. అయినా భవిష్యత్తుపై ఆశ మంచిరోజులు వస్తాయన్న ఆశ. 'భగవాన్! నువ్వు ఉన్నావా? ఉంటే ఈ కష్టాలు ఎందుకు కల్పిస్తున్నావు' అని దీనాలాపన, మూగరోదన.

అప్పట్లో మా మేనమామగారు కొండూరు వీరరాఘవాచార్య సత్తెనపల్లి హైస్కూలులో తెలుగుపండితునిగా పనిచేస్తుండేవారు. ఆయన కావ్యాలు, వేదాంత గ్రంథాలు రాయసాగారు. ఆత్మదర్శనం, శిల్పదర్శనం లాంటివి. ఆయనకు కులం పిచ్చి జాస్తి. నాకు కులం పేరు చెబితే చాలు అసహ్యం. నా అసహ్యానికి కారణం లేకపోలేదు. ఒకసారి పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలకు రాయాలని ప్రయత్నించాను. బి.ఏ. చదివి, సర్వీస్ కమీషన్ పాసైతే మంచి ఉద్యోగం గ్యారంటీగా వస్తుంది. అప్లికేషన్‌తో కులం సర్టిఫికెట్ జతపరచాలి. ఆ సర్టిఫికెట్ తహసీల్దారు యివ్వాలి. మునసబు దగ్గర, కరణం దగ్గర ఉత్తరాలు తీసుకుని తహసీల్దారును కలిశాను. రేపని, మాపని తిప్పాడు. అప్లికేషన్

పంపే గడువు దగ్గర పడ్డది. ఆఖరి రోజున వెళ్లినా ప్యూన్ లోపలకు పోనివ్వలేదు. 'అయ్యగారు బిజీగా వున్నార'ని చెప్పి వాడికి రూపాయి లంచం యిస్తే తనే సంతకం పెట్టించి తెచ్చేవాడు. నా దగ్గర రూపాయి లేదు సరాసరి లోపలికి వెళ్లాను. తహసీల్దారు నా అప్లికేషన్ తీసుకుని చించివేసి 'గెటవుట్' అని ప్యూనుచేత బయటకు పంపాడు. తాలూకాఫీసు వరండాలో కూర్చుని ఆరోజున ఎంత ఏడ్చానో! నేను చేసిన తప్పేమిటి? ప్యూన్‌కి ఒక రూపాయి లంచం యివ్వలేకపోవడం నా అనర్హత! గవర్నమెంటు ఉద్యోగం పొందడానికి ఆ ఒక్క అవకాశం చేజారిపోయింది. చస్తే 'కాస్ట్ సర్టిఫికెట్' కోసం ఎవడి చుట్టు తిరగనని ప్రతిజ్ఞచేసి, కళ్లు తుడుచుకున్నాను. ఆరోజుతో నాకు ప్రభుత్వ ఉద్యోగం చేయాలన్న ఆశకు బంధం తెగిపోయింది.

నేను యోగంలోకి వచ్చాక, అరవిందుని 'సావిత్రి' రాస్తున్న సమయంలో తిరుపతి నుండి ఒక ఉత్తరం వచ్చింది. తనకు చూపు సరిగా ఆనదని, బయటకు రాలేనని, నాదర్శనం చేసుకోవాలని వుందని రాశాడు. ఏదో పనిమీద తిరుపతి వెళ్లి కపిలతీర్థం రోడ్డులో వాళ్ల ఇంటికి వెళ్లాను. అయన అరవిందుని భక్తుడు. బాగా చదువుకున్నవాడు. ఇంట్లో అరవింద, మదర్, మాస్టర్ సి.వి.వి. గార్ల ఫొటోలు ఉన్నాయి. నేను ఫలానా అని బయట కనిపించిన ఆయన కూతురుకు చెప్పాను. ఆయన లోపలనుండి వచ్చి, సాష్టాంగ నమస్కారం చేసి 'గురువుగారూ, నాజన్మ ధన్యమైంది, ఈ జన్మలో తమరిని దర్శించగలననుకోలేదు. శ్రీ అరవిందులు, మాస్టర్ సి.వి.వి. గార్ల కరుణ వల్ల మిమ్మల్ని నావద్దకు పంపారు. నన్ను ఆశీర్వదించండి.' అని ఏడ్చాడు. తెనాలిలో నన్ను అవమానించి, ఏడ్పించిన తహసీల్దారు ఆయనే. నేను గుర్తించి నవ్వుకున్నాను.

మళ్లీ చదువులో పడ్డాక,రాజకీయాలు దూరమైనాయి. గవర్నమెంటు ఉద్యోగంపై ఆశ చచ్చిపోయింది. ఎం.ఎ. చదివి లెక్చరర్ కావాలన్న కోరిక ఏర్పడ్డది. ఇంటర్‌లో కెమిస్ట్రీలో తప్పాను కనుక బి.ఎస్సీ సీటు రాదు. తెలుగు లిటరేచర్ చదవొచ్చుగానీ, ప్రబంధాలపైన విరక్తి కలిగింది. ఎందరో కవుల్ని చూస్తున్నాను. వారిలా జీవించడం కష్టం. సాహిత్యం అంతా బ్రాహ్మణుల సొత్తు అనిపించేది. వారు ఇతరుల్ని దగ్గర చేరనివ్వడం లేదు. ఒకసారి తెనాలిలో నవ్యసాహిత్య పరిషత్తు సభ జరిగింది. ఆంధ్రదేశంలో పెద్ద కవులంతా వచ్చారు. హైస్కూలులో జరిగాయి కవితాసభలు. తల్లావఝుల నరసింహశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి ఇలా ఎందరో వచ్చారు. వారిలో నేను అమితంగా ఆరాధించే జాషువా, ఏటుకూరి వెంకటనర్సయ్య, తుమ్మల సీతారామమూర్తి లేరు. అమాయకంగా ఎవరినో అడిగాను. వారంతా బ్రాహ్మణేతరులు

అన్నారు. కవిత్వానికి కులానికి సంబంధం? అందుకే కవికులం పట్ల వున్న అనురక్తి చచ్చింది. చచ్చినా తెలుగుకవిత్వం రాయకూడదని నిర్ణయించుకున్నాను. ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరాను చేరిన వారంలోనే మా తెలుగు హెడ్ తెలికిచర్ల వెంకటరత్నంగారితో దెబ్బలాట. ఆయనే నవ్యసాహిత్య పరిషత్‌ను బుజం మీద మోస్తుండేవాడు. 'ప్రతిభ' అని సాహిత్య పత్రిక సంపాదకుడు మహా పొగరు మనిషి. తన క్లాసుకు రాకుండా ఒక ఏడాది నన్ను సస్పెండ్ చేయించాడు. దాంతో నాకు మరీ కోపం. ఎ.సి. కాలేజీలో విద్యార్థుల పోటీలు పెట్టారు తెలుగులో, ఇంగ్లీషులో పద్యరచన పోటీల్లో నాకు మొదటి బహుమతులు వచ్చాయి. నేను ఇంగ్లీషు లిటరేచర్ విద్యార్థిని కనుక నాకు బహుమతి ఇవ్వకూడదని ఆయనగారి వాదన

ఆ కాంట్రొవర్సీ నన్ను హీరోని చేసింది. పైగా లిటరరీ అసోసియేషన్‌కు నేను సెక్రటరీని. సాంస్కృతిక సంఘానికి సి. విశ్వనాథం సెక్రటరీ (సి.వి యన్.ధన్. ఇప్పుడు డైరెక్టరు, రవి కళాశాల, గుంటూరు) అనిసెట్టి అప్పారావు, మేగజైన్ ఎడిటర్. మేం ముగ్గురం ఒకే గదిలో వుండేవాళ్లం. ఎ.సి కాలేజీలో గొప్ప టీచర్లు ఉండేవారు. బి.ఎ. ఇంగ్లీషుకు అంతా ఫారినర్సే. శావరీ అని ప్రిన్సిపాల్, అమెరికన్. బాక్షా అనే ఐరిష్ ఆయన మొత్తం నలుగురు డిగ్రీ లెక్చరర్లూ విదేశీయులే అర్థం కాకపోయినా వాళ్లు చెప్పే పాఠం హాయిగా వుండేది కాస్తో కూస్తో ఇంగ్లీషు వచ్చిందంటే అది వారి చలవవల్లనే.

స్వతంత్రం వచ్చిన కొత్త. జీవితం కొత్తపుంతలు తొక్కుతున్న రోజులు. రాజకీయాలు గమ్మత్తుగా వుండేవి. కమ్యూనిస్టు ప్రభుత్వం వస్తుంది. 'రష్యా'లాగా మనదేశం సమానత్వం పొందుతుందని, దేశంలో దరిద్రం పోతుందని కలలు కంటుండేవాళ్లం. కానీ భారతకమ్యూనిజం మేధావులను దూరం చేసుకోసాగింది. కేవలం కార్మికుల కోసం, కర్షకుల కోసం, ప్రజాఉద్యమాల కోసం, రైతుకూలీల కోసం కృషిచేసే పార్టీగా మారిపోయింది. చదువుకున్నవారికి, మధ్యతరగతివారికి ఆ పార్టీ ఏమీ చేయదని జనంలో ఓ అభిప్రాయం ఏర్పడ్డది. యువకుల దృష్టి పూర్తిగా చదువులపైకి, ఉద్యోగాలపైకి మళ్లింది. కుర్రాళ్లలో రాజకీయాసక్తి తగ్గింది.

చదువు దోవన చదువు ... లక్ష్యం దూరంగా వుంది. డిగ్రీ చదువుతున్న నన్ను మా మేనమామ వీరరాఘవాచార్యులుగారు కాస్త ప్రేమగా చూడసాగారు. గుంటూరు వచ్చినప్పుడు, తెనాలి వచ్చినప్పుడు నన్ను కలుసుకునేవారు. ఆయన అప్పుడు సత్తెనపల్లిలో ఉద్యోగం. నాకు ఈడైన కూతురుంది. ఆమెను నాకిచ్చి చేయాలని ఆయన మనోగతం. సెలవులకు సత్తెనపల్లి వెళ్లేవాడిని. ఆ ఊళ్లో జవంగుల నాగభూషణంగారని వీర

బ్రహ్మంగారి జీవితచరిత్ర రాస్తున్నాడు ఆయన దానిని తెచ్చి మా మేనమామగారిచేత దిద్దించుకునేవాడు. నేను సెలవులకు వెళ్లినపుడు ఆ పని నా కప్పగించారు. అప్పటికే కథలు, నవలలు రాస్తున్నవాడిని కావటాన నాపేరు ప్రసిద్ధమైంది. ఆయన నన్ను పట్టుకున్నాడు. 'బ్రహ్మంగారి జీవిత చరిత్ర' రచనలో కొన్నిరోజులు సహకరించాను. దాంతో నాకు యోగసిద్ధులపట్ల ఆసక్తి కలిగింది ఆసనాలు, ప్రాణాయామం నేర్చాను. ఇంట్లో, ఎంతగా'దెబ్బలాడుకున్నా మా తల్లిదండ్రు లిద్దరూ అలా ధ్యానంలో కూర్చునేవారు. ఫలితం నాకు తెలియదు. వారిగురువు హనుమయ్యగారు వచ్చినపుడు అనేకమంది శిష్యులు వస్తుండేవారు. అదేదో పంచాక్షరీ మంత్రం అని, తారకం అని చెప్పుకునేవారు 'ఓం నమః శివాయ' అనేదే పంచాక్షరీ మంత్రం అని బ్రహ్మంగారి జీవిత చరిత్ర వల్ల తెలిసింది. ఆ పుస్తకం రాసిన నాగభూషణంగారు యోగి కాదు, తాపసి కాదు. ఉత్త భక్తుడు మాత్రమే. మా నాయనగారి గురువు హనుమయ్యగారు బ్రహ్మంగారి మఠం ట్రస్టీలలో ఒకరు. నాకు రవ్వంత ఆసక్తి కలిగిందిగానీ ఎవరినీ అడగలేదు ఏవో చదివిన పుస్తకాలలో గ్రహించిందే అర్ధరాత్రిపూట శ్మశానంలో కూర్చుని తపస్సుచేస్తే భేతాళుడు ప్రత్యక్షమై సిద్ధులు కటాక్షిస్తాడని. అలా ట్రయ్ చేద్దామనుకున్నాను. శ్మశానంలో రాత్రివేళ దయ్యాలు తిరుగుతుంటాయని అవి చంపేస్తాయని మిత్రులు భయపెట్టారు. చావంటే భయం ఏనాడో పోయింది. మానాన్నగారు భూతవైద్యుడు. ఆయనకు దయ్యాల్ని వదలించడం తెలుసు. ఆయన కొడుకుని కనుక దయ్యాలు నాజోలికి రావని, మానాన్నగారిని తలచుకుంటే అవి భయంతో పారిపోతాయని నావిశ్వాసం. మా ఇంటికి దగ్గరే రుద్రభూమి. రాత్రిపూట శవాలు కాలడం కనిపిస్తుంది. చూచి ఏనాడూ భయపడలేదు. కొన్నిరోజులు చీకటిపడ్డాక అలా శ్మశానంవేపు వెళ్లడం, లోపలకు వెళ్లడం, కాలే చితుల్ని గమనించడం అలవాటు చేసుకున్నాను. ఒక అమావాస్య రోజున అర్ధరాత్రి ముహూర్తం పెట్టుకుని శ్మశానానికి వెళ్లాను. అప్పటికింకా నాలుగు శవాల తాలూకు చితులు మండుతూనే వున్నాయి. ఆ నాలుగు చితుల మధ్యకు వెళ్లి పద్మాసనం వేసుకుని కూర్చుని, కళ్లు మూసుకున్నాను. గంట, రెండు గంటలు గడిచినా భేతాళుడు రాలేదు. అతని అసిస్టెంట్లు రాలేదు. దయ్యాలు కనిపించలేదు. కాటికాపరి ఓ నిద్రలేచినట్టున్నాడు అరుస్తూ వచ్చి, నన్ను తట్టి లేపాడు. సంగతి చెప్పాను.

"ఓరి పిచ్చిపంతులూ! అంత తేలిగ్గా సిద్ధులు వస్తే, రోజూ శ్మశానంలో వుండే నాకు ఎన్ని వచ్చివుండేవి. పో...పో.. ఇంటికి పోయి పడుకో"అన్నాడు. తర్వాత అటుగా వెళ్లినప్పుడల్లా నన్ను చూచి పలకరింపుగా నవ్వేవాడు. "ఏంపంతులుగారూ, భేతాళుడు ఏమైనా అడ్రసిచ్చాడా?" అని.

ఏవో సిద్ధులుంటాయి, వాటిని సాధించవచ్చు అని ఓ నమ్మకం నాకు. ఒకరోజు పొద్దున్నే కాలవకు స్నానానికి వెళ్లాను. శని ఆదివారాలలో అలా కాలవ స్నానానికి వెళ్లే అలవాటు చిన్నతనం నుండి వుంది కోపల్లెలోను పెద్దకాలువ లున్నాయి ఈత వచ్చు ఆరోజున కాలవ ఎగువకు వెళ్లేసరికి, కాలవలో ఒక గడ్డపాయన శవాసనంలో తేలుతున్నాడు. వినయంగా నమస్కరించాను.

"నీ పేరేమిటి?"

చెప్పాను.

"ఆ పేరు మార్చుకో రామకృష్ణ కాంబినేషన్ బాగలేదు. నీకు మంచిది కాదు. నీవు ఏమైనా రాస్తుంటావా?"

అవునన్నాను.

"ఏదైనా చిన్నదిగా పెన్‌నేమ్ పెట్టుకో. పైకొస్తావు."

"మీరు నీళ్లమీద అట్లా ఎలా ఉండగలిగారు?"

" అది శవాసనం. ప్రయత్నిస్తే నీవూ వేయగలవు అది ఒక యోగాసనం అలాగా నీళ్లపైనే కాదు .. నీళ్లలోపలా ఉండవచ్చు. అదీ యోగమే అలవాటు చేసుకో మంచి జరుగుతుంది." అన్నాడు.

ఆరోజు నుండి నీళ్లపైన శవాసనం వేయడం వచ్చింది అలా ప్రవాహంలో తేలివెళ్లేవాడిని రెండు మూడు ఫర్లాంగులు. గమ్మత్తు . మునిగిపోలేదు. శరీరం సగం నీటిలో వుండేది. సగం పైకి తేలేది. శ్వాస బంధించేవాడిని. శ్వాసక్రియ సన్నబడినప్పుడు శరీరం బరువును కోల్పోయి నీటిపైకి తేలుతుంది. అలా గాలిలోకి తేలిపోవచ్చు కదా!

మా అమ్మ కుంభకం చేస్తుంది. ధ్యానంలో వున్న మనిషి గాలిలోకి లేస్తుంది. అలా పైకి వెడుతుంటే చూచేవారికి భయం వేస్తుంది. వారికి తెలీదు. సూక్ష్మశరీరం ఎక్కడికో పోతున్నట్టు అనిపిస్తుందిట.

నీళ్లపైన శవాసనం, పద్మాసనం వేసి, కాలం గడపడం అలవాటైంది శ్వాస బంధించి, శరీరం బరువును పెంచి, నీటిలోపల చాలాసేపు ఉండగలిగేవాడిని. అవి పిల్లచేష్టలు, కుర్రతనపు సరదాలు.

అంతకుముందున్న ఆత్మహత్య ఆలోచనలు తగ్గిపోసాగాయి. ప్రపంచంలో పుట్టింది అనుభవించడానికి. మనిషి పుట్టుకకు ఒక ప్రయోజనం వుంటుంది. అది మనకు తెలియకపోవచ్చు. తెలుసుకోడానికి ప్రయత్నించం. తనని తాను తెలుసుకున్నవాడే మనిషి. తన ఆత్మను అంతర్దృష్టితో దర్శించ గలిగినవాడు మనీషి ఏమో నాలాంటి సామాన్యుడు మనిషిగా బ్రతికితే చాలు.

అప్పట్లో సినిమాలు చాల తక్కువగా వచ్చేవి హిందీ సినిమాలు వస్తుండేవి. సినిమాతారలంటే జనానికి అభిమానం ఏర్పడసాగింది. అంతవరకు సినీమాల్లో చేరడం అంటే చెడిపోయినట్లే. నాటకాలలో వేషాలు వేయడాన్ని సభ్యకుటుంబాలు అంగీకరించేవి కావు. ఆడపిల్లల్ని అసలు అటు చూడనిచ్చేవారు కారు కొత్త నటీనటుల కోసం దర్శకులు, నిర్మాతలు అన్వేషించేవారు. మావూళ్లో ఆంధ్రనాటక కళాపరిషత్ వారు నాటకపోటీలు పెట్టారు. తెనాలి అంటే పౌరాణిక, చారిత్రక నాటకాలకు ప్రసిద్ధి. వృత్తి కళాకారులు ఎక్కువ. ఔత్సాహిక నాటకాలకు ప్రోత్సాహం, ఆదరణ తక్కువ వృత్తి కళాకారులైన నటీనటులు సినిమాలకు పనికిరావడం లేదు పులిపాటి, దొమ్మేటిలాంటి వారు వెనుతిరిగి వచ్చారు. మా ఊళ్లో సినిమా నటీనటులు ఎక్కువ. 'బాలనాగమ్మ' సినిమాలో మాయాఫకీరు వేసిన డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు, కాంచనమాల బాగా ప్రసిద్ధులు. లక్ష్మీరాజ్యం ఆ ఊరి ఆవిడ ముదిగొండ లింగమూర్తి, వంగర, సి ఎస్.ఆర్. ఆంజనేయులు, కస్తూరి శివరావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, జగ్గయ్య తెనాలిలోనే నాకు పరిచయమైన కళాకారులు

నాటక పోటీలకు సినిమా దర్శకులు బి.ఎన్.రెడ్డిగారు, పి.పుల్లయ్యగారు, ఇంకెవరో వచ్చారు. ఆ సందర్భంలోనే సావిత్రి నాట్యప్రదర్శన యిచ్చింది. చాలామందిని వారు ఎన్నిక చేసుకున్నారు. ఒక విద్యార్థిగా కాక, రచయితగా నాకు గుర్తింపు ఉండేది. స్టూడెంట్స్‌లో స్టూడెంట్‌ను. నాలో విద్యార్థి అణగిపోయి, రచయిత బైట నిలిచేవాడు. కాలేజీలో ఆటల్లో, స్పోర్ట్సులో చాలా తక్కువగా పాల్గొనేవాడిని. కాలేజీ టైం అవగానే లెక్చరర్స్ అయిన రచయితలతో, కవులతో తిరుగుతుండేవాడిని. వారు నన్ను ఒక స్టూడెంట్‌గా చూచేవారు కాదు. క్లాసులో కూర్చుని వున్నంతవరకే విద్యార్థిననే భావన ఉండేది. ఆనాడు తెనాలిలో పుట్టి పెరిగినందుకు గర్వంగా వుండేది. "అచట పుట్టిన చిగురు కొమ్మయిన చేవ" అనిపించేది.

డిగ్రీ చదువులకు వచ్చేసరికి పిల్లలు యవ్వనంలో ప్రవేశిస్తుంటారు. కోరికలు కొత్త చివుళ్లు తొడుగుతుంటాయి. చూపులో ప్రేమ, నడకలో ఆకర్షణ, ప్రవర్తనలో మార్పు కనిపిస్తాయి. యువతీయువకులు ఒకరినొకరు ఆకర్షించాలని, అనుభూతులు పంచుకోవాలని, సుందరమైన అనుభవాల్లు కావాలని ఆరాటపడతారు. కో-ఎడ్ కాలేజీల్లో అందుకు అవకాశాలుంటాయి. హిందూ కాలేజీలో ఆడవాసన ఉండదు. లేడిహోవ్‌లో మగగాలి వీచదు. ఆడ, మగల అనురాగానికి ఎ.సి. కాలేజీ వంటి కో-ఎడ్ కాలేజీలు నందనవనాలు. అక్కడ మెయిన్‌గేటు దాటితే లోపల ప్రపంచమే వేరు. అదొక రంగుల హరివిల్లు. రతీమన్మథులు చెట్లచాటున దాగి తొంగిచూస్తున్నట్లుండేది. ఎంత అస్ఖలిత

బ్రహ్మచారి అయినా అక్కడ కాస్త చలించకపోడు. వ్రతభంగం కాకతప్పదు. డిగ్రీ క్లాసుల్లో పిలకలు పెట్టుకుని వచ్చేవారుండేవారు పరమచాదస్తులు. అమ్మాయిల దృష్టి ముందుగా వాళ్ల గుళ్లపైన పడేది. పిలకలు పట్టుకుని ఆడించేవారు. వీరేమో అసలు 'కిరస్తానీ' అమ్మాయిలవైపు చూస్తేనే పాపం తగిలినట్లు ప్రవర్తించేవారు. ఎన్నిరోజులు మడికట్టుకుంటారు. రెండు సంవత్సరాల చదువాయె! వ్రతభంగం కాకతప్పదు. ఎందరో మేనకలు, కొందరే విశ్వామిత్రులు. తపోభంగం చెంది ప్రేమలో పడకతప్పదు అనకూడదుగానీ, ఆ కాలేజీలో ప్రేమవ్యవహారాలు బాగానే సాగేవి. లెక్చరర్లే గరల్స్‌స్టూడెంట్స్‌ను ప్రేమించేవారు, కథలు నడిపేవారు. విద్యార్థుల్లోను అసూయ తక్కువే ఎవరి అదృష్టం వారిది చొరవ, చనువు తీసుకుని ప్రోగ్రెస్ అయినవాడి పంట పండినట్లే కాలేజీ కాంపస్‌లోకి చూస్తే రంగురంగుల చీరలు. పూలు పొదిగిన కురులు, పూలతోట అనిపిస్తుంది. తెగిన దండలోంచి పూలు రాలి చిందరవందరగా పడ్డట్లు, కాంపస్ నిండా రంగులే. ఏ చెట్టు చాటున చూచినా జంటలు, కిలకిలలు, పకపకలు.

మాకు బైబిల్‌క్లాసు తప్పనిసరిగా వుండేది ఒకసారి బైబిల్‌పై పోటీలో నాకు ఫస్టు ప్రయి ౭ వచ్చింది. ఇంగ్లీషు లెక్చరర్లు వాళ్ల చర్చికి ఆహ్వానించారు ఆ చర్చి కేవలం ఫారినర్స్‌కే పరిమితంగా వుండేది అమెరికన్, ఇంగ్లీషు కుటుంబాలు అక్కడ చాలా ఉండేవి వారికోసం కట్టించుకున్న చర్చి. ఆదివారం చర్చిలో ప్రార్థనలకు వెళ్లడం ఒకవిధంగా క్రెడిట్, మరొకవిధంగా డిస్‌క్రెడిట్. అప్పుడపుడు ఫ్రెండ్స్‌తో కలిసి, హాస్టల్లో భోజనం చేసేవాడిని. ఇవన్నీ నేను భ్రష్టమైపోవడానికి, అయినవారికి దొరికిన కారణాలు ఒక ముస్లిం మిత్రుడుండేవాడు ఎస్.ఎస్.లాల్ అని సినీమాల్లో పెద్ద కెమెరామన్ అయినాడు తర్వాత. మాబాచ్‌లో పైలాపచ్చీసుగా, కాస్త విప్లవభావాలతో ఉండేవాడు సి.వి.యన్.ధన్ (పూర్వనామం విశ్వనాధం).

ఆ బృందావనంలో కృష్ణావతారం తాల్చకుండా ఉన్నది నలుగురం. అయినా నాకు చాలామంది అమ్మాయిలతో స్నేహం వుండేది. అసోసియేషన్ సెక్రటరీని కదా! మీటింగులు, డిబేట్లు ఏర్పాటు చేయాలి. సాంస్కృతిక వ్యవహారాలు చూడాలి - రచయితను కావడం వల్లనేమో అమ్మాయిలు నేనంటే యిష్టపడేవారు. ఎలాగో కల్పించుకుని పలకరించి, స్నేహం చేసుకోవాలనుకునేవారు. ప్రేమలో పడేంత ధైర్యం, ఆర్థికస్తోమత నాకు లేవు.

జీవితానికి ఒక ప్లాను వేసుకోవడం, లేదా ప్లాను ప్రకారం జీవితాన్ని నడుపుకోవడం నాకు తెలీదు. అందుకోసం ఎన్నడూ ప్రయత్నించలేదు. ఎప్పుడు ఏది జరిగితే దానిని

ఆమోదించడం అలవాటైంది కొందరికి అన్నీ అమరివస్తాయి అనుకున్నట్లు జరుగుతాయి. కోరినవన్నీ సమకూరుతాయి. వారు అదృష్టవంతులు. నాలాంటి వాడికి ఏదీ అనుకున్నట్లు జరగదు. ఏ కోరికా కలగకుండా జాగ్రత్త పడటమే జరుగుతుంది. ఎంతో కష్టపడితే తప్ప, నష్టాలు భరిస్తేతప్ప రవంతఫలితం, సుఖం కనిపించవు ఇవి దురదృష్టవంతుల లక్షణాలు. నాది ఖచ్చితంగా రెండవజాబితాలోకి వచ్చేజీవితం. అందుకే ఎప్పుడూ అత్యాశలకు పోలేదు. అవకాశాలకోసం అర్రులు చాచలేదు. అదృష్టాన్ని వెతుక్కుంటూ పోలేదు ఉన్నంతలో తృప్తిపడదాం అనిపించినా తృప్తిపడలేం. ఎంచేతంటే ఆ లభించింది కనీసావసరాలకు సరిపోదుకనక. కనుక ఎప్పుడూ కాస్తలోపం, కాస్త అసంతృప్తే మిగిలింది.

తెలుగుసాహిత్యం చదవకుండా ఇంగ్లీషు లిటరేచర్ చదవటం నా అదృష్టం మంచి తెలుగుకథకులంతా ఇంగ్లీషు చదువుకున్నవారే. అమరేంద్ర, బుచ్చిబాబు, కొడవటిగంటి, గుడిపాటి వెంకటచలం, ధనికొండ - వీరు నాకు అభిమాన రచయితలు అప్పట్లో బుచ్చిబాబు, అమరేంద్రలతో వ్యక్తిగతంగానూ పరిచయం వుంది సోమర్‌సెట్‌మాం లాంటి ఇంగ్లీషు నవలాకారుల్ని నాకు రుచిచూపించింది బుచ్చిబాబుగారు అప్పుడు నా ఒరవడి మారింది. కథపై నాసంతకం మారింది. తెలిసిన మనుషుల్లోంచి పాత్రలు పుట్టుకొచ్చాయి చూచిన సంఘటనలు మలుపు తిరిగి కథలైనాయి. కేవలం ఊహించి, కల్పించిన కథలు రాయడం నాకు చేతకాలేదు యదార్థతలోంచి పుట్టినవే కథలు, పాత్రలు.

బి.ఏ లో మాకు అరవిందయోగి 'విక్రమోర్వశీయం' నాటకం పాఠ్యగ్రంథం అప్పుడే అరవిందుని భావంతో పరిచయం ఏర్పడ్డది. లైబ్రరీలో దొరికినన్ని అరవింద గ్రంథాలు చదివాను రవీంద్రుని 'గీతాంజలి', ఇతర గీతాలు, నాటకాలు చదివాను. మొత్తంపైన నా అభిరుచి రొమాంటిక్ రచనలపైగాక, మిస్టిక్ రచనపైకి మళ్లింది అందుకే రవీంద్రుడు. అరవిందుడు, థామస్‌గ్రే, మిల్టన్ లాంటివారిని బాగా అధ్యయనం చేశాను. అరవిందుని జీవితం నన్ను ఆకట్టుకుంది. నాలో కొత్త ఆలోచనల్ని రేపింది. ఆయన ప్రతిపాదించిన 'సూప్రామైండ్'ను సాధించడం అన్నది ఒక కల అయింది.

మనకంటూ జిజ్ఞాస ఉండాలే కానీ, దాన్ని తీర్చిదిద్ది ఓ చక్కనిమార్గంలో పెట్టే అవకాశాలు జీవితంలో చాలా వస్తుంటాయి. అదృష్టం ఒక్కసారే తలుపుతడుతుందని రవీంద్రుడు చెప్పినది నమ్మలేదు. అనేక అవకాశాలు వస్తాయి. జీవితం అనేక మలుపులు తిరగాలి. స్తబ్దంగా సాగకూడదు. ఎత్తుపల్లాలు, ఎగుడుదిగుళ్లు, అనుకోని మలుపులు ఉంటేగాని జాగ్రత్తపడం. ఆ జాగ్రత్తే 'జాగృతి' అవుతుంది... సద్వినియోగపరచుకుంటే.

ఇక్కడ మా తండ్రిగారి తాత్వికత నాకు కాస్త మార్గదర్శకమైంది. ఆయనకు జీవితంపై వుండే నిరాసక్తత నాకు లేదు. వైరాగ్యదృష్టి నాలో అసలు లేదు. ఇదివరలో నైరాశ్యం ఉండేది. చచ్చిపోవాలన్న కోరిక ఉండేది. ఇప్పుడు అవి పోయాయి. ఏదో సాధించాలని కాకపోయినా జీవితానికి ఒక ప్రయోజనం వుంది దాన్ని తెలుసుకుని నెరవేర్చాలి. చాలాకాలంగా పనీపాటు లేకుండా వున్న మానాన్నగారికి సంపాదనపై దృష్టి మళ్లింది. మళ్లీ పనీపాటు మొదలుపెట్టారు. సంసారం కోసం సంపాదించాలన్న బాధ్యత తెలిసింది.

నాపేరు 'శార్వరి'గా అప్పటికే స్థిరపడిపోయింది కాలేజీలో లెక్చరర్లు ఆపేరుతోనే పిలిచేవారు రిజిస్టరులో మాత్రం అసలు పేరు వుండేది ఒకసారి జవహర్‌లాల్ నెహ్రూ ప్రధాని హోదాలో గుంటూరు వచ్చారు జిల్లా కలెక్టరు కార్యాలయం ప్రాంతంలో పెద్ద బహిరంగసభ జరిగింది నేను, మిత్రుడు ఎస్.వి.ఎల్. నరసింహారావు (ఇప్పుడు తను ఎంఎల్ఏ) వెళ్లిచూచాం. ఈ ఎస్‌విఎల్‌కు నాకు గత నలభై సంవత్సరాలుగా మైత్రి కొనసాగుతూ వుంది.

మానాన్నగారి వద్ద ఒక పులిచర్మం, దండకమండలాలు, పెద్ద రుద్రాక్షమాల ఉండేవి. ఆయన ఆమధ్యన మహాకాళీ ఉపాసన ప్రారంభించారు. అది గురువు నుండి వచ్చింది కాదు. స్వంతం. పెద్ద కుంకుమబొట్టు, ఒంటినిండా విభూతి - సాక్షాత్తు రుద్రుడివలె, ఒక్కోసారి భేతాళ మాంత్రికునివలె ఉండేవారు నవరాత్రులలో ఉపవాసాలు చేసి, కాళీపూజలు భయంకరంగా నిర్వహించేవారు. అయన దగ్గరకు వెళ్లడానికే వణుకుపుట్టేది. అంతటి మహాభక్తుడు,ఉపాసకుడు, డబ్బును లెక్కచేసేవాడు కాదు. మరీ దరిద్రం లేకపోయినా కలవారి క్రింద లెక్క కాదు. ఆధ్యాత్మికసంపద లున్నచోట ధనసంపదలు చేరవేమో!

అప్పుడే ఒక గొప్ప వ్యక్తితో పరిచయం అయింది. బి.ఎ. ఆనర్సు పూర్తి చేసి వచ్చాడు. మా బంధువు శ్రీరాం భుజంగరాయశర్మ. ఎంతో మితభాషి. ఆచితూచి మాట్లాడేవాడు. ఆరడుగులపైమాట. మంచి విగ్రహం, స్ఫురద్రూపం. నన్ను కలుసుకోడానికి మా ఇంటికి వచ్చాడు. నేను పద్యాలు బాగా రాస్తానని ఆయనకు చెప్పారుట .. నన్ను అభినందించడానికి వచ్చాడు. నా పద్యాలు విన్నాడు. మెచ్చుకుని, బుజం తట్టి "ఆంగ్లసాహిత్యం బాగా చదువు, అది అపార పారావారం. అందులోని నిధినిక్షేపాలను సొంతం చేసుకో. వచనం మంచిగా రాయి" అన్నాడు.

శ్రీరాం భుజంగరాయశర్మ తర్వాత జీవితంలో ఎన్నో మెట్లు ఎక్కారు. అనేక నృత్యనాటకాలు సృష్టించి, కూచిపూడి నృత్యానికి శ్రీ వెంపటి చినసత్యంగారికి తోడై

అపూర్వసోదరులైనారు. వారితో స్నేహం మొన్నమొన్న వారు కాలం చేసేవరకు కొనసాగుతూనే వుంది. ఒక సాహితీమూర్తి ఎలా జీవించాలో, ఎంత నిరాడంబరంగా ఉండాలో, సాహితీవిలువల్ని, జీవిత విలువల్ని ఎలా కాపాడుకోవాలో వారిని చూచి తెలుసుకోవచ్చు. అచ్చు రవీంద్రనాధ్‌టాగూర్ వలె ఉండేవారు. సభలకు, సన్మానాలకు, సత్కారాలకు కడుదూరం. తృప్తికరమైన జీవితం. కీర్తిప్రతిష్టలకోసం ప్రాకులాడకపోవడం, అయినా గొప్ప సాహితీవేత్తగా, ఆదర్శజీవిగా మన్ననలు పొందాడు. మా మేనమామ కొండూరు వీరరాఘవాచార్యులుగారిని ఈ భుజంగరాయశర్మగారిని పోల్చుకుంటే ఉత్తర దక్షిణ ధృవాలంత దూరం కనిపించేది. "నీవు సొంతంగా రాయి. ఏకొంచెం రాసినా చాలు. ఆ రాసింది గొప్పగా వుండాలి. నీవు రాసిన 'రచన'లో నీవే కనిపించాలి. ఇతరుల ముఖాలు, ఇతరుల ప్రతిభ, ఇతరుల గొంతు నీలో కనిపించకూడదు" అని శ్రీరాం భుజంగరాయశర్మగారు యాభైఏళ్ల క్రితం నాలోని చిన్ని రచయితకు యిచ్చిన సందేశం, అందించిన చైతన్యం. ఇలా ఎందరో ఆనాడే నాతొలి జీవన సంధ్యలో మంచిమాటలు నేర్పారు మంచిబుద్ధులు నేర్పారు నడవడిక నేర్పారు. వారందరికీ కృతజ్ఞతలు ఎందరెందరో అజ్ఞాత మహాత్ములు. అందరికీ సుమనస్సులు!

# అధ్యాపకత్వంలో ఆరేళ్లు

అప్పటికే నా వయస్సు ఇరవైరెండు.

మధ్యలో రెండేళ్లు డుమ్మాకొట్టడంవల్ల ఇరవై యేళ్లకు డిగ్రీ పూర్తి చేయలేక పోయాను. ఇప్పుడున్న పోటాపోటీ అప్పట్లో ఏరంగంలోనూ ఉండేది కాదు. సాదాసీదాగా జీవితాలు గడిచిపోయేవి ఎవరిలోనూ టెన్షన్ కనిపించేది కాదు. దేశానికి స్వతంత్రం వచ్చిన ఫలితం అది నేను ఎప్పుడు పుట్టానో తెలియదు. నా జాతకం నాకు తెలీదు అసలు జాతకాలంటే ఏమిటో తెలియదు. పుట్టిన తేదీ తెలియనివాడికి వారఫలాలు చూచుకునే అవకాశం ఉండదు. జాతకం తెలుసుకోవాలన్న ధ్యాస లేదు. కాస్త కమ్యూనిజం వాసన మిగిలి వుంది. ఇంగువ కట్టిన గుడ్డ. అసలు ఏఒక్కటీ మనల్ని విడిచిపోదేమో! ఒకప్పుడు బలంగా నాటుకున్న భావాలు, అభిప్రాయాలు అంతవేగం చెరిగిపోవనుకుంటాను. ముందు చెప్పిన నాలుగు ఇజాలు .. గాంధీజం, కమ్యూనిజం, సోషలిజం, రాయిజంలలో వేటికీ నేను కట్టుబడలేదు. కానీ అన్నీ నన్ను కట్టివేశాయి. ఆ రోజుల్లో పుట్టినరోజు పండుగలు అలవాటులేదు. ఎవరిళ్లలో పిల్లలకు పుట్టినరోజు వేడుక చేయగా వినలేదు, కనలేదు. హైస్కూల్‌లో చేరే సమయంలో ఉజ్జాయింపుగా, ఎస్సెస్సెల్సీ అయ్యేసరికి పదహారు సంవత్సరాలు పూర్తి కావాలన్న రూల్ ప్రకారం ఏదో తారీఖు వేసేరు. చాలామంది పిల్లల డేట్ ఆఫ్ బర్త్‌లు ఆరోజుల్లో ఒక్కటీ ఖచ్చితంగా ఉండేవి కాదు. ఎ.సి.కాలేజీలో చదువుతున్న రోజు ఓ ఫ్రెండ్ బర్త్‌డే పార్టీకి వెళ్లాను. క్రిస్టియన్స్ ఇలాంటి ఫార్మలిటీస్ పాటిస్తారు, హిందువుల్లో తక్కువ.

డిగ్రీ అయింది. పొంటులోపల చొక్కా వేసుకుని టక్ చేసుకుని బజారున నడవాలంటే సిగ్గువేసింది. భయం వేసింది. చదువుకున్న ఊరు. అందరూ తెలిసిన వాళ్లే. అంతకుముందు చేసినవి చిల్లరమల్లర ఉద్యోగాలు.

అప్పట్లో పత్రికల్లో పనిచేయడం అంటే, సినిమాల్లో అసిస్టెంట్ డైరెక్టరు పదవి

లాంటిది కుర్చీలు వేయడం, కాఫీలు అందించడం, చేతులు కట్టుకుని నిలబడటం., చిన్నపత్రికల్లో ఉద్యోగాలు అలాగే ఉండేవి. ఎవరైనా వచ్చినప్పుడు కుర్చీలో కూర్చుని, ఫాన్ వేసుకుని, ఫోజులివ్వడం, వారు పోగానే ప్రెస్‌లో పత్రికలు కట్టలు కట్టడం, ప్రూఫులు దిద్దటం - ఎవరో అన్నారు "తెనాలిలో కాలేజీ పెడుతున్నారు కదా! నీది ఇంగ్లీషు లిటరేచర్. ప్రయత్నించు." అని. నా కెవరిస్తారు? నలందాప్రెస్‌కు వెళ్లినప్పుడు కోగంటి రాధాకృష్ణ మూర్తిగారు అడిగారు "ఎం.ఎ. చదువుతావా? ఉద్యోగం చేస్తావా?" అని. "ఎం.ఎ చదివే ఆర్థికస్తోమతు లేదండి" అన్నాను 'మన ఊళ్లో కాలేజీ పెడుతున్నారుట '

"కాలేజీలో చేస్తావా? ఓ అప్లికేషన్ పెట్టు" అన్నారు. ఆయన కమిటీ మెంబరని నాకు తెలియదు. క్లబ్బుకు వెడతాడని తెలుసు చాలామంది క్లబ్బుమెంబర్లే కాలేజీ కమిటీలో వున్నారు.

టి.సి., కాండక్టు సర్టిఫికెట్ తెచ్చుకుందామని గుంటూరు వెళ్లాను. ఎ.సి. కాలేజీ ప్రిన్సిపాల్ అడిగారు - మా కాలేజీలో ఉద్యోగం యిస్తాం ... అప్లికేషన్ ఇమ్మని. హిందూకాలేజీలో పోస్టులున్నాయి నామనస్సు తెనాలిలో వుంది. ఉన్న ఊరు, రైలు ప్రయాణం ఉండదు. తెనాలి కాలేజీలో రాకపోతే గుంటూరు ఎ.సి కాలేజీలో, ఉద్యోగం గ్యారంటీ. సాయంత్రం రైలుకు తెనాలి చేరాను. స్టేషన్‌లో రేపల్లె వెళ్లే రైలులో ఒకాయన కూర్చుని నన్ను గమనిస్తున్నాడు. కాషాయబట్టలు వేసుకున్న ఒక స్వామీజీ చెయ్యి ఊపి దగ్గరకు పిలిచారు వెళ్లి నమస్కరించాను.

"నీవు కృష్ణుడివి కదూ" అడిగారు.

జ్ఞాపకాలలోకి వెళ్లిపోయాను. ఈయన తత్వానందస్వామి అయివుంటారన్న నమ్మకం కలిగింది.

"అవును స్వామీజీ" వినయంగా అన్నాను.

"ఏం చదువుకున్నావు ... ఏం చేస్తున్నావు"

చెప్పాను.

"కాలేజీలో పోస్టులున్నాయట ... ప్రయత్నిస్తాను "

ఆయన నవ్వి, వెంటనే ఒక ఉత్తరం రాసి యిచ్చారు. "కాలేజీ ప్రెసిడెంటు గోగినేని రంగనాయకులు. ఈ ఉత్తరం ఆయన కివ్వు " అన్నారు.

మర్నాడు ఉదయం వారిని కలిసి స్వామీజీ ఉత్తరం యిచ్చాను. చదివి "అప్లికేషన్ యివ్వు" అన్నారు.

అంతే, ఏమీ శ్రమ లేకుండా నాకు ఉద్యోగం వచ్చింది. కొత్తగా పెట్టిన కాలేజీ

ఊరి మధ్యలో వున్న గరల్స్ స్కూలును కాలేజీగా మార్చారు. అంతా కుర్ర లెక్చరర్లు టీచింగ్ స్టాఫులో ఆ ఊరి వాడిని నేనొక్కడినే. మిగత లెక్చరర్లు, ట్యూటర్లు బయటి ఊళ్లవారే. ప్రిన్సిపాల్ మళయాళీవాడు . రాగ్‌లాండ్. చాలా క్రమశిక్షణ పాటించే మనిషి. ఆంధ్ర యూనివర్సిటి వైస్‌చాన్సలర్ వి.ఎస్.కృష్ణగారి క్లాస్‌మెట్. ఆయనకు తెలుగురాదు హిస్టరీగ్రూపులో ఒక సెక్షను, కామర్సు గ్రూపులో ఒక సెక్షను ఉండేవి. మొత్తం 200 మంది పైగా విద్యార్థులు. ప్రిన్సిపాలు, గంటి శ్రీరామమూర్తి అని ఆనర్స్ పాసై వచ్చినవాడు .. ఆయన ఇంగ్లీషు చెప్పేవారు. నేను ట్యూటర్‌ని. అయినా నాన్‌డిటైల్డ్, గ్రామరు, కాంపొజిషన్ పీరియడ్స్ నాకు కేటాయించారు. 120 మంది విద్యార్థుల క్లాసులో పాఠం చెప్పడం కష్టంగా వుండేది. క్లాసులో తెలుగు మాట్లాడకూడదు. అది ప్రిన్సిపాల్ ఆర్డరు హిస్టరీ లెక్చరర్స్ .. అంకినీడు ప్రసాద్ - ఇంటర్‌లో, హైస్కూలులో నా క్లాస్‌మెట్. మాధవరెడ్డి (తర్వాత వెంకటేశ్వర యూనివర్సిటీలో హిస్టరీ ప్రొఫెసర్ అయినాడు) శంకరరెడ్డి కామర్స్ లెక్చరర్ ఆయన రాయలసీమలో పార్లమెంటు సభ్యుడుగా పోటీచేసి, ఓడిపోయి, బ్రహ్మయ్య అండ్ కంపెనీలో ఆడిటర్ అయినాడు. హిందీ లెక్చరర్ దోనేపూడి రాజారావు, తెలుగు పండితుడు కొండూరు వీరరాఘవాచార్య. లెక్చరర్ ఏంజిలా చార్లెస్ ఎ సి. కాలేజీలో మాకు లెక్చరర్.

స్టాఫ్‌లో సగంమంది బ్రహ్మచారులే. స్టాఫ్‌రూంలో సరదాగా వుండేది అందరూ ఒక కుటుంబ సభ్యుల్లా వుండేవారు. కాలేజీ ప్రారంభం రోజున స్టాఫ్ రూంలో నన్ను చూచి మా మేనమామ ఆశ్చర్యపోయారు. "ఏమిటీ, నువ్వా?" అన్నారు. వారికి మాకు రాకపోకలు బంద్ అయి చాలాకాలమైంది. చాలారోజులు ఆయన నా మేనమామ అని. నేను ఎవరికీ చెప్పలేదు. నేను తన మేనల్లుడినని తనూ చెప్పలేదు. ఆయన తెలుగు, నేను ఇంగ్లీషు. సంబంధం లేదు. చిన్నవాడిని కావడం వల్ల ప్రిన్స్‌పాల్ చాలా అభిమానంగా వుండేవారు. అడ్మిషన్స్ వ్యవహారాలలో పక్కన కూర్చోపెట్టుకునేవారు. తను బిజీగా వుండి, తన పీరియడ్స్‌కు నన్ను వెళ్లమని పంపేవారు. కొత్తకాలేజీ కావటాన లైబ్రరీ ఏర్పరచే బాధ్యత నాకు అప్పగించారు. కొత్తగాపెట్టిన కాలేజీ, అందునా సైన్సులేదు. నాలుగైదుసార్లు ఎస్సెస్సీ తప్పినవారినీ చేర్చుకునేవారు. విద్యార్థులు సగంమంది వయస్సులో నాకంటె పెద్దగా వుండేవారు. మొదటిసంవత్సరంలో చదువులు మరచిపోయినవారు, ఊళ్లో కాలేజీ కనుక చేరినవాళ్లు కొంతమంది. మొత్తం ఆడపిల్లలు అయిదారుగురుండేవారు. అందులో ఒకమ్మాయి ధ్వన్యనుకరణ సామ్రాట్ నేరెళ్ల వేణుమాధవ్‌గారి సతీమణి అయింది.

1952లో ప్రారంభమైన జీవనయానాన్ని 1998తో పోల్చుకుంటే భయంవేస్తుంది. ఆశ్చర్యం అవుతుంది అప్పుడు నా జీతం నెలకు నూరు రూపాయలు. లెక్చరరు జీతం 150 రూపాయలు. ఎలా బ్రతికేవాళ్లమని ఇప్పటివాళ్లు ప్రశ్నించవచ్చు అప్పుడు ఎల్ డి సి. జీతం 64 రూపాయలు, కరువుభత్యం కలిపి. యుద్ధం వచ్చి, కరువు ఏర్పడకపోతే జీతనాతాలు మరీతక్కువ. ఈనాడు కూలీవాడు రోజుకు నూరురూపాయలు సంపాదిస్తున్నాడు అప్పుడు తహసీల్దారు జీతమే 150 రూపాయలు వుండేది. నూరు రూపాయల జీతంలో పాతిక రూపాయలు సొంతఖర్చులకు పోతే, ఎనభై రూపాయలు ఇంటిక్రంద ఖర్చయ్యేది అఫ్‌కోర్స్, ట్యూషన్లు చెప్పడం వల్ల 150 రూపాయల వరకు వచ్చేది. పత్రికల రెమ్యూనరేషన్స్, రేడియో ప్రోగ్రాముల వల్ల మరికొంత వచ్చేది జీవితం సుఖంగా, సజావుగా సాగినట్లే. అలా జీవితం సాగితే చాలనుకున్నాను. లెక్చరర్లు, టీచర్లు అలా ఎదుగుబొదుగులేని జీవితాలే గడుపుతుంటారు. చివరికి జన్మస్థలిలోనే అంత్యక్రియలు జరుపుకుంటారు. అదొక సెంటిమెంట్. విదేశాలలో చచ్చినవాడినైనా, స్వగ్రామానికి చేర్చి, అక్కడే అంత్యక్రియలు నిర్వహిస్తారు. బయటి ప్రపంచం బొత్తిగా తెలియక, జీవితాంతం బ్రతికే మనుషులే ఎక్కువ. రెండు మూడు సంవత్సరాలు గడిచేసరికి బోరుకొట్టింది. ఎన్నో పత్రికలకు రాస్తున్నాను కనుక పేరుప్రఖ్యాతులకు కొదవలేదు. ఇంకా ప్రపంచం వుంది పత్రికలలో వార్తలు చదువుతాం. ఆ దేశాలు, ఆ మనుషులు, నగరాలు మనకు తెలియవు. అప్పట్లో కవులకు మాత్రమే సన్మానాలు జరిగేవి. శాలువాలు కప్పేవారు. ఎంత గొప్పకథకునికైనా, నవలాకారునికైనా పండిత సన్మానం జరగదు. కవిత్వం రాక కథలు రాస్తున్నట్లు భావించేవారు. వారపత్రికలు వచ్చాయి. 'తెలుగుస్వతంత్ర' సగంపేజీలు కథలకు కేటాయించేది. నేను తెలుగు స్వతంత్ర వారపత్రికకు రెగ్యులర్‌గా రాసేవాడిని. వర్ధమాన కవులంతా రాస్తుండేవారు. ఆరుద్ర, సోమసుందర్, తిలక్, దాశరథి, సి.నారాయణ రెడ్డి - ఇలా ఎందరి కవితలో తెలుగుస్వతంత్రలో తొలి ప్రచురణ అయ్యేవి. వారితో సమంగా నా కవితలు అచ్చుకావడం అదృష్టం. నా కవితలకన్నా కథలకు మంచిరెస్పాన్స్ వుండేది. నా కలం కవితల్ని సృష్టించడం తగ్గించి, కథల పంటలు పండించసాగింది. కాలమే మనల్ని తీర్చిదిద్దుతుంది. కాలానికి అనుగుణంగా మారడమే మనపని.

మొదటిసంవత్సరంలో ఉద్యోగం కాస్త బెరుకు బెరుకుగా వున్నా రెండవ సంవత్సరానికి పాతకాపులమైనాం. సీనియారిటీతోపాటు ధైర్యం వచ్చింది. రెండవ సంవత్సరంలో హితశ్రీగారు కామర్సు లెక్చరరుగా చేరారు. హితశ్రీ మంచి కథకుడు.

ఆదర్శంగా వుండేవారు ప్రపంచ కథల పోటీలలో పాలగుమ్మి పద్మరాజు, పురాణం సుబ్రహ్మణ్యశర్మలతో పాటు హితశ్రీగారి కథ ఎన్నికైంది. అది ఒక గర్వకారణం, కాగా ఆయన మా కాలేజీ లెక్చరర్ కావడం మరొకవిధంగా ఆనందం. చాలా మంచివ్యక్తి ఏమాత్రం ఆడంబరం, భేషజం లేనివారు ప్రిన్సిపాల్ పదవిలోకి వచ్చినా అంతే నిరాడంబరంగా జీవించేవారు. నలభై సంవత్సరాలుగా మా మధ్య ఆత్మీయత, స్నేహం చెక్కుచెదరలేదు తెనాలి వెళ్లితే వారిని చూడకుండా రాను. ఇటీవల హితశ్రీ, వారి సతీమణిలోను నా యోగంపట్ల ఆసక్తి కలిగింది' సంతోషం. క్రమంగా తెనాలి కొత్త కలాలకు ప్రముఖకేంద్రమైంది కవిరావు, అలపర్తి సుబ్బారావు, వేజెండ్ల సాంబశివరావులు బాలసాహిత్యం, బాలగేయాలు రాసేవారు ఆలూరు భుజంగరావు హిందీ సాహిత్యం తర్జుమా చేసేవాడు, ప్రేమ్‌చంద్ భక్తుడు భరద్వాజ, శారద, నేను, జి.వి. కృష్ణారావు, రామకృష్ణ, తాళ్లూరి నాగేశ్వరరావు, కొలకలూరి ఈనాక్ కథకులం. నన్ను చూచి శారద అని, అతనిని శార్వరి అని భ్రమించేవారు జనం. శారద మంచి - చెడు, అపస్వరాలు నవలలను ఆంధ్రపత్రిక ప్రచురించింది. తెలుగునవల పట్ల పారకుల అభిరుచిని పెంపొందించింది. జి వి కృష్ణారావు గారి 'కీలుబొమ్మలు' తెలుగుస్వతంత్రలో సీరియల్‌గా వచ్చిన గొప్పనవల. 50-60 మధ్యకాలంలో ఆంధ్రదేశంలో తెలుగుకథ, నవల కొత్తజీవం పొంది, కొత్తచివుళ్లు వేశాయి. ఆ ఉత్సాహంతోనే 'కళావాణి' అనే ప్రచురణసంస్థ ప్రారంభించి, రావూరి భరద్వాజ 'రాగిణి', 'కొత్త చిగుళ్లు', నా 'స్వర్గసీమ' కథాసంపుటాలు ప్రచురించాను. నా 'రోదసి' కావ్యం కూడా అప్పుడే వెలువడింది. విజయవాడలోని 'ఆదర్శ గ్రంథమండలి' వారు 'ఎర్రభూతం' అనే నా కథలసంపుటి ప్రచురించారు. మూడు పుస్తకాలతో కథకుడిగా, అభ్యుదయ కవిగా, సాహిత్యరంగంలో కాస్త నిలబడిగలిగాను. పత్రికలలో ఎన్ని రాసినా, ఎంతకాలం రాసినా, ఒక్కపుస్తకమైనా అచ్చుపడకపోతే రచయితగా, కవిగా నిలదొక్కుకోవడం కష్టం. కరుణశ్రీగారి ఉదయశ్రీ, విజయశ్రీలు అప్పుడే వెలువడ్డాయి. పాపయ్యశాస్త్రిగారు గొప్ప కళాహృదయంతో వాటిని అచ్చువేసేవారు. ఎంతో శ్రద్ధగా, అందంగా, ప్రేమగా పుస్తకాల్ని తీర్చిదిద్దడం వారినుండే నేర్చుకోవాలి. చాలామంది పుస్తకాలు అచ్చువేస్తారుగానీ అందం చూడరు. ఆ పద్ధతిలో జి.వి. కృష్ణారావుగారి ప్లేటో, అరిస్టాటిల్, కాంట్ పుస్తకాలు గొప్ప అందమైన పుస్తకాలు. ఇలాంటి మంచి, గొప్ప అందమైన పుస్తకాలు నలందాప్రెస్‌లో అచ్చయ్యేవి. నాకు నలందాప్రెస్‌కు అనుబంధం ఎక్కువ. అక్కడ భరద్వాజ పనిచేసేవాడు. ప్రెస్ పని అయిపోయిన తర్వాత అదే సాహిత్యకేంద్రం. కవులు, రచయితలు అక్కడే చేరేవారం

ఏదైనా గవర్నమెంటు ఉద్యోగం వస్తే బాగుండుననుకున్నాను కానీ నాపైన సి ఐ.డి. నిఘా వున్నదని తెలిసింది. కమ్యూనిస్టు అభిమానికి ప్రభుత్వోద్యోగం లభించడం అప్పట్లో అసంభవం సి.ఐ.డి రికార్డులోకి నా పేరెలా వచ్చింది?! ఒక సి ఐ డి. ఆఫీసరు 'బలరాం' ఆ విషయం చెప్పాడు. ఏడాదిగా నన్ను గమనిస్తున్నాడతను. 'బ్లిట్జ్' పత్రికలో జవహర్‌లాల్‌ని విమర్శిస్తూ ఒక వ్యాసం రాశానుట అందుకే కేంద్రప్రభుత్వంలోని హోం డిపార్టుమెంట్ నాపైన కన్నువేసింది వారి కన్నుకప్పడం మనవల్ల కాదు. నా చర్యలు గమనిస్తూ వచ్చిన ఆఫీసర్ 'బలరాం' రెండేళ్ల తర్వాత ఆ ఫైల్ మూసివేశారు అతని మేనల్లుడు నా స్టూడెంట్. నాకు ఇష్టమైన వ్యక్తి ప్రభుత్వోద్యోగం పైన ఆశలు పోయాయి. కమ్యూనిజం పట్ల ఎప్పుడో ఏర్పడిన కాస్తంత అభిమానం అలా కాటువేసింది. అభ్యుదయ కవిని అయివుండి పెక్కు కథలు రాస్తున్నానని 'అభ్యుదయ రచయితల సంఘం' గుడివాడ సమావేశంలో నన్ను అభిశంసిస్తూ తీర్మానించిందిట. అసలు ఎప్పుడూ నేను అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడినే కాదు. వారెలా అనుకున్నారో మరి!

కాలేజీలో తప్పక ఒకరినొకరు పలకరించుకోవలసి మా మేనమామగారు నా పట్ల ప్రసన్నులైనారు ఆయన ఎంత గర్హించినా, నా రచనలు పత్రికల్లో అచ్చవుతున్నాయి 'శార్వరి'గా గుర్తింపు వస్తోంది నాపైన ప్రేమను నిరూపించుకునేందుకు ఒకటి రెండు సంబంధాలు తెచ్చారు. ఆయన చెప్పిన సంబంధాలు మా నాన్నగారు బేషరతుగా తిరస్కరించారు. వాళ్ల పట్టుదల వారిది. మేనమామే గానీ, ఆయనది కపట స్వభావం. ప్రతీపనిలోనూ స్వార్థం, స్వలాభం వుండేవి. ఇతరులకు అవి స్ఫుటంగా కనిపించేవి. పండితుడు, పెద్దవాడు, మేనమామ అని సరిపెట్టుకునేవాడిని. ఆయన మాత్రం చెడు ప్రచారం చేసేవాడు. కుర్రాడు మంచివాడేగానీ తల్లిదండ్రులతో వేగడం కష్టం అనేవాడు. తన కూతుర్ని చేసుకో నిరాకరించినందుకు ఆయనగారికి కసి, మెత్తని పగ, కనిపించని శత్రుత్వం.

నాకు పెళ్లిమీద మనస్సులేదు. అసలు సీరియస్‌గా ఆలోచించిందీ లేదు. పెళ్లి జీవితానికి అవసరమా? కాదేమో! పెళ్లి కాకుండా సన్యాసుల్లో కలిసిపోయిన వారున్నారు. వారిని సంఘం గౌరవిస్తోంది. పెళ్లయి సంసారాలు ఈదలేక, సన్యాసుల్లో కలిసిపోతున్న వారున్నారు. వారు గౌరవింపబడుతున్నారు. సంసారులకన్న సన్యాసులకే గౌరవం ఎక్కువ సన్యసించడానికి కారణం సంసారం! పెళ్లి కాకుండా బ్రహ్మచారులుగా మిగిలిపోయిన వారున్నారు. పిల్లల్ని తెగకని, మురిసిపోతున్నవారున్నారు. నరకం అనుభవిస్తున్న వారున్నారు. అయితే పెళ్లి విలువ ఏమిటి?

పెళ్లి మీద ఇష్టత లేదు, అయిష్టత లేదు నాకు తెలిసిన కుటుంబాలలో భార్యభర్తలు నిత్యం కలహిస్తూ కొట్టుకోవడం ఎక్కువ. పుస్తకాలలో చూచే ఆదర్శ దాంపత్య ఏ వొక్క కుటుంబంలోనూ కనిపించేది కాదు. ప్రేమగా వుండవలసిన దంపతులు కొట్టుకోవడం ఎందుకు? అప్పటి సమాజమే అంత! అప్పటి దాంపత్య జీవితాలు అంతే! దానిని మార్చడం సాధ్యం కాదు. భార్యాభర్తలు చదువుకున్నవారైతే బావుంటుంది అన్ని అపార్థాలుండవు. చదువుకున్న అమ్మాయి దొరికితే చేసుకుందామను కున్నాను కాని అంతగా చదువుకున్న అమ్మాయిలు ఏరీ! అప్పుడు ఇంగ్లీషు చదువులు మధ్యతరగతి ఆడపిల్లల వరకు చేరలేదు కాస్త, ప్రతి ఇంటా ఆడపిల్లల్ని సైతం చదివించాలన్న తపన కనిపిస్తోంది వివేకానందుని బోధలు బాగా తలకెక్కాయి రాజారామమోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగం సంస్కరణల్ని జనం అర్థం చేసుకోగలిగారు

కాలేజీలో పనిచేస్తున్నా నాకు ఆడపిల్లలంటే తగనిభయం. అందాన్ని ఆరాధించడం వరకే తెలుసు. దానిని అనుభవించాలన్న తపన, తహతహ నాకు లేవు నా రచయిత మిత్రులు కొంతమంది వ్యభిచారం చేసేవాళ్లు. అదొక వ్యసనం వారికి. సెక్సు జీవితానికి ప్రధాన అవసరం అనేవారు. వ్యభిచారం అప్పుడు బహిరంగంగా జరిగేది లాడ్జీలు వుండేవి. ఇష్టమైనవాళ్లు నిర్భయంగా వెళ్లేవారు. నాకు అలాంటి జీవితం చాలా అసహ్యం అనిపించేది. అలాంటి రచయితలైన మిత్రులతో కలసిమెలసి తిరిగినా, లోపల అసహ్యించుకునేవాడిని వారించినా వారు వినరు. నా కంటే వయస్సులో పెద్దవారు. రచనలో సీనియర్స్ రచయితలే కాదు, చాలామంది కళాకారులు అవినీతిమంతులని గ్రహించాను. వారిలో ప్రతిభ వుంది. దానిని గౌరవించక తప్పదు. వ్యక్తిగతమైన బలహీనత లను అభిమానులు పట్టించుకోరాదు.

పెళ్లిపట్ల, భార్యపట్ల, సంసారంపట్ల నాకు కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలు ఏర్పడ్డాయి. అవి పెద్ద ఆదర్శాలని చెప్పలేను కాని, అనుకూలవతి అయిన అమ్మాయి ఇల్లాలు కావాలి. తిట్టుకోవటాలు, కొట్టుకోవడాలు వుండకూడదు. ఆ మేరకు సహకరిస్తే చాలును. నిజమే! ముందుగా ఏ అమ్మాయినైనా ఒక క్షణం పాటు చూచి ఈ సౌశీల్యతను తెలుసుకోగలమా? చదువు చాలదు, సంస్కారం చాలదు. ఈ పరీక్షకు మరేదో ప్రజ్ఞ అవసరం. ఒక్కసారి కళ్లలోకి చూచి ఆంతర్యాన్ని గ్రహించగలగాలి. అలాంటి కథలు రాయగలం! అనుభవంలో పప్పులో కాలువేస్తాం. అక్కడే విధి, అదృష్టం పైకొస్తాయి! అదృష్టం వుంటే అనుకూలవతి లభిస్తుంది. అంతే! పెళ్లికి ముందు ప్రతిఒక్కరూ

అనుకుంటారు, అనుమానిస్తారు. . వచ్చే అమ్మాయి తనని అర్థం చేసుకుంటుందా అని. అలాగే అమ్మాయిలు ఆలోచిస్తారు! అదొక విచిత్ర వలయం! గిరగిర తిరిగే ఆ వలయంలో రెండు కొనలు కలవాలి!

మార్చి నెలలో ఒకరోజు ఉదయం లాస్ట్ పీరియడ్ అవగానే, స్టాఫ్ రూంకు వెళ్ళగానే, మా మేనమామగారు దగ్గరగా వచ్చి "నీకో సంబంధం వచ్చిందోయ్" అన్నారు. స్టాఫ్ రూంకి వెళ్ళగానే సిగరెట్ వెలిగించటం నా అలవాటు. పెద్దాయన కదా! ఆయన ముందు మాత్రం సిగరెట్ కాల్చను ఈయన భోజనానికి వెళ్ళకుండా అక్కడే వున్న కారణం ఇదా అనుకున్నాను. అంతలో ఒక పెద్దాయన లోపలికి వచ్చాడు.

"వీరే నీకు కాబోయే మామగారు" అని పరిచయం చేశాడు. 'కాబోయే' ఏమిటి? నా మొహంలా వుంది ఈయన ఉపోద్ఘాతం అనుకున్నాను. పెళ్ళిచూపులు, మాటలు, నిర్ణయాలు ఏవీ లేకుండానే 'కాబోయే మామగారు, కాబోయే పెళ్లాం' అంటే ఎవరైనా తన్నగలరు.

వారిది నిడదవోలు కాకరపర్తి సర్వేశ్వరరావు పేరు. డ్రాయింగ్ టీచరుగానో, డ్రిల్ మాస్టారుగానో చేసి రిటైర్ అయ్యారు. ఆయన ఏమీ అడగలేదు. "సాయంత్రం ఇంటికి వస్తాం, మీ నాన్నగారికి, అమ్మగారికి చెప్పు" అని వెళ్లిపోయారు. అప్పటికి నాకు బెజవాడ మాత్రమే తెలుసు. ఆతర్వాత ఊళ్లసంగతి తెలీదు. తెనాలి, గుంటూరు, బెజవాడ ఈ మూడు నాకు తెలిసిన పట్టణాలు. సత్తెనపల్లి, నరసరావుపేట, వినుకొండ అప్పుడప్పుడు వెళ్లేవాడిని.

మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్లినపుడు చెప్పాను మా నాన్నగారన్నారు "గోదావరిజిల్లా వారికీ, గుంటూరుజిల్లా వారికీ సంబంధాలు లేవు" అని.

నిజమే. అసలు పక్కనే వున్న కృష్ణాజిల్లాతోనే సంబంధాలు తక్కువ. ఆ రోజుల్లో ప్రయాణసౌకర్యాల లేమి వల్ల దగ్గర ఊళ్ల సంబంధాలే చేసేవారు. ఒక జిల్లా దాటి మరొక జిల్లాకు వెళ్లడమంటే విదేశాలకు వెళ్లినట్లే. ఆచారాలు, వ్యవహారాలు ఏవీ పొసగవని భయం. కంచందగ్గర, మంచందగ్గర సఖ్యతకు దగ్గిర వాళ్లైతేనే సుఖం అని నమ్మకం.

మా అమ్మగారు చెప్పారు "వాళ్లు వస్తామన్నారుగా, మామయ్యను రమ్మను" అని. చెప్పాను, కానీ ఆయన రాలేదు. రాడని మాకు తెలుసు. ఆయన బుద్ధి అలాంటిది. ఆ సాయంత్రం సర్వేశ్వరరావుగారు, ఆ ఊళ్లో ఒక పెద్దమనిషి రాచకుళ్ల చెంచయ్యగారిని వెంటబెట్టుకుని వచ్చారు. చెంచయ్యగారు కాంగ్రెస్ నాయకుడు. మహాత్మాగాంధీతో తిరిగిన వాడు. ఆయనంటే ఊళ్లో గౌరవం వుంది. మా నాయనగారు కాంగ్రెసు

నాయకుడే. వారిద్దరికీ రాజకీయ మైత్రి వుంది వారిని సగౌరవంగా ఆహ్వానించారు. మర్యాద చేశారు.

ఆ పెద్దాయన ముందుగానే మా ఇంటి విషయాలన్నీ తెలుసుకుని మరీ వచ్చారు. కోలవెన్ను పరబ్రహ్మంగారు, తోడు వచ్చిన చెంచయ్యగారు నా గురించి చెప్పిన మాటలు నచ్చాయి. చిలువూరులో వారి రెండవ అమ్మాయిని యిచ్చారు. అక్కడివారే నా గురించి మొదట చెప్పారుట. ఆయన మా ఆస్తిపాస్తుల్ని గురించి అడగలేదు. ఏమీ లేవని ముందే తెలుసుకుని వుంటారు. వంశాన్ని గురించి ఆరా తీయలేదు. ఆయనకు కుర్రవాడు నచ్చాలి. గ్రాడ్యుయేట్ అయివుండాలి ఉద్యోగం చేస్తున్నవాడై వుండాలి. సంపాదన ఎంత అన్న ప్రశ్నలేదు. మనిషిని చూచి తానే అంచనా వేసుకోగలడు.

సింపుల్‌గా అమ్మాయిని చూడ్డానికి రండని ఆహ్వానించాడు. మా అమ్మ, నాన్న ససేమి పిల్లను చూడడానికి వెళ్లమని భీష్మించారు కారణం చెప్పరు. నేను వత్తిడి చేయలేదు. మా పెద్దమ్మగారు నాగేంద్రమ్మ వచ్చి దులిపేశారు. 'పెద్ద శ్రీరామచంద్రుడు, పితృవాక్య పరిపాలన' అని ఎద్దేవా చేసి, "నిక్షేపంలాంటి సంబంధం, ఇంటికి వచ్చి, పిల్లను యిస్తామంటే వెళ్లకపోవడం అమర్యాద. పిల్ల నచ్చకపోతే వేరే విషయం." అన్నది. ఆమె మాటలు నిజమే అనిపించాయి.

'నీవు వెళ్లి చూసిరా అమ్మా అమ్మ నాన్న వెళ్లమంటే వెళ్లమని భీష్మించుకున్నారు' అన్నాను.

'ఏం పోయేకాలం! ఇలా అయితే నీకీ జన్మలో పెళ్లి కాదు. వీళ్లను చూచి నీకెవరూ పిల్లనిస్తామని రారు. వీళ్ల కడుపున పుట్టినందుకు నీకిదొక శాపం, దౌర్భాగ్యులు' అని తిట్టిపోసింది.

"నీవు వెళ్లు!"

"నేనా! తగుదునమ్మా అని పెళ్లికూతురిని చూడ్డానికి వెధవముండను నేను వెడితే మొహాన ఉమ్మివేస్తారు."

"అమ్మా! నిన్ను గౌరవించే సంస్కారమే వాళ్లకు లేకపోతే... ఆ సంబంధం మనకు వద్దు. అమ్మానాన్నలకు పట్టదు. అమ్మకన్న మిన్నగా ప్రేమించే పెద్దమ్మ నీవు."

"చూడవలసింది నీవు. నచ్చవలసింది నీకు"

"అమ్మా! ఒక్కమాట చెబుతాను విను, నువ్వు వెళ్లిరా. ఆ అమ్మాయి నీకు నచ్చిందే అనుకో... తాంబూలాలు పుచ్చుకోవద్దు. కానీ అబ్బాయికి నచ్చినట్లే, ముహూర్తాలు పెట్టుకోడానికి రండి అని చెప్పిరా? చాలు" అన్నాను.

మా పెద్దమ్మ ఒక్కరే వెళ్లారు పెళ్లికూతురి చూపులకు. ఆమె మంచి వ్యవహారవేత్త. లోకజ్ఞానం బాగావున్న వ్యక్తి ఎవరితో ఎలా మాట్లాడాలో తెలుసు. ఆమె వెతుక్కుంటూ సమిశ్రగూడెం వెళ్లారుట మాస్టారింటికి సన్నగా, బక్కపలచగా, రివటలా, ఎర్రగా వున్న ఓ పిల్ల . పరికిణీ, వోణీ వేసుకుని ఓ తెలుగు ఇంటిఆడపిల్లగా, పల్లెసంస్కృతికి ప్రతిబింబంగా వచ్చి, 'రండి' అని తీయగా ఆహ్వానించింది.

"అమ్మగారు లేరా?"

"కాలవకు వెళ్లారు, వస్తారు కూర్చోండి"

తను ఫలానా అని, ఫలానా పనిమీద వచ్చానని ఈమె చెప్పలేదు ఇంట్లో పెద్దవాళ్లు సమయానికి లేరు. ఆ అమ్మాయే అన్ని మర్యాదలు చేసి, ఇంటిగౌరవం నిలబెట్టింది. ఆ పిల్లే పెళ్లికూతురు అయి వుంటుందని ఈమె గ్రహించింది. అక్క చెల్లెళ్ల వివరాలు అవీ అడిగి తెలుసుకుంది. కాస్సేపటికి ఆ పిల్ల తల్లిగారు తడిబట్టలతో, మడినీళ్లతో కాలవ నుండి వచ్చారు మా అమ్మకు అలాంటి సీన్లు నచ్చుతాయి. కోపల్లెలో మా ఇంట అదే దృశ్యం వుండేది. కాలవనుండి స్నానం చేసి మంచినీళ్లు తెచ్చుకోవడం అది సంప్రదాయం, మడి, ఆచారం, కుటుంబగౌరవం, సంస్కారం

తిరిగివచ్చి "అమ్మాయి బాగుంది కృష్ణా. రుక్మిణీదేవి అచ్చం" అని కాంప్లిమెంట్ యిచ్చింది. ఆమెకు భారత, భాగవతాల పరిజ్ఞానం ఎక్కువ.

"అంటే మీ నాన్న, అమ్మ ఇష్టంలేకపోయినా, వద్దన్నా ఆ రుక్మిణిని, కృష్ణుడిలా తెచ్చుకో. నీదాన్ని చేసుకో" అన్నది. "ఆ పిల్లవచ్చిన వేళావిశేషం వల్లనైనా మీ ఇల్లు బాగుపడుతుందేమో చూద్దాం" అన్నది.

జటిలసమస్య అయింది. అమ్మానాన్నలకు ఇష్టమో, అయిష్టమో తెలియడం లేదు. 'నీ ఇష్టం' అని ఆ ప్రస్తావన మానివేశారు నలందాప్రెస్‌లో సాయంత్రం భరద్వాజతో ముచ్చటిస్తుండగా అక్కడేవున్న ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి అయ్యవారు కల్పించుకుని 'వెళ్లు శార్వరీ! ఇదే ఖాయం అవుతుంది. మూడునెలల్లో నీ వివాహం అయి తీరుతుంది' అన్నాడు. జ్వాలాపతి లింగశాస్త్రి అయ్యవారు ప్రెస్‌లో పరిచయం. అంధుడు, మహాపండితుడు, పరమ శివార్చకుడు, సంస్కృతాంధ్రాలలో కవి. ఆయనకు చూపులేదు. దివ్యదృష్టి వుంది. నేను ప్రెస్‌కు వెళ్లబోయేలోగానే పది నిమిషాల్లో శార్వరి వస్తున్నాడు. ఇప్పుడే హోటల్లోకి వెడుతున్నాడు అని దివ్యదృష్టితో చెప్పేవారు. ఆయనకు నేనంటే చాలా ప్రేమ.

"అమ్మాయి ఎలా వుంటుంది అయ్యవారూ" అని అడిగాను.

"రూపవతి! గుణవతి! నీకు అన్నివిధాలా సరితూగగలది"

ఆ రాత్రికి ఇంటికి వెళ్లేసరికి దీవి వీరభద్రరావుగారు వచ్చారు ఈయన సర్వేశ్వరరావుగారి పెద్దల్లుడు రెవెన్యూ ఇన్‌స్పెక్టరు తెల్లవారుఝాము రైలుకు బయలుదేరాం చేబ్రోలు స్టేషన్‌లో దిగి, బస్సుమీద గణపవరం చేరాం డాక్టర్ బాపన్నగారింట పెళ్లిచూపులు. అమ్మాయిని చూచాను నచ్చడం, నచ్చకపోవడం ఆలోచన లేదు. వారికి నేను నచ్చుతానా లేదా అన్నది సమస్య. నా పర్సనాలిటి అలాంటిది.

మా ఇంటి విషయాలు, మా వాళ్ల స్వభావాలు, ప్రవర్తన దాచుకోకుండా చెప్పాను.

కాబోయే మామగారు నవ్వి "నాకు తెలుసు శర్మా" అన్నారు.

పెళ్లిఖర్చులకు డబ్బుకావాలి. ఆయన ఇస్తారో లేదో మరి వేయి రూపాయల కట్నం!! అప్పట్లో అదే గొప్ప వేయిలో సగం పెళ్లికూతురు బంగారానికి, పట్టుచీరలకుపోగా, అయిదువందలు మాకు రానుపోను పెళ్లిఖర్చు మా నాన్నగారు ఒక్క రూపాయి సొంతం ఖర్చు పెట్టారేమో నేను అడగనూ లేదు. అలా ఓ అమ్మాయి నా జీవితంలో అడుగుపెట్టింది ఆ బంగారుతీగ పేరు పాపాయమ్మ ... ఉరఫ్ యామినీదేవి. నిజమే. ఆమె బంగారుతీగ మా ఇంటికి వచ్చాక, బంధువులంతా వచ్చారు. చూచి మెచ్చుకున్నారు 'బంగారుదీపం' అన్నారు. నా అదృష్టం వల్లనే అంతచక్కని పిల్ల భార్యగా దొరికింది అన్నారు. నిజమే, నేను తనకు లభించడం కూడా అదృష్టమేనని ఆ అమ్మాయి అనుకోవాలి కదా! ఆ స్థాయికి నన్ను నేను మలచుకోవాలి గదా! పెళ్లిఅయిన తొలినాళ్లలో నవవధూవరులు 'నీవే నాసర్వస్వం' అనుకుంటారు. తొలినాళ్ల బాసలు జీవితాంతం కొనసాగించగలగాలి ఆమెకు కొద్దిపాటి తెలుగు, హిందీ మాత్రం వచ్చు. ఇంగ్లీషు అసలు రాదు. అయ్యావారు చెప్పినట్లు రూపవతి గుణవతి అయితే చాలు. 'రూపం' అనేది భర్తకి అనురక్తి కలిగించేది, గుణం అనేది సమాజం మెచ్చేది అయివుంటుంది.

మా ఇల్లు చిన్నది అందులోనే ఒక మూల మా బెడ్‌రూం. ఇల్లు ఇరుకైనా ఇల్లాలి బుద్ధి మర్కటబుద్ధి కాకుంటే మగాడు సుఖపడతాడు. యామినీదేవిలో వున్న సుగుణం తనకు ఫలానా కావాలని కోరకపోవడం బహుశా వారి తండ్రిగారి సంస్కారం వారసత్వమేమో! ఆడవాళ్లకు చీరలు, నగలు, అలంకారంపై మోజు ఎక్కువంటారు. ఆమెకు వాటిమీద మోజులేదు. ఉన్నా సమకూర్చి పెట్టే శక్తి నాకూ లేదు.

ఒక ఆదివారంనాడు నేను సెంటర్ వెళ్లివస్తుండగా జట్కాబండిలో పోతున్న ఓ అమ్మాయిని చూచాను. కళ్లు చెదిరిపోయే అందం. తెల్లగా వుంది. చెవులకు లోలకులు

మెరిసిపోతున్నాయి. 'అబ్బ! ఎంత బాగుందీ' అనుకున్నాను. ఎన్నడూ లేనిదీ, మనస్సు విచలితమైంది ఇంటికి వచ్చాను, ఆ పిల్లే కళ్లలో మెదులుతోంది. అమ్మ కోడల్ని తీసుకుని మామయ్య గారింటికి వెళ్లిందన్నారు. అయితే ఆ జట్కాలో . మా ఇంటిదగ్గర జట్కాబండే, సాయిబు జట్కాలో నేను చూచింది అప్సరసను కాదు.

అప్పటికి వున్న కోరిక ఒక్కటే. ఎం.ఎ. పాసై లెక్చరర్‌గా స్థిరపడటం. ఉన్న వూళ్లో ఉద్యోగం స్థిమితంగా వుంటుంది ఎం ఎ. చదివే స్తోమత లేదు. ఆంధ్ర యూనివర్సిటీలో ఆనర్సు వుంది ప్రైవేటుగా చదవనివ్వరు. నాగపూరు యూనివర్సిటీకి ఎం ఎ కు కట్టి ప్రైవేటుగా చదివాను. మూడు సంవత్సరాలు ట్యూటర్‌గా చేస్తే ప్రయివేట్‌గా ఎం.ఎ. రాయవచ్చు. ఇంటర్ విద్యార్థులకు ట్యూషన్లు చెప్పడం, ఎం.ఎ.కు చదవడం ఒక్క అరమార్కులో ఎం ఎ. పోయింది. రెండవసా . బనారస్ యూనివర్సిటీకి డబ్బుకట్టాను.

1955లో నా వివాహం అయింది. 1956 జులైలో అబ్బాయి పుట్టాడు. ఆమె పురిటికి పుట్టింటికి వెళ్లింది. ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. మా నాన్నగారి గురువుగారు వచ్చారు తెనాలి. ఒకరోజు రాత్రి నిద్రపోతుండగా, నా చుట్టు విద్యుత్ వలయాలుగా ప్రవహించసాగింది. లేచి గిరగిరా బొంగరంలా తిరిగాను. నాన్న, అమ్మ, గురువుగారు అంతా బయటనే పడుకుని వున్నారు. నాకు ముచ్చెమటలు పోశాయి. స్పృహ తప్పి పడిపోయాను. అందరూ వచ్చి పట్టుకున్నారు. సేదతీర్చారు గురువుగారు చెప్పారు. "ఏదో ఒక మహాయోగశక్తి కృష్ణుడిలో ప్రవేశించింది. వీడు ఎప్పటికైనా మహాయోగి అవుతాడు" అని ఆశీర్వదించారు అప్పుడు మా మొదటి సంతానం వసంతకుమార్ కలిగాడు. ఆ అనుభవానికి యోగానికి సంబంధం వుందో లేదో నాకు తెలియదు. నాలో మాత్రం మార్పు రాసాగింది. ఎం.ఎ.పై ఆశ చావలేదు. మరలా చదువు సాగించాను. డిగ్రీ వుంటేనే చదువుకు విలువ మనిషికి గౌరవం. ఎం.ఎ. పాసై వుంటే కాలేజి ప్రిన్సిపాల్‌గా రిటైర్ కావచ్చు.

అప్పుడు ఒక విచిత్ర సంఘటన జరిగింది. పెదరావూరులో నా క్లాస్‌మేట్ పరమేశ్వర శాస్త్రి. తను నేను చిన్నతనం నుండి సహాధ్యాయులం. తను టీచర్ అయి, నాటక కంపెనీ పెట్టాడు. కాస్త అభ్యుదయ భావాలు కలవాడు. నాకో కాంపౌండర్ మిత్రుడుండేవాడు. అతని తమ్ముడు, బావమరదులు నా స్టూడెంట్స్. వయస్సులో నా కంటే పెద్దవారు. ఒకరోజున కాంపౌండర్ మిత్రుడు వచ్చి "కాలవలో ఒక విగ్రహం దొరికింది చూద్దాం రండి" అని తీసుకువెళ్లాడు. కాలవలో ఇసుకలో కూరుకుపోయిన విగ్రహం తీసి, పక్కపొలంలో వుంచి, ఒక పందిరివేశాం. ఊళ్లో ప్రచారం చేశాం.

వేంకటేశ్వర స్వామి వెలిశాడని జనం రాసాగారు. సాక్షాత్తు వేంకటేశ్వర స్వామి... ఆ విగ్రహానికి చిన్నగుడి ఏర్పడ్డది తర్వాత అది వైకుంఠపురం అయింది ఇప్పుడు దానికి పెద్ద ఆకర్షణ.

పరమేశ్వర శర్మ ట్రూపు వేస్తున్న నాటకాలు చూచి, నాకు నాటకాలు రాయాలని బుద్ధిపుట్టింది. అమెచూర్ నాటక సమాజాలతో స్నేహం ఏర్పడ్డది 'నిజానిజాలు' అనే నాటకం రాశాను. దుగ్గిరాలవారు దానిని ప్రదర్శించారు ఒక నూరు ప్రదర్శనలిచ్చారు. అప్పుడు కౌతా రామమోహనరావు, మున్సిపల్ ఆపీసులో పనిచేసేవాడు ఒమర్‌ఖయ్యాం నాటకం ప్రాక్టీసుకు తీసుకున్నాడు. చిల్లర భావనారాయణ రాసింది అది. ఆ నాటకానికి పాటలన్నీ నేను రాశాను రేవతి అనే అమ్మాయి, సూరిబాబు కూతురు, సాకీ వేసింది రామ్మోహనరావు ఒమర్‌ఖయ్యాం వేశాడు. నా పాటలకు మంచి గుర్తింపు వచ్చింది మిత్రులంతా సినిమాలకు రాయమని ప్రోత్సహించారు.

కొన్నాళ్లు నాటకాలపిచ్చి పట్టింది. గౌతమబుద్ధ అనే నాటకంలో వేశాను. మా కాలేజీలో ఇంగ్లీషు నాటకాల్లో వేశాను డైరెక్షన్ చేశాను. డియర్ డిపార్టెట్ నాటికలో లేడీ కారెక్టరు వేసినప్పుడు మీసాలు తీసేయవలసి వచ్చింది.. తెలుగునాటకంలో పోర్షను మరచిపోయి అక్షింతలు వేయించుకున్నాను

1958.. నా తెనాలి జీవితానికి చరమాంకం అది. ఊహించని మలుపులు తిరిగాయి ఇంటర్ స్థానంలో ప్రీయూనివర్సిటీ మొదలుపెట్టారు కాలేజీ కమిటి స్టాఫ్ మెంబర్లందరికీ నోటీసులు పంపింది... ఉద్యోగాలు టెర్మినేట్ చేస్తూ. కమిటీవారు అందరికీ హామీ యిచ్చారు. అందరికీ తప్పకుండా ఉద్యోగాలు యిస్తామని. వాస్తవానికి తెలుగు, హిందీ లెక్చరర్లందరినీ పంపించారు. కమిటీ సభ్యుల బంధువులు, స్వకులం వారికే ఎక్కువ పోస్టులు లభించాయి. శ్రీమతి రెండవసారి పురిటికని పుట్టింటికి వెళ్లింది. ఆగస్టు 4న మా రెండవ అబ్బాయి శ్యాంసుందర్ జన్మించాడు.

మధ్యలో రెండు ఉద్యోగాలు వచ్చినట్లేవచ్చి చేజారిపోయాయి. కేంద్ర ప్రభుత్వపు సమాచార శాఖలో ఒక ఉద్యోగం, మద్రాసులో వ్రాతపరీక్ష, ఇంటర్వ్యూ. ట్రాన్స్‌లేటర్ పోస్టు. వేమరాజు భానుమూర్తిగారింట్లో దిగాను. ఆయన దానిలోనే ఆఫీసరు. ఆయనే నన్ను పిలిపించారు. ఆ ఉద్యోగం నాకు గ్యారంటి. మా మేనమామ తన అల్లుడిని పోటీగా పంపి, రికమెండ్ చేశాడు. అది అలా పోయింది. సొంత మేనమామ రాసిన ఆ ఉత్తరం నాకు చూపించారు భానుమూర్తిగారు.

మరొకసారి హైదరాబాదు రేడియోలో న్యూస్‌రీడర్‌పోస్టుకు వచ్చాను. అదీ

రాతపరీక్ష, ఇంటర్వ్యూ అయింది. ప్యానెల్‌లో నా పేరే మొదటగా వుంది. నన్నే రికమెండ్ చేసినట్టు మునిమాణిక్యం నరసింహారావు చెప్పారు. అప్పటికి భరద్వాజ రేడియోలో శ్రీ త్రిపురనేని గోపీచంద్ గారి అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు. గోపీచంద్‌గారు వాళ్ల ఇంటికి తీసుకువెళ్లారు చివరకు ఆ ఉద్యోగం రాలేదు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తురగా కృష్ణమోహన్‌ని తీసుకోమని బెజవాడ గోపాలరెడ్డిగారికి ఫోన్‌చేసి మరీ చెప్పారు. దాంతో ఈ పెద్దలంటే వున్నగౌరవం పోయింది నాకు.

ఉద్యోగం లేకపోవడంతో ఇంట్లో నిరాదరణ ఎక్కువైంది. అప్పటివరకు నాకు జాతకాల మీద నమ్మకం లేదు అయినవారే శత్రువులుగా ప్రవర్తించడం దుర్భరం ఎవరితో మనసులోని బాధ చెప్పుకోవాలన్నా ఏలుకాని పరిస్థితి అప్పటికి ఉడుకు రక్తం చల్లబడ్డది ఆదర్శాలు అడుగంటాయి బ్రతుకుతెరవు ఒక్కటే సమస్య నెలకి ఓ వంద రూపాయలు సంపాదించడం ముఖ్యం. కాలేజీకి వెళ్లే త్రోవలో కాలువ ఒడ్డున కుటుంబరావు గారని ఒక తెలుగు మాస్టర్ వుండేవాడు ఆయన నాటకాలరాయుడు. అలా పరిచయం. తనకు సినిమాలలో నటించాలని కోరిక ఒకరోజున ఆయన చెప్పాడు "మారిస్‌పేటలో సత్రంలో ఒక సాధువు వున్నాడు. ఒకరిద్దరికి మాత్రమే జ్యోతిషం చెబుతాడు. బాగా చెబుతాడు"అని ఆయన గురించి కాలేజీ మిత్రులు చెప్పగా విన్నాను. ఒకరోజు సాయంత్రం కుటుంబరావుగారు, ఆ సాధువు మాట్లాడుకుంటూ వుండగా నేనే వెళ్లడం జరిగింది. ఆయన నా చేయి చూచి జ్యోతిషం చెప్పాడు. "ఉద్యోగం పోయినట్లే. ఈ సంవత్సరం తిరిగేలోగా మంచిఉద్యోగం వస్తుంది. లైను మారుతుంది. కాలేజీ ఉద్యోగం కాదు రాహు మహర్దశ నడుస్తోంది. ఏలిననాటిశని కష్టాలు తప్పవు"

ఆయనపేరు రామారావు మిలటరీలో పనిచేసి వచ్చాడు. కన్నడంవాడు. తెలుగు సరిగారాదు. గడ్డం తెగ పెరగడం వల్ల సాధువు అంటారు. ఆయనకు, నాకు స్నేహం కుదిరింది. స్టేషన్‌రోడ్డులో కూర్చుని చేతులు చూచి జ్యోతిషం చెప్పేవాడు. ఆయన వద్దనే హస్తసాముద్రికం నేర్చుకున్నాను. నా ఖర్చులు చాలావరకు తనే భరించేవాడు. కొత్త ఉద్యోగం మాట ఎలా వున్నా పామిస్ట్రీ అలవడింది.

ఉద్యోగం లేదు. సంపాదన లేదు. సంపాదించినంత కాలం ప్రేమ ఒలకబోసినవారే చీత్కరిస్తున్నారు. శ్రీమతి పిల్లల్ని తీసుకుని వచ్చింది. నా శని ఆమెకు పట్టినట్లుంది. ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నది. ఫిట్స్ రాసాగాయి. మా చెల్లెలు ఒకామెకు ఆ రోగం వుంది. అది అంటుజాడ్యం కాదు. మానసికంగా క్రుంగిపోతే వస్తుంది నా ఆర్థికస్థితి ఆమెను క్రుంగదీసి వుంటుంది. దానికి తోడు అమ్మ ప్రవర్తన. అనాగరికంగా ప్రవర్తించేది.

నేను ఇంట్లో వున్నప్పుడు ముభావంగా వుండేవారు. నేను బయటకు పోగానే సాధింపులు మొదలుపెట్టేవారు సాధించడంలో మా అమ్మ మహానేర్పరి. 'అమ్మ' కనుక అనకూడదుగాని, ఆమె మాటల్లో విషం, చూపుల్లో విషం కక్కేది ఒకరోజున రాత్రి ఇంటికి వచ్చేసరికి యామినీదేవి దైన్యంగా వుంది మాట పలుకు లేదు.

'ఏమైంది?' అని అడిగాను 'మనకి అన్నం లేదు' అన్నది. విషయం అర్థమైంది. మర్నాడు ఆమెను పిల్లల్ని తీసుకుని నిడదవోలు వెళ్లి దిగబెట్టి వచ్చాను. ఉద్యోగం వచ్చేవరకు పుట్టింట వుండకతప్పదు ఆమెకు అభిమానం జాస్తి. పుట్టింట్లో వుండడం యిష్టం లేదు. ఒక్కడినే తెనాలి వచ్చాను రామారావుగారితో జ్యోతిషం చర్చలు. ఓ రోజు సాయంత్రం కాలవపక్క ఇసుక గుట్టలపై కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుండగా "రేపు నీకు ఉద్యోగం వస్తుంది ఈరోజునే పోస్టు చేశారు" అన్నారు. "ఈరోజు ఆదివారం పోస్టు చేయడం ఏమిటి?" "ఏమో ఈరోజే పోస్టు చేసారు. రేపు అందుతుంది."

మర్నాడు పోస్టులో ఓ ఉత్తరం వచ్చింది. మద్రాసు నుండి విద్వాన్ విశ్వంగారు రాశారు. 'ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్ పోస్టుకు శ్రీ నార్లవారు ఉత్తరం రాయమన్నారు రా' అని. మూడే ముక్కలు రాశారు ఆశ్చర్యం ఆ ఉత్తరం ఆదివారం నాడే పోస్టయింది. వెంటనే వెళ్లి రామారావుగారికి కృతజ్ఞతలు చెప్పి, ప్రయాణానికి రెడీ అయినాను. రెడీ అంటే ఉన్న నాలుగు బట్టలు సంచిలో పెట్టుకోవడం, వెంట తీసుకువెళ్లవలసినవి ఏవీ లేవు ప్రయాణానికే డబ్బులేదు. అయితానగర్‌లో ఈదర లక్ష్మీనారాయణగారని ఒకాయన వున్నారు. వారికి నేనంటే అభిమానం వారిని కలిసి చెప్పాను. చాలా సంతోషించి, ఓపదిరూపాయలు పెట్టెలోంచి తీసి యిచ్చారు. "టికెట్‌కి సరిపోతుంది వుంచు అక్కడ నీకు డబ్బు అవసరమైతే చందమామ ఆఫీసుకు వెళ్లి రామారావుగారని వుంటారు. వారిని కలువు. నీ ఖర్చులకు డబ్బు యిస్తారు నేను ఫోన్ చేసి చెబుతాను." అని సలహా యిచ్చారు.

ఆయన విజయా చక్రపాణిగారికి మిత్రుడు, బంధువు. మద్రాసులో లక్ష్మీనారాయణగారు చెబితే చందమామలో ఉద్యోగం వస్తుంది. పిల్లల కథలు రాయడం నాకు చేతకాదు. రికమెండ్ చెయ్యండని అడిగితే ఒకసారి 'కష్టం' అని తప్పించుకున్నాడు. ఉద్యోగం వచ్చాక ఆదరణ చూపాడు. మా మేనమామ తెనాలిలోనే వున్నారు ఆయనకు చెప్పదలచలేదు. ఇంట్లో కూడా నిడదవోలు వెడుతున్నానని చెప్పి బయలుదేరాను. అప్పుడు తెనాలి నుండి మద్రాసుకు టికెట్టు పదిరూపాయలే. రామారావుగారు, భరద్వాజ, అయిదారుగురు రచయితలు వీడ్కోలు చెప్పడానికి స్టేషన్‌కు వచ్చారు నాకళ్లలో నీళ్లు.

ఏడుపు వచ్చింది బహుశా తెనాలికి నాకు రుణం తీరిపోయిందేమో! గుండె బిగపట్టింది. ఊపిరి ఆగిపోయినట్లయింది. 18 సంవత్సరాల అనుబంధం . చదివింది. ఉద్యోగం చేసింది అక్కడ మళ్లీ అక్కడినుండే ఒంటరిగా ప్రయాణం. వెలుగులోంచి చీకట్లోకి రైలు పయనిస్తోంది. చీకటిజీవితంలోంచి వెలుగుబాటల్లోకి నేను పయనించబోతున్నాను. కొన్ని నిమిషాల్లో తెనాలి జ్ఞాపకాలస్థానే మద్రాసు కలలు.

# జర్నలిజంలో ప్రవేశం

ఒక కళాకారుడి స్వప్నం సినిమాలోకం.
ఒక రచయిత స్వప్నం పత్రికా ప్రపంచం.

సినిమాలు, పత్రికలు వున్న నగరం మద్రాసు

మద్రాసులో కాకుమాను నాగేశ్వరరావు అని మా బంధువులే. సినిమా ఆర్ట్ డైరెక్టరు డైరెక్ట్‌గా వారింటికి వెళ్లాను. ఆయన 'నాగ్' పేరుతో సినిమాలకు పబ్లిసిటీ చేస్తారు. ఆర్టు డైరెక్షన్ చేస్తారు లాయడ్స్ రోడ్డులో వారి మేడ వెతుక్కుంటూ వెళ్లాను పరిచయం చేసుకున్నాను. బందరువాడు. చాలా బిజీ. ఎం.జి రామచంద్రన్ ఇల్లు, వీరి ఇల్లు ఎదురుబొదురుగా వుండేవి. ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు కార్లలో వచ్చి పోతుండేవారు తాను ఆర్ట్ డైరెక్షనుకు వెళ్లేవాడు. మద్రాసు కొత్త నాకు. ఆయన అంతస్తు నాకు అందనిది ఉద్యోగంలో చేరగానే రూం వెతుక్కోవాలి. అంత సంపన్నుల ఇంట నావంటి పేద వుండలేడు. ఒక్కరోజు వారింట భోజనం పెట్టారు. మెట్ల దగ్గర చోటు చూపించి ఒక చాప యిచ్చారు. పేదవాడంటే ఎంత అలుసు నా డిగ్రీ చదువు. నా ఉద్యోగం కూడా వారి తాహతుకు తగినట్టు లేదు. స్నానం చేసి బయలుదేరాను. ముందు విద్వాన్ విశ్వంగారిని చూడాలి. కాలినడకనే బయలుదేరాను. పైక్రాఫ్టు రోడ్డులో వెడుతుండగా తిరుమల రామచంద్ర కనిపించారు. వారు ప్రభలో పనిచేస్తున్నారని తెలుసు. నమస్కారం చేసి, విశ్వంగారి ఇంటి అడ్రస్ అడిగాను. నేను ఉద్యోగార్థం వచ్చానని తెలిసి, నా వెంట వచ్చి విశ్వంగారి ఇల్లు చూపించి వెళ్లారు.

విశ్వంగారింట్లోకి వెళ్లాను. వారు ఏదో రాసుకుంటున్నారు. "నీవు శార్వరి!" అన్నారు. అవునన్నాను. వారి శ్రీమతి కాఫీ తెచ్చి పెట్టింది. "ఉద్యోగంలో చేరడానికి వచ్చారా, సంతోషం" అన్నది. "నార్లగారిని వెళ్లి చూడు" అన్నారు విశ్వంగారు. ఎంతసేపు కూర్చున్నా ఆయన ఎక్కువ మాట్లాడరు. అది ఆయన నైజం.

వారింటికి అసింట అదే సందులో వుంది నార్లగారి ఇల్లు. నార్లగారిని కలవడానికి కాళ్లు వణికేయి. ఆయన జర్నలిజంలో హిమగిరి శిఖరం వంటివారు నేను అర్భకుణ్ణి. తన పత్రికలో పనిచేయడానికి తానై ఆహ్వానం .. మహాప్రసాదం వంటిది

నార్లవారి శ్రీమతి పలకరించారు. నిండుకుండ. గొప్ప ఇల్లాలు. గొప్పవారి భార్యలంతా అలాగే ప్రేమగా, ఆదరంగా వుంటారేమో! "పైన వున్నారు వెళ్లండి" అన్నది పైకి వెళ్లాను టేబుల్ లైటు వేసుకుని సిగరెట్ కాలుస్తూ నాలుగుపుస్తకాలు మంచంమీద పరచుకుని ఒక పుస్తకం చదువుతున్నారు.

"నమస్కారం సార్. నాపేరు శార్వరి."

"ఓ నువ్వా!... కూర్చో ."

అంతలో కాఫీ వచ్చింది. అయిదు నిమిషాల తర్వాత 'సంజీవదేవ్ తెలుసునా?' అని అడిగారు.

'తెలుసునండి. ఈ మధ్యనే తుమ్మపూడి వెళ్లి వారితో ఓ రోజు గడిపాను.'

మరో అయిదు నిమిషాలు గడిచాయి.

"పది గంటలకు ఆఫీసుకురా" అన్నారు.

వెళ్లి విశ్వంగారికి చెప్పి వచ్చేశాను

మౌంట్‌రోడ్డులో విక్టోరియా మెమోరియల్, స్పెన్సర్, ఆర్ట్స్ కాలేజీ దగ్గర ప్రభ ఆఫీసు. మద్రాసు మౌంట్‌రోడ్, మెరీనాబీచ్ గొప్ప ప్రసిద్ధప్రాంతాలు. ఎక్స్‌ప్రెస్‌కు ముందరి బిల్డింగ్‌లో ఆంధ్ర రెవెన్యూ ఆఫీసు లుండేవి ఎక్స్‌ప్రెస్ కాంపౌండ్ లోపల ఆంధ్ర పి.ఎం.జి ఆఫీసు వుండేది ఆంధ్రరాష్ట్రం ఏర్పడినా, ఇంకా కొన్ని ప్రధాన కార్యాలయాలు, మద్రాసు నుండి పనిచేస్తుండేవి. రెవెన్యూ బోర్డు ఆఫీసులో కొండూరు ఓంకారంగారు, మా బంధువు, పెద్ద ఉద్యోగి ఇంటర్వెల్‌లో వారిని కలిశాను. ఒకరోజు వారింటికి తీసుకువెళ్లారు. అలాగే కందుకూరి విశ్వనాథం గారింటికి ఒకసారి వెళ్లాను. ధూళిపూడి ఆంజనేయులుగారిని కలిశాను అప్పట్లో 'వాణి' రేడియో పత్రిక ఎడిటర్‌గా వుండేవారు. మరోసారి రావూరి భరద్వాజ గారిని కలిశాను. చందమామ ఆఫీసుకు వెళ్లి దాసరి సుబ్రహ్మణ్యం, కొడవటిగంటి కుటుంబరావు, ధనికొండ హనుమంతరావు, చందమామ రామారావుగార్లను కలిశాను. అప్పుడే ముద్దా విశ్వనాథం, వడ్డాది పాపయ్యగారలతో పరిచయం.

ఆంధ్రప్రభలో ఉద్యోగం ఉద్వేగభరితంగా వుంది. నాకు అపాయింట్‌మెంట్ వీక్లీలో. ఎడిటర్ నార్లగారే అయినా అన్ని బాధ్యతలు విద్వాన్ విశ్వంగారివే. కె. సభా

వున్నారు. ఎం ఎస్.మూర్తి, డిగార్ యిద్దరు ఆర్టిస్టులు. డెయిలీలో వాసు అనే కార్టూనిస్టు వుండేవారు. నార్లవారి సంపాదకీయానికి పోటీగా వుండేవి ఆయన కార్టూన్లు. అతనికి అసిస్టెంటు ఎడిటర్ హోదా వుండేది నీలంరాజు వెంకటశేషయ్యగారు లీడర్ రైటర్, అంటే సంపాదకీయాలు రాయాలి. నార్లగారు రాయని రోజున వీరు రాసేవారు. మట్టా శాస్త్రి స్క్రిప్టుఆర్ట్స్, న్యూస్ ఎడిటర్, సబ్-ఎడిటర్స్ . నాతోపాటు సబ్స్‌గా చేరారు పుత్తూరి పుల్లయ్య, జాస్తి జగన్నాధం , వేటూరి సుందరరామమూర్తి... వారు ముగ్గురు డెయిలీలో వుండేవారు నేను వీక్లీ జగన్నాధం తెనాలి కాలేజీలో నాతో పనిచేశారు తెలుగు ట్యూటర్‌గా గోల్డ్‌మెడలిస్ట్ నాతోపాటే అతని ఉద్యోగమూ ఊడింది కాలేజీలో. మంచివాడు ఒక్కసారి భగవాన్‌దాస్‌గారిని (బి డి గోయెంక) కలిసి వచ్చాను అది ఇంటర్వ్యూ ఆయన అడిగింది లేదు. 'గో అండ్ జాయిన్' అన్నారంతే 1958 నవంబరులో అలా జర్నలిజంలోకి, కొత్త ప్రపంచంలోకి, వార్తాప్రపంచంలోకి అడుగుపెట్టాను.

'నాగ్' గారింటినుండి మర్నాడే మారాను అక్కడ మెట్ల క్రింద పడుకోవడం అవమానంగా భావించాను వారింట భోజనం చేయబుద్ధి కాలేదు లక్షలు డబ్బు వున్నదని గర్వం. ఆయన పిల్లలు అంతే. పెద్దగర్వం. మా బంధువులని వెళ్తే కె విశ్వనాధం గారింట అంతే అమర్యాద వాళ్లందరికి కార్లు, మేడలు వున్నాయి మా ఆర్టిస్టు మూర్తిగారి రూంకు మారాను. ఆయన అవివాహితుడు అప్పుడప్పుడు బ్రాందీ తాగేవాడు. నాకు ఆ వాసన గిట్టేది కాదు తాగేవారంటే తగని భయం ఇద్దరం కలిసి ఇల్లు చూచాం. `ఎడ్వర్డ్ ఇలియడ్ రోడ్డులో చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు పక్కన ఒక పెద్ద కాంపౌండ్‌లో చిన్న చిన్న ఔట్‌హవుస్ లాంటి ఇల్లు. యాస్‌బెస్టాస్ షెడ్లు. ఒకే గది, ముందు చిన్నవరండా. పాతిక రూపాయలు అద్దె. పది వరకు నాలాంటి చిన్న ఆదాయాల వారు అద్దెకున్నారు. ఆంధ్రప్రభ ప్రూఫ్ రీడరు రాధాకృష్ణ అని ఒకాయన దినమణి ప్రూఫ్‌రీడర్ నీలమణి అని మరొకరు ఆ పక్కపోర్షన్లలో ఉన్నారు .. కాస్త తెలిసినవారు.

ధనికొండతో ఏదోమాట పట్టింపువచ్చి రావూరి భరద్వాజ ఓ కలాల కంపెనీలో చేరాడు. అతని జీతం 60 రూపాయలు ఆంధ్రప్రభలో నా జీతం నూరు రూపాయలు. అతనికి పై సంపాదన బాగానే వుండేది. పత్రికలకు రాస్తుండేవాడు పాకెట్ నవలలు రాసేవాడు. తన పుస్తకాలు పబ్లిషర్స్‌కు అమ్ముకునేవాడు. మొత్తంమీద రచయితగా బ్రతకనేర్చినవాడు. పైకొచ్చినవాడు. స్వయంకృషితో 'రచయిత'గా సంపాదించడం తెలిసినవాడు. లౌక్యం తెలిసినవాడు. పరిచయాల్ని స్నేహాల్ని బాగా ఎక్స్‌ప్లాయిట్ చేయడం చేతనైనవాడు. ప్రతి అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగల నేర్పరి. సాటి వారికి రూపాయి సహాయం చేసి, తను పది రూపాయలు లబ్ధి పొందుతాడు.

ఒకరోజు సాయంత్రం, భరద్వాజ ఒక వ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చాడు నారూంకు. ఇంకా యామినీదేవి, పిల్లలు రాలేదు గనుక అది గదే

"వీరు తెలుసుగదా" అన్నారు.

"తెలుసు. జాషువాగారు."

గొప్పకవి జాషువా.. వారి పద్యాలు ఎన్నో నాకు కంఠతా వచ్చు. మద్రాసు రేడియోలో పనిచేస్తున్నారు అప్పుడు. ఒక చాప తప్ప ఇంట్లో ఏం లేవు.

"ఇదేమిటి భరద్వాజా. చెప్పా పెట్టకుండా వీరిని తీసుకువచ్చావు."

జాషువాగారు గుమ్మం గడపపై కూర్చుని "శార్వరీ! మనం నేల తరగతివాళ్లమే ఎప్పటికీ బాధపడకు మట్టిలో పుట్టి, మట్టిలో పెరిగినవాళ్లం. 'గడప' దాటి అవతలకు పోలేం 'గడప' ఇవతలనే వుండలేం." అన్నారు. గొప్ప సందేశం అది. జీవితంలో నాలాంటి వాళ్లు మరువరానిది.

ధూళిపూడి ఆంజనేయులుగారు 'వాణి' ఎడిటర్. అప్పుడే రష్యాలో పర్యటించి వచ్చారు వారి శ్రీమతి ఆదిలక్ష్మి లెనిన్‌గ్రాడ్ యూనివర్సిటీలో ప్రొఫెసర్. ఆయన రష్యాని గురించి రాసిన ఇంగ్లీషు వ్యాసాలను తెలుగులోకి అనువదించమని కోరారు ఏడు వ్యాసాలు వారంరోజుల్లో తెలుగుచేసి యిచ్చాను. అవి ఆంధ్రపత్రికలో ప్రచురితమైనాయి. అప్పటినుండి డి అంజనేయులు గారితో స్నేహం. అనేక సందర్భాలలో వారు నాకు సహాయం అందించారు. ముఖ్యంగా వారికీ నార్ల వెంకటేశ్వరరావుగారికీ వున్న స్నేహం, నార్లగారికి నాపైన ప్రత్యేకమైన అభిమానం కలగడానికి దోహదం చేసింది. అప్పట్లో జర్నలిజంలో అవకాశం రావడం చాలా కష్టం. ఎడిటర్లకు ఇష్టమైతేనే ఉద్యోగం. అభ్యర్థికున్న సాహితీవిలువలు, రచనా సామర్థ్యమే అర్హతలు.

కష్టపడి పనిచేసి ఉద్యోగం నిలుపుకోవాలి. ఇది తప్ప మరోగతి లేదు. జర్నలిజంలో పైకి రావాలి. రచయితగా పేరు సంపాదించాలి. విశ్వంగారికి నేనంటే అభిమానమే కానీ మితభాషి. వారికి రాజకీయ జీవితం వుంది. జైలుకు కూడా వెళ్లారు. నీలం సంజీవరెడ్డి, తరిమెల్ల నాగిరెడ్డి ఆయన బాల్యమిత్రులు. ఆయనకు ఉద్యోగాలు రావడంలో సంజీవరెడ్డిగారి ప్రమేయం వుండేది. కథలు, నవలలు చదవడం, మంచివి సెలెక్టు చేయడం, సెలెక్టు చేసిన వాటిని ప్రచురణ యోగ్యంగా తప్పులు దిద్దడం నేర్పారు. భాషా దోషాలు పరిహరించాలి. అనవసరమైన భాగాలు తీసేయాలి.

అప్పటికి సినిమా ఎడిటర్‌గా వున్న సుదర్శనాచారి స్థానంలో నన్ను వేయడం వల్ల, చేరినవారంలోనే సినిమా ప్రివ్యూకు పోవలసి వచ్చింది. థియేటర్‌లో సినిమాలు

చూడడం వేరు ప్రివ్యూలో చూడడం వేరు పత్రికలవారికోసం, ఆర్టిస్టులకోసం ప్రివ్యూలు వేసేవారు. ఓ వారంలో పిక్చర్ రిలీజ్ చేస్తారనగా ఈ ప్రివ్యూలు వుండేవి. పిక్చర్ రిలీజ్ నాటికి పత్రికలలో ఆ చిత్రం గురించిన సమీక్షలు రావాలి. ఎన్ని వారాలు ఆడితే అన్ని వారాలు అడ్వర్‌టైజ్‌మెంట్లు యిచ్చేవారు మంచిరివ్యూతో పత్రికల ఆదాయం ముడిపడి వుండేది చిత్రాన్ని విమర్శిస్తే ప్రకటనలివ్వడం నిలిపివేసేవారు. అదొక వలయం. చిన్న పత్రికల ఎడిటర్లకు, సినిమా పత్రికల ఎడిటర్లకు అడ్వర్‌టైజ్‌మెంట్స్ యిచ్చి, వంద రెండువందలు డబ్బులిచ్చి ఆకట్టుకునేవారు. దినపత్రికలు, వారపత్రికలు-ప్రభ, పత్రిక. ఆంధ్ర దేశానికి ఈరెండు దినపత్రికలు, రెండు వారపత్రికలే ప్రధానమైన పత్రికలు. అప్పటికి 'తెలుగుస్వతంత' హైదరాబాదు మారి 'స్వతంత్ర' అయింది గోరాశాస్త్రిగారి సొంతపత్రిక అది

ఎ వి ఎం స్టూడియోలో ఒక తెలుగుపిక్చర్ ప్రివ్యూకి వెళ్లాను అక్కడ ముళ్లపూడి వెంకటరమణ, నండూరి రామమోహనరావు కలిశారు. ఇద్దరు ఆంధ్రపత్రిక ప్రతినిధులు అప్పటినుండి వారిద్దరితో మైత్రి ముళ్లపూడి వెంకటరమణ కొద్దిరోజుల్లో సినిమాలకు కథలు, మాటలు రాసే పనిబడి ఆంధ్రపత్రిక నుండి విరమించుకున్నారు. రామ్మోహన రావుగారు విజయవాడ ఆంధ్రజ్యోతికి వెళ్లిపోయారు. నా ఆంధ్రప్రభ ఉద్యోగం ఆరునెలలు సాగింది. అంతలో ఆంధ్రప్రభను విజయవాడకు తరలించాలని యాజమాన్యం ప్రయత్నించడం, దానిని వర్కర్లయూనియన్ ప్రతిఘటించడంతో సమ్మె వరకు సాగింది. సమ్మె సాకుగా తీసుకుని యాజమాన్యంవారు క్లోజర్ ప్రకటించారు. పాతపనివాళ్లను, పాతుకుపోయినవాళ్లను వదలించుకోడానికి యాజమాన్యానికి అదొకసాకు. సమ్మె చేయడం వర్కర్ల హక్కు, మూసివేస్తామనడం యజమానుల హక్కు. వర్కర్లకు, ఉద్యోగులకు, ఎడిటోరియల్‌స్టాఫ్‌కు చెక్కులందాయి. మూడునెలల నోటీసు బదులు జీతాలు గ్రాట్యుటీ చెక్కులు. నాలాంటి కొత్తవాడికి ఏమీరాదు. వెళ్లి విజయవాడ ఆఫీసులో చేరమని కబురు అందింది. ఇల్లు ఖాళీచేసి, శ్రీమతిని పిల్లల్ని నిడదవోలులో వుంచి విజయవాడ చేరాను. అక్కడ ధర్నాలు, సమ్మెలు... 'విశాలాంధ్ర' వర్కర్లు, ఆంధ్రప్రభ ముందు బైఠాయించేవారు. మరొకపక్క నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంధ్రజ్యోతి తీసుకురావడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రభను వదలిపెట్టారు. నార్లలేని 'ప్రభ'ని జనం ఊహించలేరు. కోర్టులో ఏవో అభ్యంతరాలు. ప్రభ దినపత్రిక ప్రారంభమైంది. 'టాబ్లాయిడ్'లో వేరే ప్రెస్‌లో ప్రింట్‌చేసి విడుదల చేస్తుండేవారు. వి డి. ప్రసాదరావు యాక్టింగ్ ఎడిటర్. వారికి పత్రికలో పనిచేసిన అనుభవం వుంది. మద్రాసు 'ప్రభ' నుండి ఎందరు వచ్చి చేరతారో యాజమాన్యం

ఊహించలేదు వర్కర్లు రారని గట్టి నమ్మకం. సబ్స్ కూడా మద్రాసు వదలి రాకపోవచ్చు విద్వాన్ విశ్వంగారు ఆంధ్రపత్రికలో చేరిపోయారు ... తనవరకు ఆయన జాగ్రత్తపడేవారు. మిగిలినవారి కష్టనష్టాలు పట్టించుకునే స్వభావం లేదు

వీక్లీనుండి వచ్చింది నేను ఒక్కడినే. తర్వాత ఆర్టిస్టు మూర్తి వచ్చాడు మా ఇద్దరితోనే ప్రభ వీక్లీ విజయవాడనుండి ప్రారంభమైంది. మూర్తిగారు బొమ్మలు వేయడం, టైటిల్ బొమ్మ రెడీచేయడం. పత్రికకు కథలు, సీరియల్స్ అవీ ఇవీ, అన్నీ సిద్ధం చేయడం నా వంతు నీలంరాజు వెంకట శేషయ్యగారిని ఎడిటర్‌గా వేశారు "మీకు వీక్లీ అనుభవం వుంది పాతవారు ఎవరు రాలేదు. ప్రభ సంప్రదాయం తెలిసినవారు మీరొక్కరే అక్కడ వీక్లీలోనే కంటిన్యూ చేయండి" అని నాకు సలహాయిచ్చారు.

శేషాద్రిగారని ఎక్స్‌ప్రెస్ ఇన్‌చార్జిగా వున్నారు. ఆయన్ని 'మాస్టర్' అనేవారు. బి.డి గోయెంకాకు మంచి మిత్రుడు నన్ను ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు రమ్మన్నాడు శేషయ్యగారు అడ్డుపుల్ల వేసి ఆపివేశారు. అప్పట్లో ప్రభ వీక్లీ నా ఒక్కచేతిమీదగా నడిచింది రోజూ మేనేజర్ స్వామిగారు వచ్చి సర్క్యులేషన్ పెంచాలి అని హెచ్చరిస్తూ ఉండేవారు. సమ్మె లాకవ్ కారణంగా మద్రాసు నుండి ఒక్క ఫైలు విజయవాడ చేరలేదు. ముప్పాళ రంగనాయకమ్మ గారి నవల ఒకటి ఎడిట్ చేసి పెట్టుకున్నాను వెయ్యాలని. ఏ రచయితల అడ్రసులు జ్ఞాపకం లేవు., రంగనాయకమ్మగారు తన నవల ఏమైందని ఉత్తరం రాశారు వెంటనే 'అమ్మా! మీ నవల వేద్దామనుకున్నాం. ఇంతలో ఈ ఉపద్రవం జరిగింది. మీ వద్ద రఫ్ కాపీ వుండేవుంటుంది. దయచేసి మరోకాపీ తయారుచేసి పంపండి' అని ఉత్తరం రాశాను. ఆమె వెంటనే పంపారు. 'బలిపీఠం' అది. ఆ నవల సీరియల్‌గా వేస్తూ నాకు తెలిసిన రచయిత లందరినుండి రచనలు తెప్పించేవాడిని. విజయవాడలోనే లతగారి 'ఊహాగానం' ప్రారంభించాను. కొమ్మూరి వేణుగోపాలరావు, వీరాజీ, మంజుశ్రీ, కాటూరి... ఇలా ఎందరో ఆనాటి యువరచయితల సహకారంతో ప్రభ వీక్లీ పుంజుకుంది. సర్క్యులేషన్ 70 వేల వరకు పెరిగింది. మద్రాసు నుండి నార్ల, విశ్వంగార్ల ఆధ్వర్యంలో వెలువడినపుడు అంత సర్క్యులేషన్ లేదు. రచయిత్రుల నవలలు పాఠకులు ఆదరించడం అప్పుడే మొదలైంది.

నాకు జీవితంలో సన్మానాలు జరగలేదు కానీ అవమానాలు మాత్రం అతిఘోరంగా జరుగుతూ వచ్చాయి. అది నాజాతకం రవి నీచ...నీచభంగ రాజయోగం. రాజయోగం పడుతుందో లేదోగానీ నీచులవల్ల భంగపడక తప్పడం లేదు. తెలుసు గనక సహించగలిగాను. సత్యనారాయణపురంలో ఒక ఇల్లు చూచాను. అడ్వాన్సు యిచ్చి,

భార్యాబిడ్డల్ని పిలిపించాను తెనాలినుండి కొంచెం సామాను తెచ్చుకున్నాం. ఇంట్లో చేరిన గంటలో ఇంటావిడవచ్చి "మీరు బ్రాహ్మలు కారటగా" అని అడిగింది

"అద్దెకు మాట్లాడినపుడు మీరు అడ్వాన్సు అడిగారు యిచ్చాను. మీరెవరని అడగలేదు, నే చెప్పలేదు."

"చదువుకున్నవారు, ఉద్యోగంచేస్తున్నారు అంటే బ్రాహ్మలే అనుకున్నాను"

"బ్రాహ్మలు కానివారుచదువుకోకూడదా. ఉద్యోగాలు చేయకూడదా?"

"వెంటనే ఇల్లు ఖాళీ చేయండి బాబూ, మీకు ఇవ్వడం లేదు."

పేచీ పెట్టుకోవచ్చు మొండికేసి ఖాళీ చేయకుండా ఏడిపించనూవచ్చు. నిత్యం పోట్లాటలు, దెబ్బలాటలు వుంటాయి నా శ్రీమతికి దెబ్బలాడటం చేతకాదు. తనకు అసలే భయం. అయినా అంత కులద్వేషం వున్నచోట నేనుండదలచలేదు.

సాయంత్రానికి వేరే ఇల్లు దొరికింది ఆ పూటనే మారిపోయాం ఆ ఇంట్లోనే సెంట్రల్ ఎక్సైజ్‌లో పనిచేస్తున్న జి నారాయణ రావుగారితో పరిచయం. ఇప్పటికి వారితో మైత్రి కొనసాగుతోంది. వారిప్పుడు నా యోగమిత్రులు హితవరి.. నా అభ్యుదయాన్ని అభిమానిస్తూ, నా ప్రగతిని కాంక్షిస్తున్న మంచిమనిషి జి నారాయణరావు. ఇటీవలే సెంట్రల్ ఎక్సైజ్ ఇన్‌స్పెక్టరుగా రిటైర్ అయి, హైదరాబాద్‌లోనే వుంటున్నారు. ఆనాడు అవమానం చేసి, ఇల్లు ఖాళీ చేయించిన ఇల్లాలు 35 సంవత్సరాల తర్వాత వచ్చి నా యోగంలో చేరి శిష్యురాలైంది. అది తర్వాత మరోచోట రాస్తాను.

నార్లవారి హయాంలో సబ్ ఎడిటర్ల సెలెక్షన్‌కి అర్హత వారివారి ప్రతిభ. ఇప్పుడు కులం ప్రధానమైన అర్హతగా మారింది. రావూరి సత్యనారాయణగారిని వీక్లీలోకి తెచ్చిపెట్టారు ఆయన కృష్ణాపత్రికలో 'ఆషామాషీ' రాసేవారు. కొంతకాలం సినిమా రచయితగా మహానటి భానుమతిగారి దగ్గర పనిచేశారు. తానుగొప్ప హ్యూమర్ రాస్తానని అనుకునేవాడు. ఉత్త సొల్లుకబుర్లు చెప్పి కాలక్షేపం చేస్తుండేవారు. పని తెలియదు. అసలు ఏ పనిచేయడానికీ బద్ధకం, సోమరితనం. అయితే ఎడిటర్‌గారు కోరితెచ్చి పెట్టినవాడు. నీలంరాజు వెంకటశేషయ్యగారు భద్రాచల రామభక్తుడు... పత్రికలనిండా ఎడాపెడా రామభజన వ్యాసాలు, ఫొటోలు ఎక్కువైనాయి. ఇష్టం లేకపోయినా ఎడిటర్ ఆర్డరు ప్రకారం చేసేవాడిని

నార్లవారి సంపాదకత్వంలో వుండే 'ప్రభ' పేరు పోయింది పాఠకులు తగ్గారు. పాఠకుల అభిమానం తగ్గిపోసాగింది. అవతల నార్లవారి కొత్తపత్రిక 'ఆంధ్రజ్యోతి' సర్కారు జిల్లాలలో బాగా అమ్ముడుపోసాగింది. ప్రభలో స్వాముల, మఠాధిపతుల, మతాధిపతుల

ప్రచారం ఎక్కువ కావడంతో గాలిమారింది. విద్వాన్ విశ్వంగారు వచ్చి ఆంధ్రజ్యోతి డెయిలీలో చేరారు. నండూరి రామ్మోహనరావు, విద్వాన్ విశ్వం నార్లవారికి రెండు చేతుల్లా పనిచేశారు

నీలంరాజు వారిని చూస్తేనే మడికట్టుకున్నట్లు కనిపిస్తుంది. నుదుట ఎర్ర బొట్టు, ధోవతి, ఎప్పుడూ నవ్వుతుండేవారు. కాని ఆయనకు వల్లమాలిన బ్రాహ్మణ అభిమానం నేను ఆంధ్రజ్యోతికి పోదామనుకుని నార్లవారిని కలిశాను

"ప్రస్తుతానికి అక్కడ వీక్లీలోనే వుండు శార్వరీ! ఆంధ్రజ్యోతి వీక్లీ ప్రారంభిద్దామనుకుంటున్నాం. అప్పుడు రావచ్చు. అక్కడి వీక్లీ అనుభవం ఇక్కడ పనికొస్తుంది."

మళ్లా విద్వాన్ విశ్వంగారితో కలిసి ఆంధ్రజ్యోతి వీక్లీలో పనిచేసే అవకాశం వస్తుందనీ నార్లవారి పత్రికలో పనిచేయవచ్చుననీ ఆశించాను రావూరి సత్యనారాయణరావు గారు వచ్చి చేరిందే తడవు నన్ను ఉద్యోగం నుండి తొలిగించి తనవాళ్లని పెట్టుకోవాలని ప్రయత్నించాడు ఎడిటర్ నీలంరాజుగారితో వీలైనన్ని కల్పించి చెప్పేవాడు ప్రొప్రయిటర్ నన్ను మార్చడానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పడంతో ఇద్దరూ నోరు మూసుకున్నారు అలా వీక్లీలో ఉద్యోగం నిత్యం ఒక ప్రమాదంగానే సాగినా యువ రచయితలు నేనంటే అభిమానంగా ఉండేవారు ఎందరినో ప్రభ ద్వారా పరిచయం చేస్తుండేవాడిని

కొంతమంది ఆంధ్రజ్యోతికి వెళ్లిపోవడం వల్ల కొత్తవారికి అవకాశం వచ్చింది. అప్పుడు చేరినవారు గొల్లపూడి మారుతీరావు, నండూరి పార్థసారధి... మారుతీరావు అప్పటికే నాటకరచయితగా ప్రసిద్ధుడు 'రాగరాగిణి' లాంటి నాటకాలు ప్రదర్శింపబడుతుండేవి. సారధి నండూరి రామ్మోహనరావుగారి తమ్ముడు. తను ఆంధ్రజ్యోతిలో కాకుండా ప్రభకు ఎందుకు వచ్చాడో అర్థం కాలేదు. అడిగితే "అన్నగారిదగ్గర పనిచేయడంకన్న ఇండివిడ్యుయల్‌గా పైకిరావడం నాకిష్టం" అన్నాడు. ఇద్దరూ సరదా అయినవారు. పార్థసారధి మంచి హ్యూమర్ రాస్తాడు. మారుతీరావు సీరియస్ రైటర్. బెల్లంకొండ రామదాసు, అవసరాల సూర్యారావు, రెంటాల గోపాలకృష్ణ, జొన్నలగడ్డ రాధాకృష్ణ వంటి ప్రసిద్ధరచయితలు డెయిలీలో వుండేవారు.

అప్పట్లో అన్ని పత్రికలలో ప్రసిద్ధ రచయితలు సబ్స్‌గా వుండేవారు. రచనా ప్రతిభ జర్నలిజంలో ప్రవేశానికి మొదటి అర్హత. ఆంధ్రపత్రికలోనూ తిరుమల రామచంద్ర, తెన్నేటి సూరి, పిలకా గణపతిశాస్త్రి వంటి మహారచయిత లుండేవారు. కొడవటిగంటి కుటుంబరావుగారు ఆంధ్రపత్రిక వీక్లీలో పనిచేస్తుండేవారు. సబ్స్‌గా వున్న కారణంగా

ఎడిటర్లను భరించేవారు. నీలంరాజుగారంటే సంపాదకవర్గంలో అంత ఇష్టం వుండేది కాదు అయినా ఆయన ఎడిటర్ లోగడ "నవోదయ' పత్రిక నడిపినవాడు. ఏదో ఒక పాతకాలపు సినిమాలో హీరోగా వేశాడట. అదీ ఆయన గ్లామర్. అప్పుడు ఎ బి కె.ప్రసాద్ స్వంతంగా ఒక రాజకీయ వారపత్రిక నడుపుతుండేవారు ఆ పత్రిక ప్రారంభోత్సవానికి వెళ్లాను. ఎ బి.కె. మాలాంటి యువకులలో యువకుడు స్వతంత్రభావాలు కలవాడు. ఒకరిక్రింద పనిచేయడం వారికిష్టం వుండేది కాదు తన అభిప్రాయాలు నిష్కర్షగా రాయాలంటే స్వంతపత్రిక వుంటేనే సాధ్యం అనేవాడు చూడగానే ఆదర్శ కమ్యూనిస్టు రచయిత అనిపించేవాడు. చాలామంది కమ్యూనిస్టు రచయితలకు లాల్చీ పైజామా, దళసరికళ్లద్దాలు అలవాటు. ఎంచేతనో మరి!

1960 నవంబరులో మా మూడవ అబ్బాయి పుట్టాడు. పేరు వెంకటరమణ. అప్పటికి నాకు, నా శ్రీమతికి దైవభక్తి మెండుగానే వుండేది నిత్యం వెంకటేశ్వర సుప్రభాతం చదివేవాడిని. పూజలు గట్రా ఎక్కువే మడి, ఆచారాలు మాత్రం మామూలే. ఎప్పుడో యజ్ఞోపవీతం వదలిపెట్టాను పెళ్లి సమయంలో వేసుకున్నా పదహారు రోజులకే తీసివేశాను నేనేమీ యజ్ఞాలు చేయడం లేదు యజ్ఞం చేసేవారు వేసుకోవాలి ఉపవీతం నాకెందుకు. జంధ్యం వీపు గోక్కోడానికి కారాదు జంద్యం వేసుకోకపోవడమే గొప్ప విప్లవం అనుకునేవారు.

యామినీదేవి ఆరోగ్యం చక్కబడలేదు ఫిట్సు వస్తూనే వున్నాయి. ఆపరేషన్ చేయించుకుందామనుకున్నాను. ఆమెకు ఆడపిల్లకావాలని కోరిక మిగిలి వుంది. ముగ్గురూ మగపిల్లలే. ఇంట ఆడపిల్ల పారాడకపోతే లక్ష్మిరాదట! ఏమిటో నమ్మకాలు మా పెద్దవాళ్ల సహకారం చాలా తక్కువ. ఎప్పుడైనా వచ్చి చూచి పోవడం తప్ప పదిరోజులు మా వద్ద ఉన్నది లేదు. పత్రికల జీతం చాలదు. ఆదర్శాలు భోంచేస్తూ దేశాన్ని సమాజాన్ని ఏదో తమ రచనల ద్వారా ఉద్ధరిస్తున్నామన్న భ్రమ జర్నలిస్టులకు, రచయితలకు సహజం. ఆమాత్రం ఆత్మతృప్తి లేకపోతే ఎవరూ రచనలు చేయరు. రచనలు సమాజాన్ని మార్చ గలవు. అలాంటి సత్‌రచనలు చేసేవారెందరు?

ఒక పత్రికలో పనిచేసేవారు ఇతర పత్రికలకు రాయకూడదు. అది అలిఖిత శాసనం. ఎన్ని పత్రికలు వచ్చినా మా రచనలకు ఆంక్షలు ఏర్పడ్డాయి. రేడియోకు మాత్రం రాసుకోవచ్చున్నారు. అప్పుడప్పుడు రేడియోకు నాటికలు, కథలు, వ్యాసాలు రాసేవాడిని. రేడియో నాటికలలో పాత్రపోషణ చాలాకాలంగా వున్నదే. రేడియోస్టేషన్‌లో లత, శ్రీరంగం గోపాలరత్నం, బాల మురళీకృష్ణ, బుచ్చిబాబు, ఆమంచర్ల గోపాలరావు, బందా,

వింజమూరి శివరామారావు నాకు సన్నిహితులు. పత్రికల ప్రాపకం కోసం విజయవాడకు రచయితలు, రచయిత్రులు వస్తుండేవారు పత్రికలతో ప్రత్యక్ష సంబంధాలు వారికీ మేలు. ఇటు పత్రికలకూ మేలు చేశాయి. పత్రికలు మద్రాసులో ఉన్నంతకాలం రచయితలు అంతదూరం వచ్చేవారుకాదు అసలు పత్రికలవారు రిజర్వ్‌డ్‌గా వుండేవారు. విజయవాడ రాకతో పత్రికలు ప్రజల మధ్యకు, పాఠకుల మధ్యకు వచ్చాయి

కథ, నవల కొత్తగా వోణీలు వేసుకోగాయి. వయసొచ్చిన ఆడపిల్లలా వయ్యారాలు సంతరించుకోసాగాయి యువ రచయితలు కొత్తపోకడలు అలవరచుకున్నారు. వారపత్రికలు మంచి కథలు, నవలలు, సమాజశ్రేయస్సుకోసం ప్రచురించసాగాయి సాహిత్య విలువలకన్నా, ఫిక్షన్‌లో సామాజిక స్పందన ఎక్కువైంది. రంగనాయకమ్మగారి నవలా విజయం తర్వాత కోడూరి కౌసల్యాదేవి, యద్దనపూడి సులోచనారాణి రంగప్రవేశం చేశారు. అలా క్రమక్రమంగా పత్రికలలో మగవారి జోరుతగ్గి ఆడవారి జోరు హెచ్చింది అది అవమానంగా భావించి కొందరు మగరచయితలు 'ఆడపేర్ల'తో రాయడం జరిగింది. అది ఒకరంగా ఆత్మవంచన అయినా అప్పట్లో తెలిసీ ఆపద్ధతిని ఆపలేకపోయాం

విజయవాడలో వున్న కొద్దిరోజుల్లో కొంతమంది పెద్దల పరిచయం కలిగింది దేవరపల్లి చిన్నకృష్ణశర్మ అనే తెలుగుపండితుడు పిల్లల కథలు రాసేవాడు ఆయన ఆఫీసుకు వచ్చి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి గుర్ంచి, వారి యోగచికిత్సల గురించి చెప్పాడు. మా శ్రీమతి ఆరోగ్యమే అప్పటి బెంగ. తిరుపతి తీసుకువెళ్లి శ్రీశాస్త్రిగారికి చూపిస్తే యోగచికిత్స చేస్తారని సలహా చెప్పాడు. అప్పటికే ప్రభాకరశాస్త్రిగారు పరమపదించారని ఆయనకు తెలియదేమో!

మా మేనమామగారికోసం ఆయన వెంట విశ్వనాథ సత్యనారాయణ గారింటికి ఒకసారి వెళ్లాను. నేను ఫలానా అని పరిచయం చేసుకున్నాను. "ఇంకా కవిత్వం రాస్తున్నావా, కట్టిపెట్టేసావా?" అని అడిగారు. 'ప్రభలో సబ్ ఎడిటర్‌ని' అని చెప్పాను. "మంచిబాట. కవిత్వంతో కడుపు నిండదులే. పత్రికలు మంచివే. సాహిత్యం రాయడమే కాదు. దాన్ని పోషించుకోవాలి" అన్నారు విశ్వనాథ.

మరొకసారి... చుట్టకాల్చుకుంటూ కాటూరి మాస్టారు ఆఫీసులోకి వచ్చారు.

"ఎవరూ శార్వరి అంటే?"

మా ఎడిటర్‌గారే తీసుకువచ్చి పరిచయం చేశారు. 'కాటూరి-పింగళి' సౌందరనందం చదివాను. వారంటే గౌరవం నాకు. ఎందుకో బుజం తట్టి, ఆశీర్వదించి, అభినందించి వెళ్లారు. మరొకసారి స్వామి శివశంకరులు అలాగే వచ్చారు. వారు సన్యాసం

స్వీకరించారనుకుంటా కాషాయబట్టలు ధరించారు వారు పనికట్టుకుని వచ్చి ఆశీర్వదించారు. అప్పుడే గుడివాడలో బోయిభీమన్నగారికి గండపెండేరం తొడిగి, కనకాభిషేకం జరిపారు. ఆయన విజయవాడ మా ఆఫీసుకు వచ్చి నన్ను పరిచయం చేసుకున్నారు

అవసరాల సూర్యారావు, బెల్లంకొండ రామదాసు, రెంటాల గోపాలకృష్ణ నా కొలీగ్స్ . మంచి రచయితలు. ముగ్గురు కమ్యూనిస్టు అభిమానులే. సూర్యారావుగారు గురజాడ అప్పారావుగారి గ్రంధాలు ఎడిట్‌చేసి పెట్టారు విశాలాంధ్రవారు ప్రచురించారు. వారి పరిశోధన పింగళి లక్ష్మీకాంతంగారికి నచ్చింది ఆయన అప్పటికే ఆంధ్ర విశ్వవిద్యాలయం వదలి, రేడియోలో పనిచేస్తున్నారు. పల్నాటి వీరచరిత్ర ద్విపదకావ్యం పరిష్కరిస్తున్నారు అవసరాల సూర్యారావు, నేనూ వెళ్లి వారికి సహాయం చేస్తుండేవాళ్లం అలా 'పింగళి' వారికి యూనివర్శిటీలో శిష్యుడిని కాలేకపోయినా వారితో చేయి కలిపే అవకాశాన్ని అదృష్టంగా భావించాను

విజయవాడలో మాసెక్షనులో శివలెంక ప్రసాద్ పనిచేస్తుండేవారు. వాళ్ల ఇంటికి ఒక దయ్యం చుట్టంగా వచ్చింది క్రింద వున్న గిన్నెలు అమాంతంగా పైకి లేచేవి. అటక ఎక్కికూర్చునేవి ఇక్కడ వున్న మంచాలు ఎగిరి ఎక్కడికో పోయేవి ఒకవారం తర్వాత ప్రసాద్ నన్ను తీసుకువెళ్లాడు చూపించడానికి. మా నాన్నగారు దెయ్యాలు బాగుచేసేవారు కనుక, నాకు దయ్యాలంటే భయంలేదు. వెళ్లి చూచాను. వీలైతే మా నాన్నగారిని పిలిపించి దయ్యాన్ని వదలించమని ప్రసాద్ అడిగాడు నేను వెళ్లి చూచాను నా ముందర ఏవీ దెయ్యం చేష్టలు కనిపించలేదు. ఆ రోజు నుండి దయ్యం ఏ వికార చేష్టలు చేయలేదు. పారిపోయింది బహుశా నా మనస్సులో నాన్నగారిని స్మరించడం వల్ల ఆ దయ్యం పారిపోయి వుండాలి. నాకే ఆశ్చర్యం వేసింది. అందరూ నేనే దయ్యాన్ని తరిమివేశానని అనుకున్నారు అప్పుడు 'శివం'గారితో పరిచయం. శివం గుడిపాటి వెంకటచలంగారి భక్తుడు, శిష్యుడు. అతనికి, రావూరి భరద్వాజకు చలం స్నేహం.

# కష్టాల కాపురం

కష్టాలు వచ్చినపుడే దైవభక్తి కలుగుతుంది. పెరుగుతుంది. కష్టాలు క్షయిమాక్సుకు చేరితే జీవితంపైన, దైవంపైన విరక్తి ఏర్పడుతుంది. మనుషులు నాస్తికులుగా మారడం కష్టాల వల్లనే. మనిషి ప్రయత్నాలకు అవరోధం కల్పించేది భగవంతుడు అందులో భగవంతునికీ స్వార్థం వుంది భగవంతుడిచ్చిన అవకాశాలకు మనిషి గండి కొడగతాడు. కారణం అహంకారం. అహంకారంలేని మనిషి భగవంతునితో సమానం అతనిని భగవంతుడు చల్లగా 'చూస్తాడు. తన ప్రతినిధిని చేస్తాడు ఇది గుండెలో కదలాడే భావన

మా యాజమాన్యంవారు చిత్తూరులో 'ప్రభ'ను పెట్టాలని, మద్రాసు, బెంగుళూరులకు, రాయలసీమకు అక్కడనుండి ప్రభ పంపాలని ఆలోచించి, చకచకా ఏర్పాట్లు పూర్తిచేశారు. కట్టమంచి రామలింగారెడ్డిగారి బంగళా, తోట, పొలం కొన్నారు. మిషన్లు బిగించారు. విజయవాడ నుండి జనాల్ని బదిలీ చేశారు. ప్రభ డెయిలీతో పాటు వీక్లీని చిత్తూరు నుండి రెడీచేసి మద్రాసులో ప్రింటు చేయాలని ప్లాను. కాదంటే వినేవారు ఎవరు! పైఅధికారికి కోపం వచ్చినా ఉద్యోగికే నష్టం. ఉద్యోగికి కోపం వచ్చినా నష్టపోయేది ఉద్యోగే. రావూరి సత్యనారాయణరావు దగ్గర పనిచేయడం ససేమీ నాకు యిష్టం లేదు. ఆ విషయం గోయెంకాకు రాశాను. ప్రయోజనం లేకపోయింది. కుటుంబాన్ని విజయవాడలోనే వుంచి చిత్తూరుకు బయలుదేరాను ఒంటరిగా. అద్దెకు ఇల్లు చూచుకుని కుటుంబాన్ని మార్చాలి. మద్రాసు వెళ్లానుగానీ తిరుపతి, చిత్తూరు వైపు ఎప్పుడూ వెళ్లలేదు. శ్రీకాళహస్తి, తిరుమలవంటి పుణ్యక్షేత్రాలున్న జిల్లా అది. మళయాళ స్వామిగారి వ్యాసాశ్రమం వున్న జిల్లా.

అప్పట్లో తిరుపతికి సరాసరి రైల్లు లేవు. మద్రాసు రైల్లో గూడూరువరకు వెళ్లి, అక్కడినుండి రేణిగుంట వెళ్లే రైలు ఎక్కాలి. రేణిగుంట నుండి కాట్పాడి వెళ్లే రైలు ఒక్కటే

వుండేది అందులో చిత్తూరు చేరవచ్చు లేదా తిరుపతి నుండి బస్సులో వెళ్లాలి తిరుపతిలో ఒకపూట ఆగి అక్కడ మా తోడల్లుడు గాయత్రీ ప్రసాద్‌గారిని కలిశాను పెళ్లి అయింది కాని ఇంకా సంసారం పెట్టలేదు. రూంలో వుంటున్నారు ఆయనప్పుడు పాలిటెక్నిక్ కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్ బస్సులో చిత్తూరు చేరాను. జట్కాబండి కట్టించుకుని ఆఫీసుకు వెళ్లాను. చిత్తూరులో దానిని పేపరుమిల్లు అనేవారు, పేపరాఫీసు అనికాదు ఊరికి రెండు కిలోమీటర్ల దూరం. కలెక్టరు బంగళాదగ్గర. సర్ సి.ఆర్. రెడ్డిగారి బంగళా క్రింద ఆఫీసు కాంటీను. మేడపైన స్టాఫ్‌కు విడిది జిల్లాకేంద్రమే అయినా ఒక పెద్దపల్లె చిత్తూరు. ఓ అడివిలో ఆఫీసు. చీకటిపడితే పాముల సంచారం ఎక్కువ.

జి.కృష్ణగారు న్యూస్‌ఎడిటర్ వి.డి ప్రసాదరావు అసిస్టెంట్ ఎడిటర్. బాధ్యతలన్నీ కృష్ణగారివి. ఇద్దరూ ఆంధ్రపత్రిక నుండి వచ్చినవారే. నీలంరాజు వెంకట శేషయ్యగారంటే ఇద్దరికీ చిన్నచూపు. కృష్ణగారు స్వతంత్ర నిర్ణయాలు తీసుకోవడం ఎడిటర్‌కు నచ్చేది కాదు. బాస్‌లు ఎడిటర్‌కు తెలియకుండా అసిస్టెంట్లను నియమించి 'మిత్రభేదం' కల్పించేవారు. అదొక వేడుక అది పత్రికారాజకీయం. తిరుమల రామచంద్ర డెయిలీలో చేరారు వీక్లీకి బి.సి. కామరాజును నియమించారు పేరుకు రావూరికి అసిస్టెంటు కానీ పెత్తనం అంతా అతనిదే. ఆయన రావూరి సత్యనారాయణను పూచికపుల్లలాగా చూచేవాడు. ఏమాత్రం గౌరవం ఇచ్చేవాడు కాదు రావూరి నన్ను మంచి చేసుకుకోవాలని దువ్వసాగాడు కామరాజు నన్ను తనవైపు త్రిప్పుకోవాలని ప్రయత్నం. ఎవరిమాట వినాల్నో నాకు అర్థం అయ్యేది కాదు.

గొల్లపూడి మారుతీరావు బాగా కబుర్లు చెప్పి, మనుషుల్ని మెస్మరైజ్ చేయగలడు. తాను జీనియస్ ననిపించుకుంటాడు. కామరాజు అతనిమాయలో పడ్డాడు. మారుతీరావు లాంటి జీనియస్ వీక్లీకి ఉండడం మేలని భావించి పైవారికి రాశాడు. అతని స్థానంలోకి నన్ను, నా స్థానంలోకి మారుతీరావు బదిలీ జరిగింది. నాకు గొప్ప రిలీఫ్. కామరాజు, రావూరిల బాధతప్పింది. బి.సి.కామరాజు 'తూలికాభూషణ్' పేరుతో మంచికథలే రాశాడు. మంచి ఎడిటర్. కష్టపడి పనిచేసేవాడు. మనుషుల్ని తన చుట్టు తిప్పుకోవాలని కోరిక రాత్రి పన్నెండు అయినా ఇంటికి పోనీయడు. నేను అయిదుగంటల తర్వాత పనిచేయను. అతను మధ్యాహ్నం ఒంటిగంటకు వచ్చి సాయంత్రం నాలుగు గంటలకు పని ప్రారంభించి, అర్థరాత్రి వరకు చేసేవాడు. నాకు పది నుండి అయిదుగంటల వరకు చేయడమే యిష్టం. అసలు ఆఫీసు టైమింగ్స్ అవే ఎప్పటికైనా ఎడిటర్ కావాలని రావూరి ఆశ ఛస్తే అతనని ప్రభలో వుండనివ్వనని కామరాజు శపథం

చిత్తూరు చిన్నదైనా మంచిరచయితలు కొద్దిమంది వున్నారు ముంగర శంకరరాజు, వల్లంపాటి వెంకటసుబ్బయ్య హైస్కూలులో పనిచేస్తుండేవారు మధురాంతకం రాజారాం దామల్‌చెరువులో టీచర్. సి.వేణు బొమ్మసముద్రం. వీరంతా మాకు ఆప్తులు మున్సిపల్ కమీషనర్‌గా గుంటూరు శేషేంద్రశర్మగారు. ఆయన ఆఫీసులోనే ముత్తరాజు సుబ్బారావు వుండేవారు ఇదీ చిత్తూరు సాహితీచిత్రణ ఆదివారాలు మా ఇంటికి వస్తుండేవారు. అప్పుడే చిత్తూరులో కాలేజీ పెట్టారు. కొలకలూరి ఇనాక్ తెలుగు లెక్చరర్. అతను తెనాలిలోనే నాకు తెలుసు అతనిది నాది స్వగ్రామం వేజెండ్ల.

విజయవాడ వెళ్లి భార్యాబిడ్డలను తీసుకువచ్చాను. తిరుపతిలో వేంకటేశ్వర స్వామిని దర్శించాలని శ్రీమతి కోరింది అప్పటికి నేను గుళ్లకు వెళ్లింది తక్కువ ఒకసారి విజయవాడ కనకదుర్గ దేవాలయానికి వెళ్లాం. అదీ శ్రీమతి కోరికమేరకు ఆమెకు గుడులు, గోపురాలు దర్శించాలన్న కోరిక ఎక్కువ నాకు అసలులేని కోరిక. ఆమె అనారోగ్యం కొంత కారణం భక్తి పెరగడానికి. ముగ్గురు పిల్లలతో కొండపైకి బస్సు ప్రయాణం మూడుగంటలు క్యూలో వుంటే గానీ బస్సు దొరకలేదు కొండపైకి బస్సు ప్రయాణిస్తుండగా, నాకు కళ్లు తిరిగి స్పృహపోయింది. మెలికలు తిరడం వల్లనేమో కళ్లు తిరిగాయి. కొండపైకి వెళ్లేసరికి నా పరిస్థితి అయోమయంగా మారింది. సత్రంలో గది ప్రయత్నించే స్థితికాదు ఫుట్‌పాత్‌పైన ఒకచోట ఆగిపోయాం నేను గాఢమైన మైకంలో వున్నాను. ఎదురుగా ఆస్పత్రి వుందిగానిఎవరూ లేరు. తను పిల్లలకు ఏం పెట్టిందో ఏమో నాకు స్పృహ తెలిసేసరికి వాళ్లు నిద్రపోతున్నారు. తను నాకు, పిల్లలకు కాపలాగా కూర్చున్నది. కళ్లు విప్పిచూస్తే, ఎదురుగా ధగధగా మెరుస్తోంది బంగారు శిఖరం. జనం పలచగా తిరుగుతున్నారు. కొండమీద ఎప్పుడూ కోలాహలమే. జనం తిరుగుతూనే వుంటారు. షాపులు తెరిచేవుంటాయి. ఎప్పుడూ పెళ్లిఇల్లులా కళకళలాడుతుంది. అప్పుడు అది కలియుగ వైకుంఠమే అనిపించింది. నేను భోజనం చేయలేకపోయాను వెళ్లి కాఫీ తాగి వచ్చాను. సుప్రభాతసేవలో పాల్గొనాలని శ్రీమతి కోరిక. రాత్రి నాకు నిద్రపట్టలేదు. వేకువన నాలుగుగంటలకు సుప్రభాతం గంటలు కొట్టారు. మొహాలు కడుక్కొని వెళ్లాం. అప్పట్లో క్యూలేదు. ఓ నలభైమంది వచ్చారు. అరగంటసేపు స్వామి ఎదురుగా మండపంలో కూర్చునే వీలున్నది. దర్శనం, కర్పూర నీరాజనం, నామార్చన అన్నీ ఫ్రీయే. దేనికీ చార్జీ లేదు. క్యూ లేదు. ఉదయం పిల్లల నీలాలు సమర్పించి, స్నానాలు ముగించి, మరోమారు స్వామి వారి దర్శనం చేసుకున్నాం. ఆనాడు స్వామి జాజ్వల్యమానంగా భాసించారు. మనస్సు పరవశించింది. కళ్లు ఆనందనిలయాలైనాయి.

అప్పుడు దైవభక్తి ఎక్కువైంది. రూపాయిన్నర పెట్టికొన్న స్వామివారి, పద్మావతి ఆరాధనామూర్తులు యోగంలో చేరేవరకు నా అర్చనామూర్తులే. యోగంలోకి వచ్చిన తర్వాత వాటి అవసరం లేక ఎవరికో యిచ్చివేశాను.

సరాసరి చిత్తూరు వెళ్లాం కొన్ని రోజులు బందేఖాన్ వీధిలో ఇంట్లో వున్నాం అంతలో మా నాన్నగారు వచ్చారు. బజారువెడుతుండగా వారి కజిన్ కనిపించాడట, ఇద్దరు కలిసి వచ్చారు. వారి అబ్బాయి వాసిలి నాగేశ్వరరావు చిత్తూరు కలెక్టరాఫీసులో ఉద్యోగం. వారుండేది గ్రిమ్స్‌పేట. అయినవారు సహాయంగా వుంటారని, నేను గ్రిమ్స్‌పేటలో నాగేశ్వరరావు వున్న ఇంటి దగ్గరగా ఒక ఇల్లు తీసుకున్నాను పెద్దబ్బాయి వసంతకుమార్‌కు అక్షరాభ్యాసం రావూరి సత్యనారాయణరావు చేశారు గ్రిమ్స్‌పేట స్కూలులో వేశాం.

యామినీదేవి అనారోగ్యం అలానే కొనసాగుతోంది. తన చెల్లెలు లీలావతి, కాపురానికి వచ్చింది. గాయత్రీప్రసాద్ ఉద్యోగం తిరుపతిలో. తను ఏదో పసరు వైద్యం కోసం తరచు తిరుపతి వెళ్లి వస్తుండేది. కొన్ని రోజులపాటు చెల్లెలి గారింట వుంది. నేను చిత్తూరులో వుండేవాడిని. అది జీవితంలో ఒక చీకటి అధ్యాయం. చీకటిలోనూ చీలికల్ని చూడగల దృష్టి మనిషికి ఏర్పడుతుంది. ఆ చీలికల లోంచి వెలుగులు ప్రసరిస్తాయి. వాటిని దర్శించే అంతర్దృష్టి, దిదృక్ష అలవరచుకోవాలి. కాలం ఒక్కటే మనసు చేసే గాయాల్ని మాన్పగలదు!

నా జాతక ప్రభావం ఎలాంటిదో గాని జీవితంలో సుఖం తక్కువ మనశ్శాంతి తక్కువ ఎప్పుడూ ఏవో సమస్యలు, ఈతిబాధలు. ఆర్థికంగా ఎప్పుడూ స్థిమితంగా వున్నది లేదు. స్థిరంగా ఒకచోట వున్నదీ లేదు. ఉద్యోగం దినదినగండంలా వుండేది. పైవాళ్లకు నేనంటే అసూయ. సాటిరచయితలు అంతే. పంకిలంలోంచి పద్మం వికసించినట్లు నీచుల్ని దాటుకుంటూ పైకిఎదగడం. నాకు ఏమీ లేకపోయినా ఇతరులకు ఎందుకో అసూయ. బంధువులకూ అసూయే.

ఒకసారి కొత్తగా పెళ్లయిన మా మరదలు బేబీ, ఆమె భర్త వేంకటేశ్వరస్వామి దర్శనానికి వచ్చారు పదహారు రోజుల పండుగ లోపే. తిరుపతిలో ఒక అక్కగారుంది చిత్తూరులో మరొక అక్క నా శ్రీమతి. అందరం కలిసి కొండపైకి వెళ్లాం. కాటేజీ తీసుకుని రాత్రికి మకాం చేసి, ఉదయాన దర్శనానికి వెళ్లాం. చెప్పానుగా అప్పట్లో క్యూలు తక్కువ. క్యూ కాంప్లెక్స్ లేదు మహావుంటే గాలిగోపురం నుండి క్యూ వుండేది. ఎంతయినా అరగంటలో దర్శనం అయ్యేది. ఈ తొక్కిసలాట లేదు. తృప్తిగా దర్శనం అయ్యేది

ప్రతివారికి, ఒక రూపాయి యిస్తే చాలు. అర్చన చేసేవారు. బంగారుద్వారం దాటి మూలవిరాట్ దర్శనానికి వెడుతుండగా బేబి కళ్లు తిరిగి పడిపోయింది.అక్కలిద్దరు గాభరా పడ్డారు. పరిస్థితి ఎవరికీ అర్థం కాలేదు జనం ఎక్కడివారక్కడ నిలబడిపోయారు అర్చకస్వామి 'అమ్మాయిని ఇలా తీసుకురండి' అని పిలిచి, కర్పూరం వెలిగించి, అమ్మాయికి చూపించి స్వామివారి విభూతి తెచ్చి నుదుట పెట్టి, తీర్థం యిచ్చారు. ఒక నిమిషంలో ఆమెకు స్పృహ వచ్చింది.

నాకు ఆశ్చర్యం కలిగింది అది ఎలా సాధ్యం! అలాంటి సమయంలో డాక్టరు దగ్గరకు పరుగెత్తుతాం అర్చకుడు తాపీగా, ప్రేమగా పిలిచి, తీర్థం యిచ్చి విభూతి పెట్టాడు. అది స్వామి మహిమా? లేక అర్చకస్వామి ప్రేమవల్లనా? అతనిలో వున్నది దైవశక్తా, ఆత్మశక్తా, యోగశక్తా? ఏది?!! దైవశక్తి అయితే ఎవరైనా దైవాన్ని స్మరిస్తే పని కావాలి. అలాకాదు కనుక అది ఆత్మశక్తి అయివుండాలి. అతను పూజారి, అర్చకుడు మాత్రమే. తపస్సు, ధ్యానం చేసి ఆత్మశక్తి పెంపొందించుకున్నవాడు కాదు. అది యోగశక్తికాదు. కేవలం ప్రేమతో, సానుభూతితో చేసినపని! ఆయన పవిత్రవర్తన, నిర్మలసంకల్పం అతనికి సహకరించి వుండాలి. అలాంటివి యోగసిద్ధులు కానవసరం లేదు. హృదయం నిర్మలంగా వుంటే చాలు పరిశుద్ధమైన మనస్సు, ఆలోచన, సంకల్పం వుంటే చాలు. దైవం అనుకూలిస్తుంది

తిరుమల ఏడుకొండలు నాకు ఎందుకోగాని మానవయాత్రకు ఒక సింబల్ అనిపిస్తుంది. ప్రతి వ్యక్తి ఆధ్యాత్మిక పురోగమనంలో ఏడుకొండలు ఎక్కవలసివుంది. ఏడుభూమికల్ని దాటిపోవాలి. అక్కడ సహస్రారంలాంటి విష్ణుపథం, శ్రీ నిలయం దర్శనమవుతుంది. అది మహాయాత్ర ప్రతివారికీ. ఉన్నచోటనే వుండి, చనిపోతే ఏం సాధించినట్లు. ఒక్కసారైనా తిరుపతి దర్శిస్తే, మనిషికి తన జీవితగమ్యం స్ఫురణకు వస్తుంది. అంతమాత్రాన స్వర్గం వస్తుందనీ, వైకుంఠం చేరతామనీ కాదు. ప్రాపంచిక సుఖభోగాలకు దూరమై కైవల్యపథం చేరడానికి అదొక ప్రయత్నం. ఆ తర్వాతనైనా మనిషి తన లక్ష్యాన్ని నిర్దేశించుకుని, ధర్మపథంలో నడుస్తూ, పరమపధాన్ని చేరగలగాలి.. జీవితం మహాసాగరం వంటిది తీరంలో అలల తాకిడి కల్లోలంగానే వుంటుంది. సముద్రగర్భంలోకి వెళితే ఎంత నిశ్చలత, ఎంత ప్రశాంతి. భగవద్భక్తి అనే మహాసాగరంలో మునిగి ప్రశాంతి సాధించాలి.

ఒకరోజున అకస్మాత్తుగా ప్రభ, ఎక్స్‌ప్రెస్, వీక్లీలను మద్రాసుకు మార్చుతున్నట్లు, ఒక్కరోజుకూడా పబ్లికేషన్ నిలిపివేయకుండా మర్నాడు ఉదయానికల్లా మద్రాసు ఆఫీసులో

పనిచేయాలని చెప్పారు సాయంత్రం చిత్తూరులో ఎడిషన్ పూర్తిచేసి, ఇళ్లకువెళ్లి, పెట్టె, బెడ్డింగ్ తెచ్చి రాత్రి పదిగంటలకు అందరూ వ్యాన్‌లలో బయలుదేరాం. మేఘంలేని ఉరుములాంటి వార్త. ప్రభ మద్రాసు నుండి వెలువడుతున్నట్లు పబ్లిక్‌కు తెలియకూడదు ఏవో కోర్టు గొడవలున్నాయి యాజమాన్యానికి, ఇదేదో లేపుకుపోయి గుళ్లో దండలు మార్చుకుని పెళ్లి అయిందని మురిసిపోయినట్లు.

విజయవాడ, చిత్తూరు తర్వాత మరల మద్రాసు బదిలీ అవుతుందని ఎవరూ ఊహించలేదు కాస్త స్థిమితపడేలోగా బదిలీ గవర్నమెంటు ఉద్యోగంకంటే కనాకష్టంగా మారింది మా పరిస్థితి. ఎదురుతిరిగేవారు లేరు పత్రికల్లో పనిచేసేవారంతా ఇతర ఉద్యోగాలకు పనికిరానివారు లేదా సాహిత్యంపట్ల మక్కువ ఎక్కువై ఆదర్శంగా జీవించాలనే రచయితలు లోగడ రాయపేటలో కొన్నాళ్లు వున్నాను. ఈసారి టి నగర్ ప్రాంతంలో ఇల్లు తీసుకోవాలనుకున్నాను. త్యాగరాయనగర్, పాండీబజారులో బ్రోకర్సు వుంటారు సగంనెలఅద్దె కమీషన్‌గా తీసుకొని ఇళ్లు చూపిస్తారు ఒక బ్రోకరును పట్టుకుని ఇళ్ల వేట ప్రారంభించాను నేనివ్వగలిగిన అద్దెకు మహాభవనాలు దొరకవని నాకు తెలుసు. పాతిక రూపాయలకంటే ఇవ్వలేని పరిస్థితి నాది. డైరెక్టరు వేదాంతం రాఘవయ్యగారింటి అవుట్‌హవుస్ దొరికింది. చవక అని కాదుగానీ నా శక్తికి అందుబాటులో పాండీబజారుకు దగ్గర వెంటనే చిత్తూరు నుండి భార్యబిడ్డల్ని తీసుకువచ్చాను

నా చేతిలో అయిదువరకు అదృష్టరేఖలున్నాయి. అందులో ఒకటి చంద్ర మండలం నుండి బయలుదేరి సరాసరి శనిస్థానం వరకు వెళ్లింది. అది ప్రధానమైన అదృష్ట రేఖ.ఉద్యోగానికి సంబంధించింది. అంటే రిటైర్ అయ్యేవరకు ఉద్యోగం వుంటుంది. అయితే మధ్యమధ్య చీలికల వల్ల కష్టాలు, అవాంతరాలు, బదిలీలు తప్పవు. జీవితరేఖనుండి బయలుదేరిన అదృష్టరేఖలు నాలుగున్నాయి. అవి శనిమండలంలోకి వెడుతున్నాయి. వాటికి తోడు రవిరేఖలు వున్నాయి. అంటే ఉద్యోగంతో సరిపోదు. ఇంకేవేవో చేయాలి. అదృష్టం వెతుక్కోవాలి. పుస్తక రచన ఒకటి ఉండనే వుంది.

టి.నగర్‌లో మకాంపెట్టడంతో కాస్త సినిమావారి పరిచయం ఏర్పడ్డది. కాగడాశర్మగా ప్రసిద్ధుడైన కొక్కెరగడ్డ కామేశ్వరశర్మ నాకు పాతమిత్రుడు. అతను రాజమండ్రి నుండి పత్రిక నడిపినపుడు నాచేత కవితలు రాయించుకున్నాడు. తెనాలిలో పత్రికల్లో పనిచేసిన మాగాపు రామన్, కొలను బ్రహ్మానందరావులు బాగా తెలిసినవారు. వారి ద్వారా సినిమారంగం ఎడిటర్ జి.వి.జి.తో పరిచయం, టెంపోరావుతో పరిచయం ఏర్పడ్డది. ప్రివ్యూలకు వెళ్లడం అలవాటైంది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి అబ్బాయి

బుజ్జాయి తో స్నేహం కుదిరింది అప్పుడు కృష్ణశాస్త్రిగారు అక్కడే వుండేవారు. బుజ్జాయితో కలిసి వారింటికి వెళ్లే అలవాటు. ఆరుద్ర, రామలక్ష్మి, సముద్రాల ముద్దుకృష్ణలాంటి పెద్దలతో పరిచయం కలిగింది. అప్పట్లోనే బి ఎన్.రెడ్డిగారు, కమలాకర కామేశ్వరరావుగార్లు నేనంటే ప్రేమగా, అభిమానంగా వుండేవారు. కామేశ్వరరావుగారు పౌరాణిక సినిమాల డైరెక్టరుగా ప్రసిద్ధులు మా పక్కవీధిలో వింజమూరి సీత, అనసూయ లుండేవారు. వారితోను పరిచయం ఏర్పడ్డది.

వేదాంతం రాఘవయ్యగారు నాతో ఎప్పుడూ మాట్లాడలేదు. ఆయనపెళ్లాం సూర్యప్రభ. బోలెడుమంది పిల్లలు వారికి చావగొట్టి చెవులు మూసేవాడు. సలసలకాగే నీటిలో ముంచి తేల్చేవాడు పిల్లల్ని. అతనిదో రాక్షసానందం. ఆయనకోసం అప్పుడప్పుడు అంజలీదేవి వచ్చేది. అంజలీపిక్చర్స్ సువర్ణసుందరి తీస్తున్నరోజులు అవి. సూర్యప్రభ అంటే పుష్పవల్లి చెల్లెలు. 'రేఖ' అప్పటికి సినిమానటి కాలేదు. పిన్నమ్మగారింటికి వస్తుండేది సూర్యప్రభ కూతురు శోభ పెద్దయి సినిమానటి అయింది అప్పుడు చిన్నపిల్ల. అప్పుడే ఒక పిక్చర్‌కు కథ - మాటలు రాసే అవకాశం వచ్చింది. సులోచన అని ఒకనాటి హీరోయిన్ అక్కినేని నాగేశ్వరరావుగారితో కూడా వేసిందట నేను చూడలేదు ఆ పిక్చర్. ఆమె తన కూతుర్ని హీరోయిన్ చేయాలని ఒక సినిమా ప్రారంభించింది. ఆ సిన్మాకి నేను రచయిత్రను సినిమాపేరు భక్తతుకారాం. శ్రీ అక్కినేనినాగేశ్వరరావు, జగ్గయ్య ఇంకెవరెవరో నటవర్గం డైలాగ్సు రాయడమే నా పని. సీనులు చెపితే డైలాగులు రాసేవాడిని. కొన్నిసీనులు షూటింగ్ జరిగింది. ఆపైన మూలపడింది.

సినిమా పరిశ్రమతో నాకు అప్పటికి పరిచయం తక్కువ. గ్లామర్ ఒక్కటే తెలుసు. గ్లామర్ వెనుకగల చీకటి తెరలు తెలియవు. సినిమా రచయితను అయిపోతానని భ్రమించాను. సినిమాలు తీస్తామనేవారు వందమంది, తీసేవారు పదిమంది. చాలామంది కంపెనీలు పెడతారు. ఏవో కథలు వండుతారు. నాలాంటి వాడిచేత డైలాగులు రాయిస్తారు. ఆర్టిస్టులకు అడ్వాన్సులిచ్చి కొంత షూటింగ్ చేస్తారు. అది చూచి డిస్ట్రిబ్యూటర్ లక్షలు యిస్తాడని ఆశ. సొంతడబ్బు ఖర్చయిపోయి డిస్ట్రిబ్యూటర్ కుదరక అక్కడే చతికిలబడిపోయే పిక్చర్లు వందలు. పెద్దసంస్థలు మాత్రమే సక్రమంగా చిత్రాలు నిర్మించగలిగేవి.

మేం వున్న వేదాంతం రాఘవయ్యగారి అవుట్‌హవుస్ ఒక దయ్యాల కొంప. ఆ కొంపలో ఎవరూ పట్టుమని పదిరోజులు కాపురం చేసింది లేదట. తర్వాత తెలిసింది. ఆ ఇంట్లో దయ్యం తిరిగేదిట. గిన్నెలు చెంబులు డాన్సు చేసేవి. క్రిందవున్న సామాను

మాయమయ్యేది. మేం చేరాక అలాంటిదేం జరగలేదుగానీ, మా పెద్దబ్బాయి వసంత కుమార్‌కు జబ్బు చేసింది దగ్గరలో వున్న డాక్టర్ శివరామకృష్ణయ్య (ఈయన సినిమా నటుడు) దగ్గరకు తీసుకువెళ్లాం. ఆయన ఏవో మందులిచ్చి, ముందు వెంటనే ఆ ఇల్లు వెకేట్ చేయమని చెప్పాడు వెంటనే పానగల్ పార్కు దగ్గర దొరైస్వామి వీధి సందులోకి మారాం. అదీ ఒక్కగది ఇల్లే. బక్క సంసారులకు ఒక్క గదికంటే దొరకదు ఆ ఇంటికి ఎదురుగా మహానటుడు చిత్తూరు నాగయ్యగారిల్లు పక్కన కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారిల్లు. వారితో పరిచయం ఏర్పడ్డది. జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రిగారితో అప్పుడే స్నేహం అయింది. ఉస్మాన్‌రోడ్డులో జి.మునిరత్నంనాయుడు (ఇప్పుడు రాయలసీమ సేవాసమితి కార్యదర్శి, తిరుపతి) ఓ చిన్నప్రెస్ నడుపుతుండేవారు. శ్రీకళాప్రింటర్స్ ఆయన నాలా యువకుడు ఆదర్శాలు కలవాడు. 'బాలప్రభ' అని ఓ పిల్లల పత్రికను ప్రారంభించాడు. ఆ పత్రికకు నాచే రాయించుకునేవాడు. అప్పట్లో నేను బాలసాహిత్యం రాసేవాడిని. 'నాగార్జున' అనే చిన్న నవలను నాన్‌డిటైల్డ్ టెక్స్ట్‌గా పెట్టారు అలా మునిరత్నంగారితో పరిచయంస్నేహంగా మారింది కొద్దిరోజుల్లోనే మకాం పాత మాంబళానికి మారింది. కోదండరామ కోవెలవీధిలో ఒకటి రెండు నెలలుండి, శివాలయం వెనక సుబ్బారెడ్డి వీధికి మారాం. అప్పటికి ఓ సంవత్సరంలో మూడు ఇళ్లు మారినట్టయింది సుబ్బారెడ్డివీధిలో ఒక మేడమీద సంసారం. చాలాకాలం అక్కడే వున్నాం.

మా అమ్మాయి పద్మప్రియ 1963 జనవరిలో జన్మించింది తెనాలిలో. నెలలోపున యామిని పిల్లలతో మద్రాసు వచ్చింది. కాస్త స్థిరపడుతోంది సంసారం. ఆర్థికమైన ఒడిదుడుకులు మామూలే. వసంతకుమార్, శ్యాంసుందర్‌లను దగ్గరలో వున్న శారదా మిడిల్ స్కూలులో చేర్పించాం. తెలుగు స్కూలు, నడిచివెళ్లే దూరం. పెద్దకాన్వెంట్సులో చేర్పించే శక్తిలేదు. అలాంటి కోరికలు లేవు మాకు. జీవితంపైన ఎన్నడూ పెద్ద ఆశలు పెంచుకోలేదు నేను, యామినీదేవి కూడా. మా బ్రతుకు మేం బ్రతికితే చాలు. ఒకరిని అర్థించకుండా యాచించకుండా బ్రతకాలి. ఆమెకు ఆత్మాభిమానం జాస్తి. నాకు లేదని కాదు. కాని బయట ప్రపంచంలో తిరిగేటప్పుడు కొన్ని ప్రభావాలకు లోనుకాక తప్పదు.

ప్రభలో మొదట సినిమా సెక్షన్ చూడవలసి వచ్చింది వేరే సినిమా ఎడిటర్ లేడు. ప్రివ్యూలకు వెళ్లడం వరకు బాగానేవుండేది. స్టూడియో సంచారం ఫరవాలేదు. సినిమా తారల్ని ఇళ్లకు వెళ్లి కలుసుకోవడం న్యూసెన్సు. నటులైతే కొంతమర్యాదగా వుండేవారు. ఈరోజు కాకపోతే రేపైనా ఇంటర్వ్యూలు యిచ్చేవారు. ఆడవారితోనే బాధ.

వాళ్ల ఇళ్లకు వెళ్లడం నాకు అసహ్యం వేసేది సినిమాపత్రికలు నడిపే మిత్రులున్నారు. వారికి అదే యావ. అదే ధ్యాస వారిళ్లకు వెళ్లి, పొగిడి, తిట్టి డబ్బు సంపాదించేవారు. బ్లాక్‌మెయిల్ లాంటి జర్నలిజం. అలాగా తారల దగ్గర డబ్బు పిండగలవారే అప్పటి సినిమా జర్నలిస్టులు. వారిపై అవాకులు, చవాకులు రాసేవారు అది నాకు నచ్చలేదు. నటులు, నిర్మాతలు, అదో తరహా మందుమీదగాని మాట వినరు. అసలు సినిమా ప్రపంచమే సెక్సు. మందు చుట్టూ తిరుగుతుంది. ఈ రెండు నాకు సరిపడని అంశాలు. వేరే సినిమా ఎడిటర్ వచ్చేవరకు కాలక్షేపం చేశాను. చేరినకొత్తల్లో 'జయభేరి' చిత్రంపైన రివ్యూ సినిమావారిని బాగా ఆకర్షించింది బి.ఎన్ రెడ్డిగారి ఒక సినిమాను ఘాటుగా విమర్శించి రాశాను ఆయన మర్నాడే ఆఫీసుకు వచ్చి, ఆయనా విద్వాన్ విశ్వంగారి మిత్రుడే నన్ను పరిచయం చేసుకుని, అభినందించి వెళ్లారు. అప్పటి నుండి బి ఎన్.రెడ్డిగారితో స్నేహం ఏర్పడ్డది. సినిమా సెక్షన్ చూస్తున్న తొలినాళ్లలోనే ఒకసారి ఎన్ టి రామా రావుగారు ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టారు. శ్రీధర్, లక్ష్మీరాజ్యం ఏర్పాటు చేశారు బజుల్లా రోడ్డులో ఎన్.టి. రామారావుగారి ఆఫీసులో రాయలసీమ కరువుబాధితుల కోసం చందాలు వసూలు చేసే కార్యక్రమం. ఎన్ టి. ఆర్. ఉపోద్ఘాతం చెప్పి,ఈ మహత్కార్యానికి మీ పత్రికల్లో బాగా ప్రచారం చేయాలని కోరారు నేను కొత్తగా వచ్చినవాడిని. సినిమా రాజకీయాలు, మహానటుల మనస్తత్వాలు తెలియనివాడిని. రామారావుగారిని అడిగాను. "అయ్యా ఎన్ టి. రామారావుగారూ, మీ ఆశయం గొప్పది ప్రయత్నమూ గొప్పది. లక్షలు వసూలు చేసి రాయలసీమ కరువు బాధితులకి సాయపడడం గొప్ప విషయమే. ముందు మీ విరాళం ప్రకటిస్తే దాంతో పత్రికల్లో ప్రచారం ప్రారంభిస్తాం" అన్నాను.

ఎన్.టి.ఆర్. గారికి బుస్సున కోపం వచ్చి నాపైన ఇంతెత్తున లేచారు. చొక్కా చేతులు పైకిలాగి కొట్టడానికి ఉద్యమించారు. అటు శ్రీధర్, పుండరీకాక్షయ్య ఆయన్ని పట్టుకుని ఊరడించారు. బొమ్మకంటి సుబ్బారావు, కాగడాశర్మలాంటివారు నన్ను శాంతపరిచారు. అంత ఉద్రేకం చెందిన వ్యక్తి, ఆయనగారు చందా ఇవ్వనే లేదు. తర్వాత ప్రెస్‌వారిని స్టూడియోలలో జరిగే షూటింగులకు రానీయకుండా కట్టడి చేశారు. కొద్దిరోజులకే సినిమా సెక్షనుకు వేరే అతను వచ్చాడు. నా పని ఆఫీసుకు పరిమితం అయింది.

60-70 మధ్యకాలం - జనంలో పఠనాసక్తి పెరిగింది. పత్రికల అమ్మకాలు పెరిగాయి. వారపత్రికలకు ఆదరణ పెరిగింది. కొత్త రచయితలు వస్తున్నారు. బాగా రాస్తున్నారు. జనంలో సాహిత్యస్పందన ఎక్కువకావడం వల్ల మద్రాసునుండి డిటెక్టివ్,

సెక్సు పత్రికలు తయారయ్యేవి. పది పదిహేను పత్రికలు అలాంటివి వచ్చాయి మన్మథ, మదన, రతీమన్మథ, డిటెక్టివ్, అపరాధ పరిశోధన పబ్లిషర్స్ ఎక్కువైనారు. ఇంగ్లీషు పాకెట్ నవలలు అనుసరించి రాయడం, అలాంటి గెటప్‌తో పుస్తకాలు వేయడం, ఒక్కొక్క పబ్లిషర్ నెలకు నాలుగు నవలలు ప్రచురించేవాడు. అలాంటివారు పదిమంది వుండేవారు. డిటెక్టివ్ సెక్సు నవలలు కొందరు, మిస్టరీ నవలలు కొందరు, భేతాళ మాంత్రిక నవలలు కొందరు ... ఇలా ఎన్నో రకాలు ఒక్క పుస్తకం వెల ఒక రూపాయి. వాటికి తోడు సినిమాస్క్రిప్టులు నవలలుగా వచ్చేవి. అదొక విప్లవం రచయితలు యధాశక్తి ఈ పుస్తకాలు రాసేవారు. మద్రాసులో వున్నవారికి ఇదొక హాబీ అయింది. ఆరుద్రగారు కూడా డిటెక్టివ్‌ల మోజులో పడ్డారు ఇరవైవేల వరకు పుస్తకం అమ్ముడయ్యేది.

నేనూ రాశాను మోజు కొద్దీకాదు, డబ్బుకోసం నూరు, నూటయాభై రూపాయల కోసం ఒక నవల రాయడం. వారానికి ఒక నవల రాసేవాళ్లం. పై సంపాదన కావాలి. ఏదో రాయక తప్పదు విశ్వప్రసాద్, లీలాకుమారి లాంటి వారు అలా ప్రసిద్ధులైనవారే. నాకు ఆఫీసులో చదరంగం ఆటలా వుండేది కామరాజుగారు ఎత్తులు వేస్తుండేవారు. ప్రతి ఎత్తుకు'చెక్' అనేవాడు. ఎలాగైనా నన్ను ఓడించాలి. నా ఉద్యోగం తీసివేయాలి ఉద్యోగాలు తీసివేయించడంలో అతను గ్రాండ్‌మాస్టర్. అతని యిష్టాలకి, అయిష్టాలకీ కారణాలు వుండేవి కావు.

అతనికి మొండిగా ఎదురు తిరిగాను. నా జాగ్రత్తలో నేనున్నాను బయట పత్రికలకు రాసుకునేవాణ్ణి. ఏవో పేర్లతో, పేర్లు లేకుండాను. డిటెక్టివ్, సినిమా వ్యాసంగం బాగానేవుంది. ప్రభలో ఉద్యోగం పోయిన మద్రాసులో బ్రతకడానికి వీలైనన్ని వనరులున్నాయి. 'నెలవంక' అని ఒక కథల మాసపత్రిక ప్రారంభించాను. ప్రభ ఆఫీసు నుండే న్యూస్‌ప్రింట్ కొనేవాడిని. పత్రిక వెల అర్ధరూపాయి. నూరు పేజీలు మంచికథలు వేసేవాడిని కనుక సర్క్యులేషన్ అయిదారు వేల వరకు పెరిగింది. ఎప్పుడూ జేబులో డబ్బులుండేవి. అడిగినప్పుడల్లా బి.సి.కామరాజుకు అప్పులిచ్చి మచ్చిక చేసుకున్నాను. గంగాధర్, ఎ.ఎస్.మూర్తి లాంటి ఆర్టిస్టులు సహకరించేవారు. విజయబాపినీడుగారి ప్రెస్‌లో అచ్చువేసేవాడిని. అతని పత్రికలు విజయ, బొమ్మరిల్లు అచ్చవుతుండేవి. అయిదారు సంవత్సరాలు గడిచింది. సినిమా వారి పరిచయాలున్నాయి. 'లేతమనసులు' సినిమాకోసం ఎన్నికైన కె.వి.చలం మా 'నెలవంక' అసిస్టెంటు ఎడిటర్. అతనే నన్ను నటీనటులకు పరిచయం చేసేవాడు. 'వర్ధమానతారల'ను పరిచయం చేస్తూ ఒక పుస్తకం రాశాను. అందులో శారద, వాణిశ్రీ, గీతాంజలి, ఎల్. విజయలక్ష్మి ... ఇలా ఎందరో నేటి

నటీమణుల్ని తొలిసారిగా పరిచయం చేశాను. అప్పుడు నెల్లూరు నుండి వెలువడే 'జమీన్‌రైతు' వారపత్రికకు మద్రాసు సినిమా ప్రతినిధిగా వుండేవాడిని. వారు నెలకు నూరు రూపాయలు యిచ్చేవారు. వేణ్నీళ్లకు చన్నీళ్లు తోడు అన్నట్లు అటు ప్రభలో ఉద్యోగం, బయట 'నెలవంక' పత్రిక, నా రచనలు, నవలలు సంపాదన కుటుంబానికి సరిపోయేది.

కాలం ఎప్పుడూ ఒకేలాగ సాగదు కనిపించని కాలానికి ఎగుడుదిగుళ్లు ఎక్కువే. కాల ప్రవాహానికి ఆటుపోటులు జాస్తి. ఆంధ్రప్రభ బెంగుళూరులో పెట్టారు నన్ను బెంగుళూరు ఆఫీసుకు బదిలీ చేశారు. ఎ.ఐ.సి.సి. సమావేశాలు బెంగుళూరులో జరగనున్నాయి. స్టాఫ్ అవసరం అని టెంపరరీ అని చెప్పి పంపారు. డిప్యుటేషన్ మీద పంపినట్లే పంపి తర్వాత ట్రాన్స్‌ఫర్ ఆర్డరు యిచ్చారు. ఆ మహత్కార్యం వెనుక బి.సి. కామరాజు హస్తం వుందని నాకు తెలుసు. నాకు బదిలీ ఆర్డరు వేయించి, తిరుపతి వెళ్లి మొక్కు తీర్చుకువచ్చాడని తెలిసింది. ఎవరికి అపకారం తలపెట్టినా వేంకటేశ్వర స్వామికి మొక్కుకునేవాడు.

బెంగుళూరులో ఒక్క ఏడాది వున్నాను. అప్పుడు విద్వాన్ విశ్వంగారు వచ్చి మాతో డెయిలీలో చేరారు. అప్పటికే కన్నడ పత్రికల్లో నాకథలు, నవలలు వస్తుండేవి కన్నడ పత్రికా పాఠకులకు 'శార్వరి' పేరు బాగా పరిచయం. కుటుంబాన్ని బెంగుళూరుకు మార్చే ఆలోచన లేదు. అక్కడ ఖర్చు చాలా ఎక్కువ. నా వల్ల కాదు. బెంగుళూరులో తెలుగుచదువులు లేవు. తిరిగి మద్రాసు వెళ్లిపోవాలని కోరిక. జీతం రెండువందలయాభై. ఆ మొత్తం జీతం అందిన రోజు మద్రాసు వెళ్లి ఇంటి ఖర్చులకు యిచ్చివేసేవాడిని. నా ఖర్చులకు 'జమీన్‌రైతు' వారిచ్చే నూటపాతిక రూపాయలు. పగలు మాత్రం భోజనం చేసేవాడిని. రాత్రిళ్లు బ్రెడ్, కాఫీ. ఒక బ్రెడ్ ఇద్దరం పంచుకునేవాళ్లం. చాలామంది నా లాంటి అర్ధాకలి బ్రతుకులవారే. ఆ వాతావరణం పడలేదు. ఆ భోజనం పడలేదు. ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. గ్యాస్ట్రిక్ అల్సర్ ఎక్కువైంది. కడుపులో మంటతో విలవిల్లాడిపోయేవాడిని.

బెంగుళూరు ప్రభలో నేను వెళ్లేసరికి బుద్ధవరపు నాగరాజు న్యూస్ ఎడిటర్‌గా వుండేవారు. అంతలో విద్వాన్ విశ్వంగారు ఆంధ్రజ్యోతి నుండి వచ్చి చేరారు. కొద్దిరోజుల్లో పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు ఆంధ్రపత్రికనుండి వచ్చి చేరారు. ఆయన హోదా రెసిడెంట్ ఎడిటర్. ఉదయం 8 నుండి రాత్రి 11 గంటల వరకు కదలకుండా పనిచేసేవారు. నార్లగారి తర్వాత నాకు నచ్చిన ఎడిటర్ ఆయన. మితభాషి. ఎవరితో

ఎక్కువ మాట్లాడడు ఆయనకు నేనంటే, గండికోట వెంకటేశ్వర్లుగారంటే అభిమానం. ఒక్కొక్కసారి పనిచేసేందుకు ఇద్దరమే వుండేవారం. నాగరాజు ఒకగ్రూపును తయారుచేసి, నాగేశ్వరరావుగారికి వ్యతిరేకంగా వుండేవారు ఇబ్బంది పెట్టాలని ఆయన ప్లాన్. పండితారాధ్యుల నాగేశ్వరరావు నేను ఇద్దరం కలిసి మొత్తం పత్రిక నింపేవాళ్లం. "గండికోట వెంకటేశ్వర్లు, శార్వరి వుంటే చాలు పత్రిక వస్తుంది" అనేవారు. ఈయన కాబోయే ఎడిటర్ అని మాకు తెలుసు. తర్వాత కొంతకాలానికి కూచిమంచి సత్య సుబ్రహ్మణ్యంగారు వచ్చారు ఆయనకు దినపత్రికల్లో పనిచేసిన అనుభవం లేదు గవర్నమెంటువారి 'పంచాయతీరాజ్'లో పనిచేశారుట

నేను మెడికల్ గ్రౌండ్స్‌పైన ట్రాన్స్‌ఫర్ కోరాను. మద్రాసు ఆఫీసువారు అంగీకరించలేదు. రిజైన్‌చేసి మద్రాసు వెళ్లిపోయాను. ధూళిపూడి ఆంజనేయులు గారు మద్రాసులోనే వున్నారు. వారికి నార్ల వెంకటేశ్వరరావుగారికి మంచిస్నేహం వారు రికమెండ్ చేస్తే ఆంధ్రజ్యోతిలో ఉద్యోగం వస్తుంది వెళ్లి సంగతి చెప్పాను. వారు ఉత్తరమే రాశారో, ఫోన్లో మాట్లాడేరో తెలీదుగానీ మూడవరోజుకు 'ఆంధ్రజ్యోతి'లో చేరమని పిలుపు వచ్చింది. మళ్లీ నార్లవారి దగ్గర పనిచేసే అవకాశం వచ్చింది.

విజయవాడ వెళ్లి నార్లవారిని కలిశాను. వీక్లీలో పనిచేయమన్నారు. 1967.... అప్పటికి ఆంధ్రజ్యోతి వీక్లీ ప్రారంభించి మూడునెలలైంది పురాణం సుబ్రహ్మణ్య శర్మ ఒక్కరే చూస్తున్నారు. ఆయనకు సహాయకుడిగ్గా చేరాను. నా జీతం 250. ఆయన జీతమూ దాదాపు అంతే! ఇద్దరిలో జర్నలిజం అనుభవం నాకు ఎక్కువ. ముందుగా చేరింది తను. రైల్వే ఉద్యోగానికి సెలవు పెట్టి వచ్చారు. నార్ల అన్నారు "పురాణం సెలవుపై వచ్చారు. ఈ ఉద్యోగం నచ్చకపోతే వెళ్లిపోతారు మీరే వీక్లీ చూడాలి."

కాని పురాణంగారికి తిరిగి వెళ్లే ఆలోచన లేదు. నాతో స్పష్టంగా చెప్పారు. అయినా ఫరవాలేదు వారితో కలిసి పనిచేయడం. మంచివాడు. అప్పుడే 'ఇల్లాలిముచ్చట్లు' ప్రారంభించారు. నన్ను ఒక ఫీచర్ రాయమన్నారు. రాచకొండ విశ్వనాథశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, రంగనాయకమ్మ, నేను కలిసి ఒక గొలుసునవల ప్రారంభించాలని పథకం వేశాం. నేను 'వింతలు విడ్డూరాలు' ఫీచర్ ప్రారంభించింది ఆంధ్రజ్యోతి లోనే. ఒక నెల గడిచింది.

మురళీధర్ గవర్నర్‌పేట సెంటర్‌లో కన్పించి పలకరించాడు. మురళి నీలంరాజువెంకట శేషయ్యగారి అబ్బాయి. అతను ఫొటోగ్రాఫర్ అప్పుడు. బోళా మనిషి. నెలరోజులు నేను గాంధీనగర్ వైపు వెళ్లలేదు ప్రభ మిత్రులు కనిపించకుండా వుండాలని.

తను వెళ్లి వారి నాన్నగారికి చెప్పాడు ఆయన మద్రాసు గోయెంకాకు ఫోన్ చేశాడు. మర్నాడు నేను ఆఫీసుకు వెళ్లేసరికి నార్ల పిలిపించి, "నిన్ను బి.డి.తనకు కావాలంటున్నాడు. పోనీవెళ్లు ప్రభలోనే పనిచెయ్" అన్నారు. వెళ్లి ప్రభ ఎడిటర్‌ని కలిశాను. "మిమ్మల్ని మద్రాసుకు బదిలీ చేశారు. వెళ్లి వీక్లీలో చేరండి" అన్నాడు.

"కామరాజువద్ద పనిచేయను" అన్నాను.

"మీ ఉద్యోగానికి ఏం ప్రమాదం వుండదు. అతను మిమ్మల్ని ఏమీ చేయడు. బి.డి మిమ్మల్ని బాగా యిష్టపడుతున్నాడు. పెద్దవాణ్ణి నేను చెబుతున్నాను. వెళ్లి చేరండి. మీకు మంచి జరుగుతుంది" అన్నారు.

ఆయన రామభక్తుడు. పూజనీయుడు. ఆయనమాట మన్నించి మద్రాసు వెళ్లి వీక్లీలో తిరిగి చేరాను.

నా బదిలీల వల్ల, అభద్రత వల్ల మా పత్రిక నెలవంక ఆగిపోయింది. బెంగుళూరులో వున్న కాలంలో కొన్ని నెలలపాటు యామిజాల పద్మనాభస్వామిగారు చూచిపెట్టారు ఆయన పండితుడు, కవి. పత్రికానిర్వహణ తెలియదు. లాభనష్టాలు ఎలా వున్నా, సరైన వ్యక్తి లేనిదే పత్రిక నడవదు. పుస్తక ప్రచురణలూ అంతే. అదొక ఆర్టు. ఆర్టుతో కలిసిన వ్యాపారం. పుస్తక వ్యాపారంలో అందరూ రాణించరు. పత్రికలూ అంతే! రచయిత అయిన ప్రతివ్యక్తి జర్నలిస్టు కాలేడు పత్రికలు నడపలేడు. సినిమారచనా అంతే. పెద్ద సాహిత్యవేత్తలైనవారు సినిమా రచనకు పనికిరారు. పుస్తకాలు రాయకపోయినా సినిమా రచయితలు కావచ్చు. నాటక రచయితలు, నటులు త్వరగా సినిమారచనకు అలవాటు పడతారు. నేను సినిమారచయితను కావాలనుకున్నాను. కాలేదు. అంటే అర్హత లేక కాదు. తిరుగుళ్లు, కాకాలు చేతకాక, డైరెక్టర్లను ప్రొడ్యూసర్లను వెన్నంటి తిరగాలి. వారి అడుగులకు మడుగులొత్తాలి. వాళ్లు చెప్పిన పనులు చెప్పని పనులు అవసరాల్ని గుర్తించి చేస్తుండాలి.

అంతగా ఆత్మాభిమానం చంపుకుని సినిమా రచయిత అయి బావుకునేదేమిటి. రచయితగా ఇంతో అంతో పేరు వచ్చింది చాలు. సినీనటీనటులకున్న గ్లామర్ రచయితలకుండదు. అనేకమంది సినిమా రచయితలతో పరిచయం అయిన తర్వాత ఆ కోరికను పక్కకు తోశాను... దూరపు కొండలు నునుపు.

# మహాయాత్రలో తొలిమలుపు

సృష్టించబడే ప్రతిదానికి పురిటినొప్పులు తప్పదు. ప్రతి పరిణామానికి నొప్పులు తప్పవు. మనిషి జీవితంలో వచ్చే ప్రతి పెద్దమార్పు పరిణామగతికం అయి నపుడు, దానికి పురిటి నొప్పులు తప్పదు యోగానికి పురిటినొప్పులు ప్రారంభమైనాయి అది విచిత్రం - అది అనూహ్యం - అది దైవికం- ఇటు లౌకికజీవితానికి, ఆధ్యాత్మిక జీవితానికి ఒక వారధి లాంటిది యోగం. అయినపుడు ఆ వారధి నిర్మాణం అంత తేలిక కాదు. జీవనప్రవాహానికి లౌకిక జగత్తు ఇవతలి ఒడ్డు, అలౌకికజగత్తు అవతలి ఒడ్డు, ఈ రెంటినీ కలిపేది కలపగలిగేది యోగం. అది వారధి.

జీవితం కొందరికే వడ్డించిన విస్తరి. ఏ గౌతమబుద్ధునిలాంటి ఒకరిద్దరో రాజభోగాలతో జీవించారుతప్ప, ఆధ్యాత్మిక శిఖరాలనందుకున్న మహాత్ములంతా అనేక కష్టాలు, బాధలు పడ్డవారే. ప్రతిమనిషి జీవితం ఏడు మలుపులు తిరుగుతుంది ఏడు దశలు గడుస్తుంది. మనం గమనించంగానీ, ప్రతి పది సంవత్సరాలకు మన రూపం మారి పోతూ వుంటుంది. అందుకే చిన్నప్పటి ఫోటోలు, బాల్యంలో ఫోటోలు, యవ్వనకాలం నాటి ఫోటోలు పోల్చితే పోలికే కనిపించదు. ఎక్కువ కాలం జరిగితే మనకు తెలిసినవారినే గుర్తుపట్టలేకపోవడానికి ఈ మార్పు కారణం. లౌకికజీవితంలో మనల్ని ముంచి తేల్చే పరిణామాలు అలాగే వుంటాయి. ఒకదాని కొకటి పోలికే వుండదు ఒక్కోసారి .

ఆంధ్రజ్యోతిలో పనిచేసిన ఒక్క నెలకు జీతం కూడా తీసుకోలేదు. ప్రభ ఆఫీసువారే అడ్వాన్సు యిచ్చి మద్రాసు పంపారు.అప్పట్లో దినపత్రికలలో అపాయింట్‌మెంట్ ఆర్డరు నామమాత్రమే. ఎడిటర్ మాట శాసనం. అదే ఆర్డరు. బి.సి. కామరాజు లోపల అయిష్టం అయినా పైకి అభినందనపూర్వకంగా స్వాగతించాడు. మనుషుల్ని అర్థం చేసుకోవడం నేనూ నేర్చుకున్నాను. ఏరోటి దగ్గర ఆ పాట పాడాలి. నాగరిక ప్రపంచంలో బ్రతకాలంటే 'సినిమా' పాటకు పల్లవి అదే. కామరాజు ధోరణి కొంతమారినట్లు కనిపించింది.

వెనకటంత హరాస్‌మెంటు లేదు. తప్పనితద్దినం అనుకున్నాడేమో! తన కుట్రలు, కుతంత్రాలు నా పైన పనిచేయవని, యాజమాన్యానికి నాపై ప్రత్యేక అభిమానమని గ్రహించాడు. నేనూ అతని అవసరాలు గ్రహించి మసలుకోసాగాను. అతను చేసే వెధవపనులకు నేను అడ్డురానని నా బయటపనులు తాను నిరోధించరాదని ఒప్పందం చేసుకున్నాం. 'వెధవ' పనులు అని అనడానికి బలమైన కారణం వుంది అతను ఎంత సమర్థుడైన ఎడిటరైనా, ఎంత కష్టపడి పనిచేసినా, పరమదరిద్రుడే. జీతం చాలేది కాదు. కథలు, నవలలు రాసేవారితో రహస్యమంతనాలు జరిపి కాస్తకు కక్కుర్తిపడి వారి రచనలు వేసేవాడు. అవి చెత్త అని తెలిసీ, నోరు మెదిపేవాళ్లం కాదు. అతనికి కావలసింది అదే. వారపత్రికల్లో డబ్బు అక్రమంగా సంపాదించడం అతనితోనే ఆరంభమైంది. ఆ తర్వాత ఆ జబ్బు క్రమంగా ఇతర వారపత్రికలకూ సోకింది తెలిసీ నిరోధించలేని అశక్తత నాది. అప్పుడే పత్రిక సర్క్యులేషన్ పెరగడంకోసం కథలపోటీలు, నవలలపోటీలు ప్రారంభించాం. అక్కడ అతని సంపాదన లావైంది. తనకు సహాయం చేసినవారి రచనలు బహుమతులు పొందేవి బహుమతులు పొందిన రచయితలు, రచయిత్రులు అందరూ అలా చేశారని అనను. కొందరు ఘంటాపథంగా తమ రచనకు బహుమతి వస్తుందని, ఆ ఏర్పాట్లు ముందే చేసుకున్నామని చెప్పి మరీ బహుమతులు సంపాదించేవారు. అది కామరాజుపథకం! నాలాంటి వాడు నోరు విప్పలేని అశక్తత.

తిరుపతి వెళ్లివచ్చినప్పటినుండి నాలో దైవభక్తి ఎక్కువైంది నిత్యం సుప్రభాత పారాయణం, లలితా సహస్రనామాలు చదవడం అలవాటైంది. శనివారాలు ఏకభుక్తం. ఎంత భక్తి అలవడినా ఆఫీసులో అలజడి కొనసాగుతూనే వుంది. మా బాస్ కామరాజు వేంకటేశ్వరస్వామి భక్తుడే. ఒక భక్తుడు మరొక భక్తుడికి అపకారం తలపెట్టి, అవమానం చేస్తూ, నానాబాధలకు గురిచేస్తుంటే ఆ శ్రీనివాసుడు ఎందుకు ఉపేక్షించాలి? అతనికి మాత్రం అనుకూలంగా ప్రవర్తించే పక్షపాతం ఆ దేవుడికి ఎందుకు? కష్టాలు ఎక్కువైనపుడే దేవుడిపైన భక్తి ఎలా పెరుగుతుందో ఆ కష్టాలు ఎంతకీ తీరనప్పుడు, ఆ దేవుడిపైన విరక్తి కలుగుతుంది. కొందరి కోర్కెలు తీర్చి, మరికొందరి కోర్కెలు తిరస్కరించడం దేవుడికి న్యాయమా? సబబా? భగవంతునిపై విశ్వాసం సన్నగిలసాగింది. మన బాధలు, మనం అనుభవించి తీరాలన్నప్పుడు దేవుడితో పనేమిటి? ఆ దేవుడు మనకేమీ ఒరగబెట్టనప్పుడు, అతనికోసం పూజలు అవీ చేసి టైం వృథా చేసుకోవడం ఎందుకు? మన కర్మ మనం అనుభవించాలి! అయితే దేవుడితో పనేలేదు.

నా మొండితనానికి పరీక్ష భగవంతుడు పెట్టాడని అనటం లేదు... మా నాన్నగారు గురుపరంపరలోనివారు. ఆయనకు చాలామంది శిష్యులున్నారు. ఆయన

గురువుగా చలామణి అవుతున్నారు. కాళీ ఉపాసకుడు. పిలిస్తే చాలు 'కాళీ' ప్రత్యక్షం అవుతుంది. నవరాత్రులు చాలాదీక్షగా చేస్తారు. యామినీదేవికి బాగా జబ్బు చేసింది. డా॥బాలసుందరరావుగారు మా ఫామిలీ డాక్టర్. మద్రాసులో పత్రికలవారికి, రచయితలకు, సినిమావాళ్లలో కొందరికి ఆయన డాక్టరు జర్నలిస్టుల దగ్గర ఆయన ఫీజు తీసుకునేవాడు కాదు. అసలు ఏ పేషెంట్‌ను ఆయన డిమాండ్ చేయడు. ఇస్తే పుచ్చుకునేవాడు అదొక పద్ధతి గుమ్మడి వెంకటేశ్వరరావు, జమున, శివలెంక శంభుప్రసాద్, బి.ఎన్.రెడ్డి . ఇలా కొందరు పెద్దలు నెలకు ఇంతని యిచ్చేవారు వారిని తీసుకువెళ్లి నాశ్రీమతిని చూపించాను ఆయన తన కారులో నన్ను క్లినిక్‌కు తీసుకువెళ్లి చెప్పాడు. "సారీ శార్వరీ, ఇంత చిన్న వయస్సులో నీకు రాకూడని కష్టం వస్తుంది ఆ అమ్మాయి బ్రతకదు. పెద్దవాళ్లను పిలిపించు. ఆ అమ్మాయి పేరెంట్స్‌కు కబురుచెయ్, చివరిసారిగా చూచి వెడతారు" చాలా స్పష్టంగాచెప్పారు కళ్లనీరు తిరిగింది. ఏం చేయడం.

"మీరు వైద్యం చేస్తే తగ్గుతుందని విశ్వంగారు చెప్పారు" అన్నాను

"నీకు అబద్ధం చెప్పను. నేను డబ్బుమనిషిని కాను. మాస్టర్‌పై ప్రమాణం చేసి చెబుతున్నాన మెడిసిన్స్ ఆమెను రక్షించలేవు. ఏదైనా ఒక మిరకిల్ జరిగి ఆమె బ్రతికితే సంతోషమే" అన్నారు.

మా నాన్నగారు వచ్చారు, అమ్మ రాలేదు. రాదని తెలుసు. పదిరోజులున్నారు "నేను వుండి చేయగలిగింది లేదు, వెళతాను" అని తెనాలి వెళ్లిపోయారు.

మామగారికి తెలియపరచలేదు. వారు పెద్దవారు. రాలేరు.

ఆఫీసుకు వెళుతున్నాను వస్తున్నాను. కాని మనస్సులో దిగులు.

భవిష్యత్తు భయంకరంగా కనిపిస్తోంది. పిల్లల్ని 'తల్లిలేని పిల్లలు' గా ఊహించలేక ఏడ్చేవాడిని.

ఆఫీసులో దిగులుగా కూర్చుని వుండగా, పక్కగదిలో 'దినమణి'పత్రికలో పని చేస్తున్న ఒకతను వచ్చి, 'వణక్కం' అని పలకరించాడు.

"ఎన్న విషయం?" అడిగాను.

జేబులోంచి ఒక వార్త తీసి యిచ్చాడు. ఒక ఫోటో చూపించి, "ఈయన నారాయణ బాబా? షిరిడీబాబా శిష్యుడు. వెరీ పవర్‌ఫుల్. మైలాపూర్, పొట్టిశ్రీరాములు మందిరంలో వున్నారు. ఆయన ఎలాంటి జబ్బులనైనా నయంచేస్తాడుట. షిరిడీబాబా వృద్ధాప్యంలో ఈయన షిరిడీబాబా దగ్గర వున్నారుట.

వెంటనే మాటర్ రాసి కంపోజ్‌కి పంపాను. జి.కృష్ణ అప్పుడు డెయిలీ ఇన్‌చార్జి.

ఆ వార్త వేసిన రోజునే కృష్ణగారు బాబా దర్శనానికి వెళ్లారు. ఆయన గాలిలోంచి ఒక చిన్న కృష్ణుని విగ్రహం సృష్టించి ఆయనకు బహూకరించారుట. వెళ్లి కృష్ణగారిని అడిగాను.

"ఆ బాబా మహత్తు కలవాడేనా! మీరు వెళ్లారుట"

"మహత్తు వుందో లేదో వెళ్లివచ్చాను, ఆ విగ్రహం వుండదు మాయమై పోతుంది!"

"ఎలా?"

"ఎలానా? ఎక్కడ నుండి వచ్చిందో, అక్కడికి అలాగే వెళ్లిపోతుంది."

దినమణి మిత్రుడికి నా విషయం చెప్పి, అడగమన్నాను.

అతను పర్మిషన్ తీసుకుని వచ్చి, చెప్పాడు.

మర్నాడు శ్రీమతి యామినీదేవిని తీసుకుని వెళ్లాను. ఆమె బాగా నీరసించివుంది టాక్సీలో వెళ్లాం

మేము వెళ్లేసరికి ఎవరూ భక్తులు లేరు.

బాబా లోపలికి పిలిపించారు.

వెళ్లి నమస్కారం చేసి కూర్చున్నాం.

"ఆలస్యంగా వచ్చారు ఈరోజు పూజ అయిపోయింది" అన్నారు

నాకు నిరాశ కలిగింది.

భగవంతుడు బాబా రూపంలోనైనా కరుణిస్తాడని ఆశించాను. అదీ కుదరదా!

"ఉదయం ఆరుగంటలకే రావాలని మణియన్ చెప్పలేదు" అన్నాను దిగులుగా!

"నీవు తెలుగువాడివా?" అవునన్నాను తలూపి.

"స్వగ్రామం"

"తెనాలి"

"ఎక్కడ ఇల్లు?" చెప్పాను.

"పార్వతీశంగారు తెలుసా?" అడిగారాయన.

"వారు మా నాన్నగారు."

ఆయన ప్రసన్నంగా నా భార్యవైపు చూచారు. పక్కనే పళ్లెంలో వున్న విభూతి చేతిలోకి తీసుకుని ఆమెకు బొట్టు పెట్టారు. రెండు విభూతి పొట్లాలు యిచ్చి,

"తగ్గిపోతుంది... ఫరవాలేదు, ప్రమాదం లేదు" అన్నారు.

నూటపదహార్లు దక్షిణ యిమ్మని మణియన్ అడిగాడు. నా దగ్గర డబ్బులేదు. బాబాగారికి చెప్పాను.

"ఫరవాలేదు వెళ్లిరండి నాన్నగారిని నేను అడిగానని చెప్పు" అని ఆశీర్వదించారు మమ్మల్ని

ఆఫీసులో మణియన్ కలిసి"బాబాగారు కరుణించారు మిమ్మల్ని డబ్బు యివ్వనవసరం లేదని, వీక్లీలో ఒక ఆర్టికల్ రాయమని చెప్పారు" అన్నారు.

నారాయణబాబా ఫోటోతో ఒక వ్యాసం రాసి ప్రచురించాను

సాయి విభూతి అద్భుతంగా పనిచేసింది శ్రీమతి ఆరోగ్యం క్రమంగా మెరుగైంది ఫిట్స్ ఆగిపోయాయి ఆమెలో కొత్తకళ, కొత్తజీవం రాసాగాయి మృత్యువు నీడ తొలగిపోయింది బాబాపై మాకు భక్తి కుదురుకున్నది. క్రమంగా సుప్రభాతం, లలితా సహస్రనామాలు దూరమైనాయి ఆ పరిణామం అప్రయత్నంగా, విచిత్రంగా జరిగింది నాలో కాస్త హుషారు గుర్తించి, డాక్టరుగారు అడిగారు, "నీ శ్రీమతికి ఎలావుంది?" అని

"బెటర్! డాక్టరుగారూ" అని జరిగింది చెప్పాను.

"నీకు బాబాలపైన, మహత్ములపైన నమ్మకం వుందా?"

"ఇదివరకు లేదు ఇప్పుడు ఏర్పడింది. ప్రత్యక్ష నిదర్శనం ఆ బాబా... ఇటు నాభార్యకు డాక్టర్లు చేయలేని పని బాబా చేశారు మందులు చేయని ఉపకారం ఆయన విబూది చేసింది

అంతలో శ్రీమతి నెలతప్పింది. అప్పటికే మాకు నలుగురు పిల్లలు, వసంతకుమార్, శ్యాంసుందర్, వెంకట రమణ, పద్మప్రియ. ఇంక పిల్లలు కావాలని, కలగాలని మేం కోరలేదు. అప్పట్లో పిల్లలు కలగడం అంటే భగవంతుని ప్రసాదమే. దాన్ని నిరోధించడం పాపం! అప్పటికి ఫామిలీప్లానింగ్ అంతగా లేదు. వేసక్టమి, ట్యూబెక్టమీలు సామాన్యజనానికి అందుబాటులో లేవు. అబార్షన్ కూడా నేరమే ఇందిరాగాంధీ ప్రధాని అయిన తర్వాత వీటికి చట్టం వచ్చింది. అప్పుడు లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని.

డాక్టర్ బాలసుందర రావు గారికి చెప్పాను, నా శ్రీమతి కారీయింగ్ అని.

"ఆ అమ్మాయికి మళ్లీ కడుపా! నీకు బుద్ధివుందా? ఆమె ఆరోగ్యమే అంతంత మాత్రంగా వుంది. మళ్లీ ప్రసవాన్ని తట్టుకోలేదు శార్వరీ" అని చీవాట్లు పెట్టారు.

"ఒకసారి ఇంటికి వెళదాం రండి" అని పిలిచాను. ఆయన వచ్చారు ఆమెను చూచి ఆశ్చర్యపోయారు. ఎంత మార్పు.

"వండర్‌ఫుల్... నీ పిల్లలు అదృష్టవంతులు శర్మా! ఆమెకు గండం గడిచింది. ఇంక ఫరవాలేదు, ఏదో ఆధ్యాత్మిక శక్తి ఆమెకు ప్రాణదానం చేసిందయ్యా!" అని తృప్తిపడ్డారు. బలానికి ఏవో టానిక్కులు యిచ్చారు. ప్రిస్క్రిప్షన్ రాయడం లేదు. తన

దగ్గర వున్న టానిక్‌లే యిచ్చేవారు షాపులో నేనెప్పుడూ మందులు కొనలేదు ఆయనే యిచ్చేవారు షాపులో కొనవలసి వచ్చినా తనే డబ్బులిచ్చి తెప్పించి మరీ యిచ్చేవారు. బాలసుందరరావుగారు తనకిష్టమైనవారికి ప్రాణం పెట్టే వ్యక్తి. నేనంటే ప్రత్యేకమైన అభిమానానికి కారణం.. తెన్నేటి హేమలత, ఆయన కజిన్.

లత ప్రభకు 'ఊహాగానం' రాసేవారు. అలా మా పరిచయం విజయవాడలో మొదలైంది. సినిమాలకు స్క్రిప్టు రాసే పనిబడి మద్రాసు వచ్చినప్పుడు డాక్టర్ గారింట దిగేవారు ఆమెతో వున్న పరిచయం డాక్టర్‌గారికి దగ్గర చేసింది. డాక్టర్‌గారికి ఒకే ఒక్క కూతురు జిజ్జీ. అసలు పేరు జలంధర. ఆ అమ్మాయి ప్రేమగా నన్ను 'అన్నయ్యగారూ' అని పిలిచేది. అలాగా ఆ ఇంట అనురాగాన్ని, ఆత్మీయతను పంచుకున్నాను. సాయంత్రంవేళల్లో వెళ్లి కూర్చుని డాక్టర్‌గారితో ఖాతాఖానీ వేయడం అలవాటైంది.

సినిమా వాళ్లు వస్తుండేవారు. డైరెక్టరు బి ఎన్. రెడ్డిగారితో పరిచయం చాలా ఆత్మీయంగా మారింది. కమలాకర కామేశ్వరరావు, ముదిగొండ లింగమూర్తి లాంటి పెద్దలతో స్నేహం అయింది. మల్లాది రామకృష్ణశాస్త్రిగారితో నా సాన్నిహిత్యం మరీ ఎక్కువ. 'నెలవంక' పత్రికకు చాలా కథలు, 'కృష్ణాతీరం' నవల రాసిచ్చారు. అలాగే 'ప్రభ' లో వారి కథలకోసం వారింటికి వెళుతుండేవాడిని. అప్పుడు వేరే వ్యాపకం లేదు. కొడవటిగంటి కుటుంబరావు, ధనికొండ సాయంత్రం వేళల్లో అక్కడకు వచ్చేవారు పానగల్ పార్కు రచయితలకు, సినీ కళాకారులకు సెంటర్. మద్రాసులో పాండీబజారుతో పానగల్‌పార్క్‌తో అనుబంధం లేని రచయితలు, కళాకారులు వుండరంటే అతిశయోక్తికాదు. సినిమానిర్మాణ సంస్థలు చాలావరకు టి నగర్‌లోనే వుండేవి. పెద్దవాళ్లంతా టి.నగర్‌లో వుండేవారు. చిన్నాచితక ఆర్టిస్టులు, టెక్నీషియన్లు పాతమాంబళంలో, కోడంబాకంలో వుండేవారు. దీనికి, దానికి రైలుపట్టాలే హద్దులు. పెద్ద, చిన్న తేడాలకు ఆ రైలుపట్టాలే సాక్ష్యం. నేను ఉండేది పాతమాంబళం. తిరిగేది టి.నగర్. ఉద్యోగం మౌంట్‌రోడ్‌లో.

మన యాక్టివిటీస్ గమ్మత్తుగా మారిపోతుంటాయి. బదిలీలవల్ల,ఉద్యోగంలోని ఒడుదుడుకులవల్ల మా 'నెలవంక' పత్రిక ఎప్పుడో ఆగిపోయింది. ఈసారి ఏదైనా రాయాలనిపించింది. ఆమంచర్ల శేషగిరిరావు, సినిమా డైరెక్టరుతో స్నేహం ఏర్పడ్డది. ఆయన అవకాశాలకోసం ఎదురుచూస్తున్నారు. పి.పుల్లయ్యగారి దగ్గర పనిచేసినవాడు. ఎన్.టి.ఆర్‌తో ఒక పిక్చర్ చేశారు. అయినా అవకాశాలు రావడం లేదు. వారున్న ఇంటి పక్కపోర్షన్‌లో హీరో కాంతారావు వుండేవారు. పక్కనే మరో ఇంటిలో బాలయ్య వుండేవారు. వీరు ముగ్గురు నాకు మంచి స్నేహితులు. స్వతః మంచివారు.

వీరంతా సంసారపక్షంగా వుండేవారు. కాంతారావు జానపద సినిమాల హీరో కదా! నటి కాంచన సొంతంగా సినిమా తీయాలని ప్లాన్ చేసింది. ఆమంచర్ల దర్శకుడు వారికి నేను కథరాసి పెట్టాలి. అలాగే కత్తుల గోపాలకృష్ణ మరొక ప్రొడ్యూసరు, నటుడు కూడా. అతనికోసం ఒక కథ, డైలాగులు రాశాను. కె ఎల్ చౌదరి అనే మరొక ప్రొడ్యూసర్ అతనికి స్క్రిప్టు రాశాను. కొంత షూటింగు చేశారు. కె.వి ఆర్ చౌదరి అని మరొక ప్రొడ్యూసర్. నలుగురు ప్రొడ్యూసర్లకు కథలు, మాటలు రాసిపెట్టినా ఒక్కటీ పూర్తికాకపోవడం దురదృష్టం ఆమంచర్ల గారికి కన్నడ సినిమాలు దర్శకత్వం వహించే అవకాశం వచ్చింది. తరచు బెంగుళూరువెళ్లి వస్తుండేవారు. ఆయనకోసం వచ్చే కన్నడ నిర్మాతలతో, నటీనటులతో పరిచయం ఏర్పడ్డది తక్కువడబ్బు యిస్తారు కన్నడంలో. నేను కథలు రాసియిచ్చాను.. కన్నడ సినిమాలకు రాస్తే తెలుగులో గుర్తింపు ఎలా వస్తుంది. రాదు. తర్వాత పి.పుల్లయ్యగారు వచ్చి ఒక సినిమాకు కథ రాయమని అడిగారు. రోజూ అయిదుగంటలకు ఆఫీసుకు కారువచ్చేది. ఓ నెల రోజులు వారికి ఓ కథరాసి పెట్టాను. అది మాత్రం వెంటనే పిక్చర్‌గా వచ్చింది

• శ్రీబి.ఎన్.రెడ్డి, ఎం.ఎస్.రెడ్డిగార్లతో బాగా పరిచయం. విజయనిర్మలకు కొన్ని కథలు వినిపించడం జరిగింది. అప్పుడే హీరో కృష్ణతో పరిచయం. నా కథలు ఆమెకు నచ్చలేదు. సినిమావాళ్లతో ఒక బాధ వుండేది మనం కష్టపడి కథలను తయారు చేసియిస్తే వారు వినేవారు. చదివేపాటి ఓపిక వుండదు. కొందరు చదివేవారు. చదివి, వినీ పెదవి విరిచేవారు. అలా ప్రతినిర్మాత, దర్శకుడు అనేక కథలు విని, రచయితను పంపిస్తారు. తర్వాత అదేకథ చిన్న చిన్న మార్పులతో సినిమాగా వస్తుంది. ఆ ప్రొడ్యూసర్‌గారి పెళ్లాం పేరుతోనో, కూతురి పేరుతోనే 'కథ' తెర కెక్కుతుంది. ఎంత విసిగిపోయినా సినిమా రచన చేయాలన్న కుతి తీరింది కాదు. భగవంతుడు జీవితాల్ని ఎలా మలుపు తిప్పుతాడో చెప్పలేం. సినిమారచయిత కాదగ్గలక్షణాలు నా దగ్గర బొత్తిగా లేవని తెలుసుకున్నాను. అదృష్టం లేదు.

ఆంధ్రప్రభ ఆఫీసులో కొన్ని మార్పులు వచ్చాయి. లోగడ ఇద్దరు ముగ్గురితో నడిచే పత్రికలో అయిదారుగురు పనిచేస్తున్నారు. ఎడిటర్‌గా విద్వాన్ విశ్వంగారు వచ్చారు. బి.సి.కామరాజు, నేను, మధుమూర్తి, పిలకాగణపతిశాస్త్రి, వెంకట్ ... పని తక్కువ, మనుషులు ఎక్కువ.

1968లో మాకొక పాప కలిగింది. యామినీదేవి ఆరోగ్యం బాగైంది. బాబాగారి విబూది మహిమవల్ల. ఆ పాపపేరు భానుప్రియ. మా పద్మప్రియకన్న నాలుగు సంవత్సరాలు

చిన్న. చాలా అందమైన పిల్ల. భగవంతుని లీలలు మనిషికి అర్ధంకావు. పిల్లా పాపలతో సంతోషంగా జీవితం సాగుతున్న సమయంలో ఒక అపశృతి... వీణలో కడ తీగ టప్పున తెగింది.

మా ఆఫీసులో పిలకా గణపతి శాస్త్రిగారు చేరారు. మంచికవి, కథకుడు, నవలాకారుడు ఆయన రాసిన 'విశాలనేత్రాలు' ఆదుర్తి సుబ్బారావు సినిమాగా తీయాలని ప్రయత్నిస్తున్న రోజులు ఈయన సినిమాలకు పాటలు రాశారు ఆయనకు నాకు మంచిస్నేహం. ఇద్దరం రచయితలమే ఆయనకు శ్రీ అరవిందయోగి అంటే అభిమానం ఆయన ఆగస్టు 15న అరవిందాశ్రమం వెళ్లి, శ్రీ అరవిందుల సమాధి దర్శించి ప్రార్థనల్లో పాల్గొంటారు.

నన్ను తనతో, తనకు తోడుగా రమ్మని ఆహ్వానించాడు. ఇద్దరం ఆఫీసు అయిన తర్వాత పారిస్‌కార్నరుకు వెళ్లాం. బస్ టికెట్లు రిజర్వ్ చేసుకోడానికి. తీరా వెళ్లితే ఒక్క టికెట్టే దొరికింది. బ్యాడ్‌లక్. వారిని ఆ టికెట్ తీసుకోమని, మరోసారి కలిసి వెడదామని అన్నాను. విధివిలాసం. అలా ఆటంకం ఎందుకు ఏర్పడాలి?! అది ఆగస్టు 14, 1969. చీకటిపడేవేళకు ఇంటికి చేరాను. మనస్సులో ఏదో దిగులు ఎందుకో అర్థంకాదు. మేమున్న మేడ ముందర త్రివర్ణ పతాకలు, తోరణాలు కడుతున్నారు. పిల్లలు బాల్కనీలో నిలబడి ఆనందంగా చూస్తున్నారు. నేను, శ్రీమతి భోజనం చేస్తున్నాం.. భానుప్రియ పిట్టగోడపై వంగి క్రిందికి చూస్తూ ముందుకు పడిపోయింది. పిల్లలు గగ్గోలుగా అరిచారు... భాను క్రిందపడిపోయిందని. మేం లేచి క్రిందికి పరుగెత్తాం. అప్పటికే పాప రక్తపు మడుగులో స్పృహ తప్పి పడి వుంది. జనం పోగైనారు. క్రింద మరొక పిట్టగోడ లాంటిది వుంది. దానిపైన పొట్ట తగిలినట్లుంది. రక్తం కక్కుతోంది. శివాలయం దగ్గర వున్న ఒక క్లినిక్‌కు తీసుకు వెళ్లాం. డాక్టరుచూచి రక్తం ఆగడానికి ఇంజక్షన్ యిచ్చి, జనరల్ హాస్పటల్‌కి తీసుకుపొండి, యాక్సిడెంట్ కేసు, మేం చేయకూడదు అన్నాడు.

మద్రాసులో మేం వున్న ఇంటికి ఎదురుగానే మా తిరుపతి తోడల్లుడు గాయత్రీప్రసాద్‌గారి కుటుంబం వుంటోంది. ఆయన బి ఇ. చదవడంకోసం వచ్చారు. తను క్లినిక్‌కు వచ్చాడు. అందరం కలిసి సెంట్రల్‌స్టేషన్ ఎదురుగా వున్న జనరల్ ఆస్పత్రికి టాక్సీలో తీసుకువెళ్లాం. రాత్రి పది అయింది. యాక్సిడెంట్‌కేసు, యమర్జెన్సీ. అయినా డాక్టర్లు పట్టించుకోలేదు. ఎలాగో అడ్మిట్ చేయగలిగాం. రాత్రి పన్నెండు గంటలకు ఒక చీటి యిచ్చి 'ఈ మందులు అర్జంటుగా కావాలి. ఆస్పత్రిలో స్టాకు లేదు' అన్నారు. జనరల్ ఆస్పత్రిలో లైఫ్‌సేవింగ్ డ్రగ్స్ లేవట. టాక్సీ చేసుకుని మౌంట్‌రోడ్‌కు వెళ్లాను. అక్కడ

దొరకలేదు పూనమిల్లీ హైరోడ్‌లో దొరకవచ్చునంటే అక్కడకు వెళ్లి లేవనిపించుకుని వచ్చాం. ఉదయం సూర్యోదయవేళకు ముందే పాప అస్తమించింది నేను, గాయత్రీ ప్రసాద్‌గారు తెల్లవారుఝామున ఇంటికి వెళ్ళి, తిరిగి వచ్చేలోగా పాప శవమైంది. శ్రీమతి, మరదలు ఏడుస్తూ కూర్చున్నారు. ఆ శవాన్ని విడిపించి తేవడానికి అయిదుగంటలు పట్టింది. మా ఏరియా పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు సంతకం కావాలన్నారు. ఆగస్టు 15 పోలీసు స్టేషనులో ఎవరూ దొరకలేదు. చివరకు12గంటల ప్రాంతంలో శవాన్నియిచ్చారు. అంబ్యులెన్స్‌లో ఇంటికి తీసుకు వచ్చాం శ్రీమతి ఏడుపు పట్టపగ్గాల్లేకుండా వుంది. ఆమె జీవితంలో అంతగా రోదించడం అదే. అసలామె కంట కన్నీరొలకదు. చాలా గంభీరంగా వుండగలదు. ఈ సంఘటన వేరు, కడుపు శోకం. తన రక్తం పంచుకు పుట్టిన బిడ్డ, తన ప్రేగు తెంచుకుపుట్టిన శిశువు. ప్రాణంలో ప్రాణం, నవమాసాలు మోసిన ప్రేమ.. అల్లారుముద్దుగా పెంచుకున్నది. తన కళ్లముందే చనిపోతే, తన చేతుల్లో శవమై మిగిలితే! ఎవరిదీ పాపం! ఎవరిదా శాపం! కన్న తల్లిదండ్రులదా, కరుణించి ప్రసాదించిన భగవంతుడే కాటు వేయడమా?

పాప శవాన్ని నా చేతులతో ఎత్తుకుని మేడపైకి వెళ్లాను. వెంట శోక సముద్రం ఉప్పొంగినట్లు తను. పాప శవాన్ని అక్కడ నేలమీదపెట్టిన మరుక్షణంలో నేను స్పృహ తప్పి పడిపోయాను. సావిత్రి మృత్యువును వెన్నంటి వెళ్లినట్లు, నేను మృత్యువును తరిమి వేయడానికి ప్రయత్నించాను పోరాడాను. ఓడిపోయాను నాలుగు గంటలసేపు మా పోరాటం సాగింది. సాయంత్రం నాలుగు గంటలకు నాకు స్పృహ వచ్చింది కళ్లు విప్పాను ఇంటినిండా జనం. ఒక వందమంది వరకు చేరారు. కర్తవ్యం ముందున్నది.

గాయత్రీప్రసాద్, క్రిందివాటాలో వున్న పెంచలయ్య రుద్రభూమికి వెళ్లి ఏర్పాట్లు చేసి వచ్చారు చీకటి పడేముందే అంతిమయాత్ర సాగింది. నా చేతుల్లో పాప శవం. కాళ్లలో నిస్సత్తువ. నడవలేని స్థితి. ఎవరడిగినా శవాన్ని యివ్వలేదు. నేనే మోసుకువెళ్లాను. గంభీరంగా మాతోపాటు నూరు, నూటయాభైమంది శ్మశానం వరకు వచ్చారు. అక్కడే ఒకచిత్రం. అంత దెబ్బతగిలి, అంత రక్తంపోయిన పాప, ప్రాణం పోయిన తర్వాత ఒక్కసారి బంగారురంగులోకి మారింది. శరీరంపైన ఒక్క గాయంగాని, మరక గాని లేవు. ఒక తేజస్వినిలా మెరిసిపోయింది.

అరవిందాశ్రమానికి వెళ్లకుండా విధిఆపింది. భగవంతుడు ముందు హెచ్చరిక గానే నాకు టికెట్ యివ్వలేదు. ఎందరు దేవుళ్లకో మ్రొక్కాను. ఎందరు స్వాముల్నో అర్థించాను. ఎవరూ నా మొర ఆలకించలేదు. మా ఇంట వెలిగిన ఒకదీపం ఆరిపోయింది.

అది మృత్యువుతో నా రెండవ సమాగమం. ఒకసారి మృత్యువును దర్శించినవారికి మృత్యుభయం ఉండదు. ఆనాడు నాలుగు గంటలు మృత్యుపోరాటంలో అలసిపోయాను. మనస్సు శూన్యమైంది కళ్లనీరు ఎండిపోయింది.

పట్టణాలలో కొంత సానుభూతి వుంటుంది కాని నగరాలలో ఎవరు ఎవరినీ పట్టించుకోరు పక్క ఇంట ఎవరైనా చచ్చినా తొంగిచూడరు. అలాంటిది ఆ పాప పోయినప్పుడు అన్ని వందలమంది వెంటరావడం ఆశ్చర్యం. వీరంతా ఎలా ఆత్మీయులు, ఎవరి ఆత్మీయులు ఒక మహాగురువు నిర్వాణానికి తరలి వచ్చిన శిష్యగణం అనిపించింది. ఇంటికి తిరిగివచ్చాం. అది ఇల్లులా అనిపించలేదు. ఒక దేవత అంతర్ధానమైనపుడు దిగులుగా వున్న శూన్య దేవాలయం అనిపించింది గాలిసైతం భోరున విలపించింది ఆత్మీయుల గుండెల్లో 'ప్రాణం' కొట్టాడింది

అటువంటి సమయంలోనే భగవంతుని అస్తిత్వం ఒక ప్రశ్నార్థకం అవుతుంది అసలు దేవుడనే వాడు వున్నాడా అనే అనుమానం కలుగుతుంది. ఉంటే, మన మొరెందుకు ఆలకించడు? మనం చేసిన పూజలు అన్నీ వృధా అయినాయా? బాబాలు, భగవాన్లు ఎందుకు సాయపడరు? మన కర్మ మనం అనుభవించేట్లయితే వీరిని సేవించడం ఎందుకు? ఇంతకాలం మహాత్ములనీ, అవతార పురుషులనీ నమ్మిన వారిపై మనస్సు తిరగబడసాగింది. దేవాలయాలంటే విరక్తి కలిగింది వాటిల్లో దేవుళ్లే లేరు ఉన్నవి రాతి విగ్రహాలు. దేవుడు, దైవభక్తి అన్నవి లేనేలేవు అలా మొండితనం ప్రబలింది. పూజలు, సుప్రభాతాలు బంద్, ఇంట్లో వున్న దేవుడి పటాలను తీసివేశాను.

ఈ సంఘటన ఒక్కటే నా జీవితాన్ని మలుపు తిప్పింది. మా కుటుంబానికి మార్గజ్యోతి అయింది. దాని పూర్వాపరాలు కొంచెం చెప్పుకుందాం!

ఒక చిన్న పాప, భానుప్రియ భౌతికం విశ్రమించింది. ఒక చిన్న వెలుగు భానోదయంతో ప్రభవించింది. ఆ పాప చనిపోయిందని, మృతి చెందిందని ఇప్పటికీ నేను అంగీకరించను. అది నిర్వాణం, భానుప్రియ చిరంజీవి. ఆమె పూర్వజన్మలో ఒక మహర్షి... నాకు గురువు... ఆ కథ చెబుతాను. అంతకు ముందుగా చెప్పుకోవలసిన సంఘటన ఒకటి వుంది.

మాంబళంలో మా ఇంటికి సమీపంలోనే శివాలయం వుంది. శంకరమఠం వుంది. శివాలయానికి భక్తులు రోజూ వస్తుంటారు. తమిళనాడులో దేవాలయాలు ప్రసిద్ధాలు. గుడిచుట్టూ విశాలమైన ఆవరణలుంటాయి. పిల్లలు ఆడుకోడానికి అనువుగా వుంటుంది. పెద్దలు ఉదయం, సాయంత్రం వచ్చి విశ్రాంతి తీసుకోవచ్చు. అక్కడి శివాలయం కూడా అలాంటిదే. దాని ప్రత్యేకత, శివాలయానికి అనుబంధంగా పార్వతీ

దేవి ఆలయం వుంటుంది. నా శ్రీమతికి గుడికి వెళ్లడం అలవాటు. త్యాగరాయనగర్‌లోని అగస్తీశ్వరాలయం, శివ, విష్ణు ఆలయం మైలాపూర్‌లోని కపాలీశ్వరాలయం బాగా ప్రసిద్ధాలు దేవాలయ దర్శనం వల్ల పుణ్యం మాట ఎలా వున్నా మనస్సు ప్రశాంతమవుతుంది. రెండురోజుల క్రితం అలవాటుగా యామిని ఇద్దరు పిల్లల్ని తీసుకుని గుడికి వెళ్లింది. ఒకరు మా పాప భానుప్రియ, రెండవవాడు మా పక్కింటి వారి అబ్బాయి. వాళ్ల బాబును చంకనెత్తుకుని తన పాపను నడిపిస్తూ వెళ్లింది. శివదర్శనం చేసుకుని అమ్మవారి గుడికి వెళ్లింది. గర్భగుడిలో నుండి పూజారి వచ్చి అమ్మవారి కుంకుమ యిచ్చి, తీర్థం యిచ్చాడు. లోపలికి తొంగి చూడగా, ఎప్పటిలాకాక, అమ్మవారి విగ్రహం తళతళ ధగధగ మెరిసిపోతూ, సజీవంగా వున్నట్లు తోచింది. దేవి ప్రత్యక్షమైన అనుభూతి కలిగి ఒడలు పులకరించింది. పూజారి తీర్థం యిస్తూ, "మీ పాపా?" అని అడిగాడు.

"ఈ పాప మా పాప. ఈ బాబు పక్కింటి వారబ్బాయి "

"మీ పాపా" అని పూజారి నవ్వుతూ తల నిమిరాడు అంతలో లోపల అమ్మవారి విగ్రహంలో నుండి ఇలాంటి పాప నడచి వచ్చింది. తన దగ్గరగా వచ్చి నిలబడింది ఆ పాప తిరిగి పార్వతీ దేవి రూపం దాల్చింది ఈమె భక్తితో నమస్కరించింది.

"నేనొకటి అడుగుతాను యిస్తావా!" అన్నది పార్వతీదేవి.

దేవి తనను అడగడ మేమిటి? తాను అమ్మవారికి ఇవ్వడం ఏమిటి? దేవతలు మనను అనుగ్రహిస్తారు. అమ్మవారు అడగడంతో ముచ్చెమట్లు పోశాయి, నోటమాట రాలేదు.

"నీ పాపను నాకిస్తావా? నాకు కావాలి"

అంటూ పాపవైపు లాలనగా చూచింది పార్వతీదేవి.

తల్లి గుండె గుబగుబ మన్నది.

"పోనీ నీ పాపను ఇవ్వద్దులే. నీ దగ్గరే వుండనీ, నీ భర్తను నాకివ్వు"

ఏమిటీ విపరీతం!... పాప లేక భర్తా?

"నీ పాపనైనా యివ్వు, నీ భర్తనైనా యివ్వు, ఎవరో ఒకరు కావాలి నాకు, ఎవరిని యిస్తావో నీ యిష్టం."

అది దేవి కోరిక కాదు... ఆజ్ఞ! ఏ ఇల్లాలైనా ఏం సమాధానం చెప్పగలదు? ఆమె మాట్లాడలేదు. అలాగే స్థాణువులా నిలబడిపోయింది. కొన్ని క్షణాలకు దేవి వెనక్కుపోయి విగ్రహంలో లీనమైంది. శ్రీమతి బిక్కుబిక్కుమంటూ, భయంభయంగా ఇంటికి చేరింది. ఆ జరిగింది నాకు చెప్పలేదు. తను మరచిపోలేదు. రెండు రోజుల తర్వాత ఈ సంఘటన జరిగింది.

ఎంత అందమైన ఊహ! ఎన్ని రంగులు .. ఎన్ని హంగులు, ఎన్ని కలలు... కలపోతలు తలపోతలు.. చీకట్లను చీల్చివేయగల కనిపించని వెలుగు, చలికి వణికే కిరణాలు వెచ్చవెచ్చని ఉదయం. ఎంతసేపు? కొంతసేపే తర్వాత ఎండ మాడ్చివేస్తుంది. రంగులు కరిగి వెలుతురవుతుంది తాపానికి ఆపసోపాలు తప్పవు రంగులు కరిగిపోయినట్లే కలలు కరిగిపోయి, భ్రమలు వీగిపోతాయి. జీవనసంధ్యలో వాడి, వేడి తగ్గుతుంది. గతకాలపు ఆనందాలు, సుఖాలు వెలిసిపోతాయి జ్ఞాపకాలలో మిగిలిపోతాయి.

నా ఆలోచన మారింది. నేనుగా ప్రాణత్యాగం చేయతలపెట్టిన రోజుల మనస్థితి వేరు ఇప్పుడు వేరు దానికి దీనికి ఇరవై సంవత్సరాల దూరం. అది చాపల్యం ఇది చేదు అనుభవాల సంపుటీకరణ. చావును గురించి, మృత్యువు గురించి తీవ్రంగా ఆలోచించినప్పుడే జిజ్ఞాస మొదలవుతుంది మనిషికి ఇది అనంత జిజ్ఞాస కొనలు చేతికందవు ఆలోచన ఒక దరికి రాదు తృప్తి ఉండదు ఎప్పుడూ నిరాశ, ఎప్పుడూ అసంతృప్తి జీవితం పట్ల విముఖత. అదీ నా జిజ్ఞాస. ఇంకా 'అన్వేషణ' ప్రారంభం కాలేదు. పుట్టిన తర్వాత చావు తప్పదని, పుట్టిన ప్రతివ్యక్తి, ప్రాణి చనిపోతుందన్నది యదార్థమే. అలా చెప్పడం శుష్కవేదాంతం. చెత్త ఊరడింపు, అసలు పుట్టడం ఎందుకు? చావడానికే అయితే పుట్టనవసరం లేదు. సృష్టింపబడిన ప్రతిదీ నశిస్తుందన్నది తాత్వికత అది మాత్రం ఎందుకు జరగాలి? పుట్టించేదెవరు? సృష్టించేదెవరు? సృష్టి అనేది యాబ్‌స్ట్రాక్ట్. సృష్టించబడేదంతా మెటీరియల్. యాబ్‌స్ట్రాక్ట్ నుండి మెటీరియల్ ఏర్పడుతోంది... ఎలా?!. . ఆరిజిన్ ఏది?!. అది రూపమా, అరూపమా? గుణమా, నిర్గుణమా? భావమా, అభావమా? మృత్యువు తర్వాత ఏమిటి? జీవి ఉంటుందా? జీవితం ఉంటుందా? ఉంటే ఎలాంటిది భౌతిక శరీరాన్ని ఆశ్రయించకుండా భౌతిక ప్రపంచంతో సంబంధం లేకుండా జీవితం ఎలా సాగుతుంది? దానివల్ల ప్రయోజనం ఎవరికి??? ఎలా?!...

ఒక పసిపాప మరణం నాలో అనంత జిజ్ఞాసను రేపింది. మనస్సును మేల్కొల్పింది. అంతదాకా సీదా సాదాగా, కష్టసుఖాల కలగూరగంపగా సాగుతున్న జీవితంపై ఈ జిజ్ఞాసపొర కమ్మింది. మహర్షులు సైతం ఈ విచికిత్సకులోనై, ఆత్మదర్శనం కోసం అహర్నిశలు పరిశ్రమించి వుంటారని, సత్యాన్వేషణ జరిపి వుంటారని అనిపిస్తుంది. మరణం గురించే ఇరవై నాలుగు గంటలు యోచన. మద్రాసులో అడయార్‌లో దివ్యజ్ఞాన సమాజం వుంది. థియోసాఫికల్ సొసైటీ వారి పుస్తకాలు లోగడ చాలా చదివి వున్నాను. దాన్ని గురించి కొంత అవగాహన వుంది. మా కజిన్ ఒకాయన ... పేరు శరభాచార్య, ఆయన భార్య చనిపోతే అక్కడికి వెళ్లి వారి సాయంతో ఆమె ఆత్మతో

మాట్లాడి ఆ సంభాషణ అంతా ఒకపుస్తకంగా ప్రచురించాడు ఆత్మలు మాట్లాడతాయా? . ప్రయత్నించి చూడాలి!

నేను, మా తోడల్లుడు గాయత్రీప్రసాద్ కలిసివెళ్లాం. థియొసాఫికల్ సొసైటి ప్రెసిడెంటు ఒక్కడికే ఆ శక్తి వుందని ఆయన ఒక నెలరోజుల క్రితమే ఐర్లాండ్ వెళ్లిపోయాడని తిరిగి రాకపోవచ్చునని చెప్పారు అడయార్‌లో మర్రిచెట్టు, ధ్యానమందిరం చూచాను అప్పుడు. నాలుగైదువేల సంవత్సరాల నాటి మర్రిచెట్టు, ఓ నూరుసంవత్సరాలుగా దివ్యజ్ఞాన సమాజం వారికి నీడనిస్తోంది. ఊడలు మానులైనాయి. శిథిలమవుతున్న ఛాయలు కన్పించాయి. మాడం బ్లవట్స్కీ, లెడ్‌బీటర్, సిన్నెట్ లాంటి మహాత్ములు అక్కడ ప్రార్థనలు చేశారు, తపస్సు చేశారు. ఆత్మలపై ప్రయోగాలు చేశారు ఆయన ఓ ఏడాది తర్వాత రావచ్చునని చెప్పారు. అయితే చనిపోయినవారి ఆత్మలు ఆరు నెలలు దాటిన తర్వాత మనం పిలిచినా రావట! ఈ ఆత్మల వ్యవహారం స్వయంగా పరిశోధించి తెలుసుకోవాలన్న పట్టుదల కలిగింది అడయారు మర్రి పచ్చగా వుండి, నీడనిచ్చినంతకాలం దివ్యజ్ఞాన సమాజం బావుంది. తర్వాత దాని ప్రభావం కాస్త తగ్గినట్టు అనిపించింది మహాతాత్వికుడైన జిడ్డు కృష్ణమూర్తి నడయాడిన బాటలో నేనూ అప్పుడు నడిచాను అదొక తృప్తి. ఆ ధ్యానమందిరంలో నేనూ కాసేపు ధ్యానం చేసి వచ్చాను. అప్పటికి నాకు ధ్యానం, యోగం అన్నవి లేవు మనస్సు వికలంగా వుంది. ఆ వాతావరణం బాగున్నది కళ్లు మూసుకుని కూర్చున్నాను. అంతే. పుస్తకాలలో చదివాను. పుస్తకాల చదువు అసలు యోగానికి పనికి రాదనిపించింది ధ్యానం చేసుకోవాలన్న మనస్థితిని కలిగించడానికి మాత్రమే చదువులు పనికొస్తాయి. ధ్యానానికి కూర్చున్న మరుక్షణంలో ఆ సంపాదిత విజ్ఞానం నిరుపయోగం. ఏదీ జ్ఞాపకం ఉండదు. మనం అనుకున్నట్లు ధ్యానం వుండదు. ధ్యానమే మనల్ని నడిపిస్తుంది. అలా మనల్ని నడిపిస్తేనే అది ధ్యానయోగం.

భగవంతుడు ఉన్నాడా, లేడా అని ఆలోచించడం అవివేకం. దండుగమారి పని. అసలు భగవంతుడే పెద్ద రాజకీయం. మనిషిలో అరాచకాన్ని, అలజడిని, అస్థిరతను కల్పించేది ఏదైనా రాజకీయమే. దేవుళ్లందరు రాజకీయనాయకుల్లాంటివారే. వీరు ప్రజాప్రతినిధులమని, ప్రజల్ని ఉద్ధరించడానికే తాము జన్మించామని, ప్రజాసేవే తమ జీవితలక్ష్యం అని చెప్పుకుంటూ, ప్రజల్ని దోచుకుంటున్నట్లే, మనల్ని ఉద్ధరిస్తున్నారనే భ్రమలో దేవుళ్లు దోచుకునే అవకాశం మనమే కల్పిస్తున్నాం. మనం నమ్మిన దేవుడు ఒక ముఖ్యమంత్రి, ప్రధాని కావాలి, మన అవసరాలన్నీ అడిగినవెంటనే తీర్చాలనీ ఆశిస్తాం . అవే వరాలు, అవే పర్మిట్లు. దేశప్రజలందరి క్షేమం నాయకులు ఎలా కోరరో, దేవుళ్లు

సైతం మన క్షేమం కోరరు వారు మానవజాతిని ఉద్ధరించే ఒక వర్గంగా మనమే ప్రచారం చేసి, పదవు లిచ్చి, పోర్టుఫోలియోలు కల్పించి మనల్ని పాలించమని మనమే అణగి వుంటున్నాం ఇది ఫక్తు రాజకీయం. ప్రజాస్వామ్యంలాంటిదే. మనం ఎన్నుకున్నవారే అధికారంలోకి వచ్చి, నియంతలుగా మారినట్లు దేవుళ్లు నియంతలై మనల్ని అణగ త్రొక్కుతారు నాకు రాజకీయాలు పడవు. దేవుళ్లు పడరు. నాకు ఏ పార్టీపైన అభిమానం లేనట్లే, ఏ దేవుడిపైన అభిమానం లేదు నా ఓటు ఏ దేవుడికీ వెయ్యను. నా బ్రతుకు నేను బ్రతికితే చాలు. స్వతంత్రంగా బ్రతకటం నాకిష్టం. యోగంలోనూ అంతే. ఉద్యోగంలోనూ అంతే. ఎవరి అధారిటీ నేను సహించను. స్నేహంగా మసలుకుంటాను. వాళ్లని పిలిచి, మర్యాదలు చేసి, పూజలు చేసి, కష్టాలు తెచ్చుకోవడం ఎందుకు? దేవుడు ఉన్నాడా, లేడా అన్న ఆలోచన అనవసరం మనం నమ్మితే వుంటాడు నమ్మకపోతే లేనట్లే. మన ఊహ. మన అవసరం, మన కల్పన, మన నమ్మకం, మనకు కావలసిన దేవుడిని సృష్టిస్తుంది.

ఊహ తెలిసిన తర్వాత నాకు చాలాకాలం వరకు దేవుడి గురించిన ఆలోచన లేదు చిన్నతనంనుండి పెద్దవాళ్ల అలవాట్ల అడుగుజాడలలో నడుస్తాం కనుక, అది మన నమ్మకం కాదు "భగవంతుడు ఏడి?" అనే సంశయం వచ్చినప్పుడే మన సొంత ఆలోచన ఏర్పడినట్లు! "ఉంటే కనిపించడేం?" అనే సందేహం కలిగి, ప్రశ్నగా నిలిచినపుడు ఆలోచిస్తాం. అదే ఆరంభం వ్యక్తిత్వవికాసానికి మన వ్యక్తిత్వాన్ని సమాధి చేయడానికి ప్రయత్నిస్తారు పెద్దలైనవారు. మనం ఇమిటేషన్‌గా, కార్బన్‌కాపీలాగా బ్రతకాలని అప్పుడు కుటుంబగౌరవం నిలుస్తుందని పెద్దల అభిప్రాయం. ఎక్కడో నాలాంటివాడు తిరగబడ తాడు. ఎదురునిలుస్తాడు. అందరూ గానుగెద్దుల్లా, కళ్లకు గంతలు తగిలించుకుని లోకాన్ని చూచి తాళ్లు తెంచుకుని పారిపోవడానికి యత్నిస్తారు.చిన్నప్పటి నుండి మనకు భక్తి అనేది ఒక అంటురోగంగా పట్టుకుంది. విప్లవ సాహిత్యం చదివి జందెం తీసివేశాను. అది 'పాపం' అన్నారు. నేను వినిపించుకోలేదు. "పాపం నాకు కదా! మీకేం బాధ" అని ఎదురు ప్రశ్నించాను. 'తప్పు!' అన్నారు. తప్పు ఎలా అవుతుంది? జందెం వేసుకోని వారంతా మనుషులు కారా? వారంతా బ్రతకటం లేదా, చదవడం లేదా, ఉద్యోగాలు చేయడం లేదా, ఏ విధంగా మీ జందెం ప్లస్‌పాయింటో చెప్పమని నిగ్గతీస్తే చప్పబడ్డారు పెద్దలనేబడేవారు. అందుకే పెద్దలమని ముద్రలు వేసుకున్న వారిపై గౌరవం పోయింది. నన్ను శాసించి, కట్టడిచేయడం వల్ల వచ్చిన పెద్దరికమా? పెద్దమనసు లేనివారు పెద్దలెలా అవుతారు?! మన స్వేచ్ఛను, స్వతంత్రాన్ని హరించడం పెద్దరికం లక్షణమా? నిత్యం గాయత్రి, సంధ్యావందనం చేయనివాడికి, వేదం చదవనివాడికి జందెం వేసుకునే అర్హత లేదు. అనవసరం కూడ.

మనిషికి రకరకాల అహంకారాలున్నాయి. మొదటి ఈగో కులం వల్ల సంక్రమిస్తోంది. ఉన్నతకులంలో పుట్టానన్న అహం, మిగిలినవారికన్న తాను అధికుడననే ఆధిక్యతా భావం వల్ల ఇతరులపట్ల చిన్నచూపు ఏర్పడుతుంది. పుట్టినప్పుడు ఎవడికీ కులం లేదు. అందరూ ఒక్కటే అందరూ మనుషులే. ఉన్న తేడా ఆడ, మగ. అదీ శారీరకమే. మనిషి సంస్కారం ముఖ్యం. కులం కాదు. మన సమాజం వేల సంవత్సరాల నుండి కులాల చుట్టు ప్రదక్షిణ చేస్తోంది. మతం ముసుగులో దాగి వుంది కొంపలో వున్నా కులమే బయట కాలుపెట్టినా కులమే. వాడు గొప్ప, వీడు తక్కువ వాడు ఉన్నత కులస్తుడు, వీడు తక్కువ కులస్తుడు సంస్కారం బొత్తిగా లేని సమాజం. కాశ్మీర్ శాలువ కప్పుకుంటే పండితుడు గడ్డం, మీసాలు పెంచుకుని కాషాయబట్టలు కడితే స్వామి. నా మనస్సు కుతకుతలాడసాగింది మనశ్శాంతి లేదు.

'నీదేకులం' అని ఎవరైనా అడిగితే 'తెలియదు' అనేంత మొండితనం. మరీ రెట్టించి అడిగితే తన్ని తరిమి వేయాలన్నంత కోపం వచ్చేది. నాటి నుండి నేను ఎవరినీ ఏ కులం అని తెలుసుకో ప్రయత్నించలేదు. కులం అంటే అసహ్యం కలిగింది. మనం హిందువులం, భారతీయులం అని గర్వంగా చెప్పుకోవాలట. ఎందుకు!? హిందువులకు ఏది ప్రామాణికం ... వేదాలా? ఉపనిషత్తులా? భగవద్గీతా? మనుధర్మశాస్త్రమా? ఏది? హిందువునని చెప్పుకునే వాడు, జంధ్యాలు గట్టిగా పట్టుకునేవారు, జీవితంలో ఒక్కసారైనా వేదాలు చదివారా? ఉపనిషత్తులు చదివారా? గీతను పట్టుకు వేలాడతారు. హిందువులమని చెప్పుకునే అర్హత ఎంతమందికున్నది? క్రిస్టియన్ వారానికి ఒక్కసారైనా బైబిల్ పట్టుకుంటాడు. చర్చికి వెడతాడు. ప్రార్థన చేస్తాడు. హిందువుల్లో ఒక్క పవిత్ర గ్రంథం చదివిన వారెందరు? నెలకు ఒక్కసారైనా గుడికి వెళతారా? ఎందుకీ నటన, ఎందుకీ మోసం, ఆత్మద్రోహం?

స్నేహానికి కులాలు అడ్డుకావడం లేదు. ప్రేమకు 'కులం' అడ్డు తొలగిపోయింది. జ్ఞానానికి, సంస్కారానికి కులాలు అడ్డు ఎందుకు కావాలి! ఆర్థిక అసమానత తప్ప సమాజంలో మనిషికీ మనిషికీ మధ్య మరొక అసమానత వుండరాదు. ఆలోచనలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. నిలవరించుకోలేకపోతున్నాను. ఎవరినో సంస్కరించాలన్న తపన కాదు. నన్ను నేను క్షాళనం చేసుకోవాలి. సంస్కరించుకోవాలి. నేను నా లక్ష్యాన్ని సాధించాలంటే గమ్యం చేరాలంటే ఏం చేయాలి? దరిద్రం ఒక ఆటంకం. సంసారం మరొక ఆటంకం. పాతికేళ్ళ వయస్సులో ఒక యువతి జీవితంలో ప్రవేశించి భాగస్వామి కావడంతోనే మగాడు సగం కోల్పోతున్నాడు. అర్ధనారీశ్వరత్వం వస్తోంది. పౌరుషం సగం

చచ్చి, దాని స్థానంలో స్త్రీ సహజమైన గుణాలు, అణకువ, ఓర్మి లాంటివి ప్రవేశిస్తున్నాయి. అదే అర్ధనారీత్వం. పెళ్లయిన తర్వాత స్వేచ్ఛపోతుంది. మనకు ఇష్టం లేకపోయినా కొన్ని పనులు చేయవలసిన దుస్థితి ఇష్టం వున్నవీ మానుకోవలసిన దుస్థితి. ఈ ఓటమినే జీవితం . సహధర్మం అంటున్నాం. ఎంత వంచన? ఓటమినే విజయంగా భావిస్తూ మురిసిపోవడం సంసార లక్షణం

కొంతకాలం నన్ను నేను ఎడ్యుకేట్ చేసుకోవాలనుకున్నాను. లైబ్రరీ పుస్తకాలు విపరీతంగా చదివాను మా ఆఫీసు లైబ్రరీలో కొన్ని వేల ఇంగ్లీషు పుస్తకాలున్నాయి. అందులో ఫిలాసఫీ పుస్తకాలు ఎవరూ తాకిన పాపాన పోలేదు థియొసాఫికల్ గ్రంథాలు, అరవిందుడు, రమణమహర్షి, రామకృష్ణ, మహేష్‌యోగి ఇలా ఇంగ్లీషులో వున్న ఫిలాసఫీ పుస్తకాలన్నీ దుమ్ముదులిపి చదివాను ఇంట్లో నైరాశ్యం. యామినీదేవిని వీడని పాప నీడలు చెరగని జ్ఞాపకాలు.

భాను పోయిన సందర్భంగా మా అమ్మ, నాన్న వచ్చి ఓదార్చి వెళ్లారు మామగారు, అత్తగారు రాలేదు. ఆయన పెద్దవాడైనాడు ఎవరు వచ్చి చేసేదేమీ లేకపోయినా ఆ పలకరింపు ఒక ఊరడింపు, ఆత్మీయతలకు సూచిక కాలం ఎంతటి విషాదాన్నైనా మింగివేస్తుంది రోజులు గడుస్తున్నాయి. మామూలు స్థితికి వస్తున్న సూచనలు. రోజూ సాయంత్రం ఆఫీసు నుండి వస్తూ పాండిబజారులో దిగి డాక్టరు గారి దగ్గరకు వెళ్లడం, ఏవో మంచి విషయాలు వినడం ఒక అలవాటైంది. ఆయన నాకోసం ఎదురుచూస్తుండేవారు. నా స్థితిగతులు తెలిసినవాడు. సహృదయుడు ఆయన మాటలు పన్నీటి జల్లులు. పదిమందితో కలవడం వల్ల, మన బాధల్ని మరచిపోతాం.

ఒకరోజు అరవిందుల 'సావిత్రి' ఇంటికి తెస్తున్నాను. అంతలావు పుస్తకం పైన ఆయన చూపు పడ్డది. తీసుకుని చూచి "నీవు చదివాక నాకొకసారి యివ్వు" అన్నారు. నాలో నిగూఢంగా వున్న తాత్వికతను ఆయన గ్రహించారు. ఆ తర్వాత మా మధ్య చర్చలు, లోతుగా సాగేవి.

"నీకు యోగం అంటే ఆసక్తి వుందా?" అని అడిగారు.

"ఆసక్తి అంటే చాలా పుస్తకాలు లోతుగానే చదివాను." అప్పటికి నా పరిజ్ఞానం అంతవరకే. అబద్ధం చెప్పలేదు.

నా పుట్టినతేదీ, జాతకచక్రం అడిగి తీసుకున్నారు.

నటరాజ శర్మ అనే భృగునాడి చదివే ఆయన డాక్టరుగారికి తెలుసు. ఒకసారి ఎప్పుడో నేనూ వెళ్లాను ఆయనవద్దకు. ఆయన నన్ను గుర్తించలేదు. ఆదివారం ఆయనను

పిలిపించారు. నా జాతకం చదివించారు. అందులో నా గురించి, నేను ఏ పరిస్థితిలో యోగంలో చేరేది వచ్చింది తాను, నేను కలిసి యోగప్రచారం చేస్తామని వచ్చింది.

కానీ డాక్టరుగారికి నా పట్ల విశ్వాసం లేదు బ్రాహ్మలే యోగానికి అర్హులని ఆయనకో గుడ్డినమ్మకం అయినా నన్ను వదలుకోవడం యిష్టం లేదు రోజులు గడుస్తున్నాయి. నేను అడగలేదు తాను ఆలోచిస్తూనే వున్నారు. ఒకరోజు సాయంత్రం ప్రేమగా అన్నారు -

"శార్వరీ, రోజూ ప్రేయర్ చేసుకో, బావుంటుంది"

ప్రేయర్ అనే మాటకు నాకు తెలిసిన అర్థం వేరు. డాక్టరుగారి భావం వేరు ఆయన యోగసాధన చేసే పద్ధతినే ప్రేయర్‌గా వ్యవహరిస్తారు. ఆ తేడా నాకు తెలియదు. ఒకరోజు సాయంత్రం ఆరుగంటలకు తనతో తనగదిలోకి రమ్మన్నారు వెళ్లాను తలుపు మూశాం. ఆయన చెక్కమంచంపైన కూర్చుని ప్రేయర్ చేసుకున్నారు. నేను ఆయన్ని చూస్తూ కూర్చున్నాను.

తిరిగి హాలులోకి వచ్చాక అడిగాను

"అదేనా ప్రేయర్! మంత్రం వుండదా?"

"ఇది వేరు.. నీ తలపైన చూడు" అన్నారు.

తల ఎత్తి చూచాను అక్కడ మాస్టర్‌గారి ఫోటో వున్నది చాలాకాలంగా అది అక్కడే వుంటోంది. అది ఏమిటో ఎవరిదో అడగలేదు. ఆ అవసరం కలగలేదు: దానిపై 'మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్' అనిఇంగ్లీషులో రాసి వుంది.

"ఆ మాటలు అనుకుని ధ్యానం చేయాలి, అంతే"

"మాస్టరుగారు మీ గురువుగారా?"

"ఈ యోగంలో గురువు అవసరం లేదు యోగం చేసే వారందరికీ ఆయనే మాస్టరు.. ఇంక ఏమీ అడగకు... ప్రేయర్ చేస్తున్న కొద్దీ అన్ని విషయాలు నీకే తెలుస్తాయి."

"నాకు దేవుడి పైన నమ్మకం లేదు" అన్నాను.

"నాకూ లేదు. నేను పూజలు, గట్రా చేయను. అది ఒకఅర్హత యోగానికి."

"అంటే నేను యోగానికి పనికొస్తానా?"

"అందరూ పనికొస్తారు. మనస్సుపెట్టి సాధన చేస్తే చాలు. మిగిలినవన్నీ వదులుకోవాలి."

ఆయన మాటలు నాకు అన్వయించుకోసాగాను. యోగానికి కావలసిన అర్హత, యోగ్యత నాకు వుందనిపించింది.

"యోగం చేయటం వల్ల ప్రయోజనం ఏమిటి?"

"అన్నివిధాల అభివృద్ధి వుంటుంది. భౌతికంగా చూస్తే, శరీరం ఆరోగ్యం అవుతుంది కర్మశేషం వల్ల కొన్ని జబ్బులు కలిగినా ప్రమాదకరం కావు. యోగశక్తి వల్లనే అవి చక్కబడతాయి. యోగం వల్ల రోగనిరోధకశక్తి పెరుగుతుంది. కనుక యోగం చేసేవారు జబ్బు పడడం సాధారణంగా జరగదు. రెండవది మానసిక శక్తి పెరుగుతుంది జ్ఞాపకశక్తి పెరుగుతుంది తీక్షణంగా, సూక్ష్మంగా ఆలోచించడం అలవాటవుతుంది. సత్యాన్ని మనకుగా మనం గ్రహించగలుగుతాం. ఏది చదివినా, ఏది విన్నా, అందులోని సత్యాన్ని మాత్రమే గ్రహించి, అసత్యాన్ని వదలివేసే విచక్షణ కలుగుతుంది. హంస పాలను నీటినుండి వేరు చేసినట్లు, మనమూ విషయాలలోని సత్యాన్ని మాత్రమే స్వీకరించగలుగుతాం. మూడవది, మనలో వున్నదని మనం తెలుసుకోని గ్రహించని 'ఆత్మ'శక్తి పెరుగుతుంది. దానివల్ల ఆత్మవిశ్వాసం, ఆత్మస్థైర్యం కలుగుతాయి. తద్వారా ఆత్మ ఉనికిని గ్రహించి, ఆత్మలోకంలో జీవించగలుగుతాం. అదే మానవజీవితానికి పరమలక్ష్యం, గమ్యం కావాలి."

అంత చెప్పిన తర్వాత యోగంపట్ల ఆసక్తి కలగకుండా ఎలా వుంటుంది? ఎవరికి మాత్రం - మూర్ఖుడైతే తప్ప ఇంక ఎదురుప్రశ్నలు వేయడు? శంకించడు. నేను సిద్ధం.

"ఉపదేశం యిస్తారా?"

"ఉపదేశం అన్నది పాతపద్ధతి. ఇక్కడ పాతపద్ధతులు, అలవాట్లు, సంప్రదాయాలు, ఆచారాలు ఏవీ ఉండవు. బ్రాండ్ న్యూ. ఈ యోగపద్ధతే న్యూ డైరెక్ట్‌లైన్. ఈ లైనులో ఉపదేశాలు లేవు. డైరెక్టుగా వెతుక్కోవటమే పద్ధతి. ఒక్క మాస్టరుగారికి తప్ప ఉపదేశార్హత ఏ మీడియంకు లేదు. సాంప్రదాయపద్ధతిన ఇక్కడ గురుసేవ చేయనవసరం లేదు. పాదపూజలుండవు. అందరూ సమానమే. అందరూ మాస్టర్‌గారి శిష్యులే. అందరికందరూ మిత్రులు. ఆత్మబంధువులు. ఆత్మీయులు. అసలు ఇక్కడ 'మంత్రం' అనేది చెప్పరు. ప్రేయర్ అంటాం. 'యోగం' చేస్తున్నామన్న మాట అనం. ప్రేయర్ చేసుకుంటాం. సంప్రదాయంలో గురువు శిష్యులు వుంటారు. ఉపదేశం వుంటుంది ఇది కామన్‌వెల్త్. ఈ సంపదకు అందరూ సమానార్హులే. ఎవరికి వారే డెవలప్ కావాలి! నీవు ఎంత చేసుకుంటే అంత ఫలితం వుంటుంది. ఏ గురువు తన శక్తిని శిష్యునికి ధారపోయకూడదు. మార్గం చూపించాలి. సాధకుడు తానుగా డెవలప్ కావడానికి సహకరించాలి. అది ఏ సీనియర్ సాధకుడైనా చేయవచ్చు. పది సంవత్సరాలు సిన్సియర్‌గా యోగసాధన చేసినవారు ఇతరులను గైడ్ చేయవచ్చు."

ఏమిటో అంతా అయోమయం, గందరగోళం అనిపించింది తాడులేకుండా బొంగరం తిప్పాలిట! ఎలా ఆరంభించాలి? ఏది పద్ధతి?

"అబ్బాయ్ నీవు ఆలోచించడం పూర్తిగా మానెయ్. నీకసలు బుర్ర లేదనుకో. ఆ బుర్రలో ఆలోచనలు లేవనుకో. బి యాన్ ఇన్నోసెంట్ చైల్డ్."

"సాయంత్రం రా .. నాతో ప్రేయర్ చేసుకో."

డాక్టర్‌గారితో చర్చించి, వాదించి నెగ్గలేం. ఆయన మొండితనం అలాంటిది ఆయన చెప్పేది అర్థం కాకపోయినా తలాడించక తప్పదు ఎంతటివారికైనా అది బాలసుందరరావుగారి ప్రత్యేకత. ఆయన ఆహ్వానం మాస్టర్ 'ఆదేశం'గా భావించాను అంతకు మునుపు పది సంవత్సరాలుగా ఆయన తెలుసు. కాని ఎన్నడూ ఈ విషయం ప్రస్తావనకు రాలేదు. ఆ అవసరం కలగలేదు. దేనికైనా సమయం రావాలి కదా! ఆరు తర్వాత వెడితే 'డాగీ ప్రేయర్‌లో వున్నారు. కూర్చోండి' అని వారి అమ్మాయి జలంధర చెప్పేది. ఆ ప్రేయర్ ఏమిటి అని ఎన్నడూ అడిగింది లేదు, ఆలోచించిందీ లేదు

యోగం ఆరంభించడానికి ముందు గురువుగారు కొన్ని షరతులు పెట్టారు. "ఇకపైన పూజలు, వ్రతాలు గట్రా మానుకోవాలి." అప్పటికి నాకు నిత్యం వేంకటేశ్వర సుప్రభాతం, లలితాసహస్రనామ పారాయణం అలవాటు. వాటిని మానడం ఎలా? అపచారం కాదా?

"అపచారం లేదు, ఆవకాయ లేదు, మానెయ్" అన్నారు. అది శాసనం... "పూజలు, అవీ చేసేవారు యోగానికి పనికిరారు. రెండూ కలిపిచేస్తే ప్రాణం మీదికి వస్తుంది. నేను యోగం చేస్తూ ఎవరో బోడిసలహా యిచ్చాడని గణపతి ఉపాసన చేశాను. ఫలితం నాకు కాలుచెయ్యి పడిపోయింది. 'పక్షవాతం' వచ్చింది. లెంపలు వేసుక్కుని గణపతికి వీడ్కోలు చెప్పి, మాస్టరుగారికి క్షమాపణ చెప్పుకున్న తర్వాత కాస్త నడవ గలుగుతున్నాను. చేయి, నాలుక కాస్త స్వాధీనంలోకి వచ్చాయి. నేను చేసిన పిచ్చి పని లాంటిది నీవు చేయకూడదు. 'అహం'కారం వదలిపెడితే, ఆధ్యాత్మికంగా ఎలాంటి అనర్థాలు రావు, గుర్తుంచుకో" అన్నారు.

అడుగడుగునా అగ్నిపరీక్షలు, అవరోధాలు, ఆంక్షలు. ఈ యోగం సజావుగా సాగేనా?

నాలో నేనే తర్జనభర్జన చేసుకున్నాను. నేను యోగానికి అర్హుడినా? యోగం అంటే ఆసనాలు వేయడం, ప్రాణాయామం చేయడం అని తెలుసు. ఉపదేశం పొంది, గురువు అడుగుజాడలలో నడవడం, నియమనిష్ఠలతో, యమ నియమాలతో తీవ్రంగా

సాధన చేయడం అనీ తెలుసు ఈయన పద్ధతి విచిత్రంగా, విడ్డూరంగా వుంది. 'సెల్ఫ్' అనే మాటకు అర్థం ఇదా! ఇది సాధ్యమా? మనిషి స్వయంకృషితో సాధన సాగించగలడా? ప్రయోజనం పొందగలడా! గమ్యంచేరగలడా?మనస్సు కకావికలం కాసాగింది? దీనికి పరిష్కారం!'.. ఎక్కడ మునిగి ఎక్కడ తేలతానో తెలియదు! నిశ్చయించుకున్నాను.

## ఆ రోజు నవంబరు 7. నా పుట్టినరోజు.

ఎప్పుడూ పుట్టినరోజులు జరుపుకున్నది లేదు. ఆరోజుల్లో ఆ వేడుకలు లేవు ఇంగ్లీషువారి సంస్కృతి ప్రవేశించి ఇప్పుడు ప్రతివారు పుట్టినరోజులు, పెళ్లిరోజులు జరుపుకుంటున్నారు అప్పట్లో చాలామందికి వయస్సే సరిగా తెలియదు పుట్టినరోజులు ఏవో కొండగుర్తులు. నలభై సంవత్సరాలకు ఓ మంచి పనిచేస్తున్నాను

ఆ సాయంత్రం ఏ ఆర్భాటం లేకుండా వెళ్లాను ఆయన ఏవీ తెమ్మని చెప్పలేదు మాస్టరుగారి ఫోటోముందు కూర్చోవడం కూడా లేదు. దీపారాధన లేదు, అగరువత్తులు వెలిగించడం లేదు. డాక్టరుగారి ప్రేయర్ గది చాలా చిన్నది. ఆయన పడుకునే చెక్కమంచం. పక్కన రెండు అడుగుల జాగా తాను మంచం మీదనే కూర్చుని ప్రేయర్ చేసేవారు. నేను నేలపై కూర్చున్నాను చాప కూడా లేదు.

"మాస్టర్‌గారి రూపం ఒకసారి మనసులోకి తెచ్చుకో. ఆ ఫోటో క్రింద రాసింది మూడుసార్లు లోపల అనుకో! కళ్లు మూసుకుని కూర్చో. లోపల ఏం జరుగుతున్నదీ గమనిస్తూ వుండు" అన్నారు. అలాగే చేశాను. నాకేమీ అనిపించలేదు. ఏవో ఆలోచనలు పిచ్చిగా వస్తుండేవి. ఆయనతో చెబితే తిడతారని భయం. నాలుగురోజులు బలవంతంగా వెళ్లినట్లు అనిపించింది. అయితే ఆరు అయ్యేసరికి అక్కడికి, ప్రేయర్‌కు పోవాలి అని లోపల వత్తిడి. నాలుగు రోజులలో నాలో ఒక మార్పు కనిపించింది నాకు గాస్ట్రిక్ అల్సర్ వుండేది. విపరీతంగా బాధపడేవాడిని ఒళ్లంతా చెమటలు పట్టేవి కళ్లు తిరిగి పడిపోయేంత నీరసం. డాక్టరుగారు లో బి.పి. అని దానికి మందులు లేవని తేల్చి చెప్పారు యోగంలో చేరిన రోజు నుండి నాలోని 'అల్సర్' మాయమైంది. తర్వాత ఎన్నడూ నాకు ఆ జబ్బు వుండేదన్న స్పృహ పోయింది.

సుప్రభాతం, లలితా సహస్రనామ పరనాలు ఆగిపోయాయి అప్రయత్నంగానే. ఇంట్లో వున్న దేవుళ్ల పటాలు సెలవుతీసుకున్నాయి. నైరాశ్యంలోంచి ఒక ఆశ చివురించింది. ఆత్మ మొగ్గ తొడిగింది. గుడులు, గోపురాలు, దైవదర్శనాలపై మోజు తీరిపోయింది. రోజూ డాక్టరుగారింటికి సాయంత్రం ప్రేయర్‌కు వెళ్లడం తప్పనిసరి. ఈ లోపల మమ్మల్ని

పరామర్శించడానికి మా పెద్దమ్మ వచ్చింది ఇంట్లో మాస్టర్‌గారి ఫోటో తెచ్చి పెట్టుకున్నాను అది ఏమిటో, ఎవరో, ఎందుకో శ్రీమతికీ చెప్పలేదు మా పెద్దమ్మగారు ఆ పోటో చూచి అన్నారు "కృష్ణా! మాస్టరుగారి యోగం చేస్తున్నావా?"

"చేయాలని ప్రయత్నం నీకు తెలుసా దీని గురించి?"

"ఒంగోలు మాస్టరుగారి దగ్గర చేరాను, చాలాకాలంక్రితం అప్పుడు వినుకొండలో వుండేవాళ్లం. పిడుగురాళ్లకు వెళ్లేదాన్ని"

"ఇప్పుడు చేయటం లేదా?"

"మానేశాను భయంవేసి ఒకసారి బావి వద్ద నీరు తోడుతుండగా, సప్తర్షులు కనిపించారు దాంతో భయం వేసి మానేశాను."

ఆమె నాకు సలహా యిచ్చారు, "చాలా గొప్పయోగం మాస్టరుగారిది! బావుంటు^^గి చేయండి మధ్యలో మానుకోవద్దు. పూర్తి అంకితభావంతో సాధన చేస్తే, గృహస్తులకు దీనిని మించిన యోగం లేదు అన్ని ఫలితాలు కలుగుతాయి" అని యామినీదేవికీ సలహా యిచ్చింది "నీవుకూడా చెయ్యి అమ్మాయ్. బావుంటుంది. దిగులు విచారం వుండవు ఆరోగ్యం బాగా వుంటుంది ఈ యోగం చేసేవారికి ఎలాంటి రోగాలు, రొష్టులు రావు ఎవరూ మీకు అపకారం చేయలేరు. మాస్టరుగారు తన యోగసాధకుల్ని వేయికళ్లతో కనిపెట్టి రక్షిస్తుంటారు. అన్ని అవసరాలు తీరుస్తుంటారు. అసలు 'ఇది నాకు లేదు' అనే భావనే రాదు జీవితం అన్నివిధాలా సుఖంగా, తృప్తిగా సాగుతుంది."

డాక్టరుగారికి నాడీజ్యోతిషంపై నమ్మకం నటరాజశర్మను పిలిపించి నా జాతకం చెప్పించారు. అందులో నా గతం గురించి జరిగింది జరిగినట్లు వచ్చింది యోగంలో ప్రవేశమూ చెప్పారు. డాక్టరుగారు, నేను కలిసి తూర్పు సముద్రతీర మహానగరంలో యోగవ్యాప్తి చేస్తామని వచ్చింది. అంటే నా వల్ల కొంత యోగావర్కు జరుగుతుంది. అంటే నేను యోగానికి అర్హుడిని అది తెలుసుకుని కాని ఆయన నన్ను యోగంలోకి అనుమతించలేదు ఎన్నడో మహర్షులు రాసిపెట్టిన నాడీగ్రంథాలలో మన జాతకాలు రావడం ఆశ్చర్యం. పేర్లతో సహా వస్తాయి. నాకంటే నా శ్రీమతి యోగంలో పూర్ణత్వం పొందుతుందని వచ్చింది. దాంతో ఆయన మరో ఆదివారం నాడు యామినీదేవి జాతకం నాడీలో చదివించారు. ఆమెగారి జాతకం, యోగం, ధర్మకాండ చదువుతుంటే ఆయన ఆనందానికి అవధి లేకుండా పోయింది. అందులో అనేకానేక యోగ రహస్యాలు చెప్పబడ్డాయి. - భయం, దుఃఖం, శోకం లాంటి ఉత్పాతాలు కలిగి, వాటి కారణంగా

ఆమె యోగంలో ప్రవేశిస్తుందని, పూర్వజన్మకర్మఫలంగా కొంతకాలం రోగపీడిత అవుతుందని, ఒక బిడ్డ మరణం దుఃఖహేతువై, యోగ ప్రవేశానికి మార్గం ఏర్పడుతుందని వచ్చింది ఉత్తమగృహిణి అని, బిడ్డలు కీర్తివంతులవుతారని, భర్త మహాయోగి అవుతాడని, తాను దుఃఖ సాగరంలో మునిగి వుండగా ఎవరో రక్షిస్తారని, గురుకటాక్షం లభిస్తుందని చెప్పాడు. తాను నిరాడంబరంగా, సామాన్యగృహిణిగా వుంటూ మహాగురువు అనుగ్రహానికి పాత్రురాలవుతుంది. ఆమెకు సాధనలోనే సృష్టి రహస్యం అవగతమవుతుంది. మూడు ఫలితాలూ ఒకేసారి అనుభవానికి వస్తుంటాయి. బాహ్యవిజ్ఞానం, అంతర్జ్ఞానం, సృష్టిరహస్యం విదితమవుతాయి. విశ్వవిజ్ఞానం యావత్తూ ఆమెచేసే యోగంలో నిక్షిప్తమై వుంది. సాధనలో ప్రకృతిరహస్యాలు, గ్రహాలరహస్యాలు తెలియడమేకాక మహాశక్తులు, సిద్ధులు యోగసాధనతో ఆమెకు వశమవుతాయి దీనిని సాంఖ్యదర్శనం అంటారు యుగయుగాలుగా మహర్షులు, మహాయోగులు ఎందరో సాధనచేసి తరించిన యోగం ఇది దీనిని మాస్టర్ సి.వి.వి. అనే కారణజన్ముడు భృక్తరహిత తారక రాజయోగం అని నామకరణం చేశారు

ఈ జాతకురాలు జన్మించేవరకు ఈ యోగం పరమ నిగూఢంగా, రహస్యంగా వుంది. కృణువులో విశ్వశక్తి దాగి వున్నది. అమృతపానంతో ఎవరైనా మృత్యుంజయులు కావచ్చు. ఈయోగం అమృతయోగం. ఎవరైనా అమృతతుల్యులు కావచ్చు. మృత్యుంజయులు కావచ్చు యోగసాధన మనిషికి ఆయుర్వృద్ధినిస్తుంది. శరీరం రోగరహితమై, కాయకల్ప చికిత్స జరుగుతుంది. శరీరం బంగారు రంగుగా మారుతుంది. బాధ అనే మాటను మరచిపోవచ్చు. స్థూల, సూక్ష్మ, ప్రాణ శరీరాలలో యోగక్రియ ఒకేసారి జరుగుతుంటుంది. జీవులు స్థూల శరీరాన్ని వదిలే సమయం వరకు రోగబాధలు, ఈతిబాధలు వుండవు. సాధకునికి మందులతో పనిబడదు. ఏ జబ్బునైనా యోగశక్తితో నయం చేసుకోవచ్చు. సంపూర్ణ ఆరోగ్యంతో పాటు సంపూర్ణ జ్ఞానం కలుగుతుంది. యోగంలో అభివృద్ధి నిత్యం అనుభూతమవుతుంటుంది. ఈ జాతకురాలు చూపుతో, స్పర్శతో, సంకల్పంతో యోగచికిత్సలు చేయగలదు. వరాలు అనుగ్రహించగలదు. ఈ మహాయోగాన్ని దక్షిణదేశంలో కావేరీ తీరంలో ఒక పుణ్యక్షేత్ర నగరంలో, కణుడు, కపిలుడు, యవనాచార్యులు, బోధాయనుడు, అగస్త్యమహర్షి మొదలుగా గల మహాత్ముల అంశతో జన్మించిన ఒక మహాయోగి ఈ శతాబ్దంలో మానవాళిని అనుగ్రహించారు.

నా శ్రీమతి నాడీజ్యోతిషంలో నా యోగప్రస్తావన జరిగింది. నేను యోగంలో చాలా అభివృద్ధి సాధిస్తానని వుంది. ఆమెకు గురుపాద దర్శనం అవుతుందని, గురువు

ఇల్లు ఒక యోగాలయం, ఒక తపోవనం అనేకమంది నిత్యం తపస్సు చేసుకోడానికి వస్తుంటారు అది ఒక ఋష్యాశ్రమంలా భాసిస్తుంది. యోగసమావేశాలు, ఏడాదికోమారు గురుపూజ జరుగుతుంది. జాతకునికి పంచభూతాలు వశమై వుంటాయి. ఆత్మయోగిగా సాధన చేస్తాడు గంటలు, రోజులు సమాధిలో ఉండగలడు ఇతని యోగశక్తికి దైవబలం తోడవుతుంది కృష్ణాజినంపైన ధ్యానం చేస్తాడు. ధనం, కీర్తి, ప్రతిష్టలు పుష్కలంగా, ఆయాచితంగా లభిస్తాయి సహస్రశిష్యపరివేష్టితుడైన మహాగురువు అవుతాడు.

పూర్వజన్మ గురించి నాడీకారునివాక్యం: పూర్వజన్మలో ఇతనొక మహామంత్రవేత్త. పదహారవ ఏటనే గురూపదేశం పొంది, ఒక్క ఏడాది కాలంలో సిద్ధులు సంపాదించి పద్దెనిమిదవ ఏట గురువుపైనే ప్రయోగించాడు. అహంకారంతో, తపోబలంతో, దర్పంతో గురుద్రోహానికి తలపడ్డాడు గురుద్రోహం వల్ల ఆ సిద్ధులు ఫలించకుండా గురువు కట్టడి చేశాడు అయినా స్వతంత్రించి, వ్యాఘ్రాజినంపై కూర్చుని ఘోర తపస్సు చేశాడు. 'సిద్ధబ్రహ్మయోగి'గా ప్రసిద్ధిపొందాడు. భద్రకాళి, ఆంజనేయ, కుట్టిశాతాన్, మధురై వీరన్‌లను ఉపాసన చేసి, వారి శక్తుల్ని కైవసం చేసుకున్నాడు. ఎప్పుడూ కళ్లు ఎర్రగా, జ్యోతుల్లా వుండేవి. గుబురుమీసాలతో భయం గొలిపేవాడు తన మంత్ర శక్తితో అనేకమంది కన్యలను వశపరచుకున్నాడు తాంత్రికవిద్యలలో దిట్ట ఇతనిని చూచి జనం పారిపోయేవారు సంకల్పసిద్ధుడు. సంకల్పమాత్రంచేత ఎక్కడికైనా వెళ్లగలిగేవాడు. 500 సంవత్సరాలకు పూర్వంచేసిన గురుద్రోహం వల్ల, అయిదుజన్మలు ఎత్తవలసి వచ్చింది. ఆ యా జన్మలలో అనేక సత్కార్యాలు చేశాడు. దేవాలయాలు, సత్రాలు నిర్మించాడు క్రితం జన్మలో ఒక శివాలయంలో ఘోరతపస్సు చేసి, ఈ జన్మకు వచ్చాడు. ఇతనిది తపోశరీరం. ఆ జన్మలో 40 సంవత్సరాల వయస్సు వరకు అకృత్యాలు చేసి, తర్వాత సామాన్య జీవనం సాగించాడు. ఈ జన్మలో 40 సంవత్సరాల వరకు సామాన్యజీవనం సాగిస్తాడు. తన పూర్వజన్మల తపస్సు తెలియదు. 40 వ ఏట యోగం లభిస్తుంది పూర్వజన్మల కర్మఫలాన్ని 40 సంవత్సరాలు అనుభవించాడు. గత అయిదుజన్మల దోషం పూర్తిగా నశింపు అయింది. ఇప్పుడు ఇతనిది పూర్ణసత్యయోగం. సాధనారంభం నుండి యోగఫలాలు అందుకోగలడు. పరమగురువు దర్శనం సాధన సమయంలో కలుగుతుంది. సమస్త దేవగణం సంకల్పమాత్రంచేత ఈతనికి ప్రత్యక్షమై సంభాషిస్తారు. ఇతని యోగఫలం మూడువంతులు ప్రజాసంక్షేమానికి, ఒక్కవంతు మాత్రం తన సొంతానికి ఉపయోగిస్తుంది. పరోపకారం, ప్రజాసేవ, జనహితం ఎక్కువ. స్వార్థచింతన, స్వప్రయోజనం తక్కువ. సంసార బాధ్యతలు తీరిన తర్వాత ఒక్క ఏడాది కాలంలో మహాసిద్ధిని పొందగలడు. మహాయోగిగా కీర్తించబడతాడు.

ఈతనికి 36 వ ఏటనే వైరాగ్యం ఏర్పడ్డది. సంసార త్యాగం చేసి బుద్ధుని వలె అరణ్యాలకు వెళ్లి సత్యాన్వేషణ చేయాలని ఆలోచించాడు అది పూర్వ జన్మ వాసనాఫలం. పూర్వజన్మలలో సంవత్సరాల తరబడి సమాధిలోనే వుండేవాడు వేలమంది భక్తులు వచ్చి, దర్శనం చేసుకుని వెడుతుండేవారు. ఆ యోగఫలమే, ఒక యోగబాలగా ఈ జన్మలో కూతురుగా జన్మించింది. ఆమె 'భాను' తేజస్విని. సూర్యకాంతి వంటి దేహం ఆమెది. ఆమె తపస్సంపన్నురాలైన బాలిక, కన్యక ఆ పాప జన్మించేవరకు ఈ జాతకునికి యోగార్హత కలగలేదు.

ఒక్కొక్క జాతకునికి కర్మచేస్తే తప్ప యోగం అబ్బదు. అదృష్టం వరించదు. ఇతనికి పుత్రకారకుడైన గురువు కర్మస్థానంలో వున్నాడు. ఒకరికి కర్మచేయాలి అది ఈ రూపేణ జరిగింది. పూర్వజన్మలో ఈతని గురువే తన కర్తవ్యం నిర్వహించడం కోసం, తన శిష్యుని సంపూర్ణయోగిగా చేయడంకోసం, ఉద్ధరించడం కోసం ఇప్పుడు బిడ్డగా జన్మించి, తన పనిపూర్తిచేసుకుని వెళ్లిపోయాడు. తానే యోగకారకుడైనాడు. ఆ జన్మలో మంత్ర, తంత్ర విద్యలన్నీ నేర్చాడు ఒక్క 'తారకం' నేర్వలేదు. ఇప్పుడు 'తారకరాజయోగం'లో ప్రవేశింపచేశాడు. ఈ గురువు పూర్వజన్మలో పెద్ద మలయాళమాంత్రికుడు

ఈ జాతకుని గురుద్రోహచర్యవల్ల, గురువు దిగులుపడి మరణించాడు ఇప్పుడు అలాంటి దిగులు శిష్యునికి కలిగించి, ఉద్ధరించాడు. ఆ పాప జీవించి వుంటే ఇతని యోగశక్తి పరమాద్భుతంగా ఉండేది. కాని పాప తాను మోక్షం సిద్ధింపచేసుకుని, కన్న తల్లిదండ్రులకు గురువై... 'గురుదేవత' అయింది. జాతకుడు కరస్పర్శతో ఎలాంటి రోగాలనైనా నయం చేయగలడు. మృత్యుముఖంలో వున్నవారిని సైతం జీవింప చేయగలడు. సూక్ష్మశరీరంతో వెళ్లి శిష్యులకు దర్శనం యివ్వగలడు. పరామర్శించగలడు. వారి వారి అవసరాలు తీర్చి, ఉద్ధరించగలడు సూక్ష్మశరీరిగా అన్ని లోకాలు సంచరించి వస్తుంటాడు. లోకకళ్యాణం కోసం వర్షాలు కురిపిస్తాడు. అగ్నుల్ని శమింపచేస్తాడు. తుపానుల్ని, ప్రళయాల్ని సైతం నిరోధించగలడు. జాతకుని కుటుంబంలోని వారంతా యోగం చేస్తారు. ఇతని ఇల్లే ఒకయోగాలయం అవుతుంది. ఇతనికి ఉపదేశం చేసిన గురువు మాస్టరులో లీనమైనాడు. ఈతని యోగశక్తివల్ల ఇతని గురువుకు జన్మ రాహిత్యం కలిగింది. ఈ జాతకుడు అమృతుడు, మృత్యుంజయుడు, శాశ్వతుడు.

ఈ నాడీజ్యోతిషాలు ఎంత తీయగా వుంటాయో, అంత చేదుగానూ వుంటాయి. జరిగినవన్నీ నిజాలనిపిస్తాయి. భవిష్యత్తు రంగుల్లో కనిపిస్తుంది. కాని వారు చెప్పినట్లు జరగడం లేదు .. ముఖ్యంగా ఉద్యోగం, ధనం విషయాల్లో. ధన, రాజ్య భావాలు

బెడిసికొడతాయి ధర్మకాండ బావుంటుంది యోగం, పుణ్యపాపాలు చెప్పే ద్వాదశభావం బాగున్నట్లు అనిపిస్తుంది. అయితే పూర్వజన్మల గురించి ఎంత చెప్పినా సంతోషిస్తాం తప్ప దాఖలాలు ఉండవు నిదర్శనాలు కన్పించవు. అలాగే వచ్చే జన్మల గురించి చెప్పింది వినడానికి, బంగారు కలల్లో తేలిపోవడానికి పనికివస్తుంది పై జన్మల గురించి, ఈ జన్మలో తెలుసుకుని ప్రయోజనం లేదు. నాడీజ్యోతిష్కుని వద్దకు వెళ్లేవరకు మనకు గతంలో జరిగినవి చూచినట్లే చెబుతారు. భవిష్యత్తు గురించి చెప్పేవి చాలావరకు నిజం కావడం లేదు. చాలామందికి 'నాడీ' - అగస్త్య, గణేశ, కుమార, వశిష్ట, భృగు నాడీలు - నేను చదివించి, పొందిన అనుభవం ఇది. కనుక పై ఫలితాలు ఎంతవరకు నిజాలు కాగలవో నాకు తెలియదు నేను యోగంలోకి రావడం మాత్రం జరిగింది. పూర్వజన్మలలో యోగం చేశానో, తపస్సు చేశానో, లేక గురుద్రోహం చేశానో నాకేం ఎరుక లేదు.. ఇది 1969, 70 ప్రాంతాలలో చదివించాను. 28 సంవత్సరాలలో చెప్పినవి కొన్ని జరిగాయి, కొన్ని జరుగుతున్నాయి అన్నీ కావని కొట్టివేయడానికి లేదు. పూర్తిగా నమ్మి అలాగే జరుగుతుంది అనడానికి లేదు మన కృషి ప్రధానం

మొత్తంమీద డాక్టరుగారు నాకు గురువైనారు. నా కన్న నా శ్రీమతిపై ఆయనకు అభిమానం ఎక్కువైంది. ఆ నాడీ చదివించిన తర్వాత ఆయన మా ఇంటికి వచ్చి, ఆమెను పరామర్శించి, నమస్కరించి మరీ వెళ్లారు. ఆ క్షణంలో ఆయన కళ్లు చెమ్మగిల్లడం నేను మరచిపోలేను. "అమ్మా" అని ఆప్యాయంగా, తన కన్నతల్లిని పిలిచినట్లు పిలిచారామెను. ఆ పిలుపే ఆమె పట్ల తర్వాతికాలంలో సార్థకమైంది. యోగసాధకులు ఎవరు వచ్చినా ఆమెను 'అమ్మా' అనే సంబోధించడం జరిగింది. ఆమెకు మాస్టరుగారి అనుగ్రహం వుంది. ఆమెకు పరంజ్యోతి దర్శనం అవుతుందని, సహస్రారమధ్యంలో పరమాత్మదర్శనం అవుతుందని నాడీవాక్యం. ఆమె జన్మతః యోగిని. నేను కొంత పాపిని. ఏదైనా గురువుగారి అభిమానం పొందగలిగాం. మాస్టర్‌గారి యోగ సాధనకు గురువే మార్గం.

యోగంలో నమ్మకం కుదిరి, చాలామంది దాని దాపులకు రారుకానీ, వచ్చి, సాధనచేసిన వారందరికీ మంచి ఫలితాలు, మంచి మంచి అనుభవాలు కలుగుతాయి. ఫలితం ఇంతో అంతో పొందని వారంటూ లేరు. కొందరు తాత్కాలిక ప్రయోజనాలు ఆశించి, యోగసాధన ప్రారంభించి, లాభం పొందగానే మానివేస్తుంటారు. అలాంటివారిని మార్చలేం. కానీ యోగాన్ని అంటిపెట్టుకుని, నిత్యం సాధన చేస్తున్నవారు, ఏ ఫలితాలు ఆశించకుండా చేసేవారు మాత్రం, యోగాన్ని వదలలేరు. వారు పొందే ఆత్మానందం

ఇతరత్రా లభించదని తెలుసు. బాధల్లో వున్నవారికి, కష్టాలలో చిక్కుకున్నవారికి, సమస్యలతో సతమతమయ్యేవారికి సాయపడాలన్న స్పందన సాధకునికి కలుగుతుంది. వీలైనంతమందికి తమ యోగశక్తితో సాయం చేయాలనిపిస్తుంది అది సహజం. అవి కోరికలు కావు. కోరికలు ఉండకూడదని లేదు కోరికలకు పరిమితి ఉండాలి. తనకోసం, స్వార్థంతో చేస్తే కోరికలవుతాయి. అవే ఇతరుల శ్రేయస్సుకోసం చేస్తే ఆదర్శాలవుతుంటాయి. ప్రతి కోరికకు బొమ్మ, బొరుసు వుంటాయి. ఒకటి మంచి అయి రెండవది చెడు కాదు. దేనికైనా పరిమితి అవసరం. సంయమనం అవసరం. కోరినా యోగం అబ్బదు. పూర్వజన్మ సుకృతం వుండాలి. ప్రాప్తం వుండాలి. ఈ యోగంలో సంప్రదాయ పద్ధతులు, కఠిన నియమాలు, ఆచారాలు లేవు కనుక జనాకర్షణ లేదు. పూజలు, ఉపవాసాలు, నైవేద్యాలు, పిచ్చినమ్మకాలు ఉండవు కనుక సామాన్యజనం పట్టించుకోరు అయినవారు, బంధువులు, మిత్రులు సైతం దూరంగా తప్పుకుంటారు అర్థంగాక

నేను యోగంలో చేరేనాటికి యోగం గురించి చదివి తెలుసుకున్నది చాలా వున్నది కానీ, అది ప్రాక్టికల్‌గా పనికిరాలేదు. చాలామంది పుస్తకాలు చదివి, పెద్దల ఉపన్యాసాలు విని తమకు అంతా తెలుసుననుకుంటారు. కానీ, వారికి తెలిసింది వారు తెలుసుకున్నది, ప్రాక్టికల్‌గా సాధనకు ఏమీ పనికిరాదు. ఆ విషయం యోగంలో చేరిన మొదటిరోజునే గ్రహించాను. ఆ చదివి తెలుసుకున్నది పూర్తిగా మరచిపోతే తప్ప యోగంలో ఒక్క అడుగైనా ముందుకు వేయలేమని రెండవరోజునే ఆకళింపుకు వచ్చింది యోగం అంటే ఏమిటి? ఎలా చేయాలి? ఎవరూ చెప్పరు, చెప్పలేరు. డాక్టరుగారూ నాకు చెప్పలేదు. ఆయన ప్రేరణ కలిగించారు. కళ్లు మూసుకోవడం నేర్పారు. అదే నా యోగం. అంతే... అలా రెండునెలలు కళ్లు మూసుకునే వున్నాను. అడిగే ధైర్యం లేదు. అడిగితే 'నోరుమూసుకో' అనేవారు అసలు మాస్టరుగారికి నమస్కారం చేసి కళ్లు మూసుకోవాలా? కళ్లు మూసుకున్న తర్వాత చేతులు కలిపి నమస్కరించాలా? కళ్లు మూసుకుని ఏం చేయాలి? కనీసం ఒక మంత్రం లేదు, జపం లేదు. రుద్రాక్షమాల లేదు! మాస్టరుగారి ఫోటో సైతం యివ్వలేదు. 'కేవలం మాస్టరుగారి రూపాన్ని మనసులోకి తెచ్చుకుని కూర్చో' అన్నారు. ఏమిటో అంతా పజిల్, అదొక అగ్నిపరీక్ష.

నాతోపాటు నా శ్రీమతి యామినీదేవి యోగానికి సిద్ధమైంది. ఆమెకు నేనే ప్రార్థన చెప్పాను. ఇద్దరం జనవరి 1, 1970న తీవ్రసాధన ప్రారంభించాం. భార్యాభర్తలు కలిసి చేస్తే యోగం మంచి ఫలితాలనిస్తుందని డాక్టరుగారు చెప్పారు. ఈలోగా పొట్టిప్రసాద్ అనే సినిమా హాస్యనటుడు, నాటకాల రిహార్సల్స్‌కు డాక్టరుగారింటికి వస్తుండేవారు.

అతను శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'ప్రజ్ఞాప్రభాకరం' అనే పుస్తకం తెచ్చిపెట్టాడు. పొట్టిప్రసాద్ అక్కగారినే మాస్టర్ ఎం.ఎన్.గారి అబ్బాయి దాసుగారు చేసుకున్నది. అది యోగ బాంధవ్యం. ఆ పుస్తకం కొంతభాగం ఎలుకలు తిన్నది. సాక్షి రంగారావు కూడా రోజూ మాతోపాటు యోగం చేస్తుండేవాడు. నేను మాస్టరుగారి గురించి చదివిన మొదటిపుస్తకం ప్రజ్ఞాప్రభాకరం. మనిషి కష్టాలు తట్టుకోలేనపుడే భగవంతుని జ్ఞాపకం చేసుకుంటాడు. ఆత్మశాంతి ఏదో కావాలన్న తపన కలిగినప్పుడు యోగంలాంటివి సాధన చేస్తుంటాడు

# నా యోగారంభం

**నేను** అనేదాన్ని అన్వేషిస్తూపోతే 'అహం' నశిస్తుంది అంటారు భగవాన్ రమణమహర్షి. సృష్టికే మూలమైనదాన్ని 'ఆరిజిన్' తెలుసుకుంటే అన్నీ తెలిసినట్లే నంటారు మాస్టరుగారు. 'ఆరిజిన్ నంబరు ఒకటి' పరమాత్మ అనుకుందాం సృష్టిని నడిపించే దేవుళ్లు గ్రహాలు వగైరా వగైరా 'ఆరిజిన్ నంబరు 1' అనవచ్చు. వీటి శక్తులన్నీ తనలో దాచుకున్న మాస్టరు 'ఆరిజిన్ నంబరు 2.' 'నేను' నశించి 'ఆత్మ' మాత్రమే మిగలాలి అంటే శరరస్పృహ నశించి ఆత్మస్పృహ మాత్రమే మిగలాలి. ఆత్మ శాశ్వతం, శరీరం అశాశ్వతం అంటారు. క్షణంలో శరీరస్పృహ పోతుంది. ఆత్మస్పృహ శాశ్వతంగా వుంటుంది కనుక, ఇది అశాశ్వతం, అది శాశ్వతం అన్నారు. 'నాది', నేను' అనేవి భౌతికపరిధిలోనివి మాత్రమే మనం నా 'ఆత్మ' అనడం తప్పు. ఆత్మ మనల్ని 'తన శరీరం' అనుకోవాలి. అహాన్ని తొలగిస్తే 'ఆత్మ' దర్శనమవుతుంది. అతీంద్రియ ప్రజ్ఞతో, తురీయస్థితిలో పొందగలవి ఆధ్యాత్మిక అనుభవాలు... ప్రజ్ఞ, జ్ఞానం, సత్యం వాటికి చెందినవే.

ఎవరికైనా యోగప్రాప్తికి సుకృతం వుండాలి. ముందరి జీవితం ప్రాతిపదిక అవుతుంది, భూమిక అవుతుంది. ఎవరు ఒక్కరోజులో వైరాగ్యం పొంది సర్వసంగ పరిత్యాగులుకారు. అలా కావడానికి ఏదో బలమైన సంఘటన కారణం అవుతుంది. కారణంగా కనిపిస్తుంది. కాని దానికి పూర్వభూమిక వుంటుంది. పూర్వసంస్కారం, పుణ్యం, తపస్సు తోడవుతాయి. బుద్ధుడైన గౌతముడు అనేక శాస్త్రాలు చదివినవాడే. సకలకళాప్రపూర్ణుడే. ప్రాచీన గ్రంథాలు చదివినవాడు, సుఖభోగాలు పుష్కలంగా అనుభవించాడు. రాజభోగాలకు మించిన భోగాలు లోకంలో ఏముంటాయి? అలాంటి సుఖభోగికి వైరాగ్యం కలిగింది. విరక్తితోకాక, నూతనమార్గం అన్వేషించి, కొత్తబాటన పయనించి సత్యాన్ని తానుగా తెలుసుకోవాలన్న తపన కలిగింది. స్వతంత్రంగా సాధన

చేశాడు. మంత్ర తంత్రాలతో సాధన చేసినా, తపస్సు చేసినా ఆయనకు సత్యదర్శనం కలగలేదు. చివరకు శరీరంపైన మమకారం వదలి, ఆత్మను వదలి, 'మోక్షం, సత్యం' అనే కోరికల్ని సైతం విస్మరించి, నిర్లిప్తంగా శూన్యంలోకి పయనించాడు. అప్పుడు సత్యం అవగతమైంది. అందుకే బుద్ధునిది శూన్యవాదం అన్నారు. ఆ శూన్యస్థితికి చేరుకోలేని ఆస్తికులకు, విగ్రహారాధకులకు, మడులు ఆచారాలు పట్టుకు కూర్చున్నవారికి ఆ పద్ధతి నచ్చలేదు. బుద్ధునికి కలిగిన ప్రేరణ వంటిది ప్రతిసాధకునకు కలగాలి. అది ఒకరిని అనుకరిస్తే రాదు. ఎవరిదైనా స్వతంత్ర మార్గం కావాలి. ఎవరి సాధన, అన్వేషణ వారిది కావాలి. మాస్టరుగారు ఈ మార్గంలో ఎవరికి వారు స్వతంత్రంగా ఎదగడానికి అవకాశం కల్పించారు. అదే నాకు నచ్చిన అంశం.

గత శతాబ్దంలో జన్మించిన మహాత్ములు రామకృష్ణ పరమహంస, అరవింద యోగి, షిరిడీసాయి లాంటి వారిని మరచిపోలేం. వారు ఆధ్యాత్మిక వికాసానికి ఎంతగానో కృషి చేశారు. తద్వారా సామాజిక పరిణామం వేగవంతమైంది. దివ్యజ్ఞాన సమాజం స్థాపించినవారంతా పాశ్చాత్యులే అయినా, కుల మతాలకు అతీతమైన దివ్యసమాజ వికాసానికి కృషి చేశారు. ఈ శతాబ్దంలోని మానసిక వికాసానికి, ఆధ్యాత్మిక దృష్టికి వారి తపస్సు ప్రేరణ కలిగించింది. స్పందన కలిగించింది. మాస్టరుగారు దివ్యజ్ఞాన సమాజం నీడన పెరిగి, స్వతంత్ర యోగావిష్కరణ చేసి, మహాయోగి అయినారు. ఎవరెప్పుడు ఏ కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా పాతపద్ధతుల్ని కాదనడమే జరుగుతుంది. సంప్రదాయాన్ని ధిక్కరించి నిలవకపోతే కొత్తది రాదు. మహాత్ములందరూ ఆత్మద్వారా సత్యాన్ని అన్వేషించిన వారే. కొత్త సత్యాన్ని దర్శించి వాటిని ప్రజోపయోగంగా మలచినవారే. ప్రవక్తలు, మహా గురువులు అవుతారు పాతపద్ధతుల్ని అనుసరించేవారు ఋషులు, గురువులుగా మిగిలిపోతారు.

మహాత్ముల జీవితాలు ఎప్పుడూ మార్గదర్శకాలే. ఒక మహాత్ముని బాటలో మరొకరు నడవరు. ఎవరికి వారు స్వతంత్రులే. ఎవరి అన్వేషణ, సాధన వారిది. గురువు నామమాత్రంగా వుంటాడు. మార్గం చూపిస్తాడు. నడవ వలసింది సాధకుడు. నడిచేది తన కాళ్లతోనే. మరొకరి కాళ్లతో నడవాలని ప్రయత్నించే వారంతా గమ్యం చేరరు. స్వతంత్రంగా సాధనచేస్తూ, సత్యాన్ని దర్శించాలనే తపనగల వారందరికి, ఎందరో మహాత్ములు పరమగురువులు ఆత్మ భూమిక నుండి సహాయపడుతుంటారు. మనం నమ్మినివారిని మనకు తెలిసినవారిని మనం గుర్తిస్తుంటాం. కానీ మనల్ని, మన అభివృద్ధిని గుర్తించి, పరోక్షంగా సాయపడే మహాత్ములు ఎందరో వున్నారు. వారంతా మాస్టర్లు. పరమ గురువులు, ఆత్మస్వరూపులు.

ఎందరో మహాత్ముల ప్రభావం మనపైన వుంటుంది. ఎన్నో జన్మల సంస్కారం మనల్ని మంచి మార్గాన నడిపిస్తుంది ఏడు ఆవరణలు దాటిన తర్వాతనే అసలు దేవాలయం. ఏడు ప్రాకారాలూ దాటవలసిందే గర్భగుడిలోకి వెళ్లితేనే మూలవిరాట్ దర్శనం. అదీ... కటికచీకటిలో, అక్కడ మూలవిరాట్‌ని దర్శించాలంటే ఒక దీపాన్ని వెలిగించుకోవాలి. జ్యోతి ప్రజ్వలించనిదే మూలవిరాట్ దర్శనం కాదు. ఏడుప్రాకారాలు దాటడం, గర్భాలయంలో ప్రవేశించడం, జ్యోతిని వెలిగించడం క్రమంగా జరిగే పనులు, జరగవలసిన పనులు ఈ ఏడు ప్రాకారాలు దాటడం వంటిదే మనం అనేకమంది మహాత్ముల ప్రభావాలకు లోనుకావడం, అనేక మంది గురువులసేవ చేయడం. చివరకు మూలవిరాట్ వంటి పరమాత్మప్రతినిధి అయిన ఒక మాస్టరు లేదా ఒక పరమగురువు అనుగ్రహం పొందగలం. ఎన్నో జన్మలుగా ఎంతో సాధన చేస్తే తప్ప మహాత్ముల సంపర్కం లభించదు నాకు అలాంటి అవకాశం ఈ జన్మలోనే లభించింది.

నలభైయవ ఏట జీవితం మలుపు తిరుగుతుంది. మాస్టరుగారు 40 వ ఏట యోగావిష్కరణ చేశారు. అరవిందులు 40వ ఏటనే పాండిచేరి వెళ్లి యోగి అయినారు. నేను 40 వ ఏట ఈ యోగంలోకి వచ్చాను. ఆధ్యాత్మిక రంగంవేపు అడుగువేయడానికి అది సరైన వయసు జీవితాన్ని కొంతమేరకు అనుభవించి వుంటాం. ఉడుకురక్తంలోని వేడి తగ్గుతుంది ఆలోచనల తీవ్రత తగ్గుతుంది. భగవంతుని ఉనికి మనకు బాసట అవుతుంది. ప్రతి మనిషి ఎదలో ఎప్పుడో ఒక ఆధ్యాత్మిక బీజం పడి నాటుకుంటుంది. అది మొలకెత్తడానికి టైం పడుతుంది. మనం గమనించం ఆ బీజం ఎప్పుడు పడ్డదో. అది మొలకెత్తి మొక్క అయినప్పుడు గుర్తిస్తాం. రమణ భగవాన్ అంటారు 'అజ్ఞానం తొలగిపోతే ఆత్మదర్శనం' అవుతుందని. నేను అనుకుంటాను యోగసాధన చేస్తే అజ్ఞానం తొలగిపోతుందని.

ఆధ్యాత్మిక రంగంలో అవరోధాలు చాలా ఎక్కువ. అనుమానాలూ చాలా ఎక్కువగానే వుంటాయి. చీకటి తెరలూ ఎక్కువే. మనం ఎటు పయనించినా వెలుగు కనిపిస్తుంది. అయితే చీకటి తెరల్ని తొలగించుకోవలసింది మనమే. అవే మాయతెరలు. మనస్సుకు కమ్మిన పొరలు. మన చుట్టు వెలుగు ఉన్నట్లే అనిపిస్తుంది. కాని మనస్సు చీకటిలోనే వుంటుంది మార్గం వుంటుంది. కనిపించదు. వెలుగులేనిది మార్గం ఎలా తెలుస్తుంది. రవంత వెలుగైనా కావాలి. ఒంటరితనం, అజ్ఞానం, పిరికితనం వల్ల కనపిస్తున్న మార్గాన్ని గుర్తించం. దానికి అభిముఖంగా పయనిస్తుంటాం. కాస్త ధైర్యంగా ఒక్క అడుగు ముందుకువేస్తే చీకటి తొలగిపోతుంది. ఎక్కవలసిన మెట్టు కాలికి

తగులుతుంది. ఆ పని చేయం. నిరాశానిస్పృహలు అడుగు ముందుకు వేయనీయవు. ఊపిరాడదు. ఉత్సాహం ఉండదు. ప్రోత్సాహం లభించదు. పైగా, అడుగడుగున అనుమానాలు, అవరోధాలు. వాటిని ఎదిరించే శక్తి వుండదు పరిస్థితులను ఎదిరించే ధైర్యం, శక్తి బహుకొద్దిమందికే ఉంటుంది. నిరుత్సాహంతో నిలిచిపోయేవారు, వెనుతిరిగి పలాయనం చేసేవారే ఎక్కువమంది. ఈ అనంతపథంలో పయనించే వేయిమందిలో ఒక్కరు మాత్రమే కడవరకు పోగలుగుతారు ఎవరైనా స్వతంత్రంగా సాధించాలి. అదే ప్రగతి ఇతరులపై ఆధారపడకూడదు వెనుతిరిగి చూడకూడదు ప్రక్కవారిని పట్టించుకోకూడదు ఇది పోటీ కాదు. గెలుపు ఓటములు లేవు. గమ్యం చేరిన ప్రతివ్యక్తి గెలిచినట్లే, విజయం సాధించినట్లే. ఇతరుల అనుభవాలను ఆధారం చేసుకునేవారు, వారి జ్ఞానం తమదని భ్రమపడేవారు గమ్యం చేరలేరు. అలాంటివారికి ఎదుగుదల కనిపించదు.

జ్ఞానం అలవడినా లేకపోయినా మనిషి బుద్ధిజీవి. మనిషికి మాత్రమే బుద్ధివుంది. జ్ఞానం పొందే అర్హత వుంది బుద్ధివికాసం కలిగినప్పుడు జ్ఞానం కలుగుతుంది జ్ఞానం అవతలి అంచుకు చూడగలిగితే ప్రజ్ఞానం. అదే ఆత్మజ్ఞానం .

నేను యోగంలో ఎందుకు చేరానని గానీ, చేరి ఏమి సాధించానని గానీ ఆలోచించలేదు 'ఎప్పుడు చేరావు' అని ఎవరైనా అడిగితే ఎన్నో జన్మలక్రితమే చేరానని చెప్పాలనిపిస్తుంది. మనం సాధించింది ఎంత అని చూడకూడదు. అభివృద్ధి వుందా లేదా అన్నదే ప్రశ్న! యోగం, తపస్సు అనేవి సాధనఫలాలు. అవి ఒక్కజన్మలో రావు. ఒక్కజన్మలో పూర్తికావు. కనీసం ఏడుజన్మలు పూర్ణసాధన చేస్తే తప్ప ఎవరికీ యోగం పూర్ణం కాదు. సిద్ధి కాదు.ఈ జన్మలో మన ప్రక్కవారి కన్న కాస్త ముందుగా నడుస్తున్నామంటే పూర్వజన్మలో కొంత యోగం చేసివుంటాం. ఏడు జన్మల అనుబంధం అది. ఇది ఆత్మసంబంధం. ఈ జన్మలోనే యోగం ప్రారంభించిన వారికి అనుభవాలు చప్పున కలగకపోవచ్చు. అంతమాత్రాన వారు యోగానికి పనికిరారని, యోగంలో అభివృద్ధి సాధించడం లేదని అనుమానించ రాదు. అలాంటివారికి సిద్ధులు, మహత్తులు లభించవు. అయినా నష్టం లేదు. దిగులుపడ నవసరం లేదు. ఎవరైనా ఒక్కొక్క మెట్టు ఎక్కి పైకి పోవడం మంచిది. హైజంప్, లాంగ్‌జంప్‌ల వల్ల ప్రమాదం. యోగాభివృద్ధి నెమ్మదిగా జరగడం మంచిది. యాభై సంవత్సరాలుగా యోగసాధన చేస్తున్నవారికి కలగని అనుభవాలు అయిదునెలల సాధనలో కొందరికి కలగవచ్చు. అది వారి అదృష్టమని, అసూయపడరాదు. పూర్వజన్మలలో చేసిన సాధన ఈ జన్మలకు బదిలీఅవుతుంది. ఒకరు అసూయపడి ఏం

లాభం? అసూయ చెందితే తనకున్నది తరిగిపోతుంది. యోగసాధనలో అభివృద్ధికి అసలైన ఆటంకాలు. అసూయ, అహంకారం స్వార్థం

మా గురువుగారిని నేను ఎన్నడూ ఏదీ కోరలేదు. కారణం ఆయన 'తన'ని గురువు అంటే తిట్టేవాడు నేను'శిష్యుడిని' అనుకోవడం యిష్టం వుండేది కాదు. యోగంలో సాధకులంతా మిత్రులేనన్న సిద్ధాంతం ఆయనది ఆయన 'యోగమిత్రులు' అనే నాటకం రాసి ప్రదర్శింపచేశారు ప్రభవీక్లీలోనూ సీరియల్‌గా వేసిన జ్ఞాపకం యోగంలో నేను చేరింది కోరికలు తీరడానికి కాదు. వరాలు అడగడానికి కాదు మనశ్శాంతి కోసం ఆరోగ్యం కోసం. డబ్బుపైన, పదవులపైన నాకు మోజులేదు, కాంక్ష లేదు ఏదో జీవితం గడిస్తే చాలు. డబ్బు విషయంలో జి.బి ఎస్. నాకు ఆదర్శం. ఆయన డాక్టరు అయివుండి ఏ పెషెంట్‌ను డబ్బు అడిగేవాడు కాదు. ఎవరైనా ఇవ్వదలచుకుంటే అక్కడొక హుండీలాంటిది వుండేది - దాంట్లో వేసి పోయేవారు. ఆయన నర్సు నెలకొక సారి దాన్ని తీసి జీతంకింద తీసుకునేది.

డబ్బు డిమాండ్ చేయకపోయినా ఆయనకు బాగానే గడిచేది. డబ్బుకు ఇబ్బందిపడినా బయటకు చెప్పేవారు కాదు మహా నిరాడంబరంగా జీవించేవారు. నిగర్వి. తాను యోగం చేస్తున్న విషయం సన్నిహితులకు, మిత్రులకు సైతం చెప్పేవారు కాదు. బంధువులకు అసలు తెలియనిచ్చే పని లేదు. ఎవరి దగ్గర యోగం గురించి మాట్లాడే వారు కాదు. యోగం చేస్తున్నాం కనుక మన కోరికలన్నీ తీరాలని మాస్టరుగారు మన సాధన మెచ్చి, వరాలు యివ్వాలని ఎవరైనా భావిస్తే తప్పు. యోగం చేయడం వరాలకోసం, కోరికలు తీరడం కోసం కాదు. అసలు లాభనష్టాల ఆలోచనే పనికిరాదు. ప్రయోజనం ఆశించకూడదు భౌతిక ప్రపంచానికి సంబంధించినవి ఏవీ కోరకూడదు

ప్రపంచానికి డబ్బుతో లింక్ వుంది డబ్బు లేనిది దినం గడవదు. కోరకపోయినా డబ్బు అవసరమైన మేరకు సమకూరుతుంది. ఇది సత్యం. జి.బి.ఎస్. గారికి నాటకాల పిచ్చి. ఒకప్పుడు ఆయన సినిమా రచయిత. అందుకే సినిమావారికి ఆయన నేస్తం. నేను యోగంలో చేరడం ఆయన యోగమిత్రులు నాటకం రాయడం ఒకేసారి జరిగింది. ఆ నాటకంలో భారీ డైలాగులుండేవి. దానిని ప్రదర్శించాలని ఆయన కోరిక. పాండీ బజారులో ఆయన ఇంటిపక్క ఖాళీజాగాలో ఒక ఓపెన్ థియేటర్ కట్టించాడు. రిహార్సల్స్ మొదలుపెట్టారు. ఆయనగారి అల్లుడు హీరో చంద్రమోహన్. ఆయనా, సాక్షిరంగారావు ఆ నాటకం బాధ్యత తీసుకున్నారు. కాకరాల, పొట్టిప్రసాద్, మమత, ఎవరెవరో నటించారు. ఆ స్టేజీమీదనే ఆయన కళాపోషణ. నెలకో కార్యక్రమం. బాలమురళీ,

చిట్టిబాబుల సంగీతకచేరీలు జరిపించారు. నాకు ఆ నాటకం వల్ల నటీనటులతో పరిచయాలు ఏర్పడ్డాయి బి.ఎన్.రెడ్డి, కమలాకర కామేశ్వరరావు, పాలగుమ్మి పద్మరాజు, దాసరి నారాయణరావు, గుమ్మడి, జమున, సూర్యకాంతం, సావిత్రి లాంటి వారందరితో పరిచయాలు ఏర్పడ్డాయి

నాకూ నాటకాల పిచ్చి వుంది. తెనాలిలో వుండగా నాటకాలు డైరెక్టు చేయడం, నటించడం జరిగింది అప్పుడే 'నిజానిజాలు'నాటకం రాశాను. ఇప్పుడు గురువుగారిచ్చిన స్ఫూర్తితో 'దైవనిర్ణయం' రాశాను. వి ఆర్ జయంతి దానికి పెట్టుబడి. విజయచంద్, సాక్షిరంగారావు, కాకరాల, పొట్టిప్రసాద్, వీరభద్రరావు, పొట్టిలక్ష్మి, మమత, విజయలక్ష్మి అందులో నటించారు. చంద్రమోహన్ డైరెక్టరు. అప్పుడప్పుడు దాసరి నారాయణరావు వచ్చి సలహా లిస్తుండేవారు. వాణీమహల్‌లో ప్రదర్శించాం. ఆ తర్వాత 'కలగానికల' అని మరోనాటకం రాశాను అలాగా నెమ్మదిగా సినిమా రచయితను కావాలనీ నా ఆశ.

నాటకాలు కారణంగా డాక్టరుగారికి బాగా దగ్గరైనాను. ఆయన సొంత కొడుకులా చూచుకునేవారు ఆయన కూతురు జలంధర కూడా 'అన్నయ్యగారూ' అనే పిలిచేది. అప్పటి వరకు సినిమాలకు కథలు, సంభాషణలు రాయాలని వుండేది... కానీ నేను పనికి రానని తేలింది. విజయనిర్మల, కాంచన, పి.పుల్లయ్యగార్లకు రాసినా పేరు బయటకు రాలేదు. 'ఘోస్ట్' రచయితగా వుండడం నాకిష్టంలేదు. సొంతంగా ఒక సినిమా తీయాలనే ఆలోచన వచ్చింది పోతులూరి వీరబ్రహ్మంగారి కథ, స్క్రిప్టు రాసుకున్నాను. కమలాకర కామేశ్వరరావును డైరెక్టరుగా పెట్టుకున్నాం. కృష్ణంరాజు, శారద, చంద్రమోహన్ నటవర్గంలో వున్నారు. కానీ ఎన్.టి. రామారావు ఆ సబ్జక్టు తాను తీస్తున్నానని, నటీనటుల్ని కట్టడి చేశాడు. దాంతో నా సినిమా ప్రయత్నం ఆగిపోయింది.

# యోగంలో తొలిపాఠం

**యోగం గురించి మా గురువుగారు పెద్దగా చెప్పింది లేదు.** 'చెప్పేందు కేముంది' అనేవారు దేనికైనా ఒక పద్ధతి వుంటుంది. సిద్ధాంతం వుంటుంది టెక్నిక్ వుంటుంది. ఇందులో అవేమీ లేవు. ఉండే వుంటాయి అవి మనకు ముందుగా తెలియవు డాక్టరుగారు అనేవారు 'బి ప్రాక్టికల్' అసలు మాస్టరుగారే తన యోగాల యాన్ని ఒక ప్రయోగశాలగా అభివర్ణించేవారు. అది ఒక లాబొరేటరీ. అక్కడ చేయవలసింది, చేస్తున్నదీ ప్రయోగాలు. ఫలితాలు ముందుగా చెప్పలేం ఎవరికి వారుగా ప్రయోగం చేసి ఫలితం తెలుసుకోవలసి వుంటుంది. 'ప్రాక్టికల్' అనే మాటకు రెండు ముఖాలు, ఒకటి ఆచరణ, రెండు అనుభవం. ఆచరణ అంటే సాధన. స్వీయానుభవంతో తెలుసుకునేదే సత్యం. అది ఎవరిది వారికే అది నేను నేర్చుకున్న మొదటి పాఠం. మిగిలిన యోగాలకు దీనికి తేడా టెక్నిక్‌లో. ఇక్కడ మాస్టరు నుండి ఒక శక్తి సాధకునిలో ప్రవేశిస్తుంది. అదే ఇనీసియేషన్. దానికి మంత్రాలతో పనిలేదు. మన కృషితో నిమిత్తం లేదు. మాస్టరుగారి అనుగ్రహం ఎవరిపైన ప్రసరిస్తే వారిలోకి మాస్టర్ యోగశక్తి అణుమాత్రంగా ప్రవేశిస్తుంది. ఆ శక్తిని దినదినాభివృద్ధి చేసుకోవడానికి నిత్యంసాధన చేస్తుండాలి. ఒక చిన్న మొక్కను నాటుకున్నాం. అది నిమిషాలలో మహావృక్షమై కాయలు కాయదు. ఆ మొక్కను బ్రతికించుకోవాలి. రోజూ నీళ్లుపోయాలి. బలమైన ఎరువులు వేయాలి. ప్రకృతి వైపరీత్యాల నుండి దానిని కాపాడుకోవాలి. అది పెరిగేవరకు వేచి వుండాలి. అప్పుడు ఫలాలనిస్తుంది. యోగమూ అంతే. సాధనలో లోపం వుంటే అభివృద్ధి వుండదు. రావలసిన ఫలితం రాదు. ఇది చిన్న మొక్క. మహావృక్షంగా పెంచుకోవలసింది మనం, మన సాధనతో.

యోగాన్ని గురించిన విషయాలు, విశేషాలు, అనుభవాలుసైతం ఎవరూ చెప్పేవారు కాదు. అసలు యోగం చేసేవారు కూడా దీనిని గురించి మాట్లాడకపోవడం

విచిత్రం. సాధారణంగా ఎవరైనా తను చేసే దాన్ని గురించి ఘనంగా చెబుతారు పదిమందికి చెప్పాలని తహతహలాడతారు. ఈ యోగం చేసేవారు అందుకు భిన్నం. అడిగినా చెప్పరు. "అనుభవాల గురించి అడిగితే చెప్పకూడదు. అలా ఇతరులకు చెబితే అనుభవాలు రావు, ఆగిపోతాయి" అనేవారు. ఏమిటో అంతా విచిత్రం! విడ్డూరం అనిపిస్తుంది పోనీ, సూఫీయోగుల్లాగా రహస్యప్రదేశాల్లో, రహస్యంగా చేస్తారా అంటే అది లేదు ఎక్కడైనా కూర్చుని చేసుకోగలరు. కూర్చోవడం, కళ్లు మూసుకోవడం, ఓ గంట తర్వాత కళ్లు తెరవడం కనిపిస్తుంది. ఆ గంటకాలం ఏం చేస్తారు? చెప్పరు. గట్టిగా అడిగితే 'ఏమీ చేయం' అంటారు. ఏమీ చేయకపోవడమేనా యోగం అంటే ఏమీ చేయకపోతే, లోపల ఏ ఆనందాన్ని అనుభవించకపోతే గంటసేపు ఎలా కూర్చోగలుగు తున్నారనిపిస్తుంది. అదే రహస్యం దాని మర్మం తెలుసుకుంటె యోగం అర్థమైనట్లే.

చాలా సందర్భాలలో నన్ను గైడ్ చేస్తోంది ఎవరో తెలియదు. ఏదో ప్రేరణ కలుగుతుంది. ఏదో చేస్తాను . ఆ చేసింది తప్పని, ఒప్పని నాకు తెలుస్తుంది అంతే. అంతఃప్రేరణ ఏదో వుంటుంది. లోపల ఎవరో పలుకుతున్నారు . పలికిస్తున్నారు నాచే ఏదో చేయిస్తున్నారు ఎప్పుడైతే అలాంటి అంతరంగ తరంగాలు తట్టి ఉక్కిరిబిక్కిరి చేస్తాయో, సత్యాసత్యాలను విశ్లేషించగలుగుతామో అప్పుడు బయట ప్రపంచంలో ఎవరి అవసరమూ కలగదు. మనల్ని మనమే గైడ్ చేసుకుంటాం అంతరంగ ప్రేరణతో ముందుకు సాగుతాం. మాస్టర్ యోగంలో తొలినాళ్లలో నేను పొందిన అనుభూతులు అలాంటివే.

1970 ప్రారంభంలో తెనాలి నుండి అనసూయ అని ఒకామె వచ్చింది. ఆమె మునిసిపల్ కౌన్సిలర్. మా ఇంటి దగ్గర ఇల్లు చిన్నతనం నుండి తెలుసు. అన్నయ్యగారూ అని పిలుస్తుంది. మేం యోగం చేస్తుండటం గమనించి తనూ చేస్తానన్నది. ఉపదేశం యిమ్మని అడిగింది. అదేమిటో నాకు తెలియదు. కావాలంటే ప్రేయర్‌లో కూర్చో అని చెప్పాను. మాతోపాటు కూర్చుంది. తల బరువెక్కి తట్టుకోలేకపోయింది. భయపడ్డది. అలా తలబరువైపోతుందని మాకు తెలియదు. భయం కలుగుతుందని తెలియదు. మాకు ఎప్పుడూ యోగంకానీ, యోగానుభవాలుగానీ భయం కలిగించలేదు. ఆ రోజు రాత్రి నాకు నిద్రపట్టలేదు. విపరీతంగా తలపోటు, కన్నుపోటు. చిత్రం ఏమంటే ఆమెకు సహజంగా తలపోటు వస్తుందిట. కళ్లుమంటలు. ఆమె బాధలు నాలోకి బదిలీ అయ్యాయి. ఆ తర్వాత ఆమెకు తలపోటు, కళ్లపోటు తగ్గిపోయాయిట. నేను రెండురోజులు బాధపడవలసి వచ్చింది. ప్రేయర్‌లో 'చికిత్స' జరిగిపోతుందని ఆనాడే గ్రహించాను. నేను

ట్రీట్‌మెంటు ఇవ్వలేదు అయినా ఆమె జబ్బు తాలూకు బాధ నాలోకి ట్రాన్స్‌ఫర్ అయింది ఆమెకు తగ్గిపోయింది. మర్నాడు ఉదయం ప్రేయరు రెండుగంటలుపైగా సాగింది. శరీరస్పృహ కోల్పోయాను శరీరంలో ఏవేవో ప్రకంపనలు కలిగాయి. శరీరం చెమట్లుపట్టాయి. అప్పుడు అనిపించింది. కొత్తవారిని మాతో ప్రేయర్‌కు అనుమతించ రాదని. అనవసరంగా వారి రోగాల బాధ మనం అనుభవించవలసి వస్తుంది. డాక్టరుగారికి చెబితే అన్నారు "నీవు అలాంటి ప్రయోగాలు చేయకు. ప్రభాకరశాస్త్రిగారు అలాగే ఇతరుల జబ్బులు తనలోకి తీసుకుని, ట్రీట్‌మెంట్ యిచ్చేవారు. మనం అలాంటి ఘనకార్యాలు చేయకూడదు సాధన చేసుకో చాలు మాస్టరుగారు ట్రీట్‌మెంట్స్‌కు శక్తి అనుగ్రహించినప్పుడు చూద్దాం."

ఒకరోజు ప్రేయరులో మాస్టరుగారు కనిపించి ఒకపుస్తకం యిచ్చారు అందులో ఏమీలేదు. పుస్తకం రాయమని మాస్టరువాణి వినిపించింది. మాస్టరుగారు కనిపించగానే నాకు స్పృహ పోయేది. కొన్నిగంటలు అచేతనంగా ఉండేవాడిని. తర్వాత తలపోటు, ఒళ్లునొప్పులు రెండుమూడురోజు లుండేవి. యాస్ట్రల్ శరీరాలతో సంబంధం ఏర్పడితే మన భౌతిక శరీరాలు తట్టుకోలేవు. యాస్ట్రల్ అంటే భూతమే కదా! దయ్యం పట్టినట్లు వుంటుంది దయ్యాలు భూతశరీరులు, దేవతలు మానసశరీరులు, మహాత్ములు ఆత్మశరీరులు, మాస్టర్గుగారు కనిపించకముందు ఒకసారి నా శరీరం నుండి ఒక రూపం వేరై నా ఎదురుగా నిల్చుంది అది నా రూపమే. నన్ను నేను వేరే వ్యక్తిగా చూడగలిగాను. ఆ తర్వాత దూరంగా మాస్టరుగారు కన్పించారు. నేను దగ్గరగా వెళ్లాను. వారికి ఎదురుగా నమస్కరిస్తూ కూర్చున్నాను. నా సూక్ష్మశరీరం పెరిగి పెరిగి, ఆకాశం వరకు వ్యాపించింది. నేను క్రమంగా మాస్టరుగారిలో లీనమైనాను. ఆ అనుభవం గొప్పది, అపూర్వమైంది. డాక్టర్‌గారికి చెప్పాను ఆయనకు కళ్లు చెమ్మగిల్లాయి. ఆనందంతో నోటమాట రాలేదు. "అదృష్టవంతుడివి శార్వరీ" అని కౌగిలించుకున్నారు. ఆ రోజునే డిస్కవరి ఆఫ్ మాస్టర్ యోగ రాయడం ప్రారంభించాను రాయమని ఆజ్ఞాపించింది మాస్టరుగారు, ఆయనే నాచేత రాయిస్తారన్న ధీమా!

ప్రజ్ఞాప్రభాకరం తర్వాత ఎస్. నారాయణయ్యర్ గారి 'న్యూయోగ' అనే చిన్నపుస్తకం లభించింది. ఆ రెండు పుస్తకాలే నాకు ఆలంబనలు. అప్పటికి ఎం.ఎన్.గారి గురించి వినలేదు.ఆంధ్రలో ఎవరు యోగం చేస్తారో నాకు తెలియదు. డాక్టర్‌గారింటికి పి.ఎస్.ఆర్.శర్మ. ఆర్.ఎం.ఎస్.ఉద్యోగి వస్తుండేవారు. ఆయన యోగంచేస్తారని డాక్టరుగారు చెప్పారు తప్ప ఆయన ఏనాడూ మాతో కూర్చుని ప్రేయర్ చేసింది లేదు.

యోగం అంటేనే డిసిప్లిన్. ప్రత్యేకించి నియమాలు, నిబంధనలు అనవసరం. మా గురువుగారు నాకు పెట్టిన షరతులేం లేవు. నేను ప్యూర్ వెజిటేరియన్, మందు అలవాటు లేదు. సిగరెట్లు కాల్చేవాడిని. యోగంలోకి రాకపూర్వం ఆయనముందు సిగరెట్టు కాల్చేవాడిని. తర్వాత మానివేశాను. అంటే ఆయనముందు కాల్చడం మానివేశాను. ఉదయం, సాయంత్రం ఖచ్చితంగా ఆరుగంటలకు ప్రేయర్ అలవాటైంది. మరీ జబ్బు పడితేనో, ప్రయాణాల్లో వుంటేనో తప్ప టైం మార్చలేదు. రోజూ తెల్లవారుఝామున నిద్రలేవడం వల్ల బద్ధకం వదిలింది. ప్రేయర్ వల్ల మనశ్శాంతి ఏర్పడ్డది. జీవితంలో పెద్ద ఒడుదుడుకులు లేవు. అది చిత్రమైన మార్పు ఆఫీసులో అప్పటివరకు ఉన్న వ్యతిరేకత పోయింది. ఎవరూ నాగురించి నెగెటివ్‌గా ఆలోచించరు. అపకారం చేయాలనుకోవడం లేదు. ప్రతివారు నాతో స్నేహం వాంఛిస్తున్నారు అంటే యోగంవల్ల మనలో ఒక ఆకర్షణ ఏర్పడుతుంది ప్రేమించకపోయినా ద్వేషించడం జరగదు. ద్వేషం, అసూయ లేనిచోట ప్రేమను పండించవచ్చు

యోగం మూడు నాలుగునెలలు ప్రశాంతంగా సాగింది. ఒకరోజు ప్రేయర్ ప్రారంభించిన పది నిమిషాలలో అదేపనిగా ఆవలింతలు రాసాగాయి కంట్రోల్ చేయడానికి వీలుకాని అరుపులు. తర్వాత శరీరంలో ప్రకంపనలు కాళ్లు,చేతులు వంకర తిరిగిపోవడం, రకరకాల ముద్రలు, విన్యాసాలు, నమస్కార ముద్రలు, రాసాగాయి. మానసికంగా, శారీరకంగా నిస్సత్తువ, వెన్నులోంచి నాగుపాము లేచినట్లు, శరీరం నాగస్వరానికి నాట్యం చేసే నాగుపాము వలె నాట్యం చేయసాగింది. అదొక నటనాలయం. శరీరం ముందుకు, వెనుకకు వంగిపోయింది. తర్వాత నాకు స్పృహ లేదు. నాలోకి మాస్టరుగారు వచ్చి ప్రవేశించిన అనుభూతి. నా రూపం మాస్టరుగారిలో కలిసిపోయింది. మాస్టరుగారి రూపం నాలో కలిసిపోయింది. నేను లేను. నేను, నేను కాదు. ఉన్నది మాస్టర్‌గారొక్కరే నాలో సంపూర్ణంగా మాస్టర్‌ప్రజ్ఞ నిండిపోయింది. ఇదేమిటి నేను 'మాస్టర్'గా మారిపోవడం! నేను ఏమైనట్లు? నా రూపం ఏమైంది? అంతటా మాస్టర్ విశ్వరూపమే దర్శనమవుతోంది. ఇంతకాలం మాస్టరుగారి ఫోటోరూపం సైతం జ్ఞాపకం ఉండేదికాదు. ఇప్పుడీ హిరణ్యరూపానికి అర్థమేమిటి?

డాక్టరుగారికి చెప్పాను. ఆయనకు అర్థం కాలేదు. 'అడయార్ వెళదాంపద' అన్నారు. అక్కడ మాస్టర్ గారి మీడియం టి.ఎస్.శంకరయ్యర్ గారున్నారుట. ఆయన మాస్టర్‌గారి డైరెక్టు శిష్యుడు. 50 సంవత్సరాలుగా యోగం చేస్తున్నవారు. నా అనుభవాలకు అర్థం ఆయన చెప్పగలరని ఆశించాం. ఆయన ఎగాదిగా చూచి 'గోఎహెడ్' అన్నారు.

మాస్టరుగారు మద్రాసుకు వచ్చినప్పుడు ఈయనగారు వెంటబడి తిరిగేవారుట ఆయన నాకు మాస్టరుగారి జీవితం గురించి, యోగ విశేషాలు అనేకం చెప్పారు. నేను మద్రాసులో ఉన్నంతకాలం శ్రీ శంకరయ్యర్‌తో అనుబంధం వుంది. నేనంటే చాలా ప్రేమగా వుండేవారు. నా అనుభవాలు చెప్పగా విని "ఆ రోజుల్లో మాకే ఇలాంటి అనుభవాలు రాలేదు, నీవు అదృష్టవంతుడివి. మాస్టర్‌గారి దివ్యరూపం దర్శనమైంది. ఆయన నీకు పెద్దబాధ్యత అప్పగిస్తారని నాకనిపిస్తోంది" అన్నారు. అది కొంత ప్రోత్సాహం "నీ మొహం, అవేం పిచ్చి అనుభవాలు" అనలేదు. నాకొచ్చే అనుభవాలు ఎవరికీ చెప్పవద్దని సలహా యిచ్చారు. "మాస్టరుగారి నుండి ఏ సందేశం వినిపించినా, ఎనలైజ్ చేసుకుని ముందుకు సాగిపో, మాస్టరే నీకు గైడెన్స్" అన్నారు.

అప్పటినుండి రోజుకో కొత్త అనుభవం. ఎన్నని రికార్డు చేయను! వైబ్రేషన్స్ కలగని రోజులేదు. చెబుతుంటే ఆశ్చర్యంగా వినడం తప్ప విశ్లేషించేవారు లేరు. ఒకరోజు హృదయం నుండి ఏవో శబ్దాలు బయలుదేరి శరీరం అంతా వ్యాపించి, ఊపివేశాయి. శబ్దం శక్తిగా మారసాగింది. ఈ యోగంలోని విశేషమే అది. శబ్దం స్పందించి శక్తి కావడం. కనీసం ముప్పావుగంటసేపు యోగావర్కు సాగేది అపుదామన్నా ఆగేది కాదు అలాగ అనాహత కేంద్రం నుండి శబ్దాలు వెలువడడం చాలాసార్లు జరిగింది. మొదటిసారి భయం. తర్వాత అలవాటు ఒకసారి నా సూక్ష్మశరీరం భౌతికశరీరం నుండి వేరై నా ఎదురుగా నిలబడింది. చచ్చిపోయినాననే అనిపించింది. సూక్ష్మశరీరం వెంట మనస్సు పరుగుతీసింది. అది ఏవేవో లోకాల్లో తిరిగేది. గతంలోకి, భవిష్యత్తులోకి వెళ్లి వచ్చేది. నాకేం తెలుసు అంతా అయోమయం. తిరిగి అది భౌతికశరీరంలోకి వస్తే బ్రతికినట్లు. దానిని వెనక్కు తీసుకురావడం ఎలాగో తెలియదు. సూక్ష్మశరీరం మహాకాంతివంతంగా, పరుగులు తీసేది. క్షణంలో ఎంత దూరమైనా పయనించగలిగేది. నాలుగైదుసార్లు అలా సూక్ష్మశరీరం వేరై నన్ను కంగారుపెట్టింది. ఒకసారి హిమాలయాలకు వెళ్లి ఎందరో మహర్షుల్ని దర్శించాను. నా గత జన్మలు అయిదు వరకు తెలుసుకున్నాను. అలా హిమాలయాలకు వెళ్లినపుడు నా సూక్ష్మశరీరం ఒక మహామునిని కలిసింది. ఆయనను టెస్టు చేసి, యోగం ఉపదేశించింది. అతను గతజన్మలో ఒక యువతి మోసంవల్ల వైరాగ్యంచెంది హిమాలయాలకు పారిపోయి వచ్చాడు. విదేహంతో తపస్సు చేస్తున్నాడు. ఇప్పుడు మాస్టరుగారు కరుణించి అతన్నికి యోగంలోకి అనుమతించారు. నా ద్వారా మాస్టరుగారే ఉపదేశం చేసినట్లు తెలియవచ్చింది. ఆయన యలమంచిలి ప్రాంతం వాడనిపించింది. ఏమిటో చేరిన కొత్తలోనే విచిత్రమైన అనుభవాలు!

నలభైరోజులపాటు రోజూ హృదయస్థానంలో వర్కింగు తెలుస్తూ వుంది. పూర్తి అచేతన స్థితి. స్పృహ వుండదు లోపల కుండలినీ వర్క్ ఉక్కిరిబిక్కిరి చేసేది. శరీరం పాములా మెలికలు తిరిగి, శ్వాస బుసలుకొట్టేది నాలో ఇడ, పింగళ సంచారం తెలుస్తుండేది. సర్పెంట్ పవర్ అన్నది అనుభవానికి వచ్చింది శరీరం ఎప్పుడూ వేడిగా కాలిపోతుండేది. 104 డిగ్రీల టెంపరేచర్. రోజు కార్యక్రమాలకు అవరోధంకాని హైఫీవర్. కళ్లు మూసుకుంటే చాలు శరీరంలో కరెంట్‌ప్రవాహం. కాంతి ప్రసారాలు అప్పటికి యోగం రుచి తెలిసింది.

మనం ఎన్నోపుస్తకాలు చదువుతాం. ఎందరో మహాత్ముల్ని దర్శిస్తాం. ఎన్నో దేవాలయాలు చూచి తీర్ధయాత్రలు చేస్తాం ఎంతో ఆర్తిగా, జిజ్ఞాసగా అన్వేషిస్తుంటాం. ఒకగైడ్ కావాలి, మార్గదర్శి కావాలి అన్ని ప్రయత్నాలు ఫలించి, పక్వానికి వచ్చినప్పుడుగానీ ఒక గురువు లభించడు. ఆ గురువు చూపిన మార్గంలో ఆయన మీద పూర్ణ విశ్వాసంతో సాధన సాగించాలి గురువు శక్తి సామర్ధ్యాలను శంకించే వాడెన్నటికీ ప్రగతి సాధించలేడు. నా జీవనయాత్రలో ఎన్నో దేవాలయాలు దర్శించాను. విజయవాడ, తిరుమల, కంచి, శ్రీశైలం, వారణాశి, చిదంబరం... అలాగే ఎందరో మహాత్ముల్ని, గురువుల్ని సందర్శించాను చివరకు నాకు లభించిన మార్గం ఇది. నాకు నచ్చిన పద్ధతి యిది. ఒక మార్గంలోకి వచ్చాక మిగిలిన వాటిపైకి మనసు పోగూడదు ఒక గురువును ఆశ్రయించిన తర్వాత ఎంత గొప్పవారైనా ఇతర గురువులపై మోజుకూడదు. ముఖ్యం. యోగమార్గంలో పయనించి, సాధన చేసేవారు దేవాలయాలు దర్శించనవసరం లేదు. దేవుళ్లను దేవతల్ని కొలవనవసరం లేదు. మంత్రాలు, తంత్రాలు, పూజలు వ్రతాలు అన్నీ బంద్ చేయక తప్పదు.

ఎల్లకాలం ఒక గురువుపై ఆధారపడ నవసరం లేదు. గురువు కావాలి. గురువు సహాయం అవసరమే. మనం స్వంతకాళ్లపై నడవగలగాలి. గురుకృపవల్ల శిష్యునికి శక్తి సమకూడుతుంది. ఆత్మవిశ్వాసం కలగాలి. శక్తి గురువునుండి భారీగా శిష్యునిలోకి బదిలీ కాదు. సాధనవల్ల మాత్రమే దాన్ని గుర్తించగలం. ఆత్మవిశ్వాసం ఏర్పడినప్పుడే గురుశక్తి అభివృద్ధి చెందుతుంది. అదే సాధకుని యోగశక్తి. మనకు గురువు అనుగ్రహం వుంటే చాలు అన్నీ సమకూరుతాయి అనుకుంటాం. మన విశ్వాసమే అనుగ్రహంగా మారుతుంది. అది గురువుకు తెలియనవసరం లేదు. సమర్పణ లేనిదే తొలిమెట్టు ఎక్కలేం. యోగం చేస్తూవుంటే మనలోకి శక్తి వస్తుంది. అది గురువు నుండి వస్తుందో, మాస్టరుగారి నుండి వస్తుందో మనకు తెలియదు. వస్తుంది. రావడం మాత్రం ఖాయం. దాన్ని నిలుపుకోవడం మనవంతు. నిరంతర యోగసాధన ఒక్కటే దాన్ని నిలుపుకునే సాధనం. అలా ఏర్పడిన

చైతన్యమే మనం సంపాదించుకునే యోగశక్తి. ఒకసారి ఆ దివ్యశక్తిని మనం ఆహ్వానిస్తే మన గుండె తలుపులు తెరిస్తే, అది మనలో ప్రవేశిస్తుంది తిష్ట వేస్తుంది

మనిషిని కట్టుబానిసను చేసేవి సంప్రదాయం, ఆచారం, దురదృష్టం, కర్మ ఈ నాలుగు మనకృషిపైన మనకే నమ్మకం లేకుండా చేస్తాయి. ఆత్మవిశ్వాసాన్ని సడలిస్తాయి. మంచికీ, చెడుకీ భగవంతుని అడ్డంపెట్టుకుని, కర్మతో అదృష్టంతో ముడిపెడతాం. ఈ దుర్భరస్థితి మన దేశంలో మరీ ఎక్కువ. అందుకే చాలా దేశాల కన్నా మనం చాలాచాలా వెనుకబడి వున్నాం. విద్యతోపాటు వివేకం పెరగాలి. అది జరగటం లేదు మానసిక వికాసం కలగాలి, అదీ కలగడం లేదు. మూఢవిశ్వాసాలకు, సంప్రదాయాలకు, ఆచారాలకు బానిసలం అయివున్నంతకాలం మనం పెరగం, ముంగుకు పోలేం మతం ఉచ్చులో, కులాల విషపుకోరల్లో చిక్కి, ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై, చస్తూ జీవచ్ఛవాల్లాగా బ్రతుకుతాం.

అందరం ఆశిస్తాం, బ్రతుకంతా హాయిగా, సాఫీగా సాగాలని. అందుకు దేవుళ్లకు లంచాలిస్తాం, స్తోత్రాలు చేస్తాం, పొగుడుతాం. మనకొచ్చే అక్రమ సంపాదనలో వాటాలిస్తాం. మనం ఆశించిన ప్రయోజనాలు కలగకపోతే పొగిడిన దేవుళ్లనే వదలిపెడతాం మరో కొత్త దేవుడిని వెతుక్కుంటాం దేవుళ్ల అసమర్ధతల్ని సైతం మనమే నిర్ణయిస్తాం మతాల వారీ దేవుళ్లే కాదు, కులాల వారీగా దేవుళ్లు, గోత్రఋషులు ఏర్పడ్డారు మనకోసం. మనం చేసే వెధవపనులు, వేసే వేషాలు దేవుళ్లకు తెలీదా! అందుకే మన జోలికి రారు. మన దుష్టకార్యాలను ప్రోత్సహించరు. అనుకుంటాంగానీ మన మంచిచెడ్డలు లాభనష్టాలు పట్టించుకోవాల్సిన పని ఆ దేవుళ్లకేముంది? మన కోర్కెలు తీరితే దేవుళ్లకు పెళ్లిళ్లు చేయిస్తాం. విశ్వకళ్యాణం ఏదో మనవల్లే జరిగిపోయినట్లు మురిసిపోతాం. ఇంతచేసినా, మనకు అనుకూలంగా మంచి జరగకపోతే 'కర్మ' అని మొహం చాటు చేసుకుంటాం.

మా గురువుగారు ఇలా మరీ కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పేవారు. వారు చెప్పినవన్నీ సత్యాలే. ఆయన మాటలు తలకెక్కినకొద్దీ నాకు మిగతావాటిపైన ఆసక్తిపోయింది. వితండవాదం కాకపోయినా సమాధానం కటువుగా, తిక్కగా చెప్పడం అలవాటైంది. 'తిక్క' అనిపించవచ్చు గానీ అవి పచ్చినిజాలు. నిజాన్ని నిర్భయంగా చెప్పడం యోగసాధకునికి అవసరం. ఇంకా యింకా చదివి తెలుసుకోవాలనే ఆరాటం తగ్గింది. చదివి తెసుకునే దానికన్న, చదవకుండా హృదయంతో తెలుసుకోవడం మంచిది అనిపించింది. పుస్తకాలు చదవడం తగ్గింది. ఇప్పుడు కావలసింది ఆత్మ, బుద్ధి. యోగదృష్టితో సత్యాన్ని అందుకోవడం.

యోగానికి సంబంధించిన పుస్తకాలు ఇంగ్లీషులో లభ్యమైనన్ని చదివాను. హిందూ, బౌద్ధ, ఇస్లాం, జొరాస్ట్రియన్, ఎపిక్యూరస్ మతగ్రంథాలు, టిబెట్, నేపాల్ దేశాలలో గుప్తంగా వున్న గ్రంథాలు చదివే అవకాశం కలిగింది. అరవిందులు, రామకృష్ణ, రమణమహర్షి, సాయి, కృష్ణమూర్తి, థియోసఫీ గ్రంథాలు చదివాను. నాకు చివరకు నచ్చింది మాస్టర్‌యోగం. మిగిలినవి తక్కువనీ, నచ్చలేదనీ కాదు. నా తత్వానికి ఇది సరిపోయింది. నాకున్న కొద్దిపాటి సంస్కారం ఈ మార్గంలో ఇమిడింది. యోగసాధన ప్రారంభించినప్పటి నుండి నా సందేహాలు తీరిపోసాగాయి. మాయమబ్బులు ప్రిదిలి పోసాగాయి. మనస్సు నిర్మలం అయిందని చెప్పను కానీ శంకా నివృత్తమైంది. సత్యరోచిస్సులతో మాయచీకట్లు మాయమైనాయి. ప్రపంచం ఎందరో మహాత్ముల్ని ప్రభవించింది. అందరినీ అనుసరించలేం. 'మహాత్మ' అనేపదానికి అర్హులైన వారంతా సమానులే. సమకాలీనులు కాకపోవచ్చు. ఆత్మలోకాలలో అందరూ సహచరులే. ఏ ఒక్కరిని మనం ఆదర్శంగా తీసుకుని వారిని అనుసరించినా, వారి మార్గాన్ని అనుకరించినా మిగిలిన అందరూ ఆశీర్వదిస్తారు. మనతో సహకరిస్తారు.

తొలినాళ్లలో ఎవరికైనా యోగసాధనకు అవరోధాలు,ఆటంకాలు సహజంగా ఏర్పడుతుంటాయి. అవి పరీక్షలు. మనం నమ్మినదానిని జనం నమ్మనివ్వరు. మన పాటికి మనం ఏధో చేసుకుంటున్నామని ఊరుకోరు. విమర్శిస్తారు. అవీ ఇవీ చెప్పి భయపెడతారు. స్నేహంగా వున్నవారే అకారణంగా దూరమవుతారు. ఇదేం యోగం? ప్రాణాయామం లేదు, ఆసనాలు వేయడం లేదు, అని ఈసడించేవారు ఎక్కువైనారు. మనిషినైజం అది. మనం యోగంచేసి ఏదో కానిపని చేస్తున్నట్లు! భ్రష్టమైపోయినట్లు విమర్శ వారికి నచ్చని యోగం మనం చేసుకుంటే వారికి కష్టాలు, పాపాలు వస్తాయని బెంగ. "కలడు కలండనెడివాడు కలడో లేడో" అన్న సందేహం దేవుళ్ల విషయంలో సహజం. ఉన్నారో లేదో ఎవరు నిరూపిస్తారు! ఉన్నారనుకునేవారికి, నమ్మినవారికి నమ్మినవిధంగా కనిపిస్తారు. లేరనుకున్నవారి జోలికి దేవుళ్లు రారు. మన నమ్మకం, విశ్వాసం బట్టి దేవుళ్ల ఉనికి, మనికి వుంటుంది. మనం అవసరమై పిలిస్తే తప్ప వారు జోక్యం చేసుకోరు.ఈ నమ్మకాల సందర్భంగా నాకొక సంఘటన జ్ఞాపకం వస్తోంది. 1970 - 71 ప్రాంతంలో మద్రాసుకు ఒకబాబా వచ్చాడు. సినిమావాళ్లకు బాబాలంటే వెర్రివ్యామోహం. వెంటనే పోగవుతారు. ఆ బాబా టి.నగర్ పక్కన ఒక కాలనీలో బస చేశాడు. ఓ పత్రిక ఎడిటర్ ఆ బాబా దగ్గర చేరి, కాస్త డబ్బు దండుకుని పత్రికల్లో వార్త వేయిస్తానన్నాడు. ప్రెస్‌మీట్ ఏర్పాటు చేశాడు. ఉన్న చిన్నాపెద్ద, పది పత్రికల వారిని వచ్చి

బ్రతిమిలాడారు అయిదు గంటలకు ఇంటర్వ్యూ. నేనుముందే చెప్పాను ఆరుగంటలకు ముందే నేను వెళ్లిపోతాను ఉండలేను అని. ఏ పరిస్థితిలోను గురువుగారింట ప్రేయర్ మిస్ అవడం నాకిష్టం లేదు సరే అన్నారు. నాలుగున్నరకు నేను వెళ్లాను వర్షం భారీగా పట్టుకుంది. ఎవరూ జనం రావడం లేదు. ఆ బాబాకు నన్ను పరిచయం చేశారు. అతను కుర్రవాడు. ముప్పయి ఏళ్లు లేవు బషీర్‌బాబా అనుకుంటాను పేరు. ఆయన గదిలో రకరకాల ఫోటోలు, పటాలు వున్నాయి. 'నాకు ఆరుగంటలకు ప్రేయర్.. నాప్రేయర్ అయ్యేవరకు ఎవరినీ లోపలకు రానివ్వకండి 'అని బాబాతో చెప్పాను. ఆయన నాతోనే కూర్చుని నన్ను గమనించసాగాడు అప్పట్లో మూవ్‌మెంట్స్, వైబ్రేషన్స్ చాలా ఎక్కువగా వచ్చేవి. మెలికలు తిరిగిపోయేవాడిని. ఎడుగంటలకు నా ప్రేయర్ పూర్తయింది. అతను నా కాళ్లమీదపడి నమస్కరించి "స్వామీ మీరు అసామాన్యులు,పెద్దయోగులు. నన్ను మీ శిష్యునిగా చేసుకోండి" అని అర్థించాడు

"నాకు శిష్యులేమిటి? నేను గురువునుకాను బాబా. కొత్తగా యోగంలో చేరినవాడిని."

. నా గురించి, యోగం గురించి వివరంగా చెప్పాను

"ఇన్ని పటాలు పెట్టుకున్నారు వీటితో మీరు జనాల్ని ఆకర్షించి, మోసం చేస్తున్నారు" అన్నాను.

ఆ బాబా కన్నీళ్లు పెట్టుకున్నాడు.

"ఏ చెయ్యను గురూజీ, అమ్మ, ముగ్గురు చెల్లెళ్లను పోషించాలి. చెల్లెళ్ల పెళ్లిళ్లు చేయాలి. మరో సంపాదన లేదు. చదువు తక్కువ. ఇలా 'బాబా' వేషం వేసి సంపాదించడం సులభం."

"మీ మతంలోనే ఇలాంటివి చేయవచ్చు గదా."

"మా మతంలో ఈవెధవపనులు చేస్తే చంపేస్తారు. మీ హిందువుల్ని సులభంగా మోసం చేయవచ్చు. డబ్బు సంపాదించవచ్చు."

నాకు అతని మోసం చూస్తే అసహ్యం వేసింది.

"మీరు నన్ను క్షమించి, ఆశీర్వదించండి" అని పాదాలపై బడి ఏడ్వసాగాడు.

అలాంటి మోసపు బాబాలను ఆశీర్వదించకూడదు.

ఆ బాబాకు తర్వాత చాలామంది భక్తులు చేరారు. ఏవేవో మహత్తులు ప్రచారంలోకి వచ్చాయి. తను అమెరికా వెళ్లి దండిగా డబ్బు సంపాదించి తెచ్చుకున్నాడు. అమెరికాలో ఇండియన్ బాబాలకు, స్వామీజీలకు, భగవాన్లకు డిమాండ్ ఎక్కువ. ఇక్కడ

[illegible] కాషాయాలు ధరించి అక్కడ హిందూత్వం ప్రచారం చేసి, 'యోగం' పేరు చెప్పి కోట్లు సంపాదిస్తుంటాడు ఈయన అదేపని చేశాడు ఇండియా తిరిగి రాగానే చనిపోయాడని తెలిసింది

ఇలాంటి వారిని చూస్తే అసహ్యం వేస్తుంది. జుగుప్స కలుగుతుంది. యోగానికి ఆధ్యాత్మిక జీవనానికి పట్టిన చీడపురుగులు అనిపిస్తుంది. అన్ని దేవుళ్లపటాలు పెట్టుకుని మోసం చేయడం తప్పు. జనం బలహీనతల్ని వీరు స్వప్రయోజనాలకు వాడుకుంటారు. ప్రశాంతంగా వున్నవారిని ఆశ్రయించడం అవసరం. మనిషికి కొంతైనా మానసిక శాంతి [illegible] కానీ రంగులుమార్చి, మోసం చేసి ఇతర మతాలవారిని, ఇతర మార్గాల వారిని ఆకర్షించడం నాకు మనస్కరించదు. డబ్బుకోసం, కీర్తికోసం యోగాన్ని ఆధ్యాత్మికతను బలిపెట్టడం ద్రోహం మనదేశంలో ఇలా గారడీలు చేసి, మహాత్ముల పేరున గారడీలు [illegible]వాళ్లుగా చలామణీ అవుతున్నారు ఎవడికి వాడు తానే అవతారపురుషుడినంటాడు. జనం వెర్రిగా వెంటపడతారు కొన్ని సంవత్సరాలకు రంగు మాసిపోతుంది. నిజరూపాలు వికృతంగా బయటపడతాయి. మగవారే కాదు. ఇప్పుడు కొందరు అమ్మాజీలు, మాతాజీలు ఇలా ఆధ్యాత్మిక వ్యభిచార కేంద్రాలు నెలకొల్పుతున్నారు.

## నా ఫీలింగ్సును బట్టి నా నిర్ణయాలు.

ఒకరి ప్రోద్బలంతో నేను నిర్ణయాలు మార్చుకోను. 'గాడ్‌మెన్' అనే మాటను నలభై సంవత్సరాలక్రితం విన్నాను. గాడ్‌మెన్‌గా ప్రచారం పొందుతున్నవారి గురించి చదివాను, తెలుసుకున్నాను. భగవాన్ పదం నాకు విచిత్రం అనిపిస్తుంది. మహర్షి, ఋషి, ముని అనే పదాలకు విశిష్టమైన అర్థాలున్నాయి. ఈ 'గాడ్‌మన్' అనే సంకరపదం ఎలా వచ్చింది. రమణమహర్షి అంటే కలిగే స్పందన, అనుభూతి రమణభగవాన్ అన్నప్పుడు కలగదు. భగవాన్ అంటే భగవంతుని ప్రతినిధి అనా? అవతారమనా? భగవంతుని దర్శించాలనుకున్నంత మాత్రాన భగవాన్ ఎలా అవుతారు! రమణ మహర్షి, అరవిందయోగి, రామకృష్ణ పరమహంసల చిత్రపటాలు చూస్తే ఏదో హృదయస్పందన కలుగుతుంది. మనస్సు శీతలమై, సేదతీరినట్లు అనిపిస్తుంది. అలా కలగనప్పుడు వారు భగవానులమని చెప్పినా తృప్తి కలగదు.

నా ఫీలింగ్సు నావి. ఒకరిని నిందించను. కానీ కొందరిని చూస్తే, వారి ఫోటోలు చూస్తే ఎవర్షన్ కలుగుతుంది. కడుపులో దేవినట్లవుతుంది. ఎవరి భక్తులు వారికుంటారు! నాకు మోడరన్ స్వాముల ఫోటోలుచూస్తే, ఎలాంటి స్పందన కలగదు. స్వామి వివేకానంద

ఫోటో చూచినా, నాకు రామకృష్ణ పరమహంస ఫోటో చూచినప్పుడు కలిగే అనుభూతి కలగదు మాస్టరుగారి ఫోటో చూచినప్పుడు చూపు తిప్పుకోలేకపోయాను. ఆయన ఫోటోలోంచి సజీవమూర్తివలె నా గుండెలోకి చూస్తున్నట్లు అనిపిస్తుంది శరీరం జలదరించింది. అదే, ఆ స్పందనే నన్ను మాస్టర్‌యోగంలోకి లాగిందేమో! నన్ను నేను మరచిపోవడం నిమిషాలలో జరుగుతుంది. కళ్లు మూసుకుని, మాస్టర్ రూపాన్ని భావించగానే మగత ఆవహిస్తుంది. ఏదో శూన్యంలోకి వెళ్లిపోతాను. ఆ పారవశ్యం చాలు నాకు. ఆపైన ఏమీ కోరను!

యోగంలో ఏదో సాధించాలని గానీ, ఒక గురువును కావాలని, మాస్టరును అనిపించుకోవాలని నాకెన్నడూ లేదు యోగంతో మరేదో లబ్ధి పొందాలని తలచలేదు అసలు నా బడుగుజీవితం మలుపు తిరిగి ఆధ్యాత్మికం దిశగా పయనించడమే మహద్భాగ్యం సీదాసాదాగా యోగంలో చేరాను ఏదీ కోరకపోయినా, జీవనం సాఫీగానే సాగుతోంది. చాలు. నాకు ఏవి అవసరమో మాస్టరుగారే నిర్ణయిస్తారు, ప్రసాదిస్తారు అది నా నమ్మకం. అర్హత, యోగ్యత లేనిది అర్థించినా, దేబిరించినా యివ్వరు. అర్హతలు పెంచుకోవడం సాధకుని కర్తవ్యం. మన లక్ష్యం యోగసాధన యోగం ఏమిస్తుందని, ఏమి లాభమని ఎప్పుడూ ఆలోచించకూడదు. అలాగ నేను ఆలోచించను

ఇల్లు మార్చవలసి వచ్చింది. ఉద్యోగం చేసినంతకాలం ఊళ్లుమారడం, ఇళ్లు మారడం తప్పదు యోగంలోకి రావడమే జీవితంలో పెద్దమార్పు. కొత్త ఇంటికి మారాక 'డిస్కవరీ ఆఫ్ మాస్టర్‌యోగ' రాయటం మొదలెట్టాను. తెలుగులో కాకుండా ఇంగ్లీషులో ఎందుకు రాయాలనిపించిందో చెప్పలేను. నాకు ఇంగ్లీషు పరిజ్ఞానం బహుస్వల్పం. చిన్నచిన్న వ్యాసాలు రాసే అలవాటుంది గానీ ఏకంగా ఒక పుస్తకమే రాయబూనడం సాహసం. అది మాస్టరుగారి సంకల్పం కావచ్చు. ఉద్యోగం చేస్తున్నది మద్రాసులో. తెలుగు ప్రాంతం వదలిపెట్టి పది సంవత్సరాలవుతోంది. పరిచయాలు, రాకపోకలు తగ్గిపోయాయి. ఎప్పుడైనా తల్లిదండ్రులను చూడడానికి తెనాలి వెళ్లడమే. అసలు నాకు మాబంధువులు ఎక్కడెక్కడున్నారో తెలియదు. అజ్ఞాతవాసం లాంటి ప్రవాసజీవితం అది. ప్రాణం యిచ్చే స్నేహితులు నాకు అసలు లేరనే చెప్పాలి.

నా జాతకం ఎలాంటిదోకాని నేనంటే అసూయపడేవారు, నన్ను ఇష్టపడనివారు కొందరుంటారు. పైకి అందరూ ఆత్మీయంగా, మంచిగా ఉన్నట్లు నటిస్తుంటారు. చాటుమాటుగా అపకారం తలపెడుతుంటారు. మూడుగ్రహాలకు పాపార్గళ దోషం పట్టింది. రెండు గ్రహాలు ఉచ్ఛ. కొన్ని శుభగ్రహాలకు నీచగ్రహదృష్టి వుంది. కనుక

మొదటినుండి ఎదురుదెబ్బలు తినక తప్పడం లేదు కాలేజీ జీవితంలోనూ, జర్నలిజం లోనూ అదే పరిస్థితి అనవసరంగా నన్ను ద్వేషించేవారు. అవమానపరిచేవారు తారసపడు తుంటారు అయితే నన్ను ప్రేమించేవారు, నా స్నేహాన్ని అభిలషించేవారు ఎక్కువ మందే వున్నారు కడకు యోగంలోనూ ఈ పోటీ తప్పలేదు. కొందరు అనవసరంగా ద్వేషిస్తే, మరికొందరు వెతుక్కుంటూ వచ్చి నాతో మైత్రిని పెంచుకున్నారు. ఏమిటో అంతావిచిత్రం, విధివిలాసం

పి.ఎస్.ఆర్. శర్మగారికి నేను యోగం చేయడం ఇష్టం లేదు. ఆయనది ఒంగోలు మాస్టరుగారి పద్ధతి నాది కుంభకోణం మాస్టరుగారి పద్ధతి. నేను డాక్టరుగారి గదిలో ప్రేయర్‌లో కూర్చుంటే శర్మగారు బయట స్టేజీపైన ఒంటరిగా కూర్చునేవారు. నా పక్కన కూర్చుంటే మైలపడతానని, యోగభ్రష్టం అవుతుందని ఆయన అనుమానం. ఆయన వల్ల ఒక మేలు జరిగింది. విజయవాడ యోగమిత్రులకు నా గురించి చెప్పింది ఆయనే. ఒకరోజు డాక్టరుగారింట్లో కబుర్లు చెబుతుండగా ఒక సన్నటి వ్యక్తి వచ్చి, డాక్టరుగారికి నమస్కారం చేశాడు బహుశా ఆయనకు తెలిసినవాడై వుంటాడనుకున్నాను.

"శార్వరి ఎవరు?" అని డాక్టరుగారిని ప్రశ్నించాడు.

డాక్టరుగారు ఎదురుగా వున్న నన్ను పరిచయం చేశారు

ఆయన నాతో కరచాలనం చేస్తూ 'నాపేరు దాసు' అని పరిచయం చేసుకున్నాడు. నా మిత్రుడు, నటుడు పొట్టి ప్రసాద్‌కి ఆయన బావగారు. ఆ రోజు నుండి దాసుగారికి, నాకు స్నేహం విడదీయరాని ఆత్మీయతాబంధం అయింది. దాసుగారి పేరు మధుసూదనరావు. ఒంగోలు మాస్టరుగారు మైనంపాటి నరసింహంపంతులుగారి కుమారుడు. ఉండేది విజయవాడ. పరిచయం అయిన రోజునే ఇద్దరం చాలాసేపు సంభాషించుకున్నాం. ఆయన చివరకు అన్నమాటలు "శర్మ నిన్ను అపార్థం చేసుకున్నాడు శార్వరీ! అతని మాటలు సీరియస్‌గా తీసుకోకు."

ఆయనకు ఉద్యోగం సద్యోగం లేదు. ఆస్తిపాస్తులు ఉన్నాయి. విజయవాడలో వుంటూ యోగమిత్రుల యోగక్షేమాలు విచారిస్తుంటారు. ఎం.ఎన్.గారి శిష్యబృందం అంతా వీరిని గురువుగారి అబ్బాయిగా గౌరవిస్తారు. గుంటూరు, విజయవాడ, పిడుగురాళ్లలో జరిగే యోగసమావేశాలలో ఎం.ఎన్.గారి ప్రతినిధిగా పెత్తనం చేస్తుంటారు. మంచి స్నేహితుడు నావరకు.

# యోగంపైన నా తొలిరచన

**యో**గంపైన తొలిరచన ఇంగ్లీషులోనే.

అప్పటిదాకా ఏవో చిన్న చిన్న వ్యాసాలు, యోగగ్రంథాలపై సమీక్షలు చాలా రాశాను గానీ, ఆథెంటిక్‌గా యోగంపైన ఒక పుస్తకమూ రాయలేదు. అలాంటి పుస్తకం ఒకటి నేను రాయగలనని ఎన్నడూ అనుకోలేదు దానికి చాలా పరిశ్రమ కావాలి, పరిశోధన చేయాలి. విషయసేకరణ జరగాలి. ఇవి ఒక రచయితగా నాకున్న అనుభవాలు. ది డిస్కవరీ ఆఫ్ మాస్టర్‌యోగా రచనకు నాకు స్ఫూర్తినిచ్చింది యోగసాధన. సాధనే నాకు ప్రేరణ. ఏదో అంతఃస్పందన నన్ను ముందుకురికించింది. మాస్టరుగారి సందేశం అందుకుని చాలాకాలమైంది. కానీ ధైర్యం చాలలేదు. కొంతకాలం ఆలోచన, కొంతకాలం ప్లానింగ్ .. ఏం రాయాలి, ఎలా రాయాలి, ఎక్కడ మొదలుపెట్టాలి? అన్నది రచయిత కృత్యాదవస్థ మాస్టరుయోగం గురించిన పుస్తకాలు లేవు. సమాచారం అందదు. అక్కడక్కడ కొందరు సాధకులు, మాస్టరుగారి శిష్యులు ఉన్నా నోరు విప్పి చెప్పరు. గురువుగారి అనుమతి, ప్రోత్సాహం నాకు ఊపిరి. పగలు ఆఫీసులో పని తప్పదు. రాత్రి పదిగంటల తర్వాత కూర్చునేవాడిని. పన్నెండు, ఒంటిగంటవరకు కుస్తీపట్లు. ఇంగ్లీషులో రాయడం కదా, స్పెల్లింగ్స్, గ్రామరు జాగ్రత్తగా గమనించాలి. మాస్టర్‌గారి యోగం గురించి రాస్తూ, మిగిలిన యోగాల గురించి స్పృశించదలచాను. మిగతావాటి గురించి చెప్పకుండా ఈ యోగం గొప్పది అంటే, నేను చేస్తున్నాను కనుక గొప్పదని పొగిడినట్లు విమర్శలు వస్తాయి. నాలో జర్నలిస్టు ప్రతిక్షణం హెచ్చరిస్తుంటాడు ఏది రాయాలన్నా. నిద్రపోతున్నా, మేల్కొనివున్నా, ఏ పనిచేస్తున్నా ఒక పుస్తకం రాయడం ప్రారంభించిన నాటి నుండి అవే ఆలోచనలు ఊపిరిసలపనీయవు. ఇలాంటి గ్రంథాలు రాస్తున్నంతకాలం నిగ్రహం వుండాలి. సంయమనం పాటించాలి. వీలైనంతవరకు బ్రహ్మచర్యం పాటించాలి. మనిషి నైజం, ప్రవర్తన అన్నింటిలోనూ మార్పు వస్తుంది. వచ్చితీరాలి, తప్పదు.

అప్పుడే డాక్టర్ జి.బి.ఎస్ 'నూతనప్రవిభాగం' రాయడం ప్రారంభించారు అది మాస్టర్‌గారి ప్రియశిష్యుడు ప్రొఫెసర్ పోతరాజు నరసింహం పంతులుగారి 'న్యూడిస్పెన్సేషన్' వ్యాసానికి తెనుగు డాక్టర్‌గారికి పెరాలిసిస్ వచ్చి, కాలు చేయి పనిచేయడం లేదు కనీసం ప్రిస్క్రిప్షన్ కూడా రాయరు అలాంటిది యోగ పుస్తకం సంకల్పించగానే చేయి పనిచేయసాగింది. చక్కగా తనే స్వయంగా రాయసాగారు. అప్పుడప్పుడు నాకు డిక్టేషన్ యిస్తుండేవారు మాస్టర్ గారిని గురించి యోగం గురించి మాట్లాడేటప్పుడు ఆయనకు మాటలు స్పష్టంగా వచ్చేవి అసలు ఆయనకు పెరాలిసిస్ అనే అనుమానం ఎవరికీ వచ్చేది కాదు. ఇతర సమయాలలో మళ్లీ తడబాటే. అలాంటిది మాస్టరు అనుగ్రహం నేను ఆ పుస్తకం మాస్టర్ కరుణతోనే ప్రారంభించాను. లేకుంటే మాస్టర్‌గారియోగంపై నేను రాయడం ఏమిటి? ఆయనే నాచేత రాయించారు.

ఆ పుస్తకం రాస్తున్నకాలంలో ఎందరో మహర్షుల్ని మహాత్ముల్ని దర్శించుకున్నాను కొందరు యోగసమయంలో కొందరు స్వప్నంలో దర్శనం యిచ్చారు. రామకృష్ణ పరమహంస, షిరిడీసాయి, జీసస్, అరవిందయోగి, రమణమహర్షి, మాస్టరుగారు ఇంకా ఎవరెవరో నేను గుర్తించలేని మహర్షులు కన్పించి నా సందేహాలు నివృత్తి చేసేవారు. అలా పుస్తకం పూర్తయ్యేవరకు సాగింది. పుస్తకాన్ని తప్పులు సరిచేసుకుంటూ రెండవప్రతి తయారుచేశాను. అప్పటికి డాక్టరుగారి పుస్తకం పూర్తయింది. మాస్టర్ యోగాజర్నల్ పత్రికకు డిక్లరేషన్ వచ్చింది. డాక్టర్‌గారు చదివి ఓ కే చేశాక ప్రెస్‌కిచ్చాం. పుస్తకం ముందు బయటకొచ్చింది. తర్వాత పత్రిక ప్రారంభించాం. రెండింటికీ పెట్టుబడి నాదే పత్రిక ఎడిటర్‌గా డాక్టర్ బాలసుందరరావుగారి పేరుపెట్టాను. పెద్దవారు, నాకు గురువు ఆయన. నిర్వహణ బాధ్యత అంతా నాదే! లాభనష్టాలతో, కష్టసుఖాలతో ఆయనకు నిమిత్తంలేదు. మూడుసంచికలు వచ్చింది పత్రిక. తర్వాత మూతపడింది.

'యోగ జర్నల్' మొదటి సంచిక వేయి కాపీలు వేసి, అందరికీ ఉచితంగా పంచిపెట్టాం. మా ఆశయం ఒకటే మాస్టర్‌యోగ గురించి జనానికి తెలియచెప్పాలి. కొంతకాలంగా అజ్ఞాతంలో వున్న యోగాన్ని వెలుగులోకి తేవాలి. అందుకు పత్రిక ఇంగ్లీషులో వుంటే మంచిది. నా 'డిస్కవరీ ఆఫ్ మాస్టర్ యోగా' కూడా ప్రచురణ జరిగింది. మద్రాసులో వున్న యోగసాధకులందర్నీ పరిశోధించి ఒక సమావేశం జరిపాం. పత్రికవల్ల అంతా నష్టమే వచ్చింది. అయితే పత్రిక చదివినవారు ఓ వందమంది వరకు ఉత్తరాలు రాశారు యోగంలో చేరతామని. వారందరికీ సమాధానం రాస్తూ ప్రేయర్ ఎలా చేసుకోవాలో చెప్పేవారం. అన్ని ఉత్తరాలకు జవాబులు నేనేరాసినా సంతకం డాక్టరుగారిది వుండేది.

కొత్తపెళ్లికొడుకు సంబరం లాంటిది యోగసాధకునిది.ఎప్పుడెప్పుడు చీకటిపడుతుందా అని ఎదురుచూచినట్లే ఎప్పుడు సాయంత్రం అవుతుందా, ఎప్పుడు తెల్లవారుతుందా, ప్రేయర్ చేసుకోవచ్చునని సాధకుని మనస్సు తొందరపడుతుంది. నావరకు తపన అలా వుండేది. ఆరుగంటలకు ప్రేయర్ చేసుకకపోతే పిచ్చిపట్టినట్లు అయ్యేది. మరచిపోవడం అనేది లేనే లేదు. యోగం కారణంగా ఫస్ట్‌షో సినిమాలు బంద్ అయ్యాయి. యోగంలో చేరాక సినిమా ప్రివ్యూలకు, స్టూడియోలకు వెళ్లడం మానివేశాను. థియేటర్‌లో సినిమా చూడాలన్నా మ్యాటినీ, లేదా రాత్రి రెండవ ఆట అలాగా జీవితం ఒక క్రమశిక్షణకు లోనైంది క్రమశిక్షణ పాటించే వారికి క్రమవికాసం కలిగి తీరుతుంది. యోగం ప్రారంభించిన అయిదారునెలలకు నాకొకసారి తీవ్రంగా జ్వరం వచ్చింది. నాలుగురోజులు మంచం పట్టాను డాక్టరుగారు ట్రీట్‌మెంట్ యిచ్చినా తగ్గలేదు. నాల్గవరోజు రాత్రి ఒక చిత్రం జరిగింది. నా శరీరం యావత్తూ విద్యుత్ ప్రవహించినట్లయింది. గుండె వద్ద, భుజాల మధ్య, భృకుటి వద్ద దీపాలు వెలిగాయి. శరీరంలోని నరాలు రీసెట్ చేసినట్లయింది. ఏవో కొత్తకనెక్షన్స్ కొత్తలింకులు ఏర్పడ్డాయి. నాలుగైదుగంటలపాటు యోగా ఆపరేషన్ జరిగింది తెలతెలవారుతుండగా శరీరానికి చెమట్లు పట్టి, జ్వరం తగ్గింది. ఉదయానికి నార్మల్ కొచ్చింది. ఆరోజు నుండి నాలో యోగక్రియ తీవ్రం కాజొచ్చింది నేను సంపూర్ణంగా యోగానికి అంకితమైనాను

## 'ది డిస్కవరి ఆఫ్ మాస్టర్‌యోగ'

అచ్చవగానే మొదటికాపీ మాస్టరుగారి శిష్యుడైన టి.ఎస్. శంకరయ్యర్‌గారి కివ్వాలని ఆశ. డాక్టరుగారు, నేను కలసి అడయారు వెళ్లాం శంకరయ్యర్‌గారింటికి. అప్పటికి ఆయనతో నా పరిచయం అంతంత మాత్రమే. ఆయనకు పాదాభివందనం చేసి, పుస్తకం చేతికిచ్చాను ... మీ బ్లెస్సింగ్స్ కావాలన్న రిక్వెస్టుతో. ఆయన పుస్తకంపేరు చూడగానే నిప్పులో ఉప్పు వేసినట్లు చిటచిటలాడారు. ఇంగ్లీషులో, అరవంలో తనకు వచ్చిన తిట్లన్నీ తిట్టాడు. నాకు ఏడుపొచ్చింది.ఎరక్కపోయి వచ్చి ఇరుక్కుపోయాను.

"అసలు నువ్వెవరు పుస్తకం రాయడానికి? మాస్టర్‌యోగంపై రాసే అర్హత నీకేది? నువ్వసలు మాస్టర్ని చూచావా? ఆ యోగం నీకేం తెలుసని? 55 సంవత్సరాలుగా యోగంలో తలమునకలైన నేనే రాయలేదు. మహామహావాళ్లు మీడియమ్స్, వారెవరూ రాయలేదు. అసలు మాస్టర్‌గారే ఎవరినీ రాయవద్దన్నారు నీకు తెలుసా?" ప్రశ్నించారు.

"అర్హతలేని వాళ్లని రాయవద్దని వుంటారు" చల్లగా అంటించాను.

"నీకు అర్హత వుందా! మాకు లేదా?"

" ఆ విషయం పుస్తకం చదివినవారు నిర్ణయించాలి. చదవకుండా నిర్ణయాలు చేయడం, జర్నలిస్టుగా నేనొప్పుకోను "

ఒక అర్ధగంటతర్వాత చల్లబడ్డాడు. "సరే, నేను చదువుతాను. నాకు నచ్చకపోతే..'

"పుస్తకం రిలీజ్ చెయ్యను. వెయ్యి కాపీలు డిస్కార్డ్ చేస్తాను. మాస్టరుగారికి గాని, మాస్టర్ యోగానికి గాని అప్రతిష్ట కలిగేపని చేయను. ప్రామిస్ "

వచ్చేశాం!

పెద్దాయన. అసలే ప్రిజుడిస్‌తో వున్నాడు అందునా అరవ్వాడు, తెలుగువాళ్లంటే పడదు. తిక్కమనిషని తెలుసు. చాదస్తం ఎక్కువ... కానీ మాస్టర్‌గారి డైరెక్ట్ మీడియం. మాస్టర్‌గారిని చూచినవాడు ఆయన దగ్గర కూర్చుని యోగంలో ఓనమాలు నేర్చినవాడు. ఈయనగారి తీర్పుతో నేను యోగం కొనసాగించడమో, విరమించడమో జరుగుతుంది. రోజుకో యుగంలాగ గడిచింది. పుస్తకం చదవడానికి వారంరోజులైనా పడుతుంది. మళ్లీ ఆదివారం నాటికి నా పుస్తకం భవిష్యత్తు, నా యోగం భవిష్యత్తు తేలుతుంది కాని నాల్గవనాడే మా ఆఫీసుకు ఫోన్ వచ్చింది.

"సాయంత్రం ఆఫీసు నుండి సరాసరి అడయార్ రా.."

ఫోన్ కట్. సస్పెన్స్. సాయంత్రం వరకు, ఆయన శపించడానికి పిలిచాడా? వరం ఇవ్వడానికి రమ్మన్నాడా! టెన్షన్. పెందలకడనే పర్మిషన్ తీసుకుని బస్సెక్కాను. "డోంట్ బ్రింగ్ దట్ డాక్టర్" అనీ చెప్పాడు. టి.ఎస్.కు డాక్టరు గారంటే పెద్దగా గౌరవం లేదు ఎంచేతనో మరి. అయ్యర్ గారింట్లోకి అడుగుపెడుతుండగా కాళ్లు వణికాయి. చెమట్లు పోశాయి. నన్ను చూడగానే "వాంగో, వాంగో" అని పడక కుర్చీలోంచి లేచి, ఎదురువచ్చి కౌగిలించుకున్నాడు. "హమ్మయ్య" రిజల్ట్ తెలిసిపోయింది.

"కంగ్రాచ్యులేషన్స్ మై బాయ్" అన్నాడు. ఏం బాయో, ఏం పాడో, నాలుగు రోజులు నాకు నిద్రపట్టకుండా చేశాడు మహానుభావుడు.

"చాలాబావుంది శర్మా, ట్రెమండస్."

ఆయనకు పాదాభివందనం చేశాను. పక్కనే ఆయనపాదాల వద్ద కూర్చున్నాను. బలవంతంగా లేపి తన ప్రక్కన సోఫాలో కూర్చునే వరకు వదల్లేదు.

"యోగానికి నీ అవసరం చాలావుంది శర్మా, మాస్టర్‌గారు నిన్ను సెలెక్టు చేశారు. మాస్టర్ యోగం బహుళ వ్యాప్తం అయ్యేటైం దగ్గరపడ్డది అందుకే, అందుకేనయ్యా డైరెక్టు మీడియంలు మేం ఎవ్వరం చేయలేని పని నీవు చేశావు. ఉహు. మాస్టర్‌గారే నీ చేత చేయించుకున్నారు." అన్నారు అభినందనగా.

ఆయన ప్రేమగా స్వీటు తినిపించాడు. భార్యను, కొడుకును, కోడల్ని పరిచయం చేశాడు. "ఈ శర్మ మన పెద్దబ్బాయి. అవర్ ఎల్డర్ సన్" అని చెప్పి ముచ్చటపడ్డాడు

తను పాతిక పుస్తకాలు తీసుకుని మీడియమ్స్ అందరికీ పంపాడు బెంగుళూరులో రఘునాధ అయ్యర్ అని డైరెక్ట్ మీడియం వున్నారు. ఆయన 'హిందూ'పత్రికలో అసిస్టెంట్ ఎడిటర్‌గా చేశారు. ఆయనకు ఒక పుస్తకం పంపారు.

ఆయన సిగ్నల్ ఇవ్వగానే ఇండియాలో వున్న అన్ని దినపత్రికలకు రివ్యూకోసం పంపాను. రివ్యూలకే నూరు పుస్తకాలు ఖర్చయినాయి. కానీ అవసరం. పబ్లిసిటీ కావాలి. పుస్తకం ఒకటి వచ్చినట్లు జనానికి తెలియాలి తెలుగు, తమిళ, కన్నడ, హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు దినపత్రికలలో చాలా మంచి సమీక్షలు వచ్చాయి. ఏ తండ్రికైనా కొడుకుపుట్టినప్పటి సంతోషం కంటే ఆ కొడుకు ప్రయోజకుడైనప్పుడు ఎక్కువ సంతోషం కలుగుతుంది. ఒక రచయితకూ అంతే పుస్తకం రాసినప్పటి సంతోషం వేరు. అది అచ్చయి, పది పత్రికల్లో మంచి సమీక్షలు వచ్చినపుడు, విద్యావంతుల అభినందనలు అందుకున్నప్పుడు, ఆ రచయితకు నిజమైన తృప్తి కలుగుతుంది.

'దినమణి' పత్రికలో రివ్యూ అచ్చయిన రోజున దినమణి న్యూస్ ఎడిటర్ రామనాధం నా దగ్గరకు వచ్చాడు "శర్మా, ఆ పుస్తకం రాసింది నువ్వేనా?" అని అడిగాడు.

అవునన్నాను. "వండర్‌ఫుల్. అయితే నీవు మాస్టర్ యోగం చేస్తావన్న మాట. ఎప్పుడూ చెప్పలేదేం "

ఎందుకు చెప్పాలి! నేను మాసెక్షన్‌లోనే ఎవరికీ తెలియనివ్వలేదు.

రామనాధంకి మాస్టరుగారు తెలుసునట. కుంభకోణంలో మాస్టర్‌గారివీధిలోనే వీరిల్లు. మాస్టరుగారి పెద్దబ్బాయి వెంకట్రావు, ఈ రామనాధం క్లాసుమేట్స్. కలిసి కుంభకోణంలో చదువుకున్నారు.

చాలా చాలా విషయాలు అడిగి తెలుసుకున్నాను. సాధారణంగా చాలామందికి తెలియని విషయాలు మిత్రుడు రామనాధం నాకు చెప్పారు. "మాస్టర్‌గారి జీవితకథ" రాయడానికి రామనాధన్ ప్రేరణ. ఆయనచెప్పిన మాస్టర్ కుటుంబ విషయాలు నా పుస్తకంలో రాశాను.

ఆ పుస్తకం ఒక 'తరంగం' లాగా పనిచేసింది ఇంగ్లీషు దినపత్రికలన్నీ రివ్యూ చేశాయి. టైమ్స్ ఆఫ్ ఇండియా, హిందూస్తాన్ టైమ్స్, ది హిందూ లాంటి పెద్ద పత్రికలలో ఎం.పి. పండిట్ లాంటి పెద్దలు సమీక్షించారు. ఈ సమీక్షల వల్ల మాస్టర్ యోగం పట్ల ఆసక్తి కలిగింది ఇంతకాలంగా అజ్ఞాతంగా వుండి జనం మరిచిపోయిన యోగం ఒక్కసారి

సంచలనం కలిగించింది మద్రాసు విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ ప్రొఫెసర్ శ్రీ పి. నరసింహంగారు ఆ రోజుల్లో ఇంగ్లీషులో చాలా వ్యాసాలు రాశారుట. ఎన్. నారాయణయ్యర్, టి.ఎస్. రామానుజం కొన్ని పుస్తకాలు రాశారు. 20 వ శతాబ్దపు ఉత్తరార్ధంలో వెలుగులోకి వచ్చిన పుస్తకం నాది. మాస్టర్ యోగాన్ని మళ్ళీ వెలుగులోకి తెచ్చిన పుస్తకం "డిస్కవరీ ఆఫ్ మాస్టర్ యోగ."

# అనుభవాలు

ఒక అనుభవం కలిగించే తృప్తి, ఆత్మవిశ్వాసం ఎన్ని పుస్తకాలు చదివినా కలగదు. అడుగడుగునా నాఅనుభవాలే నన్ను ముందుకు నడిపించాయి. నేను చేస్తున్న యోగసాధనలో నమ్మకం పెరిగేటట్లు చేశాయి దేనినైనా ఆమోదించడానికి తిరస్కరించడానికి నా అనుభవాలే నాకు గీటురాళ్లు. నా పుస్తకం 'డిస్కవరీ ఆఫ్ మాస్టర్ యోగా' వెలువడినప్పుడు నెల్లూరు నుండి ఒక ఇంజనీరు తెప్పించుకుని చదివాడు. ఆయన రాత్రిపూట పుస్తకం చదువుతుంటే కళ్లు బరువెక్కాయి అలాగే పక్కనపెట్టి నిద్రపోయాడు. తెల్లవారేసరికి కళ్లు లావుగా వాచిపోయాయి మంట, నీరుకారడం జాండిస్ వచ్చిందేమోనని భయపడ్డాడు. ఆఫీసుకు సెలవుచీటి పంపి, మళ్లీ చదవనారంభించాడు. కొన్ని పేజీలు చదివేసరికి కళ్ల మంటలు తగ్గాయి. చల్లగా అనిపించింది. అద్దంలో చూచుకుంటే ఎరుపు కనిపించలేదు. మధ్యాహ్నానికి వాపు తగ్గింది. యోగంపై నమ్మకం కలిగింది. మాస్టరుగారికి నమస్కారం చేసుకుని పుస్తకం మరికొంత చదివేసరికి కళ్ల కలక తగ్గిపోయింది.

ఆయన మర్నాడు నాకు ఉత్తరం రాశాడు. నాకూ ఆశ్చర్యం వేసింది. పుస్తకం చదివినంత మాత్రాన అలా జరుగుతుందా!

మాస్టరుగారు అలాంటి అద్భుతాలు ఎన్నో చేశారని విన్నాను. షిరిడీసాయి జీవితంలోనూ ఇలాంటి విచిత్ర అద్భుత సంఘటనలు విన్నాం. కానీ ఒక పుస్తకం ఎంత శక్తివంతంగా పనిచేసింది!! ఆ పుస్తకం రాస్తున్నప్పుడు నాకు అనేక అనుభవాలు కలిగాయి. కానీ వాటిని రికార్డు చేసుకోలేదు. నా వ్యక్తిగతంగా కలిగిన అనుభవాలకు అంత విలువ ఇవ్వను. నా ధ్యాన సమయంలో నేను దర్శించిన మహాత్ములంతా సూక్ష్మశరీర ధారులేనన్న నిశ్చయానికి వచ్చాను. మాస్టర్‌గారిని దర్శించడం యదార్థమే. అది వారి సూక్ష్మశరీరమే.

## మూగపిల్లవాని నోటమాట

యోగమహత్తుల్ని గురించి వర్ణించే సందర్భంలో 'మూకం కరోతి వాచాలం' ఉదాహరణగా చెప్పేవారు. చాలామంది మహాత్ములు మూగవారికి మాటలు ప్రసాదించిన సందర్భాలు మనకు తెలుసు. అలాగే నిరక్షరకుక్షి మహాకవి కావడం సరస్వతీదేవి వరంగానో, మరోదేవత ప్రసాదంగానో చెబుతారు. అనాది కాలంనుండి ప్రవక్తలు, మహాత్ములు ప్రజాశ్రేయస్సు కోసం, అభాగ్యుల కన్నీరు తుడవడంకోసం, తమ శక్తిని ఉపయోగించేవారు. జీసస్, బుద్ధుడు, సాయి, బ్రహ్మంగారు, వేమన లాంటి మహాత్ముల జీవితచరిత్రల నిండా అలాంటి సంఘటనలు కన్పిస్తాయి అవి చేయడం వల్ల వారు గొప్పవారు కాలేదు. వారి యోగశక్తితో, కరుణతో, .ప్రేమతో ఆ పనులు చేశారు. యోగశక్తిని, తపశ్శక్తిని ఎంతైనా సంపాదించవచ్చు. అది తమ వరకే ఉపయోగించుకున్న వారు లోకం దృష్టికి వారు స్వర్గానికి వెళితే వెళ్లి వుండవచ్చు. వారిది పచ్చి స్వార్థం . ఇతరుల కన్నీరు తుడవ కలిగిన వారు, మరో మనిషిని కష్టంలో ఆదుకున్నవారు పదుగురి మెప్పు పొందగలుగుతారు. మహాయోగులు, ఋషులు తాము చేసేవి మహత్తులని చెప్పరు అవి వారి శక్తికి సహజం. సామాన్యుల దృష్టికి అద్భుతాలు అంటే మన శక్తిని వీలుగలిగినప్పుడు ప్రజాహితంకోసం వెచ్చించాలి. మాస్టరుగారు చాలా అద్భుతాలు చేసేవారు. వాటిని వారు యోగసిద్ధులని చెప్పలేదు. యోగసాధన చేసే ప్రతివ్యక్తికి లభించే మానసిక శక్తులన్నారు. వాటికి ప్రచారం అవసరం లేదు. ప్రచారం ఇవ్వకూడదు.

1972 లోనే నా యోగం ప్రజాహితం కావడం మొదలైంది. అది మాస్టర్ సంకల్పమే అయి వుండాలి. నేనుగా ఎవరికీ యోగం చేస్తున్నట్లు చెప్పేవాడిని కాను. నాకోసం, నా తృప్తి కోసం చేసుకునేవాడిని. నమ్మినదాన్ని పూర్తిగా విశ్వసించడం నాకిష్టం అందుకే ఇంట్లో దేవతాపూజలు, బయట దైవదర్శనాలు బంద్ చేశాను.

నేను ఊహించని ఒక సంఘటన గొప్ప మలుపు తిప్పింది. మద్రాసు మౌంట్‌రోడ్డులో మా ఆఫీసు రోడ్డు ఆవలివైపున ఆర్ట్సు కాలేజీ, దానిప్రక్క మేడపైన ఇండియా బుక్‌హౌస్ దాని యజమాని హీరా, సింధీవాడు. ఆయనకు హిగ్గిన్‌బాదమ్స్ మేనేజరుకు వ్యాపారమైత్రి. నా డిస్కవరి ఆఫ్ మాస్టర్ యోగా పుస్తకం చదివిన హిగ్గిన్ బాదమ్స్ మేనేజరు, హీరాతో చెప్పాడు ఈ యోగం గురించి. ఆయన ఆఫీసుకు కబురు పంపాడు. నన్ను ఒకసారి కలుసుకోవాలని, అపాయింట్‌మెంట్ యివ్వమని. నేను అపాయింట్‌మెంట్ ఇచ్చేంత గొప్పవాడిని కాదు. మధ్యాహ్నం నేనే బుక్‌షాపుకు వెళ్లాను లంచ్ అవర్లో. వారికి వచ్చే ఫారిన్‌బుక్స్ మాకు రివ్యూలకు పంపిస్తుంటారు. నేను లోగడ చాలాసార్లు ఆ షాపుకు వెళ్లి పుస్తకాలు కొన్నాను.

హీరాకు ఒక్కగానొక్క కొడుకు. అయిదేళ్లవాడు. మాటలురావు అతనికి ట్రీట్‌మెంట్ యిమ్మని అడిగాడు. నాకేం తెలియదు మా గురువుగారిని అడిగి చెబుతా నన్నాను. డాక్టరుగారికి చెప్పాను ట్రీట్ చేయమని అర్థించాను. "నాకు ట్రీట్‌మెంట్స్. ఇనిసియేషన్ ఏమీ తెలియవు శర్మా, నీ యిష్టం నీకు ధైర్యం వుంటే చేయి." అన్నారు.

"మీరు పర్మిషన్ యిస్తే......" నసిగాను.

"నేనెవర్ని పర్మిషన్ ఇవ్వడానికి నీవెవడివి ట్రీట్‌మెంట్ చేయడానికి వెళ్లి ప్రేయర్ చేయి అసలు ట్రీట్‌మెంట్ మాస్టరుగారే చేస్తారు. మన ప్రమేయం నామమాత్రమే. ఒకటి జ్ఞాపకంపెట్టుకో ఎప్పుడు ఎవరికి ట్రీట్‌మెంట్ చేయాలన్న సంకల్పం కలిగినా హృదయ పూర్వకంగా మాస్టరుగారిని ధ్యానించి విన్నవించుకో. ఆ తర్వాత పని ఆయనే చేస్తారు ఫలితం అనుకూలం కాకపోతే నిరాశపడకు. నీ శక్తి పోయిందని క్రుంగిపోవద్దు. మాస్టరుగారి అనుగ్రహం అందలేదనుకో"

హీరా వాళ్ల యింటికి నన్ను తీసుకువెళ్లాడు బాబు బాగున్నాడు. అందంగా బొద్దుగా యాక్టివ్‌గా వున్నాడు 'అయ్యో' అనిపించింది 'మాట' రాదు. మాస్టరుగారి ఫోటో ఒకటి యిచ్చి ఆ ఫోటోకు తలాన్చి కూర్చోమని చెప్పి, నేను ప్రేయర్ చేశాను. ఆ కుర్రవాడు మైకంలోకి వెళ్లిపోయాడు. అలా 40 రోజులు ఆ పిల్లవాడిని చేయించమని చెప్పాను మాట వస్తుందో రాదో నాకు తెలియదు. 40 రోజుల తర్వాత షాపుకు వెళ్లాను, హీరా ఫోన్ చేస్తే .. ఆ కుర్రవాడు 'అంకుల్' అంటూ వచ్చి ప్రేమగా ఒడిలో కూర్చున్నాడు. అబ్బాయి వసపిట్టలా వాగుతున్నాడు. మంచి మంచి స్వీట్సు యిచ్చి కారులో ఇంటివరకు వచ్చి దిగబెట్టి వెళ్లాడు.

\+ \+ \+

మా ఇంటి కాంపౌండులో పెంచలయ్య అనే అతను వుండేవారు. చాలాకాలంగా మేం ఏ ఇంట్లో వుంటే ఆ ఇంటికి దగ్గరగా తనూ ఉండడం జరిగేది. యామినీదేవికి అతని భార్య పార్వతమ్మ అంటే యిష్టం. ఒకసారి ఆమెకు గుండెనొప్పి వచ్చింది. నేనేదో రాసుకుంటున్నాను రాత్రిపూట. యామినీదేవి వచ్చి పెంచలయ్య భార్యకు గుండెనొప్పి వచ్చింది, శ్వాస పీల్చడం కష్టంగా వుంది, ఆస్పత్రికి తీసుకువెళ్లేలోగా ఒకసారి వచ్చి విభూతి పెట్టమన్నది. తను రికమెండ్ చేస్తే కాదనే ప్రశ్నే లేదు. మరీ తన హృదయం స్పందిస్తే తప్ప తను జోక్యం పెట్టుకోదు. రికమెండ్ చెయ్యదు అప్పటికీ ఇప్పటికీ ఆమె స్వభావం అంతే. ఇప్పుడు మరీ, వచ్చేవారు అమ్మగారితో చెప్పుకుని, తర్వాత నా దగ్గరకు వస్తారు. అది వారికొక తృప్తి. అమ్మగారు చెబితే గురువుగారు కాదనరని ఒక నమ్మకం.

సరేనని రాయటం ఆపి, వెళ్లి విభూతి పెట్టి వచ్చాను ఓ రెండుగంటలు నా రాతపని సాగింది. పడుకోబోయేముందు దొడ్లోకి వెళ్లి చూచాను, ఆమెకు ఎలా వుందోనని. భోజనాలు చేసి అంతా కబుర్లు చెప్పుకుంటున్నారు.

తర్వాత పెంచలయ్య ప్రోత్సాహంతోనే అతని భార్య రోజూ ప్రేయర్‌కు వచ్చేది. కొద్దిరోజుల్లోనే అతను వచ్చి యోగంలో చేరాడు. అతని నాడీజ్యోతిషంలో యోగం గురించి, నా గురించి స్పష్టంగా వచ్చింది. నా పేరుతో సహా వివరాలు చెప్పారు అందులో. అలా చేరిన పెంచలయ్య చివరివరకు యోగం చేస్తూనే వున్నాడు.

+ + +

మేం గొయ్యా తోపులో వుండగా రోజూ ప్రేయర్స్ బాగా సాగేవి. పెంచలయ్య, పార్వతమ్మ, సర్వేపల్లి శంకరయ్యగారనే పెద్దాయన, శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యుడు, రోజూ సాయంత్రం ప్రేయర్‌కి వచ్చేవారు. ఆ వీధిలోనే ఒక నర్సు వుండేది ఆమెకు పది పన్నెండేళ్ల కూతురుంది ఆ పిల్ల మూగ. అయిదేళ్ల వయస్సు వచ్చేవరకు ఆ పాప బాగానే మాట్లాడేదిట. తర్వాత సడెన్‌గా మాటపోయింది. మూగ అయింది. పెంచలయ్య ఆ పిల్లను తీసుకువచ్చాడు, ట్రీట్‌మెంట్ చేయాలని. అందరం కూర్చుని, మధ్యలో ఆ పాపను కూర్చోబెట్టి ప్రేయర్ చేశాం సాయంత్రం ప్రేయరు నేను డాక్టరుగారింట్లో చేసుకునేవాడిని. ఇంటివద్ద ప్రేయరు యామినీదేవితో వచ్చినవారు చేసుకునేవారు. వసంతకుమార్, పెంచలయ్య, శంకరయ్య, యామినీదేవి, పార్వతమ్మ... వీరు అయిదుగురు ఆ పాపకు ట్రీట్ చేసేవారు పదవరోజు వీరు ప్రేయర్‌లో వుండగా, ఆ పాపకు మాటలు వచ్చాయి.

పాప కన్నతల్లి ఆనందానికి అవధిలేదు. ఎందరో డాక్టర్లకు చూపించింది. ఎవరూ చికిత్స చేయలేకపోయారు. వైద్యానికి అలవికాని జబ్బులకు యోగం ద్వారా మాస్టరుగారి అనుగ్రహం వుంటే చికిత్స జరుగుతుందనేది స్పష్టంగా తెలిసింది. యోగచికిత్సలో మనం చేసేది పెద్దగా ఉండదు. మాస్టరుగారికి విన్నవించుకోవడమే. వచ్చేవారు పూర్తిగా 'శరణు' అంటే మాస్టర్ దయ కలుగుతుంది.

+ + +

ఇండియా బుక్‌హవుస్ హీరా బంధువుల అమ్మాయికి ట్రీట్ మెంట్ చేయవలసి వచ్చింది. 20 సంవత్సరాలుంటాయి. చాలా అందగత్తె. సింధీలు కదా! గదిలో పెట్టి బోల్టు వేస్తారు. బయటకొస్తే పిచ్చిగా ప్రవర్తిస్తుంది, కరుస్తుంది. నన్ను తీసుకువెళ్లారు. గది తలుపు తెరిచారు. ఆ పిల్ల కిటికీలో కూర్చుని బయటకు చూస్తోంది. నేను లోపలకు

వెళ్లగానే తలుపులు వేశారు నాకు భయం వేసింది .. పిచ్చిపిల్ల గదిలోకి తోసి బయట గడియపెట్టినందుకు. నన్నెక్కడ పీకుతుందోనని నా భయం నన్ను చూచి నవ్వింది.

గుండె దిటవు చేసుకుని "గుడ్‌మార్నింగ్ బేబీ" అన్నా

"మాణింగ్, వెల్‌కం" అన్నది కిటికీ లోంచి దిగివస్తూ

"హౌ ఆర్యూ"

"ఫైన్" వచ్చి షేక్‌హాండ్ యిచ్చింది.

"ఐ లవ్‌యూ" అన్నాను. లోగడ ఎవరినీ ప్రేమించిన పాపాన పోలేదు నేను ఆ మాట కొత్తగా 'రింగ్' అయింది.

"ఐ టు లవ్ యూ" అన్నది చక్కని ఇంగ్లీషులో ఇద్దరం చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాం. ఆ పిల్ల చక్కగా నవ్వుతూ కబుర్లు చెప్పింది

జరిగింది ఏమిటంటే ఆ పిల్ల ఓ అబ్బాయిని ప్రేమించింది. పెద్దలకు అది యిష్టం లేదు. పిచ్చి నటిస్తోంది. ఆ కుర్రవాడితో పెళ్లిజరిగేలా చూస్తానని హామీ యిచ్చాను. తను మామూలుగా వుంటానని ప్రామిస్ చేసింది.

ఇద్దరం బయటకొచ్చాం. తనే వెళ్లి స్నాక్స్, టీ తెచ్చింది.

పెద్దవాళ్లతో మాట్లాడాను. ఒప్పుకున్నారు. ఇలాంటి కౌన్సిలింగ్ యోగంలో భాగం అవుతుందా?! వాళ్లు అనుకున్నారు నేనేదో మంత్రం వేసి, ఆ పిల్లను బాగు చేశానని. ... ప్రేమతో సమస్యల్ని పరిష్కరించవచ్చు.

\+ \+ \+

ఒకసారి దాసుగారు విజయవాడ నుండి మద్రాసు వచ్చారు ... ఎవరికో ట్రీట్‌మెంటు ఇవ్వడం కోసం. ఆయన తన బావమరది ఇంట్లో దిగుతారు. దాసుగారు నా దగ్గరకు వచ్చారు. ఎప్పుడు మద్రాసు వచ్చినా మా ఇంటికి వచ్చేవారు. "సాయంత్రం ఒకచోట ట్రీట్‌మెంటు చేయాలి. వెళదాం రా" అని వెంటపెట్టుకు బయల్దేరారు. మా ఇద్దరికీ కాఫీలు, సిగరెట్లు అలవాటు. దాపరికం లేదు, మొహమాటం లేదు. ఒకాయన పోలీసు సూపరింటెండెంటు, కోయంబత్తూరు నుండి వచ్చాడుట. ఆయన భార్యకు గుండెజబ్బు. దాసుగారికి తమిళం రాదు. నాకు స్వల్పంగా పరిచయం.

"శార్వరీ ! నువ్వు ట్రీట్‌మెంటు చేస్తున్నావు ఇవాళ" అన్నాడు.

"నేను చేయడం ఏమిటి! నాకేం తెలీదు" అన్నాను.

"నాకు తెలుసులే. నీవు ట్రీట్‌మెంట్స్ బాగాచేస్తావని విజయవాడ ప్రాంతంలో తెలిసిపోయింది. దాచిపెట్టకు. నీ ట్రీట్‌మెంటు ఇవాళ నేను చూడాలి. అందుకే నిన్ను తీసుకువచ్చాను" అన్నాడు.

"మాస్టర్ నీదే భారం! దాసుగారు నాకు పరీక్ష పెడుతున్నారు" అని లోపల మాస్టర్‌గారిని స్మరించి ఉపక్రమించాను.పేషెంట్‌ను పడుకోమని చెప్పి, కాస్త విభూది నొసటన పెట్టి, ప్రేయర్ చేశాను. నిమిషాలలో నాకు యాస్ట్రల్ అనుభూతి కలిగింది. ఆమె యాస్ట్రల్ శరీరమూ నాకు కనిపించింది బ్రీతింగ్ ఎక్కువైంది. వైబ్రేషన్స్ వచ్చాయి. నా చేతులు పైకిలేచి, పేషెంటు శరీరంపైన అటు ఇటు తిరగసాగాయి. చివరకు నా చూపుడువేలు పోయి ఆమె నుదుటిని తాకింది . కొంతసేపటికి కళ్లు విప్పాను. అరగంట తర్వాతగానీ ఆమెగారికి స్పృహ రాలేదు చిత్రంగా ఆమెకు గుండెజబ్బు తగ్గిపోయింది

ఆమెకు తగ్గిపోయిందన్న వార్తవిని దాసుగారన్నారు.

"ట్రీట్‌మెంట్ తెలియదన్నావు. ఆమెకు పూర్తిగా తగ్గిపోయింది గదా."

"నేనేమీ చేయలేదు."

"అదే ట్రీట్‌మెంట్ రహస్యం" అన్నారు.

"అంతసేపు ట్రాన్స్‌లో వున్నాను. ఏం జరిగిందో నాకు తెలియదు"

"నీవు ట్రాన్స్‌లోకి వెళ్లగలిగావు. అదిచాలు. మిగతాపని ట్రాన్స్‌బాడీస్ చేసుకుపోతాయి. ముందుచేసిన సంకల్పమే తర్వాత ట్రీట్‌మెంట్‌గా మారుతుంది."

నేను చేసిన ట్రీట్‌మెంటు విషయం టి.నగర్‌లో వార్తలా వ్యాపించింది. ఎవరో వెళ్లి డాక్టర్‌గారికి చెప్పారు. ఆయన తలవాచేలా చీవాట్లుపెట్టారు.

"ట్రీట్‌మెంట్ చేస్తే శక్తిపోతుంది నీవు సంపాదించిన యోగశక్తి అంతా ఖర్చయిపోతుంది నీకేం మిగలదు. పైగా ఆ పేషెంట్ జబ్బుటు, బాధలు నీకు తగులు కుంటాయి."

"పేషెంట్ జబ్బులు డాక్టర్లకు అంటుకునేట్లయితే మీ డాక్టర్లంతా ."

"షటప్. అది వేరు, ఇది వేరు. ఇది యోగా ట్రీట్‌మెంట్. దీనికి చాలా ఎనర్జీకావాలి. ప్రభాకరశాస్త్రిగారు ఎంతమందికో చికిత్స చేసేవారు. వారి బాధలు తాను స్వీకరించి, తాను అస్వస్థులై వారికి స్వస్థత కలిగించేవారు. అంత ఔదార్యం, ప్రేమ, కరుణ మనలో వున్నాయా! లేవు గదా! వారి రోగాలు మనకు ట్రాన్స్‌ఫర్ చేయమని మాస్టరుగారిని అడగగలవా!"

"అడగను డాక్టరుగారూ. వారి బాధ, జబ్బు నాలోకి బదిలీ చేసుకోకుండానే ట్రీట్‌మెంట్ చేయవచ్చు" అన్నాను. యోగా ట్రీట్‌మెంట్స్ పైనున్న అపోహల్ని తొలగించాలని, సైంటిఫిక్‌గా మార్చాలని ఆనాడే నిశ్చయించుకున్నాను.

\+ \+ \+

మా వీధికి అవతల వీధిలో పెంచలయ్య స్నేహితుడు ఒకరుండేవారు. పేరు రోశయ్య., బియ్యం వ్యాపారి, అతని కూతురుకు దయ్యం పట్టింది. మంచానికి అతుక్కుపోయివుంది ఆ పిల్లకు పెళ్లయింది కూడా. పెంచలయ్య వచ్చిఅడిగాడు . ఆ పిల్లకు ట్రీట్ చేయమని నేను భూతవైద్యుడిని కాను. దయ్యాలంటే తెలుసు. చిన్నప్పటి నుండి మా నాయనగారు దయ్యాల్ని వదలించడం చూచినవాడిని అయినా దయ్యం అంటే, భూతం అంటే ఎవరికైనా భయం కలుగుతుంది. నాకు చాతకాదని చెప్పినా పెంచలయ్య వినలేదు అతనికి నాపై గొప్ప నమ్మకం. "మీరు ఒక్కసారి వచ్చి చూడండి చాలు. దయ్యం గియ్యం పారిపోతుంది" అన్నాడు

వెళ్లి చూచాను కేసు ప్రమాదకరంగా వుంది. ఆ పిల్ల చూపులే వికారంగా, భయోత్పాతం కలిగించేవిగా వున్నాయి. వెళ్లాక ఏమైనా చేద్దామన్న సంకల్పం కలిగింది విభూతి తీసుకుని ప్రేయర్ చేసి ఆమె వంటిపైన, మంచంపైన చల్లాను. నుదుట పెట్టాలంటే నాకే భయం వేసింది. తీర్థం మంత్రించి యిచ్చాను. మంత్రంలో క్షుద్రశక్తుల నిమంత్రణ ఉంటుందేమో మరి? సాయంత్రానికి ఆమె జ్వరం నార్మల్‌కు వచ్చింది మర్నాటికి లేచి కూర్చున్నది. రెండు మూడుసార్లు ప్రార్థన చేసి విభూతి యివ్వగానే ఆమె నార్మల్‌గా లేచి తిరగగలిగింది. మాస్టర్‌గారి యోగం సర్వకిల్బిష హారిణి, సర్వరోగ నివారిణి. ఇది అమృతయోగం అనిపించింది. ఏ రుగ్మతలకైనా అమృతం ఎలా పనిచేస్తుందో ఇదీ అంతే. అమృతతుల్యయోగం అని నాడీకారులు వర్ణించారు. కానీ సాధకుని అనుభవంలోకి వచ్చినప్పుడే దాని విలువ. ఈ యోగంలో అనేక కోర్సులు ఉన్నాయని విన్నాను. అవి ఎక్కడ దొరుకుతాయో తెలియదు. బాగా సాధన చేసి సిద్ధిపొందినవారు అనుగ్రహిస్తే తప్ప ప్రయోజనం ఉండదు. ఏ శక్తులు, సిద్ధులైనా పరంపరాగతాలే!!

\+ + +

కోర్సులు ఏవో తెలుసుకోవాలని, సాధన చేయాలని నాకు అనిపించింది. బాల సుందరరావుగారితో చెబితే "మనకు అవసరం లేదులే. ప్రేయర్ ఒక్కటి చాలు" అన్నారు.

డాక్టరుగారు కుంభకోణంలో ఎన్.ఆర్.బి.వి.గారి శిష్యులు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అడుగుజాడలలో నడిచేవారు. శ్రీ వేటూరివారు కోర్సులు అవసరం లేదని చెప్పేవారుట. జనరల్ ప్రేయర్ ఒక్కటే చాలని వారిమతం. బాల సుందరరావుగారికి కోర్సులుచేస్తే ఏమవుతామోనన్న భయం వుండేది. అడయారు శంకరయ్యర్‌గారు కూడా, "ఆ కోర్సులు, రెగ్యులేషన్స్ మీ అందరికోసం కాదు. మా వంటి డైరెక్టు మీడియమ్స్ కోసం. మేం అన్నీ చేసి, వాటి ఫలితాన్ని మీకు అందిస్తున్నాం. మీరు చేయనవసరంలేదు" అని

స్పష్టంగా చెప్పేవారు వాళ్లు చేశారు గదా మనం చేస్తే తప్పేమిటని నా వాదన. వాళ్లు కడుపునిండా తిన్నారు. మనకు కడుపు ఎలా నిండుతుంది. మనము తింటే కదా, మనకు తృప్తి. బాలసుందరరావుగారు, శంకరయ్యర్‌గారు వాదించి, వాదించి చివరకు "నీ నీ ఇష్టం చేస్తే చేసుకో ఫో" అన్నారు ఎవరు చెబుతారు? ఎవరి దగ్గర వున్నాయి కోర్సులు?

ఆఫీసుకు వెళ్లాను. ఒకాయన వచ్చారు. ఆయన జి.కృష్ణగారికి మిత్రులు. కృష్ణగారు డెయిలీన్యూస్ ఎడిటర్ అప్పుడు. నేను వీక్లీలో వుండేవాడిని. ఆయన నాగురించి, విచారించి శార్వరిని చూడటానికి వచ్చాను పరిచయం చెయ్యి అని అడిగారు. ఆయన మా సెక్షన్‌కు వచ్చాడు. నేను ప్రెస్‌లోకి వెళ్లి వున్నాను. ఆర్టిస్టు ముద్దా పార్వతీశం నా వద్దకు పరుగెత్తుకు వచ్చి "మాస్టరుగారు మీకోసం వచ్చారు మీ సీటుదగ్గర వున్నాడు" అన్నాడు.

'మాస్టరుగారు రావటం ఏమిటి పార్వతీశం' అన్నాను. అతనికి నా యోగం గురించి తెలుసు బాలసుందరరావుగారికీ అతను తెలుసు. వాళ్ల నాన్నగారు చందమామలో ఎడిటర్.

"మాస్టరుగారు నువ్వూ, నేనూ పుట్టకముందే పోయారు. ఎవరిని చూచి ఎవరనుకున్నావో!" అన్నాను.

"కాదు మాస్టరుగారే.." అన్నాడు.

నాకు ఆశ్చర్యం వేసి నాసీటు దగ్గరకు వెళ్లాను. నా కళ్లు నన్ను మోసం చేశాయి. నా టేబుల్ దగ్గర మాస్టర్‌గారే నిలబడి వున్నారు. పట్టుధోవతి లుంగీగా కట్టుకున్నారు. అవే మీసాలు. అదే బట్టతల... అయినా మాస్టరుగారు అయివుండరు. "మీరు?" అని ప్రశ్నించి కూర్చోమన్నాను.

"నీవు శార్వరి... అవునా! నాపేరు నారాయణరావు. గుంటూరు. అడ్వొకేట్‌ని. నీ కోసమే వచ్చాను."

కాస్సేపు యోగ విషయాలు మాట్లాడుకున్నాం. "సాయంత్రం వచ్చి కలుస్తాను ఎక్కడ వుంటారో చెప్పండి" అన్నాను.

చెప్పాడు. సాయంత్రం వారు బసచేసిన ఇంటికి వెళ్లి కలిశాను. యోగా గురించి బాగా తెలిసిన వ్యక్తి. లాయర్‌గా ప్రాక్టీసు వద్దనుకుని మానివేశాడు. యోగమే జీవితం. అంతలా యోగానికి అంకితమై పోయిన వ్యక్తి.

దాసుగారు నాగురించి చెప్పాడట. నారాయణరావుగారే ప్రిలిమినరీ కోర్సులు రాసి పంపారు. ఎలా చేయాలో చెప్పారు. అలా కోర్సులు చేయడం ఆరంభించాను.

ఉత్తినే ప్రేయర్ చేయడానికి, కోర్సులు చేయడానికి ఎంతో తేడా వుంది. కోర్సులు చేస్తే ఎంతో శక్తి, ఉత్సాహం, పూర్ణత్వం లభించిన అనుభూతి కలుగుతుంది

.దిడుగు నారాయణరావుగారితో స్నేహం అలా చివరివరకు సాగింది నన్ను ఆత్మీయుడుగా భావించారు గుంటూరు , విజయవాడ ప్రాంతంలోని యోగసాధకులకు నా గురించి విస్తృతంగా ప్రచారం చేసింది వారే. నన్ను వారి సమావేశాలకు ప్రత్యేకంగా ఆహ్వానించి సముచిత స్థానం యిచ్చారు. పెద్దపీట వేశారు

\+ + +

ఏవైనా నిదర్శనాలు కనిపిస్తే తప్ప ప్రజలకు నమ్మకం కలగదు. మహత్తులు ప్రదర్శిస్తే తప్ప మహాత్ముల్ని గుర్తించరు. భగవంతుని ఉనికిని, భగవచ్ఛక్తిని లోకానికి ఎరుకపరచడానికే మహాత్ములు అప్పుడప్పుడు అపూర్వసంఘటనలు కల్పిస్తుంటారు. నిదర్శనాలు చూపిస్తారు. అద్భుతాలు సృష్టిస్తారు. మాస్టరుగారు ఒక్కో వ్యక్తికి ఒక్కో ప్రత్యేకపని అప్పగిస్తారనిపిస్తుంది నా యోగకార్యానికి నేను నిర్వహించవలసిన పనేదో నాకు నిర్దేశించారు. అన్ని పనులు ఒక్కరే చేయలేరు. ఒక వ్యక్తి చేస్తున్న పనిలో మరొకరు జోక్యం చేసుకోనవసరంవుండదు కార్యనిర్వహణలో మన ప్రతిభ ప్రధానం కాదు. మన అర్హత నీకు ఏ పని చేయడానికి సమర్థత, నేర్పరితనం వుంటుందో, ఉత్సాహం వుంటుందో ఆ పని అప్పగించడం వల్ల మేలు జరుగుతుంది.

\+ + +

ఒంగోలు ప్రాంతంలో ఉప్పుగుండూరులో రోశయ్యగుప్త అని ఒకాయన వున్నారు ఆయన మాస్టర్ ఎం.ఎన్.గారి శిష్యుడు. నా పుస్తకం చదివి, నేను చేస్తున్న యోగకార్యం గురించి విని నన్ను చూడాలని, కలుసుకోవాలని ఉవ్విళ్లూరి ఒకసరి మద్రాసు వచ్చాడు. అది నవంబరు నెల, మద్రాసులో వర్షాలు దండిగా కురుస్తున్నాయి. సాయంత్రం పూట వచ్చి, ఆ ప్రాంతంలో తిరిగి తిరిగి ఇల్లు దొరక్క వెళ్లిపోయాడు. మర్నాడు ఉదయం తన అల్లుడిని తీసుకుని బయలు దేరాడు. వర్షం జోరుగా వుంది. బయటకు మనిషి రావడం లేదు. నేను కిరాణాషాపుకు పనిబడి వచ్చాను. తిరిగి ఇంటికి వెడుతుండగా, ఇద్దరు వ్యక్తులు నా వెనకగా వచ్చి పలకరించారు. వారిని ఎప్పుడూ చూచిన జ్ఞాపకం లేదు. "నమస్కారం శార్వరిగారూ" అని పలకరించడంతో వారికి నేను తెలుసునేమో అనుకున్నాను.

"నాపేరు రోశయ్యగుప్త. ఈ అబ్బాయి నా అల్లుడు" పరిచయం చేసుకున్నారు.

"వర్షంలో వచ్చారు! ఇబ్బందిపడి వుంటారు."

ఇంటికి చేరాక చెప్పారు "నిన్న సాయంత్రం వచ్చి తిరిగి తిరిగి వెళ్లిపోయాం మళ్లీ ఇప్పుడు వచ్చాం ఇల్లు దొరకలేదు. విసుగుపుట్టి వెళ్లిపోదామని నిర్ధారించుకుని మాస్టరుగారికి నమస్కారం చేసుకున్నాను. అంతలో ఒక వృద్ధుడు. మా ప్రక్కన నిలబడి, "అదిగో, ఆ వెళ్లేదే శార్వరి వెళ్లి కలవండి" అని చెప్పారు. ఇటు మీ వైపు చూచి మళ్లీ అటు తిరిగేలోగా ఆయన అంతర్ధానం అయినాడు.

"ఆయనే మాస్టరుగారు. వృద్ధునిరూపంలో మీకు కనిపించారు. అదృష్టవంతులు" అన్నాను.

"ఇన్నేళ్లుగా యోగం చేస్తున్నాను ఎప్పుడూ కన్పించలేదు మీకోసం వెతుకుతుంటే మాస్టరుగారు కనిపించారు" అన్నాడు

" అదే విచిత్రం నాకోసం వచ్చినవారికి మాస్టరుగారు దర్శనమిస్తారు మాస్టరుకోసం వెదికేవారికి నేను తటస్థపడతాను. విచిత్రంగా వుంది కదూ".

+ + +

మద్రాసులో నాకో మిత్రు డుండేవాడు. ఇప్పటికీ వున్నాడు. అతనిపేరు మంధా గోపాలకృష్ణ ఎం.ఏ. చదివి ఎక్కిరాల వేదవ్యాసకు పి.ఎ గా పనిచేశాడు. ఉద్యోగం పోయింది. నాటకాలు, సినిమాలు- వేషాలు వేసేవాడు ఇప్పుడు అతను హోమియో డాక్టరు, స్ట్రీట్ డాక్టరుగా ప్రసిద్ధుడైనాడు. మద్రాసులో గొప్పవారికి వైద్యంచేస్తాడు. రిక్షావాళ్లకు, ముష్టివాళ్లకు చేస్తాడు. కార్లలో వచ్చినా, కాలినడకన వచ్చినా అతను మాత్రం పానగల్ పార్కుపక్క ఫుట్‌పాత్‌పైనే కనిపిస్తాడు. అతనికీ నాకూ స్నేహం ధియోసఫిస్టు. పిచ్చిగా చదివాడు. ఒకసారి హిందూలో బుద్ధపూర్ణిమ రోజున, హిమాలయాల్లో ఒక లోయలో బౌద్ధభిక్షువులకు బుద్ధజ్యోతి దర్శనం అవుతుందని చదివాం. హిమాలయాలకు, ఆలోయకు వెళ్లకుండా, ధ్యానంలో, సూక్ష్మశరీరాలతో జ్యోతిని దర్శించాలని అనుకున్నాం. పౌర్ణమినాడు ఇద్దరం రాత్రి పన్నెండు గంటలకు ధ్యానంలో కూర్చున్నాం. ఇద్దరికీ తెలుసు... యాస్ట్రల్ బాడీని ఫిజికల్ శరీరం నుండి ఎలా వేరుపరచాలో. అయితే అలా వేరైన సూక్ష్మశరీరం, నిర్ణీతసమయంలో తిరిగితే రావాలి. అలా రాకుండా దానిపాటికి అది వెళ్లిపోతే ఇక్కడున్న శరీరం శవమైపోతుంది. ఒక సన్ననిదారంలాంటి వెలుగుదారం సూక్ష్మ శరీరానికి, స్థూల శరీరానికి 'లింక్'గా వుంటుంది. పై లోకాలలో సంచారం పూర్తికాగానే సంకల్పిస్తే చాలు అది తిరిగివస్తుందని సూత్రం. ఇద్దరం మూడుగంటలకు పైగా ధ్యానంలో ఒళ్లుమరచి కూర్చుండిపోయాం.. సంకల్పం చేయడానికి 'బుద్ధి' పనిచేస్తేగదా! భౌతిక శరీరాన్ని వదలి సూక్ష్మశరీరం పైకిపోగానే 'బుద్ధి' నశించింది. చచ్చాం. తిరిగిరావడం

జరగదు. చచ్చిపోయినామనే అనుకున్నాం. తెలతెలవారుతుండగా నాకు చైతన్యం కలిగింది. కళ్లు తెరిచాను. అతని పరిస్థితి నాలాగే ఉండి వుండాలి. భౌతికంగా 'టచ్' యిస్తే సూక్ష్మశరీరం వచ్చి చేరుతుందని నాకు తెలుసు. అతన్ని నెమ్మదిగా సహస్రారంలో 'టచ్' చేసి పిలిచాను. లేచాడు. బ్రతుకు జీవుడా అనుకున్నాం. సూక్ష్మ శరీరంతో రోదసిలో పయనించడం అనుభవంలోకి వచ్చింది.

ఈ అనుభవాలు మా గురువుగారికి గానీ శంకరయ్యర్‌కి గానీ చెప్పేవాడిని కాను. ఇద్దరికీ కోపమే చిటపటలాడేవారు. అయితే నా పుస్తకం డిస్కవరీ వచ్చాక శంకర అయ్యర్‌గారితో సాన్నిహిత్యం ఎక్కువైంది. ఆయన వద్దనున్న ప్లానెటరీ కోర్సులు అచ్చు పుస్తకాలు చూచాను తర్వాత నాకే యిస్తానని ప్రామిస్ చేశాడు నేను ఇనీసియేషన్ చేయడానికి, ట్రీట్‌మెంట్స్‌చేయడానికి అనుమతించారాయన."మాస్టర్‌గారి తరపున నీకు అనుమతి యిస్తున్నాను" అన్నారు. అది నా అదృష్టం. మాస్టరుగారు మంచి శిష్యులలో త్వమేవాహంగా వుంటారు మద్రాసులో ఉండగా పరిచయాలు పెంచుకోడానికి హస్తసాముద్రికం బాగా పనికొచ్చింది. శంకరయ్యర్‌గారి అబ్బాయి చిన్నఉద్యోగం చేస్తుండేవాడు. ఆయనకు కొడుకు బెంగ. వాడు బాగుపడాలి పైకి రావాలి వాడు రాడు. తండ్రిని డబ్బిమ్మని వేధించేవాడు. ఆయన కోడలు మంచి అమ్మాయి. నా చేత ఆమె చేయి చూపించాడు. కొడుకు చేయి చూపించాడు వెంటనే అతన్ని ఉద్యోగం మాని సొంత బిజినెస్ పెట్టమని చెప్పాను. చెప్పిన మాట విని, వెంటనే రిజైన్ చేశాడు. చిన్న ఇండస్ట్రీ పెట్టాడు. నా కళ్లముందే లక్షలు గడించాడు. ఆ తండ్రికి అది తృప్తి. కొడుకు ప్రయోజకుడైనాడు

శంకరయ్యర్‌గారికి 'ఈగో' ఎక్కువ. తాను యోగంలో పండిపోయానని అనుకునేవాడు. తన దగ్గరగా ఎవరినీ ప్రేయర్‌కి కూర్చోనివ్వడు. తనలోంచి వచ్చే కరెంట్‌కు షాక్ కొట్టి పడిపోతారని భయపెట్టేవాడు. నిజమో కాదో నాకు తెలియదు గానీ, ఎవరూ ఆయన దగ్గరగా కూర్చునేవారు కాదు. ఆ విషయం తెలిసి ఒకసారి నేను ఆయన ప్రక్కనే కూర్చున్నాను. నన్ను భయపెట్టాడు. నేను మొండివాడిని. అక్కడే కూర్చున్నాను. నా ప్రేయర్ గంటసేపు సాగింది. పడిపోలేదు. ఆయనగారే కూర్చోలేక, పదినిమిషాలకు లేచి వెళ్లిపోయాడు.

+ + +

విజయవాడ నుండి కవులూరి సీతారామయ్యగారు, మన్నవ హనుమంతరావు, గూడూరు నమశ్శివాయ, దాసు ఇలా ఎవరు కుంభకోణం వెళ్లి వస్తూ, మద్రాసులో దిగినా

శంకరయ్యర్‌ను, బాలసుందరరావుగారినీ, నన్ను కలుసుకునేవారు నేను కుర్రవాడిని గనుక, తమ వెంట పెట్టుకు తిప్పేవారు ఇటు ఆంధ్రప్రాంతపు యోగసాధకులకు మద్రాసువారికి మధ్య నేను వారధిలా పనిచేశాను. నేను అందరితో ఇష్టంగా వుండేవాడిని వారికీ నేనంటే ఇష్టం. ఒకసారి విజయవాడలో దాసు గారింట కొత్త రామకోటయ్యగారి పరిచయం కలిగింది అప్పట్లో.

వెలుగు వెనక చీకటి, మంచిమాటున చెడు పొంచి వుంటాయి. గురజాలలో యోగసమావేశాలు జరుగుతున్నాయి. రమ్మని నారాయణరావుగారి నుండి ఆహ్వానం వచ్చింది. అప్పటివరకు యోగసమావేశాలు ఎలా వుంటాయో, ఎలా జరుగుతాయో నాకు తెలియదు. ఉత్సాహంకొద్దీ ఒకవారంసెలవుపెట్టి బయలుదేరాను. గురజాల ప్రాంతం ఎప్పుడూ వెళ్లలేదు. తెనాలి వరకు రైలు, గుంటూరు నుండి మాచర్ల రైలు రాత్రి ఏడుగంటలకు గురజాల చేరాను కొత్తఊరు. ఓ మైలు నడిచి నారాయణరావు గారి సోదరుడు చంద్రశేఖరరావుగారింటికి చేరుకున్నాను. నాకు తెలిసినవారు లేరు యోగ సంబంధీకులు ఎవరూ రాలేదు. తెల్లవారితే సమావేశం. రాత్రికి హోటల్ భోజనం వరండా నిద్ర. యోగ సమావేశానికి వచ్చిన వ్యక్తి అనే ఆదరణ లేదు చాలా నిరాశ కలిగింది. మర్నాడు ఒక్కొక్కరే రాసాగారు. అంతా చుట్టుపక్కలవారే. దూరం నుండి వచ్చింది నేనే. ఊళ్లో లాడ్జీలు లేవు. మేనెల. పిడుగురాళ్ల ఎండలు చెప్పనవసరం లేదు నిప్పులు చెరిగే ఎండలు.

ప్రేయర్స్‌కు నరసారావుపేట జొన్నలగడ్డ కృష్ణమూర్తి ఆధ్వర్యులు. ఆయన రాలేదు. కాసేపు దాసు, మరికాసేపు సీతారామయ్యగారు కోర్సులు చేయించారు పి ఎస్.ఆర్ శర్మ, కొత్త రామకోటయ్యగారు చాలా మంది వచ్చారు. ఒక వందమంది పైగా వచ్చారు. నారాయణరావు గుంటూరునుండి ఎవరో విశ్వనాధ శాస్త్రిని వెంటపెట్టుకు వచ్చారు. ఆయనకు దివ్యదృష్టి వుందిట. మధ్యాహ్నం భోజనాల సమయంలో ఒక ప్రహసనం జరిగింది. బ్రాహ్మలంతా స్నానాలు చేసి, మడికట్టుకుని లోపలగదిలోకి రండని ఆహ్వానించారు. శూద్రులకు బయట వరండాలో వడ్డిస్తారుట. నాకు తల తీసినట్లయింది. యోగంలోకి వచ్చినా వీరికి బ్రాహ్మలు, శూద్రులు అన్న తేడా ఏమిటి? బ్రాహ్మలు కాని వారంతా శూద్రులా? నేను హోటల్‌కెళ్లి భోజనం చేసివస్తానని నారాయణరావు గారికి చెప్పాను. కడపనుండి ఒక ముస్లిం, హైదరాబాదు నుండి ఒక క్రిస్టియన్ వచ్చారు. వారు వాకోసం వచ్చారు పాపం.

ఓ అరగంటసేపు లోపల చర్చలు జరిగాయి. దాసుగారు వచ్చి, "అదేం లేదు

శార్వరిగారూ. ఇక్కడ అలవాటు ఇది మీరు మాతోపాటు లోపలే కూర్చోవచ్చు .రా రామకోటయ్య వరండాలో కూర్చుంటాడు" అన్నాడు

"రామకోటయ్యగారు మనందరికంటే పెద్దవారు, యోగంలో సీనియర్. వారిని బయట కూర్చోమనడం అవమానించడమే అవుతుంది మీరు భోజనాలు మడిగా కానివ్వండి మేం హోటల్‌కు వెళ్లి తింటాం" అని మొండికెత్తాను

ఎంతోకాలంగా వస్తున్న మడి, ఆచారం ఆరోజుతో పోయాయి. "లేదు. సమావేశాలలో సమారాధన దృష్టి వుండాలి. పంక్తి భోజనాలు మంచిది. అందరం కలిసే కూర్చుందాం" అని నిర్ణయించారు. ఎంత నిర్ణయించినా వారిమనస్సులో 'మైల' కలిసింది. మా మనసుల్లో బాధ మిగిలింది. అవమానం బయటపడకుండా నిగ్రహించుకున్నాం.

సాయంత్రం ప్రేయర్‌వేళకు నరసరావుపేట నుండి జొన్నలగడ్డ కృష్ణమూర్తి వచ్చారు. ఆయన కోర్సులు చాలా క్రమశిక్షణతో చేయించారు. చాలా అనుభవం వుంది మంచి డిసిప్లిన్ వుంది. ప్రార్థనకు కూర్చోబోతుండగా, ఊళ్లోని భక్తులు కొందరు వచ్చారు. ప్లీడరుగారింట వేడుక. యోగం అంటే ఆసక్తి. అందరం జనరల్ ప్రేయర్ చేస్తుండగా ఆ వచ్చిన వారిలో ఒకనికి పూనకం వచ్చింది. అతను 'రాం, రాం' అంటూ కుప్పిగంతులు వేయసాగాడు. అతను ఆ ఊరిలో గొప్ప రామభక్తుడట. ఒంటినిండా నామాలున్నాయి ఆయనగారిని ఉపశమింప చేయడానికి నారాయణరావు, దాసు ప్రయత్నించారు. ఊహూ, వారివల్ల కాలేదు. అతను హనుమంతుని వలె చేతులుమోడ్చి, 'రాం, రాం' అంటూ నృత్యం చేయసాగాడు. వీరి మాట అతని చెవినిపడడం లేదు. రామకోటయ్యగారు ప్రయత్నించారు. ఇంక కోర్సులు చేసినట్లేనని కృష్ణమూర్తిగారు నిరాశగా కూర్చున్నారు.

పెద్దలంతా నాదగ్గరకు వచ్చి "శార్వరీ! నువ్వు ప్రయత్నించు" అన్నారు.

"నేనేమీ చేయను. నేను ఒక అతిధిగా వచ్చాను. మీరు చేసుకోండి" అన్నాను. నాకు లోపల అవమానం మంట రేపుతోంది. గుంటూరు నుండి వచ్చిన మహాత్ముని వల్ల కాలేదు. చివరకు అందరి అభ్యర్థనపై నేను పూనుకున్నాను.

రామభక్తుడు మాస్టరుగారి ఫోటోముందు బైఠాయించి రామభజన చేస్తూనే వున్నాడు. నేను మాస్టర్‌గారికి నమస్కారం చేసుకుని ఆయనెదురుగా నిలబడి, భుజంమీద తట్టాను - "హనుమా లే" అన్నాను. మూడుసార్లు పిలిచాను. అతను లక్ష్యపెట్టలేదు. "హనుమా, నీ రాముణ్ణి వచ్చాను లేవయ్యా. నీ భక్తికి మెచ్చాను కళ్లు విప్పు" అన్నాను. అతను కళ్లు విప్పి నా వేపు చూచాడు.

"రామా, రామా, నన్ను కరుణించావా రామా? ఈ భక్తుడిని కనికరించావా

స్వామీ" అంటూ నా పాదాలపై పడ్డాడు. "హనుమా నీ ఎదురుగా వున్న ఫోటో చూడు అందులో నీ రాముడున్నాడు. కనిపిస్తున్నాడా లేదా! త్రేతాయుగంలోని నీ రాముడే ఇప్పుడు మాస్టరుగారు. చెప్పు. 'మాస్టరు సి వి.వి. నమస్కారం' అని చెప్పు" అన్నాను అలా మాస్టర్‌గారికి నమస్కారం చేయగానే అతని ఉద్రేకం తగ్గింది. నార్మల్ అయ్యాడు మాతో కలిసి ప్రేయర్ చేసుకుని వెళ్లిపోయాడు. అందరికళ్లు నామీదే వారందరిలో నాకో ప్రత్యేకత ఏర్పడ్డది

వారంరోజులు సమావేశాలు అన్నారు గానీ, మర్నాటికే కొందరికి రక్తవిరోచనాలు. వచ్చి వెళ్లిపోయారు. కొందరికి జ్వరాలు వచ్చి జారుకున్నారు. మూడవరోజుకు 30 మంది మిగిలాం. మూడవరోజు రాత్రి, దిడుగు నారాయణరావు గారు ఒళ్లు మంటలెత్తి పరుగులు తీశారు. ఎన్ని బిందెల నీళ్లుపోసినా తగ్గలేదు. అర్ధరాత్రి బస్సెక్కి గుంటూరు వెళ్లిపోయారు.

మర్నాడు ఉదయం ప్రార్ధనతో సమావేశాలు చాలించారు డాక్టర్ కందేపు సుబ్రహ్మణ్యంగారితో అప్పుడు పరిచయం కలిగింది ఆయన మాస్టర్ ఎం.బి ఎస్. గారికి స్నేహితుడు పిడుగురాళ్లలో డాక్టరుగా ప్రసిద్ధుడు. ఆయన పిడుగురాళ్ల వచ్చి వెళ్లమని కోరారు. అంతకుముందు వారిని చూడకపోయినా వారిగురించి నాకు తెలుసు నా గురించి వారికీ తెలుసు. మంచి వ్యక్తి. సహృదయులు తర్వాత కాలంలో వారు నరసరావుపేటలో వారి కుమారుడు అచ్చయ్యగారింట ఉన్నప్పుడు చాలాసార్లు కలిసి, ప్రేయర్ చేసుకోవడం జరిగింది.

గురుజాలలోని అనుభవానికి భిన్నమైన అనుభవం అవమానం పిడుగురాళ్లలో కలిగింది. దాసుగారు, నేను కలిసివెళ్లాం పిడుగురాళ్లకు. అక్కడి ఆశ్రమం, ఎంబిఎస్‌గారిల్లు పక్కపక్కనే. నాగరాజు ఆధ్వర్యంలో నడుస్తోంది. అక్కడి యోగాశ్రమంలో మధ్యాహ్నం ప్రేయర్ చేసుకున్నాం. మాస్టరుగారి పాదుకలున్నాయి అక్కడ! ఏ మాస్టర్‌గారివో? భోజనాల సమయంలో మళ్లీ వివక్ష. గురుజాల వచ్చిన యోగమిత్రులు పిడుగురాళ్ల ఆశ్రమం చూద్దామని వచ్చారు. వారిలో బ్రాహ్మల్ని మాత్రం భోజనానికి లేపారు. మిగిలినవారికి కడగా, తర్వాత వడ్డిస్తారుట. నాకు మండిపోయింది. వీరివల్ల యోగం విస్తరించదు, నశిస్తుంది. జీవితంలో ఈ పిడుగురాళ్ల సెంటర్‌కు రాకూడదని, ఈ జనంతో కలవకూడదని నిర్ణయించుకున్నాను. డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు వచ్చి తమ ఇంటికి తీసుకువెళ్లారు. వారికి ఆ పూట అతిధిగా వున్నాను. ఆ సాయంత్రం పి.ఎస్.ఆర్. శర్మ, నేను కలిసి తాడేపల్లి వెళ్లాం. ఆ రోజు రాత్రి వారి గెస్టుని. మర్నాడు ఉదయం విజయవాడ వెళ్లి

దాసుగారిని, సీతారామయ్యగారిని కలిసి, సాయంత్రానికి తెనాలికి వెళ్లిపోయాను. తెనాలి స్వగ్రామం అమ్మానాన్న అక్కడే వున్నారు. చాలామంది కాలేజీమిత్రులున్న ఊరు.

+ + +

యోగంలో చేరాక మద్రాసులో జీవితం ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగానే సాగింది. పెద్దగా కోరికలు లేవు. సినిమాలకు స్వస్తి పలికాను అధికంగా సంపాదించాలన్న ఆశ లేదు జీతం కుటుంబానికి చాలేది కాదు. మొత్తం 350 రూపాయలు వచ్చేవి. పిల్లల చదువులు, ఖర్చులు ఎక్కువైనాయి. ఏదో మాస్టగు:గారే మార్గం చూపిస్తారన్న ఒక పెద్ద నమ్మకం కష్టాలు, కన్నీళ్లు లేకపోయినా, జీవితంలో బాధ్యతలు, బరువులు వుంటాయి కదా! రెండు సినిమాపత్రికలకు రచన చేసిపెట్టేవాడిని నాలుగైదు వందల వరకు వచ్చేది మాస్టరుగారి పుస్తకం 'ది డిస్కవరీ ఆఫ్ మాస్టర్‌యోగా'తో స్వంత పబ్లికేషన్ మొదలైంది పుస్తకాలు వేయడం వల్ల పెద్దగా లాభాలు రావుగానీ కాలక్షేపం అవుతుంది. కాలం గడిచి, అమ్మకాలు బావుంటే లాభం వుంటుంది మాస్టరుగారి పుస్తకం బాగా అమ్ముడుపోయింది దానికితోడు నా 'హస్తసాముద్రిక సర్వస్వమ్' అప్పుడే అచ్చువేశాను చిన్న చిన్న పార్టులు మూడు. ఒకే వాల్యూమ్‌గా వేయడానికి పెట్టుబడి లేక. కృష్ణావతారం పుస్తకం కూడా అప్పుడే వేశాను. అలా పుస్తక ప్రచురణ నాకు సైడ్‌బిజినెస్ అయింది మొత్తంమీద సంపాదన ఇంటి ఖర్చులకు సరిపోయేది.

అప్పుడే ఒక విచిత్రం జరిగింది మాస్టర్‌యోగ పుస్తకం చదివి తెనాలి ప్రాంతం నుండి ఒకతను ఉత్తరం రాశాడు తాను ఆ పుస్తకాన్ని తెలుగులోకి అనువాదం చేయదలచినట్లు. నేను తెలుగువాడినని అతనికి తెలియదు! ఒప్పుకునేవాడిని కాదు కాని, అతని దైన్యస్థితి తెలిసి సరేనన్నాను. అతను ఇంజనీరింగ్ విద్యార్థి. బి.ఇ. రెండవ సంవత్సరంలో జబ్బున పడ్డాడు. వెన్నుపూస క్రిందిభాగంలో ఆపరేషన్ చేశారు. మంచంలోంచి లేవలేడు. లేచి కూర్చోలేడు పాపం! రెండు సంవత్సరాలు అలా మంచంపట్టి వున్నాడు మాస్టర్‌యోగ పుస్తకం చదవ నారంభించిన రోజునే అతనికి కొత్త ఉత్సాహం కలిగింది. కాస్త లేచి కూర్చోగలిగాడు. పుస్తకం ఓ వారం రోజుల్లో చదవడం పూర్తి చేశాడు. ఆ వారంరోజుల్లో అతను లేచి కాస్త ఇంట్లో తిరిగే శక్తి వచ్చింది. తన పనులు తాను చేసుకుంటూ సాటివారితో కబుర్లు చెప్పకోగలిగాడు. ఆ స్థితిలో నాకు ఉత్తరం రాశాడు. తనకు అనువాదం చేయగలశక్తి లేకపోయినా, చేయాలనే ప్రేరణ కలిగిందని ఆ ప్రేరణ మాస్టర్‌గారినుండే వచ్చిందని రాశాడు. సరే నన్నాను. అయితే ఒక్కొక్క అధ్యాయం తెలుగు అనువాదం నాకు పంపాలని, నా అనుమతి లేకుండా దానిని ప్రచురించ వీలులేదని కండిషన్ పెట్టాను.

అతను అనువాదం మొదలెట్టాడు. పేజీ, రెండుపేజీలు రాసేవాడు పుస్తకం రాయడం మొదలైన రోజు నుండి అతని ఆరోగ్యం మెరుగుకాజొచ్చింది. రెండునెలల్లో రాయడం పూర్తి చేశాడు. పూర్తి ఆరోగ్యం చేకూరింది రెండు సంవత్సరాలుగా మంచానికి అతుక్కుపోయిన మనిషి, లేచి ఊళ్లకు వెడుతున్నాడు మద్రాసు వచ్చి నన్ను కలిశాడు ఆ పుస్తకం అచ్చువేద్దామని కోరాడు. నేను చెప్పాను, "నీ అనువాదం ఏమీ బాగా లేదు. నేను తెలుగువాడినని నీకు తెలియక ప్రయత్నించావు తీరిక చేసుకుని నేనే రాసిపెడతాను నీ పేరున అచ్చువేస్తాలే." 'మాస్టర్ యోగదర్శిని' ధనాభావం వల్ల మొదట రెండు పార్టులుగా అచ్చువేశాను బాగాపోయింది. ఎప్పుడో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'ప్రజ్ఞాప్రభాకరం' తప్ప మాస్టర్ యోగ సంబంధమైన పుస్తకం తెలుగులో రాలేదు కొత్త రామకోటయ్యగారి 'భక్తరహిత తారక రాజయోగం' వచ్చిందని విన్నాను. కాని ఎక్కడా కాపీలు దొరకలేదు.

అప్పట్లో శ్రీ ఎక్కిరాల కృష్ణమాచారిగారు మద్రాసు వచ్చారు. శ్రీ వేదవ్యాస నాకు తెలుసు. వారు మద్రాసులో వుంటుండేవారు. మాస్టరుగారి యోగమే చేస్తుండేవారు. మా యోగజర్నల్‌కూ ఓ వ్యాసం రాసి పెట్టారు. అప్పుడప్పుడు మా ఆఫీసుకు వచ్చేవారు .. పిలకా గణపతి శాస్త్రిగారి కోసం. గణపతిశాస్త్రిగారు నా సహోద్యోగి. పక్కపక్క సీట్లు మావి. వేదవ్యాసగారికి ఆయన మద్రాసులో ప్రియశిష్యుడు, ఏకైకశిష్యుడు కూడా గణపతి శాస్త్రిగారు అరవిందుని యోగంలోని వారు. వేదవ్యాసకు దగ్గరైనాడు వేదవ్యాసను విమర్శించేవాడు ఆయన వచ్చి పిలిస్తే కాదనకుండా వెళ్లేవాడు. వేదవ్యాస కృష్ణమాచారి గారి తమ్ముడు.

ఇ.కె.గారి మద్రాసు సభను నిర్వహించే బాధ్యత ముదిగొండ లింగమూర్తిగారు తీసుకున్నారు. ఆయన మా గురువుగారికి దగ్గరవాడే. ఈయన అల్లుడు చంద్రమోహన్‌కు దగ్గరబంధువు. లింగమూర్తి వచ్చి ఇలా మాస్టర్ ఇ.కె. వస్తున్నారు, మీరు రావాలని డాక్టరుగారిని అడిగారు. డాక్టరుగారు మండిపడ్డారు. 'మాస్టర్ ఇ.కె.' అనడం ఆయనకేం నచ్చలేదు. ఒక్క సి.వి.వి గారిని తప్ప ఈ యోగంలో ఎవరినీ మాస్టర్ అనడం ఆయనకు నచ్చదు. తన గురువు నర్భవినే ఆయన అనడు. మాస్టరు ఇ.కె.గారి శిష్యుడు ఒకరు ఆఫీసుకు వచ్చి నన్ను ఆహ్వానించి వెళ్లాడు. ఇష్టం లేకపోయినా, జర్నలిస్టుగా వెళ్లదలిచాను. డాక్టరుగారు, నేను కలిసే వెళ్లాం. టి.నగర్‌లోనే శంకరమఠంలో మీటింగ్. ఓ నలభై, యాభైమంది వచ్చారు. మేం కాస్త ఆలస్యంగా వెళ్లాం. అప్పటికి వారి ఉపన్యాసం ముగింపుకు వస్తోంది. ప్రక్కన మాస్టరుగారి ఫోటో వుంది. మేం ఇద్దరం దూరంగా వారికి కనిపించకుండా కూర్చున్నాం.

ఉపన్యాసం ముగిసిన తర్వాత ఒక్కొక్కరే ఇ.కె.గారికి పాదాభివందనం చేయసాగారు. ఆయన శిష్యులు, లింగమూర్తి వచ్చినవారిని 'వెళ్లి మాస్టరుగారికి పాదాభివందనం చేయండి'' అని బలవంతం చేశారు. డాక్టరుగారికి బి పి పెరిగిపోయింది. 'ఎవరి కెవరూ గురువు కాదు, యోగంలో అందరు సాధకులు మాస్టరుగారికి సమానులే' అది డాక్టరుగారి నమ్మకం. లింగమూర్తి వచ్చి 'రండి, మాస్టర్‌గారికి నమస్కారం చేసి ఆశీస్సులు తీసుకోండి' అన్నాడు. డాక్టరుగారు కన్నెర్రచేసి ''షటప్ అండ్ గెటవుట్'' అని అరిచారు. ఆ అరుపు విని ఇ.కె. మా దగ్గరకు వచ్చారు లింగమూర్తిగారే మమ్మల్ని పరిచయం చేశారు. ఎక్కువ మాట్లాడింది లేదు. మేం వచ్చేశాం

\+ \+ \+

యోగం నీకు ఏం నేర్పింది అని ఎవరైనా ప్రశ్నిస్తే 'అనుభవం' నేర్పింది అంటాను.

'అనుభవం' అంటే ఏదో అనుభవించడం కాదు. సుఖపడడం మాత్రం కాదు. కష్టపడడం మాత్రమే కాదు. కష్టాలు, సుఖాలు అందరం అనుభవిస్తున్నాం. వాటి ఫలితం మన జీవితం మీద ఎంతవరకు పడుతుంది అవి మన భవిష్యత్తును ఎంతమేర ప్రభావితం చేస్తున్నాయి. మన అభివృద్ధికి ఎంత దోహదం చేస్తున్నాయి. అలా చేయగలిగిన వాటిని 'అనుభవం' అంటాను నేను. అంటే మనకు జీవితం నేర్పే పాఠం 'అనుభవం.' మన జీవితబాటలో, సొంతంగా సేకరించిన మౌళికవిలువలు అనుభవాలంటే. అలా మన జీవితాల్లో మైలురాళ్లుగా నిలిచి, మార్గదర్శకంగా మారిన సంఘటనల తాలూకు గుర్తులు అనుభవాలు. అలాంటి అనుభవాల ఆసరాతో నేను నా జీవితాన్ని ముందుకు సాగిస్తున్నాను. మలుపులు తిప్పుకుంటున్నాను.

అసలు భృక్తం అంటే ఏమిటి? భృక్త రహితం ఏమిటి? తారక రాజయోగ రహస్యం ఏమిటి? ఒక్కొక్కరు ఒక్కోరకంగా వివరణ యిచ్చేవారు. ఆ వివరణ నాకు నచ్చేది కాదు. నా 'అనుభవం' యోగసాధన ఫలం.

సృష్టి జరిగింది. అందరం అంగీకరిస్తాం. సృష్టిలో ఒక దశ పూర్తయి మరో దశ ప్రారంభమవుతుంది. దానిని పరిణామక్రమం అందాం. మొదటి దశల సృష్టి ఎలా జరిగిందీ భృక్తంగా అంటే రహస్యంగా వుండిపోయింది. మాస్టరుగారు యోగం ఆవిష్కరించే వరకు ఆ రహస్యాలు పూర్తిగా తెలియలేదు. సృష్టిరహస్యాలు భృక్తంగా వుండిపోయాయి. ఆ తర్వాతనే సృష్టిరహస్య భేదనం జరిగింది. అంటే భృక్తరహితం కాసాగాయి. సృష్టి పూర్వపు స్థితి, తర్వాతి స్థితి తెలుస్తోంది. ఆ రహస్యం తనంత తాను విచ్చుకుంది. సృష్టి

మొదటిదశ కన్న సృష్టి ముందరి దశ చాలా ఉన్నతమైనది, శక్తివంతమైంది, ప్రాణపూర్ణమైనది. తొలి దశకన్న పూర్వదశకు వెళితే తొలి, మలి దశల రహస్యాలు తెలుస్తాయి సులభంగా. అలా తెలుసుకోవడమే ఈ యోగలక్ష్యం. అంటే పరిణామంలో చివరిదశ నుండి సృష్టి పూర్వస్థితికి, నిరాకార, నిర్గుణ, నిర్వికార స్థితికి వెళ్లడం. అది పూర్తిగా అవగాహన కావాలంటే, దానిని స్పృశించి గ్రహించాలి - టచ్. దానినే రీ-స్పెక్ట్ అంటాం. దానిని ఆశిస్తాం.

ఆశ అంటే జరిగింది కాదు. కనిపించేదీ కాదు కదా! ఖచ్చితంగా ఉన్నదో లేదో తెలియనిదాన్ని ఉన్నదని, తెలుసుకోవాలనీ ఆశించడం. అవకాశం ఉండవచ్చు, ఉండక పోవచ్చు. అంచనాలకు అందినప్పుడు తెలుస్తుందనే ఆశ కలుగుతుంది ఒక సంఘటన జరిగిన తర్వాత దానిపై ఆశ అనవసరం భవిష్యత్తులో ఎప్పుడో సంభవించ వీలున్న దానిని 'ఆశ'తో ముడిపెట్టి ఆశిస్తాం. అది జరగవచ్చు. అలా జరగటానికి 'అవకాశం' ఏర్పడాలి.

ఉత్తినే ఎవరైనా ఆశిస్తారు! ఆశ నెరవేరడానికి శక్తి తోడు కావాలి. దానిని ఎనర్జిటిక్ వేవ్స్ అనవచ్చు మనం యోగం చేస్తున్నప్పుడు మాస్టరుగారి పేరును, లేదా ఒక కోర్సును మననం చేస్తాం అలా మననం చేస్తున్నప్పుడు ఒక శక్తి లేదా ప్రాణ తరంగాలు మనలో జొరబడి పనిచేయడం ప్రారంభిస్తాయి. అంటే సాధకునిలో యోగక్రియ జరుగుతుంది. ఆ శక్తి తరంగాలు తనలో ప్రవేశించడం, క్రియ జరపడం సాధకునికి తెలియవచ్చు, తెలియకపోవచ్చు. రెండింటికీ అవకాశం వుంది. సాధకునికి తెలిసి జరిగినా, తెలియక జరిగినా, లోపల యోగక్రియ ఆగదు. ఆ తర్వాత తనలో ఏదో జరుగుతోందని, తనలో ఏదో మార్పు వస్తోందని అనిపిస్తుంది. అలా డైరెక్టుగా తనలో యోగక్రియను కొందరు గమనిస్తుంటారు. కొందరు ఫలితాన్ని బట్టి, మార్పును బట్టి యోగక్రియను ఆమోదిస్తారు. అది ముందుగా తెలుసుకోగలిగిన సాధకుడు పూర్ణత్వం దిశగా ఆలోచిస్తాడు, పయనిస్తాడు. అతనికి లక్ష్యం గమ్యం ఏర్పడుతుంది. అలా యోగశక్తి ఏమాత్రం మనలో ప్రవేశించి నిలవరించినా ఆశ చివురిస్తుంది. ఆశ ఇనుమడిస్తుంది. బయట పరిస్థితుల వల్ల అనుభవం అందుబాటులోకి వస్తుంది. అనుభూతిని మిగుల్చుతుంది. ప్రతికూల బాహ్యావాతావరణం నిస్పృహను కలిగించవచ్చు. పూర్తి నిరాశ ఆవరించినపుడు, కొత్త ఆశ చివురిస్తుంది. చెట్టు ఆకులన్నీ రాలిపోయినప్పుడే కొత్తచివుళ్లు వేస్తుంది. నైరాశ్యంనుండి ప్రతిసాధకుడు తప్పక బయటపడతాడు. అలా బయటపడడం మరో మెట్టు యోగంలో పైకి పోవడం. కొత్తశక్తిని సంపాదించడం. ఒక

నిరాశ వెనుకనే రెండింతలు ఆశ కనిపిస్తుంది. అలాంటి కొత్త ఆశ, స్ఫూర్తి బాహ్య పరిస్థితులను ఎదుర్కొని జయించే శక్తినిస్తుంది. అదే యోగసాధనలో ప్రాణధార మనకు చేసే మహోపకారం. వాటినే ఎనర్జిటిక్ హోప్స్ అంటాం అది అనంతం

\+ + +

మద్రాసులో వున్నకాలంలో ఒక మిత్రుడు పి.వి రమణ సినిమాపనిమీద మద్రాసు వచ్చాడు. అతనికి వరంగల్‌లో ఉద్యోగం. నాటకాలు రాయడం, వేయించడం, నటించడం హాబీ సినిమా తీయాలని ఒక ప్రొడ్యూసర్‌ను తీసుకువచ్చాడు. అతని మిత్రుడు రాజా శివానంద్ అని మద్రాసులో సినిమా పరిశ్రమలో వున్నాడు. పాండీ బజారులో కలిశారు. నేను గుర్తించలేదు ఎప్పుడో తెనాలి కాలేజీలో తను విద్యార్థి అట. 'గురువుగారూ' అంటాడు భక్తి నేనంటే. అతని భార్య అదే కాలేజీ విద్యార్థిని. ఇద్దరూ ప్రేమించిపెళ్లాడారు ముగ్గురుపిల్లలు. ఆమె టీచర్‌గా చేసింది ఇప్పుడామెకు గుండె బలహీనత. ఆస్మా అని జ్ఞాపకం జంపనిలో తల్లిదండ్రుల ఇంట, పిల్లలతో వుంటోంది ఇతను ఒంటరివాడు. నన్ను ట్రీట్‌మెంట్ చేయమని కోరాడు. నేను హోమియోమిత్రుడు గోపాలకృష్ణ కలిసి తెనాలి వెళ్లాం. స్టేషనులో స్వాగతం చెప్పాడు అతనిమిత్రుడు సుబ్బారావు అని ఒక డాక్టరు స్టేషనుకు వచ్చారు. మాటల సందర్భంలో అతనికి యోగంపైన, మహత్ములపైన నమ్మకంలేదని వ్యక్తం చేశాడు. నమ్మకం లేని వాడైతే నా కోసం రావలసిన పనిలేదు. ఏదైనా ఒక అద్భుతం జరిగితే తాను నమ్ముతానని, యోగంలో చేరతానని అన్నాడు. అతను యోగంలో చేరకపోతే కొంప మునిగేది లేదు. అలాగ అనుమానించేవారు అసలు యోగానికి పనికిరారని నా నమ్మకం. ఒక విశ్వాసంతో ముక్కుమూసుకుని నీళ్లలో దూకాలి మునగదలచిన వాడు. యోగం అంటే మీనమేషాలు లెక్కిస్తూ, లాభనష్టాలు, ప్రయోజనాలు బేరీజు వేస్తూ ఆలోచించేవారు యోగం చేయలేరు. ప్రతిరోజు ఎంత లాభం అనుకుంటే ఎలా! ఆ సుబ్బారావు మాట మనస్సులో నాటుకున్నా నేను పట్టించుకోలేదు. నలుగురం బస్సెక్కి జంపని వెళ్లాం. రమణ భార్య, పిల్లలు అంతా సంతోషించారు. మాస్టరుగారు వచ్చారని ఆ అమ్మాయి సంతోషించింది.

మే, జూన్ ప్రాంతం ఎండలు మండిస్తున్నాయి. బస్సులో వెళ్లాలంటేనే తాపం. ఎండలు సెగలు కక్కుతున్నాయి. ఆ రోజు సాయంత్రం ట్రీట్‌మెంట్. పెద్దలోగిలి ఇల్లు. నేను రమణ భార్య లోపల గదిలో వున్నాం. ప్రార్థన కోసం అందరూ తలొకచోట చేరారు. గోపాలకృష్ణ యోగం చేయడు. వరండాలో మంచంమీదకూర్చున్నాడు. ప్రేయర్ ప్రారంభమైన అరగంటకు, ఉరుములు మెరుపులతో కుంభపోత వర్షం. ఒకగంటలో ఊరు వాడ

జలాశ్రయాలైనాయి. విపరీతంగా చలిపుట్టుకు వచ్చింది. పొలాలు జలమయమైనాయి. ఆ నెలలో వర్షాలు రావడం ఎన్నడూ జరగదు

"ఏమండీ సుబ్బారావుగారూ. యోగం వల్ల వర్షాలు కురుస్తాయా! మంత్రాలకు చింతకాయలు రాలతాయా అన్నారు కదా! ఇప్పుడేమంటారు. మంత్రంతో ఆ అమ్మాయి జబ్బు తగ్గిపోయింది. చూడండి. ఎప్పుడూ మీకు తెలియనంత మాత్రాన అజ్ఞానంతో విమర్శించకండి" అన్నాను.

తిరిగి వచ్చేటప్పుడు అతను తెనాలిలో వాళ్ల ఇంటికి ఆహ్వానించాడు. రానని నిష్కర్షగా చెప్పాను. 'నీవు యోగానికి అర్హుడివి కావు' అని మొహంమీదనే అన్నాను. అలాంటి శంకాచూడుల్ని యోగంలో చేర్చడం నాకు ఇష్టం వుండదు. ప్రేమతో యోగి కావాలి. సాధన చేయాలి. యోగం వల్ల, సాధన వల్ల పుట్టేది అమృతం ఇది క్షీరసాగర మథనం వంటిది. నాటికీ నేటికీ యోగార్హుల్ని నిర్ణయించడంలో పరీక్షలు కఠినంగానే వుంటాయి. నిబంధనలు గట్టిగానే వుంటాయి. ఎంత ఆత్మీయులకైనా, స్నేహితులకైనా, బంధువులకైనా కన్సెషన్స్ ఉండవు. అందుకేనేమో మా దగ్గర బంధువులు, మిత్రులు మాయోగంలోకి ఎక్కువగా రాలేకపోయారు చండామార్కుని వలె వుండక తప్పదు. మినహాయింపులు యిస్తే యోగానికి అన్యాయం చేసినట్లవుతుంది

\+ \+ \+

తెనాలిలో ఒక వివాహానికి వెళ్లవలసి వచ్చింది ఒకసారి. పెళ్లికి, యోగానికి సంబంధం ఏమిటనవచ్చు ఉంది నేను మద్రాసులో వుంటున్న కారణంగా ఆంధ్రలో బంధువుల ఇళ్లలో జరిగే శుభకార్యాలకు సాధారణంగా హాజరవడం పడేదికాదు. ఆ పెళ్లికి ఎందుకో వెళ్లాలనిపించింది. ఆ పెళ్లికుమార్తె తండ్రికి నా యోగం అంటే చిన్నచూపు. చాలసార్లు హేళన చేశారు. "ఏమిటోయ్ నువ్వు యోగం చేస్తున్నావట. అలా కూర్చుని ఏం చేస్తావేమిటి ?" ఆయన వ్యంగ్యభాషణంతో నాకు అరికాలిలో ముల్లు గుచ్చుకునేది? సమయంకోసం ఎదురుచూస్తున్నాను. పెళ్లి ఇంటికి పోకుండా సరాసరి మా ఇంటికి వెళ్లాను. అమ్మ నాన్న అక్కడే వున్నారప్పుడు. నేను వెళ్లేసరికి మా పిన్ని, చెల్లెళ్లు ఇంటనే వున్నారు. నారాకకు ఎంతో సంతోషించారు. "హమ్మయ్య" అని ఊపిరి పీల్చుకున్నారు.

"ఏమిటి అంతా దిగులుగా ఉన్నారు" నా ప్రశ్న.

"నువ్వు వస్తావో రావో నని ఎదురుచూస్తున్నాం. ఈ పెళ్లి ఆగిపోతుందని భయంగా బెంగగా వుంది" అన్నారు.

"ఎవరింట పెళ్లికో మీరు బెంగపడడం ఎందుకు?"

అసలు సంగతి చెప్పారు ఆ పెళ్లికూతురు ఎవరినో ప్రేమించిందట కులాంతరం అతనితో లేచిపోవాలని ప్రయత్నించింది. తల్లిదండ్రులు బలవంతంగా వేరే [illegible] సంబంధం నిర్ణయించారు. అడిగినంత కట్నం యిస్తున్నారు. పైగా ఆ అమ్మాయి ఒకసారి బ్రోతల్ యాక్ట్ క్రింద అరెస్ట్ అయింది. ఒక లాడ్జిలో పట్టుకుని పోలీసులు లాక్కుపోయారు. బ్రోతల్ కేసు పెట్టారు. ఆ విషయాలు తెలియనివ్వకుండా పెళ్లివారికి ఎక్కువ కట్నం ఎరచూపి పెళ్లి చేస్తున్నారు. ఆ పిల్లకు తన పాతప్రియుడిపైనే మనసు. అవకాశం దొరికితే పారిపోవాలని ఎత్తు వేసి ఏడుస్తోందట

నేను వచ్చానని కబురందగానే పెళ్లికూతురు తండ్రి పరుగున వచ్చి చేతులు పట్టుకుని కన్నీరు పెట్టుకున్నాడు "ఇంతకాలం గౌరవంగా బ్రతికాను శార్వరీ! ఈ పిల్ల అప్రాచ్యపు పని వల్ల సగం చచ్చిపోయాను. వీధిలో తల ఎత్తుకు తిరగలేక పోతున్నాను. రిటైర్ అయినాను కనుక సరిపోయింది, లేకుంటే పదిమందిలో అవమానం భరించలేక నేనే ప్రాణత్యాగం చేసుకోవలసి వచ్చేది."

లాంఛనంగా ఆయన్ని ఓదార్చాను "పరవాలేదు లెండి. నా చేతనైన సాయం చేస్తాను." అన్నాను.

"అలా కాదు శార్వరీ! నీ యోగశక్తిని ఉపయోగించి, నాబిడ్డ పెళ్లి ఆగకుండా చేయాలి ఇవి చేతులు కాదు. కాళ్లు అనుకో" బ్రతిమిలాడాడు

ఆపిల్ల ప్రేమించిన కుర్రాడి పేరు, అడ్రసు తెలుసుకున్నాను మర్నాడు ఉదయం వాళ్ల ఇంటివరకు వెళ్లాను. పెళ్లి జరిగే ప్రదేశం చుట్టూ నాలుగు వీధులు ప్రదక్షిణం చేసి వచ్చాను

ఒక డాబాపైన షామియానా వేసి, పెళ్లి జరిపిస్తున్నారు. డాబాపైకి వెళ్లడానికి ఒక వైపే మెట్లున్నాయి.

"నేను పెళ్లి జరిగేచోటుకి రాను మీరు మీ పని కానివ్వండి. నేను బయటనే వుంటాను" అని, వీధిలో వేసిన షామియానాలో కుర్చీలో కూర్చుని స్థానికంగా వున్న నా స్నేహితులు వస్తే, వారితో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాను పెళ్లితతంగం అంతా పూర్తి అయ్యేవరకు.

ఆ రాత్రికే పెళ్లికూతుర్ని అత్తవారింటికి పంపివేశారు దుష్యంతుడు శకుంతలను అత్తవారింటికి పంపిన దృశ్యం జ్ఞాపకం వచ్చింది. ఇక్కడ పెళ్లికూతురి మాజీప్రియుడు వచ్చి అల్లరిచేయనందుకు ఆ పిల్ల తండ్రి పొందిన ఆనందం...

\+ + +

పాతనీరు పోయి కొత్తనీరు వచ్చింది. తెనాలిపట్టణంలో మాతరం రచయితలు, కవులు ఇప్పుడు లేరు నేనక్కడ ఉద్యోగం చేసిన కాలంలో జి.వి.కృష్ణారావు, హితశ్రీ, తాళ్లూరి నాగేశ్వరరావు, పి.వి సుబ్బారావు, బైరాగి, దుర్గానంద్, శారద, భరద్వాజ, అమరశ్రీ, కవిరావు లాంటి కవులు, రచయితలు ఉండేవారు. ఇప్పుడు పాతవారిలో హితశ్రీ ఒక్కరే మిగిలారు డా॥ కె.వి.కృష్ణకుమారి, డా॥ పోతుకూచి వెంకటేశ్వర్లు, డా॥ కొత్త రవీంద్రబాబు, డా॥ దక్షిణామూర్తి, సౌజన్య, వడ్లమన్నాటి కుటుంబరావు, ప్రసాదార్కె వంటి యువతరం రచయితలు ప్రసిద్ధులవుతున్నారు. అప్పట్లో నేను 'మహిళ' పత్రికకు వర్కింగ్ ఎడిటర్. మా మిత్రుడు జి. మునిరత్నం నాయుడు, ఆఫీసు తిరుపతిలో పెట్టి, ప్రింటింగ్ ఎడిటింగ్ బాధ్యతలు మద్రాసులో నాకు అప్పగించారు 'మహిళ'కు ప్రశ్నలు జవాబులు రాయడానికి డా॥ కృష్ణకుమారిని ఒప్పించాను సౌజన్య ఇంట్లో రచయితల సభ జరిపి నాకు చిన్న సన్మానం చేశారు. సభులకు, సమావేశాలకు నేను ఎప్పుడూ దూరం. దండలు వేయించుకోవడం, శాలువాలు కప్పించుకోవడం, పొగడ్తలు నాకు గిట్టవు. అప్పటికీ, ఇప్పటికీ వేదికలు ఎక్కడం, ఉపన్యాసాలు ఇవ్వడం నాకు మనస్కరించదు. మరీ తప్పనిసరి అయితే అంగీకరిస్తాను.

మా నాయనగారి అనారోగ్యం కారణంగా అప్పుడప్పుడు తెనాలి వెళ్లవలసి వచ్చేది గవర్నమెంటు ఆస్పత్రిలో నాయనకు అల్సర్ ఆపరేషన్ చేశారు. నేను మద్రాసు నుండి వచ్చాను అర్ధరాత్రి పన్నెండయింది తెనాలి చేరేసరికి. సౌజన్య, వడ్లమన్నాటి కుటుంబరావు స్టేషన్‌లో ఎదురుచూస్తున్నారు అందరం కలిసి ఆస్పత్రికి వెళ్లాం. జనరల్ వార్డులో నాన్నగారిని చూచాను. రాత్రి డ్యూటీలో కృష్ణకుమారి ఉన్నారు. కుటుంబరావు వెళ్లి, ఆమెను నిద్రలేపాడు. ఆమె భయపడిపోయింది. 'నాన్నగారికి ప్రమాదమేమోనని...' ఆమె మరొక విచిత్రం జరిగినట్లు చెప్పారు. నైట్‌డ్యూటీ రౌండ్స్‌కు ఆమె రారు తన గదిలో పడుకుని నిద్రపోతారట. ఎందువల్లనంటే నాన్నగారున్న వార్డులో ఆమెకు ఏవో శబ్దాలు వినిపించేవట. ఆకాశంలో ఎవరో నడిచివస్తున్నట్లు కనిపించి భయపడేదిట.

మర్నాడు ఉదయం మళ్లీ ఆస్పత్రికి వెళ్లాను. నాన్నగారికి ఆరోజు గడవటం కష్టమని డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లు చెప్పారు. ఆయనే మెడికల్ ఆఫీసరు. బంధువులు వచ్చి చూచి పోతున్నారు. నాన్నగారి బెడ్‌ప్రక్కన 'నీలకంఠం' అని మరో పేషెంట్ వున్నాడు. ఈయన లాగానే ఆయనకూ ఆపరేషన్ జరిగింది. ఆయన కోలుకున్నాడు. మర్నాడు ఆయన్ని డిశ్చార్జి చేస్తారుట. ఆయన మా నాన్నగారి స్నేహితుడే. చిన్నతనంలో మా ఇంటి దగ్గరనే వారిల్లు. నేను గుర్తించలేదు ఆయనను. ఆరోజు సాయంత్రం ఇంటి దగ్గర

ప్రేయర్ చేసుకున్నాను. నాకేమీ 'చెడు' అనిపించలేదు నాన్నగారి ఆరోగ్యం బాగవుతుందన్న ఫీలింగ్ వచ్చింది మన చేతుల్లో ఏముంది, భగవంతుడు ఎలా చేస్తాడో! మనకు అయినవారు, ఆత్మీయులు కదాని మాస్టరుగారిని అర్థిస్తాం ప్రతివారు ఎప్పుడో పోకతప్పదు. తల్లిదండ్రులైనంత మాత్రాన శాశ్వతంగా ఉండగలరా! నేను మాత్రం ఉంటానా? కనుక కాలంతో మృత్యువును స్వాగతించాలి ... కాలం తీరిన వారిని యోగశక్తి రక్షించలేదు

ఆ ఒక్క రాత్రి ... డాక్టర్లు నాన్నగారికి పెట్టిన గడువు. ఆస్పత్రికి వెళ్లి రాత్రి పన్నెండు గంటల వరకు ఉన్నాను ఆయన మంచంమీదనే కూర్చుని ప్రేయర్ చేశాను. మిత్రులతో తిరిగి వచ్చాను. ఉదయం ఎప్పుడు దుర్వార్త వస్తుందో ననే భయం, ఆతృత. ఏదీ రాలేదు. ఉదయం ప్రేయర్ చేసుకొని మళ్లీ మిత్రులతో కలిసి ఆస్పత్రికి వెళ్లాను. నాన్నగారు లేచి కూర్చుని బ్రెడ్ తింటున్నారు సంతోషంగా వున్నారు వెళ్లి పలకరించాం

"ఈపూట డిశ్చార్జి కావలసిన నీలకంఠం తెల్లవారుఝామున చనిపోయాడు నాయనా" అన్నారు నాన్నగారు. ఆయన నన్ను సాధారణంగా 'నాయనా' అనే పిలిచేవారు 'కృష్ణా' అని పిలవడం అరుదు.

'అలాగా' అన్నాను ప్రక్క మంచం ఖాళీ . అయింది. వచ్చిన మృత్యువు ఆయన్ని తీసుకుపోయిందా? ఏమో! నాన్నగారికి ఇంకా కొంతకాలం జీవించే యోగం వుంది, అంతే!

నాన్నగారు మహాకాళీ ఉపాసకులు. ఆయనను కాళీమాత కనిపెట్టుకుని ఉండేది కృష్ణకుమారి అమ్మ కాలిగజ్జెల సవ్వడి వినే భయపడ్డది వార్డులో అమ్మవారే తిరుగుతుండేది. ఆమె నాన్నగారికి చెప్పారు ...

" ఆ విషయం అబ్బాయికి చెప్పండి, డాక్టరుగారూ. అమ్మ మీ జోలికి రాకుండా తనైతేనే ఆపగలడు. మిగతా ఎవరి వద్దకు వెళ్లినా మీకు లాభం లేదు అమ్మను ప్రసన్నం చేసుకోవాలి తప్ప భయపడకూడదు."

నాన్నగారిని డిశ్చార్జి చేసిన రోజునే ఆస్పత్రిలో గజ్జెల సవ్వడులు, అమ్మ స్పందనలు ఆగిపోయాయి.

నాన్నగారిని డిశ్చార్జి చేశారు. ఇంటికి తీసుకువెళ్లాం. మా ఇంట్లో ఒక పెద్ద పోర్షను అద్దె కిచ్చి, చిన్న పోర్షనులో అమ్మనాన్న ఉండేవారు. అద్దె డబ్బులే వాళ్లకు ఆధారం. నేను వారికి చేస్తున్న ఆర్థిక సహాయం లేదు. ఎప్పుడైనా అక్కడకు వెళ్లినపుడు ఒక వంద, రెండు వందలు యివ్వడం తప్ప, నెలనెల ఇంత అని పంపే శక్తి నాకు లేదు. మద్రాసులో సంసారం. నలుగురు పిల్లల్ని చదివించుకోవాలి. మనం కన్నవారిని ఎంతగా

...లాగా చూస్తామో, మనల్ని కన్నవారిని అంత ప్రేమగా చూడాలి. కాని చూడం. పరిస్థితులు కారణం. తల్లిదండ్రులు బిడ్డల ప్రేమాభిమానాల్ని ఆశిస్తారు గానీ, వారి [illegible] తన బిడ్డల ముందు చేయిచాచరాదని, అర్థించరాదని [illegible]. కానీ [illegible] పరిస్థితులు ప్రతికూలమైనప్పుడు అర్థించక తప్పదు. దేబిరించక తప్పదు అమ్మ నాన్నలను చివరి దశలో ఆదుకోలేకపోవడం మహాపాపం అలాంటి [illegible] చేసిన కొంత కారణం నా అశక్తత వారి స్వాభిమానం కొంత.

మా ఇంటి గుమ్మంపైన ఒక పెద్ద కాళికాదేవి పటం వుంటుంది చాలాకాలం మానాన్నగారు పూజించిన మహాశక్తి. ఇదివరకు అది వారి పూజామందిరంలో ఉండేది. [illegible] అనుభవ, వింతలు ఉండేవి. పూజలు నిలిపి వేశాక, ఆ పటం గుమ్మంపైన పెట్టారు దాన్ని చూచి పిల్లలు దడుచుకునేవారు. ఆ రోజున నాన్నగారి మంచం ప్రక్కన నేల మీద కూర్చుని ప్రేయర్ వేశాను ధ్యానం రెండు గంటలు పైగా సాగింది చాలా [illegible] వచ్చింది. అచేతన స్థితిలో లేచివెళ్లి ఆ మహాకాళికాదేవి పటాన్ని క్రిందికి లాగాను. నాన్నగారికి చెప్పాను -

"ఇంక కాళీమాత పూజ చేయకండి. ఆమెకు మీపైన ప్రేమ ఎక్కువై, మీ చుట్టూ తిరుగుతోంది. ఆమె మీ ప్రక్కన ఉండగా మృత్యువు రాదు. కానీ శరీరం శుష్కించిపోయి, ఇలా రోగాలతో బాధపడాలి ఇలా బాధలు పడుతూ జీవచ్ఛవంలాగా బ్రతుకుతారో, అమ్మను వదలి, హాయిగా మృత్యువును ఆహ్వానించి జన్మరాహిత్యస్థితిని పొందుతారో మీ ఇష్టం నిర్ణయం మీది."

"నాకు మళ్లీ జన్మ వుంటుందా! పరమాత్మలో కలిసిపోతానా?" అని అడిగారు.

"మీరు నన్ను కన్నతండ్రి. మీకు పునర్జన్మ లేకుండా మాస్టరుదగ్గరకు పంపగలను. నా యోగం మీ వంటి వారికి సత్యలోక ప్రాప్తి కలిగించి తీరుతుంది. నాపై నమ్మకం వుంచండి" అన్నాను.

తనకు మాస్టర్‌యోగంలో ఉపదేశం చేయమని కోరారు.

"నాకు కన్నతండ్రి మీరు. మీకు నేను ఉపదేశం చేయకూడదు. రోజూ మాస్టర్ గారికి నమస్కరించుకుని, వారిని స్మరించండి చాలు. ధ్యానం చేసుకోండి. మిగత పని నేను చేస్తాను."

జన్మ నిచ్చిన తల్లిదండ్రుల ఋణం ఆ విధంగా తీర్చుకున్నాను. తర్వాత మా అమ్మగారు ఈ యోగంలో సాధన చేసేవారు. నేను ఉపదేశం చేయకపోయినా సంకల్పంతో వారికి యోగారూఢం సిద్ధించింది. పున్నామ నరకం నుండి రక్షించేవాడు పుత్రుడు అంటారు. మన యోగంతో మన తల్లిదండ్రులకు జన్మరాహిత్యం సిద్ధింపచేయవచ్చు.

తర్వాత నాన్నగారు ఈయోగం చేసుకోసాగారు ఆరోగ్యం చాలావరకు చక్కబడ్డది. ఆయన ఎంతో తపస్సు చేసినవారు కనుక, మాస్టర్ మార్గంలో అవలీలగా యోగశిఖరాల్ని అందుకోగలిగారు కన్నకొడుకుగా వారికి నేను చేసింది, చేయగలిగింది సామాన్యంగా అందరూ చేయగలిగింది కాదు!

మా గురువుగారు బాలసుందరరావుగారింట పరిచయమైన పెద్దలలో ప్రముఖ దర్శకుడు బి.ఎన్.రెడ్డి ఒకరు ఆయన సినిమాలు తీయడం మానివేశారు అప్పటికే రోజూ ఒక గంటసేపైనా నాతో గడిపేవారు. ఇద్దరం కలిసి విజయ, వాహినీస్టూడియోలకు వెళ్లి సినిమాలు చూచేవారం ఆయనకు ఈ యోగం చేయాలని వుండేది కాని డాక్టరు గారిని అడగడం యిష్టం లేదు నైతికజీవితం కలవారే గురుస్థానానికి అర్హులని ఆయన అభిప్రాయం. ఆయనకు నా జీవనపద్ధతి నచ్చినట్లుంది. నన్ను అడిగారు యోగంలో ఉపదేశం చేయమని. నేను వెళ్లి డాక్టరుగారికి చెప్పాను, బి.ఎన్ లాంటి వ్యక్తికి నేను ఉపదేశం చేయటం ఏమిటి? అని.

'నీవే అర్హుడివి చెయ్. ఇది మాస్టరుగారి సంకల్పం.' అని ప్రోత్సహించారు ఆయన సాంప్రదాయంగా ఉపదేశం పొందారు మా గురువుగారు ఎగతాళి చేశాడు 'బి.ఎన్ నిన్ను గురువును చేశాడు. ఆయన గొప్ప సినిమాలు తీయడమే కాదు ఒక గొప్ప గురువును సృష్టించాడు'

డాక్టరుగారి వ్యంగ్యం ఒక్కోసారి బాధపెట్టేది. గురువులకు శిష్యులు దూరం అవుతుంటారు. స్వతంత్రంగా అభివృద్ధి చెందే శిష్యులు గురువులకు దూరంగా వుండాలి అడుగులకు మడుగులొత్తి, పాదసేవలు చేయనవసరం లేదు. మా గురువుగారు అలాగే కోప్పడి, కసిరికొట్టి, విమర్శించి నన్ను దూరంగా వుంచేవారు. అడుగడుగునా నా అభివృద్ధిని గమనిస్తుండేవారు. ఒక్కటి నిజం. ఆయనకు అసూయలేదు. శిష్యులు పైకి ఎదిగితే అసూయపడి బాధపెట్టే గురువులు చాలా మంది వున్నారు. గురువు శిష్యునికి ఆత్మబంధువు కావాలి తప్ప అభివృద్ధికి ప్రతిబంధకం కాకూడదు. ఏడాదికి ఒకటి రెండు పర్యాయాలు ఏ శిష్యుడైనా గురువును దర్శిస్తే చాలు. ఈ యోగంలో సమావేశాల రహస్యం అదే.

డాక్టరుగారికి కాన్సర్ వచ్చింది. బొంబాయివెళ్లి పరీక్ష చేయించుకుని వచ్చారు. ఆరునెలలకంటే బ్రతకడని చెప్పారు. చివరి రోజుల్లో చాలా బాధపడ్డారు. వినాయకచవితి రోజున ఆయనపోయారు. అల్లుడు చంద్రమోహన్ అంత్యక్రియలు జరిపారు.వందలాది మంది అభిమానులు, సినిమాలవారు, నాటకాలవారు వచ్చారు. నేనూ రుద్రభూమికి

వెళ్లాను. తండ్రి తర్వాత గురువు తండ్రి అంతటివాడు గురువుతో కర్మబంధం తెగిపోయింది. నేను యోగంలో ఒంటరిగా మిగిలాను.

మద్రాసులో యోగజీవితం ఏడు సంవత్సరాలు సాగింది. ఉద్యోగరీత్యా మద్రాసు వదలివెళ్లే అవసరం కలగదనుకున్నాను మాస్టరుగారు హైదరాబాదుకు మార్పించారు మద్రాసులో వుండి సాధించేది లేదు. అయితే పిల్లలు చదువుకుంటున్నారు. వసంతకుమార్ ఎం.ఏ. చేస్తున్నాడు. శ్యాం సుందర్ పి.యు సి., రమణ ఎస్.ఎస్.ఎల్.సి., అమ్మాయి పద్మప్రియ తొమ్మిది పూర్తయింది. పిల్లల పెళ్లిళ్ల దృష్ట్యా ఆంధ్రప్రదేశ్ అయితే బావుంటుందని ఉండేది. విజయవాడలో మా ఆఫీసు వుంది. ఇప్పుడు హైదరాబాదులో ప్రభ డెయిలీ, ఎక్స్‌ప్రెస్, ప్రభ వీక్లీ పెట్టి ట్రాన్స్‌ఫర్ చేశారు బదిలీని కాదనడానికి కారణాలు కనిపించలేదు. అంతకుముందు హైదరాబాదు రెండు మూడుసార్లు వెళ్లినా పెద్దగా పరిచయం లేదు. ఇప్పుడు ఉద్యోగరీత్యా వెళ్లడం. అక్కడే సంసారం పెట్టాలి పదహారు సంవత్సరాలుగా మద్రాసు సంస్కృతికి అలవాటు పడ్డాం. మద్రాసుతో అనుబంధం వున్న వారెవరూ మద్రాసు వదలి వెళ్లడానికి ఇష్టపడరు. తెలుగువారి సాంస్కృతిక రాజధాని అప్పటికి మద్రాసే!!

# మదరాసు స్మృతులు

**జీవితంలోని మలుపుల్ని మనం గుర్తుపెట్టుకోం గానీ, అన్నింటికీ విలువ, ప్రయోజనం వుంటుంది.**

ఎన్నో ఊళ్లు తిరుగుతాం ఎందరెందరితోనో పరిచయాలు కలుగుతాయి ఒక్కసారైనా సింహావలోకనం చేసుకోం ఏదో ముందుకుపోతున్నాం అనుకుని తృప్తిపడి పోతాం కాని భవిష్యత్తులోకి వేసే ప్రతి అడుగుకు గతం గట్టి పునాది అవుతుంది భవిష్యత్తుకు సంబంధించిన తొలి వెలుగులు గతంలోనే వుంటాయి.

పది సంవత్సరాల వయస్సు వరకు ఉన్నది పల్లెసీమలో. తర్వాత 18సంవత్సరాలు తెనాలి. ఆ తర్వాత విజయవాడ, చిత్తూరు, బెంగుళూరు మద్రాసులో దాదాపు 18 సంవత్సరాలు గడిపాను చేదునిజాల్ని చూచాను. చేదు అనుభవాలు రుచిచూచాను జీవితంలో ఎత్తుపల్లాల అనుభవాలు పొందాను. దాదాపు సగం జీవితం గడిచిపోయింది. సూర్యుడు పడమర వైపుకు వాలుతున్నాడు మనిషికి బాధ్యతలు పెరిగేది ఈ వయస్సులోనే. గృహస్థుగా మోయవలసిన బరువులు మోపెడయ్యేది అప్పుడే. ఖర్చులు పెరిగేది, బాధ్యతలు పెరిగేది అప్పుడే. అప్పటికి నా సంపాదన నెలకు 400 రూపాయలు.

మద్రాసు జీవితంలో మరచిపోలేని వ్యక్తులు గురువుగారు బాలసుందర రావుగారు, మహర్షి టి.ఎస్. శంకరయ్యర్. ఇద్దరూ నాకు గురు సమానులే, పూజ్యులే. నా జీవితపు ఉత్తరార్ధానికి దివిటీలు వెలిగించిన వారు. వారు చూపిన వెలుగుబాటల్లో నేటికీ పయనిస్తున్నాను. యోగంలో నాకు ప్రవేశం కలగకుండా వుంటే నా జీవితం ఎంత అంధకారబంధురం అయ్యేదో అనిపిస్తుంది.

ఎవరు భౌతికంగా మన మధ్య లేకపోయినా, ఈ ప్రపంచం వదలిపోయినా వారి జ్ఞాపకాలు మనలో మిగిలి వుంటాయో, ఎవరి సంస్మరణ మనలో ఉత్తేజాన్ని కలిగించి మనకు మార్గదర్శకంగా వుంటుందో వారు శాశ్వతులుగా వున్నట్లే. వారి ఆత్మలు

లేదా వారి ఆత్మ శరీరాలు స్ఫూర్తినిస్తుంటాయి.. అలాంటివారే మహాత్ములు లోకంలో మనం భర్తకు భార్య, భార్యకు భర్త తోడు నీడ అంటాం నిజమే భౌతికజీవనం వరకు, భౌతిక ప్రపంచం వరకు భార్యాభర్తలు ఒకరికొకరు తోడు నీడలు కాని ఆత్మకు తోడు ఎవరు?! పరలోకంలోకి మనవెంట నీడలా వచ్చేది ఎవరు... గురువు!!! లేదా ఆత్మ! ఆత్మను గురించి తెలియచెప్పేవాడు, మనంగా ఆత్మను గుర్తించేట్లు చేసేవాడు గురువు కనుక గురువు ఆత్మతో సమానమే. ఆత్మే గురువే కావడం మరో పరిణామం. మన వెతుకులాటలో గురువు 'ఆత్మ' స్థానాన్ని భర్తీ చేస్తాడు. అందువల్లనే గురుశిష్యబంధం భార్యాభర్తల అనుబంధం కన్న గొప్పది, విలువైనది.

డాక్టరుగారు పోయాక అప్పుడప్పుడు అడయారు వెళ్లేవాడిని శంకరయ్యర్ తనింటి ఆవరణలో ఒక చిన్న పర్ణశాల ఏర్పరచి అందులో ప్రేయర్స్ నిర్వహించసాగారు. ఆయన భార్యపోయింది వెళ్లినప్పుడల్లా యోగ విషయాలు, మాస్టర్‌గారి విషయాలు చెప్పేవారు. ఆయనకు యోగమే ప్రాణం అరవై సంవత్సరాలకు పైగా యోగసాధన చేసినవారు.

"మిస్టర్ శర్మా, ఎప్పటికైనా యోగం నీ వల్ల విస్తరిస్తుంది. నా అంతరాత్మ చెబుతోంది. ఇది సత్యం. మనది సత్యయోగం. సత్యయోగం చేసేవారి హృదయం అబద్ధం చెప్పదు అసత్యం పలికించదు నీ వల్ల యోగవికాసం కలుగుతుంది. నీకు నా ఆశీస్సులు. ట్రీట్‌మెంట్స్ చెయ్" అని ఆదేశించారు.

కుమారి శోభానాయుడు 'అరంగేట్రం'. ప్రభలో సమీక్ష రాశాను. వెంపటి చినసత్యం వచ్చి తమ అకాడమీకి రమ్మని ఆహ్వానించారు శోభానాయుడిని పరిచయం చేస్తూ మరో వ్యాసం రాశాను. మంజుభార్గవి, కొత్తపల్లి పద్మ, బాల, సత్యంగారి కూచిపూడి ఆర్ట్స అకాడమీలో నృత్యరత్నాలు. అందరితో పరిచయం అయింది. శ్రీరాం భుజంగరాయశర్మగారు యక్షగాన రచయిత. వారు నాకు బంధువు కావడం వల్ల సత్యం గారితో పరిచయం స్నేహంగా మారింది. ఆ పరిచయంతో మా అమ్మాయి పద్మప్రియకు నాట్యం నేర్పించాలనుకున్నాను. మా అమ్మాయికీ కోపం ఎక్కువే. కుదరలేదు. పద్మ బదులు మా అబ్బాయి వెంకటరమణ నాట్యం నేర్చాడు. 'మాస్టర్ రమణ'గా అచిర కాలంలోనే గురువుల స్థాయికి ఎదిగి, వందలాది ప్రదర్శనలిచ్చాడు. మద్రాసు జీవితం ఓ కాక్‌టైల్‌పార్టీ.

అప్పుడు మా ఇల్లు ఒక యోగాలయం. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో మాస్టర్‌గారి విగ్రహం చేయించి ఒక సెంటర్ ప్రారంభించాం. నేను, పెంచలయ్య, ఎం.ఎన్. ఆర్.కె.

ప్రసాద్ అనే అతను అతనితో ఒక ప్రెస్ ప్రారంభించి, మోసపోయి, నష్టపోయాను అన్నీ వైఫల్యాలే. విజయాలు కనుచూపు మేరలో లేవు.

ఒకరోజు ఉదయం ప్రేయరు చేసుకుంటుండగా ఎవరో లోపలకువచ్చినట్టు తోచింది. ప్రేయర్ గది తలుపులు గడియ వేసే అలవాటు లేదు. ఎవరైనా ఆలస్యంగా వచ్చినా ఇబ్బంది కలగకుండా ప్రేయరు గదితలుపులు తీసే వుంటాయి. ఆ వచ్చినాయన నా పక్కన కూర్చున్నాడు. వెంటనే త్రేన్పులు. పిల్లికూతలు ఆరంభం. నేలమీద చేతులతో, కాళ్లతో టపటప కొడుతున్న శబ్దాలు. అలాంటి అనుభవం ఎన్నడూ ఎరగను. నాకు ప్రేయర్ కుదరలేదు. ప్రేయరు ప్రశాంతంగా చేసుకోవడం నా అలవాటు. కళ్లు విప్పాను. ఎవరో కొత్తవ్యక్తి. ఎప్పుడూ చూచిన జ్ఞాపకం లేదు. లేచాక పరిచయం చేసుకున్నాడు ఆయన పేరు తిమ్మావఝుల కోదండరామయ్య, మధురై విశ్వవిద్యాలయం ప్రొఫెసరు పూజ్యశ్రీ వేటూరి వారి శిష్యుడు.

"సంతోషం. ప్రేయరులో అరుపులు, త్రేన్పులు ఏమిటి? ఎంతకాలంగా వస్తున్నాయి" అని అడిగాను.

"అలా ఆరవాలికదండీ! అలా అరిస్తేనే మనలోవున్న దోషాలు ఆవిరైపోతాయి'

"అలా అని ఎవరు చెప్పారు?"

"మా గురువర్యులు ప్రభాకరశాస్త్రిగారు"

"అలా వస్తే ఏమవుతుంది?"

"ఆరోగ్యం చక్కబడుతుంది"

అప్పటికి నాకు వేటూరివారి శిష్యులతో పరిచయం లేదు. ఎం.ఎన్‌గారి శిష్యవర్గంలో ఇలాంటి వర్కింగ్ లేదు.

"రోజూ వస్తాయా?"

"రోజూ నేను ప్రేయర్ చేయను. భయపడిపోతానని ఇంట్లోవాళ్లు భయపడతారు. ఎవరైనా తోడుగా ఉంటేనే ప్రేయర్ చేస్తాను. ఇలా మీలాంటివారి దగ్గర చేస్తాను. ఇవాళ ప్రేయర్ చాలా తృప్తిగా వుంది. మరో ఆరునెలల వరకు ఈ ఎనర్జీ సరిపోతుంది" అని తృప్తిపడ్డాడు.

ఇదేం యోగంరా భగవంతుడా! ఎప్పుడో చేయడం ఏమిటి? భయం ఏమిటి! ఈ వికారం ఏమిటి?

"అయ్యా కోదండరామయ్యగారూ! మీలో ఏదో నెగెటివ్‌వర్కు సాగుతున్నదని నా అనుమానం. అరుపులు, కేకలు, త్రేన్పులు, కాళ్లు చేతులు కొట్టుకోకుండా యోగం కుదిరితే ఎంతో తృప్తిగా వుంటుంది కదా"

"అవును, అదెలా సాధ్యం మా గురువుగారు లేరు గదా"

"మీగురువుగారు లేకపోయినా నేనున్నాను నాపై నమ్మకం ఉంటే, ఈరోజు సాయంత్రం, రేపు ఉదయం రండి" అన్నాను.

సాయంత్రం వచ్చాడు. మా యోగమిత్రులు వచ్చారు ఆయన్ని నాపక్కన కూర్చోమన్నాను కొంచెంసేపటికి త్రేన్పులు వచ్చాయి. వెంటనే నా చేయి లేచి, అతని తలపైన బ్రహ్మస్థానంలో నొక్కిపట్టింది. త్రేన్పులు ఆగిపోయాయి. మహాప్రశాంతంగా ధ్యానం కుదిరింది.

"అయ్యా గురువుగారూ! నలభై ఏళ్లుగా యోగం చేస్తున్నాను. నిజానికి ఈరోజే తృప్తిగా, ధ్యానంలో సమాధిస్థితికి వెళ్లాను. పరమపదసుఖానుభూతిని పొందగలిగాను" అన్నాడు అప్పటి నుండి ఉదయం సాయంత్రాలు ఆయన యోగం చేసుకోసాగారు మద్రాసులో నేను ఉన్నంత కాలం అప్పుడప్పుడు వచ్చేవారు.

\+ \+ \+

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చివరిశిష్యుడు అనదగిన వ్యక్తి సర్వేపల్లి శంకరయ్య. అప్పట్లో తిరుపతిలో రాములవారి దేవాలయం ప్రక్కన, శాస్త్రిగారింటి దగ్గరగా వుండేవారుట ఈయన నగర సంకీర్తనం లాంటి భక్తి ముదిరిన పనులు చేసేవారు శాస్త్రిగారు ఈయన భక్తికి భయపడి యోగంలో చేర్చి, పురప్రజలకు నిద్రాభంగం లేకుండా చేశారు ఆయన మద్రాసులో మా వీధిలోనే వుండేవారు.

"పోతరాజు నరసింహం గారింటికి వెడదాం రా" అన్నాడు ఒకసారి.

"పి.ఎన్.గారు లేరు. ఆయన భార్య సత్యమ్మ వుంది. వారి ఇల్లు వుంది. ఆమె డైరెక్టు మీడియం కదా"

ఇద్దరం వెళ్లాం. పెంపుడు కూతురు, అల్లుడితో వుంటుంది ఆమె. 90 సంవత్సరాల వయస్సు ఆమెకి. మమ్మల్ని పరిచయం చేసుకున్నాం.

"యోగం చేస్తే కష్టాలు వస్తాయి. మానెయ్యండి" అన్నది.

"మీరు మానుకున్నారా! అనుక్షణం మాస్టరుగారి నామస్మరణ చేస్తారని విన్నాను" అన్నాను నేను.

"అది నాకర్మ. యోగంలో చేరి ఏం అనుభవించాను. పుట్టిన బిడ్డపోయింది. చేసుకున్న మొగుడు పోయాడు. నేను మిగిలాను. యోగం మిగిలింది."

మనిషి తనకు వచ్చిన లాభాన్ని, అనుభవించిన సుఖాల్ని మరచిపోయి కష్టనష్టాల్ని మాత్రమే జ్ఞాపకం పెట్టుకుంటాడు. ఆ చేదుజ్ఞాపకాలే మనిషిని బాధిస్తాయి.

అతలాకుతలం చేస్తాయి. యోగం చేయని వారంతా సుఖపడుతున్నారా! వారికి కష్టాలు రావా?"

"నువ్వేమైన మాస్టరువా! అంత ఖండితంగా చెబుతున్నావు మాస్టరునిన్ను పంపాడా?" అన్నది.

శంకరయ్యగారు కల్పించుకుని అన్నారు "అవును ... మాస్టరు శార్వరి. మాస్టరుగారు స్వయంగా పంపిన వ్యక్తి."

ఆమె నావైపు నిశితంగాచూచి, "మాస్టర్వా, అయితే నీకూ ఒకనమస్కారం" అన్నది.

సత్తెమ్మ ఏం చెప్పారని కాదు ఆమె కుంభకోణంలో మాస్టర్‌గారితో వున్న వ్యక్తి పి.ఎన్ గారి సతీమణి. యోగంలో ఏం సాధించిందన్న ప్రశ్న లేదు. సాధించడం సాధించక పోవడం, సాధకుని చేతిలో వుండదు ఎంత అర్హత, యోగ్యత వుంటుందో అంతే లభిస్తుంది మన ప్రమాణాలతో యోగఫలాన్ని కొలవకూడదు. ఆ లెక్కన టి.ఎస్. శంకరయ్యర్‌గారు ఏం సాధించారు? మా గురువుగారు ఏం సాధించారు? కీర్తి, ప్రచారం, డబ్బు, శిష్యు ఌ... వీటినిబట్టిగదా జనం ఒక వ్యక్తిని,-అతని ఔన్నత్యాన్ని అంచనా వేస్తారు. ఈ యోగంలో ఆ గొడవల్లేవు. ఎవరూ ప్రచారం చేసుకోరు. పి.ఎన్ గారిని చూడకపోయినా, ఆయన మా గురువుగారికి బాగా ఆత్మీయుడైన వ్యక్తి. మాస్టరుగారు అనేకసార్లు ఆ ఇంట సమావేశాలు, ప్రార్థనలు చేయించారు. కనుక ఆ ఇంట్లో ఒకసారి ప్రేయర్ చేసుకుందాం అనిపించింది. మహాత్ములు నడిచిన ప్రదేశాలు, తపస్సు చేసిన ప్రదేశాలు పుణ్యభూములే.

# హైదరాబాదు 1977 - '82

**1977** **జీవితాన్ని మరొకమలుపు తిప్పింది.**

మద్రాసుకు 'గుడ్‌బై' చెప్పక తప్పలేదు ఉగాది రోజునే హైదరాబాదు బయలుదేరాను పిల్లలకు రిజల్ట్స్ వచ్చాక, టి సి.లు తీసుకున్నాక రావాలని నిర్ణయం కేంద్రంలో కాంగ్రెసు ఓడిపోయింది ఆ రోజునే ఎన్నికల ఫలితాలు వచ్చాయి ఇందిరాగాంధీ, సంజయ్‌గాంధీ ఓడిపాయారు గోయెంకా మొరార్జీకి మిత్రుడు. ఇందిరాగాంధీకి వ్యతిరేకి. కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడనుంది హైదరాబాదులో గోయెంకా పత్రికలు నిలబడడం ఖాయం. హైదరాబాదులో నాకు తెలిసినవారు రావూరి భరద్వాజ, యూనివర్సిటీలో రీసర్చి చేస్తున్న పి.వి.రమణ, మా తోడల్లుడు సుగుణభూషణ రావు.

నాంపల్లి స్టేషనులో బయంభయంగా అడుగుపెట్టాం మద్రాసు తమిళులకు తెలుగు సరిగా రాదు. ఇక్కడి హిందీ, ఉర్దూలు వారి పాలిట గ్రీక్, లాటిన్ భాషలే ఇక్కడ ఎవరూ తెలుగు మాట్లాడరనీ, అంతా ఉర్దూమయం అని మా అభిప్రాయం. మద్రాసులో తెలుగువారు అక్కడక్కడ వున్నా అంతా అరవమేళం, తమిళమోత స్టేషను బయటకు వచ్చి టాక్సీలు బేరం చేశాం. మద్రాసులో టాక్సీలు చౌక మీటర్ ఉంటుంది. అడగకుండా, బేరం చేయకుండానే ఎక్కికూర్చుని అడ్రసు చెబితే తీసుకుపోతారు. ఇక్కడ మీటర్ టాక్సీలు లేవు. రెండు టాక్సీల్లో బయటపడ్డాం. వాళ్లకి దోమలగూడా అంటే తెలియలేదు. మొత్తానికి ఆఫీసుకు చేరుకున్నాం. ఒక వాచ్‌మన్, టైం కీపర్ తప్ప అక్కడ ఎవరూ లేరు. మద్రాసు నుండి వచ్చినవాళ్లం పదిమంది. వీక్లీకి ముగ్గురం. వీక్లీ వర్కర్సు కొందరు వచ్చాం. డెయిలీస్టాఫ్ విజయవాడనుండి వస్తారుట. హిమాయత్‌నగర్‌లో ఎక్స్‌ప్రెస్, ప్రభ రిపోర్టర్ల ఆఫీసు మా లాడ్జి భోజనం ఎం.ఎల్.ఏ.క్యాంటీన్‌లో. 'ఈనాడు' నుండి పొత్తూరు వెంకటేశ్వరరావుగారు డెయిలీ ఇన్‌చార్జిగా వచ్చి చేరారు. విజయవాడ నుండి ఇద్దరు సబ్స్ వచ్చారు. పొత్తూరు వెంకటేశ్వరరావుగారిని చూడగానే గౌరవం కలిగింది పెద్దమనిషి తరహా. ఆ ధోవతి, లాల్చీ కట్టినతీరు, గుంటూరు జిల్లాది.

ఒకరోజు సాయంత్రం మా తోడల్లుడు సుగుణభూషణరావు వచ్చి వారింటికి తీసుకువెళ్లాడు సీతాఫల్‌మండిలో వారుండేవారు. ఒక్కపూట ఆతిధ్యం యిచ్చారు. సిటిలో అయినవారిని ఒక్కపూట పిలిచి బోజనంపెట్టడమే గొప్ప మర్యాద అని తెలిసింది. నేను వచ్చే ముందే పి.వి రమణకు ఉత్తరం రాశాను. తను ఉస్మానియాలో రీసర్చి చేస్తున్నాడు నేనంటే ప్రేమాభిమానాలున్న పాతవిద్యార్థి. తను రాలేదు ఒకపూట నేనే ఆటో చేసుకుని యూనివర్సిటీకి వెళ్లాను. హాస్టల్‌లో అతను దొరకలేదు బహుశా జంపని అత్తవారింటికి వెళ్లి వుంటాడు మరొకరోజు రేడియోస్టేషనుకు వెళ్లాను రావూరి భరద్వాజను కలవాలని అయనకు హార్ట్‌అటాక్ వచ్చి ఉస్మానియా ఆస్పత్రిలో చేరినట్లు వార్త. ఆ సాయంత్రమే అతనిని చూడడానికి వెళ్లాను. బావున్నాడు. నేను హైదరాబాదు వచ్చినందుకు ఎంతో సంతోషించాడు అక్కడే డా॥వి.వి.ఎల్ నరసింహారావుని చూచాను తను మాచెర్ల కాలేజీ ప్రిన్సిపాలుగా పనిచేస్తున్నాడు. హైదరాబాదులో నాకు తెలిసినవారు వీరు ముగ్గురు కాక మరొకరున్నారు తాళ్లూరి నాగేశ్వరరావు తెలుగు అకాడమీలో డిప్యూటి డైరెక్టరు ునాలిలో స్నేహం అతనిని కలిశాను. గాంధీనగర్‌లో అతనికి సొంత ఇల్లుంది. ఇంటికి తిసుకువెళ్లాడు. అతను నాకు మంచిస్నేహితుడు.

ఉస్మానియా హాస్టల్‌కువెళ్లి వచ్చిన మర్నాడే మిత్రుడు రమణ, తన మిత్రుడు ఇందుర్తి ప్రభాకర్‌ను వెంటబెట్టుకునివచ్చి కలిశాడు. హైదరాబాదుల్లో నాకు కలవదగినవారు ఈ అయిదుగురే అప్పుడు. విద్వాన్‌విశ్వం, బి.సి.కామరాజు వచ్చారు మద్రాసునుండి డెయిలీసెటప్ ఆలస్యం అయినా, మా వీక్లీ పని వెంటనే ప్రారంభించాం. మేం వచ్చామని తెలిసి డి. రామలింగం వచ్చి కలిశాడు. అతను మద్రాసులో ఫిలిం సెన్సార్ ఆఫీసరుగా వుండేవాడు. రచయిత, విమర్శకుడు, సమీక్షకుడు. ఎం.ఎల్.ఎ. హాస్టల్‌కు భోజనానికి వెళ్లినప్పుడు మావూరి పెద్దలు, ఎం.ఎల్.ఎ. నన్నపనేని వెంకట్రావు, యడ్లపాటి వెంకట్రావు, కె.రోశయ్య, వీరు ఎం.ఎల్.సి. కలిసి కబుర్లు చెప్పుకునేవారం.

పి.వి.రమణ ఒకరోజు నన్ను 'ఈనాడు' ఆఫీసుకు తీసుకువెళ్లాడు. అక్కడ మేనేజరు తన మిత్రుడు చలసాని ప్రసాద్‌ను పరిచయం చేశాడు రామోజీరావుగారిని కలిశాను. నన్ను ఈనాడులో వచ్చి చేరమని మద్రాసులో ఉన్నప్పటి నుండి రాయబారాలు సాగుతున్నాయి. నన్ను చూడగానే రామోజీరావుగారు "చేరుతున్నారా?" అని అడిగారు. "మీరు కోరినంత జీతం యిస్తాం, వచ్చిచేరండి" అన్నారు. అక్కడ రామవరపు వేణుగోపాలరావు పిలిచి చెప్పాడు. "ఇక్కడ చేరకండి ఇక్కడ మీలాంటివారు పని చెయ్యలేరు. ప్రతిమనిషిపై ఇద్దరు సి.ఐ.డి. లుంటారు." ఆలోచనలో పడ్డాను.

మద్రాసులో మాకు బంధువు కె వి ఆర్ చారి జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాలో పని చేస్తుండేవారు. వారికి హైదరాబాద్ ట్రాన్సఫర్ అయింది ఏడాది క్రితమే. ఎక్కడ వున్నదీ తెలియదు. మద్రాసు నుండిఉత్తరం వచ్చింది, వారు గాంధీనగర్ లోనే వుంటారని, ప్రస్తుతం ఇల్లు ఖాళీగా వుందని, తాళపుచెవి సీతాఫల్‌మండీలో వుందని. వెళ్లి తాళాలు తెచ్చి, ఆ ఇంట్లోకి మారాను. ఆ దగ్గరగా వున్నారు మిత్రుడు తాళ్లూరి నాగేశ్వరరావు ఆఫీసుకు రెండుకిలోమీటర్ల దూరం అయితే చార్మినార్ చౌరస్తా నుండి బస్సులో పోవలసి వుంది. డైరెక్టు రోడ్డు లేదు. ఆఫీసువర్కర్లు ఆ ప్రాంతంలో ఎస్ ఆర్.టి. కాలనీలో చిన్న చిన్న ఇళ్లు తీసుకుంటున్నారు నేనూ ఆ ప్రాంతంలో ఇల్లు దొరికితే బావుండుననుకున్నాను. కొద్దిరోజుల్లోనే దాని పక్కవీధిలోనే ఒక ఇల్లు దొరికింది. తాళ్లూరు నాగేశ్వరరావుగారింటికి రెండవ ఇల్లు మా ఇంట ఎదురుగా మల్లాది వెంకటకృష్ణమూర్తి రూం. ఆయన కధలు చాలా ప్రభలొ వేశాను. గాంధీనగర్‌ను అప్పుడు న్యూబాకారం అనే వారు. అశోకనగరం నుండి అప్పుగు టాంక్‌బండ్‌కు రోడ్డు లేదు. అన్నీ పొలాలు, రామకృష్ణామరం, ఇందిరాపార్కు ఏర్పడలేదు. లోయర్‌టాంక్‌బండ్ కింద ఓ ఆశ్రమం వుండేది అడ్డుగా. మేం ఓ సందులో నుండి ఫిజికల్‌ట్రెయినింగ్ కాలేజీ గ్రౌండ్స్ దాటి ఆఫీసుకు వెళ్లేవాళ్లం. చీకటి పడ్డాక అటు వెళ్లేది లేదు. అంతా పాముల మయం. లిబర్టీ దగ్గర బస్సు ఎక్కి, చిక్కడపల్లి క్రాస్‌రోడ్సు దగ్గర దిగి దిగువకు నడిచివచ్చేవాళ్లం.

ఇల్లు దొరికింది. కుటుంబం వస్తుంది రాగానే ఖర్చులు విచిత్రంగా ఒక కేసు వచ్చింది. నేను యోగం చేస్తున్నానని తెలిసిన మిత్రుడు శ్రీమన్నవ హనుమంతరావుగారు చిక్కడపల్లిలో ఉంటుండేవాడు. ఒక స్టేట్‌బ్యాంక్ మేనేజరును నా దగ్గరకు పంపారు. అతను బ్యాంకు డబ్బు కొన్ని లక్షలు కాజేశాడని అభియోగం ఉద్యోగం నుండి సస్పెండు చేశారు. అరెస్టవుతాడని భయం. అజ్ఞాతవాసం చేస్తున్నాడు అతను వచ్చి, రెండు వేలు యిచ్చి, ఎలాగైనా తనకు సహాయం చేయమని అర్ధించాడు అతను నిజంగా దోషి అయితే, మాస్టరుగారు సాయం చేయరు. నేను యోగంలో అర్థించీ ప్రయోజనం ఉండదు. పైగా డబ్బు తీసుకోవడం! ఇది లంచమా! ప్రతిఫలమా? నేనుగా అడిగింది లేదు. తనంత తానుగా యిచ్చాడు. మన్నవ హనుమంతరావుగారిని కలిసి చెప్పాను.ఇలా జరిగింది. అతను డబ్బిచ్చాడు తీసుకోవచ్చా! తీసుకుంటే మాస్టరుగారికి కోపం వస్తుందేమో! "కోపం లేదు, తాపం లేదు, తీసుకో, ఊరికినే చేస్తే వాళ్లకి నమ్మకం కుదరదు తర్వాత కృతజ్ఞత వుంచరు. సద్వినియోగం చేస్తున్నప్పుడు మాస్టరుగారికి కోపం రాదు. డబ్బు తీసుకోవడం పాపం కాదు, నేరం కాదు. డబ్బు యిస్తే తప్పు చేయను అంటే తప్పు."

ఆయన సలహా నచ్చింది. యోగం ద్వారా చేసిన సహాయానికి అది తొలిప్రతిఫలం పైగా నాకు అవసరం వుంది అవసరం మేరకు డబ్బు తీసుకోవడం తప్పు కాదు అని అంతరాత్మ ఊరడింపు. అతను ఒకటి రెండు లక్షలు బ్యాంకులో జమ చేశాడు నా సలహాపైన. పైవాళ్లు వచ్చి, చెక్‌చేసి పట్టుకునేలోగా అకౌంట్స్ అడ్జెస్టు చేయగలిగాడు సస్పెన్షన్ కాల పరిమితి తీరగానే డ్యూటీలో చేరాడు. అలాగా నా అవసరం తీరింది. నా గురించి హైదరాబాదులో యోగపరంగా చెప్పుకోసాగారు శార్వరి కేవలం ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్ కాదు యోగి యోగశక్తితో ఎలాంటి జబ్బులైనా నయం చేస్తాడని పి.వి రమణ ప్రచారం చేయసాగాడు. తను సిన్సియర్‌గా చెబుతాడు.

పి.వి.రమణ, ఇందుర్తి ప్రభాకర్ జంటగా తిరిగేవారు. ప్రభాకర్‌కు యోగంపట్ల ఆసక్తి కలిగింది. అతను జర్నలిస్టు. సురవరం ప్రతాపరెడ్డి రచనలపై పరిశోధన చేసి డాక్టరేట్ అయినాడు. ఎల్.ఎల్.బి చదివాడు. రాజకీయాలపట్ల ఆసక్తి. ఎన్నికల్లో నామినేషన్లు వేసి విత్‌డ్రా అవుతుండేవాడు. చెన్నారెడ్డి అభిమాని పి.వి నరసింహారావుకు బంధువు చదువు, పరపతి ఉన్నా ఏమీ చేసేవాడు కాదు రికామీగా తిరుగుతుండేవాడు. బ్రహ్మచారి అతను శ్రావణపౌర్ణమి, బుద్ధపూర్ణిమ నాడు యోగంలో చేరాడు ఉపదేశం తీసుకున్నాడు. పౌర్ణమి ఉపదేశాలకు మంచిది.

మద్రాసునుండి కుటుంబం వచ్చింది. అద్దెకు తీసుకున్న ఇంట్లో సామాను పెట్టాం .. మంచిరోజు చూచి పాలు పొంగించి చేరాలని. ఒకరోజు రాత్రి బాగా ముసురుపట్టింది. కుండపోతవర్షం మేం తీసుకున్న ఇంట్లో మూడు నాలుగు కుటుంబాలు వుండేవి. మాది మెయిన్‌పోర్షన్. తెల్లవారిఉదయం ప్రేయర్ చేసుకుంటూ వుండగా, ఒకామె ఆదుర్దాగా వచ్చి "మీ ఇంట్లో దొంగలు పడ్డారు. తాళం పగులగొట్టి తెరచి వుంది. సామాను చిందర వందరగా పడి వున్నాయి, రండి" అని పిలిచింది. యామినీదేవి, పిల్లలు హడావుడిగా పరిగెత్తారు. నేను ప్రేయర్ మధ్యలో లేవలేకపోయాను. దొంగలు పడినా, ఇల్లు తగులబడుతున్నా ప్రేయర్ మధ్యలో లేవడం నా వల్ల కాదు. ప్రేయర్ అయిన తర్వాత వెళ్లాను. చిందరవందరగా వుంది ఇల్లు. ముఖ్యంగా బంగారం, నగలు, పట్టుచీరలు అవీ వున్న పెట్టె పోయిందని శ్రీమతి బాధగా చెప్పింది. పిల్లల పాంట్లు, షర్టులు బజారున పడి వున్నాయి. నిజానికి పోయినవి పెద్దగా లేవు దొంగలు డబ్బుకోసం, బంగారం కోసం వెదికి వుంటారు. అవి కనిపించ లేదు. క్రితంరోజు రాత్రి పదిగంటలకు, అందరూ నిద్రపోతుండగా, నేను వెళ్లి ఆ పెట్టె తెచ్చిన సంగతి శ్రీమతికి తెలీదు. చెప్పాను 'హమ్మయ్య' అనుకుంది. ఏమాత్రం బంగారం అయినా పాతికవేలు. మా బ్రతుక్కి పాతికవేలు సంపాదించడం

మాటలు కాదు ఒక అట్టపెట్టెలో మాస్టరుగారి పుస్తకాలున్నాయి. వాటిని తీస్తూ దొంగలు పారిపోయారు మా ఇంట్లోల దొంగలు పడినరోజు, జూలై 7, 1977 చిత్రమైన సంఘటన ఆ రోజునే కొత్త ఇంటికి మారాం జర్నలిస్టు వేజ్ బోర్డు పుణ్యమా అని నాకు జీతం పెరిగింది. నెలకు వేయి రూపాయలు దాటింది.

+ + +

ఆఫీసుకు దగ్గరగా ఇల్లు దొరికిందన్న తృప్తి మరీ అంత దగ్గర కాదు రెండు కిలోమీటర్ల దూరం. అయినా నడిచివెళ్లే వీలుంది నాకుకాస్త సాముద్రికంలో పరిచయం వుంది కాని జ్యోతిషంతో పరిచయం లేదు. వాస్తు అసలు తెలియదు అప్పట్లో ఎవరూ వాస్తు గురించి పట్టించుకునే వారు కారు. నేను అద్దెకు దిగిన ఇంటికి వాస్తుదోషం ఏమైనా వుందేమో మరి చేరకముందే దొంగలు పడ్డారు యోగం చేస్తున్నాం మాస్టరుగారిని నమ్ముకున్నాం .. ఇంక జ్యోతిషం, గ్రహాలు మనల్ని ఇబ్బంది పెట్టవని మొండినమ్మకం మాది దేవుళ్లను, గ్రహాలను యోగం అదుపు చేస్తుందన్న విశ్వాసం, ఆత్మబలం ముందు గ్రహబలహీనతలు వీగిపోతాయి. ఆ ఇంటికి వచ్చాక మిశ్రమ ఫలితాలు కలిగాయి. ఆఫీసులో ఎప్పుడూ సుఖం లేదు పైవారి ఒత్తిళ్లు తప్పవు జర్నలిజంలో పత్రికలలో ఆనాడు కులాభిమానం హెచ్చుగా కనిపించేది ఆంధ్రపత్రికలో బ్రాహ్మలకు తప్ప మిగిలినవారికి అవకాశం వుండేది కాదు ప్రభలో అన్ని కులాలవారు వుండేవారు గానీ, నార్లగారు వదలిన తర్వాత ఇక్కడా బ్రాహ్మణాభిమానం ఎక్కువైంది. పాతవారిని తీసివేయలేక చిత్రహింసలు పెట్టేవారు.

వాటిని గురించి నేను అంతగా పట్టించుకునేవాడిని కాను ప్రొప్రయిటర్ల అభిమానం వుంది. ఇంతో అంతో పేరున్న రచయిత పత్రికలో సబ్‌ఎడిటర్‌గా వుండడం రచయితలకు మంచి చేస్తుంది. రచనల మంచి చెడు నిర్ణయించడం రచయితలైన ఎడిటర్లకు సులభం. సాటి రచయితల అభిమానం పొంద వీలుండేది. దినపత్రికల మాట ఎలావున్నా, కథలూ నవలలతో నడిచే వారపత్రికలకు కాస్త సాహిత్య వాసన కలవారు, రచయితలు, కవులు సంపాదక వర్గంలో ఉండడం అవసరం. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక వీక్లీలు ఆ ఆనవాయితీని పాటిస్తూ వచ్చాయి. వీక్లీ సర్క్యులేషన్ పెరిగినంతకాలం యాజమాన్యం సిబ్బందిని ఇబ్బంది పెట్టదు. అందుకే ప్రభలో ఉద్యోగం కంచుకోటలో కొలువులాంటిది.

పెద్దబ్బాయి వసంతకుమార్ మద్రాసులో ఎం.ఎ. రెండవ సంవత్సరం చదువుతున్నాడు. రెండవ అబ్బాయి శ్యాంసుందర్ సర్దార్ పటేల్ కాలేజీలో బి కాంలో

పోయాడు. తనకు చార్టర్డ్ అకౌంటెన్సీ చేయాలని కోరిక మూడవ అబ్బాయి వెంకటరమణ మెడిసిన్ చేయాలన్న సంకల్పంతో ఒక సంవత్సరం చదువు నష్టపడి, చైతన్యకాలేజీలో ఇంటర్ మొదటి సంవత్సరంలో బై పి.సి.లో చేరాడు. అమ్మాయి పద్మప్రియ కేశవ మెమోరియల్‌లో పదవతరగతిలో చేరింది అది 77లో మా ఇంటి పరిస్థితి రమణ మద్రాసులో శ్రీ వెంపటి చినసత్యంవద్ద కూచిపూడి డాన్సు నేర్చుకున్నాడు ఒక సంవత్సరం. ఇక్కడకు వచ్చాక డాన్సు మానవలసి వస్తుందని బెంగపడ్డాడు. సత్యంగారు కూచిపూడి ఆర్ట్ అకాడమీ బ్రాంచి హైదరాబాదులో స్థాపించారు. కుమారి శోభానాయుడు దానికి ప్రిన్సిపాల్. రమణ శోభానాయుడు దగ్గర చేరాడు.

కొత్త ఊరు పాత ఉద్యోగం చాలని జీతం. పై సంపాదనకు అవకాశం లేదు. ఎలాగో తంటాలు పడాలి. ఇంటి ఖర్చులు పెరిగాయి పిల్లలు కాలేజీ చదువులు, జీతాలు, పుస్తకాలు, పైఅవసరాలు రావూరి భరద్వాజకోసం రేడియో స్టేషన్‌కు వెళ్లితే శాస్త్రిగారు, బాలకృష్ణ, పాలగుమ్మి విశ్వనాథం, ఇంకా ఎవరెవరో పరిచయమైనారు. రేడియో ప్రోగ్రామ్స్ రాసాగాయి. 'ఎ' గ్రేడు రచయితగా గుర్తింపు వచ్చింది ప్రతి సంవత్సరం 'రిపబ్లిక్‌డే' సందర్భంగా జాతీయకవి సమ్మేళనాలకు నాకూ అవకాశం రాసాగింది. రేడియోవారి ప్రత్యేక కవిసమ్మేళనాలలో నేనూ ఉండేవాడిని. పి.వి రమణ వల్ల 'ఈనాడు' వారికి, రామోజీరావుగారికి పరిచయమైంది. చలసాని ప్రసాద్‌రావు ఆదివారం సంచిక చూచేవారు. దానికి, విపుల, చతుర మాసపత్రికలకు రెగ్యులర్‌గా రాయసాగాను. జస్ట్ డబ్బుకోసం నా కధలు, నవలలు, 'వింతలు - విడ్డూరాలు' కన్నడ పత్రికల వారు అనువాదం చేసుకుని డబ్బులిచ్చేవారు. హిందీ పత్రికలలో నాకథలు వచ్చేవి. అలాగ మొత్తం మీద బండిసాగింది.

కొత్త ఇంటికి వచ్చాక మంచే జరిగిందో చెడే జరిగిందో చెప్పలేను. రెండూ జరిగాయి. ఒక సంవత్సరం తిరిగింది. వసంతకుమార్ ఎం.ఎ పూర్తిచేసుకుని వచ్చాడు. చైతన్య కాలేజీలో లెక్చరర్‌గా చేరాడు. జీతం తక్కువే. తనకు రీసర్చి చేయాలని కోరిక. అప్పుడు దిడుగు నారాయణరావుగారు గుంటూరునుండి వచ్చినపుడు కలుస్తుండేవారు. విజయవాడ నుండి దాసుగారు, సీతారామయ్యగారు వచ్చేవారు. యోగపరంగా పెద్దల పరిచయం, సత్సంగం. అదొక మానసికతృప్తి. స్థానికంగా మన్నవ హనుమంతరావుగారు అప్పటికే పరిచితులు. బంధువుల రాకపోకలు పెరిగాయి. మద్రాసులో వుండగా అయినవారి కోసం, బంధువులకోసం వాచిపోయినట్టుండేది. ఇక్కడ వద్దన్నా బంధువుల రాకపోకలు ఎక్కువ. ఊళ్లో చాలామంది బంధువులున్నారు. అందరితో పరిచయం అయింది.

మద్రాసుతో సంబంధం తెగిపోయింది హైదరాబాదు రావడం యోగ మిత్రులకు ఆనందంగా వుంది ఎప్పుడూ ఎవరో ఒకరు రావడం తృప్తి. నా మాస్టర్ యోగదర్శిని, డిస్కవరీ ఆఫ్ మాస్టర్ యోగా పుస్తకాలు యోగాసర్కిల్‌లో మంచి స్ఫూర్తిని కలిగించాయి. చాలామంది ఉత్తరాలు రాయసాగారు. యోగం గురించి తెలుసుకోవాలని వచ్చేవారు నిజానికి యోగం గురించి చెప్పే శక్తి నాకు లేదు. మిత్రులు నారాయణరావుగారు, సీతారామయ్యగారు, దాసుగారు ఆ బరువు నా తలపైకెత్తారు నేను సాదాసీదా సాధకుణ్ణి. రాయడం చేతవును కాబట్టి ఏదో ఒక పుస్తకం రాశాను. అది కొందరికైనా స్ఫూర్తినిస్తోంది. ప్రజల ఆసక్తిని నిలవరించడం నాచేతుల్లో లేనిపని. అలా పరిస్థితుల్ని బట్టి, నన్ను నేనుగా యోగానికి అంకితం చేసుకోవలసి వచ్చింది.

యోగంలో చేరినప్పటి నుండి నాకో అలవాటు. మాస్టర్‌గారి జన్మదిన సందర్భంగా, పత్రికలలో మాస్టరు గురించి, యోగం గురించి వ్యాసాలు రాసేవాడిని. హైదరాబాదు వచ్చాక ఇండియన్ ఎక్స్‌ప్రెస్, క్రానికల్, తెలుగు దినపత్రిక లన్నింటిలో మాస్టరుగారి ఫోటోతో వ్యాసాలు ప్రచురించడం వల్ల జనానికి యోగం గురించి ఆసక్తి పెరగసాగింది. లోగడ యోగం గురించి రాయకూడదని, ప్రచారం పనికిరాదని చెప్పేవారు. నాకు రాయాలనిపించి అలా రాయసాగేను. విమర్శలు ఏనాడు లక్ష్యపెట్టలేదు. తిట్టినవారిని, అవమానించినవారిని క్షమించి వదలిపెట్టాను. యోగం ద్వారా ఏదో సాధించాలని, లబ్ధి పొందాలని, కీర్తి గడించాలని నాకు ఎన్నడూలేదు యోగం ద్వారా ఆరోగ్యం పొందాను. మనశ్శాంతి లభిస్తోంది. ఆ ఫలితాలు ఇతరులూ పొందాలన్నదే ఏకైకవాంఛ. స్వర్గం, మోక్షం పట్ల కలలు కనలేదు.

అప్పుడొకసారి సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడింది. దాంతో విలయం సంభవిస్తుందని, ప్రళయం వస్తుందని భయపడ్డారు. స్వాములు, మఠాధిపతులు రకరకాలుగా ప్రచారం చేసుకున్నారు. తాము తప్ప మిగిలిన ప్రజలంతా చచ్చిపోతారని, తాము మాత్రమే ప్రళయజలంపై తేలి, మరో యుగం ఏర్పరుస్తామని, తామే పవిత్రులమని అన్నారు. అయితే యోగశక్తితో అలాంటి ప్రమాదాలను దాటవచ్చునని నా అభిప్రాయం. అంతకుముందు వచ్చిన అష్టగ్రహ కూటమి సందర్భంగాను అలాగే ప్రచారం జరిగింది. మద్రాసు వదలి చాలామంది వెళ్లిపోయారు. కొందరైతే తిరువణ్ణామలై వెళ్లి కొండెక్కి కూర్చున్నారు, సముద్రం పొంగితే కొండపైన ప్రాణాలు నిలుపుకోవచ్చునని. మాస్టర్‌యోగం ప్రారంభమైనప్పుడే గ్రహాలను కట్టడి చేయడం జరిగింది. మరో ప్రళయం రాదని మాస్టరుగారు చెప్పారు.. వచ్చేది ప్రళయం కాదు, పరిణామం. పరిణామం కాలానుగతికం.

యోగంతో, సూక్ష్మశరీరంతో రోదసి లోకి వెళ్లి రావచ్చు నా యోగం, నా సాధన లోకానికి ఉపకరిస్తుందని, మేలు చేస్తుందని నా నమ్మకం. మానవ శ్రేయస్సును కాంక్షించని తపస్సు నిరర్ధకం. తన సుఖం కోసం, తన మోక్షం కోసం తపస్సు చేసేవారు ఎవరైనా మోక్షాన్ని పొందారో లేదో తెలియదు. తెలియనిదాని కోసం మానవతను విస్మరించడం తప్పు

సూర్య, చంద్ర గ్రహణాలు ఖగోళంలో గ్రహచలనం వల్ల ఏర్పడేవి కనుక వాటివల్ల ప్రళయాలు రావు. ముందుగానే ఫలానారోజు ఇన్ని గంటల ఇన్ని నిమిషాలకు సంభవిస్తాయని లెక్కలు వేసి చెప్పగలుగుతున్నాం మంచి, చెడులు ఏవికానీ అనుభవించ వలసిందే అందరం. చిన్నవైనా, పెద్దవైనా ఎవరరికి వారు అనుభవించాలి యోగఫలితాలు, అనుభవాలు ఎవరికి వారుగా తెలుసుకోవలసిందే. యోగసాధన నాకు మొండితనం నేర్పింది. సత్యాన్ని నేరుగా గ్రహించడం నేర్పింది

ప్రళయం వచ్చినా పత్రికలవారికి సెలవు దొరకదు ఆరోజు సంపూర్ణ సూర్య గ్రహణం. ఏదో ప్రమాదం ముంచుకు వస్తున్నట్టు యావత్ ప్రపంచం ఊపిరి బిగబట్టి చూస్తోంది. మాకు వార్తల ఆరాటం. నాకు గ్రహణ సమయంలో యోగసాధన చేయాలని పట్టుదల. ఒంటి గంటకు ఇంటికి చేరాను. ఉదయం భోజనం చేయలేదు. ఆదరాబాదరాగా తలనిండా నీళ్లు కుమ్మరించుకుని, తడిబట్టలతోనే ధ్యానానికి కూర్చుండిపోయాను తలుపులు, కిటికీలు బిగించారు. క్రమంగా వీధుల్లో జనసంచారం తగ్గింది కోడికూతలు వినిపించసాగాయి. సూర్యుని వేడి తగ్గింది. వెన్నెల కాస్తున్న అనుభూతి. చలి. టెంపరేచర్ పడిపోయింది. కటిక చీకటి. నక్షత్రాలు పైన. పట్టపగలు నక్షత్రాలు కనిపించడం, ఇంట్లో సైతం దీపాలు వెలగడం, నేను కళ్లు విప్పలేదు. సమాధిస్థితికి వెళ్లిపోయాను. సూక్ష్మశరీరం రోదసిలోకి వెళ్లిపోయింది. గ్రహాలు, నక్షత్రాలు దాటిపోయింది ఖగోళాన్ని దర్శించింది సృష్టిరహస్యం తెలుస్తోంది. సాయంత్రం అయిదున్నర వరకు అదే యోగస్థితి.

లోగడ అనేకసార్లు సూక్ష్మశరీరం వేరై శూన్యంలో పయనించిన అనుభవం వుంది. కనుక భయం వేయలేదు. అయినా చైతన్యం తప్పలేదు. బయట వాస్తవప్రపంచం గమనింపులోనే వుంది. అప్పుడప్పుడు మాటలు, శబ్దాలు చెవిని పడుతున్నాయి. కళ్లు తెరవలేనిస్థితి. మరుక్షణంలో ఆత్మ పై లోకాలకు వెళుతోంది. గ్రహణం వీడిన తర్వాతగానీ నాకు స్పృహ రాలేదు. ఆ నాలుగైదు గంటలు ఎన్నో యోగముద్రలు, భంగిమలు వచ్చాయి. ఒక దశలో తలుపులు తెరచుకుని బజారులోకి వెళ్లానుట. నేను యోగస్థితిలో గమనించిన విషయాలు, ఎక్స్‌ప్రెస్ మిత్రులకు చెబితే నమ్మలేదు. మర్నాడు అమెరికన్

సైంటిస్టులు అవే విషయాలు వెల్లడిచేస్తే ఆశ్చర్యపడ్డారు. యోగదృష్టి శాస్త్రీయ దృష్టి అవుతుంది. శాస్త్రకారునిది యోగదృష్టే. విజ్ఞానం సరిహద్దు దాటితే జ్ఞానం అవుతుంది. యోగంలో నేను అందుకోగలవి సత్యాలు అని నిర్ధారణ చేసుకున్నాను ఆనాడే.

ఉద్యోగం చేస్తున్నా శ్రద్ధపోయింది భార్యాబిడ్డల పోషణ కోసం సంపాదన కావాలి ఉద్యోగం చేయాలి. మాస్టర్ వాణి లోపల నుండి వినిపిస్తోంది - నన్ను పూర్తిగా యోగానికి అంకితం కమ్మని. అది పరమగురువుల ఆదేశం జరిగి తీరుతుంది. కొన్ని నెలలు సందిగ్ధం. ఉద్యోగం మానటమా? మాని ఏం చేయాలి! బాధ్యతలు తీరలేదే, ఎలా? యోగసాధన రోజురోజుకు తీవ్రం కాసాగింది. మనస్సు మరో పనిమీదికి పోదు. పిచ్చిపట్టినట్లు చికాకు, ఏమీ రాయబుద్ధి కాదు. కధలు, నవలలు,రేడియోకి నాటికలు, ప్రసంగాలు ఏవైనా రాసే అవకాశం వుంది. రాసే శక్తి వుంది. కాని రాయబుద్ధి కాదు. ఇతర పత్రికలకు రాయడం మానివేశాను. ఎలా అయితే అలా అవుతుంది. ఏదో మార్గం మాస్టరుగారే చూపిస్తారు అదొక నమ్మకం అని ఊరకే కూర్చోలేం కదా! స్వార్ధం లేదు స్వప్రయోజనాకాంక్షలేదు పని చేయడం ఫలితం ఆశించకపోవడం! అంతే లక్ష్యసాధనలో ఎన్ని కష్టాలు వచ్చినా, బాధలు కలిగినా యోగసాధకుడు సిద్ధం. కావాలి కరగనిదే బంగారం శుద్ధి కాదు సుత్తిదెబ్బలు తగలనిదే బంగారం ఒక ఆకృతి దాల్చదు. మనిషీ అంతే, యోగసాధకుడూ అంతే. కష్టాలు, బాధలు అనే దెబ్బలు భరించాలి. యోగసాధన అప్పుడు, ఒక సుందరరూపాన్ని సంతరించుకుంటుంది. శుద్ధబంగారం ముద్దమందారంలా వుంటే అలంకరణకు పనికిరాదు

ఆఫీసులో నా యోగం గురించి అందరికీ తెలియదు ఎడిటర్స్ విద్వాన్ విశ్వం, పొత్తూరి వెంకటేశ్వరరావు, ఎ.బి.కె. ప్రసాద్ గార్లకు నాపట్ల గౌరవానికి యోగం ఒక కారణం. యోగం చేస్తున్న వ్యక్తి ప్రమాదకారి కాడు, అబద్ధాలు చెప్పడు ఇతరులకు హాని చేయడు. తనపని తను చూసుకుపోతాడు. ఎవరికీ శత్రువు కాలేడు. ఎవరిపట్ల శత్రుత్వం వహించలేడు. ఈ గుణాలు చాలు ఏ ఉద్యోగికైనా భద్రత కలిగించడానికి. విద్వాన్ విశ్వం వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విద్యార్థిగా వున్నప్పుడు ఈయోగం చేసి భయపడి మానివేశారుట పొత్తూరి వేంకటేశ్వరరావుగారు జిల్లెల్లమూడి అమ్మ భక్తుడు. సహజంగా సంప్రదాయాన్ని గౌరవించే వ్యక్తి. ఎ.బి.కె. ప్యూర్ కమ్యూనిస్టు అనడం కన్నా రాడికలిస్టు అంటే బావుంటుంది. దేవుళ్లు, నమ్మకాలు బొత్తిగా లేనివాడు. అయినా నా యోగశక్తిని రుచి చూచినవాడు.

ఆయన డెయిలీ ఎడిటర్. నేను వీక్లీలో వున్నాను. ఇంకా డెయిలీకి మారలేదు. నన్ను డెయిలీకి మార్చాలని ఎ.బి.కె. ప్రయత్నం. ఆయనకు ఒంటి కణత నొప్పి, కళ్లు

పీకుతాయి ఒకప్పుడు ఆ జబ్బు నాకూ వుండేది. యమబాధ యోగంలోకి వచ్చాక తగ్గింది నాకు. ఒకనాడు ఎడిటోరియల్ రాయడానికి తలపట్టుకు కూర్చున్నాడు నన్ను పిలిచాడు. తన గదిలోకి వెళ్లాను ఓ సిగరెట్ అడిగి తీసుకున్నాడు. ఏమిటి బాధ అంటే చెప్పాడు నేను రెండు కప్పులు టీ తెప్పించి, ఆయన కొకటి యిచ్చి, నేనొకటి తీసుకున్నాను "టీ త్రాగండి, తలనొప్పి తగ్గిపోతుంది" అన్నాను.

'టీ' పేరుతో నేనేదో చేశానని ఆయన నమ్మాడు. రెండునిమిషాలలో తలనొప్పి మాయమైంది 'సంపాదకీయం రాసుకోండి' అనిచెప్పి నేను బయటకు వచ్చాను సాయంత్రం నాలుగు గంటలకు వెళ్లి 'నొప్పి ఎలా వుంది' అని పరామర్శిస్తే, 'నొప్పి ఏమిటి, ఎవరికి?'అని ఎదురుప్రశ్న వేశాడు తన నొప్పి సంగతి మరచిపోయాడు

నాకు తెలియకుండానే నా యోగం ఇతరుల పట్ల ప్రేమగా మారసాగింది. అన్ని వందల మంది పనిచేసే ఆఫీసులో అందరూ నన్ను ప్రేమగా, అభిమానంగా పలకరించేవారు వారి పట్ల నా ప్రవర్తన అలాగే వుండేది. మేనేజరు నుండి వాచ్‌మెన్‌వరకు అందరూ అభిమానంగా, గౌరవంగా వుండేవారు. వర్కర్ల సమస్యలు నేను పరిష్కరించాలి యూనియన్ వుంది యూనియన్ పెద్దలకు నా సలహా, సహకారం కావాలి రెండు యూనియన్లను సమాధాన పరచేది నేను, నా ఒక్క వోటుతో యూనియన్ బలాబలాలు తేలిన సందర్భాలున్నాయి కనుక రెండు యూనియన్ల పెద్దలు నా మాటను, సలహాలు గౌరవించేవారు 350 మంది వర్కర్లకు అధికారం లేని నాయకుడిని నేను మంచితనం, ప్రేమ నన్ను నడిపించాయి. హృదయాన్ని జయించడానికి 'ప్రేమ' ఒక్కటే ఉపాయం. ఏ సమ్మె జరిగినా నాకు మినహాయింపు. లోపలకు వెళ్లి నన్ను అడ్డుకునేవారు కాదు. నాది ఎగ్జిక్యూటివ్ హోదా.

అదీ ఆఫీసు వాతావరణం. ఇంటికి వస్తే యోగం. దాదాపు సాహిత్యరచన మూలపడింది. ఎప్పుడో చదివి, చదివి, అర్థంకాక వదలిన అరవిందుని 'సావిత్రి' మరల చదవాలనిపించింది. చదివాను. అనువాదం చేస్తే!... ఒకరోజు ప్రేయర్‌లో 'సావిత్రి'ని రాయమని మాస్టరు, అరవిందులు ఆదేశించినట్లయింది. అనువదించడం కాదు, రాయడమే. 'సావిత్రి' ఆధారంగా 'సావిత్రి' రాయాలి. పునస్సృష్టి జరగాలి. నేను అర్థం చేసుకున్నది మాత్రమే నా పాఠకులకు చెప్పగలను. రోజూ ప్రేయర్ చేసుకుని 'సావిత్రి' ముందుపెట్టుకుని కలం తీసుకునేవాడిని. మొదటి పంక్తి రాయడానికి వారం రోజులు పట్టింది. అయినా పట్టు విడవ దలచలేదు. మనస్సులో మరొక ఆలోచన చొరబడడం లేదు.

పెద్దబ్బాయి వసంతకుమార్ ఎం.ఏ. పూర్తి చేసుకుని వచ్చి చైతన్య కళాశాలలో లెక్చరర్‌గా చేరాడు. అదే కాలేజీలో ఇంటర్ సీనియర్‌లో రమణ, జూనియర్‌లో పద్మప్రియ చదువుతున్నారు శ్యాం సుందర్ పటేల్ కళాశాలలో బి.కాం. చైతన్య కాలేజీ ప్రిన్సిపాల్ సుందరరామయ్య తెనాలి కాలేజీలో నాస్టూడెంట్. అందుకని పిల్లల అడ్మిషన్లకు కష్టపడవలసి రాలేదు.

యోగం ఏదో మనశ్శాంతి నిస్తోంది అనుకున్నాను. ముందు అలాగే అనిపించింది కాని కొంతదూరం వెళ్లాకగాని తెలియలేదు ఆపైన ముందుబాట లేదని, అది దుర్గమారణ్యం అని ప్రతిసాధకునికి కొంతదూరమే ఒక మార్గం వుంటుంది. ఆ తర్వాత రోడ్డు ఆగిపోతుంది ప్రయాణం ఆగదు, ఆగకూడదు. అక్కడ ఆగిపోయేవారే ఎక్కువ. ఆపైన మహారణ్యంలో ప్రవేశించడానికి సాహసం కావాలి. సాహసమే ఊపిరి కావాలి. అక్కడ ప్రాణాయామం చేస్తూ, ఆసనాలు వేసుకుని కూర్చుంటే కుదరదు. ప్రతిక్షణం అప్రమత్తంగా వుండాలి. కన్ను మూయడానికి లేదు. విశ్రమించడానికి వీలులేదు. ఎక్కడకు పోతున్నామో తెలియదు. ఎంత దూరం పోవాలో తెలియదు. లోపలకు చొచ్చుకు పోవడం ఒక్కటే. తీగలు, చెట్లు, పొదలు, పాములు, క్రూరమృగాలు... వీటిని ఛేదించుకుంటూ, దాటుకుంటూ, తప్పించుకుంటూ పోవాలి. ధైర్యం కావాలి. నా ప్రయాణం అలా సాగింది. అప్పటివరకు ఒక గురువు, మాస్టరు కరుణ వుంటే చాలునని నిర్భయంగా వున్నాను. అవి మాత్రం చాలవు. ముందుకు సాగవలసింది మనమే. గౌతమ బుద్ధునికి అవరోధాలు తప్పలేదు. అగ్ని పరీక్షలుతప్పలేదు నాకూ తప్పలేదు. ఎవరికైనా తప్పవు. పరీక్షలో నెగ్గనివాడు కృతార్థుడు కాడు. విజయం సాధించాలంటే అన్ని పరీక్షలు నెగ్గాలి. అగ్ని పరీక్షల నెదుర్కోవాలి. తప్పదు.

అప్పుడే మా కుటుంబం చాలా అలజడులకు లోనైంది. కారణం తెలియదు. ప్రకృతి వైపరీత్యాలు కొన్ని, గ్రహాల ఆగ్రహావేశాలు కొన్ని, అప్పట్లో తెలంగాణాలో బాణామతి ప్రయోగాలు వినిపిస్తుండేవి. చార్మినార్ క్రాస్‌రోడ్డు వద్ద లక్ష్మీ గణపతి ఆలయంలో అర్ధరాత్రి పూట రాళ్లు పడేవి. ఎవరు విసిరేది తెలిసేది కాదు. జనం భయకంపితులైనారు. రాత్రి తెల్లవార్లు పోలీసులు కాపలా వుండేవారు. చుట్టుపట్ల మేడలపైన పహరా వున్నారు. అయినా ఎవరో విసిరి వేసినట్లు రాళ్లు పడేవి. భక్తులు ఆ గుడికి వెళ్లడం బంద్ చేశారు. జనం గుండెల్లో భయం. రైళ్లు పరిగెత్తేవి. రెండు వారాలపాటు అలా జరిగింది. ఒకరోజు మధ్యాహ్నం వేళ మా ఇంట్లోకి ఒక రాయి రివ్వున వచ్చి పడ్డది. మండు వేసవి కాలం. బయటకు వెళ్లి చూస్తే నాలుగు రోడ్లలో మనిషి

జాడలేదు. అది బాణామతి ప్రయోగమని ఇరుగుపొరుగువారు భయపెట్టారు. మాస్టరుగారి యోగంలో వున్న మనకి అలాంటి భయం ఉండకూడదని, ఎలాంటి ఇబ్బందులు రావని ఒక పిచ్చి నమ్మకం. నేను ధైర్యం చేసి, ఆ రాయి తీసి, పొట్లం కట్టి, రోడ్డు మీదికి విసిరివేశాను ... చిత్రంగా ఆ రాయి రోడ్డుమీద పడకముందే మాయమైంది. ఆరోజు నుండి లక్ష్మీ గణపతి ఆలయంలో రాళ్లు పడడం ఆగిపోయింది.

అప్పుడే మా ఇంట ఒక విచిత్ర సంఘటన జరిగింది. రాత్రిపూట ఏవేవో శబ్దాలు వినిపిస్తున్నాయని పక్కపోర్షన్ల వాళ్లు వచ్చి చెప్పసాగారు. ఎవరో నడుస్తున్నట్లు అనిపించేది. దయ్యాలా? భూతాలా? ఏమో మరి! ప్రేయర్‌కు కూర్చోగానే మా పిల్లలు వసంతకుమార్, రమణ పైకి ఏవో క్షుద్రశక్తులు వచ్చి ఆవహించేవి. ఆ శక్తులు వారిని ఆవహించినప్పుడు వారికి ఎంతో బలం వచ్చేది. దెబ్బలాటలు, పోటాపోటీలు జరిగేవి.

రమణ అయితే కాలేజీనుండి వస్తూనే పూనకం వచ్చిన వాడిలా ఊగిపోతూ, కళ్లు ఎర్రగా చేసుకుని వచ్చి పడేవాడు. నా చేయిపట్టి బరబరా మంచం మీదికి లాక్కుపోయి 'నీ మాస్టర్ శక్తివంతుడో, నేను శక్తివంతుడనో తేల్చుకుందాం రా' అని పిడికిలి బిగించి, దానిని విప్పమనేవాడు. కోపోద్రేకంతో నా వైపు చూచి ఫీంకరించేవాడు. ఎవరినీ దగ్గరకు రానిచ్చేవాడు కాదు. నాకు ఆ గుప్పిట విడిపించడం అసాధ్యం అనిపించేది. అంత బలం ఎలా వచ్చేదో! రెండు మూడు గంటలకుగానీ ఆ ఉద్రేకం తగ్గేది కాదు. అలాగే వసంతకుమార్ పైకి ఏవో శక్తులు వచ్చేవి. అతని జుత్తులో వేలుపెడితే, స్టీలు తీగలతో జల్లెడ పేనినట్లు వేలుదూరేది కాదు. ఏవో క్షుద్రశక్తులనే భ్రమలో అతని జుత్తు పట్టుకునేవాడిని. ఆ తర్వాత అతని జుత్తు రాలిపోయి బట్టతల అయింది. ఈ గొడవలకు మా రెండవ అబ్బాయి శ్యాంసుందర్, అమ్మాయి పద్మప్రియ దూరంగా వుండేవారు శ్యాంకు భయం. అమ్మాయికి భయం లేదు కాని నిమ్మకు నీరెత్తినట్లు వుండేది. అమ్మా నాన్న అంటే అపరిమితమైన ప్రేమ, గౌరవం పద్మప్రియకు.

ఇందుర్తి ప్రభాకర్, పి.వి. రమణ ప్రేయర్‌కు వస్తుండేవారు. ప్రభాకర్‌కు యోగావర్కింగ్ బావుండేది. ట్రాన్స్‌లోకి వెళ్లిపోయి ఏవేవో చెప్పేవాడు. మాస్టరు గారి ఫోటో వద్ద నిలబడి ధ్యానించేవాడు. ఆ ఫోటో తీసి, ఇల్లంతా తిప్పేవాడు. గమ్మత్తుగా వుండేవి. అతని వర్కింగ్స్. వెరీ సిన్సియర్.

"గురూజీ, ఏవో శక్తులు మీకు పరీక్షలు పెడుతున్నాయి. వాటిని ఎదుర్కోవాలి" అన్నాడు ఒకరోజున.

"క్షుద్రశక్తులా?" అని అడిగాను.

"కాదు ఏవో గ్రహశక్తులు. కొన్ని దివ్యశక్తులు. కొందరు ఋషులు,యోగులు మీకు పరీక్ష పెడుతున్నారు ఈ పరీక్షలో మీరు నెగ్గాలి."

"ఎలా!"

"ఒక పదిహేను రోజులపాటు మనం అర్ధరాత్రి మెరిడియన్ ప్రేయర్ చేయాలి. అప్పుడుగాని ఆ క్షుద్రశక్తులు వదలిపోవు."

"రాత్రి పన్నెండు గంటలకు చేయగలమా?"

"చేద్దాం. తప్పదు. రోజూ నేను, రమణ వస్తాం. రెండువారాలు చేద్దాం. అలా చేయమని మాస్టర్‌గారి ఆదేశం" అన్నాడు ప్రభాకర్

"అలాగే చేదాం"

రోజూ వారిద్దరూ రాత్రిపూట వచ్చేవారు. ఏవేవో కబుర్లు చెప్పుకుని, నిద్ర ముంచకు రాగానే పడుకునేవాళ్లం. ఎవరికి ముందు మెలకువ వస్తే వారు మిగిలిన వారిని నిద్రలేపాలి చిత్రంగా పన్నెండుకు అయిదు నిమిషా లుందనగా ఎవరికి వారు ఉలిక్కిపడి నిద్రలేచి, ప్రేయర్‌కు కూర్చుండిపోయేవారు. అరగంట నుండి గంటవరకు సాధన సాగేది. అలా పదిహేను రోజులు అర్ధరాత్రి ప్రార్ధనలు జరిగాయి. చివరి రోజున ప్రభాకర్ ఏవేవో శాంతులు చేశాడు మాస్టరుగారి ఫోటో చేతుల్లోకి తీసుకుని ఇల్లంతా తిప్పాడు. అతనికి అలా అనిపించింది, చేశాడు నో కామెంట్.

ముగ్గురు నలుగురు ప్రతికూలంగా పనిచేస్తున్నారు వారు నలుగురూ సజీవులే, గొప్ప పేరున్నవారు, స్వామీజీలుగా చలామణీ అవుతున్నారు. వారికి నాపైన కోపం దేనికి? ఈ యోగంలోని వారు ఎవరి జోలికి పోరు! ప్రభాకర్ అన్నాడు .. 'వారు ఈయోగాన్ని సంపూర్ణం కాకుండా తమ క్షుద్రశక్తుల్ని ప్రయోగిస్తున్నారు ఇది సత్యయోగం. వారి ప్రాచుర్యానికి ఈ యోగం అడ్డు వస్తున్నదని భయం. యోగంలో ఎవరు ముందుకు పోతుంటే వారికి ఆ శక్తులు ఆటంకాలు. ఈ క్షుద్రశక్తులు వదలిపోయిన తర్వాత శ్రీమతిపైకి ఒక దేవత వచ్చింది. మేం ఘర్షణ పడ్డాం. ఆరోజు సాయంత్రం ప్రేయర్‌లో ఆ దేవత ఒక మహాశక్తిగా వచ్చి, ఆమెలో ప్రవేశించింది. నేను ఆమె ఎదురుగా కూర్చుని, పరమ వినమ్రంగా ఒక గంటపైగా ధ్యానించాను. మర్నాటికి ప్రతికూల పవనాలు తగ్గిపోయాయి. అంతా ప్రశాంతమైంది.

అది యాదృచ్ఛికం కావచ్చు. విధి లిఖితం కావచ్చు. మా నాన్నగారుచనిపోయారు. అప్పుడప్పుడు తెనాలి వెళ్లిచూచి వచ్చేవాడిని తప్ప, ఆయన నా వద్దకు వచ్చి ఉన్నది లేదు. చాలా కాలంగా అనారోగ్యం వెంటాడుతోంది ఆయనకు ట్రీట్‌మెంట్ యిచ్చే డాక్టరు

పోతుకూచి వెంకటేశ్వర్లుగారు నాకు మిత్రుడు "మీరేం గాభరా పడకండి, ఆయన కోమాలో నాలుగైదు రోజులుంటారు అప్పుడు ఫోన్ చేస్తాను. వద్దురు గాని" అన్నారు ఆయన ఊహించినట్లు నాన్నగారు కోమాలోకి పోలేదు. ఆయనకు సహాయంగా మా బావగారు యల్లమందాచారి, చెల్లెలు అపర్ణ ఇంట్లోనే వుండేవారు ఒకరోజు రాత్రి ఆయన పోయినట్లు ఆఫీసుకు ఫోన్ వచ్చింది. ఒక వర్కరు వచ్చి ఆ వార్త మా మేనమామగారికి అందించారు. ఆయన అప్పుడు తన కొడుకు దగ్గరకు వచ్చారు. వెంటనే నేను, యామినీదేవి, మేనమామ చివరి బస్సుకు బయలుదేరాం స్వయాన అక్కగారి భర్త చనిపోతే తాను రానని పేచీపెట్టారు మేనమామ. 'ఖర్చులు నేనే పెట్టుకుని తీసుకుపోతాను. తెలిసీ మీరురాకపోతే ఊరిలో బావుండదు. నలుగురూ మీకు, నాకు వైరం అనుకుంటా' రని బ్రతిమిలాడి బయలుదేర తీశాను. బస్సు దిగాక మా ఇంటికి రాకుండా, తనవారింటికి వెళ్లిపోయాడు.'తర్వాత నెమ్మదిగా వస్తాను, ఈ లోపు కార్యక్రమం సాగించండి' అని సలహా! శుభకార్యాలకు రాకపోయినా, అశుభ కార్యాలకు రావడం తప్పనిసరి. అదొక సంప్రదాయం!

. నాన్నగారు పోయారన్న దిగులు లేదు. ప్రతివారు ఎప్పుడో ఒకప్పుడు పోక తప్పదు నాకు కంట తడిరాదు నేను ఏడ్వకపోవడం బంధువులకు అబ్బురమనిపించింది. నా శ్రీమతికి ఒక పట్టాన ఏడుపురాదు మా పాప 'భాను' పోయినప్పుడు మా ఇద్దరి కన్నీరంతా ఖర్చయిపోయింది ఇంక ఎవరికోసం కన్నీరు మిగలలేదేమో! తన తల్లిదండ్రులు పోయినప్పుడు ఆమె లోపల కుమిలిపోయింది గానీ, పైకి ఏడ్వలేదు ఇప్పుడు మా నాన్నగారు పోయినప్పుడు లాంఛన విషాదమే కనిపించింది. జననమరణాల రహస్యం తెలిసిన ఆత్మలు కన్నీటిని విడుదల కానీయవు. 'జాతస్య మరణం ధృవం'.

మేం ఇంటికి వెళ్లేసరికి ఊళ్లో నా మిత్రులంతా ఎదురుచూస్తున్నారు. నాచిన్న చెల్లెలు పార్వతి రాలేదు. మా పినతల్లి గారి అబ్బాయి బాలకృష్ణ, బాబాయి శివరామకృష్ణ పూనుకున్నారు రవీంద్రప్రసాద్ మనుషుల్ని ఏర్పాటు చేసి, రుద్రభూమి ఏర్పాట్లు చేశాడు. ఆ రోజు శ్రీరామనవమి. తెనాలిలో శ్రీరామనవమి అంటే బ్రహ్మోత్సవాలను మరపిస్తాయి. 'మేళం' ఏర్పాటు చేయమని మా అమ్మగారి ఆర్డరు. మేళగాళ్లు దొరకలేదు. ప్రతిపందిరికి ఒక మేళం ఎప్పుడో బుక్ అయింది. అయినా సీతారాముల కళ్యాణం ముందు మా నాన్నగారి 'మరణమృదంగం' ముఖ్యం కాదు. నాయనగారు పోయినందుకు కాదు మేళం పెట్టనందుకు మా అమ్మగారు శోకించసాగింది. మేనమామ వచ్చి మందలించాక శోకం తగ్గించింది.

మేం వచ్చిన అరగంటలో మా చిన్నబ్బాయి రమణ వచ్చాడు హైదరాబాదు నుండి. మేం బయలుదేరే వేళకు తను ఇంటికి రాలేదు. తనకు కాలేజీ అయినాక డాన్సు కాలేజీకి వెళ్లేవాడు. ప్రొద్దుపోయి ఇంటికి వస్తాడు. "తాతయ్య చనిపోతే వెళ్లవద్దా" అని అన్నలపైన కోపపడి, తాను బస్సుకు బయలుదేరి హుటాహుటిన వచ్చాడు

సాంప్రదాయంగా శవపూజ అయింది. నా స్నేహితులు, నాన్నగారి అభిమానులు ఒకవందమంది వరకు వచ్చారు రథం భుజాలపైకి ఎత్తుకోబోతుండగా "శార్వరీ" అని ఓ పెద్దపిలుపు వినిపించింది. ఆగాను. అలా పిలిచే వారెవరు? మా అమ్మ 'కృష్ణా' అనే పిలుస్తుంది బంధువులు 'పెద్దోడా' అనేవారు. మిత్రులు శర్మగారు, శార్వరిగారు అంటారు. మేనమామ కృష్ణా అనో పెద్దకృష్ణుడనో అంటారు. చుట్టూ పరికించాను లోపలకు వెళ్లాను. వంటగది పక్కగది తలుపులు దగ్గరగా మూసి వున్నాయి తలుపులు తెరిచాను. మా 'రమణ' పద్మాసనంలో కూర్చుని, మంచి సమాధిస్థితిలో వున్నాడు. అతనిలో 'మాస్టరుగారి గాంభీర్యం కనిపించింది. నమస్కరించి, ఎదురుగా కూర్చున్నాను ప్రార్థనచేసి, తనని యోగస్థితి నుండి లేపాలని నా ప్రయత్నం. తనే, నా తలపైన తన చేయివుంచాడు వీపుపై నిమిరాడు. అయిదు నిమిషాల తర్వాత లేచి వచ్చాను. తను చేతనలోనే వున్నాడు ఫరవాలేదు. ఆ పిలుపు' మాస్టరుగారిది అప్పటి అతనిలోని దీప్తి, వర్చస్సు మాస్టరుగారివి. ఆ సంఘటన తెనాలిలో కథలుగా చెప్పుకున్నారు.

శవయాత్ర ప్రారంభమైంది ఆరంభంలో యాభై మంది వున్నారు. రెండు ఇళ్ల అవతల సందు మలుపు తిరిగే సరికి, మా ముందు 'సీతారామకళ్యాణం' చేయించేవారు మేళతాళాలతో పట్టుబట్టలతో బయలుదేరారు. అలా ఒక్కొక్క రోడ్డు మలుపు తిరుగుతుంటే ఒక్కో మేళం మా ముందు నడిచింది. మూడు కిలోమీటర్ల దూరం, అలా మా ముందు భజంత్రీలు నడిచారు. దారిపొడవునా, అభిమానులు రెండువందల వరకు వచ్చి చేరుతూనే వున్నారు. ఆయన చేసుకున్న పుణ్యం అది. మద్రాసులో మా పాప 'భాను' పోయినప్పుడు, గురువుగారు బాలసుందరరావుగారు పోయినపుడు అలాంటి దృశ్యాలు చూచాను. భాను ఆగస్టు 15న, బాలసుందరరావుగారు వినాయక చవితి రోజున, నాన్నగారు శ్రీరామనవమి రోజున పోయారు. మూడూ పుణ్యదినాలే. ఆగస్టు 15 అరవింద యోగి జయంతి. కర్మాంతరాల చివరిరోజున అలాగే జరిగింది. మేం మాట్లాడుకున్న పురోహితుడు రాలేదు. ఎవరో వచ్చారు. శాంతిసమయంలో సప్తర్షుల వలె ఏడుగురు ఉద్ధండ వేదపండితులు రెండు గంటలపాటు వేదపఠనం చేశారు. నాన్నగారు ఎంత సామాన్యంగా జీవించినా ఆయన చేసిన తపస్సు ఫలించింది. మరణంతో మహాత్ములు అవుతారు కొందరు. నాన్నగారు అజ్ఞాతంగా జీవించిన జ్ఞాని. మహర్షి.

\+ \+ \+

బెంగుళూరులో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో మా సహోద్యోగి వి.డి.యస్. ప్రసాదరావు నా జాతకం చూచి "శార్వరీ, నీది కర్మసన్యాస యోగం. పితృకర్మ చేస్తే తప్ప జీవితంలో వెలుగు కనిపించదు అప్పటి వరకు ఒకవిధంగా చీకటి జీవితమే. ఎంత ప్రతిభ కనబరచినా, ఎంత కష్టపడినా తగిన గుర్తింపు ప్రతిఫలం లభించదు" అన్నారు. నా చిన్నతనంలో మా తాతగారు అంటుండేవారు 'నీవు ఎప్పటికైనా సన్యాసివి అవుతావు. నీకు పెళ్లి, సంసారం అవసరం లేదు కృష్ణా' అని. మా అమ్మగారు సైతం అదే పాట పాడేది. నేను సన్యాసిని అవడం, అవకపోవడంపై వీరికింత శ్రద్ధ ఎందుకో! సంసారం వదలి సన్యసించడం ఆ కాలంలో గొప్పత్యాగం. గొప్ప ఆధ్యాత్మికత! సన్యాసం స్వీకరిస్తే చాలు, స్వర్గం అరచేతికి అందివచ్చినట్లే. ప్రసాదరావుగారు చెప్పినదాంట్లో ఒక తిరకాసు వుంది. కర్మసన్యాసయోగం అంటే కర్మ చేశాక సన్యసించడమా! కర్మనే సన్యసించడమా! పితృకర్మ చేసి తర్వాత అదృష్టం కలిసి వస్తుందన్నారు అది ఏ రూపంలో వుంటుంది. అదృష్టం కనుక కంటికి కనిపించదు.

మా పెద్దమ్మగారు ప్రేమగా 'పిచ్చిసన్నాసి' అంటుండేది. అప్పట్లో అది ముద్దు అని మురిసిపోయాను. అదే నిజమైతే! వారంతా జోస్యం చెప్పినట్లు సన్యాసిని కాలేదు. కాషాయం కట్టలేదు. సంసారాన్ని త్యజించనూ లేదు యోగంలో చేరాను. ఏ సన్యాసికైనా 'యోగం' అంతిమలక్ష్యం అని అప్పుడు తెలీదు. పైపై వేషాలు ఎన్ని వేసినా, వేయకపోయినా జీవితంలో చివరి మజిలీ ధ్యానం - తపస్సు - యోగం. ఈ మూడు మూడు మెట్లు. పూర్వ ఋషులు ఎవరూ సన్యసించినవారు కారు. హాయిగా, భార్యాబిడ్డలతో అరణ్యాలలో ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సు చేసేవారు. సన్యాసం అనేది బౌద్ధం తర్వాత, బౌద్ధాన్ని దెబ్బతీయడానికి తయారైన ప్రక్రియ. బౌద్ధ శ్రమణులకు పోటీగా హైందవంలో సన్యాసం ఆవిర్భవించింది. గృహస్తుగా వుంటూనే తపస్సు చేసుకోవచ్చు. ఆధ్యాత్మిక వికాసానికి భార్యాబిడ్డలు అవరోధం కాదు.

నాయనగారు పరమపదించిన తరువాత నా జీవితం మలుపు తిరిగింది. తెనాలిలో ఉన్న ఇల్లు అమ్మకానికి పెట్టాం. అది ఒక్కటే పిత్రార్జితం. అదీ మా అమ్మగారి పేర వుంది. ఆమె దానిని అమ్మడానికి, ఆ ఊరు వదలి రావడానికి సుతరాము అంగీకరించలేదు ... పేచీ పెట్టింది. నిరాహార దీక్ష ప్రారంభించింది. చెల్లెళ్లు ఆమెకు వత్తాసు పలికారు. ఆ ఇల్లు నాకు కలసి రాలేదు. ఎప్పుడూ దరిద్రమే. ఆ ఇంట్లో ఎవరూ సుఖపడ్డది లేదు. నేను తిరిగి ఆ ఊరు వెళ్లి ఆ ఇంట్లో వుండేది లేదు. ఆ ఇల్లు అమ్మితే 'శని' విరగడ అవుతుందని అమ్మకు నచ్చచెప్పాం.

రిజిస్ట్రేషన్ రేపు అనగా మా అమ్మ పంచాయితీ పెట్టింది. అమ్మగా వచ్చే డబ్బులో తనకు, కూతుళ్లకు కొంత యివ్వాలన్న కండిషన్. ఒప్పుకున్నాను. అక్కడ కె. రవీంద్రప్రసాద్ అని ఓ మిత్రుడున్నాడు. అతనిది వెండినగలషాపు. నా దైన్యస్థితి చూచి, తనకు తెలిసిన ఒక జ్యోతిష్కుని పిలిపించాడు. అతని పేరు తెలియదు, షిర్డీసాయి భక్తుడు బాగా చెబుతాడని పేరుంది. ఆయన మొక్కుబడిగా చేయి చూచి, తర్వాత మొహం చూచి, చెప్పడం మొదలెట్టాడు

"ఈ డబ్బు తీసుకుపోయి మీరు ఇల్లు కొనాలనుకుంటున్నారు ఇల్లు కాదు కదా, కనీసం స్థలం కూడా కొనలేరు. ఆ డబ్బుతో ప్రెస్ పెడతారు మీ సొంత సంపాదన అందులో కొంత చేర్చుతారు. ఆ ప్రెస్ నడుస్తుందిగానీ, మీరు అనుభవించరు. పిత్రార్జితం మీకు దక్కదు ఈ డబ్బు మొత్తం ప్రెస్ పేర వ్యయం అవుతుంది. మీరు పెట్టే సొంత డబ్బూ పోతుంది పిత్రార్జితం మీరు ఒక్కరూపాయి అనుభవించలేరు"

నాకు తల తిరిగింది. నాకూ కాస్తసాముద్రికం వచ్చుగాని ఇలా చెప్పడం రాదు. అది 'షిర్డీబాబా' అంతర్వాణి ఆయన చెప్పినట్లు మర్నాడు రిజిస్ట్రేషన్ అయింది. ఇరవై వేల వరకు అక్కడ ఖర్చయింది. నలభైవేలు నా చేతికొచ్చింది. సెలవుపెట్టి ఒక నెలరోజులు తెగ తిరిగాను ... చిన్నఇల్లుగానీ, స్థలంగానీ కొనాలని. కుదరలేదు. మా పెద్దబ్బాయి కాలేజీఉద్యోగం మాని స్వంతప్రెస్ పెట్టాలని ప్లాన్ వేశాడు ఆ డబ్బు అందుకోసం ఖర్చయింది. మరో ఇరవైవేలు నా సంపాదన పెట్టుబడి పెట్టాను. అది చిన్న ప్రెస్. నా మాటకు, నా డబ్బుకు విలువలేదని అప్పుడే గ్రహించాను అదీ సన్యాసం. ఎంత సంపాదించినా విలువ లేదు. సానుభూతి లేదు. కొందరి జీవితాలు అంతేనేమో! రాత్రింబవళ్లు గొడ్డులా చాకిరీ చేసి, సంపాదించినా కనీస సుఖాలకు నోచుకోరు.

నా జాతకం మారదు. కష్టపడడం వరకే నా వంతు. ఎవరినీ యాచించకపోయినా పేదవాడంటే సమాజం చిన్నచూపు చూస్తుంది. 'జర్నలిజం' అందరికీ అర్థమయ్యే ఉద్యోగంకాదు. చుట్టుపక్కలవారు గౌరవం చూపని ఉద్యోగం నాది.

# యోగం దిశగా ...

హాలు మనిషి జీవితాన్ని నిర్దేశిస్తాయి...శాసిస్తాయి. యోగం గ్రహాల్ని నిర్దేశిస్తుంది, శాసిస్తుంది. ఇది ఒక అపూర్వ, విచిత్రపరిణామం. యోగంలోచేరిన ప్రతి వ్యక్తి, గ్రహాల్ని అదుపు చేయలేడు మదుపు చేయలేడు యోగం పూర్ణ ఫలితాల నిస్తున్నప్పుడు మాత్రమే గ్రహాలు తమ ప్రభావాల్ని మనిషికి అనుకూలంగా మార్చుకుంటాయి. గ్రహస్పందన మన హృదయస్పందనతో మమేకం అవుతుంది 1980 నుండి న బ్రతుకులో కొత్త రాగాలు వినిపించసాగాయి నా ప్రయత్నం, కృషి ఎంతమాత్రం కాదని నాకు తెలుసు అంతా మాస్టర్ గైడెన్స్ నేను సంపూర్ణంగా యోగానికి, మాస్టర్‌గారికి సమర్పణ చేసుకోగలిగాను అది ఒక్కటే నాకు తెలిసింది. నా వల్ల యోగానికి ఏదో జరిగిందని చెప్పే సాహసం నాకు లేదు. కాని యోగం వల్ల నా బ్రతుకు బాట కొత్త మలుపులు తిరగసాగింది అది పూర్వపుణ్యమో, యోగఫలమో చెప్పలేను

మద్రాసులో శ్రీ శంకరయ్యర్‌తో సంబంధం పోయింది. బాల సుందరరావుగారు పోనే పోయారు. ఇద్దరికీ దూరమైన నేను ఒంటరివాడి ననుకుంటున్న తరుణంలో నా శిష్యులు అనేవారు, నన్ను అమితంగా ప్రేమించేవారు నాకు దొరికారు. శ్రీ దిడుగు నారాయణరావు, దాసు ఆత్మీయులైనారు. వీరిద్దరు హైదరాబాదు ఎప్పుడు వచ్చినా నన్ను చూడకుండా పోయేవారు కారు. నారాయణ రావుగారు నివురుకప్పిన నిప్పు. యోగ విజ్ఞానం నరనరాన జీర్ణించుకున్నవాడు. పూర్ణయోగి. గుంటూరులో, పిడుగురాళ్లలో యోగ సమావేశాలు నిర్వహిస్తుండేవారు. శ్రీ కవులూరి సీతారామయ్యగారు సత్యయోగి, 80 సంవత్సరాల వయస్సు, ఆయనను చూస్తే, ఒక్కసారి పాదాభివందనం చేస్తే ఎవరికైనా యోగస్ఫూర్తి కలుగుతుంది. మనశ్శాంతి లభిస్తుంది.

ఈ త్రిమూర్తులు నాకు యోగమార్గదర్శకులుగా నిలిచారు. "నీ వెనుక మేము వున్నాం. ముందుకు నడువు" అని వెన్నుతట్టి నడిపించిన మహర్షి సత్తములు. ఒకసారి

మిత్రులు నారాయణరావుగారు ఒక మీసాల ఆసామిని వెంటబెట్టుకుని వచ్చారు మా ఇంటికి. చిన్న ఇల్లు, అంతటి పెద్దవారు ఆ చిన్న ఇంట్లో ఇమడరు. ఆరుబయట కుర్చీలు వేసుకున్నాం. "వీరే శార్వరిగారు. నమస్కారం చేసుకో " అన్నారు నారాయణ రావుగారు. ఆయన నా వైపు చూచి మీసాలు మెలిపెట్టి, గమ్మున కూర్చున్నారు నమస్కారం చేయలేదు.

"నేను చిన్నవాడిని, మీసాలు లేనివాడిని వీరెవరో నాకు తెలియదు గానీ వీరి మీసాలు నాకు నచ్చాయి వీరి మీసాలకు నా నమస్కారం" అన్నాను.

ఆయన పకపక నవ్వి, కుర్చీలోంచి లేచి, నన్ను లేచి నిలబడమని, గట్టిగా కౌగలించుకుని "వండ్రఫుల్. ఏమో అనుకున్నా గట్టివాడే"అన్నాడు.

"ఏం గట్టి... నాఎముకలు కాస్త లూజ్ అయ్యాయి మీ ఘాటుప్రేమకు" అన్నాను.

"జర్నలిస్టు కదా! మా సీతారాం జర్నలిస్టే గాని వాడిలో సెన్స్ ఆఫ్ హ్యూమర్ బొత్తిగా లేదు. శార్వరి రచయిత, పొయెట్ కదా ఆ మాత్రంసెన్స్ ఆఫ్ హ్యూమర్ వుండాలి" అని అభినందించారు.

ఆయన డి ఏన్.రావు బొంబాయిలో రైల్వే ఇంజనీరు. రిటైర్ అయి హైదరాబాదు వచ్చారు. సీతాఫల్‌మండిలో ఒక పెద్ద ఇల్లుంది బొంబాయిలో సెటిల్ కావడమా, హైదరాబాద్‌లోనా అని'ఆలోచిస్తున్నారు నాతో పరిచయం అయిన తర్వాత హైదరాబాదుకు మకాం మార్చారు.

"నేను హైదరాబాద్ ఎన్నుకోడానికి కారణం నీవే. రిటైర్డ్‌లైఫ్ యోగంలో గడప దలచాను. నారాయణరావు నిన్ను పరిచయం చేశాడు" అన్నారు

కొన్నాళ్లు బొంబాయిలో ఉండి వస్తుండేవాడు. అక్కడ ఆస్తులున్నాయి. అద్దెలు వస్తాయి. హైదరాబాదు వచ్చినప్పుడు వచ్చి కలిసేవాడు. టోటల్‌గా యోగానికి అంకితమైన వ్యక్తి. ఆయన కొడుకు ఇరాన్‌లో ఉంటాడు. కూతురు పెళ్లయి బొంబాయిలో వుంటోంది. మరొక కొడుకు ఉన్నాడుగానీ అడ్రసు తెలియదు. భార్య, బొంబాయిలోనే వుంటుంది. ఈయనతో వుండేది కాదు. ఇక్కడ ఇద్దరు తమ్ముళ్లు. వారి సంసారాలు వారివి. తల్లి వుండేవారు. ఆ తల్లిగారు మాస్టర్ ఎం.ఎన్‌గారి శిష్యురాలు. మా ఇద్దరిమైత్రి బలమైంది.

\+ + +

ఒకమారు దాసుగారు అశోకనగర్‌లో ఒకసమావేశం ఏర్పాటు చేసి, హైదరాబాదులో వున్న యోగసాధకుల్ని పిలిచారు. కవులూరి సీతారామయ్యగారు ఏవేవో

కోర్సులు చేయించారు. డి ఎన్.రావు, నేను కలిసివెళ్లాం కొన్నిరోజులు అలా కోర్సులు చేయించారు. డి.ఎన్. రావుగారు చొక్కా విప్పి, వెల్లకిలా పడుకుని గురకపెట్టేవారు. కాని చేస్తున్న కోర్సుల గురించి తెలుస్తూనే వుండేది. నిద్రలేపి "ఏమిటి గురక పెడుతూ నిద్ర కోర్సు చేయిస్తుంటే" అని ప్రశ్నిస్తే . " ఈ నేమ్ గదా చివరగా చేయించింది" అని ఆ నేమ్ చెప్పేవాడు. అంత గురకనిద్రలో వున్నా, ఆయన కోర్సు వినేవాడు. వర్కింగు ఉండేది. అదొక చిత్రమైన అనుభవం పైగా కోర్సులు చేయిస్తునప్పుడు కూర్చునే ఓపికలేనివారు పడుకోవచ్చని చెప్పారు అయితే నిద్ర పోకూడదు. ఒక్కొక్కసారి కోర్సులు గంటలకొద్దీ సాగేవి. అప్పుడు చేయించే వ్యక్తి తప్ప, సాధకులంతా పడుకునే వుండేవారు. తొలినాళ్లలో మాస్టరుగారు కొత్తసాధకుల్ని 'శవాసనం'లో పడుకుని సాధన చేయమనేవారుట. మద్రాసులో శంకరయ్యార్ ఇంటివద్ద ప్రేయర్‌కు వచ్చేవారు ఓతుండు తెచ్చుకుని పరచి బెర్త్ రిజర్వు చేసుకునేవారు.

ఒకమారు దిడుగు నారాయణ రావుగారు నన్ను తీసుకుని బ్యాంకు కాలనీలో ఒక ఇంటికి వెళ్లారు అక్కడ శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ పంతులుగారిని పరిచయం చేశారు. ఆయనకు ఎనభై వయస్సు వారిది తెనాలి. పెద్ద లాయరు. సన్నగా, రివటలా వున్నా ఆరోగ్యంగా వున్నారు వారు ఎం.ఎస్.గారి ప్రియశిష్యులు. మదర్ వెంకమ్మగారికి తెనాలిలో తమ ఇంట అనేకమార్లు అతిధ్యం యిచ్చినవారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారి మిత్రుడు. ఆయనకు పాదాభివందనం చేశాను.

"అయ్యా! తమరు తెనాలి వాస్తవ్యులు. నేనూ తెనాలివాడినే" అని పరిచయం చేసుకున్నాను.

నేను హైస్కూలులో చదివేరోజుల్లో వారిని చూచాను.

ఆయన నన్ను ఆశీర్వదించారు. ఆయన రోజూ ముప్ఫయి నలభై మందికి విందు చేసేవారు. ఆస్తి అంతా హరించుకుపోయింది. కొడుకులు దూరమైనారు. చిన్న కొడుకు ఇంట హైదరాబాదులో వుంటున్నారు. ఆ చిన్న కొడుకు తెనాలి కాలేజీలో నా స్టూడెంటు. వారు యోగం గురించి అద్భుతంగా చెప్పేవారు. ఇంగ్లీషులో బాగా చదివిన వారు. గొప్పవక్త. బార్ ఎట్ లా. ఆయన చెప్పే విషయాలు ఏవీ జ్ఞాపకం వుండేవి కావు. వాటి సారం మాత్రం హృదయంలో పదిలంగా మిగిలేది. గొప్ప ప్రసంగాలు జ్ఞాపకం ఉండవు వాటి సారాంశం అనుభూతిగా మిగులుతుంది. ఒక స్పందన కలిగిస్తుంది. వారి మాటలు నాలో బీజాలుగా నాటుకునేవి. ఎప్పుడో అవి మొలకెత్తి మహావృక్షాలవుతాయి. ఆయన రోజూ కాకపోయినా, ప్రతి ఆదివారం మా ఇంటికి ప్రేయర్‌కు వచ్చేవారు.

గంటసేపు సమాధిలో వుండేవారు వారు చెప్పిన మాటలు అప్పటికి అర్థంకాక, మరచి పోయినా తర్వాత అవి నాలో భావాలను మొలకెత్తించి, వాక్యాలుగా, రచనలుగా పరి ణామం చెందాయి.

\+ + +

మాస్టరు జన్మదిన సందర్భంగా, నాలుగు వ్యాసాలురాసి, మాస్టరుగారి ఫోటోలతో నాలుగు పత్రికలలో ప్రచురించేవాడిని. మా అబ్బాయి 'మాస్టర్ రమణ' పేరుతో ఒక డెయిలీలో వచ్చిన వ్యాసం చదివి మెదక్‌జిల్లా నుండి ఒక పెద్దాయన వచ్చాడు. ఆయన వెంట ఒకరిని తోడుగా తెచ్చుకున్నాడు. అడ్రసు సంపాదించి పొద్దున్నే ఇంటికి వచ్చాడు. రమణగారు కావాలన్నాడు. అప్పుడు రమణ కాలేజీకి వెళ్లే హడావిడిలో వున్నాడు. వాకిట్లోకి వెళ్లగానే ఆయన 'రమణ' కాళ్లపైన పడి సాష్టాంగ నమస్కారం చేశాడు. రమణ 'నేనుకాదు నాన్నగారితో మాట్లాడండి' అంటూ వెళ్లిపోయాడు.

ఆయనకు డెబ్బయి ఏళ్లుంటాయి. ఏవో జపతపాలు ఆచరించాడు. కొంతకాలం ధ్యానం చేశాడుట ఎక్కడో ఉపదేశం తీసుకున్నాడు కాని తృప్తి లేదు. సాధనలో ఏం సాధించిందీ తెలియదు

"మీకేం కావాలి చెప్పండి" అని అడిగాను

"నాకు బ్రహ్మాన్ని చూపగలరా?"

"బ్రహ్మం అంటే మీరు అనుకునేది ఏమిటి? బ్రహ్మం ఒక రూపంలో, ఆకారంలో వుండదు. అది నిర్గుణం. అనుభూతితో మాత్రమే బ్రహ్మానందస్థితి కలుగుతుంది. మీరు ఏదైనా ఒకరూపంలో ధ్యానించివుంటే చెప్పండి. ఆ రూపంలో మీకు సాక్షాత్కరించేటట్లు చేస్తాను. లేదంటారా... బ్రహ్మాన్ని నిర్గుణ, నిరాకార, నిశ్చలనస్థితిగా అనుభవించేటట్లు చేస్తాను. మీకు ఏది కావాలి?"

"మీ ఇష్టం. జీవితకాలం యావత్తూ అన్వేషణలోనే గడిచింది. ఎన్నో సాధనలు చేశాను. ఏమీ లభించలేదు. ఈ వయస్సులో నాకేది అవసరమో దాన్ని అనుగ్రహించండి చాలు" అని చేతులు ముకుళించాడు. భగవంతుడు ఏ రూపంలో మనం అన్వేషిస్తే ఆరాధిస్తే, ఆ రూపంలోనే దర్శనమిస్తాడు. అలా కోరనివారికి నిర్గుణత్వం బ్రహ్మానందాను భూతిగా మిగులుతుంది.

ఆఫీసు సమస్యలతో నేను సీరియస్‌గా వుండేవాడిని. ఎవరితో చనువుగా మాట్లాడను. టెన్షన్ ఎక్కువ. యోగం గురించి తెలుసుకోవాలని వచ్చేవారితోనూ సీరియస్‌గానే వుంటాను. అందువల్ల ఎవరూ నాదగ్గర అతిగా మాట్లాడరు. ఆయన రెడీ

అయినాడు. పాదప్రక్షాళనం చేసుకువచ్చి, నా పాదాలకు నమస్కరించి కూర్చున్నాడు. కళ్లు మూసుకోమని చెప్పి నుదుట విభూతి పెట్టాను నిమిషంలో ఆయన బాహ్యస్మృతి కోల్పోయాడు. గొప్ప సమాధి స్థితి అది. బాగా సాధన చేశాడు. ఒక గంటసేపు అలా నిశ్చలంగా వున్నాడు ఈలోగా నేను భోజనం చేసి ఆఫీసుకు రెడీ అయినాను. గంటతర్వాత ఆయన్ని లేపాను.

విప్పలేక, విప్పలేక, కళ్లు విప్పాడు. కాళ్లపైన పడి భోరున ఏడ్చాడు. అది పరాకాష్టకు చేరిన ఆనందం "గురుదేవా! నా జన్మ ధన్యమైంది. ఇంతకాలానికి ఒక సద్గురువు దర్శనం అయింది. ఇన్ని సంవత్సరాలుగా ఎందరినో సేవించాను. ఎన్నో చేశాను ఈ అనుభూతి కలగలేదు. ఈరోజు బ్రహ్మానందానుభూతితో తలమునకలైనాను.ఈ జన్మకిది చాలు మహాత్మా"

ఉపదేశం చేయమని అర్థించాడు "మీకు వేరే ఉపదేశం అవసరం లేదు. రోజూ ఉదయం సాయంత్రం మాస్టర్‌గారిని స్మరించి ధ్యానం చేసుకోండి అదే ఉపదేశం... మీకు అవసరమైనంత వరకు మాస్టర్ కరుణ లభిస్తుంది. అదనంగా కోరినా దొరకదు మీకు ప్రాప్తం ఉండబట్టి నావద్దకు రాగలిగారు. అదీ మాస్టర్ గారి సంకల్పమే. మాస్టరుగారు తమ యోగానికి అర్హులైనవారిని తామే ఎన్నిక చేస్తారు. వారి యోగసాధనకు నావంటివారు కేవలం సహాయకులు మాత్రమే. అందరికీ పరమగురువు మాస్టరుగారే" అని చెప్పి పంపాను.

\+ \+ \+

ఒకరోజు ఒకాయన వచ్చారు. నా వయస్సే వుంటుంది. ఎప్పుడూ చూచిన జ్ఞాపకం లేదు. పరిచయమూ లేదు. కాని అతను ఎంతోకాలంగా మా మధ్య స్నేహం వున్నట్లు చనువుగా మాట్లాడసాగాడు. మద్రాసులో ఉండగా ఎవరైనా తెలుగువారు వచ్చినా, బెరుకుగా మాట్లాడేవారు. అక్కడి తెలుగువారిని దత్తత్తపోయినవారిలాగా, ప్రవాసుల్లాగా చూచేవారు. యోగమిత్రులు మద్రాసులో తక్కువ. కుంభకోణంవెళ్లి వచ్చే యోగసాధకులు వచ్చి పలకరించినా, అది లాంఛనం. హైదరాబాదు వచ్చాక, యోగాభి మానులు అప్పుడప్పుడు రాసాగారు. అప్పటికి నాకు సన్నిహితులైన యోగమిత్రులు అందరూ నా కన్న సీనియర్లు.

'నా పేరు ఘంటప్ప. ఆదోని' ఆ పరిచయమే చెబుతోంది యోగసాధకుడని. రచయితలు ఇంటికి వస్తుంటారు. వారి ధోరణి వేరు. వారిని చూడగానే పోల్చుకోగలను. రచయిత్రులు అనేకమంది వచ్చేవారు. వారి సిగ్గులు, వయ్యారాలు ఇట్టే పట్టిస్తాయి.

"మీరు యోగం చేస్తారా? ఎంతకాలం నుండి చేస్తున్నారు? ఎవరివద్ద ఇనీసియేషన్ తీసుకున్నారు?"

అవి నేను సాధారణంగా యోగసాధకులను అడిగే ప్రశ్నలు ఆ మూడు ప్రశ్నలకు సమాధానం యిస్తే, వారిని అంచనా వేసుకోగలను

"నేను రొట్టె బసప్ప దగ్గర చేరాను మా ప్రాంతంలో చాలామందికి యోగాన్ని ఆయనే పరిచయం చేస్తుంటారు."

"ఏమిటి చెప్పండి? నావల్ల ఏం కావాలి? నేను చేయగల సహాయం ఏదైనా చేస్తాను."

"నా బిడ్డకు పెళ్లయింది"

"వెల్ మంచిదే కదా!"

"వరంగల్ యిచ్చాం అల్లుడు మంచివాడే"

"మరి ఇంకేమిటి సమస్య?"

"బిడ్డ యోగం చేస్తుంది బాగాచేస్తుంది. అత్తారింట్లో బిడ్డ మాస్టరుగారి ఫోటో వద్ద నిలబడి, అలాగే ఏడుస్తుంది మగతగా పడి వుంటుంది ఇంటిపని చేయదు మొగుడితో సంసారం చేయదు. వాళ్లు అమ్మాయిని తీసుకుపొమ్మని టెలిగ్రాం యిచ్చారు అల్లుడు వేరే పెళ్లి చేసుకుంటాడట" అని చెప్పి వలవల ఏడ్చాడు

పాపం! కన్నతండ్రిబాధ! ఆడపిల్లను అత్తవారు వదిలేస్తామంటే బాధగా వుండదా?

"ఏం చేస్తున్నారు"

"మీరే రక్షించాలి. నా బిడ్డ సంసారం నిలబెట్టండి" అని కాళ్లు పట్టుకున్నాడు.

"నేను మాత్రం ఏంచేయగలను? అంత పెద్దపనులు చేసే శక్తి నాకు లేదు"

"మీకా శక్తి వుంది గురువుగారూ! ప్రేయర్ చేస్తుంటే, మాస్టరుగారు మీదగ్గరకు వెళ్లమని సూచించారు. మీరు అమ్మాయి సంసారాన్ని రక్షించగలరు."

మాస్టరుగారు నన్ను సూచించడం ఏమిటి? ముందరి కాళ్లకు బంధాలు వేయడం కాదు కదా! సరే. ఏమైనా కన్నతండ్రిగా నా హృదయం కలుక్కుమన్నది. ఆ రోజు ప్రేయర్‌లో మాస్టరుగారిని ప్రార్థించి విభూతి యిచ్చాను, వెళ్లి అమ్మాయికి పెట్టమని.

ఘంటప్ప సంతోషంగా వరంగల్ వెళ్లాడు. అమ్మాయి అదే స్థితిలో వుంది. విభూతి పెట్టాడు. నిమిషంలో అమ్మాయి మామూలు మనిషైంది. ఇంటిపనులు చేసింది. భర్తను ఆదరించింది. నాలుగురోజులు అల్లుడింట వుండి, అంతా చక్కబడ్డాక ఘంటప్ప తిరిగి వచ్చాడు. తర్వాత ఆ అమ్మాయి ఎలాంటి చేష్టలు చేయలేదు. హాయిగా సంసారం

చేసుకుంటోంది తదాది ఘంటప్ప నాకుమంచి యోగమిత్రుడైనాడు అతనిని ఎప్పుడూ నా శిష్యుడిగా భావించలేదు.

ఒక్కొక్క సంఘటన అలా మనిషిని మలుపు తిప్పుతుంది. మనిషి బ్రతుకుబాటను మార్చుతుంది యోగం చేసుకోవడమే తప్ప, దానిని ఏదో ప్రచారం చేయాలన్న రంధి నాకు వుండేది కాదు. చేతిలో పని కనుక ఎప్పుడైనా పత్రికలకు ఓ చిన్నవ్యాసం రాయడం జరిగేది. నాపుస్తకం ఒక్కటే డిస్కవరీ అఫ్ మాస్టర్‌యోగ, దాని తెలుగువర్షన్ మాస్టర్ యోగదర్శని. హైదరాబాదు వచ్చాక మరలా అచ్చువేయవలసి వచ్చింది. తిరిగి రాసి అచ్చువేశాను .ఆ పుస్తకానికి తోడుగా 'యోగాశ్రమ లేఖలు' అనే పుస్తకం ఒకటి యోగంలో కొత్తగా ఆసక్తి కలవారికోసం ఉత్తరాల ద్వారా యోగం గురించి ప్రాధమిక పరిజ్ఞానం కలిగించడానికి ప్రయత్నించాను ఆ రెండు పుస్తకాలు పాఠకులలో ఉత్సాహం కలిగించసాగాయి. అలా మాస్టరుయోగంపై పుస్తకాలు రాయడం 'మహాపాపం' అన్నవారున్నారు మాస్టరుగారు తన గురించి, తన యోగం గురించీ పత్రికలలో రాయవద్దని శాసించారుట ఎప్పుడో ఇప్పటికీ అదే పట్టుకుని నన్ను భయపెట్టారు కొందరు.

నా పుస్తకాలు చదివి, నన్ను కలుసుకోవాలని వచ్చిన వ్యక్తి బి. కొండాచార్య. బళ్లారి నివాసి. వారిది పూర్వం గూడూరు. వారి అమ్మాయిని గూడూరు యిచ్చారు. రైల్లో ఎవరో నా గురించి చర్చిస్తుండగా విని, అడ్రసు తీసుకుని హైదరాబాదు వచ్చారు. అయన ఆకారం చూస్తే నాకు భయం వేసింది. మనిషి మంచివాడు. సాత్వికుడే. కానీ ఆయన కళ్లు ఎర్రగా భయంకరంగా వున్నాయి. మనిషి చాలా సీరియస్, ముక్కోపి అనిపించారు కాని కాదు పాపం. చాలా దిగులుగా నిరాశగా దైన్యంగా వున్నాడు. పరిచయాలు అయ్యాక తన గురించి చెప్పుకున్నాడు. భార్యపోయింది, ముగ్గురు ఆడపిల్లలు, ఒక అబ్బాయి. ఆర్థికంగా చాలాచాలా కష్టాలలో ఉన్నాడు. కోర్టుగొడవలు. యోగంలో ఏదైనా మార్గం చూపించమని కోరాడు. బళ్లారి రమ్మని ఆహ్వానించాడు. ఆయన అప్పటికే యోగంలో ఉన్నాడు.

\+ \+ \+

బళ్లారిలో కొండాచారి గారిల్లు ఒక దేవాలయం. వారి తండ్రిగారు శ్రీవిద్యోపాసకులు. వీరు తండ్రిగారి వారసత్వం పొంది శ్రీఉపాసన చేస్తున్నారు. నాకు తెలిసినంతలో శ్రీఉపాసన, బాల ఉపాసన చేయడం చాలా కష్టం. అసలు ఇళ్లలో శ్రీచక్రం పెట్టుకుంటేనే ఇబ్బంది. దానిని మడి ఆచారాలతో, నియమనిష్టలతో ఆరాధించాలి.

జపించాలి. ఉపవాసాలు ఎక్కువ. మా నాన్నగారు చాలాకాలంగా శ్రీ ఉపాసన, బాల ఉపాసన చేశారు వాటివల్ల ఆయన ప్రాపంచికంగా పొందిన లబ్ధిలేదు ఎప్పుడూ ఇంట దరిద్రమే. ఆయన అనుభవించిన దారిద్ర్యంలో మేమూ పాలుపంచుకున్నాం. దరిద్రం అనుభవిస్తామని, కష్టాలు వస్తాయని తెలిసీ ఆ ఉపాసన చేశారు. పాపం! కొండాచారిగారి స్థితి అలాగే వుంది ఇరవై సంవత్సరాలుగా చేస్తున్న ఘోర తపస్సు. వారి తండ్రిగారు పోయారు. భార్య పోయింది. ఆర్థికచిక్కులు ఇంట్లో పసుపుకుంకుమలు రాసులు పెరిగాయి ఆ పూజామందిరం కర్పూరవాసనలతో మగ్గిపోయివుంది

ఆ ఉపాసనలు కట్టిపెట్టమని సలహా చెప్పాను సలహాలు చెప్పడం ఎవరికైనా సులువే ఆచరించడమే కష్టం. ఆయనకు మనసొప్పలేదు అనడం కన్న ధైర్యం చాలలేదు అనవచ్చు తటపటాయించాడు. "మీ పరిస్థితి బాగుపడాలంటే అవి బంద్ చేయక తప్పదు" అని నా సలహా నా మాటపైన యోగం పైన వారికి పూర్ణవిశ్వాసం ఉపాయం చెప్పాను అపాయం లేదని హామీ యిచ్చాను. ధైర్యంగా ఆ పనిచేస్తే మాస్టరుగారి అండ, ఆశీస్సు లభిస్తుందని భరోసా యిచ్చాను. దగ్గరుండి అవన్నీ ఒక గోతంలో కట్టించి, తుంగభద్రలో కలపమన్నాను. శ్రీ చక్రాన్నితీసుకువెళ్ళి, ఒక అమ్మవారి దేవాలయంలోగాని, శివాలయంలోగానీ, దేవీసన్నిధిలో వదలి నమస్కరించి 'క్షమాపణ' కోరుకొమ్మని చెప్పాను. నా మాటపై గౌరవంతో ఆయన ఆ పని చేశారు. ఆ గదినే శుభ్రపరచి, వెల్లవేసి, మాస్టర్‌గారి ప్రేయర్‌కి ఉపయోగించమని చెప్పి ముందుగా నేనే ఆ గదిలో ప్రేయర్ చేశాను. క్రమంగా ఆయన పరిస్థితి మెరుగైంది. పిల్లలకు నాచేత ట్రీట్‌మెంట్ యిప్పించాడు వాళ్ళ బాగున్నారు. అంతకుముందు తండ్రిని చూస్తే పిల్లలు భయపడేవారు. కొట్టేవాడట నేను వెళ్లి ఈ మార్పులు చేసిన తర్వాత ఆయన సాత్వికుడైనాడు. పిల్లల్ని ప్రేమించసాగాడు. తల్లిలేని పిల్లలు వారు. తర్వాత పిల్లలంతా బాగాచదివి ప్రయోజకులైనారు. ఉద్యోగాలు వచ్చాయి. వివాహాలైనాయి.

ఆ ఊతంతో కొండాచారిగారు బళ్లారిలో యోగసమావేశాలు జరిపి నన్ను ఆహ్వానించారు. కొంతకాలం తర్వాత నాకు తరచు రావడం సాధ్యంకాదని చెప్పి వారి చేతనే అక్కడ యోగకేంద్రం పెట్టించాను. వారి ఇల్లే ఒక రాజయోగాశ్రమం. ఇప్పుడు మద్రాసు నుండి కుంజుఅయ్యర్ వచ్చి యోగసమావేశాల నిర్వహణలో సహకరిస్తారు. కర్నాటకలో ముఖ్యంగా బళ్లారి, గుల్బర్గా, రాయచూర్, టి.పి.డామ్ ఏరియాలలో మాస్టర్‌యోగాన్ని బాగా విస్తరింప చేస్తున్నవారు కొండాచారి. కన్నడంలో కొన్ని పుస్తకాలు ప్రచురించారు.. నాడీజ్యోతిషంలో తానొక గురువునని చెప్పారని, ఆ కారణంగా తనకొక

యోగకేంద్రం నెలకొల్పుకుని మాస్టర్‌గారి యోగాన్ని శక్తివంచన లేకుండా ప్రచారం చేస్తున్నారు.

\+ \+ \+

హైదరాబాదులో ఆంధ్రప్రభలో ఉద్యోగపర్వం 1977 నుండి 88 వరకు. పన్నెండు సంవత్సరాలలో ఎత్తుపల్లాలున్నాయి. విషాదాలు, వినోదాలున్నాయి ఆశలు, నిరాశలు ఉన్నాయి అసలు నా జాతకంలోనే అవన్నీ పుష్కలంగా వున్నాయంటారు దైవజ్ఞులు. ప్రధానంగా చెప్పవలసింది, ఆలోచించవలసింది లగ్నాధిపతి అయిన రవి, తృతీయంలో నీచపడడం, గురుదృష్టిని పొందడం నీచభంగరాజయోగం కనుక నీచులతో కలిసి పనిచేయడం తప్పదు నీచప్రవృత్తిగలవారితో మైత్రి కొనసాగించకపోయినా కలవక తప్పదు. ప్రభ వీక్లీకి మొదటి నుండి ఎడిటర్ విద్వాన్‌విశ్వం నన్ను అభిమానించి ఉద్యోగం యిప్పించిందీ ఆయనే. ఎడిటర్ నార్లగారికీ నేనంటే అభిమానం వారిద్దరి ఆప్యాయత కారణంగా నేను జర్నలిస్టునైనాను

జర్నలిజం కాస్తంత నేర్చుకున్నాను. 30సంవత్సరాల జర్నలిజం పరిధిలో నేను పనిచేసింది ఒక్కప్రభలోనే. అన్ని సంవత్సరాలు ఒకేపత్రికలో పనిచేసిన జర్నలిస్టులు అరదుగా వుంటారు. అసలు జర్నలిస్టులకు కాలు నిలవదు. ఒక్కచోట కుదురుగా వుండరు. ఈ పత్రిక కాదని, మరొక పత్రికకు పరుగులు తీస్తుంటారు యాజమాన్యంవారు ఒక వ్యక్తిని ఎక్కువ కాలం వుంచుకోరు ఏవో కారణాలు చూపి ఉద్యోగం నుండి తొలగించి కొత్తవారికి అవకాశం యిస్తుంటారు. అది వారికి లాభం. కొత్తవారు చిన్నజీతాలకు వస్తారు. అణగిమణగి పనిచేస్తారు పాతవారికి కొమ్ములొస్తాయి అసలు రచయితలకు కవులకు నాలుగు రచనలు అచ్చయేసరికి కొమ్ములొస్తాయి. అలాంటిది పదేళ్లపాటు పత్రికల్లో పనిచేసినవారికి కొమ్ములు రావడం ఆశ్చర్యం కాదు. ప్రతిజర్నలిస్టు తనకు అన్ని విషయాలు తెలుసుననే భ్రమలో వుంటాడు. అలా అనుకోకపోతే ఎవరూ జర్నలిస్టుగా రాణించరు.

1959లో మద్రాసులో ప్రభలో సబ్‌గా చేరాను. 1988లో అసిస్టెంటుఎడిటర్‌గా మ్యాగజైన్ ఎడిటర్‌గా రిటైర్ అయ్యాను. డెయిలీ ఎడిటర్ పేరునే వీక్లీ ఎడిటర్‌గా వాడే అలవాటు. పనిచేస్తోంది విద్వాన్‌విశ్వం అయినా, నార్లగారిపేరు, నీలంరాజు వేంకట శేషయ్యగారి పేరు ఎడిటర్‌గా వుండేది. పత్రికలలో పేరుకు ఎడిటర్ ఉన్నా పెత్తనం యజమానులదే. వారి కోపతాపాలకు గురైతే నిమిషంలో ఉద్యోగం పోతుంది. విశ్వంగారు వీక్లీకి ఎడిటర్ అయినారు. కొంతకాలం పెత్తనం చేసిన బి.సి.కామారాజు మళ్లీ వచ్చి

ప్రభలో కాలుపెట్టాడు అతనిది ఐరన్‌లెగ్ మంచిగా కనిపిస్తాడు కాని మహాజిత్తులమారి. ఎత్తులు వేయడంలో శకుని జర్నలిజంలో ప్రతిపత్రికలోనూ ఒక శకుని వుంటాడు ఎడిటర్లు దుర్యోధనులు పెత్తనం శకునిది. 'తూలికాభూషణ్' అనే ఈయన ఎప్పుడో కథలు రాశాడుట. తాను గొప్ప కథకుడినని అనుకుంటాడు తను రాసే రచనలు గొప్పవి కాదనుకుంటే ఎవరూ ఏమీ రాయరు. రాయలేరు. రచయితకు అహంకారం అవసరం. అహంకారం ముందుపుట్టి తర్వాత రచయిత పుడతాడు. రచయితలే కాదు, కళాకారులంతా అంతేనేమో! మింగడానికి మెతుకులేకపోయినా మేకపోతు గాంభీర్యంప్రదర్శిస్తూ పోజులు కొడతారు. కామరాజుకు మొదటినుండి నేనంటేపడదు. ఒకసారి ఇంక్రిమెంటు రాకుండా చేశాడు రెండుసార్లు ట్రాన్స్‌ఫర్ చేయించి పుణ్యం కట్టుకున్నాడు. ఆ బదిలీల వల్ల నాకు మేలే జరిగింది

పత్రికా ప్రపంచంలో అవినీతిని ప్రవేశపెట్టిన ఘనత ఆయనది అంతకుముందు ఎడిటర్లు లంచం తీసుకోవడం ఎరగం ఇతని దరిద్రం అవినీతికి రాచబాట వేసింది రచయితల దగ్గర రచయిత్రుల దగ్గర డబ్బుతీసుకుని కథలు, నవలలు అచ్చువేసేవాడు పరమ చెత్తకథలు, నవలలు ప్రచురించడంవల్ల ప్రభకు అపకీర్తి రాసాగింది. అసలు అప్పట్లో వుండేవే రెండు వీక్లీలు. తర్వాత ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి వారపత్రికలు వచ్చాయి. దాని సంపాదకులు కామరాజు పద్ధతినే అనుసరించారు. దానదీనా తెలుగు వారపత్రికలలో డబ్బు లిచ్చి కథలు, నవలలు వేయించుకునే చెత్త, దుష్ట సంప్రదాయం వచ్చింది దానిని ఎదిరించినందుకు నాకు శిక్ష. వీక్లీనుండి నన్ను తరిమివేయాలన్న కామరాజు ఆలోచన నెరవేరకముందే ఆయనే రిజైన్ చేసి వెళ్లిపోయాడు. కామరాజు సూక్తులు వంటపట్టించుకున్న పొత్తూరి వెంకటేశ్వరరావు అకారణంగా నాపై అలక వహించారు. సమయానికి ఆయన వీక్లీ ఎడిటర్ కావడం. డెయిలీకి ఎ.బి.కె.ప్రసాద్ రావడం జరిగింది. ఎ.బి.కె. నాకు చిరకాల మిత్రుడు. ఎక్స్‌ప్రెస్ రిపోర్టర్లుగా వుండే నీలంరాజు మురళీధర్, సుందరం, జి.కృష్ణ నాకు మిత్రులు పొత్తూరివారు ఏమైనా చేస్తే ఎక్స్‌ప్రెస్ రిపోర్టరుగా తీసుకుంటామని హామీ యిచ్చారు. అప్పుడప్పుడు ఎక్స్‌ప్రెస్‌కు రాస్తుండేవాడిని. కొందరు నీచుల మధ్య తప్పనిసరి ఉద్యోగం. ఎ.బి.కె.ప్రసాద్‌గారు పట్టుబట్టి నన్ను తన డెయిలీకి వేయించుకున్నారు. కానీ ఆయన దాసరినారాయణరావు పెట్టిన ఉదయం ఎడిటర్‌గా వెళ్లిపోవడంతో నా కష్టాలు పునరావృతమైనాయి. కొన్నిపరిస్థితుల వల్ల పొత్తూరి వెంకటేశ్వర రావు డెయిలీ ఎడిటర్ అయ్యారు. వీక్లీకి తానే ఎడిటర్. వారికి అసిస్టెంటు నేను. డెయిలీలో కొన్ని శీర్షికలు నిర్వహించే బాధ్యత నాది. 'మహిళాప్రభ'

'బాలప్రభ' 'చిత్రప్రభ' 'ఆదివారం సారస్వతానుబంధం' ఎనిమిది పేజీలకు నేను ఎడిటర్. తర్వాత నాలుగు పేజీల చిత్రప్రభ నిర్వహణ బాధ్యత నాకే యిచ్చారు. పి.ఎస్. ఆర్ ఆంజనేయులుగారిని, అజంతాగారిని నాకు సహాయకులుగా నియమించారు 'అజంతా' అంటే నాకు గౌరవం. ఆయన చాలాకాలం విజయవాడ ఎడిషన్‌కు న్యూస్ ఎడిటర్. విజయనగరం ఎడిషన్‌కు రెసిడెంట్ ఎడిటర్ అలాంటి సీనియర్‌ని తీసుకువచ్చి నాకు అసిస్టెంటుగా వేసి అవమానించారు. ఆ అవమానంతో ఆయన రిజైన్ చేసి వెళ్లిపోతాడని యాజమాన్యం పథకం ఆదివారం అనుబంధం నేను పూర్తిగా అజంతా హస్తగతం చేసి 'చిత్రప్రభ' నేను చేసేవాడిని. గోయెంకా సంస్థలో సీనియర్స్‌కు గౌరవం ఉండదు. సముచితస్థానమూ ఉండదు. ఎలాగో అవమానం చేసి, రిజైన్ చేసి వెళ్లి పోయేట్లు చూస్తారు. అదొక టెక్నిక్.

ప్రభ వీక్లీ, డెయిలీ అమ్మకాలు దారుణంగా పడిపోయాయి. కారణం ఎడిటర్ చాదస్తం. రచనల్లో పసలేకపోయినా, ఎడిటర్ రికమెండేషన్. పత్రికలు రాణించడానికి ఒకప్పుడు ఎడిటర్ల నిజయితీ కారణం అయితే విజయవాడ, హైదరాబాదు పత్రికలకు కేంద్రాలు అయిన తర్వాత పత్రికల పతనానికి, ఎడిటర్ల అవినీతి చర్యలు కారణం అయ్యాయి. అవినీతి అంటే లంచాలు తీసుకోవడమే కాదు. ఆశ్రితపక్షపాతం, అయోగ్య రచనలు ప్రచురించడం, వైదికధర్మ పునరుద్ధరణకు, దేవాలయాల ప్రాచుర్యానికి పత్రికలు గొడుగు పట్టడం కారణాలయ్యాయి. ఎడిటర్లు రాజకీయపార్టీలకు, నాయకులకు తమ అభిమానాన్ని తాకట్టుపెట్టడం, అమ్ముడుపోవడం మరొక పెద్ద కారణం. స్వర్ణయుగం నుండి పతనం చెందిన పత్రికలు. పత్రికల్లో ఉద్యోగం అంటే అసహ్యం వేసింది. అఫ్‌కోర్స్ అప్పటికే రిటైర్‌మెంట్ దగ్గరపడింది.

# నాబాట వెలుగుబాట

ఆఫీసు పని ఆఫీసు వరకే పరిమితం.

ఇంటికి మోసుకొచ్చే ప్రసక్తి లేదు సాయంత్రం అయిదు అవగానే బయలుదేరి ఇంటికి చేరడం, ఆరుగంటలకు ప్రేయర్. ఒక సినిమా లేదు, షికారు లేదు, సాంస్కృతిక కార్యక్రమం లేదు. ఎంత చాకిరి చేసినా ఉద్యోగంలో మెప్పులేదు. వచ్చే ప్రమోషన్స్ లేవు జీతం పెరగదు. అదనపు చాకిరీ ఎందుకు చేయాలి. పైవారి అసూయ అడుగడుగునా అవరోధం. ఎలా ఉద్యోగం పీకించివేయాలా అని ఎడిటర్ ప్రయత్నం. రెండు మూడుసార్లు రిజైన్ చేశాను అసలు జర్నలిస్టు ఉద్యోగమే అసిధారావ్రతం. రేపటికి ఉద్యోగం వుంటుందన్న గ్యారంటీ ఎవరికీ వుండదు. సీనియర్స్‌కు, కీలక పదవుల్లో ఉన్నవారికి ఆ బాధ, ప్రమాదం మరీ ఎక్కువ. సబ్-ఎడిటర్‌గా ఉన్నంతకాలం ఫరవాలేదు. ఎవరిని పెద్దగా పట్టించుకోరు. పనిచేసినా చేయకపోయినా సాగిపోతుంది నా పరిస్థితి ద్విముఖం. నన్ను తొలగించడం అసాధ్యమని ఎడిటర్‌కు తెలుసు. అయినా తన యత్నం మానడు. ఇతరత్రా పనిలో కసి తీర్చుకుంటాడు. ప్రభలో ఎడిటర్ అనే వాడి ఉద్యోగాయుర్దాయం గట్టిగా ఉండదు. పది సంవత్సరాల పాటు ఎడిటర్‌గా ఎవరూ ఉండరు. ఉండనీయరు. అయినా వారి పొగరు, పెత్తనం అనూహ్యం. వీలైనంతలో తనవారిని ఇరికించ ప్రయత్నిస్తారు. పాతవారికి ఎలాగో ఎసరు పెట్టాలనీ చూస్తారు. ఒక్కొక్కరు రెండూ సాధిస్తారు. ఒక్కొక్కరు ఏ ఒక్కటీ సాధించకపోగా, తన కుళ్లు బుద్ధికి ప్రతిఫలంగా తనే రాజీనామా చేసి పోవలసివస్తుంది. ఇది 'ప్రభ'లో అద్వితీయమైన దుష్టసంప్రదాయం.

ఆఫీసులో అస్థిరత వల్ల నా జీవితం యోగంవైపు ఎక్కువ మొగ్గు చూపింది. ప్రతికూల పరిస్థితి, అభద్రత కారణం. ఉద్యోగం ఏ క్షణంలోనైనా పోతుందని తెలిసిన తర్వాత భయంపోయింది. పోతే పోయింది. ఈ పత్రిక కాకపోతే మరొక పత్రిక. ఇరవై సంవత్సరాల అనుభవం ఉన్నవాడిని. ఏ పత్రికవారైనా ఆదరిస్తారు. రచయితగా కొంత

పేరుంది గొప్ప కవిని, గొప్ప రచయితను కాకపోవచ్చు. కలంజీవిగా గుర్తింపు ఉంది. ఏవో పుస్తకాలు రాసి, ప్రచురించి, బిజినెస్ చేసుకోగలను. హస్తసాముద్రికం ఒకటి ఉండనే ఉంది రోజూ పదిమందికి జ్యోతిషం చెప్పినా గడుస్తుంది. ప్రభలో యిచ్చే జీతం కన్నా ఎక్కువే సంపాదించవచ్చు. అదొక భరోసా . అదొక ధీమా. అదొక ఆత్మతృప్తి.

అప్పుడే ఒక సంఘటన జరిగింది. 'అమ్మ'గా ప్రసిద్ధురాలైన జిల్లెల్లమూడి అమ్మ- రాజరాజేశ్వరీదేవి అపరావతారంగా భక్తులచే కొలువబడుతున్న అమ్మకు 'హార్టటాక్' హైదరాబాదు వచ్చింది చికిత్సకోసం ఆమెను గురించి, మద్రాసులో ఉండగా తెలుసు. అమ్మపై డాక్యుమెంటరీ తీసినప్పుడు పత్రికల్లో ప్రచారానికని వచ్చిన కొండముది రామకృష్ణతో నాకు పరిచయం ఉంది. ఇప్పుడు అమ్మకు గుండెజబ్బు రోజూ చాలాసార్లు వచ్చి ప్రమాదం సూచిస్తోంది. నాకు తెలియదు ఇందుర్తి ప్రభాకర్ అమ్మభక్తుడని ఒకరోజున ప్రేయర్‌కు వచ్చి విషయం చెప్పాడు. "జిల్లెల్లమూడి అమ్మ తీవ్ర అనారోగ్యంతో ఉన్నది అమ్మకు ట్రీట్‌మెంట్ ఇమ్మని మాస్టరుగారు మీతో చెప్పమన్నారు" అన్నాడు.

"మాస్టరుగారు నీకు ఎప్పుడు కనిపించారు. ఎలా కనిపించారు?"అని అడిగాను

"ఉదయం ప్రేయర్‌లో అలా అనిపించింది."

"అనిపించడం కనిపించడం కాదు అనిపించడం ఆర్డరు కాదు మాస్టరుగారు నాతోనే చెప్పవచ్చు గదా! నాకూ అనిపించేటట్లు చేయవచ్చు. మాస్టరుగారు నన్ను ట్రీట్‌మెంట్ చేయమని ఎందుకు అడుగుతారు? తానే చేస్తారు! అయినా జిల్లెల్లమూడి అమ్మ సాక్షాత్తు రాజరాజేశ్వరి అవతారం అంటారు గదా! అలాంటి కారణజన్మురాలికి, అవతారమూర్తికి నావంటి సామాన్యుడు ట్రీట్‌మెంట్ చేయడం, చేయ ప్రయత్నించడం ప్రపంచ వింతల్లో మరో వింత అవుతుంది" అన్నాను.

"అలా కొట్టిపారేయవద్దు గురూజీ... మాస్టరుగారి సంకల్పం లేనిది నాలో ఆ భావన కలగదు, ఆ స్పందన ఏర్పడదు కదా!"

"అయితే ప్రభాకర్ మీరే వెళ్లి చేసిరండి. నాకంత సాహసం లేదు."

ప్రభాకర్ పట్టు విడవలేదు. అతని ప్రేరణకు కారణం నాకు బోధపడలేదు. నేను కాస్త మెత్తబడ్డాను అనడం కంటే ప్రభాకర్ విజయం పొందాడని చెప్పాలి. అయితే ఎలా? ఏం చేయడం? ఎలా చేయడం? నేను అమ్మను ఎన్నడూ చూడలేదు. తనూ చూడలేదట. ప్రయత్నిస్తానని వెళ్లాడు.

ఆమె పంజగుట్ట జర్నలిస్టు కాలనీలో ఉంది. ఇద్దరం ఆటో చేసుకుని వెళ్లాం. అంతవరకు బాగానే వుంది. జనం కొండవీటి చాంతాడంత పొడవుగా బారులు తీరి

వున్నారు ఓ నలభై కార్లు ఆగివున్నాయి. ఆమె విశ్రాంతి తీసుకుంటున్న ఇల్లు భక్తులతో కిటకిట లాడుతోంది. ఎవరినీ లోపలకు అనుమతించడం లేదు అయినా భక్తులకు ఆశ ఒక్కసారి దర్శనం చేసుకోవాలని అసలే జబ్బుతో వున్నది ఏమవుతుందో! గంటల కొలది జనం ఎండలో నిరీక్షిస్తున్నారు అంతమందిని కాదని మాకు ప్రవేశం ఎలా లభిస్తుంది?

ప్రభాకర్‌తో అన్నాను "లోపల కొండముది రామకృష్ణ ఉంటారు. ఆయనను కలుసుకో. వీలు కలగవచ్చు"

ఆ జనసమ్మర్దాన్ని చీల్చుకుని ప్రభాకర్ లోపలికి వెళ్లి, నా విషయం ఆయన చెవిలో చెప్పాడు. ఆయన వెంటనే లేచి, లోపల గదిలో పడుకుని వున్న అమ్మకు చెప్పారు అమ్మ అంగీకారం తెలిపింది బయటకువచ్చి నన్ను తీసుకు వెళ్లారు. ముగ్గురం అమ్మగదికి వెళ్లాం దూరం నుండి నమస్కరించి ప్రేయర్‌కు కూర్చున్నాం. నాపద్ధతి ప్రకారం 45 నిమిషాలు ప్రార్ధన సాగింది. ట్రీట్‌మెంటు వైబ్రేషన్స్ బాగా వచ్చాయి ఫలితం నేను చెప్పలేదు. సెలవు తీసుకుని వచ్చేశాం . మిరకిల్. ఆరోజే ఆమెకు పూర్వస్థితి చేకూరింది. మర్నాటికి మామూలైంది నాల్గవరోజున జిల్లెల్లమూడి వెళ్లిపోయింది

ఆ సంఘటన మా ఎడిటర్‌గారిపై చాలా ప్రభావం చూపింది. ఆయన 'అమ్మ' భక్తుడు. అప్పుడప్పుడు జిల్లెల్లమూడి వెళ్లి అమ్మ చేతి గోరుముద్దలు తిని వస్తుంటాడు. అలా వెళ్లినప్పుడల్లా అమ్మ నా గురించి అడిగేది "నాయన శార్వరి బావున్నాడా" అని. అదీ ఆమె ఆప్యాయత అమ్మకు నాపట్ల అంతటి ప్రేమాదరాలు ఉన్నందున ఈయనగారు నాపట్ల ప్రేమ, అభిమానం పెంచుకోసాగారు. నాయోగం పట్ల ఆఫీసులో చాలామందికి సద్భావన ఏర్పడింది. అసలు ఇలా యోగం, సాధన అనేవారు ఉద్యోగాలు చేయలేరు దానికి, దీనికి పొసగదు ఉద్యోగ నిర్వహణకు అవసరమైన అడ్డమైన పనులు, అవినీతిపనులు వీరు చేయలేరు. అవినీతిగా ప్రవర్తించనివాడు ఇతరులను మోసం చేయనివాడు ఈనాడు అసమర్థుడు. బ్రతకడం చేతకానివాడు. నాపైనా ఆ ముద్ర పడ్డది. అయినా నా బ్రతుకు నాది.

అంతకు మునుపు ఒకసారి మా ఎడిటర్ పొత్తూరివారు వారింటికి నన్ను పిలిచారు."జిల్లెల్లమూడి అమ్మ వస్తున్నారు. బహుకొద్దిమందిని మాత్రం పిలుస్తున్నాను మీరూ రండి". నేను యోగం చేస్తానని వారికి తెలుసు. ఎవరినీ ద్వేషించను. నావల్ల ప్రమాదం వుండదు. నాకు ఏ స్వాముల్ని, అమ్మల్ని దర్శించడం యిష్టం వుండదు. ఒక మార్గంలో వున్నవారు అలా అందరినీ దర్శించకూడదు. మనస్సు వికలమవుతుంది. అవతలి వ్యక్తి తక్కువని కాదు. అనవసరం ఉండదు. ఏ మార్గాన్ని అనుసరించేవారైనా,

తన మార్గానికే కట్టుబడి ఉండాలి. తన దైవాన్ని మాత్రమే ఆరాధించాలి అలా ఉండడం నాకిష్టం. సరే! పెద్దవాడు, ఎడిటర్, ప్రేమగా పిలిచారు కదా అని వెళ్లాను. అక్కడ ఎడిటర్ దంపతులు అమ్మకు పాదపూజ చేశారు. పద్ధతి బావుంది. అవసరం కూడా నేమో అనిపించింది తర్వాత వరుసగా అమ్మ పాదాలకు నమస్కరించారు పక్కన వున్న రామకృష్ణ అందిస్తుండగా అమ్మప్రసాదం భక్తులకు యిచ్చారు. నాకు ఇష్టంలేదు అలా పాదాభివందనం చేయడం మా యోగంలో అది నిషేధం అవునోకాదో తెలీదుకాని ఎవరూ అనుసరించరు గురు సంప్రదాయానికే మేము వ్యతిరేకం మాస్టర్‌గారిని తప్ప ఇతరుల్ని గురువుగానైనా ఆమోదించలేము అలాంటిది మరొకరికి పాదాభివందనం చేయడం సాధ్యం కానిపని నేను తటపటాయిస్తుండగా పాత్తూరివారు పిలిచారు "శార్వరిగారూ, అమ్మ ఆశీస్సులు తీసుకోరూ!"అని "నేను నమస్కరించను" అన్నాను అమ్మ నావైపు తీక్షణంగా చూడ ... లేచి వెళ్లి మామూలుగా నమస్కరించాను. ప్రసాదం ఇవ్వబోగా "అలవాటు లేదు" అని తప్పుకున్నాను.

నాకు అనిపించింది ఆరోజే 'అమ్మ' కంటిలో నేనొక నలుసునైనానని. నన్ను మరచిపో పని. తర్వాత ఆమెకు యోగా ట్రీట్‌మెంట్ రెండవసంఘటన.

అప్పుడే ప్రభాకర్ అడిగారు అమ్మ ఎంతకాలం జీవిస్తుందని 'మూడు సంవత్సరాల, రెండు నెలల, ఒక రోజు...' రక్కున మాట వచ్చింది నోటివెంట. అంతే జరిగింది. నామాట ఆనోట ఆ నోట అమ్మ చెవిని పడ్డది. ఆమెకు నాపైన ఇష్టం మరీ ఎక్కువైంది.

\+ \+ \+

అప్పుడే అమ్మ షష్టిపూర్తి ఉత్సవాలు జరిగాయి.'త్యాగరాయగానసభ' సెక్రటరీ పరబ్రహ్మమూర్తి అమ్మ భక్తుడు. మా పి వి.రమణకు, ఇందుర్తి ప్రభాకర్‌కు మిత్రుడు. ఆ సందర్భంగా త్యాగరాయ గానసభలో మూడురోజుల కార్యక్రమం ఏర్పాటుచేశారు. ఉదయం, సాయంత్రం ప్రసంగాలు. ఒకసావనీర్ ప్రచురించారు. సావనీర్‌లో నా అనుభవం రాశాను. అమ్మకోరికపై ఒకరోజు నా ఉపన్యాసం ఏర్పాటు చేశారు. రెండవరోజు ఉదయం వక్తలు. శ్రీ దివాకర్ల వెంకటావధాని, లక్ష్మణ యతీంద్రులు, నేను, మరికొందరు... నేను ఒక గంటపైగా యోగవిద్యపై ప్రసంగించాను. యోగశక్తితో ట్రీట్‌మెంట్స్ చేసే పద్ధతిని సైంటిఫిక్‌గా చెప్పాను నా ప్రసంగం అయిన తర్వాత దివాకర్ల వెంకటావధానిగారు గట్టిగా నన్ను కౌగలించుకుని ఆనందబాష్పాలు రాల్చి "శార్వరిగారూ! వయస్సులో మీరు నాకంటే చాలా పిన్న కనుక పాదాభివందనం చేయలేకపోతున్నాను. మీకు నా ఆశీస్సులు.

మీరు కారణజన్ములు" అన్నారు. లక్ష్మణ యతీంద్రులు మా పూర్వాశ్రమ పరిచయాలు స్మరించి ఆలింగనం చేసుకుని "శార్వరీ మీరు నా మిత్రులు కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను" అన్నారు సజలనయనాలతో.

అమ్మతో నాకు ఆత్మానుసంధానం కలిగిన అనుభూతి. నేను ఎవరికీ భక్తుడిని కాను. వల్లమాలిన భక్తి, ఇష్టం ఎవరిపైనా లేవు. ఎవరిపైనా అయిష్టత లేదు సత్యసాయి, జిల్లెళ్ల మూడి అమ్మ మనకాలంలో ఆధ్యాత్మికరంగంలో ప్రాచుర్యం పొందినవారు. వారిపట్ల గౌరవం వుంది అని వారి దర్శనానికి వెళ్లింది లేదు. అమ్మను రెండు పర్యాయాలు చూచాను. చూపులు కలిశాయి. ఆత్మలు స్పందించాయి అనురాగం జాలువారింది. కరుణ పొటమరించింది. అనుభూతి ఆత్మీయతగామారి అనుబంధంగా కాక, ఆత్మానుసంధానం జరిగింది. శక్తి ఎవరినుండి ఎవరిలోకి ప్రవహించినా ప్రయోజనమే అమ్మప్రేమను పొందాను. అమ్మప్రేమ మనిషికి జీవం పోస్తుంది. జిల్లెళ్లమూడి అమ్మ నాకు స్ఫూర్తినిచ్చింది ఆమె ప్రేమ నాలోనూ ప్రేమబీజాలు నాటింది. అంతవరకూ పాషాణంగా వుండిన నా హృదయం కాస్త మెత్తబడసాగింది సాధుత్వం నాలో చోటు చేసుకోసాగింది

హిమాయత్‌నగర్‌లో రామానుజాచారి ఇంట్లో అమ్మపూజ పెట్టారు. పెద్దరికం పరబ్రహ్మమూర్తిది, మా ప్రభాకర్‌ది. నన్ను ఆహ్వానించారు ప్రభాకర్ వెంట వుండి తీసుకువెళ్లాడు అలా వెళ్లడం నాకు ఇష్టం లేదు. అయినా తప్పలేదు అమ్మ నిలువెత్తు ఫోటో రంగులు దిద్ది అలంకరించారు దీపాలు వెలిగించారు. భజన చేశారు. హారతి యిచ్చారు. జనం చాలామంది వచ్చారు. సాయంత్రం ఆరుగంటలైంది. నా యోగ నియమం అక్కడి పెద్దలకు తెలుసు. అందరూ భోజనాలకు వెళ్లారు నేను, ప్రభాకర్ ప్రేయర్‌కు కూర్చున్నాం. ఇద్దరికీ స్పందన కలిగింది. తీవ్రంగా వైబ్రేషన్స్ వచ్చాయి నా ప్రేయర్ గంటసేపు సాగింది. చైతన్యంతో ఊగి, తూగి పోయాను. కళ్లు విప్పలేదు. అలాగే లేచి అమ్మ ఫోటో ముందర అంగన్యాస, కరన్యాస ఆరాధన చేశానుట. గోడవార నిలబడే ధ్యానంలో వుండిపోయాను. ఒక దివ్యమాత అనుగ్రహం కలిగింది. మహాశక్తి నన్ను ఆవహించి నాలోకి ప్రవహించింది. గంటసేపు ఆ సమాధిస్థితి కొనసాగింది. కళ్లు విప్పిన తర్వాత కూడా ఒక గంటసేపు నేను కదలలేని స్థితి. అమ్మలో దివ్యశక్తి ఉంది. అది మహాశక్తి. ఆ శక్తి మొత్తం నాలోకి ప్రవహించింది. ఆ తర్వాత అమ్మ జీవించి ఉన్నది రెండు సంవత్సరాలే. అప్పుడప్పుడు ఆమె పరామర్శ, ఆశీస్సుగా నాకు అందుతూనే ఉండేది.

# సావిత్రి రచన

'సా విత్రి' అంటే గాయత్రి...

సత్యసంపూతమైన గాయత్రియే సావిత్రి నా 'సావిత్రి' రచనకు ఒక కారణం, ఒక ప్రేరణ ఉంగి మద్రాసులోవున్న కాలంలో యోగా పుస్తకాలు విపరీతంగా చదవడం అలవాటు అరవిందయోగి రచనలు కూలంకషంగా అధ్యయనం చేశాను అందులో కొరుకుడు పడనిది, అర్థం కానిది ... సావిత్రి. ఎక్స్‌ప్రెస్ లైబ్రరీలో సావిత్రి రెండు ప్రతు లుండేవి. ఒకటి ఎప్పుడూ నా దగ్గరే ఉండేది ఎన్నిసార్లు చదివేనో చెప్పలేను 'డివైన్‌లైఫ్' చదివాక సావిత్రి అర్థం కాసాగింది. అది వచనం, ఇది పద్యం. అర్థం కాకపోయినా సావిత్రిని చదువుతుంటే అదో తృప్తి ఆత్మశాంతి .. ఏవో లోకాలలో విహరించి వస్తున్న భావన సాహిత్యపరంగా అర్థం కాలేదు గానీ చదివినంత మేరకు అనుభూతి మిగిల్చింది. అదే సావిత్రి రచనలో అరవిందయోగి లక్ష్యమా? కాదు. ఇంకా ఏదో ఉంది. అందులోనే ఉంది కిటుకు. 'లెజండ్ అండ్ ది సింబల్' అన్నారు. రేఖామాత్రంగా కథ తెలుస్తుంది. 'సింబల్' అరవిందులు ఆశించింది.

ఒక రోజున నా చేతిలోని 'సావిత్రి'ని చూచి డాక్టరు బాలసుందరరావుగారు తనకిమ్మని తీసుకున్నారు. చదివారు. అర్థం కాలేదు అయినా వదలలేదు. ఏదో ఆకర్షణ. ఒక కొత్తపుస్తకం తెప్పించుకున్నారు. నాలుగైదు నెలలు ప్రయత్నించారు. ఆ పుస్తకం నాకు యిచ్చి, 'ఇందులో ఏదో విశేషం వుంది శార్వరీ! ఎప్పటికైనా దీనిని నీవే తెని గించాలి. ఈ పని మరొకరి వల్ల కాదు. యోగం చేసేవాడికి తప్ప సావిత్రి అర్థం కాదయ్యా! అరవిందుని స్థాయిలోని యోగి తప్ప దానిని అనువదించలేడని నా అభిప్రాయం. నీవే ఎప్పటికైనా సావిత్రిని తెలుగులో యోగపరంగా రాయగలవని నాఅంతరాత్మ చెబుతోంది' అని ఆ పుస్తకం నాకిచ్చారు. అదే గురువు ఆజ్ఞ, ఆశయం. వారికి నా పట్ల ప్రేమ, వాత్సల్యం మెండు. అప్పటికి అది నాకూ అర్థం కాలేదు. పుస్తకాన్ని భద్రంగా దాచిపెట్టుకున్నాను .

హైదరాబాద్ వచ్చాక యోగసంబంధమైన కార్యక్రమా లేవీ లేవు. మా గురువుగారు పోవడంతో మద్రాసులోనే బంద్ అయ్యాయి. దగ్గిర మిత్రులు నలుగురు ప్రేయర్ చేసుకోవడం. అంతే హైదరాబాదులో అసలు యోగం చేసే వారుంటారని అనుకోలేదు. ఇక్కడి సంస్కృతి వేరు, జీవనవిధానం వేరు. అక్కడ అరవగోల, ఇక్కడ ఉర్దూగోల అందుకే చాలారోజులు కిమ్మనకుండా ఉండిపోయాను. మద్రాసులో బిజీబిజీగా వుండేవాడిని. ఇక్కడ పనిలేకుండా కూర్చోవడం ఒక 'శాపం' అయింది. దానికి తోడు కుటుంబ పరిస్థితులు, ఆఫీసులో అలజడులు డి నారాయణరావు, డి. నరసింహారావు తప్ప ఎప్పుడో వచ్చి పలకరించే యోగమిత్రులూ లేరు. శిష్యులు లేరు. కొత్తగా రాసిన పుస్తకాలు లేవు

సావిత్రి బయటకు తీశాను. వ్యాపకాలు లేవు ఒత్తిడులు లేవు ఈసారి సావిత్రి అర్ధం కాసాగింది హుషారుగా చదివాను బ్రహ్మాండంగా వుంది ప్రతివాక్యం అరటిపండు ఒలిచి పెట్టినట్లు అర్ధం కాసాగింది. అరవిందుని ఫోటో ఒకటి సంపాదించి, ధ్యానించాను. ఆయన నుండి ఆశీస్సు లభించినట్లయింది. గురువుగారిని స్మరించి కాగితం, కలం తీసుకుని 'మాస్టర్ నమస్కారం'తో ప్రారంభించాను. మొదటి వాక్యం రాయడానికి వారంరోజులు పట్టింది. కావ్యారంభం కదా! నేను కవినికాదు అయినా కవిత్వం రాయాలి. సావిత్రి ఆఫీసులో మిత్రులు జి.కృష్ణ లాంటి వారికి చూపాను విద్వాన్‌విశ్వంగారు, తిరుమల రామచంద్ర ఇలా ఎందరికో చూపించాను మూలవాక్యం ఇది, నా అనువాదం ఇది. ఎవరూ బాగాలేదని అనలేదు. బ్రహ్మాండం అనలేదు. మూలం అర్ధం అయితే గద! నా తెలుగు వాక్యానికి విలువ కట్టడానికి చివరకు 'ఇంగ్లీషువాక్యం అర్ధం ఎలావున్నా నీవు రాసింది చాలా బాగుంది' అన్నారు ఇంక ఎవరికీ చూపించకూడదనుకున్నాను.

రోజుకు నాలుగైదు లైన్లు కన్న సాగేది కాదు. వేయిపేజీల మహాగ్రంథం, ఎప్పటికి పూర్తయేను? అసలు పూర్తవుతుందా? అనుమానమే. కాకపోతే నష్టం ఏమిటి? ఏం లేదు. ఎవరికోసం రాయడం? నా కోసం! నా తృప్తికోసం! రాయకపోతే నిద్రపట్టదు. కనుక రాయడం సాగించాను. ఒక్కొక్క పదానికి ఎన్ని అర్ధాలు నిఘంటువులు దగ్గర పెట్టుకున్నాను. అన్ని పదాలు కలిపితే అర్థం రావాలి. అర్థం కావాలి! తల తోక కనిపించని భావం ఏదో మదిలో కదలాడేది. ఆ భావాన్ని పట్టుకుని క్రిందకి దిగివచ్చి దాన్ని తెలుగు అక్షరాలలో బంధించడం అలవాటైంది.

ఎప్పుడో చదివిన లాటిన్ అక్కరకు వచ్చింది. ఎం.ఎ. చదివే రోజుల్లో లాటిన్ అవసరమైంది. ఇప్పుడు సావిత్రిని రాయడానికి లాటిన్ అవసరమైంది. లాటిన్ భాషతో

ఏ మాత్రం పరిచయం లేకపోతే సావిత్రి అర్థం కాదు. అరవిందుని హృదయానికి దగ్గరగా పోలేము. ఒక అధ్యాయం వ్రాయడానికి ఆరునెలలు పట్టింది చదివితే పరమ భయంకరంగా వుంది ఏం రాశానో, ఎందుకు రాశానో నాకే అర్థం కాలేదు. రాసిందంతా చించి అవతల పారవేసి, మళ్లీ మొదలుపెట్టాను ఈసారి భాష జటిలంగానే సాగింది అర్థం అయీ అవనట్లు ... స్పష్టత లేకపోయినా రేఖామాత్రంగా ఒక చిత్రణ, మనోయవనికపై ఒక మెరుపు, .. ఓ వెలుగు .. ఫరవాలేదనిపించి తృప్తిపడ్డాను మరో ఆరునెలల కాలం పట్టింది. ఇలాంటి రచనలకు మనస్సు, పాండిత్యం ప్రధానం కాదు. హృదయం, ఆర్ద్రత. హృదయం స్పందించాలి అనుభూతి కలగాలి అంటే అస్పష్టంగా రసతృష్ణను తీర్చడం. మొత్తానికి నా సావిత్రిలో ఏదో మర్మం, ఏదో అంతర్లీనంగా మెదిలే బావం ఉందని అనిపించింది. అరవిందులే అన్నారు 'ఇది భవిష్యత్ కవిత' అని ఎవరికీ అర్థం కాకపోయినా ఫరవాలేదు. రాసిన నాకు తృప్తి కలిగితే చాలు అలా రాయగా రాయగా తృప్తి పెరిగింది. కొన్ని రచనలు మనస్సుకు తృప్తి కలిగిస్తాయి. కొన్ని మాత్రమే హృదయానికి తృప్తి కలిగించ గలుగుతాయి. సావిత్రి రాసింది నాకోసం, నా తృప్తికోసం. అచ్చుకావాలని, ఇతరులు మెచ్చుకోవాలని రాయలేదు. అందుకే తృప్తిగా సాగింది రచన ఫలాపేక్ష లేదు కదా! పుస్తకం అచ్చుకావాలన్న దృష్టీ లేదు పాఠకులు లేని రచన సావిత్రి పాఠకుల్ని తానే తయారు చేసుకున్న మహాకావ్యం సావిత్రి.

రచయితకు రాయడం ఎంత ముఖ్యమో రాసింది అచ్చుకావడం అంతే ముఖ్యం. ఒకపత్రికలో అచ్చుకావడం వేరు. పుస్తకంగా రావడంలో ఎక్కువ సంతృప్తి వుంటుంది. అచ్చుకానప్పుడు రాయాలనిపించదు. రాసి ప్రయోజనం కనిపించదు. ఇప్పటికి నావి 50 పుస్తకాలు అచ్చయాయి. ఇప్పుడు ప్రతి రచనకీ ఒక ప్రయోజనం వుంటుంది. ఉబుసుపోకకు రచన చేయబుద్ధి కావడం లేదు. సావిత్రిని ప్రారంభించిన నాడే కథలు, నవలలు రాయడం మానివేశాను. ఉద్యోగ ధర్మంగా పత్రికలో చిల్లరమల్లర రచనలు చేయక తప్పదు. పుస్తకం అచ్చుపడకపోతే రచయితకు ఆత్మహత్య చేసుకున్నట్లు. అవమానంగా భావిస్తాడు ... ఓ పెద్ద నాయకుడు గెలిచీ, మంత్రిపదవి దక్కించుకోలేక పోయినట్లు.

సావిత్రి మొదటి భాగం రచన పూర్తయింది. అచ్చువేసే శక్తిలేదు. రెండువేలు కావాలి! సాహిత్యఅకాడమీ రచయితలకు ఆర్థికసహాయం చేస్తుందని ఎవరో సలహా యివ్వగా అప్లికేషన్ జతచేసి, స్క్రిప్టు పంపాను. సాహిత్యఅకాడమీ పెద్దలు ఎవరూ నాకు పరిచయం వున్నవారు కారు. డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులు, దేవులపల్లి రామానుజరావు కార్యదర్శి. ఇద్దరిదీ చెరి ఒక రకమైన చాదస్తం.

ఆరునెలలు గడిచింది కొందరి పుస్తకాలకు ఆర్థికసహాయం అందింది నా పుస్తకానికి రాలేదు. మరో ఆరునెలలు గడిచింది. మళ్లీ లిస్టులోకి రాలేదు తర్వాత లిస్టులో పేరు వచ్చింది శాంక్షన్ చేసేది బెజవాడ గోపాలరెడ్డి. బుచ్చిరెడ్డిపాలెం వెళ్లి ఆయన దర్శనం చేసుకుంటే పని అవుతుందని అకాడమీ గుమాస్తా చెప్పాడు. ఛస్తే ఆ పని చేయను నా వల్ల కాదు ఆయన మాట పెళుసు విశ్వనాథ సత్యనారాయణగారి వలె ఎత్తిపొడుపు లెక్కువ

ఎవరినీ కాకా పట్టడం నాకు చేత కాదు. అలా చేయగలిగితే నాకు చాలా అవార్డులు వచ్చేవి. కళాప్రపూర్ణ, డాక్టరేట్ ఎప్పుడో సంపాదించుకునేవాడిని. వంగి వంగి దణ్ణాలు పెట్టడం, నంగినంగి మాటలు, నక్కవినయాలు నాకు చేతకాదు. సాహిత్యఅకాడమీ సాయం అందని ద్రాక్ష అని నిర్ధారించుకున్నాను దర్శనం చేసుకుని, కాకాపడితే తప్ప గోపాలరెడ్డి ప్రసన్నులు కారు ఆ పని నేను చేయను గాక చేయను. తర్వాత నాలుగు రోజులలోనే డబ్బు శాంక్షన్ చేసినట్లు కాగితం వచ్చింది

'సావిత్రి' మొదటిభాగం 'మహోదయం' అభిప్రాయం కోసం ముందుగా డా॥సి నారాయణరెడ్డి గారికి పంపారుట వారు ఆరునెలలు గడిచాక స్క్రిప్టు పంపారు గానీ అభిప్రాయం రాయలేదు. తర్వాత మరొకరికి పంపితే, ఆయన ఆరునెలలు వుంచుకుని తనకు అర్థం కాలేదని పంపాడు. మూడవసారి ఉస్మానియా ఇంగ్లీషు ప్రొఫెసర్ అడపా రామకృష్ణారావుగారికి పంపారు. అది ఆంగ్ల 'సావిత్రి' కి అనువాదం కదా! వారైతే తులనాత్మకంగా పరిశీలించగలరని అకాడమీ అభిప్రాయపడ్డది వారు రెండు వారాలలోనే తన అభిప్రాయం పంపారు. చాలా గొప్ప విలువైన పుస్తకం. వీలైనంత ఎక్కువ మొత్తం గ్రాంటు చేయవలసిందిగా సిఫార్సు చేశారుట. సాధారణంగా ఒక్కొక్క పుస్తకానికి వేయి రూపాయలు సహాయంగా యిస్తారు. మహోదయానికి రెండువేలు ఇచ్చారు. ఆలస్యం అయినా మంచి పనే జరిగింది. మా అబ్బాయి వసంతకుమార్ పిహెచ్.డి. సీటు కోసం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి డా॥ రామరాజు, డా॥సినారెలను కలుసుకోవడానికి వెళ్లినప్పుడు అడపా రామకృష్ణారావు నన్ను చూచి గుర్తించి పలకరించి, ఈ సంగతి చెప్పారు. రామకృష్ణారావు గుంటూరు ఎ.సి.కాలేజీలో మాకు లెక్చరర్

సావిత్రి మొదటిభాగం 'మహోదయం' ఆవిష్కరణ అశోక్‌నగర్ సిటి గ్రంథాలయంలో జరిగింది. డా॥ సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. వారన్నారు, "నా 'విశ్వంభర'కు పోటీ నీ 'సావిత్రి' అని నేనన్నాను, 'నేను ఏ అవార్డులు కోరను. ఇది ఒక మహాయజ్ఞం రెడ్డిగారూ." వారు రాస్తున్న 'విశ్వంభర' జ్ఞానపీఠ్ అవార్డు తెచ్చిపెడుతుందని

మా అందరికీ తెలుసు. సి.నా.రె. వేదిక నుండి అన్నారు "సావిత్రి మంచి చెడులను విశ్లేషించే తూనికరాళ్లు నావద్ద లేవు. అరవిందుని 'సావిత్రి' చాలాసార్లు ప్రయత్నించాను అర్థం కాలేదు. ఇప్పుడు శార్వరి 'సావిత్రి' ద్వారా అరవిందుని దర్శిస్తున్నాను. శార్వరి సావిత్రిని చూస్తే నాకు అసూయగా వుంది, గర్వంగానూ వుంది శార్వరి మనవాడు, తెలుగుకవి అయినందుకు మనం గర్వించాలి."

వారి అభిభాషణ నాకు కొత్త ఊపిరులు అందించింది. మిగిలిన భాగాలు నిరాశతో నిలిపివేయక రాత కొనసాగించమని భుజం తట్టారు. శ్రీ రెడ్డిగారు పూలమాల వేసి సత్కరించ ప్రయత్నించగా వినయంగా తిరస్కరించి 'రెడ్డిగారూ, మొత్తం పన్నెండు భాగాలు పూర్తిచేయగలిగితే చివరిభాగం ఆవిష్కరణ మీ చేతుల మీదుగానే జరిపిస్తాను అప్పుడు మీరు పూలమాలతో అభినందించవచ్చు అప్పటివరకు మాలలు, శాలువలు వద్దు." అన్నాను

సావిత్రి రచన ఒక మహాసాహిత్య యజ్ఞం. పవిత్రంగా రాయవలసి వచ్చింది .ప్రతిరోజు యోగం చేసిన తర్వాతనే రచనకు ఉపక్రమించేవాడిని. అదొక తపస్సు యోగసాధకుడు మాత్రమే సావిత్రిని అర్థం చేసుకోగలడు అంటారు పెద్దలు. సాధనలో కొన్ని మెట్లు అయినా ఎక్కి అరవింద భూమికలకు చేరుకుంటే తప్ప సావిత్రి రచన సాధ్యపడదు నేను ఆ భూమికలు చేరానో లేదోగానీ రచనాకాలంలో ఆ మహాయోగి నా అంతఃకరణలో నా వెంటే ఉండి, నా కలం నడిపించారు అంతకాలం నా గురుదేవులు మాస్టరు సి.వి.వి. నన్ను అనుగ్రహిస్తూ వచ్చారు.

మహోదయంపై పత్రికలలో సమీక్షలు బాగా వచ్చాయి. చదివిన పెద్దలు ఆశీర్వదించారు. అభినందించారు. శ్రీశరభాచార్య అనే గణితావధాని, డి ఇ ఓ. 'ఆంధ్ర అరవింద' అని ప్రశంసించి సంస్కృత శ్లోకాలు అయిదు రాసి ఆశీఃపురస్కారంగా అందించారు. అరవిందాశ్రమంవారు పుస్తకాలు 200 వరకు తెప్పించుకున్నారు. కొందరి ప్రోద్బలంతో ఆచార్య తిరుమల ఆంధ్రభూమిలో మారుపేరుతో ఘోరంగా విమర్శించాడు. తర్వాత తెలిసింది అది రాసింది ఆయనని. కనిపించినపుడు 'థాంక్స్' చెప్పాను. అయితే ఒకమేలు చేసింది ఆ కువిమర్శ నన్ను నేను అద్దంలో చూచుకున్నట్లు, ఆ విమర్శలో నా లోపాలు గుర్తించి 'మహోదయం' మొత్తం అతి సరళ భాషలో తిప్పి రాశాను. అప్పటికే మొదటిముద్రణ ప్రతులు చెల్లిపోయాయి. మొదటివర్షన్‌లోని ఒక్కపాదంకూడా రెండవవర్షన్‌లో లేదు. చాలా తేలిక భాషలో, అతి సామాన్యపాఠకునికి అర్థం అయ్యేరీతిలో రాశాను. అప్పటికి రెండు, మూడు భాగాలు అన్వేషణ, స్పందన పూర్తిచేయడం వల్ల బాగా

చేయితిరిగింది 'సావిత్రి' రచనలో అరవింద నుడికారం పట్టుబడ్డది ఆ మహాయోగి ఆంగ్లంలో ఉపయోగించిన ఛందస్సునే శ్రమించి, తెలుగు నుడికారంలోకి పట్టుకు రాగలిగాను కనుక పట్టు దొరికింది.

నా యోగానికి సావిత్రి రచన ఒక మలుపు 70లో ప్రారంభించిన యోగసాధన 77లో హైదరాబాదు వచ్చేవరకు ఒకఅధ్యాయం 78 నుండి 85 వరకు ఏడు సంవత్సరాలు సాగిన సావిత్రి రచన ఒక పూర్ణయోగ ప్రస్థానం. నా సత్యయోగానికి పూర్ణయోగం తోడైంది బహుశా అరవిందులు, మాస్టరుగారు సమకాలికులు కావడం కారణం కావచ్చు పాండిచేరికి కుంభకోణం దూరంకాదు. పూర్ణయోగానికి సత్యయోగం భిన్నం కాదు. రెంటికి చాలా పోలికలున్నాయి అనిపించింది.

లోగడ ఎన్నో పుస్తకాలు రాసినవాడిని కథలు, నవలలు, నాటకాలు,కవితలు, నృత్యనాటకాలు ఎన్నో రాశాను. యాభై పుస్తకాలు అచ్చయినాయి. 'సావిత్రి' తెచ్చి పెట్టిన పేరు మిగిలిన పుస్తకాలను మరుగున పడవేసింది. శార్వరి సావిత్రి రచయితగా మిగిలాడు. అదొక మహాయజ్ఞం. శ్రీరాం భుజంగరాయశర్మ, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా॥ అరిపిరాల విశ్వం, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ, డా॥ వి.వి ఎల్ నరసింహారావు, డా॥ ఎం శివరామకృష్ణ, డా॥ వాసిలి వసంతకుమార్ వంటి సాహితీపరులు ముందుమాటలు రాశారు. సావిత్రిలోని మేలి సొబగుల్ని ఎత్తిచూపారు ఆవిష్కరణ సభలలో ప్రసంగించినవారు చాలామంది ఉన్నారు. కన్నడ సాహితీవేత్త డా॥ నడకర్ణి, డా॥ తూమాటి దొణప్ప, జ్ఞానపీఠ్ గ్రహీత డా॥సి.నారాయణ రెడ్డి, డా॥ ముదిగొండ శివప్రసాద్, శ్రీ ఆచార్య తిరుమల, శ్రీజ్వాలాముఖి, డా॥ రావూరి భరద్వాజ ... ఎందరో ప్రసిద్ధ కవులు, రచయితలు అభినందన సుమాలు విరజల్లారు. శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు పారవశ్యంతో నా సావిత్రిని 'ఆంధ్రమహాసావిత్రి' అని నూరు పేజీల పరిశోధన వ్యాసం రచించి 'భారతి'కి తిలకం దిద్దారు. వ్యాస, వాల్మీక మహర్షుల పక్కన ఆంధ్రమహాసావిత్రి కర్త శార్వరిని, ఉన్నతాసనంపైన ఉపవిష్ఠుని చేశారు.

తెలుగులో శార్వరి 'సావిత్రి' మూలరచన అన్నంత సుమధురంగా, సముజ్వలంగా సాగిన ప్రబంధం అని ఆచార్య బిరుదరాజు రామరాజు, దివాకర్ల వెంకటావధానివంటి పుంభావ సరస్వతులు కొనియాడారు. సావిత్రి దివ్యప్రబంధాన్ని తెలుగువారికి అందించే అవకాశం కలగడం నా అదృష్టం. నన్ను ఆధ్యాత్మిక శిఖరాల నుండి ఆశీర్వదించి నడిపించిన మాస్టర్‌గారికి, అరవిందయోగికి ఆత్మనమస్కృతులు.

# "మహాయాత్ర"కు సన్నాహం

చిన్నచిన్న అబద్ధాలు చెప్పకుండా వుండలేం. ఈనాటి ప్రపంచంలో నిత్యవ్యవహారాలలో సత్యసంధతకు బొత్తిగా అవకాశం లేదు మరి, యోగం చేసేవారు అబద్ధాలాడవచ్చునా! అందునా సత్యయోగవిష్టులు.. ఆఫీసుల్లో, ఉద్యోగాలలో, వ్యాపారాలలో నిత్యం, అడుగడుగునా ఏదో ఒక అబద్ధం అవసరానికో, సమయానికో, ఆడకతప్పదు. లేకపోతే కొంపలు మునిగిపోతాయి కష్టాలు, నష్టాలు వస్తాయి. సత్యం మాత్రమే పలుకుతాను. అసత్యం పల్కను అని శపథం చేస్తే మహాత్ములు, అవతారపురుషులు సైతం ఓడిపోక తప్పదు. అయితే ఆపద్ధర్మంగా ఆడే అబద్ధం వేరు అసత్యం వేరు. అబద్ధం మన జీవనబద్ధతకి, నిబద్ధతకి సంబంధించిన వ్యవహారం. అసత్యం ధర్మానికి, హృదయానికి సంబంధించింది. ఒక చిన్న తప్పుచేయడం, ఒక చిన్న అబద్ధం ఆడడం సహజమే కావచ్చు కానీ వాటి పర్యవసానం చిత్రంగా ఉంటుంది.

నేనొకసారి అలాంటి చిత్రమైన అనుభవం పొందాను. అప్పటినుండి అబద్ధం అంటే భయం పట్టుకుంది. మా అబ్బాయి వసంతకుమార్ ఎం.ఏ. అయిన తర్వాత ఒక సంవత్సరం లెక్చరర్‌గా చేశాడు. రెండవ సంవత్సరం అది మాని ప్రెస్ పెట్టాలనుకున్నాడు. ఉద్యోగం చేయడం ఇష్టంలేక కాదు ... అవకాశం లేక. ప్రెస్ అయితే స్వేచ్ఛగా బ్రతకవచ్చునని. మా నాన్నగారు పోవడం, తెనాలిలో ఇల్లు అమ్మడం, ఆ డబ్బుతో కనీసం ఒక జాగాకూడా సంపాదించుకోలేకపోవడం జరిగింది. నా జాతకంలో పిత్రార్జితం అనుభవించే యోగం లేదు. నలభై వేలతో ఒక చిన్న ప్రెస్ కొన్నాం. ఒక ట్రెడిల్, కొన్ని కేసులు, టైపు, ఓ కటింగ్ మెషిన్. అరవైవేలతో చిన్న యూనిట్ తయారైంది. మా సొంత పుస్తకాలతో ప్రెస్ ప్రారంభించాం.

తనకి పిహెచ్.డి. చేయాలనే కోరిక కలిగింది. తెలుగు ఎం.ఏ. చేసి ఫస్ట్‌క్లాసులో పాసైన ప్రతివ్యక్తి పిహెచ్.డి. కోసం ప్రయత్నిస్తాడు. ఉత్త ఎం.ఏ.తో ఉద్యోగం రావడంకష్టం.

తను మద్రాసులో ఎం ఏ చేశాడు. ఉస్మానియా రూల్స్ ప్రకారం తాను నాన్‌లోకల్. ఎం.ఫిల్ కు అప్లికేషన్ పెట్టాడు. అప్పటికి నాకు యూనివర్సిటీ పెద్దలతో పరిచయం లేదు ఎడిటర్ విద్వాన్‌విశ్వంగారి చెవిన వేశాను. ఆయన ప్రొఫెసర్ రామరాజు గారికో, నారాయణరెడ్డి గారికో చెప్పారు. వారికి సాహిత్య అకాడమీ చుట్టరికాలు ఎక్కువ ఎం ఫిల్, పిహెచ్ డి ఇంటర్వ్యూలు రేపు అనగా మా అబ్బాయికి తీవ్రంగా జ్వరం వచ్చింది అప్పటికి నాలుగు రోజులుగా జ్వరం, కదలలేని పరిస్థితి అశోక్‌నగర్‌లోని రామచంద్రన్ అనే డాక్టరువద్దకు తీసుకువెళ్లాను. అతని హస్తవాసి చాలా మంచిది.ఈ ఊరు వచ్చినప్పటినుండి ఆయనే మా డాక్టరు. రెండు రూపాయల కంటే ఫీజు ఎక్కువ తీసుకోడు మందులకు రెండుమూడు రూపాయలు చార్జీ చేస్తాడు. నావంటి పేదలకు ఆయన ఇష్టుడు ఆయన దగ్గరకు తీసుకువెళ్లి అర్థించాను "డాక్టరుగారూ రేపు అబ్బాయికి పిహెచ్ డి ఇంటర్వ్యూ ఉంది ఎలాగైనా ఇంటర్వ్యూకు వెళ్లాలి. ఎలాగైనా జ్వరం తగ్గించండి. లేకపోతే ఒక సంవత్సరం చదువుపోతుంది."

ఆయన ఒక ఇంజక్షన్ ఇచ్చి పంపాడు. సాయంత్రానికి జ్వరం తగ్గింది. అది వేరే సంగతి. ఆస్పత్రి వదలి బయటకు వచ్చి రిక్షా ఎక్కగానే వసంత అడిగాడు "పిహెచ్.డి. ఇంటర్వ్యూ అన్నారేమిటి? నేను అప్లైచేసింది ఎం.ఫిల్ కి కదా నా ఇంటర్వ్యూ ఎం.ఫిల్‌కి. మరచిపోయారా?"

"కరెక్ట్. డాక్టరుగారి దగ్గర నేను అబద్ధం చెప్పాను!"

మర్నాడు ఇంటర్వ్యూకి వెళ్లాడు. కొన్ని సాంకేతికమైన కారణాల వల్ల వసంతకు ఎం.ఫిల్.లో సీటు ఇవ్వలేదు. కాని సరాసరి పిహెచ్.డి కి సీటు వచ్చింది. శ్రీరామరాజుగారికి, శ్రీ నారాయణ రెడ్డిగారికి కృతజ్ఞతలు చెప్పి వచ్చాను.

ఇక్కడ నేను అబద్ధం చెప్పినట్లా? కాదు, సత్యమే పలికినట్లు! అంతర్వాణి సత్యం పలికించింది అప్పటినుండి నాకు భయం ఏ మాట చెప్పాలన్నా. పొరపాటున నోటివెంట ఒకమాట వస్తే అది నిజమైపోతుంది! అబ్బ ఎంత కష్టం నిజం చెప్పడం! పొరపాటున కూడా చెడు ఆలోచించను. చెడు చెప్పను. గాంధీగారి మూడు కోతుల కథ లోనిరెండు కోతులు నాలో ప్రవేశించాయి.'చెడుకనకు' అని కళ్లుమూసుకుని నడవలేం కదా! కనుక మూడవకోతి ఎదుటివారిలో గంతులు వేస్తూనే ఉంది.

\+ \+ \+

ఒకనాడు ఆఫీసులో ఉండగా సెక్రటేరియట్ నుండి ఫోన్ వచ్చింది. ఎడిటర్ గారి గదిలో ఫోన్ ఉంటుంది. ఆయన వచ్చి 'భాట్టం శ్రీరామమూర్తి ఫోన్ చేస్తున్నాడు' అని చెప్పాడు.

"నాకా?" అని ఆశ్చర్యపోయాను వారు మినిస్టర్ సాంస్కృతిక వ్యవహారాల మంత్రి ముఖ్యమంత్రి అంజయ్యగారి హయాంలో నాకు వారితో వ్యక్తిగతమైన పరిచయం లేదు ఫోన్ తీసుకుని 'నమస్కారం' చెప్పాను.

"మిమ్మల్ని కలవాలి. ఎప్పుడురమ్మంటారు" అని అడిగారు.

"మీరు రావడం ఎందుకు?నేనే మీవద్దకు వస్తాను.ఇప్పుడు రమ్మంటారా?"

"వద్దు సాయంత్రం మీ ఇంటికి వస్తున్నాను" అని ఫోన్ పెట్టేశారు.

మా ఇల్లు ఆయనకు ఎలా తెలుసు? ఏం పని?

ఒక మంత్రిగారు రాదగిన ఇల్లు కాదు మాది. చిన్న ఇల్లు. ఆయన మందీమార్బలంతో వస్తే, నిలబడడానికి చోటు చాలదు. మా ఇంట్లో ఉన్నవి రెండే కుర్చీలు, ఒక టేబిల్ నేను రాసుకునేందుకు, ఎవరైనా వస్తే కూర్చునేందుకు ఒక కుర్చీ. సాయంత్రం ఆయనకోసం మరో రెండు కుర్చీలు పక్కఇళ్ల నుండి తెప్పించాను యామినీదేవికి కాఫీ ఫలహారాలు సిద్ధం చేయమని చెప్పాను ఆయన వచ్చే పని తెలియదు. అయినా మినిస్టర్ కదా! సాయంత్రం ఆరుగంటలకు రెండుకార్లు వచ్చి గుమ్మం ముందు ఆగాయి. ఎదురువెళ్లి స్వాగతం పలికాను ఆయన వెంట జె.వి సోమ యాజులు, పి ఎస్ ఆర్ అప్పారావు వచ్చారు. వారిద్దరు సెక్రటరీలు. లాంఛనంగా లోపలకి వచ్చి, మళ్లీ వెళ్లిపోయి కారువద్ద నిలబడ్డారు ... మినిస్టర్‌గారికి ఏకాంతం కల్పించి

"కుచేలుని ఇంటికి శ్రీకృష్ణుడు వచ్చాడు" అన్నాను.

ఆయన నిరాడంబరంగా, తృప్తిగా నవ్వారు.

"మీ పుస్తకాలు చదివాను యోగంలో చేరాలని కోరిక నాకు ఇనీసియేషన్ ఇవ్వండి"

"మీకు యోగం చేసే వ్యవధి వుండదేమో! బిజీ కదా?"

"ఫరవాలేదు. వెసులుబాటు చేసుకుంటాను."

"అయితే రండి. లోపల కూర్చుందాం."

లోపలి గదిలో నాతోపాటు ప్రేయర్‌లో కూర్చోబెట్టుకున్నాను. వసంతకుమార్, వెంకటరమణ, యామినీదేవి, నేను... శ్రీరామమూర్తిగారు ప్రేయర్ చేశాం. ఆయన ఒక గంటసేపు కూర్చోగలిగారు ప్రశాంతంగా.

అలా నా యోగంలో హైదరాబాదులో చేరిన రెండవవ్యక్తి భాట్టం శ్రీరామమూర్తిగారు.

"రోజూ రాలేను. వీలైనప్పుడు వస్తుంటాను ఇంట్లో చేసుకుంటాను" అని చెప్పారు ప్రార్థన రాసి యిచ్చాను.

మరొకసారి శ్రీ రామమూర్తిగారు తన శ్రీమతిని తీసుకువచ్చారు ఆమె పేరు సతిదేవి కాస్త స్థూలకాయురాలు. నేలపైన కూర్చోవడం కష్టం కుర్చీలో కూర్చునేది. ప్రేయర్ కుర్చీపైన కూర్చుని చేయడం నాకిష్టం వుండదు ఎవరైనా సరే, చాపపైన కూర్చోవలసిందే లేకపోతే వైబ్రేషన్స్ తట్టుకోలేరు ఆమెకు కాళ్లు మడత పడవట. కాళ్ళుచాపుకుని కూర్చుంటే ఏం బావుంటుంది.

"నేను చూచుకుంటాను. గోడవారగా కూర్చోండి" అని ప్రేయర్‌కు కూర్చోబెట్టాను. రెండు నిమిషాలలో ఆమె చాలా ఫ్రీగా సుఖాసనంలోకి వెళ్లిపోయి గంటసేపు ధ్యానం చేసుకోగలిగింది. ఆ తర్వాత ఆమెకు కాళ్లుపట్టటం లేదు. ఎప్పుడు వచ్చినా హాయిగా, ఫ్రీగా అందరిలా నేలపైనే కూర్చునేది ఆయనా అంతే! మంత్రిననే అభిజాత్యం లేదు లావుగా వున్నా, తర్వాత చిన్నపిల్లలా చలాకీగా మారింది

ఒకసారి ఆయన వెంట విశాఖజిల్లా శాసనసభ్యులు నలుగురు వచ్చారు వారు పక్కన వుండగా ఈయనకు చాపపై కూర్చోవడం నామోషీ అనిపించింది.

"నేను ఇక్కడ కుర్చీలో కూర్చుని ప్రేయర్ చేసుకుంటాను మీరు లోపల గదిలో చేసుకోండి" అన్నారు.

"మీ ఇష్టం అలాగే"

ఎవరి ఇష్టాన్ని కాదని నేను రూల్స్ పెట్టను. నియమాలు, నిబంధనలు ఉంటాయి. పాటించడం వారివారి యిష్టం, అనుకూలం. ఈ నిబంధనలు పాటించకపోతే యోగం చేయకూడదు అనను. నిబంధనలు డిసిప్లిన్ కోసం మనం పెట్టుకున్నవి.

ఆయన ముందరి గదిలో కుర్చీలోనే కూర్చున్నారు. మేం లోపలి గదిలో కూర్చున్నాం. కొంతసేపటికి ఎవరో నేలపైన పడ్డట్టు 'ధన్' మని శబ్దం వచ్చింది. ప్రేయర్‌లో మునిగిన తర్వాత ప్రళయం వచ్చినా లేవను. బ్రహ్మరాక్షసి వచ్చి మీదపడినా చలించేది లేదు. ఆ పడ్డది మంత్రిగారు. బయట గదిలో కూర్చున్న పెద్దమనిషి 'ధన్' మని కిందపడి, పాకుతూ, దేకుతూ లోపలి గదిలోకి వచ్చి మా వెనక కూర్చుండిపోయాడు.

ప్రేయర్ అయిన తర్వాత అడిగాను.

"ఇక్కడికి ఎప్పుడు వచ్చారు?"

"ఏమో తెలీదు నేను బయట కూర్చున్నా."

క్రిందపడటం, దొర్లుకుంటూ రావడం ఆయనకు తెలీకుండానే జరిగిపోయింది. ఆ తర్వాత ఎన్నడూ కుర్చీలో కూర్చుని ప్రేయర్ చేసుకుంటానని అనలేదు.

ఆయన మంత్రిగా వున్నంత కాలం ప్రేయర్‌కు వచ్చేవాడు తర్వాత కాంగ్రెస్‌ను వదలి తెలుగుదేశంలో చేరాడు. పార్లమెంటుకు ఎన్నికైనాడు. అప్పుడు ఎం పి హోదాలో వస్తుండేవాడు.

ఒకసారి ఆయనకు జబ్బులు పట్టేసి చేతులు పైకి లేచేవి కావు. ఎందరు డాక్టర్లు చూచినా, ఎన్ని వైద్యాలు చేసినా తగ్గలేదు. పదిరోజులపాటు యోగా ట్రీట్‌మెంట్‌కు వచ్చారు. రాత్రి ఎనిమిది తొమ్మిది గంటల ప్రాంతంలో వచ్చేవారు లాల్చీ తొడుక్కునేందుకు లేదు. ఉత్తరీయం పైన కప్పుకుని వచ్చేవాడు. తొమ్మిదిరోజుల ట్రీట్‌మెంట్‌తో రోగం కుదిరింది. అప్పుడు మినిస్టర్స్ కాలనీలో వుండేవారు ఒకటి రెండు సార్లు నన్ను తీసుకువెళ్లారు. వారి వల్లనే న్యూఎమ్మెల్యే క్వార్టర్స్‌లో చాలామంది మంత్రులతో, శాసనసభ్యులతో పరిచయం,స్నేహం ఏర్పడ్డది. హైదరాబాదులో నా యోగకార్యక్రమం అలా మొదలైంది

+ + +

నేను చేస్తున్న యోగం గురించి ప్రచారం చేసుకోను ఎవరికీ చెప్పను వారంతట వారు తెలుసుకుని వస్తే, అడిగితే నాలుగు మాటలు చెబుతాను. మరీ వెంటపడితే తప్ప యోగంలో చేర్చుకోను. ట్రీట్‌మెంట్స్ అంతే ఇంక డాక్టర్లవల్ల నయంకాని కేసులు అయితేనే యోగ చికిత్సకు అంగీకరిస్తాను. డాక్టర్ల వల్ల మందులవల్ల తగ్గే జబ్బులకు యోగచికిత్స చేయడం నాకు ఇష్టం వుండదు. తలనొప్పి, కడుపునొప్పి, జ్వరం వస్తే డాక్టరు వద్దకు వెళ్లి వైద్యం చేయించుకొమ్మని సలహా యిస్తాను వైద్యానికి లొంగని జబ్బులైతేనే యోగం...

మా ఇంటి ఎదురుగా డాక్టర్ రంగాచారిగారు వున్నారు. అప్పుడప్పుడు పలకరించేవారు. ఆయన భార్య రేడియోలో పాడుతుంది. ఆమె జై సంతోషిమా భక్తురాలు. అమె వ్రతం చేస్తూ పేరంటానికి పిలిచి దక్షిణ రవికలగుడ్డ యివ్వగా నా శ్రీమతి తీసుకోలేదు. మేం యోగం చేసుకుంటాం ... ఇలాంటివి తీసుకోకూడదని తిరస్కరించింది. రంగాచారి డాక్టరైనా అరవిందయోగి భక్తుడు. ఆయన ఆచార్య రజనీష్ అభిమాని. నేను తొలిసారిగా రజనీష్ పుస్తకాలు ఆయన వద్దనే తీసుకుని చదివాను. అప్పట్లో నాకు ఎలాంటి అభిమానం కలగలేదు. రజనీష్ అంటే ఒక అయిష్టత, ద్వేషం ఏర్పడ్డది. భాట్టంగారు మా ఇంటికి రావడం రంగాచారి గారు గమనించారు. వీడేదో కాస్త గట్టివాడే అయివుండాలి, లేకపోతే మినిస్టర్‌గారు తరచుగా ఇంటికి రావడం ఏమిటి అని నా పరిచయం పెంచుకున్నారు. ఆయన భార్య రాకపోకలు సాగించింది. అప్పుడప్పుడు

ఇంట్లోకివచ్చి యోగవిషయాలు, వేదాంత విషయాలు మాట్లాడేవాడు. నేను 'సావిత్రి' రాస్తుండడం వల్ల ఆయన నాకు మరింత సన్నిహితం కాగలిగాడు

ఆయనకు ఒక కూతురు వున్నది చాలామంది ఆడపిల్లలు తర్వాత కలిగారు అప్పట్లో సన్నగా, తీగలా, నాగుపాములా వుండేది ఆ పిల్లకు నాగదోషం వుంది రాత్రిళ్లు మెలికలు తిరుగుతూ నేలపైన పాకుతూ మంచాల సందున దూరి తలుపు వెనక నక్కినక్కి పడుకునేది. నిద్రపోయేది కాదు పాముకళ్లతో భయంగా చూస్తుండేది ఆ పిల్లకళ్లు చూస్తే పెద్దవాళ్లే దడుచుకునేవారు. సరిగా అన్నం తినేది కాదు. తాను డాక్టరు అయ్యి ఆ పిల్లకు వైద్యం చేయలేక పోయాడు. పాపం! అది జబ్బు కాదు కదా! యోగంతో నన్ను ట్రీట్‌మెంట్ ఇమ్మని అర్థించాడు. ఎదురింటివాడు. డాక్టరు. మంచివాడు. కాదని ఎలా అనగలను? పదిరోజులపాటు రోజూ ఉదయం, సాయంత్రం ఆరుగంటలకు తీసుకురమ్మని చెప్పాను. తొమ్మిదిరోజుల ట్రీట్‌మెంట్‌తో ఆపిల్లకు బాగైంది. మామూలు ఆ వయసు పిల్లలా మారిపోయింది. ఆయనకు నా యోగం చేయాలని కోరిక. కాని నేను పెట్టిన కండిషన్స్‌కు భయపడ్డాడు అతను నాన్-వెజ్ అది మానలేక యోగానికి గుడ్‌బై చెప్పాడు. అభిమానం వుంది. యోగం పట్ల గౌరవం వుంది. మరి నాన్ వెజిటేరియన్ అయివుండి అరవిందునియోగం ఎలా చేస్తున్నాడో అర్థం కాలేదు. చాలామందికి యోగం చేయాలని ఉన్నా వెజిటేరియన్స్‌గా మారడం యిష్టంలేక యోగం జోలికి రావడం లేదని నాకు తెలుసు. యోగంలో చేరిన తర్వాత 'తినుడు' పై మనస్సు మళ్లి యోగం' మాని వేస్తారుగానీ నోరు కట్టుకోరు మధువు, మాంసం ఏ యోగానికైనా పనికిరావు విదేశాలలో యోగం చేసేవారుసైతం తాగుడు, మాంసాహారం మానివేయగలుగుతున్నారు. మనదేశంలో అగ్రవర్ణాలని విర్రవీగేవారు ఈ అలవాట్లు మానుకోలేకపోతున్నారు

తన కుమార్తెకు ట్రీట్‌మెంట్ చేయించుకున్న ఘంటప్ప ఆదోనిలో, కర్నూలులో బాగా ప్రచారం చేశాడు. మద్రాసులో నా వద్ద ఇనీసియేషన్ తీసుకున్న రంగనాధరావు తన సోదరుడు కృష్ణమాచారికి యోగం గురించి చెప్పి ఒకసారి మద్రాసు వచ్చాడు. ఆ కృష్ణమాచారి కర్నూలులో పోస్టల్ ఇన్‌స్పెక్టర్‌గా వుండి యోగాసెంటర్ ప్రారంభించాడు. ఆదోనిలో ఘంటప్ప ద్వారా చాలామంది యోగంలో చేరారు వారిలో రఘునాధ్ అనే అతనికి బాగా వైబ్రేషన్స్ వచ్చేవి. అతనికి మాస్టర్‌గారు కనిపిస్తారని చెప్పేవాడు. అతనిలో మాస్టరు ప్రవేశించాడని అతనే మాస్టరు అని ప్రచారం సాగింది. ఆ అబ్బాయిని నా వద్దకు తీసుకుని వచ్చారు. ఆ కుర్రవాడు ట్రాన్స్‌లోకి వెళ్లిపోయి మాస్టరుగారితో మాట్లాడతాడని ఏవో సందేశాలు ఇస్తాడని చెప్పారు. ఆ అబ్బాయిని ఒక గురువును, మాస్టరును చేయాలని అతని తల్లి కోరిక.

నా దగ్గరకు వచ్చారు. ఆమె సినిమాల్లో హీరో తల్లి మేకప్‌తో వుంది. మంచి కంచిపట్టుచీర కట్టింది సాయంత్రం అందరం ప్రేయర్‌కు కూర్చున్నాం. ఆమె, ఆమెగారి కొడుకు ముందు వరసలో మాస్టర్‌గారి ఫోటోకు దగ్గరగా కూర్చున్నారు నేను దూరంగా, చివరగా కూర్చోవలసి వచ్చింది మేము మామూలుగా ప్రేయర్ చేసుకున్నాం. రఘునాథ్‌కి ఆశించిన వైబ్రేషన్స్ ఏవీ రాలేదు. ట్రాన్స్‌లోకి వెళ్లలేదు సందేశాలు యివ్వలేదు. అతనికి చెమట్లు పోశాయి. తల్లీ కొడుకులు బిక్కమొహాలు వేసి సిగ్గుతో వెళ్లిపోయారు.

మాస్టరుగారి అనుగ్రహం చేజారిపోయిందని వాపోయారు మాస్టరుగారి అనుగ్రహం చేజారిపోవడానికి మనలో పెంచుకున్న అహంకారమే కారణమని వారు గ్రహించలేదు. ఇప్పటికీ అహంకారంతోనే సాధకులు మాస్టరుగారి అనుగ్రహాన్ని పోగొట్టుకొంటున్నారు మాస్టరుగారికి ఒకరు ఎక్కువ కాదు ... తక్కువ కాదు. ఎవరు చక్కగా సాధన చేస్తే వారే మాస్టరు యోగానికి దగ్గరవుతారు. మాస్టరుగారి యోగశక్తిని పొందగలుగుతారు. అహంకారం పెంచుకున్నవారు దూరమై, యోగ భ్రష్టులవుతారు. మరొకమారు వచ్చినప్పుడు ఘంటప్ప చెప్పాడు ఆ అబ్బాయి యోగం మానివేశాడని, వాళ్లకి వైష్ణవం ఎక్కువట శ్రీకృష్ణుడు, గీత, భాగవతం ఇవీ వారి ఆరాధ్యాలు. మాస్టరు యోగాన్ని ఆసరాగా చేసుకుని వైష్ణవ ప్రచారం చేశారట. గోదాదేవి కథలు చదవడం, పాశురాలు పాడడం, శ్రీకృష్ణలీలలు ఇవి వారికి ఇష్టం మాస్టరుయోగం చేస్తున్నట్లు జనానికి నమ్మచూపి వారికి కృష్ణలీలామృతాన్ని దోసిళ్లతో పంచిపెట్టేవారు. యోగానికి మతానికి సంబంధం లేదు. యోగాన్ని అడ్డుపెట్టుకుని మత ప్రచారం చేయడం ఆత్మద్రోహమే అవుతుంది.

ఘంటప్ప నిజాయితీగా యోగం చేశాడు. అతనంటే మిగిలినవారికి పడదు. వారిలాగా తప్పటడుగులు వేయడు. తప్పుడు పనులు చేయడు. ప్రచారం అభిలషించడు. అతను యోగంతో మాస్టరుగారి 'అనుగ్రహం' బాగా పొందగలిగాడు. నిజాయితీగా యోగం చేసేవారికి ప్రచారం అక్కరలేదు.

అలా అప్రయత్నంగా యోగసాధకులు నన్ను వెతుక్కుంటూ రాసాగారు. కోరి మరీ ట్రీట్‌మెంట్స్ చేయించుకునేవారు. నాకు ట్రీట్‌మెంట్స్ చేయడం రాదు. టెక్నిక్ తెలియదు. యోగానికి సంబంధించి చాలా చాలా కోర్సులు వున్నాయని వినడమే తప్ప చూచింది లేదు. దిడుగు నారాయణరావుగారి దయవల్ల ప్రిపరేటరీ కోర్సులు ఆరు మాత్రం సాధన చేశాను. మిగత కోర్సులు నాకు దొరకలేదు.

అప్పట్లో ఒక పెద్ద రాష్ట్రప్రభుత్వోద్యోగి నా వద్దకు వచ్చాడు. ఆయన పేరు మరిచిపోయాను. ఆయనకు ఉబ్బసం. రోగం ముదిరింది. హోమియో వాడుతున్నాడు.

గుణం లేదు యోగం ద్వారా ట్రీట్‌మెంట్ కోరాడు. చేశాను కొంతవరకు తగ్గింది పూర్తిగా తగ్గిపోతుందన్న నమ్మకం ఆయనకు, నాకు కలిగింది. ఆయనకు జ్యోతిషం వచ్చునట నా పుట్టినతేదీ అడిగాడు జాతకచక్రం యిచ్చాను తాను మరల గుణించి, చక్రం వేసి తెచ్చాడు. చాలా స్టడీ చేశాడు బిందువర్గు కూడా వేశాడు. యోగంలో నా స్థానం నిర్ణయించాలని ఆయన ప్రయత్నం కాని ఆయన చూపు శనిపైన పడ్డదో శనిదృష్టి ఆయనపైన పడ్డదోగాని నేను 52 సంవత్సరాలు మించి బ్రతకనని, అయిదవ ఇంట శని ధనుస్సులో వున్నాడట. శని ధనురాశిలో బిందువులు శూన్యం బలం లేదట కనుక శనికి ధనుస్సులోకి వచ్చి రాగానే నాకు మారకం తప్పదట. ఆయనకు నేను యోగంతో రోగం నయం చేసినందుకు ప్రతిఫలంగా నాకు మారకం భయం పెట్టాడు లోగడ కూడా కొందరు ఇలాగే చెప్పారు. ఆ వయస్సులో మారకం కాకపోతే సంసారం వదిలి సన్యాసుల్లో కలిసిపోతానని ఉపశమన వాక్యాలు చెప్పిన వారున్నారు. ఈయన ఏకంగా ప్రాణానికి ముప్పు తెచ్చిపెట్టాడు

చిక్కడపల్లిలో క్రాస్‌రోడ్స్ వద్ద నా మిత్రుడు వున్నాడు . వి వి రావుగారు. ఆంధ్రభూమిలో సబ్ ఎడిటర్ మంచి జ్యోతిష్కుడు ఆయనకు జాతకం చూపించాను. ఆఫీసర్ చెప్పిన ఫలాలు చెప్పి మరణం తప్పదా అని అడిగాను. "మీకు సాముద్రికం తెలుసుగదా చేయి చూచి చెప్పండి" అన్నాడు. "రేఖలలో అలాంటి దోషం లేదు పైగా అదే వయస్సులో జీవిత రేఖ నుండి ఒక ఊర్ధ్వరేఖ బయలుదేరి శనిస్థానం వైపు పోతున్నది అది మంచి మలుపు. దానివల్ల కీర్తి ప్రతిష్టలు పెరుగుతాయితప్ప మారకం జరగదు." అన్నాను.

"కరెక్ట్! మీరు యోగం చేస్తారు కదా! మీ పైన గ్రహాల ప్రభావం ఉండదు. మామూలు జాతకులకైతే అతను చెప్పిన దోషం, మారకం ఉంటుంది. కాని మీకు వుండదు. యోగబలం ఉన్నవారిని, గ్రహ బలహీనతలు ఏమీ చేయవు. మీరెప్పుడూ జాతకఫలాలను నమ్మకండి. వాటి ప్రకారం జీవితం నడవదు. ఇది నా అనుభవం. ఉపాసకులకు, యోగులకు గ్రహదోషాలు అంటవు." అని ధైర్యం చెప్పాడు.

చావంటే నాకు భయం లేదు. ఎప్పుడో ఒకరోజున చావవలసిందే! యోగాన్ని నమ్ముకున్నాను. యోగం చేసేవారికి ఆయుష్షు పెరుగుతుందని పెద్దలు చెప్పారు. కనీసం పదిసంవత్సరాల ఆయుర్దాయం అదనంగా మాస్టరుగారు గ్రాంట్ చేస్తారని నమ్మకం. ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. అంతా మాస్టర్‌గారి దయ. పిల్లలింకా ప్రయోజకులు కాలేదు. చదువులే పూర్తి కాలేదు. అమ్మాయి పెళ్లి చేయాలి. అందరికన్న

చిన్నది అమ్మాయి. కనుక ముందు వసంతకుమార్ పెళ్ళి చేయాలని సంకల్పించాం. అప్పటికి తనకింకా ఉపనయనం కాలేదు ఉపనయనం కాకపోతే తండ్రికి కర్మచేసే అర్హత వుండదు యోగంలో వున్నా ఆలోచనలు సంప్రదాయక పొరల్ని దాటడం లేదు యోగికి కర్మ అవసరం లేదు కాని నేను ఇంకా ఒక యోగిని అయినానా! కానప్పుడు యధావిధిగా కర్మాంతరాలు నిర్వహిస్తారు కదా నేను వద్దని వారించినా సమాజం మిన్నకుండదు. క్షమించదు.

పెళ్లి అనుకోగానే ముందు ఇల్లు మారవలసి వచ్చింది అంతవరకు వుంటున్న ఇల్లు చిన్నది. రెండు గదులు, ఒక కిచన్, ఒక సెపరేట్ బెడ్‌రూమ్ ఉన్న ఇల్లు కావాలి బ్యాంక్ కాలనీలో అట్లాంటి ఇల్లు దొరికింది. వెంటనే మారిపోయాం. ఇల్లుమారగానే ప్రెస్ ప్రారంభోత్సవం మద్రాసు నుండి వచ్చినబంధువు అడవికొలను నాగేశ్వరరావుగారు వారి పెద్దమ్మాయి మణిగ-కూరిని వసంతకు ఇవ్వచూడడం, అందరికీ అంగీకారం కావడం చకచకా జరిగాయి ప్రెస్‌పెట్టిన కొద్దిరోజుల్లో పెళ్లి జరిగింది ఒకపక్క పిహెచ్ డి పరిశోధన, ఇటు ప్రెస్ నిర్వహణ

పరిస్థితులు మన చెప్పు చేతల్లో వుండవు కష్టాలు ఎదురైతే తప్ప భగవంతుడు జ్ఞాపకం రాడు నేను భగవంతుని ప్రక్కకుపెట్టి చాలా సంవత్సరాలైంది. యోగం, మాస్టరుగారు ఇవే సర్వస్వం. యోగశక్తి నన్ను ఆదుకోవాలి లేకుంటే మాస్టరుగారు ఆదుకోవాలి దేవుని వేడుకోవడం అన్నది లేదు. దేవాలయాలకు వెళ్లేది లేదు. ఇంతకన్నా చెడేది లేదు మృత్యురేఖపై నిలిచినవాడిని. భయందేనికి? ప్రెస్ నడుస్తోంది. వసంత తన బాధ్యతపై నడుపుతున్నాడు పైకి తీసుకువస్తాడన్న నమ్మకం ఏర్పడ్డది మా సోదరుడు డాక్టర్ వి.వి ఎల్. నరసింహారావు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి డైరెక్టర్‌గా వచ్చాడు. వారి ప్రింటింగ్ పనులన్నీ వసంతకుమార్ సంపాదించాడు యూనివర్సిటీ పరిచయాల వల్ల మరికొన్ని అచ్చుపనులు, సాహిత్య అకాడమీ, తెలుగు అకాడమీ పుస్తకాలు వచ్చాయి. ప్రెస్‌లో ప్రింటింగ్ మెషిన్ కొనక తప్పలేదు. వర్కర్ల సంఖ్య పెరిగింది. ప్రెస్ పనుల్లో పడి వసంత పరిశోధన పని నిర్లక్ష్యం చేశాడు. అది మనస్సులో కలుక్కుమనిపించినా భరించక తప్పలేదు. పిహెచ్.డి వస్తే కాలేజీ లెక్చరర్ అవుతాడని, జీవితం ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగుతుందని ఆశ.

నేను ప్రెస్ పెట్టడం ఆఫీసులో పెద్దలకు కంటగింపు అయింది. ఒకడు బాగుపడుతుంటే ఏడ్చేవాళ్లు ఎక్కువ ఎడిటర్ మహాశయులు నన్ను బెంగుళూరుకో, విజయనగరానికో బదిలీ చేయించాలని ప్రయత్నించారు. అయిదారు వందల జీతం

పెంపుతో రెసిడెంట్ ఎడిటర్ హోదాతో విజయనగరంలో పెట్టే కొత్తఎడిషన్‌కి పొమ్మన్నారు. ఎక్కడికీ వెళ్లడం నాకిష్టం లేదు. కారణం ఎక్కడికి పోయినా రెండు చోట్ల సంసారాలవు తాయి. పిల్లల చదువులకు సంపాదన చాలదు యోగం వేళకు చేసుకోవడం కుదరదు ప్రమోషన్ సున్నితంగా తిరస్కరించాను. రిటెన్‌గా ఇమ్మన్నారు నా తర్వాతి వారికి ప్రమోషన్ కావాలిట. ఇచ్చాను నా జూనియర్స్ అయిదారుగురికి ప్రమోషన్స్, పదవులు వచ్చాయి. జీతం పెరిగింది. నాకు అసూయ లేదు దిగులు లేదు. వీక్లీ నుండి డెయిలీకి మారాను ఎ బి.కె.ప్రసాద్‌గారి సాయం మరువలేనిది

మొదటి నుండీ జర్నలిజంలో నాకు గాడ్‌ఫాదర్‌గా వున్న విద్వాన్ విశ్వంగారు రిటైర్ అయినారు పొత్తూరు వెంకటేశ్వరరావుగారు వీక్లీ ఎడిటర్ అయినారు వీక్లీలో మొదటి నుండీ వున్న నన్ను నా అనుభవాన్ని విస్మరించి ఆయనకు ఎడిటర్ పదవి కట్టబెట్టారు. అదీ రాజకీయం జర్నలిజంలో రాజకీయం నడపగల మహామేధావి పొత్తూరివారు మిగతా విషయాల్లో మంచివాడుగా పెద్దమనిషిగా అందరినీ నమ్మించగలడు. స్వలాభంకోసం, స్వప్రయోజనాలకోసం భయంకరమైన రాజకీయ నాటకం ఆడగలడు. అందరూ ఆయన్ని రాజకీయ చాణుక్యుడు అనేవారు ఎదురుగా అనలేరు కదా! చాటుగా విమర్శించుకోవడం సబార్డినేట్స్ స్వభావం. ఆయన కావాలని తెచ్చుకున్న వ్యక్తులే ఆయన్ని ఆయన మనస్తత్వాన్ని చాటుగ్గా దుయ్యబట్టేవారు.

మార్పులు చకచకా చోటు చేసుకోసాగాయి. శనిగారు కలిగించవలసిన 'మారకం' తప్పిపోయినట్లుంది నాకు మరణయోగం వుందని చెప్పిన జ్యోతిష్కుడు పాపం ఆరునెలలు తిరగకుండానే చనిపోయాడు. తన జాతకమే తెలుసుకోలేనివాడు ఇతరులకు చెప్పకూడదు. వసంతకుమార్ పరిశోధనకు గైడ్‌గా వున్న డాక్టర్ వేటూరి ఆనందమూర్తి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కుమారుడు. యోగంలో వున్న తనకు యోగం చేస్తున్న ఆచార్యుడేగైడ్ కావడం మాస్టర్‌గారి సంకల్పం. డాక్టర్ ఆనందమూర్తిగారు మారిషస్‌లో కొన్ని సంవత్సరాలు వుండి వచ్చారు. ప్రభాకరశాస్త్రిగారి రచనలు ముద్రించ పూనుకున్నారు. మణిమంజరి అనే పత్రికను ప్రారంభించారు. అవి అన్నీ మా మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్‌కే వచ్చాయి.

నా వరకు యోగానికి ఉపయోగపడితే చాలుననే సంకల్పం నాది. ఏం చేయగలను? నాకున్న అర్హతలేమిటి! 'మాస్టర్ యోగదర్శిని' ఒక్కటి రాయగలిగాను నాకున్న అవధిలో మాస్టరుగారు ఏది చేయిస్తే అది చేయడానికి నేనుసిద్ధం భగవంతుడు యిచ్చిన ఆయుర్దాయం అయిపోయింది. అదనంగా బ్రతుకుతున్నది మాస్టరుగారు

గ్రాంట్ చేసిన అదనపు ఆయుష్షు. దీనిని వారి యోగకార్యానికి వెచ్చించడం ధర్మం. ఆ నిర్ణయం నాలో బలంగా పాదుకున్నది. ఆఫీసులో పనిపైన శ్రద్ధ పరిమితం మాటపడకుండా ఉండడం వరకే. చేయవలసిన పని సక్రమంగా చేయడం వరకే ఉద్యోగం తీసివేసినాసరే సిద్ధంగానే వున్నాను. నిండా మునిగినవానికి చలి భయం వుండదు

బళ్లారి నుండి బి.కొండాచారిగారి ఆహ్వానం. అగస్టు 4 మాస్టరుగారి జన్మదినోత్సవానికి రమ్మని పిలుపు నా ఆధ్వర్యంలో ప్రార్థనలు జరుగుతాయట. నేను పెద్దనా!? విచిత్రం!! మిత్రులు డి.ఎన్.రావుగారితో చెప్పాను. తాను వస్తున్నానని, బయలు దేరమని చెప్పాడు

"మాస్టరుగారి ప్లాన్ మనకు అర్థం కాదు యూ గెట్ రెడి" అన్నారు అప్పటికి డి. నరసింహారావుగారికి నాకూ మైత్రి బాగా గట్టిపడ్డది. ఆయన నాకు గైడ్ అన్నిటా ఇద్దరం బయలుదేరాం వస్తున్నట్లు కొండాచారిగారికి టెలిగ్రాం యిచ్చాను అటు వెళ్లడం అదే మొదటిసారి ఇద్దరం వెంకటాద్రిలో బయలుదేరాం గుంతకల్ వెళ్లేవరకు భయంకర మైన తుఫాను. వర్షం. రైలు దిగటమే కష్టమైంది. వెయిటింగ్ రూమ్‌లో ఖాళీ లేదు. రావుగారికి చలిజ్వరం పట్టుకుంది. పాపం! పెద్దాయన. వర్షంలో వణికిపోతున్నాడు ఫస్ట్ క్లాస్ రైల్వే పాస్ ఆయనది. ఏం ప్రయోజనం. స్టేషన్ మాస్టర్ లేడు ఒంటిగంటకు గుంతకల్‌లో దిగాం నాలుగు గంటలకు విజయనగర్ రైలు. ఒక కాఫీ, టీ ఏం లేవు. బ్రిడ్జి క్రింద తలదాచుకున్నాం. ఆస్పత్రికి వెళ్లాలన్నా వర్షం. ఆయనకు ఏం ప్రమాదం ముంచుకొస్తుందోనని నాభయం. ఏమని ఓదార్చను మాస్టరుగారిని ప్రార్థిస్తూ, వర్షంలో తడిసిపోతూ కూర్చున్నాం మూడు గంటల ప్రాంతాన వర్షం జోరుతగ్గింది. బళ్లారి వైపు వెళ్లేరైలు ప్లాట్‌ఫాం పైకి వచ్చింది. దాంట్లో ఎక్కి రావుగారిని పడుకోబెట్టి నాపెట్టెలో ఉన్న ధోవతులు కప్పాను. ఆయనకు బాగా నిద్రపట్టింది. నాలుగుగంటలకు రైలు బయలుదేరే సమయానికి ఆయన కళ్లు తెరిచి సిగరెట్ వెలిగించాడు కాఫీ తెప్పించి ఇచ్చాను.

"ఇంకా రేణిగుంటలోనే వున్నామా?" అని జోక్ చేశాడు. అయన కనిపిస్తే మృత్యువుతోనూ జోక్ వేయగలడు. నాకు ఆ రాత్రి నిద్రలేదు. ఒంటిగంట వరకు మా కబుర్లు. గుంతకల్ స్టేషన్‌లో డి.ఎన్. రావుగారి అనారోగ్యం, వర్షం. ఇంకా కునకడానికి అవకాశం ఏదీ? అయిదు గంటలకు రైలు బళ్లారి స్టేషన్ చేరింది. బ్రతుకుజీవుడా అని బయటపడ్డాం.

అసలు డ్రామా అప్పుడు మొదలైంది. 1982, ఆగస్టు 4వ తేదీ. తెల్లవారుఝాము అయిదుగంటలు. ఇద్దరం ప్లాట్‌ఫాంపైన దిగి అటు ఇటు చూశాం. ఎవరూ రాలేదు.

కొండాచారి గారికి టెలిగ్రాం యిచ్చాను. ఎందుకు రాలేదూ! రైల్వే టీ స్టాల్‌లో వేడివేడి టీ తాగి సిగరెట్స్ కొని బయలుదేరి నడుస్తుండగా ముగ్గురు వ్యక్తులు ఎదురైనారు అప్పటికి రైలు దిగినవారంతా వెళ్లిపోయారు మేం ఇద్దరమే ప్లాట్‌ఫాంపైన మిగిలాం. వారు మావద్దకువచ్చి "హైదరాబాద్ నుండి వచ్చింది తమరేనా" అని అడిగారు

"అవును" అన్నాం

వారి చేతిలో వున్న పూలదండలు హడావుడిగా డి ఎన్ రావుగారి మెడలో వేసి, నమస్కారంచేసి, "క్షమించాలి రావడం కాస్త ఆలస్యమైంది. ఒకసారి వచ్చి వెళ్లాం. రైలు లేటన్నారు అయిదింటికి గాని రాదన్నారు ఇంటికి వెళ్లాం. రైలు కూత విని హడావుడిగా బయలుదేరి వచ్చాం క్షమించాలి"

అలాగ క్షమాపణలు చెపుతున్నారు అసలు వీరు వచ్చింది మాకోసమేనా అని అనుమానం వచ్చింది మాకోసమే వస్తే పూలమాలలు ఎందుకు తెస్తారు? అంతలో దూరంనుండి కొండాచారిగారు, సూర్యనారాయణగారు పరుగున రావడం గమనించాను. "కొండాచారిగారు వస్తున్నారు" అన్నాను డి.ఎన్.తో.

"దట్సాల్ రైట్" అన్నారు.

"దట్సాల్ రైట్ సరే, వీరు ఎవరికోసమో తెచ్చిన దండలు మీకు వేశారు."

"అయితే తిరిగి యిచ్చేద్దాం" అని ఆయన మెడలో దండలు తీసి వారికి యిచ్చివేశాడు వారు కొండాచారిగారి మనుషులే మా కోసమే వచ్చారు.

"సారీ మావాళ్లకు మీరు తెలియదు. వారిని మీరనుకున్నారు క్షమించండి" అన్నాడు కొండాచారి

"కుడి ఎడమైతే పొరపాటు లేదులెండి. వీరు డి ఎన్.రావుగారు. సీనియర్ సాధకులు. మీ పూలమాలలకు వారే అర్హులు" అని ఓదార్చాను. రావుగారిని వదిలి నేను గౌరవం పొందటం తప్పు. మాస్టరుగారి సంకల్పం అది. స్టేషనుకు దగ్గరే సూర్యనారాయణ గారిల్లు. మున్సిపల్ ఆఫీసు ఎదర. అందరం కబుర్లు చెప్పుకుంటూ నడిచివెళ్లాం అప్పటికే ప్రేయర్‌కు హాల్ అలంకరించారు. పదిమంది వచ్చి వున్నారు. కాఫీలు, స్నానాలు పూర్తి చేసుకున్నాం. ఆరుగంటలయ్యేసరికి యాభై అరవైమంది వరకు వచ్చారు ప్రేయర్‌కు. బావుంది. మంచి గ్యాదరింగ్ మాస్టరుగారి, మదర్‌గారి ఫోటోలు పెద్దవి చక్కగా అలంకరించారు. ఎదురుగా ప్రార్థన చేసే సాధకులకోసం చాపలు, కార్పెట్లు వేశారు. పక్కగా రెండు ప్రత్యేకస్థానాలు వుంచారు. బహుశా అవి మాకోసమే ననుకొని నేను ఆ స్థలంలో కూర్చున్నాను. రావుగారు అందరితో కలిసి కూర్చున్నారు. సూర్యనారాయణ వారి భార్య వచ్చి నాకు నమస్కరించారు. నేను ప్రేయర్ చెప్పాను. ప్రార్థన అయిన తర్వాత

అందరూ వచ్చి నాకు నమస్కరించసాగారు. అది విచిత్రమైన అనుభవం. అందరూ కలిసి నాకు గురుస్థానం కల్పించారు. లోగడ యోగసమావేశాలకు హాజరైనా ఒక సామాన్యసాధకుని వలె హాజరైనాను ఇక్కడ బళ్లారిలో నాస్థానం మారింది. ఆయాచితంగా అప్రయత్నంగా గురుస్థానంలోకి బదిలీ అయినాను ఆ రోజు ప్రతిఒక్కరు 'గురువుగారూ' అని పిలుస్తుంటే నాకేదో కొత్తలోకంలో ఉన్న అనుభూతి కలిగింది నేను ఈ స్థానానికి అర్హుడినా కాదా అనిపించలేదు ఒక గురువు వలెనే ప్రవర్తించవలసివచ్చింది. అది అసహజం అనిపించలేదు. మాస్టరుగారి సంకల్పం అనుకున్నాను.

బళ్లారిలో యోగకేంద్రం నిర్వహిస్తున్న సూర్యనారాయణ ఆయన భార్య గొప్ప భక్తులు యోగానికి సంపూర్ణంగా అంకితమైనవారు ఆయన మాస్టరు జన్మదినోత్సవం జరపాలని, నన్ను ఆహ్వానించాలని అనుకున్నారు. మాస్టరుగారు కన్పించి తాను జయంతి నాటికి వస్తున్నట్లు చెప్పారుట. ఆగస్టు 4న మాస్టరుగారు వస్తారని వారి విశ్వాసం మాస్టరుగారి సందేశం అబద్ధం కావడానికి వీల్లేదు. అందువల్ల ప్రేయర్ హాల్లో ఒక పక్కన పట్టు తివాచీ పరిచి వుంచారు మాస్టరుగారి కోసం ఎవరూ కూర్చోకపోయినా అది మాస్టరుగారికి కేటాయించిన స్థానం. ఈ విషయం తెలియక సరాసరి వెళ్లి అది నాకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేశారని భావించి నేను అక్కడ కూర్చుండిపోయాను. ఆయన అనుకున్నారట . నా రూపంలో మాస్టరుగారు వచ్చారని. అందరూ అలాగే భావించి వచ్చి నమస్కారాలు చేశారు. ఆ విధంగా నేను ఊహించని రీతిలో గురుస్థానం పొందడం జరిగింది

డి.ఎన్ రావుగారిని అడిగాను, "ఏమిటి మహాశయా! ఇలా చేశారు? నేను గురువును కావడం ఏమిటి? పెద్దలు ఎందరో ఉన్నారు కదా!"

"అది మాస్టర్ ప్లాన్, కాదనడానికి మనం ఎవర?. వచ్చిన అవకాశాన్ని మాస్టరు ప్రసాదంగా తలదాల్చడమే మనం చేయవలసింది."

సూర్యనారాయణ, ఆయనభార్య నాకు గురుపూజ చేసి నూతన వస్త్రాలు బహూకరించారు ఆ రాత్రికి తిరుపతి బయలుదేరుతుండగా కన్నీటితో వీడ్కోలు చెప్పారు. మళ్లీ బళ్లారి వస్తానని మాట తీసుకున్నారు. ఒక్కరోజు బళ్లారిలో నూరుమంది సాధకులతో గడిపాం. నాకంటే సీనియర్స్, వయస్సులో పెద్దవారూ ఉన్నారు. వారందరికీ నేనంటే అభిమానం ఏర్పడ్డది చిన్నవారంతా 'గురువు'గా కొత్తపదవిని కట్టబెట్టారు.

\+ + +

బళ్లారి నుండి శ్రీ నరసింహారావు, నేను బస్సులో తిరుపతి వెళ్లాం. మర్నాడు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి జయంతి. ఏ.వి. శ్రీనివాసాచారిగారు ప్రతీ ఆగస్టులో మాస్టరుగారి

జన్మదినోత్సవం, రెండ్రోజుల అవతల శ్రీ ప్రభాకరశాస్త్రిగారి జయంతి ఉత్సవాలు జరుపుతారు. డి ఎన్ గారికి ఆహ్వానం వచ్చింది. నేను వారికి తెలీదు. ఎప్పుడూ కలుసుకోలేదు బస్సు లేటైంది రైల్వే రిటైరింగ్ రూమ్‌లో దిగి స్నానం చేసుకుని ఆయనగారిని విశ్రాంతి తీసుకోమని చెప్పి నేను మా షడ్డకుడు శ్రీ గాయత్రీప్రసాద్ గారింటికి వెళ్లాను. ఊళ్లోకి వచ్చి దగ్గరి బంధువులను చూడకపోతే బాగుండదు కదా! తిరుపతి నాకు కొత్త కాదు. చిత్తూరులో వున్న కాలంలో తరుచుగా వచ్చేవాడిని

సాయంత్రం ప్రేయర్‌కు వెళ్లాం. రామాలయం ప్రక్కన శ్రీనివాసాచారిగారి ఇల్లు. మేం వెళ్లేసరికి హాల్‌నిండా జనం క్రిక్కిరిసి ఉన్నారు. వరండాలో, గదుల్లో జనం ఉన్నారు రావుగారిని చూడగానే ఆచారిగారు నమస్కారంచేసి సాదరంగా ఆహ్వానించారు నన్ను పరిచయం చేయగానే మహదానందం చెందారు. "ఇద్దరు మహాత్ములు వచ్చారు. చాలా బాగుంది" అనిపొంగిపోయారు ఆచారిగారు అల్ప సంతోషి అనిపించింది అక్కడ చేరిన అంతమంది సాధకుల్ని చూస్తే ఆయన గట్టివాడే అనుకున్నాను. అంతమందిని సమావేశ పరచడం మాటలు కాదు యోగసమావేశాలలో ఆకర్షణ వుండదు గ్లామర్ వుండదు. ప్రార్థన చేసుకోవడం తర్వాత కాస్త సత్సంగం అంతే...

ప్రేయర్ ప్రారంభం కాగానే చాలామంది త్రేన్చడం వినిపించింది. 'ఆవ్,ఆవ్' నలువైపులనుండీ ఒకే డిస్టబెన్స్ నాకు ప్రేయర్ కుదరలేదు రావుగారు ఇబ్బందిగా ఫీలై కళ్లు విప్పారు ఆచారిగారు మా పరిస్థితి గమనించి కళ్లు తెరిచారు "ఏమిటి ఆచారిగారూ ఆ అరుపులు, కూతలు అవి ఆగవా?" అని అడిగాను.

"అలావస్తాయి, రావాలి అలా వస్తే ఆరోగ్యం చక్కబడుతుంది."

"రోజూ ఇలాగే వస్తుంటే ఎప్పటికీ ఆరోగ్యాలు చక్కబడినట్లు కాదుకదా. మొదట్లో వస్తే అర్థం వుంది. ఇంక వీరి ఆరోగ్యాలు ఎప్పటికీ చక్కబడవా?"

ఆయన సమాధానం చెప్పలేకపోయారు.

"శార్వరీ! వీళ్లకు ఆ అరుపులు, పిల్లికూతలు రాకుండా చెయ్ ఏం ఆచారిగారూ చేయమంటారా" అన్నారు డి.ఎన్.గారు

"మీ ఇష్టం, చేయగలిగితే చేయండి. నాకూ మంచిదే కదా! అందరం ప్రశాంతంగా ప్రేయర్ చేసుకోవచ్చు" అని పర్మిషన్ యిచ్చారు.

నేను నాలుగువైపులా దృష్టి సారించి అందరిలోకి చూచి ట్రీట్‌మెంట్ చేశాను. అయిదు నిమిషాల్లో హాలంతా నిశ్శబ్దం ఆవహించింది. తర్వాత ప్రేయర్ గంటసేపు మహాప్రశాంతంగా జరిగింది.

'ఎప్పుడూ జరగనంత హాయిగా, తృప్తిగా ప్రేయర్ సాగింది ఇవ్వాళ' అని అందరూ సంతోషించారు.

ఆచారిగారికి కోర్సులు చేయడం ఇష్టంవుండదు. వారు చేయించరు ప్రేయర్ ఒక్కటే చాలునంటారు. నేను, రావుగారు కోర్సులు అవసరం అనే స్కూల్‌కి చెందినవారం.

"శార్వరీ! ఏమైనా కోర్సులు చేద్దామా" అన్నారు రావుగారు అన్యాపదేశంగా, ఒప్పుకోండి ఆచారిగారూ అన్నట్లు అటు చూస్తూ. ఆయన అంగీకరించారు మేం కోర్సు చేయించాం. డి ఎన్ గారికి చిన్నచిన్న కోర్సులు కంఠతః వచ్చును ఆయనే చెప్పారు. తర్వాత ఆచారిగారు నన్ను మాట్లాడమని కోరారు. నాకు ఉపన్యాసాలు అలవాటు లేదు అయినా అది ప్లాట్‌ఫారం కాదు. యోగసమావేశం. ప్రార్థనాస్థలి అందరూ మనవారే. నన్ను వినాలని ఉత్సాహంగా ఆసక్తిగా వున్నారు ఆచారిగారు మైక్ సిద్ధం చేశారు. వేపు సిద్ధంగానే వుంది. నేను గంటసేపు ఉపన్యసించాను. యోగంపైన, నేను అంతసేపు, అంతబాగా ఉపన్యసించగలనని అనుకోలేదు నాకూ ఆశ్చర్యం వేసింది అందరూ అభినందించారు శ్రీనివాసాచారిగారు చాలా సంతోషించారు మేం స్టేషన్‌కు వెళ్లిపోయాం. మా వెనుకే ఓ సాధకునితో ప్రసాదం, లడ్లు, విభూతి పంపారు. ఆ రాత్రికే మేం విజయవాడకు బయలుదేరాం.

అదొక చిత్రమైన యాత్ర... నా యోగ ప్రస్థానంలో పెద్ద మలుపు ఒకేసారి మూడు కేంద్రాలను దర్శించడం బళ్లారి, తిరుపతి, విజయవాడ. శ్రీకవులూరి సీతారామయ్యగారు ఆగస్టు 4న మాస్టర్ జన్మదిన ప్రార్థనలు, తర్వాత వారి గురుదేవులు మాస్టర్ ఎం.ఎన్ గారి జయంతి ఉత్సవాలు కలిసి నాలుగైదురోజులు చేయిస్తారు. మాస్టర్ ఎం.ఎన్.గారి జయంతిఉత్సవాలకు మేం విజయవాడకు చేరుకున్నాం. ఉదయం ప్రార్థన సమయానికే సత్యనారాయణపురంలోని సీతారామయ్యగారి ఇంటికి చేరాం. వారు మాకు పూజ్యులు, గురుసమానులు. వారికి పాదాభివందనం చేయకుండా వుండలేను. వారు వారించినా ఆ విషయంలో మొండితనం నాది. నన్ను కన్నకొడుకుల కంటే ప్రేమగా చూచేవారు.

శ్రీ సీతారామయ్యగారు ప్రతిసంవత్సరం ఆగస్టులో యోగసమావేశాలు జరుపుతారు. గుంటూరునుండి దిడుగు నారాయణరావు వచ్చారు. స్థానికంగా దాసుగారు. పి.ఎస్. ఆర్. శర్మగారు, గూడూరి నమశ్శివాయ, సత్యనారాయణగారు, ఆదోనినుండి ఘంటప్ప, వినుకొండ నుండి కె.ఎల్.రెడ్డి, పిడుగురాళ్ల కేంద్రానికి చెందిన సాధకులు యాభైమంది వచ్చారు. ఆ రోజు దిడుగు నారాయణరావుగారు ఎం.టి ఎ. కోర్సు చేయించారు. ఆ కోర్సు చేయడానికి కనీసం మూడు గంటలు వ్యవధి కావాలి. నెమ్మదిగా

చేయిస్తే అయిదారుగంటలు పడుతుంది సాధకుని అంతఃశుద్ధిని బట్టి తన్మయత వుంటుంది రోదసిలో ప్రయాణం సాగుతుంది నక్షత్రలోకాలు గ్రహలోకాలు దాటి నిర్వాణ, పరనిర్వాణ, మహాపరనిర్వాణ లెవెల్స్‌కు చేరడం జరుగుతుంది చివరన ఎం టి.ఎ భూమిక వస్తుంది యాభై అరవై మందిచే చేయించారు నారాయణరావుగారు చివరివరకూ ముందు వెనకగా ప్రయాణం సాగించింది సీతారామయ్యగారు, శార్వరి మాత్రమే నని దిడుగు నారాయ రావుగారు సర్టిఫికెట్ యిచ్చారు ఆరోజు సాయంత్రం ఎం.ఎన్ గారి జీవితచరిత్ర ఆవిష్కరణ జరిగింది పూజ్యులు వేటూరి చంద్రశేఖర శాస్త్రిగారు, దిడుగు నారాయణరావుగారు, నేను ప్రసంగించాం అలా వారం రోజుల వ్యవధిలో మూడు యోగకేంద్రాలు దర్శించి మూడుచోట్ల యోగసమావేశాలలో ప్రార్థనలలో పాల్గొనడం మరుపురాని అనుభవం. మరువలేని అనుభూతి అప్పుడే నా 'జీవనయోగం' తొలిమలుపు తిరిగింది 'నా యోగజీవనం' ఆనందనందనమైంది చిత్రంగా ఒకదాని వెంట ఒకటిగా సంఘటనలు చోటు చేసుకున్నాయి. అదీ మాస్టర్‌గారి సంకల్పమేకాక మరొకటి కాదు. ఒకాయన ప్రేయర్‌కు వచ్చారు. వారు విజయవాడ సత్యనారాయణపురంలో ఉంటారు సీతారామయ్య గారింట ప్రార్థనల్లో నన్ను చూశారుట. ఆ రోజు నా ఉపన్యాసం విన్నారుట హైద్రాబాదులో వారి అమ్మాయిగారింటికి వచ్చి మా ఇంటికి ప్రేయర్‌కు వచ్చారు.

"మాస్టర్ గారి పోటో పక్కన మదర్ ఫోటో కూడా వుంచండి, మంచిది" అని సలహా యిచ్చారు

ఇన్నాళ్లుగా యోగం చేస్తున్నా నాకు ఆ ఆలోచనే క లగలేదు. మా గురువుగారి దగ్గర మదర్ ఫోటో ఉండేది కాదు

"అవును, అమ్మగారి ఫోటో కూడా కావాలి" అని నా శ్రీమతి సమర్థించింది

"మాస్టరుగారి యోగానికి మీడియమ్స్ అందరూ ఒక ఎత్తు. మదర్ ఒక్కరూ ఒక ఎత్తు. అసలు మాస్టరుగారికి ఎం.టి.ఎ. నుండి సందేశాలు మదర్ ద్వారానే అందేవి. మదర్ ఒక్కరే ట్రాన్స్ మీడియం. మిగిలిన వారు ఉత్త మీడియములు. అమ్మగారు ట్రాన్స్ లోకి వెళ్లి యోగరహస్యాలు చెప్పేవారు. చాలా కోర్సులు డిక్టేట్ చేసింది మదర్‌గారే" అని చెప్పారు సత్యనారాయణగారు. వారు విజయవాడ వెళ్లిన తర్వాత మదర్ ఫోటో పంపారు. మదర్‌ఫోటో నా చేతికి వచ్చి మాస్టర్‌గారి ఫోటో పక్కన మదర్ ఫోటో పెట్టి ప్రార్థన చేయడం ప్రారంభించడమే మా ఇల్లు ఒక యోగాలయంగా మారడానికి నాంది.

ఆ వెంటనే సీతారామయ్యగారు హైద్రాబాద్ రావడం, వారి కుమారుని ఇంట కొన్నిరోజులు ఉండటం జరిగింది. అప్పుడే దాసుగారు హైద్రాబాద్ వచ్చారు. దాసుగారి అన్నగారు మైనంపాటి అప్పారావుగారి పిల్లలు చిక్కడపల్లిలో వున్నారు. అశోక్‌నగర్‌లోనూ

ఎవరో బంధువులు ఉన్నారు. అశోక్‌నగర్‌లో ప్రార్థనలు ఏర్పాటు చేశారు దాసుగారు. నేను, డి.ఎన్ రావు గారు వెళ్లాం. మూడు నాలుగురోజులు ఏవో కోర్సులు చేయించారు అవేమిటో నాకు తెలియదు. సాధనలో పాల్గొనడం, అనుభూతి చెందడం వరకే నాకు తెలుసు అవి ఏం కోర్సులు అని సీతారామయ్యగారిని నేను అడగలేదు.

సీతాఫల్‌మండిలో ఒకసారి డి.ఎన్.రావుగారు సమావేశం ఏర్పాటు చేశారు. తన ఇంటిలో యోగకేంద్రం నడపాలని రావుగారి కోరిక అయిదారుగురిని చేర్చగలిగారు కాని వారెవరూ యోగాన్ని తీవ్రంగా తీసుకోలేదు. ఏదో కాలక్షేపానికి, ఉబుసుపోక కబుర్లకీ వచ్చేవారు. ఒకరోజు సీతారామయ్యగారిని పిలిచి ప్రేయర్స్ చేయించారు. నేనూ వెళ్లాను కోర్సులు చేయించారు. అదే ఆఖరు.

మొత్తంమీద సీతారామయ్యగారిరాక శ్రీ దిడుగు నారాయణరావు, మైనంపాటి మధుసూదనరావు రావడం, డి ఎన్.రావు, నేను స్థానికంగా వుండడం, మన్నవ హనుమంతరావు, వేదాంతం లక్ష్మీనారాయణగారు ఇక్కడ వుండడం, పచ్చలతాడిపర్రు కరణం, పున్నయ్యగారి కూతురు, అల్లుడు, మాకు దగ్గరగా ఉండడం - వీరందరూ చిక్కడపల్లి, గాంధీనగర్‌లలో దగ్గర దగ్గరగా ఉండటంతో పదిమంది యోగసాధకులు కలుసుకునే అవకాశం కలిగింది. వీరంతా బాగా సీనియర్స్. అందరిలోకి జూనియర్‌ని నేను.

డి ఎన్.రావుగారి ప్రోత్సాహంతో సీతారామయ్యగారు మా ఇంట్లో కొన్నిరోజుల పాటు ప్రేయర్స్ చేయించటానికి అంగీకరించారు. ఆదివారాలు తప్ప నాకు తీరిక వుండదు. రోజూ సెలవు పెట్టడానికి అనువైన ఉద్యోగం కాదు పత్రికావ్యాసంగం. ప్రతి ఆదివారం మూడుగంటలకే సమావేశమయ్యేవాళ్లం. మా ఇంట్లో పాతికమందివరకు ప్రార్థన చేసుకునే వీలుంది. అలా కొన్ని వారాలలో సీతారామయ్యగారు చాలా కోర్సులు చేయించారు. వర్కింగ్‌బావుంది. యోగంలో ప్రేయర్స్ చేసినప్పుడు, చేయించినప్పుడు యోగక్రియను గమనిస్తారు. వర్కింగ్ బాగాలేకపోతే, కోర్సుచేయించి ప్రయోజనం ఉండదు. మా ఇంటకోర్సులు చేయించినపుడు మంచి వర్కింగ్ వచ్చిందట!

"శార్వరీ! మీ ఇంట్లో యోగా సెంటర్ నడుపు. వర్కింగ్ చాలా బావుంది" అన్నారు కవులూరి సీతారామయ్యగారు.

"నేనా? సెంటర్ నడపడమా! నావల్ల కాదు స్వామీ. నా కంత శక్తి లేదు" అన్నాను

డి.ఎన్. రావుగారు కల్పించుకుని "సీతారామయ్య గారి మాట నీకు ఆశీస్సు. కాదనకు. పెద్దాయన చెప్పారంటే ఏదో ప్రయోజనం ఉండు ఉంటుంది. అది మాస్టర్ ఆజ్ఞగా పాటించు" అన్నారు.

నిమిషాలలో మాటల్లో యోగాసెంటర్ రూపుదిద్దుకుంది. డి ఎన్.రావు నాకు తోడుగా వుండి నిర్వహించడానికి అంగీకరించారు. సీతారామయ్య గారు తన వద్ద వున్న కోర్సుల పుస్తకం నా చేతిలో పెట్టారు. "అన్నీ కాపీ చేసుకుని ఇవ్వు. ఇకపైన నువ్వు కోర్సులు చేయించాలి" అన్నారు ప్రెస్ వుంది కనుక ఒక పత్రిక నడపమని సలహా ఇచ్చారు

పది సంవత్సరాల క్రితమే మద్రాసు నుండి యోగాజర్నల్ ఇంగ్లీషులో నడిపాను ముచ్చటగా మూడు సంచికలు వేయగలిగాను ఆ చిన్న ప్రయత్నంలోనే చాలా నష్టపోయాను తర్వాత యోగాజర్నల్ పి.ఎస్ ఆర్ శర్మగారు తన పేర రాయించుకుని తెచ్చుకున్నారు డి నారాయణరావుగారి సంపాదకత్వంలో తెలుగులో నడిపారు మూడు నెలల కొక మారు పత్రిక ప్రచురించినా చాలునని అనుకున్నాం

ప్రెస్ వున్నా పత్రిక నడపడానికి పెట్టుబడి కావాలి. పత్రికకు పెట్టుబడి పెట్టే శక్తి నాకు లేదు. యోగాసెంటర్ ప్రారంభించవచ్చు. ఒక చిన్నబోర్డు రాయించి పెడితేచాలు తెలిసిన వారు వస్తుంటారు. ప్రస్తుతానికి ప్రతి ఆదివారం సామూహిక ప్రార్థనలు జరపాలని నిశ్చయించుకున్నాం. మా డి. ఎన్ రావుగారు అంటే డే అండ్ నైట్ రావుగారు ఎవరినీ నిద్రపోనివ్వరు పని అయ్యేవరకు.

చి॥ వసంతకుమార్‌కు పత్రిక నడపాలనే కోరిక వుంది. చేతిలో ప్రెస్ వుందన్న ధీమా. ప్రెస్ ఉన్నంత మాత్రాన పత్రిక నడపలేం. డబ్బు ఒక్కటే చాలదు. యోగ విషయంగా వ్యాసాలు రాసే వారెంతమంది ఉన్నారు! ఆధ్యాత్మిక పత్రిక అమ్మకాలు జరగవు. ఉచితంగా యిచ్చినా చదవరు కమర్షియల్‌గా నడపలేకపోతే కొంతకాలం వచ్చి ఆగిపోతుంది. వసంతకుమార్‌కు సైదోడు డి.ఎన్ రావు. ఆయనకు ఉత్సాహం నూరుశాతం కన్నా ఎక్కువే. కాని ఆచరణకు అనుభవం ఏది? మొత్తంమీద యోగదర్శని ప్రారంభించాం. అన్ని మార్గాల రచనలు ప్రచురించడం మంచిదే. సమదర్శిత్వం వుంటుంది. కాని ఏ ఒక్క శాఖకు పూర్తిన్యాయం చేయలేం. అయినా పత్రిక నడిపేది మన యోగం కోసం. ఇతరాలు వేసి ప్రయోజనం లేదు కనుక మాస్టర్‌యోగానికే పరిమితం చేయాలనుకున్నాం! ఏం రాయాలి? మాస్టర్‌యోగం గురించి తెలిసింది తక్కువ. ఉన్న పుస్తకాలు వేళ్లమీద లెక్కించవచ్చు. వాటిని అనువదించడం మహాకష్టం. తెలుగులో సామాన్యులకు అర్థమయ్యే రీతిలో రాయాలి. పండితులకు పత్రిక అవసరంలేదు. మొత్తంమీద 1983 ఉగాదినాటికి యోగదర్శని అచ్చయింది. లోగడ మద్రాసులో నెలవంక, చిత్రప్రగతి పత్రికలు నడిపిన చిరు అనుభవం వసంత్‌ది. ఏజంట్సు అందరికి పత్రిక గురించి రాశాం. తల కొక పది, అయిదుకాపీలు చొప్పున పంపాం. కొండకు వెంట్రుకను కట్టి కొండను కదిలించాలని

ప్రయత్నం ఈ చిన్న పత్రిక. మహాపర్వతం లాంటి మాస్టర్‌యోగం కదులుతుందా! తెలియదు. సంకల్పం మంచిది ఒక్క సంకల్ప బలంతో కొండను కదిలించగల యోగశక్తి, ధీశక్తి, ఆత్మబలం మాకు ఉన్నాయనిపించలేదు.

ఏజంట్లు కొంతమంది డబ్బు పంపారు. కొందరు స్వాహా చేశారు. అది చిన్న పత్రికల విషయంలో ఏజంట్ల ఉదారవైఖరి! పాఠకులలో స్పందన కనిపించింది. రెండు మూడు వేలు ఖర్చయ్యేది. పత్రిక వెల అయిదురూపాయలు. కొన్ని అమ్ముడు పోయినా మళ్లీ పత్రిక వేయవచ్చు. యోగదర్శిని చదివినవారు చాలా మంది ఉత్తరాలు రాశారు యోగంలో చేరతామని. వేయిమంది పాఠకులలో పాతిక, యాభైమందిలో స్పందన కలిగినా గొప్పవిషయమే. ఉబ్బితబ్బిబ్బులైనాం. మా డి.ఎన్.రావుగారైతే మహదానంద పడిపోయారు

"ఏమైనా సరే. ఈ ఊపులో యోగాన్ని ప్రజల్లోకి తీసుకుపోవాలి" అని పట్టుబట్టారు 1983 ఉగాది తర్వాత మేకాల్ అంటే మాస్టర్‌గారి కాలంలో మే సమావేశాలు అనేవారు - అంటే మాస్టరుగారు యోగం ప్రారంభించిన దినాలు- అప్పటికి యోగకేంద్రం ప్రారంభించాలన్న సంకల్పం కలిగింది. ఈ కేంద్రానికి డి ఎన్.రావు, నేను, శ్రీమతి యామినీదేవి, వసంతకుమార్ సూత్రధారులం, నిర్వాహకులం .. ఫలితాలు మంచివైనా, చెడ్డవైనా అనుభవించడానికి మేము సిద్ధపడి ఉన్నాం. యోగా సెంటర్‌గా కాక యోగా స్కూలుగా నడపాలని డి.ఎన్.గారి ప్రతిపాదన. దిడ్డుగు నారాయణరావు, దాసుగారు, సీతారామయ్యగారు మాకు సలహాదారులు, ప్రోత్సాహకులు. వారికీ సంతోషంగా వుంది. మాస్టర్ ఎం.ఎన్.గారి నిర్యాణం తర్వాత అజ్ఞాతంగా ఉన్న యోగం వెలుగు చూడబోతు న్నందుకు. ఆ మహత్కార్యం నిర్వహించే బాధ్యత వారు మా పైన పెట్టినా తలకెత్తుకున్న ధైర్యం మాది.

మోపు తలకెత్తినప్పుడు తేలిక అనే అనిపిస్తుంది. ఎత్తినవారు చేయి ఆసరా వదలగానే, నడకసాగిస్తాం. అప్పుడు మోపు బరువు పెరుగుతుంది. కాళ్లు తడబడతాయి. మోయలేక ఆయాసం వస్తుంది. మా పని అంతే అయింది. సరదాగా పత్రిక ప్రారంభించాం గానీ అటు ఆఫీసుపని చూసుకుంటూ ఈ పత్రికకు రచన సాగించడం శ్రమ అయింది. పైగా యోగంలో చేరతామని ఉత్తరాలు రాసేవారి సంఖ్య పెరుగుతోంది. మెంబర్‌షిప్ రుసుము మూడు నెలలకు 25రూపాయలుగా నిర్ణయించాం. ఈ బ్యాక్‌గ్రౌండ్ వర్క్ అంతా డి.ఎన్. రావుగారిదే. పేరు మాది. నా అంతట నేను యోగం చేసుకోవచ్చు. కాని పదిమందికి తెలియాలి. మనం పొందిన ఆనందం ఇతరులు పొందగలగాలి. లేకపోతే

మన స్వామీజీలు ఇంత పబ్లిసిటీ కోరరు. మనంగా ఏమీ కొత్తది చెప్పలేకపోవచ్చు. కొన్ని మంచి విషయాలు ఆర్తులకు, కోరినవారికి తెలియచేయాలి

'యోగా టీచ్' అన్న మాటకు రెండు అర్థాలు. 'టీచ్' అంటే పారం చెప్పడమేకాదు. తెలియచెప్పడం. యూనివర్సిటీలు రెగ్యులర్ కోర్సులతో పాటు కరస్పాండెన్సు కోర్సులు నడుపుతాయి ఇక్కడ యోగాస్కూలులో రెగ్యులర్ ప్రేయర్స్ ఉండాలి. కరస్పాండెన్సు కోర్సువుండాలి. అది మా ప్రయత్నం. అది మంచిదో కాదో మాకు తెలియదు. మేం అలా చేయదలచుకున్నాం మాస్టరుగారి అనుమతి ఆశీస్సులున్నాయా లేదా అంటే, సక్రమంగా నడిస్తే మాస్టర్‌గారి అనుమతి లభించినట్లు కాకుంటే మూసివేస్తాం. అంతేగదా! కొంతమంది పాతసాధకులు విమర్శించారు . మాస్టరుగారి యోగం అజ్ఞాతంగా ఉండవలె, ఇలా పత్రికల ద్వారా, పుస్తకాల ద్వారా ప్రచారం చేస్తే పవిత్రత పోతుంది అని పవిత్రత ఏమిటి? ప్రచారంతో పవిత్రత ఎలాపోతుంది? విమర్శించేవారు కాలు అడ్డం వేసే వారు పెరిగినకొద్దీ, మాలో పట్టుదల పెరిగింది. విశాఖపట్నం నుండి మాస్టర్ ఇ.కె. గారి 'నావాణి' పత్రిక వస్తోంది దానినిండా జ్యోతిషం, హోమియోపతి, పురాణకథలు, హరికథలు వుంటాయి. మాస్టర్‌గారి ఫోటో వేస్తారు తప్ప, మాస్టర్‌గారియోగం గురించి అతి తక్కువ రాస్తారు. ఆపత్రికపై లేని విమర్శ మా పత్రికపైన ఎందుకు రావాలి. అందరి అభిప్రాయాలు ఘన్నిస్తూ పోతే ఎవరూ ముందుకు పోలేరు ముందుకుపోయేవాడిని వెనక్కులాగేవారే ఎక్కువ. ధైర్యసాహసాలున్నవానికి పిరికిమందు పోసేవారే ఎక్కువ.

'మాస్టర్‌యోగదర్శని' పుస్తకాన్ని పునర్ముద్రించాము. 'యోగాశ్రమలేఖలు' అనే మరొక పుస్తకం ప్రచురించాం. ఈ రెండు పుస్తకాలు, యోగదర్శని త్రైమాసిక పత్రిక, మాస్టర్ యోగాస్కూలు అండదండలు. 1983 మే29న హైదరాబాదులో మా యోగాస్కూలు మొదటి సమావేశం నిర్వహించింది. ఒక వేగుచుక్క దర్శనమిచ్చింది. ప్రక్కన నా 'సావిత్రి' రచన కొనసాగుతోంది. అప్పటికి మహోదయం, అన్వేషణ, స్పందన - మొదటి మూడు భాగాలు వెలువడ్డాయి. మిగిలిన భాగాల రచన సాగుతోంది అరవిందయోగి పూర్ణయోగానికి మాస్టర్ సి.వి.వి గారి సత్యయోగానికి మధ్య ఒక వారధి ఏర్పడింది. ఏ పేరున పిలిచినా, ఏ పేరు పెట్టినా ఆత్మయోగం ఒక్కటే ...

అది చైతన్యధార!

అది జీవనాడి!

అది ప్రాణప్రదాత!

సేవించిన తర్వాతనే యోగసాధన చేయాలన్న నియమం చాలా మంది ఆచారవంతులకు నచ్చలేదు యోగానికి బ్రహ్మచర్యం, సన్యాసం, వైరాగ్యం అవసరం లేదని, గృహస్థులుగా ఉన్నవారే ఎక్కువ యోగ్యులని అనడం మరి కొందరిని దూరం చేసింది యోగం వల్ల మోక్షం, స్వర్గం లాంటివి కోరరాదని, ఈ జన్మలోనే ముక్తి లభిస్తుందని, కొత్త లక్ష్యాలు గుర్తించడం వల్ల స్వర్గాల కోసం, స్వర్గ సుఖాల కోసం తపస్సు చేసే సంప్రదాయం కలవారికి ఇది మింగుడు పడలేదు. యోగం చేసేవారు దైవ పూజలు, కైంకర్యాలు, అర్చనలు, అర్పణలు చేయరాదని గట్టి షరతు విధించడం వల్ల, కుల, మతాచారాలలో కూరుకుపోయిన వారు వాటిని వదులుకోలేక పోయారు 'మాస్టరుగారిది మా కులమే కనుక మేమే యోగార్హులం' అని సొంత పీరాలెక్కిన వారి వల్ల యోగం వైపు చాలామంది ఆకర్షితులుకాలేగు.

ఇన్ని కారణాల వల్ల మాస్టరుగారి యోగానికి ఆదరణ కరువైంది సర్దుకుపోవడం, రాయితీలు ఈ యోగంలో లేవు ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. రకరకాల యోగాలు వెలుగులోకి వచ్చాయి. కులాధిక్యత, మతాధిక్యత పోయింది. కొత్తను ఆహ్వానించడం, అభిమానించడం విద్యావంతులు నేర్చుకున్నారు హేతువాద దృక్పథం అలవడింది.

మాస్టర్‌గారి యోగం ఒక్కటే మహోన్నతమైనదని, అన్నింటికంటే గొప్పదని మేం అనడం లేదు. మీరే ఆ మాట అంటారు మిగిలిన వాటితో దీనిని పోల్చకూడదు. ఇక్కడ యోగా వర్కింగ్ అనూహ్యంగా, అపూర్వంగా ఉంటుంది. అన్ని యోగ ఫలితాలు సత్వరం సాధకునికి ఉపకరిస్తుంటాయి. ఫలితాలు కళ్లముందు కనిపిస్తాయి చచ్చిపోయిన తర్వాత వచ్చే మోక్షం ఈ యోగానికి లక్ష్యం కాదు. ఈ జీవితంలోనే సుఖాలు, ఆనందాలు అనుభవిస్తూ జీవన్ముక్తి సాధించాలి.

గత 30 సంవత్సరాలుగా మాస్టర్ యోగ విస్తరణ బహుముఖీనంగా సాగుతోంది. కారణం మాస్టర్‌గారు నిర్ణయించిన 60 ఏండ్ల గడువుతో యోగం పరిపూర్ణం అయింది. ఇప్పుడు మాస్టర్‌గారి సత్యయోగం వేగంగా విస్తరించడమే కాక, మాస్టర్ నామ స్మరణ మాత్రంచే అద్భుత ఫలితాలు కలుగుతున్నాయి.

'ప్రణుత నిజ జవాన్ స్వాత్మతుల్యాన్ కరోతి' అన్నది ఋషి వాక్యం. యోగ హృదయంతో తనకు నమస్కరించిన వారిని తనంతటి వారుగా తీర్చిదిద్దుతారని మాస్టర్ పరంగా చెబుతారు. ఇలాంటి హామీ పూర్వ కాలం నుండి నేటి వరకు ఎవరూ ఇవ్వలేదు. ఒక్క పరబ్రహ్మకే ఇది సాధ్యం. సంపూర్ణ సమర్పణతో, అంకిత భావంతో యోగం చేసిన ప్రతివ్యక్తి పూర్ణంగా యోగ ఫలితాలు పొందగలుగుతున్నాడు.

## యోగసాధకులకు మాస్టరుగారిచ్చిన హామీలు :

1 సర్వ సమర్పణ చేసుకుని ఉభయ సంధ్యలలో యోగం చేసేవారికి ఈతిబాధలుండవు దారిద్ర్యం ఉండదు. అనవరత ప్రాణశక్తి పుష్కలంగా సరఫరా చేయబడుతుంది.

2. రోగబాధలు, వృధ్ధాప్యపు బాధలు ఉండవు. యోగక్రియ ఒకేసారి స్థూల, సూక్ష్మ, ప్రాణ శరీరాలలో జరుగుతుంది. కనుక శరీరం శుష్కించదు, క్షీణించదు. రోగాలను తనలో ప్రవేశించనీయదు మృత్యుభయం ఉండదు అమృతసిద్ధికి ఇది సూటిమార్గం.

3. జాగ్రత్ స్వప్న సుషుప్తులలో ఎలాంటి మాంద్యం, నైరాశ్యం ఉండవు. అనునిత్యం అనవరతం, ఉత్సాహం ఉరకలు వేస్తుంది. చైతన్యం పొంగులు వారుతుంది.

4. యోగశక్తితో మహాప్రాణధారను అందుకుంటూ ఎలాంటి జబ్బులనైనా నయం చేయవచ్చు. అపమృత్యువాత పడిన వారికి సైతం ప్రాణదానం చేయవచ్చు.

5. మనిషిని ఆవరించిన మాయపొరలు, భ్రమలు వదలి పోతాయి. అనుక్షణం 'సత్యం' అనుభూతమవుతుంది. అవసరమైన శక్తులు, సిద్ధులు లభిస్తాయి.

6. పీస్, ప్లెంటి, పర్ఫెక్షన్, పర్మనెన్సీ సూత్రం అమలు జరిగి సర్వత్రా స్వతంత్ర అవగాహన ఏర్పడుతుంది

## సాధన నియమాలు

1. తొలినాళ్లలో 21-55 సంవత్సరాల మధ్య వయస్సు వారిని అనుమతించేవారు. అప్పుడు యోగం ప్రయోగదశలో ఉండేది. ఇప్పుడు యోగం పర్ఫెక్షన్ పొందిన కారణంగా అన్ని వయస్సుల వారిని సాధనకు అనుమతించడం జరుగుతున్నది.

2. కుల, మతాల పట్టింపులు యోగంలో అసలు లేవు. సాధకులు ఎవరూ 'కుల' ప్రస్తావన చేయకూడదు. అందరూ ఒక కుటుంబంలోని వారి వలె మసలు కోవాలి.

3. విధిగా శాఖాహార నియమం పాటించాలి. మత్తు పానీయాలు పూర్తిగా నిషిద్ధం.

4. బ్రహ్మచారులు, సన్యాసులు యోగానికి అర్హులు కారన్న నియమం ఒకప్పుడు ఉండేది. ఇప్పుడు ఆ నియమం లేదు. అవివాహితులైనా సంసారం పట్ల ద్వేషం, విముఖత్వం లేనివారు చక్కగా యోగం చేసుకోవచ్చు.

5. సంప్రదాయబద్ధంగా ఉపనయనం చేసుకునేవారు చేసుకోవచ్చు. జంధ్యాలు తీసివేయనవసరం లేదు. కొత్తగా వేసుకోనవసరం లేదు. యధావిధిగా క్రతువులు, కర్మకాండలు జరుపుకోవచ్చు. వాటిపైన ఆంక్షలు లేవు.

6. ఇతరత్రా పూజలు, వ్రతాలు, విగ్రహారాధనలు, పుణ్యక్షేత్ర దర్శనాలు పనికి రావు.

సాధకులకు వాటి అవసరం లేదు కనుక క్రమంగా వాటికి దూరం కావడం మంచిది అలా పూర్తిగా దూరమైనప్పుడే యోగంలో అభివృద్ధి కనిపిస్తుంది

7. కోర్టు వ్యవహారాలు, రాజకీయాలు పనికి రావు. సత్యసంధత అవసరం పవిత్ర జీవనం ముఖ్యం.

8. వీలైనంత వరకు ప్రశాంతంగా జీవించడం అలవాటు చేసుకోవాలి. అనవసర విషయాలలో ఆసక్తి పనికి రాదు

9 ఆడ, మగ సాధకులందరూ సోదరబావంతో మెలగాలి యోగమిత్రుల వలె స్వచ్ఛంగా జీవించాలి

## సాధన

1 ప్రతిరోజు ఉదయం, సాయంత్రం 6 గంటలకు ఖచ్చితంగా యోగం ప్రారంభించి, అరగంట నుండి ఒక గంట వరకు సాధన కొనసాగించాలి

2 నిరాహారంగా, ఖాళీ కడుపుతో యోగం చేయకూడదు ఉపాహారం, కాఫీ, పాలు ఏమైనా తప్పక తీసుకోవాలి స్నానం చేసి, మంచి బట్టలు వేసుకుని యోగం ప్రారంభించాలి.

3 మాస్టరుగారి ఫోటో ముందు పద్మాసనంలోగానీ, సుఖాసనంలోగాని కూర్చుని కళ్లు మూసుకుని ముమ్మారు 'నిర్దిష్ట' ఉపదేశం స్మరించిన తర్వాత, లోచూపుతో శరీరంలో ఏం జరుగుతున్నది గమనిస్తూ ఉండాలి. తన శరీరాన్ని, పరిసరాలను మరచి తానొక 'రుషి' నన్న భావనతో శూన్యంలో చొరబడాలి ఇతర ఆలోచనలు లోపలకు ప్రవేశించకుండా జాగ్రత్త పడాలి.

4. శరీరంలో ఎలాంటి స్పందనలు, ప్రకంపనలు కలిగినా భయపడి, సాధన ఆపకూడదు. ఆ స్పందనలు యోగ క్రియలని గుర్తించాలి.

5. సాధన పూర్తి కావడం అంటే యోగక్రియ ఆగే వరకు ప్రయత్నించినా కళ్లు తెరవడం జరగదు. సాధన పూర్తయే సమయానికి రెండు చేతులు అప్రయత్నంగా పైకి లేచి నమస్కార ముద్ర వస్తుంది. అది ఆ పూటకు యోగక్రియ పూర్తి అయినట్లు గుర్తు.

మాస్టర్ యోగాశ్రమంలో రోజూ సాయంత్రం ఆరు గంటలకు సాధన జరుగుతుంది. ఆసక్తి కలవారు ఎవరైనా రావచ్చు. ఉపదేశం తీసుకుని సభ్యులైన వారు మాత్రమే కోర్సులు చేయడానికి అర్హులు. ఇక్కడ అన్ని రకాల జబ్బులకు యోగం ద్వారా చికిత్స జరుగుతుంది. కనీసం పది సంవత్సరాలు యోగసాధన చేస్తామని హామీ ఇచ్చిన వారికి మాత్రమే ఉపదేశం ఇవ్వబడుతుంది. అన్ని కోర్సులు నియమంగా పూర్తి చేసి, 35 సంవత్సరాలు యోగసాధన చేసిన వారు జీవన్ముక్తులవుతారు

# యోగాశ్రమ జీవితం

## ఆత్మయోగి సత్యకథ - 2



శార్వరి

# ఆత్మయోగి సత్యకథ

# 2

---

# యోగాశ్రమ జీవితం



## శ్రీ శార్వరి

# 1983 నుండి 95 వరకు

# ఒక్కక్షణం....

సముద్రంలో ఒక నీటి బిందువు : జీవితం

కాలచక్రంలో మనిషి బ్రతుకు : క్షణంలో సగం

బిందువులు కలిస్తేనే సముద్రం : క్షణాలు కలిస్తేనే కాలం

నా ఆత్మకథ రాసుకోవాలని ఎన్నడూ అనుకోలేదు.

ఇంతకాలం అంత అవసరమూ కనిపించలేదు.

ఆత్మకథలో రాస్తున్న వ్యక్తి జీవితం ఉంటుంది. అతని వ్యక్తిగత జీవితం ఉంటుంది.

ఈ నా సత్యకథలో నా సమాజం, నా చుట్టూ ప్రపంచం కనిపిస్తుంది.

యోగంలో చేరాక నేను నేరుగా మిగల్లేదు....

నాకు అండగా ఉన్న యోగం మిగిలింది. నన్ను నడిపిస్తున్న సత్యం మిగిలింది.

అందుకే ఇది సత్యకథ....ఒక ఆత్మయోగి సత్యకథ.

సత్యకథకు ప్రేరణ సత్యయోగం.

యోగసాధనతో ఏం సాధించానో నాకైతే తెలియదు.

ఇతరులకు యోగం ద్వారా నేను ఎంతవరకు ఉపయోగించానన్నదే ముఖ్యం.

యోగంతో నేను ఏదో అయిపోవాలని ఎన్నడూ వాంఛించలేదు.

నా ద్వారా సత్యయోగం ఎందరిలో స్పందన కలిగించిందన్నదే ముఖ్యం.

అరవిందుని 'సావిత్రి'లో వలె ఇందులో కొంత కథనం ఉంది.

మరికొంత యోగం ఉంది. వెరసి అంతా మార్మికం అయింది.

'ఆత్మయోగి సత్యకథ' మొదటి భాగం స్వతంత్ర్యానికి పూర్వం

జీవితం ఎలా ఉండేదో.....నేను అనుభవించింది రాశాను.

స్వాతంత్ర్యానంతర పరిణామాలు సగటు మనిషిపై

ఎలాంటి ప్రభావాలు చూపాయో రాశాను.

రెండవ భాగం నా యోగజీవితం....

25 సంవత్సరాల యోగాశ్రమ జీవితం ఇది.

ఇందులో నా ఆరాట పోరాటాలు, నా తపన, తపస్సు కొంతవరకు ఉన్నాయి.

సత్యలోచనాలతో ఈ పుస్తకం చదివితే నా యోగం, నా కృషి తెలుస్తుంది.

ఆ చూసిన చిత్రలో నన్ను మినహాయిస్తే నా వెనుక ప్రస్ఫుటంగా కనిపించేది

గురుదేవులు మాస్టరుగారు - వారి యోగం, వారి యోగశక్తి.

అది నన్ను ఎలా నడిపిస్తున్నదో అలాగే మిమ్మల్నీ నడిపిస్తుందని,

మీకు అండగా ఉంటుందనీ నా ఆశ.

ఇది గొప్పతనం చాటుకోడానికి రాసుకున్న పుస్తకం కాదు.

మాస్టరుగారి యోగాన్ని ఒక కొత్త కోణంలో చూపించడానికి రాసిన పుస్తకం.

ఇందులో వేయి ముఖాలు కనిపిస్తాయి. ఇది వికసించిన సహస్రదళ పద్మం.

- శార్వరి

# నా యోగాశ్రమ జీవితం

నా జీవితంలో మలుపులు ఎన్నో.....ఎన్నెన్నో

వాటిని 'సత్యకథ' మొదటి పుస్తకంలో నివేదించాను.

నా యోగజీవితంలోనూ ఎన్నో మజిలీలు...ఎన్నెన్నో....

వాటిని ఈ 'సత్యకథ' రెండవ పుస్తకంలో రాసుకున్నాను.

నేను స్పృశించిన యోగ శిఖరాలు ఏవైనా ఉన్నాయో లేదో నాకు తెలియదు.

నేను దర్శించిన వాటికి నిదర్శనాలు చూపలేను.

అనుభూతుల్ని మాత్రం గుండెలో పదిలపరచుకున్నాను.

వాటిలో జ్ఞాపకం ఉన్న కొన్నింటినైనా మీకు అందించాలని, మీతో పంచుకోవాలని ఈ చిన్న ప్రయత్నం.

ప్రతి రచయితకు అభిమానులుంటారు.

అభిమాన పాఠకులుంటారు, నా ఉద్దేశ్యంలో అభిమానులు వేరు, అభిమాన పాఠకులు వేరు.

రచయితను అభిమానించే వారంతా పాఠకులు కానవసరం లేదు. పాఠకులంతా రచయిత పట్ల అభిమానం పెంచుకుంటారని నేననుకోను.

నావరకు నాకు అభిమానులున్నారు, పాఠకులున్నారు. నా రచనలకు, పుస్తకాలకు అభిమానులున్నారు. పుస్తకాలు అభిమాన పాఠకుల్ని సంపాదించుకోవడం విశేషం. నేను ఎవరో తెలియకపోయినా నా పుస్తకాలు చదివి నన్ను అభిమానించేవారు, నా కోసం వచ్చేవారు ఎక్కువ. ఇది ఒక విచిత్ర స్పందన.

గత 50 సంవత్సరాల సాహిత్య జీవితంలో ఎన్నో పరిణామాలు చూచాను. నాకే కాదు, ఈ విషయం రచయితలందరికీ అనుభవమే. ఒకప్పుడు కథలు, కల్పనలు ఇష్టపడిన పాఠకుడు క్రమంగా వాటికి దూరం అయ్యాడు. ఒక

రచయితగానే కాక, పత్రికల సంపాదకత్వ బాధ్యత్లలు 30 సంవత్సరాల పాటు పైన వేసుకున్న నాకు, పాఠకుల నాడి తెలుసు, రచనల వేడి తెలుసు. రచయితల వరవడి తెలుసు. అన్నీ అంతో ఇంతో ఆకళింపు చేసుకుని, వాటికి దూరంగా ఎందుకు జరిగానో నాకైతే తెలియదు. కథ, నవల లాంటి కాల్పనిక సాహిత్య ప్రక్రియల్ని కాదని 'యోగంనీడలోకి' ఎలా ఎందుకు వచ్చానో 'సత్యకథ' మొదటి భాగంలో కొంత వరకు రాశాను. ఈ రెండవ పుస్తకంలో నా యోగాశ్రమ జీవితాన్ని మరికొంత వివరంగా విశ్లేషించ యత్నించాను.

"యోగంలో చేరి నీవు ఏం సాధించావు?" అని చాలామంది సాహితీ మిత్రులు ప్రశ్నిస్తుంటారు.

వారికి నా మౌనమే సమాధానం.

ఏదో సాధించాలని నేను యోగంలో చేరలేదు.

లోకాన్ని ఉద్ధరించాలన్న మహాసంకల్పంతోనూ నేను యోగం చేయడం లేదు. లాభాలు, ప్రయోజనాలు ఆశించి 'యోగం' చేయటం లేదు.

యోగం జీవితంలో ఒక భాగం అయింది. అంతే.

హైదరాబాదులో ఉన్నా, తిరుపతిలో ఉన్నా, ఇప్పుడు సికిందరాబాదులో ఉన్నా నా కేంద్ర బిందువు యోగమే. 'యోగమేరా జీవితం....యోగమేరా శాశ్వతం' అన్నట్లు యోగమే ఊపిరిగా జీవిస్తున్నాను. యోగసాధనకు ఎంతటి విలువనిస్తానో, యోగ రచనలకు అంతే విలువనిస్తాను. నా వరకు 'యోగం'పై రచనలు చేయడం యోగసాధనలో ఒక భాగం. గత ముప్ఫయి సంవత్సరాలుగా మనసా, వాచా, కర్మణా యోగజీవనం సాగిస్తున్ననాకు, మరొక వ్యాపకం లేదు. అందుకు అవసరం కనిపించలేదు. నా పుస్తకాలు అనేకమంది మంచి పాఠకుల్ని సంపాదించుకున్నాయి. అది చాలు. మంచి పాఠకులు ఎప్పుడూ మంచి పుస్తకాలనే ఎన్నుకుంటారు. మంచి పుస్తకాన్ని మంచి మనస్సుతో, గొప్ప హృదయంతో ఆదరిస్తారు, అభిమానిస్తారు.

నా డెబ్భయ్యవ ఏట, జ్ఞాపకాల లోతుల్లోకి పయనించి, అందిన మటుకు పట్టుకోగలిగాను. నేను మరచిపోయినవి, చెప్పలేక పోయినవి, ఎన్నో ఉండి ఉంటాయి. నాకు డెయిరీలు రాసే అలవాటు లేదు. ఎవరితోను పెద్దగా పరిచయాలు, స్నేహాలు పెంచుకోను. ఏకాంతంగా ఉండడం చిన్నతనం నుండి అలవాటు. అంచేతనే జీవితంలో చెప్పుకోదగ్గ స్నేహితులు మిగల్లేదు. నా జ్ఞాపకాలే

నాకు హితులు, సన్నిహితులు, స్నేహితులు. ఒకప్పుడు పుస్తకాలు విపరీతంగా చదివే అలవాటు. యోగంలోకి వచ్చాక 'చదువు' చిక్కిపోయింది. పాతిక, ముప్ఫయి సంవత్సరాలుగా చదవడం తగ్గిపోయింది. చదవడం తగ్గాక 'మంచి' రాత మొదలైంది. నా 'రాత' మారింది యోగంతోనే.

"ది డిస్కవరీ ఆఫ్ మాస్టర్ యోగా"తో నా రచనా వ్యాసంగం కొత్త మలుపు తిరిగింది. తర్వాత "యోగాశ్రమ లేఖలు" కొత్త వాకిళ్లు తెరిచిన పుస్తకం. ఆ తర్వాత "మాస్టర్ యోగదర్శిని" మరో 'శార్వరి'ని ఆవిష్కరించింది. ఇవి నా యోగప్రస్థానంలో తొలి నెగళ్లు. 1977లో హైదరాబాదుకు మకాం మారాక శ్రీ అరవిందుని 'సావిత్రి' తొమ్మిది భాగాల 'కావ్యకృతి' సాహితీ మిత్రులకు నా కవితాత్మను, యోగ హృదయాన్ని పరిచయం చేసింది. 1983లో నా అసలైన 'మహాయాత్ర' ప్రారంభమైంది. నాటి నుండి "నా యోగాశ్రమ జీవితం" కొత్త పుంతలు తొక్కి, చిత్రమైన మలుపులు తిరుగుతూ వస్తున్నది. ఆ వివరాలన్నీ ఈ పుస్తకంలో చూడవచ్చు.

నాదైన ముద్ర తర్వాత రాసిన పుస్తకాలలో కనిపిస్తుంది. సంతకం అవసరం లేని రచనలు నావి. శ్రీకృష్ణావతారం, మాస్టర్ యోగచరిత్ర, శ్రీ గురుగీత రెండవ మజిలీలో వెలిగించిన దీపాలు. ఆ తర్వాత మహాచైతన్యం, కుండలిని, శక్తిపాతం, సమాధి, నా యోగమందిరానికి నాలుగు స్తంభాలయ్యాయి. 'ఆంధ్ర మహాసావిత్రి' మూడు భాగాలు మూడంతస్థులు. నా షష్టిపూర్తి సందర్భంగా వెలువడిన 'సత్యసంహిత', '60 వసంతాల శార్వరి' కనకాభిషిక్తుణ్ని చేసిపెట్టాయి. గీతాసాంఖ్యం, గీతా పరమార్థం విమర్శనాత్మక రచనలు. 'మాస్టర్ సి.వి.వి. జీవితకథ' నాకు పునర్జన్మను ప్రసాదించి, ఉన్నత పథాలలో పయనింపచేస్తున్న గురుదేవులు మాస్టర్ సి.వి.వి. గారికి నేను ఆత్మీయంగా సమర్పించుకున్న గురుదక్షిణ. అప్పుడప్పుడు 'నేనున్నాను, నన్ను మరచిపోవద్దు' అని హెచ్చరిస్తున్న 'మృత్యువు' పై ఒక అనుశీలన 'నా మృత్యువు తర్వాత జీవితం'. ఎందరో మహాత్ములు, మహాయోగులు నాకు కరదీపికలుగా ఉన్న వారికి నా కృతజ్ఞతా నివాళులు. 'మాస్టర్స్ యోగదర్శిని' 'మాస్టర్స్ అండ్ ది ఆర్ట్ ఆఫ్ మెడిటేషన్' తెలుగువారు కాని వారికోసం రాసిన ఇంగ్లీషు పుస్తకం.

ఇప్పటికి ఇవీ మా తోటలో పూచిన పూలు, వీచిన గాలులు, ప్రసరించిన పరిమళాలు.

# ఈ తోట నా సొంతం కాదు

ఈ తోట నా సొంతం కాదు
ఈ తోటలోని లతలు, చెట్లు, ఏవీ నా సొంతం కాదు
ఈ తోటకు నేను యజమానిని కాను
కేవలం ఒక తోట మాలిని
ఇందులోని ఏ చెట్టూ ఎండి పోకూడదని నా తపన.
ఏ తీగా వాడి, నేల రాలిపోకూడదు.
అందుకే వేయి కళ్ళతో కాపలా కాస్తుంటాను.
అవన్నీ వాటి జీవశక్తితో అవే పెరుగుతుంటాయి.
వాటి ఆనందానికి నేనెన్నడూ అడ్డు నిలవను
కాదంటే కాసిన్ని నీళ్లు పోసి తృప్తి పడుతుంటాను.
ఇవన్నీ నేను స్వయంగా నాటిన చెట్లు కానే కావు.
కొన్ని మాత్రమే విత్తనాలు నాటి పెంచినవి.
అవంటే నాకు చాలా ప్రేమ.
ఎక్కడో పెరిగిన చెట్లను వేళ్లతో పెకలించి తెచ్చి
ఈ తోటలో నాటాను.
ఈ వాతావరణం సరిపడక కొన్ని చచ్చి పోయాయి.
కొన్నింటిపై మోజుపడి అంటుకట్టి తెచ్చాను.
నా తోటలో అవి పాత పూలనే పూస్తున్నాయి.
పాత వాసనే వెదజల్లుతున్నాయి.
విరబూసిన ఈ నందనవనంలో ఏ ఒక్క పూవూ నాది కాదు
ఏ ఒక్క చెట్టూ, తీగా నా శ్రమను గుర్తించదు
కనీసం నా ప్రేమనైనా పంచుకోదు
ఈ తోటే కాదు, ఈ లోకమూ నాది కాదనిపిస్తోంది.
నేను పెంచిన చెట్లలా
నేనూ
ఓ చెట్టునై, ఓ పూవునై ఎప్పుడో రాలిపోతాను.

# 1983 అగ్ని కీలాద్రి

**యోగానికి నేను చెప్పుకున్న నిర్వచనం 'అగ్ని కీలాద్రి' అని.**

నేను అనుభూతించిన శిఖరంపైన - చల్లని అగ్నికీలలు -
నేను అనుభవించిన శీతలశైలాలలో - నిప్పునెగళ్లు -
నేను నడయాడిన సానువులలో - అగోచర దీపశిఖలు -
అవి అగమ్య కాంతి వలయాలు ...
అదృశ్యంగా ఉన్న శక్తితరంగాలు ...
ఎన్నో ... ఎన్నెన్నో !

ఇన్‌స్పైరింగ్‌గా రాయడం వేరు ... ఇన్‌స్పిరేషన్‌తో రాయడం వేరు - రచనానుభవం నాకు నేర్పిన పాఠం ... అది నా రచనాసూత్రం. ప్రతి రచయిత తొలినాళ్లలో ఒక ఇన్‌స్పిరేషన్‌తో రాస్తాడు. లేదా ఇన్‌స్పిరేషన్ వచ్చినప్పుడు మాత్రమే రాయగలడు. దానిని ముద్దుగా 'మూడ్' రావడం అంటాం. అలాంటి మూడ్ రావడానికి పూర్వ కవులకు కాంతలు, కర్పూరం గుబాళించే తాంబూలం, ఇంకా ఇంకా ఏవేవో రసిక రాజులు సమకూర్చిపెట్టేవారు లేదా కవులే స్వయంగా కల్పించుకునేవారు. ఈకాలంలో కవులు, రచయితలు ఇన్‌స్పిరేషన్ రకరకాలుగా పొంది మరీ రచనలు చేస్తున్నారనుకోండి.

ఇక్కడ ఇన్‌స్పైరింగ్‌గా రాయడం అన్నది ప్రధాన విషయం. ఇన్‌స్పిరేషన్‌తో రాసినప్పుడు మాటలు, వాక్యాలు చకచక నడుస్తాయి. రచయిత ఒక 'ఫ్లో' వెంట పరుగుతీస్తాడు. తన పాఠకుల్ని తన 'ఫ్లో' వెంట పరుగులు తీయించగలడు. ఇప్పుడు నా పుస్తకాలకు ఇన్‌స్పిరేషన్ ప్రధానం కాదు. లోపలనుండి ఒక బలవత్తరమైన శక్తి ఏదో తోస్తే తప్ప రాయని పరిస్థితి. ఫలానా విషయంపై రాయాలని నిర్ణయించుకోవడం ఉండదు. ఆలోచన ఉండదు. సామగ్రిని సమకూర్చుకోవడం ఉండదు. ఉండేది సాధన ఒక్కటే. సాధనలో ఓ మెరుపు మెరుస్తుంది. ఆ మెరుపు బయటకు రావాలి. అది గుండెని చీల్చుకుని వస్తుంది. ఆ వత్తిడిని తట్టుకోలేక రాయడం. అదీ నా రాత.

ఇక్కడ పాఠకుడు రచయిత వెంట పరుగుతీయడు. రచయితను పూర్తిగా మరచిపోతాడు. అతను చెప్పే విషయంలోకి అప్రయత్నంగా చొరబడతాడు. ఆ భావారణ్యంలో తప్పిపోయి, రాసిన వాడిమాట మరచిపోయి, ఏదో వెదుకులాట

మొదలుపెడతాడు. అది ఒంటరి అన్వేషణ. కనిపించని సత్యాన్ని అందుకోవాలని చేతులు చాస్తుంటాడు. అవి అందినట్లే ఉంటూ అందకుండా పోతుంటాయి. అవి మిణుగురు వెలుగులు. ఆ వెలుగుల్ని నిజం చేసుకోవాలని తహతహ. రచయిత ఏయే భూమికల్ని స్పృశించి వచ్చాడో ఆ యా భూమికలపైన పాఠకుడు పయనించాలి. రచయిత ఏ ఆనందసీమలలో విహరించాడో ఆ సీమలలో పాఠకుడు సైతం ఆనందం పొందాలి. అనుభవించాలి. అదీ ఇన్‌స్పైరింగ్‌గా రాయడంలోని ఆంతర్యం... అనుభూతి. దీని వెనుక కొండంత అనుభవం ఉంటే తప్ప కొంచెమైనా అద్దంలో ప్రతిబింబించదుగదా!

'సావిత్రి' రచన నా సాహిత్య జీవితాన్ని, యోగజీవితాన్ని ఒక కుదుపు కుదిపి, ఒక మలుపు తిప్పింది. అలా జరుగుతుందని నేను ఊహించలేదు. మనం ఊహించినట్లు చాలా జరగవు. ఇదీ వాటిలో ఒకటి. 'సావిత్రి'కి ముందు నేను ఒక చిన్నకవిని. సాధారణ రచయితను. జర్నలిస్టును. కథలు, నవలలు ఎక్కువగా రాస్తుండేవాడిని. రేడియో కవితలు, సంగీతరూపకాలు, ప్రసంగాలు, నాటికలు చాలా రాశాను. ప్రదర్శన యోగ్యమైన యక్షగాన రూపకాలూ రాశాను. అవి ప్రదర్శించబడ్డాయి. నేను మద్రాసులో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో దాశరథిగారు, గొల్లపూడి మారుతీరావు రేడియోలో ఉద్యోగాలు చేస్తుండేవారు. వారికోసం రేడియోకి లెక్కలేనన్ని కథలు, ప్రసంగాలు, నాటికలు రాశాను. అవి రేడియోలో అనేకమార్లు ప్రసారమైనాయి. సినిమా రచయిత కావాలని శతధా ప్రయత్నిస్తున్న రోజులలో, విధివశాత్తూ యోగంలో ప్రవేశించడం జరిగింది. అది పూర్వజన్మ సుకృతం అనుకుంటా! అదే నా జీవితంలో గొప్ప మలుపు.

సావిత్రి రచన నా జీవితంలో చెప్పుకోదగిన రెండవ మలుపు. అంతకు ముందరిది సాహిత్య వ్యవసాయం. ఇరవై నవలలు, కొన్ని కథలసంపుటాలు, నాటకాలు, కావ్యాలు ... కలసి అరవై పుస్తకాల ప్రచురణ జరిగింది. కథకుడుగా, నవలారచయితగా నాకు అవార్డులు రాలేదు. జర్నలిజంలో ఉన్నందున, పత్రికలలో ఉద్యోగం కనుక నిబంధనలు, ఆంక్షలు ఎక్కువ. కొన్ని కథలు, నవలలు కన్నడంలో, హిందీలో అనువదించబడ్డాయి. సావిత్రి రచన ఒక్క కుదుపు కుదిపింది. నాలో అంతకుముందున్న ఆలోచనా ధోరణి మారింది. జీవితాశయమే మారిపోయింది. సాహిత్యంపట్ల, పేరుప్రఖ్యాతులపట్ల, కీర్తిపట్ల వ్యామోహం పోయింది. పబ్లిసిటీ కోసం వెంపరలాట లేదు... ఒకవిధమైన నిర్లిప్తత. అది వైఫల్యాలవల్ల, నిరాశవల్ల వచ్చింది కాదు - ఏ సభలకూ వెళ్లాలనిపించదు. ఎవరితోను కలవాలనిపించదు. సాహిత్య చర్చలంటే అయిష్టత ఏర్పడ్డది. ఆఫీసులో రచయితలు కలిసినా 'పని'వరకే పరిచయాలు పరిమితం. ఈ మనస్థితి ఎందువల్ల ఏర్పడిందీ ఆలోచించలేదు.

'సావిత్రి' పూర్తిగా రాయాలన్నది ఒక్కటే తపన. అప్పటికి యోగం చేసుకోవడం తప్ప, ఇతర వ్యాపకాలు, ప్రణాళికలు లేవనే చెప్పాలి. సావిత్రి మూడు భాగాలు 'మహోదయం, అన్వేషణ, స్పందన' వెలువడే సమయానికి విద్యావంతుల దృష్టి సావిత్రిపైన పడ్డది. ఒక ప్రత్యేకమైన గుర్తింపు లభించింది. కథలు రాసినా, నవలలు రాసినా, కవితలు రాసినా విద్యావేత్తల గుర్తింపు అంతంతమాత్రంగానే ఉంటుంది. పత్రికల్లో పనిచేసిన కారణంగా, ఎడిటర్ అయినా, సబ్-ఎడిటర్ అయినా రచయితలు యిచ్చే విలువ, మాకు ఉండే విలువ పరిమితమే. అది తాత్కాలికం. వారి అవసరాలు తీరిన తర్వాత ఎడిటర్లను పలకరించే వారుండరు.

మనిషి జీవితంలో ఇలాంటి మార్పులు విచిత్రంగా ఏర్పడుతుంటాయి. వాటిని గుర్తించడం, గుర్తుంచుకోవడం జరగదు. పూర్తిగా కథలు, నవలలు వమానడం వల్ల, వరసగా 'సావిత్రి' భాగాలు రావడం వల్ల పాఠకులలో చిత్రమైన స్పందన రాసాగింది. అరవిందుని మహాకావ్యం 'సావిత్రి' సాధారణంగా ఎవరికీ అర్థం కానిది. అర్థమయ్యే రీతిలో తెలుగురచన సాగటం విశేషం. అరవిందుల యోగంపై సాహిత్యం మక్కువ గల విద్యావేత్తలు,అరవిందుని భావజాలంతో పరిచయం ఉన్నవారు అభినందించారు, ఆనందించారు. అది ఒక వర్గమే కావచ్చు. సంఖ్య చిన్నదే కావచ్చు, కాని వారంతా సత్యాన్వేషులు! యోగభూమికలలో విహరించేవారు. అంచేత 'సావిత్రి' ద్వారా 'శార్వరి' ని అంచనా వేయసాగారు. ఒక్కొక్కగ్రంథం ఆ రచయిత జీవితానికో, మనస్సుకో అద్దం పడుతుంది.

సావిత్రి నా జీవితానికి దర్పణం కాదు గానీ, నా మనస్సుకు, మానసిక పరిణామానికి, పక్వతకు అద్దం పట్టిందేమో! సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, శ్రీ వానమామలై వరదాచార్యులు, శ్రీ గడియారం వెంకటకృష్ణశర్మ వంటి మహాకవుల ఆశీస్సులు అందుకోగలిగాను. నా సమకాలిక మహాకవులు డా॥ సి. నారాయణరెడ్డి, దాశరథి, బోయి భీమన్న లాంటి వారెందరో మనసారా అభినందించసాగారు. బహుశా ఇందరి అభినందనలు సైతం నా రచనకు ఉద్దీపనాలైనాయేమో! కథకుడు, నవలారచయిత 'శార్వరి' తెరమరుగైనాడు. అందుకు విచారం లేదు.

సావిత్రి కావ్యకర్తగా, అరవిందుని హృదయాన్ని తెలుగు విద్వత్ జనావళికి ఆవిష్కరించగలిగిన అవకాశం అదృష్టం నాకు కలిగింది. తర్వాత ఎక్కడకు వెళ్లినా ఫలానా కథ, ఫలానా నవల రాసిన 'శార్వరి' మీరూ ఒక్కరేనా? లేక వేరువేరా? అన్న ప్రశ్నలు ఎదురైనప్పుడు నవ్వుకోక తప్పలేదు. సగర్వంగా తలెత్తుకోవలసిన పరిస్థితి అది.

## 1983 - హైదరాబాద్‌లో యోగాసెంటర్

ఉగాదినాడు మా యోగాసెంటర్ ప్రారంభించాం. డి.ఎన్.రావు స్థానికంగా వున్న యోగమిత్రుల్ని ఆహ్వానించారు. పత్రికలలో వార్త ప్రచురించడం వల్ల కొంతమందికి సమాచారం అందింది. 'యోగదర్శిని' మూడునెలల పత్రికను ఉగాదికి ముందే విడుదలచేయడం వల్ల యోగకేంద్రం విషయం పదిమందికీ తెలిసింది. నాకైతే ధైర్యం లేదు. యోగకేంద్రం నిర్వహించడం, సమావేశాలు జరపడం మాటలతో అయ్యేపనికాదు. చాలా అర్హత లుండాలి. మాస్టరుగారి ఆశీస్సు లుండాలి. డి.ఎన్.రావుగారు నిర్వాహకులు. శ్రీ దిడుగు నారాయణరావు, కవులూరి సీతారామయ్య, మైనంపాటి మధుసూదనరావు, మన్నవ హనుమంతరావు, వేదాంతం లక్ష్మీనారాయణ, ఎస్. పున్నయ్య మా సీనియర్ సాధకులు. వీరు మాస్టర్ ఎం.ఎన్.గారి శిష్యులు. మా యోగకేంద్రానికి మూలస్తంభాలుగా నిలిచిన మహర్షులు.

1983 ఉగాదికి ప్రారంభించిన మా యోగకేంద్రంలో ఆ సంవత్సరం చేరినవారు 80 మంది. అప్పుడు చేరినవారు సెంట్రల్ ఎక్సయిజ్ శాఖలో పనిచేస్తున్న, నా చిరకాలమిత్రుడు శ్రీ జి. నారాయణరావు, వి. గంగాధరరావు, యామినీ సరస్వతి, బెజవాడ కామేశ్వరరావు, బెజవాడ వీరయ్య, నందూరి పార్థసారధి, అధికారి సత్యనారాయణ, సి. శేషాచల రెడ్డి, ఎస్. బస్వరాజ్, జె. రామకృష్ణరాజు, వై. ఆదివిష్ణుమూర్తి, బండారు వెంకటశేషయ్య - వీరంతా ఇప్పటికీ యోగం చేస్తూనే ఉన్నారు. యోగాస్కూలు గురించి పత్రికా ప్రకటన చేయకపోయినా 'యోగదర్శిని' పత్రిక సాధకుల్ని ఉత్తేజపరచిందని చెప్పాలి. నాటికి, నేటికి నా పుస్తకాలు, యోగమార్గం పత్రిక కొత్తవారికి ఆసక్తి కలిగిస్తున్నాయి. యోగసాధన, యోగాట్రీట్‌మెంట్ జనంలో ఆకర్షణ కలిగిస్తున్నాయి. యోగావర్క్ సైలెంట్‌గా సాగాలన్న నా లక్ష్యం ... అలా నెమ్మదిగా నెరవేరసాగింది.

యోగకేంద్రం అని బోర్డు తగిలించినా చుట్టుపట్లవారు ఎవరూ రాలేదు. యోగం నేర్చుకోండి అని పిలిచినా జనం రారు. ఏదో ప్రయోజనం ఉండాలి. మాస్టరుగారి దగ్గరకు మొదట ట్రీట్‌మెంట్ కోసం వెళ్లినవారే యోగసాధకులయ్యేవారు. అది సంప్రదాయం కాకపోయినా అదొక చక్కనిమార్గం. నావద్దకు కొందరు అలా ట్రీట్‌మెంట్‌కోసమే వచ్చారు. చింతా రామచంద్రమూర్తి, వి. అనూరాధ, వెంకటరావు, జొన్నలగడ్డ సూర్యనారాయణ, ఆర్. నాగేశ్వరరావు, గోపాలకృష్ణ, పి. జమున, సి. నారాయణాచారి, ఎస్. ఫక్రుద్దీన్, ఆర్.వై.కె.మునిమాణిక్యం, డి. వీరశేఖరరావు - ఇలా ఎందరో ట్రీట్‌మెంట్ కోసం వచ్చారు. ఎనిమిది నెలల కాలంలో 80 మంది యోగంలో చేరడం తృప్తిగా ఉంది. నేను యోగచికిత్స చేయను అని చెప్పడానికి వీల్లేని స్థితి. ఏం రాసినా, ఎన్ని ఉపన్యాసాలు చెప్పినా ఎవరు వింటారు? దేనికైనా ఫలితం ఉండాలి.

ఇక్కడ మొదటగా చేసిన కేసు అనూరాధ అనే ఇంటర్ విద్యార్థిని. ఆ పిల్లకు దయ్యం పట్టిందట. ఆ పిల్ల అన్న వెంకటరమణకు అదే జబ్బు. జొన్నలగడ్డ సూర్యనారాయణ తీసుకువచ్చారు. ఈయన నరసరావుపేట మా యోగమిత్రులు శ్రీ జొన్నలగడ్డ కృష్ణమూర్తి గారి అన్నగారు. మాస్టర్ ఎం.ఎన్.గారి ప్రియశిష్యుడైన బ్రహ్మాండం కుటుంబరావుగారి అల్లుడు. మామగారి వద్దనే యోగోపదేశం పొంది నలభై సంవత్సరాలుగా యోగం చేస్తున్నారు. పోస్టుమాస్టర్‌గా రిటైరై దిల్‌షుక్‌నగర్‌లో ఉంటున్నాడు. ఆయన తీసుకువచ్చిన అనూరాధ, వెంకటరమణలకు చికిత్స చేయడం, వారు స్వస్థులు కావడం జరిగింది. తర్వాత పట్టుకున్న ప్రతి కేసు విజయవంతమయింది.

యోగం ప్రచారం కావడానికి కొన్ని మహత్తులు అవసరం. మాస్టరుగారు చాలా మహత్తులు చూపారు. షిర్డీబాబా, బ్రహ్మంగారు ఇలాంటి సిద్ధపురుషులంతా ప్రదర్శనకోసం, ప్రచారంకోసం కాకపోయినా కారుణ్యదృష్టితో మానవసేవ చేసేవారు. అవి తర్వాత మహత్తులుగా ప్రచారం పొందాయి. భక్తి పెంపొందించుకుంటే తమ కష్టాలు తొలగిపోతాయని, ఆపదలు గడుస్తాయని, కోరిన కోరికలు బాబా తీరుస్తాడని భక్తి పెంపొందించుకుంటారు తప్ప బాబా ఆచరించిన యోగం ఏమిటి? వారి సాధన ఎలాంటిది? అని ఎవరూ ఆలోచించరు! ఏ మహాత్ముని కరుణతో మనం లబ్ధిపొందినా, అంతటితో ఆగిపోకూడదు. ఆ చిన్ని సహాయం ఆధారంగా మన జీవితాలు మంచి మార్గాన నడవాలి. మన జీవితాలలో ఒక దివ్యజ్యోతిని వెలిగించుకోవాలి. అంతేగాని, అవసరమైనప్పుడు మాత్రమే పటాలకు దుమ్ము దులిపి నాలుగురోజులు దీపం వెలిగించి, అవసరం తీరాక అవతలపెట్టడం తప్పు. భక్తి అన్నది ఎవరిపైన ఉన్నా అది దినదినాభివృద్ధి చెందాలి. మనల్ని ఒక గమ్యంవైపు నడిపించగలిగేది కావాలి.

మాస్టరుగారు మహత్తుల్ని ప్రదర్శించడం కన్న యోగశక్తితో చికిత్సలు చేయడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. తన శిష్యులచేత చికిత్సలు చేయించేవారు. యోగానికి మహిమలు ప్రదర్శించనవసరం లేదని చెబుతూనే వాటిమీదనే తమ కీర్తిసౌధాలను నిర్మించుకుంటున్నవారిని చూస్తున్నాం. మందులవల్ల, డాక్టర్లకు అలవికాని జబ్బులకు మాత్రమే యోగంతో చికిత్స చేయాలన్న నిబంధనను నేను పాటిస్తాను. సాధారణమైన జబ్బులైతే మందులకు తగ్గేవైతే డాక్టర్ల వద్దకే పంపుతాను. ప్రతి చిన్న రోగానికి యోగశక్తిని వెచ్చించడం నాకిష్టం ఉండదు.

అనూరాధ అనే అమ్మాయికి రెండు మూడు వారాలు చికిత్స చేశాను. వాళ్ల ఇంటికి వెళ్లి వచ్చాను. ఒకరోజు ప్రేయర్‌కు వచ్చినప్పుడు ఆ అమ్మాయి అన్నది, "గురువుగారూ, నాకు మీ అబ్బాయిగారు ట్రీట్ చేస్తే తగ్గిపోతుందనిపిస్తోంది." చి॥

వసంతకుమార్ అప్పటికింకా కుర్రవాడు. ప్రేయర్ చక్కగా చేస్తుంటాడు. తనని ట్రీట్‌మెంట్స్‌కు నేను ప్రోత్సహించలేదు. ఆ పిల్ల కోరిక అలా బయటపెట్టింది! అది మాస్టర్‌గారి ప్రేరణ అనుకున్నాను. ఎవరికి ఎలాంటి శక్తిని మాస్టంగారు అనుగ్రహిస్తారో మనకు తెలియదు. ఆ అమ్మాయిని వసంతకుమార్ ట్రీట్ చేశాడు. తగ్గిపోయింది. ఆ రోజుతో దయ్యంపారిపోయింది. నేను చేస్తే ఎందుకు కాలేదు? వసంత్ చేస్తే ఎందుకు అయింది? కారణాలు వెతకనవసరం లేదు గానీ ఆనాటి నుండి యోగావర్క్‌లో, ట్రీట్‌మెంట్స్‌లో వసంతకుమార్ భాగస్వామ్యం అవసరం అన్నది మాస్టర్‌గారి సంకల్పం. కొన్నికొన్ని కేసులు అంతఃప్రేరణవల్ల తనే ట్రీట్‌చేస్తుంటాడు. నేను కాదనను. బుద్ధి పుట్టి, ముందుకు వచ్చి ఎవరు ట్రీట్‌మెంట్ చేస్తానన్నా నేను కాదనను. వారికి, నాకు శక్తి మాస్టర్‌గారి నుండి వచ్చేదే. యోగంలో ఎక్కువ తక్కువలు లేవు. చిన్న పెద్ద అని ఉండదు. ఎవరు మాస్టర్‌గారికి దగ్గర అయినారన్నదే ముఖ్యం.

0 0 0

చింతా శ్రీరామచంద్రమూర్తి ఆర్.టి.సి. డిపో మేనేజర్. భార్యను తీసుకువచ్చాడు. ఆమెకు మూడు, నాలుగు ఆపరేషన్లు జరిగాయి. గర్భసంచి ఇన్‌ఫెక్ట్ అయింది. బ్లీడింగ్ ఆగడం లేదు. వారం రోజులు భర్త వద్ద ఉంటే మూడు వారాలు పుట్టింట ఉంటుంది. నీరసం, లేవలేదు, పనులు చేసుకోలేదు. సన్నగా, పీలగా ఉండేది. ట్రీట్‌మెంట్ చేసిన రోజు నుండే బ్లీడింగ్ ఆగింది. కడుపులో పుండు తగ్గిపోసాగింది. నెల రోజుల్లో చక్కని ఆరోగ్యం కలిగింది. మనిషి కాస్త లావైంది. ప్రతి ఆదివారం ప్రేయర్‌కు తప్పక వచ్చేది.

ఒక వారం అందరం ప్రేయర్ చేస్తుండగా లక్ష్మిపైకి ఒక దేవీశక్తి వచ్చి ఆవహించింది. గుడిలో దేవత వలె నిటారుగా, అభయముద్రలో కూర్చుండిపోయింది. మనిషిలోకి నిమిషాలలో దివ్యతేజస్సు వచ్చి, ధగ ధగ మెరిసిపోతున్నది. కళ్లు మూసుకుని 'యోగముద్రలో ఉన్నందున ఆమెను అంచనా వేయలేకపోయాను. సాధారణంగా అలాంటి సమయాలలో క్షుద్రశక్తులు ఏవైనా ఉంటే బయటకొస్తుంటాయి. దివ్యశక్తులు సైతం మనిషిపైకి వస్తాయని నాకు తెలియదు. అనుభవం లేదు. మామూలు పద్ధతిలో ఆమె నుదుటిన విభూతి పెట్టబోయాను. నా చేతిని విదిలించివేసింది. నేను కొంచెం ఖంగు తిన్న మాట నిజం. ఇలాంటి కేసుల విషయంలో ఇదమిత్థమైన సూత్రాలు, పద్ధతులు, టెక్నిక్ ఉండవు. ఆ క్షణంలో నాకు తోచినట్లు చెయ్యడమే. అది ఎలా చేశారని ఎవరైనా ప్రశ్నించినా సమాధానం చెప్పలేం. ఇది ఇలాగే చేయాలన్న రూల్ ఉండదు. ఏ శక్తుల్నిగానీ ... క్షుద్రశక్తులుగానీ, దైవశక్తులుగానీ ... మన శక్తికి లొంగవు. మన ప్రేమకు లొంగి, అనుకూలంగా ప్రవర్తిస్తుంటాయి. దయ్యాలు, భూతాలైనా అంతే. హ్రాం, హ్రీం అంటే అవి మరీ పేట్రేగిపోతాయి. ఏలైతే మన భరతం పడతాయి. వాటిని ప్రేమగా లాలించి,

బుజ్జగిస్తే మనం కోరినట్లు చేస్తాయి. ఇదంతా పైకి కనిపించని వ్యవహారం. యాస్ట్రల్ శరీరాల భాష అది. ఆ భాషలో భావాల మార్పిడి జరుగుతుంది.

లక్ష్మి నా చేతిని వదిలించి వేసి, గంభీరంగా అన్నది : "నాకు విభూతి పెట్ట సాహసిస్తున్నావు? నేనెవరనుకుంటున్నావు?" అది గాలి చేష్ట కాదు. అది దయ్యం కాదు. స్పష్టంగా తెలిసింది. నేను నమస్కారం చేసి, వినయంగా ప్రశ్నించాను "అమ్మా, నీవు ఎవరవో తెలియని అజ్ఞానంలో ఉన్నాను. నన్ను క్షమించు. నిన్ను అవమానపరచాలన్నది నా అభిమతం కాదు. దయచేసి నీవు ఎవరవో చెప్పు. నేనేం చేయాలో చెప్పు." అన్నాను. ఆమె ఫక్కున నవ్వింది. స్నిగ్ధమైన చిరునవ్వు. మొహంలో కోటిదీపకాంతులు. ఆమె వెనుక కాంతివలయం. తల చుట్టూ ధగధగ మెరుస్తున్న కాంతిచ్ఛటలు. ఖచ్చితంగా ఈమె ఒక దేవతాశక్తి అనుకుని చేతులు మోడ్చి నమస్కరించాను.

"నేను లక్ష్మిని" అన్నది.

"అవును ... నీపేరు లక్ష్మి అని నాకూ తెలుసు" అన్నాను.

ఆ అమ్మాయి పేరు లక్ష్మి.

"కాదు ... నేను మహాలక్ష్మిని" అని దరహసించి, కళ్లు విప్పింది.

"ధన్యుణ్ణి దేవీ! ఈ పేదవాడిని కరుణించి, ఇప్పటికి ప్రత్యక్షం అయినందుకు కృతజ్ఞతలు. మాపైన అనుగ్రహంతో ఈ రూపంలో మా ఇంటికి వచ్చావు." అని మరొక్కసారి నమస్కరించాను. ఆమె కళ్లు మూసుకుంది. ట్రాన్స్‌లోకి వెళ్ళిపోయింది. అప్పుడు అదనుచూచి, మాస్టరుగారిని స్మరించి, విభూతి పెట్టాను. నిమిషంలో ఆ దేవత వెళ్లిపోయింది. ఈ అమ్మాయిలో ఉన్న తేజస్సు తగ్గిపోయి మామూలైంది. నీరసంగా పడిపోయింది. అరగంటకు గానీ ఆమెకు స్పృహ రాలేదు. తర్వాత ఆమె ఆరోగ్యం పూర్తిగా చక్కబడ్డది. అది నాకు లక్ష్మీదేవి ప్రసన్నం అయినతీరు. అప్పటివరకు నా జీవితంలో దరిద్రం దోబూచులాడేది. ఆ తర్వాత ఆర్థికపరమైన ఇబ్బందులు కలగలేదనే చెప్పవచ్చు. అవసరానికి ఎలాగో డబ్బు సమకూరుతుంది ... బయటపడిపోతుంటాను.

నాటినుండి యోగాస్కూలు పని ఎక్కువైంది. ట్రీట్‌మెంట్స్ నేనుగానీ, వసంత కుమార్‌గానీ, ఎవరికి వీలుంటే వారు చేసేవాళ్లం. నేను ప్రేయర్స్ నిర్వహిస్తే తాను ట్రీట్ చేసేవాడు. నేను ఇవి చేయాలి, తాను ఇవి చేయాలన్నది కాదు. పెద్దవారు వస్తే నేను చేసేవాడిని. చిన్న కుర్రవాడు ట్రీట్ చేస్తే పెద్దవాళ్లకు విశ్వాసం కుదరదు తొందరగా. విశ్వాసం, నమ్మకం లేకపోతే ట్రీట్‌మెంట్స్ జరగవు. మనుషులకు నమ్మకం కలిగించడం పెద్ద పని. అసలు నన్ను చూచినా కొందరికి విశ్వాసం కలగదు. వేషభాషలలో ప్రత్యేకత లుండవు నాకు. సాదాసీదాగా, నిరాడంబరంగా ఉండే వ్యక్తిని 'యోగి' అనలేరు. నమ్మ

బుద్ధి కాదు. లోపలి శక్తి తెలుసుకోవడం అందరికీ సాధ్యం కాదుకదా! ఒకరికోసం, ఒకరి నమ్మకం కోసం, నేను మారదలచలేదు.

ఆఫీసులో నా సహోద్యోగి పి.వి. సుబ్బారావు .. చాలా మంచివాడు. యూనియన్ లీడరు. బిజెపి పక్షపాతి. మరొక యూనియన్ ఉంది. ఈయనకు వ్యతిరేకం. మనిషి ఉత్తముడు కనుక అందరూ గౌరవిస్తారు. నాలాగా ఎడిటర్ల బాధాద్రష్టుడు అతనూ. అకారణంగా పైవారి అయిష్టానికి గురై ఉద్యోగం చేస్తున్నాడు. నేనంటే యిష్టం. సహబాధితులం కదా! వాళ్ల అబ్బాయి సుధాకర్‌కు స్కూటర్ యాక్సిడెంట్ అయింది. డిగ్రీ చదువుతున్న కుర్రవాడు. డాక్టర్లు సమ్మె చేస్తున్న రోజులు. యాక్సిడెంట్ కనుక ప్రయివేట్ డాక్టర్లు ట్రీట్‌చేయరు. గవర్నమెంటు ఆస్పత్రులలో చేర్చుకోలేదు. ఆఫీసులో దిగులుగా నాతో చెప్పి యోగంతో ట్రీట్‌మెంట్ చేయండని అర్థించాడు. కళ్లనీళ్లు పెట్టుకుని చేతులు పట్టుకున్నాడు.

"సాయంత్రం ఇంటికి తీసుకు రండి" అన్నాను.

చేయగల శక్తి ఉంది కాదు, ఏదో మొండి ధైర్యం, విశ్వాసం. ఎలాంటి కేసు అయినా మాస్టరుగారి అనుగ్రహంతో నయం అవుతుందన్న వెర్రి ఆశ, నమ్మకం నాది. నేను యోగం చేస్తానని ఆయనకు తెలుసు.

సాయంత్రం రెండు ఆటోలు వచ్చి ఇంటి ముందు ఆగాయి. నేను యోగమిత్రులతో మాట్లాడుతున్నాను. సుధాకర్‌ను అతని స్నేహితులు ముగ్గురు చేతులమీద మోసుకువచ్చారు లోపలికి. పరిస్థితి అర్థమైంది. కుర్రాడు కనీసం నడిచే స్థితిలో లేడు. బాధతో విలవిల్లాడుతున్నాడు. మరో ఆటోలో సుబ్బారావు, ఆయన భార్య సువర్చల వచ్చారు. లోపల ప్రేయర్ గదిలోకి తీసుకువెళ్లమని చెప్పాను. ఇంకా ప్రేయర్‌కు అరగంట ఉంది. ఈలోగా నేను చేయగలిగింది లేదు. లోపలకు వెళ్లి కనీసం పరామర్శించనైనా లేదు. రెండు మూడు సార్లు ఏదో చెప్పాలని ప్రయత్నించినా, నేను పట్టించుకోలేదు. అలా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశాను. యోగసాధకులు ఒక్కొక్కరే రాసాగారు. ఆదివారం ప్రేయర్‌కు కనీసం ఇరవైమంది వస్తుండేవారు.

ప్రేయర్‌కు కూర్చున్నాం. ఆ అబ్బాయికి విభూతి పెట్టి, అందరం ప్రేయర్‌కు ఉపక్రమించాం.రెండు నిమిషాలలో అతని మూలుగులు ఆగిపోయాయి. నిద్ర పోతున్నాడు ... బాధ మరచిపోయి.

ముప్పావుగంట ప్రేయర్ అయిన తర్వాత నేను లేచి వెళ్లి అతని దగ్గరగా కూర్చుని, ట్రాన్స్‌లో ఒళ్లంతా నిమిరాను. మరోపావుగంటకు అతనికి స్పృహ వచ్చింది. ట్రాన్స్‌లో నా వేళ్లు అతని విరిగిన భాగాలపైన స్పృశించాయి.

"సుధాకర్ లేవగలవా ప్రయత్నించు" అన్నాను.

తన అశక్తతను వ్యక్తం చేశాడు. "ప్రయత్నించు". నేను చేయి అందించి నెమ్మదిగా లేవప్రయత్నించమన్నాను. పది నిమిషాలలో గోడ ఆసరాగా నడవగలిగాడు. అతని మిత్రుల్ని తండ్రిగారిని దూరంగా ఉండమని చెప్పాను. తానే నెమ్మదిగా లేచి, నడచి, ఆటోవరకు వెళ్లాడు.

అతనికి రెండురోజుల్లో పబ్లిక్ పరీక్షలు, యాక్సిడెంట్ వల్ల పరీక్ష రాయలేనని దిగులు పడుతున్నాడు.

"ఎల్లుండిగదా పరీక్ష. నిన్ను పరీక్షకు పంపుతాను. రాత్రికి భోజనం చేసి చక్కగా నిద్రపో. రేపు సాయంత్రం మళ్లీ రా."

ఆ రాత్రి భోజనం చేయగానే విపరీతంగా నిద్రపోయాడట. తెల్లవారి ఏడుగంటల వరకు లేవలేదు. చాలావరకు నొప్పి తగ్గింది. బాధ లేదు. మర్నాడు సాయంత్రం అతను, అమ్మగారు, అమ్మమ్మ వచ్చారు. రెండవరోజు ట్రీట్‌మెంట్ బాగా జరిగింది... ఒకగంట ట్రాన్స్‌లో. తనకు యాక్సిడెంట్ అయిన విషయమే మరచిపోయాడు. ఆరోజు రాత్రి క్రితం రోజులా బాగా నిద్రపట్టింది. మూడవనాటికి మామూలుగా తయారైనాడు. పరీక్షలు బాగా రాశాడు. క్లాసు వచ్చింది. అతను నాకు చెప్పకుండా డక్కన్ క్రానికల్‌లో నాగురించి, ట్రీట్‌మెంట్ గురించి ఓ వ్యాసం రాశాడు. వాళ్ల నాన్నగారు జర్నలిస్టు గదా, సహాయం చేసి ఉంటారు. నా గురించి, నా యోగం గురించి ఎవరికీ చెప్పడం నాకు ఇష్టం ఉండదు. జర్నలిస్టు మిత్రులకుగానీ, కవులు రచయితలు అయిన మిత్రులకు గానీ చెప్పను. అసలు మా బంధువర్గంలో ఎవరికీ నాయోగం గురించి చెప్పింది లేదు. ఇంటికి వచ్చినప్పుడు చూచినా ఎవరూ పట్టించుకునేవారు కారు.

0 0 0

ఈ ట్రీట్‌మెంట్ తర్వాత మిత్రుడు సుబ్బారావుగారి భార్య తన స్నేహితురాలిని తీసుకువచ్చింది. ఆమె పేరు సువర్చల. మా కొలీగ్ నండూరి పార్థసారథిగారి శ్రీమతి. ఆంధ్రజ్యోతి ఎడిటర్ నండూరి రామమోహన్‌రావుగారి మరదలు. ఆ అమ్మాయి తన చెల్లెలు లక్ష్మిని, మరొక చెల్లెల్ని తీసుకువచ్చింది. అలా ఒకరి ద్వారా ఒకరు యోగంలోకి వస్తుండేవారు. లక్ష్మికి పెళ్లి కాలేదు. ఆమె అన్నగారు వచ్చాడు. వీరి తాతగారు ఈ యోగం చేసేవారట. అప్పుడు పార్థసారథి దోమల్‌గూడాలో ఉండేవాడు. లక్ష్మి అక్కగారింట ఉండేది. యోగంలో చేరిన ఒకవారం రోజుల్లో లక్ష్మికి చిత్రమైన అనుభవాలు కలిగాయి. తెల్లవారుఝామున మూడు, నాలుగు గంటలకు లేచి సంగీతం పాడడం మొదలుపెట్టేది. విపరీతంగా ఏడుస్తుంది. లేదా ఆపకుండా నవ్వుతుంది. అలా అయిదారు గంటలు ఉంటుంది ఆ ఉన్మాదం. తెలుస్తూనే ఉంటుంది కానీ ఆపుకోలేదు ... నిగ్రహం ఉండదు.

నేను ఆఫీసుకు వెళుతుండగా అశోక్‌నగర్ సెంటర్‌లో ఎదురై "అర్జంటుగా మీతో ఒక విషయం చెప్పాలి. ఇంటికి రండి గురువుగారూ" అని ఏడ్చింది.

"ఏమిటి చెప్పు" అన్నాను.

నాకు ఆఫీసుకు టైం అయింది. తిరిగి ఇంటికి పోలేను.

ప్రక్కనే ఉన్న హోటల్‌కు తీసుకువెళ్లాను. సంగతి చెప్పింది ... భయం భయంగా, దిగులుగా.

"నాకు చచ్చిపోతానేమోనని భయం"

"ఏం భయం లేదు ... ఈ కాఫీ తాగు"

తాగింది.

"ఇదే నీకు ట్రీట్‌మెంట్. ఇంక అలాంటి ఉన్మాదం రాదులే." అని ధైర్యం చెప్పి, ఇందిరాపార్కు వరకు నాతో తీసుకు వెళ్లి, తనను పంపి, నేను వెళ్లిపోయాను.

ఆ ట్రీట్‌మెంట్‌తో లక్ష్మికి బాగైంది. ఆ అమ్మాయికి కోరుకున్న వాడితోనే పెళ్లి జరిగింది. ట్రీట్‌మెంట్ వల్ల సాధకుల కోరికలు కూడా నెరవేరుతాయని అప్పుడే తెలిసింది. కానీ, యోగానికి కోరికలను ముడివేయడం నాకిష్టం ఉండదు.

0 0 0

కొన్ని రోజులకు యలమంచిలి నుండి వచ్చిన వాళ్ల తమ్ముణ్ణి తీసుకువచ్చారు సువర్చల, లక్ష్మి. అతనికి యోగం గురించి ఏమీ తెలియదు. అక్కలు రమ్మంటే వచ్చాడు. ప్రేయర్ గదిలోకి అడుగుపెడుతూనే అతను అరంగేట్రం మొదలుపెట్టాడు. రంగప్రవేశం చేస్తున్న నర్తకునివలె, నమస్కారముద్ర పట్టి, నాట్యం చేయసాగాడు. మాకు అర్థం కాలేదు. అతను పలకరిస్తే వినిపించుకునే స్థితిలో లేడు. నాట్యంలో తన్మయం చెందాడు.

"ఈ అబ్బాయి కూచిపూడి నుండి వచ్చాడా?" అని అడిగాను.

కూచిపూడి నాట్యానికి ప్రసిద్ధి కదా! మా మూడవ అబ్బాయి రమణ డాన్స్ నేర్చుకుంటున్నాడు. వెంపటి చినసత్యంగారి శిష్యుడు. ఇక్కడ కుమారి శోభానాయుడు వద్ద 'కూచిపూడి ఆర్ట్ అకాడమీ'లో నాట్యం నేర్చుకుంటున్నాడు. ఆ గదిలో ఒకమూలన నటరాజ విగ్రహం చాలా అందమైనది ఉంది. మా రమణ ఆ గదిలో డాన్సు ప్రాక్టీస్ చేస్తుంటాడు. పిల్లలకు డాన్సు నేర్పుతుంటాడు. ప్రేయరు గది అయినా యోగీశ్వరుడైన ఈశ్వరుడే నటరాజు కనుక, దానిని తీయలేదు.

"మా తమ్ముడు. యలమంచిలి నుండి వచ్చాడు" అన్నారు.

"డాన్సరా?"

"బొత్తిగా రాదు"

అతని డాన్సును లక్ష్యపెట్టకుండా మేం ప్రేయర్‌కు కూర్చున్నాం. నిమిషంలో అతను నృత్యం ఆపి, కళ్లు మూసుకుని కూర్చున్నాడు.

ఆ అబ్బాయి పూర్వజన్మలో నర్తకుడు అయివుండాలి. మాస్టర్‌గారి సమక్షంలో ప్రేయర్‌లో మనిషిలో ఉండే గొప్పగుణాలు బయటపడుతుంటాయి. ఎవరిలో ఏశక్తి ఉందో మనకు తెలియదు. అలా అజ్ఞాతంగా ఉండే శక్తులు ప్రేయర్‌తో మేల్కొని చైతన్యవంతమవుతుంటాయి.

శివుడు నటరాజు! యోగం మన పరిధుల్ని దాటి విశ్వపరిణామాన్ని లక్షించినపుడు విశ్వయోగం అవుతుంది. అదే కాస్మిక్‌యోగం. అందులో మన వంతు యోగావర్కు ఉంటుంది. దాని ఫలితాలలో వినిమయంలో మనకు వాటా ఉండదు. సి.వి.వి. అన్న అక్షరాలలో 'శివత్వం' ఉన్నదేమో! శివోహం !!

0 0 0

అప్పుడు ఆసక్తితో వచ్చినవారిలో బెజవాడ కామేశ్వరరావు, వీరయ్య సోదరులు ఒంగోలు ప్రాంతంవారు. మాస్టర్ ఎం.ఎన్.గారి సంప్రదాయం. ఎక్కిరాల వేదవ్యాస శిష్యులు. కామేశ్వరరావు కూతురికి కళ్లజబ్బు, ఊబశరీరం. అన్నీ అనుమానాలే. అన్నదమ్ములిద్దరికీ దయ్యాల భయం జాస్తి. శ్రద్ధ, ఆసక్తి ఉన్నాయి కాని నిలకడ తక్కువ. కొప్పోలులో వీరయ్య, పార్థసారథి బాగానే సాధన చేస్తుంటారు. కానీ వేదవ్యాసగారి వల్ల నష్టపోయామని చెప్పుకుంటారు.

యోగం పట్ల గొప్ప అభినివేశంతో చేరినవారు సి. నారాయణాచారి, శ్రీకాకుళం. ఈ యోగంలో చేరిన తర్వాత చాలా అనుభవాలు పొందాడు. చాలా ఎత్తులకు ఎదిగాడు. అతనికి ఆ ప్రాంతంలోని క్రైస్తవ మతగురువులకు ఏవో గొడవలు ఉండేవి. వారు తనపై ప్రయోగాలు చేస్తున్నారని చెప్పేవాడు. విశాఖలో ఒకాయన క్రైస్తవ మతగురువులతో పోటీపడుతుంటాడని, వారు ఆయనపైన కక్షగట్టి ఏవేవో ప్రయోగాలు చేస్తున్నారని చెప్పాడు. నాకు వారి గురించి తెలియదు. ఎవరి జోలికి పోకుండా, ఎవరి విషయాలలో తలదూర్చకుండా మాస్టర్‌గారిపై పూర్ణవిశ్వాసంతో యోగం చేసుకుంటే ఎలాంటి చిక్కులు, ఆటంకాలు కలగవని నా విశ్వాసం. ఈ యోగం చేసేవారు మిగిలిన వారి గురించి పట్టించుకోకూడదు. వేరు విధాల సాధకులతో కలవడం, సిద్ధాంత చర్చలు చేయడం అనవసరమని గ్రహించాను.

అనంతపురం ప్రాంతంనుండి గోపాలకృష్ణ అని ఒకాయన వచ్చాడు. వారి తండ్రిగారికి నేను తెలుసునట. నేను మద్రాసులో ఉండగా, నానుండి యోగం నేర్చుకుని

యోగం చేస్తున్నాడట. తండ్రిగారి ప్రోత్సాహంతోనే ఇతను నావద్దకు వచ్చాడు. ఆర్థికంగా చాలా చితికిపోయి ఉన్నాడు. అయిదారు లక్షల వరకు అప్పులు చేశాడు. పైగా ఆస్మా, గుండెనొప్పి. ఇంకా ఏవేవో రోగాలున్నవాడు. ట్రీట్‌మెంట్ అర్థించాడు. తన రోగాలు తగ్గి, ఆర్థికచిక్కుల్లోంచి బయటపడితే యోగానికి ఎంతో సాయం చేస్తానన్నాడు. అతనికి రియల్ ఎస్టేట్ బిజినెస్ ఉంది. ప్లాట్లు అమ్ముడుపోయి, లాభం వస్తే ఒక ప్లాటు యోగానికి బహూకరిస్తానని ప్రామిస్ చేశాడు. యోగంలో చేరాడు. రోగాలు తగ్గాయి. ప్లాట్ల అమ్మకం జరిగింది. వేరే వ్యాపారాలు విజయవంతంగా చేశాడు. నావద్దకు మళ్లీ రాలేదు. వాళ్ల అవసరాలు తీరాక చాలామంది నన్ను మరచిపోతుంటారు.

ఒక సమావేశానికి చిత్తూరునుండి పదిపన్నెండుమంది సాధకులు వచ్చారు. వారికి నాయకుడు చంద్రశేఖర్. వారంతా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంప్రదాయంలోని వారు. తిరుపతి శ్రీనివాసాచారిగారి శిష్యబృందం. ఆ విషయం నాకు తెలియదు. వారు చెప్పలేదు. యోగసమావేశాలకు వచ్చారు. అప్పట్లో అందర్నీ అనుమతించేవాళ్లం. చంద్రశేఖర్ చిత్తూరులో యోగాసెంటర్ నిర్వహిస్తున్నారని తెలియదు. యోగసాధకులని తెలిసి సమావేశాలకు ఆహ్వానించాను. ఆ తర్వాత వారెప్పుడూ సమావేశాలకు రాలేదు. వచ్చి కోర్సులు రాసుకువెళ్లేవారు. చంద్రశేఖర్ చిత్తూరు సెంటర్ చక్కగా నిర్వహిస్తున్నారు.

0 0 0

ఒకసారి ఆఫీసుకు ఒకాయన వచ్చాడు వాడి నుండి. ఆఫీసువేళల్లో యోగావాళ్లు వస్తే నాకు చెప్పరాని ఇబ్బంది. ఆఫీసు టైం నాస్వంత పనికి ఉపయోగించుకోవడం ఇష్టం ఉండదు. పర్సనల్ ఉత్తరాలు సైతం ఆఫీసు టైంలో రాయను. ఇతరులు వేలెత్తి లోపం చూపించే అవకాశం కలిగించకూడదని నా సిద్ధాంతం. ఆ వచ్చిన అతన్ని "ఎవరు మీరు, ఎందుకు వచ్చారు" అని పరామర్శించేలోగానే ఏడవడం మొదలెట్టాడు - ఆఫీసులో ఏడుపు సీను. అసహ్యంగా ఉంటుంది కదా !

"ఒక్క అయిదు నిమిషాలు బయటకు రండి" అని అడిగాడు. ఆఫీసు కాంపస్ దాటగానే 'నాకు చచ్చిపోవాలని ఉంది. ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నాను' అన్నాడు..

"ఏమిటి కారణం?"

హోటల్‌కు వెళ్లాం. టూకీగా తన కథ చెప్పాడు. అతని భార్య అతనిని వదలి పుట్టింటికి వెళ్లిపోయింది. ఒక కూతురు. ఆమె ఉద్యోగం చేసుకుంటూ బ్రతుకుతోంది. ఇద్దరు విడిపోయి పది సంవత్సరాలైంది. మళ్లీ కలిసే అవకాశం కనిపించడం లేదు. అతను ఉత్తముడే అనిపించాడు. అంత మంచివాడిని భార్య అపార్థం చేసుకుందా! పది సంవత్సరాలు, తక్కువేం కాదు. ఇప్పటికే తప్పు తెలుసుకుని తిరిగి రావలసింది. ఇంక సాధ్యమా?

సాయంత్రం ఇంటికి రమ్మని చెప్పి పంపాను. సాయంత్రం వచ్చాడు.

"ప్రస్తుతానికి ఆత్మహత్యా ప్రయత్నం విరమించండి రావుగారూ! నాకు ఒక ఆరునెలలు గడువివ్వండి. రోజూ ప్రేయర్ చేసుకొండి. మీకో స్పెషల్ ప్రేయర్ ఇస్తాను. అది చేస్తూ ఉంటే మీ శ్రీమతిగారి మనస్సు మారుతుందని నా నమ్మకం. ఆమె అడ్రసుకు నా యోగపుస్తకాలు పంపండి. అవి చదివితే మార్పు రావచ్చు."

ఆరోజు అతనికి ఇనీసియేషన్ చేశాను. ఒక్కసారి ప్రేయర్ చేశాక అతనికి జీవితం పైనున్న విరక్తి పోయింది.

తర్వాత ఆరునెలలలోపే ఒక విచిత్ర సంఘటన జరిగింది. బంధువుల ఇంట పెళ్లికి వెళ్లవలసి వచ్చిందట. అక్కడకు అతని భార్య, కూతురు వచ్చారు. ఆ పాప తండ్రి వస్తాడని ఆశించింది. ప్రక్కవారు చెప్పారు "అడిగో మీ డాడీ. వెళ్లి పలకరించు" అని.

ఆ పాప వచ్చి 'డాడీ' అని ప్రేమగా పలకరించింది. అప్పటికి పాప వయస్సు 15 సంవత్సరాలు. ఆ పాప తల్లిదండ్రుల్ని కలిపింది. అక్కడినుండి అతని భార్య కూతురు అతని వెంట వచ్చేశారు.

అలాగా యోగం ప్రేమపంట పండిస్తుంది. జీవితంలో ప్రేమసూత్రాన్ని మించింది లేదు. పవిత్రప్రేమ మనుషులనే కాదు, దేవుళ్లను కదిలిస్తుంది, మనసుల్ని కలుపుతుంది.

"ప్యూర్ లవ్, గాస్పెల్, డిటర్మినేషన్" అనే సూత్రం తర్వాత చాలామందిని కలపడంలో నాకు ఉపయోగించింది.

0 0 0

అప్పట్లో నా పాలపడ్డ కేసులన్నీ నాకు అగ్నిపరీక్షలే. ఒక్కొక్కటి గుండెని బిగపట్టించేది. ఏ మహాశక్తి నాలో ప్రవేశించి నాచేత ఆ చికిత్స చేయించేదో తెలియదుగానీ, వాటివల్ల నేచేస్తున్న యోగం పట్ల నా విశ్వాసం నూరురెట్లు పెరిగింది. చేస్తున్నది నేనే అయినా, చేయిస్తున్నది ఒక అజ్ఞాతశక్తి. అది మాస్టరుగారి నుండి సంతతధారగా వస్తుండేది. మనం కర్తలం కానపుడు ఫలితాలు మనకి ఆపాదించుకోలేం. యోగఫలితాలు, విజయాలు అన్నీ మాస్టరుగారివే. నేను కేవలం ఆయన ప్రతినిధిని. విజయానికి పొంగిపోయేది లేదు. ఎప్పుడైనా ఫెయిల్ అయినా బెంగపడేదిలేదు.

బెంగుళూర్నుండి వి.వి.రావు అనే ఆయన వచ్చాడు. పెద్దవాడు. ఒళ్లంతా పుచ్చిపోయింది. కుష్టు అని భ్రమపడ్డాను. ఆయనకు చాలా సంవత్సరాలుగా చర్మరోగం. శరీరం రసికమయం, రక్తసిక్తం. భయంకరంగా ఉన్నాడు. పైన తలపాగా ధరించి, చేతిలో ఒక మూటతో అచ్చం పల్లెటూరిబైతులా వచ్చాడు. అతని ఆకారం చూచి అసహ్యం వేసినా 'తప్పు' అని మనస్సులో అనుకున్నాను. పైగా చికిత్సకోసం వచ్చినవాడు. వెంటనే జీసస్,

సాయి నా కళ్లలో మెదిలారు. వారంతటి ప్రేమ ఉంటే తప్ప చికిత్స చేయలేం అనిపించింది. రోగిని చూచి భయపడడం ఏమిటి? మృత్యువును చూచి, శవాన్ని చూచి భయపడనవసరం లేదు. అతనిని సాదరంగా పరామర్శించాను. దూరంనుండి వచ్చాడు కదా! భోజనం నాతోపాటు చేశాడు. ట్రీట్‌మెంటుకు ఎవరు వచ్చినా శ్రీమతి యామినీదేవి భక్తిగా, ప్రేమగా భోజనం పెడుతుంది. అతిథులన్నా, అభ్యాగతులన్నా ఆమెకు ఆదరణ ఎక్కువ. వేళకాని వేళలో వచ్చినా అన్నం పెడుతుంది. ఇంటికి వచ్చినవారెవరైనా ముందు వారి ఆకలి తీర్చుతుంది. మంచిచెడ్డలు విచారిస్తుంది. ప్రేమతో మంచిని పెంచుకోవడం ఆమె పద్ధతి.

రావుగారిని ప్రేయర్‌లో కూర్చోపెట్టుకున్నాను. విభూతి పెట్టాలంటే చేయి వణికింది. మనస్సు జంకింది. కానీ మాస్టర్ శక్తి నన్ను ముందుకు తోసింది. మనస్సును దాటిపోతే చెడ్డ ఆలోచనలు కలగవు. అలాంటప్పుడు ఏదీ ఆలోచించకూడదు. కళ్లు మూసుకుని, హృదయం లోతుల్లోకి వెళ్లిపోవాలి. ప్రేమలో మునకలు వేయాలి. అతనికి ట్రీట్‌మెంట్ బాగా జరిగింది. టచ్ ఇచ్చాను. 40 రోజులకు విభూతి ఇచ్చాను. "నలభై రోజులు ఈ విభూతి వాడండి. ప్రేయర్ చేస్తుండండి రెగ్యులర్‌గా" అని ధైర్యం చెప్పాను.

తాజ్‌మహల్ హోటల్ కన్నడిగులది. రాత్రికి అక్కడ బసచేసి వెళ్లిపోతానని చెప్పాడు. అప్పట్లో మా ఇంట్లో పైమనుషులకు వసతి లేదు. చిన్న ఇల్లు, పెద్ద సంసారం.

ట్రీట్.చేశాను గానీ అతని గురించి మరచిపోయాను. ఆరునెలల తర్వాత పారిస్ నుండి నాకో ఉత్తరం వచ్చింది. ఫ్రాన్సులో నాకు తెలిసినవారెవరూ లేరు. ఉత్తరం విప్పి చూశాను. ఈ బెంగుళూరు పెద్దమనిషి. నలభై రోజుల్లో చర్మవ్యాధి పూర్తిగా తగ్గిపోయిందట. పారిస్‌లో బ్యాంకులో పనిచేస్తున్న తన తమ్ముడు రమ్మంటే వెళ్లాడట. ఫ్రాన్సు ఇంగ్లండు దేశాలలో కొన్ని రోజులుంటానని రాశాడు. తనకు పునర్జన్మ ప్రసాదించిన మాస్టరుగారిని స్తుతిస్తూ రాశాడు. ఆయన అంతగా చదువుకున్నవాడని ఎవరూ అనుకోరు. చాలా పెద్ద ఉద్యోగం చేసి, జబ్బు వల్ల రిజైన్ చేశాడట. తర్వాత పారిస్‌లోని అతని తమ్ముడు వారణాశి రామ్మూర్తి, ఇండియా వచ్చినప్పుడు నావద్దకు వచ్చి, మాస్టర్‌యోగంలో చేరాడు.

మాస్టరుగారి కరుణ అపారం. తనను నమ్మినవారిని రోగవిముక్తుల్ని చేయడంలో మాస్టరు గొప్ప కరుణామయులు. వారి పేరు స్మరిస్తే చాలు, శరీరం అణువణువు చైతన్యం నింపుకుని, కొత్త జీవం పొందుతుంది. యోగసాధన చేస్తే రోగవిముక్తులు కాకపోవడం అంటూ ఉండదు.

0 0 0

ఎంతైనా భక్తి ప్రదర్శించవచ్చు. దేవాలయాలు దర్శించవచ్చు. బాబాల చుట్టూ ప్రదక్షిణలు చేయవచ్చు. మనిషికి నీతినియమాలు లేకపోతే అవన్నీ వ్యర్థం. దక్కే పుణ్యం ఏమీ ఉండదు. ఎందరి ఆశీర్వచనం పొందినా ఫలితం ఉండదు. కొన్ని నీతిసూత్రాలకు మనిషి కట్టుబడి ఉండాలి. తనకు తానే నిబంధనలు విధించుకోవాలి, పాటించాలి. ఒకరు చెప్పవలసిన పని ఉండదు. ఎవరికో భయపడి చేయనవసరం లేదు. నీతినియమాలు పాటించనివారికి యోగంలో అభివృద్ధి ఉండదు.

ఒక పోలీసు ఆఫీసరు వచ్చాడు. సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా చేసి, సస్పెండు అయినాడు. పోలీసులంటే దొంగలకు అలుసు. దొంగలకు, దుర్మార్గులకు, సాంఘిక విద్రోహులకు పోలీసులు సింహస్వప్నం అనుకుంటాం గానీ వారిని చూచి సామాన్యులకంటే పోలీసులే ఎక్కువ భయపడుతుంటారు. పోలీసు ఆఫీసరుగా చేసిన వ్యక్తి, ఉద్యోగ కాలంలో ఫరవాలేదుగానీ,రిటైర్ అయినాక నిశ్చింతగా ఉండలేడు. దినదినగండంగా గడుస్తుంది. తాను వేధించినవాళ్లు ఇప్పుడు పగసాధిస్తారని భయపడుతుంటారు. రౌడీలు అనుకుంటాం గానీ, ఆ రౌడీలకు కొమ్ముకాసే రాజకీయ నాయకుల వత్తిళ్లకు పోలీసు అధికారులు తల వంచక తప్పదు. బాధలు పడక తప్పదు.

అప్పట్లో అయిదారుగురు పోలీసు ఆఫీసర్లు వచ్చారు. అందరూ ఇన్‌స్పెక్టర్లు, సర్కిల్, డి.ఎస్.పి. హోదాలవారు. ఒకాయన గూఢచారిశాఖలో పనిచేస్తున్న సర్కిల్ - సస్పెన్షన్‌లో ఉన్నాడు. కేసు నడుస్తోంది అతనిపైన. వచ్చి తన ఆత్మకథ చెప్పాడు. మహాభక్తుడట అతను. భంభం బాబాగారి శిష్యుడట. తన కొడుకు చదువుకోవడం లేదని, జులాయిగా తిరుగుతున్నాడని వాపోయాడు. యోగా ట్రీట్‌మెంట్ అర్థించాడు. కుర్రవాడు టెన్త్ చదువుతున్నాడు. కాని శ్రద్ధ లేదు. పోలీసు ఆఫీసరు కొడుకు కదా! రాజకీయ నాయకుల పిల్లలకు, పోలీసు అధికార్ల పిల్లలకు చదువుపై శ్రద్ధ ఉండడం కష్టం. నాలుగురోజుల ట్రీట్‌మెంట్‌తో కుర్రవాడు దోవలోకి వచ్చాడు. అతను, అతని భార్య యోగం చక్కగా చేసేవారు. తన కేసు ఎలాగైనా కొట్టివేయాలని, తిరిగి ఉద్యోగం రావాలని అతని కోరిక. ఆరునెలల్లో అతను కోరినట్లే ప్రయిమాఫేసియా క్రింద కేసు కొట్టివేశారు. డి.వై.ఎస్.పి.గా ప్రమోషన్ వచ్చింది. ఒక ఆదివారం ఉదయం ఫుల్ పోలీసు యూనిఫాంలో జీపులో వచ్చాడు. నేను గుర్తుపట్టలేదు. వచ్చి హాట్ అవతల పెట్టి పాదాభివందనం చేశాడు. 'మీ ఆశీస్సులతో ఈరోజు డ్యూటీలో జాయిన్ అవుతున్నాను' అని చెప్పాడు. సంతోషం.

తర్వాత అయిదారు నెలల వరకు ఆదివారాలలో వచ్చేవాడు. ఆ తర్వాత మరెక్కడికో ట్రాన్స్‌ఫర్ అయి వెళ్లిపోయాడని తెలిసింది. రాజకీయ నాయకులు, పోలీసు

ఉన్నతాధికారులు యోగం చాయలకు రాలేరు. మరొక ఇంటలిజెన్స్ అధికారి అలాగే వచ్చాడు. చాలా భక్తిప్రపత్తులు చూపాడు. జీపులో వాళ్ల ఇంటికి తీసుకు వెళ్లి తల్లి, భార్య, బిడ్డల చేత పూజలు చేయించి దక్షిణ ఇచ్చాడు. బట్టలు పెట్టాడు. అవి తీసుకుంటుండగా నాకు అనిపించింది ... ఇందులో ఏదో తిరకాసు ఉందని. అన్నింటిని తిరస్కరించాను. వాళ్ల ఇంట్లో కనీసం కాఫీ కూడా తాగలేదు. ఇంట్యూషన్ హెచ్చరించింది. ఇంతమంది పోలీసు అధికార్లు రావడంలో రహస్యం ఏదో ఉంటుంది. వీరు నాపైన నిఘా వేశారు. యోగం పేరుతో, ఆశ్రమాల పేరుతో చాలామంది స్వాములు, బాబాలు, అక్రమచర్యలకు పాల్పడుతూ, విదేశాలకు ఏజంట్సుగా పనిచేస్తుండటం, వారిని పోలీసులు వలవేసి పట్టుకోవడం జర్నలిస్టుగా నాకు తెలియని విషయం కాదు. ఎంతమంది గుప్తంగా వేగుచర్యలు చేసినా, నావద్ద రహస్యాలు లేవు. మా ఇంటిద్వారాలు ఎప్పుడూ తెరిచే ఉంటాయి. యోగం చేసే వేళల్లో సైతం తలుపులు మూయడం జరగదు. ఎవరైనా ఎప్పుడైనా రావచ్చు.

0 0 0

యోగాన్ని కొందరు తమ పరపతి పెంచుకోడానికి ఉపయోగిస్తే, కొందరు కీర్తిప్రతిష్టలకు అడ్డం పెట్టుకుంటారు. మరికొందరు యోగం పేరు చెప్పి. తన మతానికి, కులానికీ పట్టం కట్టాలని ప్రయత్నిస్తారు. మాస్టర్‌గారు యోగం ప్రారంభించినప్పుడు వేటిని నిషేధించారో, వాటినే తల కెత్తుకుంటున్న వారున్నారు. కులమతాల ప్రసక్తి కూడదంటే తర్వాతివారు తమ కులంవారు తప్ప అన్యులు యోగానికి అర్హులు కానట్లు దాచిపెట్టుకున్నారు. దేవతారాధనలు, పూజలు గట్రా వద్దంటే వాటిని పూర్తిగా వదులుకున్నవారు బహుతక్కువ. కొందరైతే వైష్ణవాలయాలలో పూజారులే అయినారు. టి.ఎస్.శంకరయ్యర్‌గారు గణపతి పూజ చేసేవారు. ఇళ్లలో దూరి చూడం కదా! చాటుమాటుగా అన్నీ చేసుకునేవారే బయట మాస్టరుగారి ఫొటోలు చొక్కాలకు తగిలించుకుంటారు. సాంప్రదాయం వద్దంటే, ఆచారాలు వద్దంటే మాస్టరుగారి ఫొటోలు పెట్టి మంగళహారతులు పాడి, అష్టోత్తర శతనామాలు సృష్టించి, కొబ్బరికాయలు కొట్టి, పదార్థాలు నివేదనలు చేసి తమ భక్తిని ప్రదర్శిస్తున్నారు. వారసత్వం వదులుకోలేకపోతున్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర నామాలే ఉచ్చరించరాదని మాస్టరుగారు నిషేధిస్తే ఏకంగా మాస్టరుగారి పేరుతో కలిపి నారాయణ మంత్రం ఉపదేశిస్తున్నవారున్నారు. ఇవన్నీ తెలుసుకున్నప్పుడు, కళ్లారా చూచినప్పుడు యోగం ఎక్కడకు పోతుందో అర్థం కాదు. నియమనిబంధనలు పాటించకుండా యోగసిద్ధాంతం, సూత్రం అర్థం చేసుకోకుండా మనం యోగం ఏంచేస్తున్నట్లు? మన లబ్ధికోసమా! మాస్టర్ ఆశయసిద్ధి కోసమా!

యోగాసెంటర్ పెట్టిన తర్వాత వచ్చే రకరకాల సాధకులను గమనిస్తుంటే, వారు చెప్పే మాటలు వింటే, వారి పద్ధతులు తెలుసుకుంటే, నాకు తల తిరిగింది. "యోగం చేస్తే మాస్టర్‌గారు చెప్పిన రీతిలో చేయాలి. లేకపోతే మానివేయాలి" అనుకున్నాను. ఏవో నాలుగు ప్రిపరేటరీ కోర్సులు తప్ప నాకు లభించిన సాహిత్యం లేదు. అవి చేయవచ్చుననే వారు కొందరు, కూడదు అనేవారు మరికొందరు. ఒక పద్ధతి లేదు. ఎవరిష్టం వారిది. మా గురువుగారు కోర్సులు చేయలేదు. నేను కొన్ని చేశాను దొరికినంతవరకు. అప్పుడొక నిర్ణయానికి వచ్చాను. 'ఆరు నూరైనా, నూరు ఆరైనా, ఎంత కష్టం కలిగినా, ప్రతిఘటన ఎదురైనా మాస్టర్‌గారు యోగాస్కూలు నిర్వహించిన పద్ధతిలో నా యోగాస్కూలు నడపాలి. కోర్సులన్నీ చేయించాలి. ఒక సిలబస్ ఏర్పాటు చేయాలి. సమావేశాలు నిర్వహించాలి. అక్కడా పేచీలే. మాస్టర్‌గారికి తప్ప మేకాల్, డిసెంబర్‌కాల్ నిర్వహించే అధికారం ఎవరికీ లేదని, అలా సమావేశాలు జరపవలసిన అవసరం అసలు లేదని, కొందరు నసిగారు.

నేను ఎవరి వాదనలు వినదలచలేదు. ఎవరి సలహా పాటించదలచలేదు. నా అంతర్వాణి ప్రబోధం ఒక్కటే నాకు మార్గదర్శకం. అవసరమైనవి మాస్టర్‌గారే చేయిస్తారు, అవసరం లేనివాటికి వారే ఆటంకం కలిగిస్తారు. నా హృదయం చేయమంటే చేస్తాను. వద్దనిపిస్తే మానతాను. సమావేశాలలో కోర్సులు చేయించాలి. అవి నాదగ్గర లేవు. కొందరి దగ్గర ఉన్నాయని తెలుసు. వారు నాకు ఇవ్వరు. నేను గాలి బాలసుందరరావుగారి శిష్యుడి నని చిన్నచూపు. అందరం మాస్టరుగారి అనుయాయులమే కదా! వారి యోగమేకదా చేస్తున్నది! ఉహు ... ఆ ఆలోచన ఉండదు. డైరెక్టుగా మాస్టరుగారి ఆదేశాలు, సందేశాలు అందుకోవడం ఒక్కటే శరణ్యం. తీవ్రంగా నివేదించుకుని, ప్రార్థన చేయనారంభించాను. డిసెంబరు సమావేశాలకు సిగ్నల్ అందింది. డి.ఎన్.రావుగారికి చెప్పాను ... 'గో ఎహెడ్' అన్నారు. నేను ఏపని చేయాలన్నా ఆయన అండదండలు ఉండేవి.

ఇంతచేస్తున్నా గురువు ననిపించుకోవడం నాకిష్టం లేదు. భయం. 'గురువు' చాలా బరువైన పదవి. బాధ్యతాయుతమైనది. దానికి చాలా అర్హతలు ఉండాలి. అన్ని అర్హతలు నాకు లేవని తెలుసు. అది బంగారు కిరీటం అని చాలామంది ఉబలాటపడతారు. అదొక ముళ్లకిరీటం అని నా నమ్మకం. ఎవరినీ 'గురువుగారు' అని అననిచ్చేవాణ్ని కాదు. 'శార్వరిగారు' అంటే చాలును. కానీ కొత్తగా యోగంలోకి వచ్చేవారు తప్పనిసరిగా 'గురువుగారు' అని పిలిచేవారు. లేదా 'మాస్టర్‌గారు' అనేవారు. అది మరీ బరువైనదని నాకూ తెలుసు. ఎం.ఎన్.గారిని మాస్టర్‌గారు అంటేనే చాలామంది విమర్శించారు. ఎలా

పిలవడం అన్నది సాధకమిత్రులకే వదలిపెట్టాను. కొందరు 'శార్వరిగారు' అంటారు. సీనియర్ సాధకులంతా 'శార్వరీ' అంటారు. ఆ పిలవడంలో ప్రేమ, అనురాగం ఉంటే చాలు ... ఆత్మీయత కనబడితే చాలు, ఎవరు ఎలా పిలిచినా వారిలో మాస్టర్‌గారి పట్ల అనన్య భక్తిప్రపత్తులు కనిపిస్తున్నాయా లేదా అన్నది ప్రధానం. యోగం పట్ల పూర్తి విశ్వాసం ఉన్నదా లేదా అన్నది ముఖ్యం.

డిసెంబర్ సమావేశాలకు డి.ఎన్.రావుగారు పూనుకున్నారు. డాబాపైన షామియానా వేయించడం, కార్పెట్లు తెప్పించడం ... అంతవరకే. భోజనాల వ్యవహారం లేదు అప్పుడు. చివరిరోజున మాత్రం సమారాధనగా, పూర్ణాహుతిగా భోజనాలు ప్లాన్ చేశాం. అంతకుమించి మాకు శక్తి లేదు, ఆర్థిక వనరులు లేవు. డి.ఎన్.రావుగారు ఏవో కాగితాలు తీసుకువచ్చారు. 'ఎం' కోర్సు అని జ్ఞాపకం. టైపుచేసిన కాగితాలు. ఆయన పిడుగురాళ్ల సెంటర్‌కు చెందినవాడు. అక్కడ చేయించిన కోర్సులు ఆయనకు తెలుసు. తానే పిడుగురాళ్ల వెళ్లి, మా సమావేశాలకు అవసరమైన కోర్సు కాగితాలు తీసుకువచ్చారు.

ఆ సంవత్సరంలో చేరిన 80 మంది సాధకులు వచ్చారు సమావేశానికి. సీనియర్ సాధకులు, ఎం.ఎన్.గారి శిష్యులు పదిమందివరకు ఉన్నారు. మొత్తంమీద 99 మందితో తొలి యోగసమావేశం డిసెంబరు 1983లో జరిగింది. మూడురోజుల సమావేశాలు నిర్విఘ్నంగా సాగినందుకు మాస్టరుగారికి వేనవేల నమస్కారాలు చెప్పుకున్నాం. "ఇంక మనం సమావేశాలు ప్రతి సంవత్సరం జరపవచ్చు శార్వరీ, మాస్టరుగారి అనుమతి లభించినట్లే. వారి అనుమతి లేకపోయినట్లయితే వందమంది రావడం జరిగేది కాదు. ఇంత ప్రశాంతంగా జరిగేది కాదు. ఎవ్విరిబడీ ఈజ్ హేపీ" అని ప్రోత్సహించారు డి.ఎన్.రావుగారు.

0 0 0

కొన్ని మొక్కలు జానెడెత్తు పెరగకపోయినా ఒకటి రెండు పూలు పూస్తాయి. ఆ తర్వాత మొక్క పెరగదు. మళ్లీ పూలు పూయదు. కొన్ని చెట్లు నేవళంగా పెరిగి విరగ పూస్తాయి. అలాగ గుంటపూలు పూసే బాపతు సాధకులు ఉంటారు. మెట్‌పల్లి నుండి వచ్చిన డి.ఎస్.గుప్తా ఆ బాపతు గుంటపూల మొక్కలాంటివాడు. తన వ్యాపారానికి యోగం బాగా సహకరిస్తుందని గ్రహించిన మేధావి. ఆరునెలలు సాధనచేసి ఓ ఇరవైమందిని వెంటబెట్టుకుని వచ్చి 'అడియేన్ దాసోహం' అన్నట్లు నటించాడు. కాళ్లా వేళ్లా పడి బ్రతిమిలాడి నాలుగు విభూతి పొట్లాలు తీసుకువెళ్లి, సొంత దుకాణం పెట్టాడు. మూడు సంవత్సరాల వరకు అతని రహస్యం తెలుసుకోలేకపోయాను. రెండు నెలల కొకసారి ఎవరినో పంపేవాడు విభూతి పొట్లాల కోసం. మంచిదే. తన ఇంట్లో ప్రార్థనలు

చేయించేవాడు. రోగులకు విభూతి యిచ్చేవాడు. రోగాలు తగ్గేవి. అది ఆయన ప్రతాపం కాదు, నా ప్రతాపమూ కాదు. మాస్టరుగారి యోగబలం అది. అలా అనుకోక అదంతా తన యోగశక్తి అని ప్రచారం చేసుకుని స్థానికుల్ని ఆకట్టుకున్నాడు. డి.ఎస్.గుప్తా తానే గురువుగా, ఒక మాస్టర్‌గా పిలిపించుకోసాగాడు. ఆత్మశక్తి లేనివారు గురువులు కాలేరు. సత్యాన్ని ఆత్మతో దర్శించాలి. ఆత్మలో దర్శించాలి. గురువు కావాలనుకోవడమే ఒక అహంకారప్రజ్ఞ - సాత్వికప్రజ్ఞ - గురువైనవానికి అలంకారం. అహంకారంతో గురువైనవారిని ఆ అహంకారమే నాశనం చేస్తుంది. కొద్దిమందిని ప్రోదిచేసుకుని, భజన చేయించుకున్నంత మాత్రాన గురువులు కాలేరు. గురువు కావడానికి తొలి అర్హత ఆత్మప్రజ్ఞ. కొంతమందిని పోగుచేసుకుని 'నారాయణ' మంత్రం ఉపదేశించి భజనలు చేయించి గురువులైపోవచ్చు.

ఆత్మదర్శన చింతన కలవారు సాధకులవుతారు. ఉత్తమసాధకుడు ఎన్నడూ గురుస్థానాన్ని కోరుకోడు. తనలో పెల్లుబికే ఆత్మచైతన్యం విశ్వచైతన్యంగా పరిణమించడాన్ని వాంఛిస్తాడు. అదే తన సాధనకు గమ్యంగా భావిస్తాడు. ఆత్మజాగృతితో సాధకుడు తన అభివృద్ధిని పదిలపరచుకోవాలి. అభ్యుదయానికి సహకరించగలగాలి. స్వీయప్రజ్ఞను, ఆత్మచైతన్యాన్ని ప్రేమసూత్రంతో ముడివేసి, విశ్వప్రేమగా మార్చుకోగలిగినప్పుడు సాధకుడు ఒక గురువు అవుతాడు. కోరి, వెంపరలాడితే లభించేది 'గురుత్వం' కాదు. పదిమందికి తన చైతన్యాన్ని అందించగలిగినప్పుడు, తనలోని యోగశక్తిని ఉదారంగా పంచి ఇవ్వగలిగినప్పుడు, తనకై ఏదీ మిగుల్చుకోని, నిస్వార్థతత్వం నెలకొన్నప్పుడు మాత్రమే ఎవరైనా గురువు కాగలరు. అప్పుడే అతని గురుస్థానం భద్రంగా ఉంటుంది.

మెట్‌పల్లి గుప్తాలాంటివారు గురుద్రోహులు. అలాంటి కుహనాశిష్యుల్ని ఏ గురువూ చేరనివ్వకూడదు. అలాంటివారు స్వార్థంతోనే గురువుల్ని ఆశ్రయిస్తారు. స్వప్రయోజనాలకు గురువుల్ని, వారి శక్తిని ఉపయోగించుకుంటారు. చాపక్రింద నీరు లాంటి వీరిని ముందుగా గుర్తించలేం. ఇలాంటివారివల్ల గురువులకు కష్టనష్టాలే ఎక్కువ. గురువులు గుణపాఠం నేర్చుకోడానికి ఇలాంటి శిష్యులు ఎప్పుడూ ఉంటారు.

# 1984

## గాయత్రీ నిదర్శనం

**ఉపనయన సమయంలో గాయత్రీ మహామంత్రోపదేశం జరిగినా అప్పట్లో గాయత్రిని ఉపాసించింది తక్కువే.**

ఆ మంత్రశక్తి తెలియక, దాని అవసరం గుర్తించక. ఒక్క గాయత్రిని ఉపాసిస్తే చాలు - మిగిలిన మంత్రాలేవీ అవసరం లేదంటారు. కాని ఒక్క గాయత్రితో సరిపెట్టుకునే వారు తక్కువ. రకరకాల మంత్రదీక్షలు తీసుకుంటారు. బాల, శ్రీ ఉపాసనలు చేస్తారు. పంచాక్షరి, నవాక్షరి, ద్వాదశాక్షరి మంత్రాలు ఉపదేశం పొంది సాధన చేస్తున్నవారు నాకు తెలుసు. వీటన్నింటిని మించినది గురూపదేశం. యోగంలో చేరిన తర్వాత విశ్వామిత్ర గాయత్రికి అర్థం చెప్పారు మా గురువుగారు. అదికాక, అజప గాయత్రీ మంత్రం నాకు అందించారు. దానిని సన్యాసులు మాత్రమే చేయాలట. దానిని నేను సాధన చేశాను చాలాకాలం. సన్యాసిని అయినానో లేదో తెలియదు. మనసు మాత్రం ప్రాపంచిక విషయాల పట్ల సన్యసించింది. యోగంలోకి వచ్చాక ఏ మంత్రాలు చేయరాదన్న నిబంధన, బీజాక్షరాల జోలికి పోకూడదన్న ఆంక్ష వుంది. గాయత్రి మాత్రం చేసుకోవచ్చునని, కాస్త సడలింపు. అది మాత్రం ఎందుకు చేయడం? దానినీ వదలిపెట్టాను - యోగమే చాలు.

మహాగాయత్రీ ఉపాసకుడు ఒకాయన వచ్చారు. ఆయన వృత్తిరీత్యా కరణంగారు. ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రి అయిన శుభసందర్భంలో 'కరణం' పదవులు రద్దుచేయడంతో వేలమంది కరణాలు వీధిన పడ్డారు. ప్రభుత్వానికి వినతిపత్రాలు సమర్పించి, వేడికోళ్లు చేసుకునే సందర్భంలో ఆయన హైదరాబాదు వచ్చారు. నాయోగంపై ఆసక్తి కలిగి, నన్ను చూడాలని వచ్చాడు. ఆయన పేరు ఆంజనేయులుగారు. ఇరవై సంవత్సరాలుగా గాయత్రీ ఉపాసన తీవ్రంగా చేస్తున్నారు. పైగా హనుమద్భక్తుడు. ఆయనకు సంతానం లేదు. అదొక లోటు. నాపై, యోగంపై పూర్తి విశ్వాసంతో వచ్చాడు.

ఆయనది మెత్తని మనస్సు - మితభాషి.

"గాయత్రి ఎంతకాలంగా చేస్తున్నారు?" నా ప్రశ్న.

"ఇరవై రెండు సంవత్సరాలుగా"

"మీ అనుభూతి ఏమిటి? ఇప్పుడీ యోగంలోకి రావడానికి కారణం ఏమిటి?

యోగంలో మీ పూజలు, పునస్కారాలు అంగీకరించం. సాంప్రదాయం, ఆచారాలు, మడి, దడి ఇక్కడ పనికిరావు. ఇంతకాలం మీరు చదివింది, తెలుసుకున్నదీ వదులుకోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే మిగతావన్నీ ఈరోజుతో సమాధి చేయాలి. నేటి నుండి మీది పునర్జన్మ... ఇంత సాహసం చేయగలరా? ఇంత కఠోర నిర్ణయం తీసుకోగలరా? బాగా ఆలోచించుకోండి. తర్వాత చాటుమాటుగా అవన్నీ చేస్తే, రెంటికి చెడ్డరేవడి అవుతుంది. ఇంతకాలం చేసింది వృథా అవుతుంది. పూర్తి కైంకర్యం కానందువల్ల ఇక్కడ సాధించేదీ కనిపించదు. ఒకరకంగా యోగంలో చేరడం అంటే ఏరికోరి మృత్యువును ఆహ్వానించడం. ఇక్కడ మృత్యువు మనిషిని చంపదు. మీ గతాన్ని చంపి, సమాధి చేస్తుంది..." అలా వివరంగా చెప్పాను.

అయన ఆలోచనలో పడ్డాడు. అలా చెబితే ఎవరైనా ఆలోచిస్తారు. అంత సాహసం చేయడం మాటలు కాదు.

"దేవతా పూజలు మానమన్నారు సరే! పితృకర్మల మాటేమిటి? పోయిన తల్లిదండ్రులకు ఆబ్దికాలు పెట్టవద్దా! వాటినీ మానివేస్తే వారికి స్వర్గలోక ప్రాప్తి కలగదు కదా?"

"స్వర్గం ఎక్కడ ఉందో, ఎలా ఉంటుందో మనకు తెలియదు. పోయిన వారు తాము ఫలానా లోకంలో ఉన్నామని, కర్మకాండ చేయడం వల్ల ఫలానా పై లోకాలకు ప్రమోషన్ వచ్చిందని, ఏటా పెట్టే తద్దినాల వల్ల, ఒక్కొక్క మెట్టు స్వర్గం దిశగా పోతున్నామని ఎవరైనా చెప్పారా? లేదు. అది మన నమ్మకం. ఆచారాన్ని పాటిస్తున్నాం. మన తృప్తికోసం చేస్తున్నాం. అలా చేయకపోతే ఒక నరకాన్ని మనమే సృష్టిస్తున్నాం. అన్నీ నమ్మకాలు. ఆత్మకు చావులేదు కదా! శరీరాన్ని వదలిన ఆత్మకు శరీర కర్మలు అంటవు. అలాంటి ఆత్మకు స్వర్గ నరకాలు ఏమిటి? ఊర్ధ్వ లోకాలనేవి ఆత్మకు సంబంధించినవే తప్ప అవి మన ప్రపంచంలాంటి లోకాలు కావు."

"మీరు చెప్పింది ఒప్పుకుంటాను. మనం కర్మశేషాన్ని అనుభవిస్తున్నాం గదా?

"మీకు సంతానం లేదన్నారు! ఇంతకాలం చేసిన దేవతారాధన వల్ల ఆ దేవతలు వరాలివ్వవచ్చుగదా! మీకు సంతానమే ప్రసాదించలేరా ఆ దేవతలు. మీ పూజలు అంతటి నిష్ప్రయోజనాలా? మీ పితృదేవతలైనా అనుగ్రహించవచ్చు గదా. ఇదంతా మీరు మీ పూర్వజన్మకర్మ అని సరిపెట్టుకుంటారు! ఆ కర్మకొంతైనా తగ్గే మార్గమే లేదా? మీ పురాకృతాల్ని ఇప్పటి సుకృతంతో రద్దు పరచుకోండి."

"సాధ్యమా?"

"ఏదీ అసాధ్యం కాదు. 'అసాధ్యం' అనే మాటలో 'సాధ్యం' ఉంది. బ్రతికి

ఉండగానే మనకు ఎంతో కొంత ఆత్మశాంతిని ప్రసాదించే మార్గం కావాలి. దాన్ని వెతుక్కోండి. చనిపోయిన తర్వాత మళ్లీ జన్మిస్తామో, లేదో తెలియదు. జన్మించినా ఈ జన్మకు ఆ జన్మకు జ్ఞాపకాల లింక్ ఉండదు కదా. నాది ప్రాక్టికల్ యోగం. ఇందులో పాతనమ్మకాలు వట్టిపోతాయి. సాంప్రదాయంపై మోజుపోతుంది. మన అభివృద్ధి ఏదో ప్రత్యక్షంగా మనకే తెలుస్తుంది. ఒక్కటి ఆంజనేయులుగారూ! ఇంతకాలం ఏవేవో చేశారు. తృప్తిలేదు. ఈ యోగం మీకు తృప్తినిస్తుంది. అది చాలదా! ఆతర్వాత మీరు ఎంత సాధన చేస్తే అంత ఫలితం మీకు దక్కుతుంది. ప్రతిరోజు ప్రేయర్ మీకు అనుభూతం అవుతుంటుంది. మీ అనుభవానికి అందుతుంది."

"నేను యోగానికి అర్హుడినా? నాకా అర్హత ఉందా?"

"మీరు అర్హులవునో కాదో చెప్పే అర్హత నాకున్నదంటారా? యోగం చేయడానికి, ఉత్తమగుణాలు అలవరచుకోడానికి అందరూ అర్హులే. కులాన్నిబట్టి అర్హతలు రావు. గుణాన్ని బట్టి వస్తాయి. శ్రీకృష్ణుడు చెప్పింది గుణకర్మలు, నాలుగువర్ణాలు గుణాలను బట్టి ఏర్పడినవే. వృత్తుల్ని బట్టి ఏర్పడినవి కానే కావు. నాలుగు సంస్కృత శబ్దాలు నేర్చినంత మాత్రాన పండితులు కారు. పెద్ద కులంలో పుట్టినంత మాత్రాన గుణవంతుడు, వివేకవంతుడు కాదు."

"ఇది నూతన యోగం కనుక మీ సనాతన పద్ధతులు ప్రక్కన పెట్టాలి. ఇక్కడి నియమాలు పాటించాలి. మీ దేవుళ్ల పటాలు, పూజలు, అర్చనలు, స్తోత్రాలు ప్రక్కన పెట్టాలి. అసలు ఇంతకాలంగా మీరు అబగా సంపాదించిన జ్ఞానంపైన ముసుగు వేయాలి. 'అన్నీ వేదాలలోనే వున్నా ఁష - అన్నీ పురాణాలలో రాషారుష' అనే కబుర్లు పనికి రావు. మీ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల్ని ఇతర దేవతల్ని అవతల పెట్టండి. వారి చుట్టూ అల్లిన కథలు, పురాణాలు మరచిపొండి. ఇక్కడ మీరు, మీ శరీరం, మీ మనస్సు, మీ ఆత్మ - ఈ నాలుగుస్తంభాలపైనే యోగం నిలబడుతుంది.

మిగతప్రపంచాన్ని మరచిపొండి. 'నేను' తప్ప మరేదీ లేదనుకోండి. మీలో మహత్తరమైన శక్తి ఉంది. అది ఉన్నదని ముందు నమ్మండి. ఉన్నదాన్ని తెలుసుకోండి. ఆ తెలుసుకున్నదానిని బయటకు తేండి. ఏ దేవుళ్లూ ఆ పనిలో మీకు సహాయపడరు. వాళ్లను ఇంతకాలం పొగుడుతూనే ఉన్నారుగా, ఏం నొరగబెట్టారు? మీ లోపలకి మీరే వెళ్లగలరు. నేను వెళ్లలేను. మరొకరు వెళ్లలేరు. అలాగే ఏ దేవుళ్లూ వెళ్లలేరు. మీలో ఉన్నది అభేద్యమైన కుండలినీ శక్తి. ఆ కోటగోడల్ని ఛేదించుకుని వెళ్లగలిగింది మీ ఆత్మశక్తి ఒక్కటే. అందుకే చెప్పాను. నీవు ఆత్మయోగివి కావాలి. ఆపైన కుండలినీ శక్తిని తెలుసుకోవాలి. అది భృక్తంగా ఉంది. దాన్ని భృక్తరహితం చేయండి. మీ శక్తి మీదే. దానిపైన సర్వాధికారాలు మీవే. అది మీ సొంతం."

"నావంటి సామాన్యునివల్ల అంతపని సాధ్యమా?"

"సాధ్యమే. ప్రతివ్యక్తి మొదట సామాన్యుడే. అవకాశం వచ్చినపుడు ఆ శక్తిని పొందినపుడు మాన్యుడవుతాడు. రాముడు సామాన్య మానవుడే, కృష్ణుడు సామాన్య మానవుడే. జీసస్ సామాన్యుడే. మనిషిగా పుట్టిన ప్రతివాడు మొదట సామాన్యుడే. తన ఆత్మశక్తిని తెలుసుకున్నపుడు మహాత్ముడవుతాడు. సాధనచేస్తే యోగి అవుతాడు. యోగి కాకుండా ఎవరూ మహాత్ములు కాలేరు. ముందు ప్రారంభించండి. బండి స్టార్టు చేయకుండానే గమ్యం గురించి కలలు కనడం ఎందుకు? మధ్యలో ఏవో ప్రమాదాలు రావచ్చునని అసలు ప్రయాణమే మానివేస్తారా?"

"అయితే నేను సిద్ధమే" అన్నాడు.

"ఒక్కటి గుర్తుంచుకోండి పంతులుగారూ! నేనేదో యోగం చేస్తున్నాను, ఎవరినో ఉద్ధరిస్తున్నాను అనుకోకండి. అంతా మాస్టరుగారే చూస్తారు. వారే మనల్ని నడిపిస్తారు."

"మాస్టరుగారు ఇప్పుడు లేరు కదా! వారు మనల్ని ఎలా నడిపిస్తారు?"

"ఉన్నారు. మాస్టర్సు అంటే మహాత్ములు. వారు ఎప్పుడూ ఉంటారు. వారికి భౌతిక శరీరాలు ఉండవు. వారి ఆత్మశరీరాలు ఉంటాయి. ఆత్మరూపులైన మహాయోగులు ఎప్పుడు మనకు అందుబాటులోనే ఉంటారు. మాస్టరుగారిని మీరూ చూస్తారు. అనుమానం ఎందుకు?"

"మీరు చూచారా?" ఎదురు ప్రశ్న వేశాడు.

"చూచాను ... ఎప్పుడు సంకల్పిస్తే అప్పుడే కనిపిస్తారు."

"నాకూ కనిపిస్తారా?"

"ముందు యోగార్హత పొందండి. సాధన చేయండి. సాధనలో కొన్నిమెట్లు ఎక్కి అక్కడ చూడండి. మీరు లోయలో ఉండి సూర్యుడు కనిపించలేదంటే ఎలా?"

అంత చెప్పిన తర్వాత ఆయన అన్నారు "నాకు గాయత్రీమాతను దర్శింప చేస్తారా?"

పసిపిల్లవాడు చందమామను తెచ్చిపెట్టమని మారాం చేసినట్లు అడిగారు. ఆయన అమాయకత్వమే అసలైన అర్హత. అహంకారం లేకపోవడం మరొక అర్హత.

"నేను భగవంతుడిని కాను. కనీసం భగవంతుని అవతారమూర్తినీ కాను. మీలాగ అతి సామాన్యుడిని నేను. ఇంతకాలం గాయత్రిని ఉపాసించారు. ఆ జగజ్జననికి మీపట్ల ఏపాటి ప్రేమ ఉన్నా మీకోరిక తీర్చుతుంది. దర్శనం ఏమోగానీ గాయత్రీనిదర్శనం కలగవచ్చు. నాతో ప్రేయర్‌లో కూర్చోండి" అన్నాను.

సాయంత్రం స్నానం చేసి శుచిగా, మడిగా వచ్చాడు.

ఆ రోజు పాతికమందివరకు యోగమిత్రులున్నారు ప్రేయర్‌కు.

"మీరు కళ్లు మూసుకుని గాయత్రీస్మరణ చెయ్యండి చాలు" అని విభూతి పెట్టి ప్రేయర్‌కు ఉపక్రమించాను. అరగంటకు అందరు తీవ్రసాధనలో లీనమైనారు. ప్రేయర్ గది ఒక్కసారి వెలుగుతో నిండిపోయింది. గాయత్రీమాత చిరుసవ్వడి వినిపించ సాగింది. తలుపులు, కిటికీ సందుల్లో నుండి వెలుగులు బయటకు ప్రసరించసాగాయి. యామినీదేవి మంచి సమాధిస్థితిలో ఉన్నారు. ఆమెలో గాయత్రీశక్తి ప్రవేశించింది. శరీరం దేదీప్యమానంగా వెలుగుతోంది. అభయముద్రాంకితమైంది. ఆంజనేయులు ఆమె ముందు ధ్యానస్థితిలో కూర్చుని పారవశ్యం చెందుతున్నారు.అలాగ అరగంటసేపు గడిచింది.

గంట తర్వాత అందరూ ఒక్క క్షణంలో చైతన్యం పొందారు. ఆయన 'అమ్మ' పాదాలపై వాలిపోయి, ఏడ్వసాగాడు. కళ్లవెంట అశ్రుజలాలు. ఆనందంతో తూగిపోసాగాడు. "ఇన్ని సంవత్సరాల నా తపస్సు ఫలించింది గురువుగారూ. మీ కృప వల్ల గాయత్రీమాత దర్శనం లభించింది."

ఆ రోజునే ఆయన యోగంలో ఉపదేశం తీసుకున్నారు. అది 'గాయత్రీ నిదర్శనం.' అది అనుభవ యోగ రహస్యం.

0 0 0

రెండు విషయాలు నాకు అనుభవంలోకి వచ్చాయి. పది, పదిహేను సంవత్సరాల పాటు నాతో కలిసి నడుస్తున్నవారు నాకూ, యోగానికి ఎంతో ఆత్మీయులైనారు. అందుకే మాస్టరుగారు పదిసంవత్సరాల నిబంధన పెట్టారేమో! పది సంవత్సరాలు యోగం సాధన చేసినవారు సీనియర్స్ అవుతారు. అంతేకాదు యోగంతో తాదాత్మ్యం చెందుతారు. రెండవది అమాయకంగా ఉండేవారు అహంకారంలేని వారు యోగంలో బాగా కుదురు కుంటున్నారు. ఎంత చదువుకున్నవారైనా, ఎంత పెద్ద ఉద్యోగాలు చేస్తున్నా, డబ్బు ఉన్నా, వాటిని మరచిపోయి, నిరాడంబరతను ఆశ్రయిస్తే, ఉత్తమ సాధకులవుతున్నారు. పది సంవత్సరాలుగా నాతో కలిసి నడుస్తున్నవారికీ, నాకూ కొన్ని సారూప్యతలు ఉండి ఉంటాయి. భావసారూప్యత ఒక్కటే కాదు, గుణాలలోనూ మైత్రి ఉండి ఉంటుంది. అలాంటి వారిని గమనిస్తే అర్థం అయ్యేది ఒక్కటి. వారు ఎప్పుడు ఏదీ తమకు కావాలని అడగకపోవడం. నన్నే కాదు, మాస్టరుగారినీ ప్రార్థించరు. ఇది కావాలని అడగరు. అలా ఏదీ కోరకపోవడం గొప్ప యోగార్హత.

0 0 0



పితృదేవులు శ్రీ వాసిలి పార్వతీశాచారి



మాతృమూర్తి ఈశ్వరమ్మ

తిరుపతిలో - శార్వరిగారి మాతృమూర్తి, సోదరి అపర్ణ, పార్వతమ్మ
యోగానుయాయి డా॥ పద్మావతమ్మ

తెనాలిలో అభిమానమిత్రులతో
ఎం.డి. సౌజన్య, పి.ఆర్. కోటేశ్వరరావు, చివుకుల పురుషోత్తం, ప్రసాదార్కె

సూర్యదేవర రామ్మోహనరావు, జి.వి. అమరేశ్వరరావులతో

శార్వరిగారి కుమార్తె శ్రీమతి పద్మప్రియ, 3వ కోడలు శ్రీమతి చంద్రప్రభ

3వ కుమారుడు డా. వెంకటరమణ (అమెరికా)

అల్లుడు శ్రీ బి. సర్వేశ్వరరావు (నరసారావుపేట)



యోగాశ్రమానికి విచ్చేసిన విదేశీయులతో
శ్రీ శార్వరి, యామినీదేవి, మణికుమారి
మాస్టర్ యోగాశ్రమం ముంగిట ముచ్చట్లు

శ్రీమతి పద్మప్రియ కుమార్తె ప్రవీణతో యోగాభ్యాసి ఎం. రామకృష్ణ

తొలినాళ్లలో నా యోగంలో చేరినవారిలో చాలామంది శాంతమూర్తులు, అమాయకులు, కోరికలు లేనివారు. సమస్యలు చిన్నాచితకా ఉన్నా ఖాతరు చేయని మనస్తత్వం కలవారు. వారే ఇప్పటికీ చక్కగా యోగం చేస్తున్నారు. యోగపరంగా ఎంతో అభివృద్ధి సాధిస్తున్నారు. మొదటి సంవత్సరం అనుభవంతోనే తెలుసుకున్నాను, పోలీసు ఉద్యోగులు, పొలిటీషియన్స్, ప్రాస్టిట్యూట్స్ యోగం చేయలేరని- అనర్హులని కాదుగానీ, ఈ యోగపద్ధతిలో సాధన సాగించగల వీలు వారికుండదు. వారి బుద్ధి ఇతర విషయాలపైకి పరిగెడుతుంటుంది. పసిపిల్లలు ఆదమరచి, ఊయెలలో నిద్రిస్తారు. యోగంలో సైతం ఆదమరచి, నిద్రించేస్థితి రావాలి! గొంతెమ్మ కోర్కెలతో వచ్చేవారికి సుఖనిద్రపట్టదు. యోగం సుఖం అనిపించదు. అమాయకంగా ఉండే వారంటే నాకు ఇష్టం. ప్రతి యోగసాధకుడు పసివయస్సు మనస్తత్వాన్ని తిరిగి సంపాదించుకోగలగాలి.

సెకండరీ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటులో పనిచేస్తున్న ఆర్. సత్యనారాయణ గారు వచ్చారు ఒకరోజున. ఆదివారం కనుక నేను విశ్రాంతిగానే ఉన్నాను. ఆయనకు ఆఫ్. మిగత రోజుల్లో ఆరు అవుతుండగా వచ్చేవాడిని ఆఫీసునుండి. ఎవరితోనూ మాట్లాడడానికి వీలుపడదు. అందుకే అందరికీ ఆదివారమే అపాయింట్‌మెంట్స్. ఆయన రూపుదాల్చిన దైన్యంగా కనిపించారు. నాలాగానే పిరికివాడనుకున్నాను. మనిషిని చూడగానే జాలి కలిగింది. మాట్లాడితే, మాటలు వృథా అవుతాయన్నట్లు, అతి నెమ్మదిగా ఆచి, తూచి మాట్లాడారు.

"నమస్కారం"... అది ఆఫీసుల్లో లాంఛనం. ఇళ్ల దగ్గరైతే ప్రేమకు, గౌరవానికి చిహ్నం. యోగసంబంధమైతే, భక్తికి, ఆత్మసంస్కారానికి నిదర్శనం. కొందరు పెద్దలు ఎవరైనా తమకు నమస్కరించకపోతే దిగులు పడిపోతారు. తమ గొప్పతనాన్ని గుర్తించలేదని బాధపడిపోతారు. ఆఫీసుల్లో 'నమస్కారం'కు విలువ ఉండదు. 'హలో' అన్నట్లే. సత్యనారాయణగారి 'నమస్కారం' గుండెలోంచి అతికష్టంగా గొంతు పెగల్చుకుని వచ్చింది. దాని బరువు నాకు తెలిసిపోయింది. ఆదరంగా ఆహ్వానించాను. కొందరిని చూడగానే ఎన్నో జన్మల పరిచయం ఉన్నవారనిపిస్తారు. ఈ జన్మలో మొదటి సారిగా కలుసుకున్నా, ఆత్మీయత, ఆప్యాయత పరవళ్లు తొక్కుతాయి.

"కాఫీ తీసుకుంటారా?" నేటి అతిథి మర్యాద. ఆయనకు కాఫీ, టీ, సిగరెట్ లాంటి మంచి అలవాట్లు లేవుట.

"మీ శ్రీమతి అదృష్టవంతురాలు. ఇంత మంచి భర్తను పొందినందుకు" అన్నాను.

ఆయన కళ్లవెంట నీరు కారింది. అవి ఆనందబాష్పాలు కావు. ఆనందబాష్పాలు అంత బరువుగా ఉండవు.

ఆయన నారెండు చేతులు పట్టుకుని, "నా కథ వింటారా? వినగలరా!" అన్నాడు. అది కన్నీటికథ అనిపించింది.

"చెప్పండి... వేరే పనేం లేదు ప్రస్తుతం" అన్నాను.

"నేను యోగంలో చేరతాను. అనుమతిస్తారా?" అడిగాడు.

"చేర్చుకోవడం నా పని. నాకేం అభ్యంతరం లేదు. అనుమతి మాస్టరుగారిచ్చేది. అది వారి ఇష్టం. యోగం అనేది మార్కెట్లో దొరికే వస్తువు కాదు. సాధన చేయగా చేయగా కలిగే అనుభూతి, వచ్చే పరిణామం యోగం అవుతుంది. యోగం అనేది ప్రత్యేకంగా ఉండదు. మన సంస్కారం, సాధనతో కలిసి యోగం అవుతుంది. నా యోగంలో ఆసనాలు, ప్రాణాయామం ఉండవు. ఇది కేవలం మెడిటేషన్."

"నేను మాస్టర్‌గారి ఫాలోయర్ని. మాస్టర్ ఇ.కె. గారి పద్ధతి..." అన్నారు.

"మంచిది. కానీ ఇ.కె. గారి పద్ధతికి, నా పద్ధతికి చాలా తేడా ఉంటుంది. వారి పద్ధతిని ఫాలో కండి. ఈ మార్పు దేనికి? వారు చేసినా, నేను చేసినా మాస్టర్‌గారి యోగమే గదా!"

"నాకు మీ వద్ద చేరాలని అనిపిస్తోంది" అన్నారు.

"ఇ.కె. గారి అనుమతి తీసుకుని రండి. ఒకే మార్గంలోని వాళ్లం. వారి మనస్సుకు కష్టం కలిగించడం నాకిష్టం లేదు.

"పర్మిషన్ తీసుకునే వచ్చాను"

"అయితే నాతో చేరండి, నాతో కలిసి ప్రేయర్ చేసుకోండి"

"ఇనీసియేషన్ ఎప్పుడు చేస్తారు?"

"తెలియదు. ఇనీసియేషన్ చేసేది నేను కాదు. మాస్టరుగారు. ప్రతి ఆదివారం ప్రేయర్‌కు వస్తుండండి. ఎప్పుడు మాస్టర్‌గారు మీకు ఇనీసియేట్ చేస్తారో నాకు తెలీదు. మీ అదృష్టం. నేనుగా ఇనీసియేషన్ యివ్వను. మాస్టరు ఎనర్జీ నాకు అందిన రోజున ఆపని జరుగుతుంది. మాస్టరుగారి ఎనర్జీని మీలోకి పంపడమే నా ఇనీసియేషన్. అది యోగానికి మొదటిమెట్టు. ఆ తర్వాత మీలో జరిగే అభివృద్ధికి నా సహాయం, సహకారం తప్పక ఉంటుంది."

"మీదే భారం" అన్నాడు.

"ఇక్కడ తులాభారాలు లేవు. అందరం సమానమే. అందరం సాధకులమే. నాతో కలిసి యోగం చేయండి చాలు."

సత్యనారాయణగారి రాకకు అసలు కారణం మరొకటి ఉంది. వారి అర్ధాంగికి జాతకం ప్రకారం ఆయుష్షు తీరిపోయిందని ఎవరో పెద్ద జ్యోతిష్యుడు చెప్పాడుట.

ఆయన పెట్టిన చావు ముహూర్తాలకు అరడజనుమంది ఢాంమ్మని ఎగిరిపోయారుట. ఆయనగారి వాక్శుద్ధి అపాటిది. నిజంగా జాతకం ప్రకారం చావురాని వారైనా ఈయన మాట మన్నించి చావక తప్పదుట. సత్యనారాయణగారు అత్తమామలకు అయిన వారికి ఉత్తరాలు రాసిపెట్టారు ఆఖరు చూపుకోసం రమ్మని. ఆ ఉత్తరాలు పోస్టు చేసేలోగా ఎలా బుద్ధిపుట్టిందో నా వద్దకు వచ్చాడు. మద్రాసులో ఉండగా మా డాక్టరు బాలసుందరరావుగారు నా శ్రీమతి విషయంలో ఇటువంటి దొడ్డసలహా యిచ్చారుగాని, ఆ మృత్యుదేవత దొడ్డిదోవన వెళ్లిపోయింది. జ్యోతిషాలపై నాకు విశ్వాసం ఉన్నా మరీ గుడ్డిగా నమ్మను. చావు విషయంలో ఎవరూ సరిగా జ్యోతిషం చెప్పలేరు. అసలు చెప్పకూడదు. నాకు గొప్ప నమ్మకం - 'యోగం' మనిషి ఆయుష్సు పెంచుతుందని, మృత్యువును సైతం తరిమి వేస్తుందని.

ఆయనకు ధైర్యం చెప్పి, వారి శ్రీమతిని ఒకసారి తీసుకు రమ్మన్నాను. వారికి నాపైన, నా యోగంపైన కాస్త గురి ఉన్నట్లుంది. మరుసటి ఆదివారం ఆమెను తీసుకు వచ్చారు. ఆమెను చూడగానే నాకు ధైర్యం వచ్చింది. ఏరోగం లేదు. రొస్టు లేదు. శుభ్రంగావుంది. సాముద్రికం కాస్త తెలుసుగదా! చేయి చూచాను. జీవితరేఖ బ్రహ్మాండంగా ఉంది. పోనీ ఏవైనా అపమృత్యు చిహ్నాలు ఉన్నాయా అంటే అవీ కనిపించలేదు.

'సత్యనారాయణగారూ! ఈమెకు మీరు అనుకునే ప్రమాదం లేదుగాక లేదు, రాసిస్తాను. కనీసం పదిసంవత్సరాలు ఈమెకు ఏ జబ్బూ చేయదు. గ్యారంటీ. యోగం చేసుకోమనండి. మాస్టర్‌గారి యోగం రక్షణకవచంలాగా పని చేస్తుంది. తాను చేసే యోగం వల్ల ఆరోగ్యం, ఐశ్వర్యం సమకూడతాయి."

ఇప్పటికి 15 సంవత్సరాలైంది. సత్యనారాయణగారు వారి శ్రీమతి కళ్యాణి చక్కగా యోగం చేస్తూ యోగజీవనం సాగిస్తున్నారు. మనిషికి ధైర్యంతో పాటు ఆత్మవిశ్వాసం, గురువుపై విశ్వాసం అవసరం.

0 0 0

యోగంకోసం వచ్చేవారిలో నిరక్షరకుక్షులున్నారు,పెద్ద విద్యావేత్తలున్నారు. బడా, చోటా వ్యాపారులున్నారు. నాకు అందరూ ఒక్కటే. చదువుకున్నవారికి ప్రత్యేకగౌరవం యిచ్చి, చిన్నవారిని చిన్నచూపు చూడడం లేదు. అసలు సన్నకారునే ఆత్మీయంగా ప్రేమించాలి. వారు సాంఘికంగా వెనుకనున్నవారు, సమాజం గర్హిస్తున్నవారు. అలాంటి వారికున్న ఆత్మీయత, ప్రేమాభిమానాలు కార్లలో వచ్చేవారిలో ఉండవు. ఈ సంవత్సరం కొత్తగా 65మంది యోగంలో చేరారు.

0 0 0

ఒకరోజున ఒకామె వచ్చింది. చదువు లేదు, సంస్కారం లేదు. మాటలో నాజూకుతనం లేదు. పిచ్చిమాలోకం అనిపించింది. యాభైసంవత్సరాలుంటాయి. దరిద్రం, రోగం బాధలు మనిషిని బాగా క్రుంగదీశాయి. మాట్లాడలేని నిస్సత్తువ. రావటం తరువాయి కాళ్లు పెనవేసుకుని, ఏడవసాగింది.

"ఎవరమ్మా నీవు? ఏం కావాలి? ఏమిటి నీ బాధ" అడిగాను.

గౌతమబుద్ధుడైనా, జీసస్ క్రైస్ట్ అయినా ఆ క్షణంలో కరిగిపోక తప్పదు, కనికరించకతప్పదు. తనను రక్షిస్తానని మాటయిచ్చే వరకు ఆమె నా కాళ్లు వదలలేదు. రాముడికోసం నిరీక్షించిన శబరిలా ఉంది ఆమె వాలకం.

ఆమె పేరు రుక్కమ్మ. ఆమె తమ్ముడు ఎక్కడో గన్నవరంలో చప్రాసీ ఉద్యోగం చేస్తున్నాడుట. ఆ తమ్ముడికే తన బిడ్డనిచ్చి పెళ్లి చేసిందట. వాళ్లకు పిల్లలు కలగలేదు. తను నాలుగు సంవత్సరాలుగా ఉస్మానియా ఆస్పత్రిలో ఇన్‌పేషెంట్‌గా ఉంటోంది. కడుపులో పుండు కోతబెడుతుంది. బ్రతకనివ్వదు. చంపదు.డాక్టర్లు పోనివ్వరు. చస్తే ఆస్పత్రిలోనే చావాలని, శవాన్ని మాత్రం పంపాలని రూలేమో! ఈమె తమ్ముడు నారాయణ కారటు (కార్డు) వేశాడట. యోగదర్శని పత్రిక చదివి నా అడ్రసు పట్టుకుని తెలియచేశాడు. "వెళ్లి గురువుగారి కాళ్లు పట్టుకో. అయనే నీజబ్బు తగ్గించగలడు - ఆవటా అని- అంతే ఆస్పత్రి నుండి చెప్పా పెట్టకుండా పారిపోయి వచ్చింది. వెంట చిన్న కూతురుని తోడు తెచ్చుకుంది. ఆమెకు బస్సుమీద నంబరు చదవడం కూడా రాదు. అసలు చదువుకోలేదు.

ఆమెకు భర్తలేడు. బ్రతికే వున్నాడో లేదో తెలియదు. ఇల్లు వదలి వెళ్లి పోయాడు. ఈమెకు ముగ్గురు కూతుళ్లు, ఇద్దరు కొడుకులు. నావద్దకు వచ్చేసరికి చిన్న కూతురు, చిన్న కొడుకు మాత్రమే ఉండేవారు. నారాయణకిచ్చిన కూతురు తప్ప, పెద్దకొడుకు, పెద్దకూతురు విషయం ఆమె చెప్పలేదు. పూలు అమ్మి జీవిస్తుంది. ఇద్దరు పిల్లల్ని పోషించుకుంటోంది. ఆ పిల్లకు పెళ్లి చేయాలి, కొడుక్కు ఓ దారి చూపించాలి. అప్పటివరకు తను బ్రతకాలి. అది ఆమె కోరిక. ఆ రోజే ట్రీట్ చేశాను. మర్నాటికి ఆమె కడుపులో మంట తగ్గింది. పదిరోజుల్లో పుండు నయమైంది. నాలుగు సంవత్సరాలు ఉస్మానియా ఆస్పత్రిలో ఉన్నా తగ్గని జబ్బు! పాపం! పదిరోజుల్లో తగ్గింది. తిరిగి పూల వ్యాపారం మొదలు పెట్టింది.

ప్రతి ఆదివారం తప్పకుండా వచ్చేది. వస్తూ ఇన్ని పూలమాలలు, కొబ్బరికాయ, పళ్లు తెచ్చేది.

'ఎందుకమ్మా ఈ ఖర్చు. మాస్టరుగారికి ఇవేవీ అవసరం లేదు. తీసుకురావద్దు' అంటే వినేది కాదు. ప్రతి వారం పాతిక, ముప్పయి రూపాయలు ఖర్చు చేసేది. ఆటోలో

వచ్చేది. అదొక ఖర్చు అదనం. తన సంపాదనలో కొంత భాగం మాస్టరుగారి కోసం ఖర్చు పెట్టాలని ఆమె నిర్ణయం. చెప్పినా వినదు.

"నాయనా! పుణ్యవతి పెళ్లి అయ్యేవరకు బతికించు చాలు" అని వేడుకునేది. తర్వాత పది సంవత్సరాలు, మేం తిరుపతి వెళ్లేవరకు బాగానే ఉంది. కూతురు పెళ్లి చేసింది. చిన్న కొడుకు పెళ్లి చేసుకున్నాడు. చిన్న కొడుకు విషయంలో తన కిష్టం లేని విధంగా పెద్దకొడుకు జోక్యం చేసుకోవడంతో తట్టుకోలేకపోయింది. పది సంవత్సరాలు యోగానికి అంకితమైపోయిన సాధకురాలు. అంత అమాయకంగా వున్నా "రుక్కమ్మా! ట్రీట్‌మెంట్ చేస్తావా!" అంటే నడుం బిగించి పూనుకునేది. నిమిషాలలో మాస్టర్ శక్తి ఆమెలోకి వచ్చేది. సంపూర్ణ సమర్పణకు చక్కని ఉదాహరణ రుక్కమ్మ యోగజీవితం.

0 0 0

ఆ సంవత్సరం యోగంలో 70 మంది చేరారు. ఒక్కొక్కరి ప్రవేశం చిత్రంగా జరిగింది. గత సంవత్సరంలో చేరిన మెట్‌పల్లి గుప్తా ఓ ఇరవైమందికి సభ్యత్వం యిప్పించాడు. తానే ఇనీసియేట్ చేసేవాడు. అప్లికేషన్ ఫారాలు మాత్రం నాకు పంపేవాడు. వారందరికీ తనే గురువునని చెప్పుకునేవాడు. ఏం చేస్తాం? కర్నూలు, చిత్తూరు, మదనపల్లి, ధర్మవరం, నంద్యాల, రాజంపేట ఇలా అనేక ప్రాంతాల నుండి సభ్యులు వచ్చి చేరారు. అప్పట్లో డైరెక్టుగా హైదరాబాదు రావాలని, ఇనీసియేషన్ తీసుకోవాలని నిబంధన లేదు. ఎవరు యోగంలో చేరాలనుకున్నా మెంబర్‌షిప్ యిచ్చేవాళ్లం. జనానికి యోగం గురించి తెలియాలి. డి.ఎన్. రావు, నేను ఆలోచించింది అంతవరకే. యోగంవ్యాప్తి కావాలి. అదే మా తపన. అర్హతానర్హతల ప్రసక్తి లేదు. హైదరాబాదు నుండి హిందూస్తాన్ ఏరోనాటిక్స్‌లో పి.ఆర్.ఓ. శ్రీ పి.ఎం.వి. ప్రసాద్‌గారు, శ్రీ ఎం.బి.ఆర్.కె. శాస్త్రిగారు రెగ్యులర్‌గా వచ్చేవారు.

ఏదో పనిబడి నేను తిరుపతి వెళ్లాను. అక్కడికి మదనపల్లి నుండి ఇద్దరు యోగసాధకులు వేణుగోపాల్, రామ్మూర్తి వచ్చారు నన్ను చూడాలని. సొంతంగా యోగం చేస్తున్నా, సాధనలో వైబ్రేషన్స్ వస్తుండేవి. ఏవో కొత్త కొత్త అనుభూతులు కలిగేవి. ఆ అనుభవాల వల్ల యోగం పట్ల ఆసక్తి పెరిగేది. వారు మిత్రులకు చెప్పడంతో వారికి ఆసక్తి కలిగేది. మదనపల్లి నుండి వచ్చిన ఇద్దరూ యోగం బాగానే చేస్తారు కానీ ప్రేయర్‌లో ఉండగా, తెలియనిస్థితిలో బట్టలు విప్పతీసి పడేసేవారు. ఆ కారణంగా ఒంటరిగా గదిలో తలుపులు బిగించుకుని కూర్చునేవారుట. దానికి ట్రీట్‌మెంట్ కోసం వచ్చారు. క్రిందపడి దొర్లడం, శరీరం రకరకాల ముద్రలు పట్టడం నాకు తెలుసు. ఇలా బట్టలు పీకి

పారేసిన అనుభవం ఎవరూ చెప్పలేదు. ఆ రోజున వారికి 'టచ్' యిచ్చి పంపాను. మాస్టర్‌గారి దయవల్ల వారిలో ఆ ఉన్మాదం తగ్గిపోయింది.

0 0 0

పదిగంటలకు ఠంచన్‌గా ఇంటివద్ద బయలుదేరితే పదిన్నరకు ఆఫీసుకు చేరతాను. నడిచిపోవడమే కనుక, ఆలస్యం అయ్యే అవసరం లేదు. ఏ పరిస్థితిలోను టైముకు ఆఫీసుకు వెళ్లడం నా అలవాటు. సాయంత్రం అయిదుకు ఖచ్చితంగా బయట పడతాం. ఎప్పుడోగానీ ఆలస్యం కాదు. ఆ రోజు అలాగే బయలుదేరబోతుండగా, ఒకాయన గుమ్మంలో ప్రత్యక్షం అయినాడు.

"నమస్కారం"

"మీరు ఎవరో, ఎందుకు వచ్చారో విచారించే టైం లేదు. నాకు ఆఫీసు టైం అయింది. దయచేసి సాయంత్రం రండి."

"క్షమించండి... ఒక్క అయిదు నిమిషాలు నాకోసం, తర్వాత వెళ్లి పోతాను. ప్లీజ్" అన్నాడు.

చదువుకున్నవాడులా వున్నాడు. "సరే... చెప్పండి" అన్నాను.

నా పేరు పి.టి.ఎల్. నరసింహం. పెనుగొండలో అడ్వకేట్‌ని. పుట్టపర్తి నారాయణచార్యులుగారి మనవడిని. నన్ను పంపింది సౌరిస్‌గారు. ఓ పని మీద వచ్చాను. ఆ పని మీ వల్ల అవుతుంది.

మూడు మాటలతో కూర్చుండి పోయాను. సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారంటే నాకు ఎనలేని గౌరవం. తెలుగు సంస్కృత పండితులలో అయనంత ఆధునిక భావాలు కలవారు తెలుగునాట లేరని నా అభిప్రాయం. నేను చిత్తూరులో ప్రభలో పనిచేస్తున్నప్పుడు వారు వచ్చేవారు. బాగా పరిచయం. పధ్నాలుగు భాషలు నేర్చిన సరస్వతీపుత్రులు. వారికి ఈయన మనవడట. ఆయన ప్రస్తావించిన రెండవపేరు సౌరిస్‌గారు. సౌరిస్ ప్రసిద్ధరచయిత గుడిపాటి వెంకటచలంగారి కూతురు. ఒకప్పుడు ఆమె కథలు, నాటకాలు రాసేది. ఒక గొప్ప అజ్ఞాత రచయిత్రి. తండ్రితో పాటు రమణాశ్రమం చేరి ఒక ఆశ్రమం సొంతంగా నెలకొల్పుకుని, ఆధ్యాత్మికజీవనం సాగిస్తున్న యోగిని. అవధూత మాల పిచ్చమ్మగారి ఆశీస్సులు పొందిన ఆమె సౌరిస్.

"వివరంగా చెప్పండి" అని కూర్చుండిపోయాను.

నేను అనంతపురంజిల్లా పెనుగొండలో అడ్వకేట్‌ని. సౌరిస్‌గారి శిష్యుడిని. మీ గురించి మా తాతగారు నారాయణాచార్యులుగారు చెప్పారు. నేను వచ్చిన కార్యం క్లుప్తంగా చెబుతాను. ధర్మవరంలో నా మిత్రుడొకరున్నారు, కుల్లాయప్ప. లేబర్ ఆఫీసరు.

అయన చాలాకాలంగా నియమనిష్టలతో దేవీ ఉపాసనలు చేస్తున్నాడు. ఆ ఉపాసనల్లో ఏదో భేదం వచ్చిందని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారే చెప్పారు ధ్యానంలో కూర్చుని. దానికి విరుగుడు కావాలి. అతను ప్రస్తుతం మృత్యుముఖంలో వున్నాడు. మా గురువుగారు సౌరీస్‌దగ్గరకు తీసుకువెళ్లాను. రమణాశ్రమం... ఆమె గొప్ప ఆధ్యాత్మికశక్తి గలది. ఆమె చెప్పారు "అతనికి మీరు యోగంతో ట్రీట్ చేయగలరని, ఇంక ఎవరివల్ల కాదని"

"సౌరీస్‌గారికి నా గురించి, నా యోగం గురించి ఎలా తెలుసు. ఆమెను నేను ఎన్నడూ చూడలేదు. ఆమె నన్ను చూచి వుండరు. రచయితగా నా పేరు విని ఉండవచ్చు. నేను యోగంతో అలాంటికేసులు చేయగలనని ఆమె ఎలా ఊహించారు?"

"అది నాకు తెలియదు స్వామీ! ఆమె ధ్యానంలోకి వెళ్లి మీ గురించి చెప్పారు. మా తాతగారూ మీపేరు చెప్పారు. మీరిక్కడ వుంటారని నాకు తెలియదు. సౌరీస్‌గారే చెప్పారు. శార్వరిగారు హైదరాబాదులో ఉంటారు. ప్రభలో పనిచేస్తున్నారు. ధర్మవరంలో తోట నరసింహంగారు మీ అడ్రసు యిచ్చారు. ఇదీ విషయం."

కొద్దిరోజులక్రితమే తోట నరసింహం యోగంలో చేరిన జ్ఞాపకం. మనిషిని చూడలేదింకా. ఆలోచించాను. ఈ కేసు నేను చేయగలనా! ఇద్దరు పెద్దలు దివ్యస్ఫూర్తితో నా గురించి సెలవిచ్చారు. ఇది నాకు పరీక్షా? నా యోగానికా?!

అతనిని సాయంత్రం ప్రేయర్ టైంకు రమ్మని చెప్పాను. సాయంత్రం అతను వచ్చి, ధర్మవరం వెడదాం రమ్మన్నాడు.

"నేను ఎక్కడికీ రానవసరం లేదు. అయన పేరు చెప్పండి చాలు. ప్రేయర్ చేసి చెబుతాను. నాకు మాస్టర్‌గారి సందేశం అందాలి. అలా అందితే అతనికి తగ్గినట్లే' అన్నాను.

ప్రేయర్‌లో మంచి వైబ్రేషన్స్ వచ్చాయి. ఏదో యాస్ట్రల్ లెవల్‌లో ట్రీట్‌మెంట్ జరిగినట్లు అనిపించింది. అతనికి విభూది యిచ్చి పంపాను. "విభూతి పెట్టుకోమని చెప్పండి. తొమ్మిదిరోజులు పూజలు బంద్ చేయమనండి. ఈ తొమ్మిదిరోజుల్లో అతనికి రోగం నయమవుతుంది. తర్వాత తన పూజలు పూర్తిగా బంద్ చేయాల్సి వుంటుంది. రోజూ మాస్టర్‌గారి జపం చేయమనండి చాలు."

... మిరకిల్!! పదవనాడు నరసింహం ఆ కుల్లాయప్పను వెంటబెట్టుకుని వచ్చాడు. ట్రీట్‌మెంట్ ఇక్కడ చేస్తున్నప్పుడే అతనిలో మార్పు కనిపించిందట. రోజు రోజుకు గుణం కనిపించసాగింది. చెప్పినట్లు తొమ్మిదిరోజుల్లో పూర్తిగా కోలుకున్నాడు. అతనికి ఆ ఊళ్లో మంచి పలుకుబడి వుంది. లేబర్ ఆఫీసరుకదా! చాలాకాలం జబ్బుగా

వున్నాడు. వ్యాపారస్తులందరు తెలుసు. మంచివాడని పేరుంది. దేవీపూజలు అవీ చేస్తూ, ముఖాన ఇంతపెద్ద కుంకుమ బొట్టుపెట్టుకుంటే ఎవరైనా వాసనపడతారు. ఒక ఆకర్షణ ఏర్పడుతుంది గదా! పైగా లేబర్ ఆఫీసరు, వ్యాపారులందరికీ కావలసిన వ్యక్తి. అతను మృత్యుముఖం నుంచి బయటపడడం, కథలుగా చెప్పుకున్నారు. ఆయన, నరసింహం వచ్చి, విషయం చెప్పి, యోగంలో ఉపదేశం పొందారు. వారి తాలూకు మిత్రులు ధర్మవరం, పెనుగొండ, అనంతపురం, కల్యాణదుర్గంలో చాలామంది వున్నారు. వారందరికీ నా గురించీ, యోగం గురించీ తెలిసింది. క్రమంగా ఒక్కొక్కరు రాసాగారు యోగంలోకి.

0 0 0

అప్పట్లో నా ఉత్సాహానికి కాస్త ఉబలాటం తోడైంది. యోగానికి ఏదో చేస్తున్నామన్న తృప్తి. ఇంకెంతో చేయాలన్న తపన. ఉత్తరం రాసినవారికల్లా ప్రేయర్ పంపేవాణ్ని. చేయవలసిన పద్ధతులు రాసేవాణ్ణి. ఒక చిన్న బ్రోచర్ ప్రింట్ చేశాం ప్రేయర్‌తో. అదొక సరదా. అలాగే పోస్టుద్వారానే ట్రీట్‌మెంటు చేస్తుండేవాణ్ని. ధర్మవరం నుండి సరోజమ్మ అనే టీచర్ ఉత్తరం రాసింది. ఆమెకు కీళ్లనొప్పులు. నడుంనొప్పి, లేవలేదు. పనులు చేసుకోలేదు. కొన్ని సంవత్సరాలుగా అదేస్థితి. భర్తపోవడంతో ఆమెకు రోగం పట్టుకుంది. సహజం. మానసిక అనుబంధం అలా చేస్తుంది. భర్త పది సంవత్సరాలు జబ్బుపడి చనిపోయాడట. ట్రీట్ చేసి, విభూతి పంపాను. ప్రేయర్ చేసుకోమని సలహా యిచ్చాను. పదిరోజుల్లో ఆమె నరాలబలహీనత పోయింది. లేచి తిరగగలిగింది. ఒక్కనెలలో పూర్వపు ఆరోగ్యస్థితి వచ్చింది. హైదరాబాదు వచ్చింది. తన అనుభవాలు చెప్పింది.

ట్రీట్‌మెంట్ అయిన తర్వాత, ఒకరోజు రాత్రి ఆమెకు భర్త కలలోకి వచ్చాడుట. అందరికీ కలలు వస్తుంటాయి. కలల్లోకి ఎవరెవరో వస్తుంటారు. ఆమెకు అది కలలా అనిపించలేదు. నిజంగానే తన భర్త బజారునుండి వచ్చినట్లుంది. తను మామూలుగా వుంది. కలలో నైనా భార్యభర్తలు కనిపిస్తే ఊరుకుంటారా! ప్రేమ పొంగింది. ఇద్దరు ఒకటైనారు. ఉదయం లేస్తూనే ఆమెకు రాత్రి జరిగిన సమాగమం కలలోనని తెలిసి సిగ్గుపడ్డదట. ఆపూట నుండి ఆమె నరాల జబ్బు తగ్గుముఖం పట్టింది. పదిరోజుల్లో మామూలు మనిషి అయింది.

"గురువుగారూ, నాలుగు సంవత్సరాల క్రితమే మీరు కనిపిస్తే మా వారు బ్రతికిపోయేవాడు" అని విలపించింది. మన చేతిలో లేదు. యోగం చేస్తున్నంతకాలం ఆమెకు భర్త యాస్ట్రల్ రూపంలో కనిపిస్తుండేవారు. ఆయన చనిపోయిన దిగులు పోయింది ఆమెకు.

దిల్‌షుక్‌నగర్ నుండి ఒకామె వచ్చింది. ఎప్పటినుండో యోగం చేస్తున్నది. తిరుపతి శ్రీనివాసాచారిగారి శిష్యురాలు. ఆమెకు తోడు ప్రక్కింటి ఇల్లాల్ని తెచ్చేది. ఆమె రమాదేవి. ఇద్దరు కవల కన్యల్లా ఉండేవారు. ఒకేరకం చీరలు, జాకెట్లు, చెప్పులు వేసుకునేవారు. మంచిదోస్తి. వరలక్ష్మికి గుండెజబ్బు. చికిత్సకోసం వచ్చింది. ఎవరు చెప్పారో మరి. ఆమె ఇంట్లో ఏ పనిచేసేది కాదు. భర్త, కొడుకు ఇంటిపని చూసుకునేవారు.

సాధారణంగా ఒకరి దగ్గర చేరి యోగం చేస్తున్న వారిని నా దగ్గరకు అంగీకరించను. ఎవరికైనా ఒక గురువు చాలు. ఒక పద్ధతి చాలు. ఒక గురువును, చేస్తున్న పద్ధతిని కాదని వచ్చేవారు ఇక్కడా ఎక్కువకాలం ఉండలేరు. అది వారినైజం. ఇది కాదని అది, అలా మారడం వారికి తృప్తి. ఎక్కడా అభివృద్ధి సాధించలేరు.

ట్రీట్‌మెంట్ మాత్రం చేస్తానని ఒప్పుకున్నాను. శ్రీనివాసాచారి గురించి ఏమీ నా దగ్గర చెప్పవద్దన్నాను. చాలామందికి అదొక జబ్బు. కొత్తచోటికి వెళితే పాతవారిపై లేనిపోని ఫిర్యాదులు చెప్పి అసంతృప్తి వెళ్ళడించి, వారికి దగ్గర కావాలనుకుంటారు. రేపు మరొకచోటికి వెళ్లి, మన మీద అలాగే చెబుతారు కదా! ఆ పద్ధతి నాకు నచ్చదు. ఎవరి గతం గురించి నేను వివరంగా తెలుసుకోను. నా వద్ద చేరిన వారు నియమంగా ఉండాలి. మరొకచోటికి పోతామంటే అంగీకరించను. అలా నాలుగుచోట్లకు తిరగడంవల్ల యోగాభివృద్ధి కలగదు. ఆదివారాలు మాత్రమే ట్రీట్‌మెంట్స్ చేస్తాను. మిగతారోజులలో కుదరదు. ఆఫీసునుండి సమయానికి రాలేకపోవచ్చు. ఆలస్యం అయ్యే సమయంలో ఆఫీసులోనే ప్రేయర్ చేసుకుంటాను. వీళ్లకోసం ఆఫీసు, ఉద్యోగం వదులుకోలేనుగదా!

వరలక్ష్మికి ఓ నెలరోజుల్లో జబ్బు తగ్గిపోయింది. ఇంటిపనులు చేసుకోసాగింది. మనిషి కాస్త లావైంది. ఎర్రబడ్డది. ఆ తర్వాత ఆమె తిరుపతి సెంటర్‌కు వెళ్లలేదు. ప్రతి ఆదివారం ఖచ్చితంగా తను, రమాదేవి, ఆమె కొడుకు ఆదిత్య వచ్చేవారు. ఆమె భర్తమాత్రం ఎన్నడూ రాలేదు.

0 0 0

మద్రాసులో ఉండగా యామినీదేవిలో యోగాభివృద్ధిని నేను అంతగా గమనించలేదు. మా గురువుగారు మాత్రం ఆమెలో వున్న నిగూఢశక్తిని గుర్తించారు. తను, పెద్దబ్బాయి వసంతకుమార్ యోగం బాగా నమ్మకంగా చేసేవారు. మిగిలిన పిల్లలు అప్పటికి మరీ చిన్నవాళ్లు. హైదరాబాదు వచ్చిన తర్వాత అయిదారు సంవత్సరాలు అందరం అగ్నిపరీక్షల నెదుర్కొన్నాం. పుటం వేస్తేగానీ బంగారం శుద్ధికాదు. అలాగే మమ్మల్ని యోగాగ్నిలో కాల్చుకున్నాం అని చెప్పకతప్పదు. ఎంతటి విపత్కర పరిస్థితిలోనూ, యోగాన్ని వదలలేకపోయాం. మరొకమార్గం లేదు. దేవతాపూజల పైకి మనస్సు పోయేది

కాదు. 1983లో యోగాసెంటర్ పెట్టడం, డి.ఎన్.రావుగారితో మైత్రి, మా మనసుల్ని మార్చివేసింది. నా కన్న ఆ మార్పు యామినీదేవిలో స్పష్టంగా కనిపించసాగింది. తనలో ఏదో దైవీశక్తి చొరబడింది. నాలుగుసంవత్సరాల క్రితమే ఆమె యాస్ట్రల్ శరీరం బాగా తయారైంది. ఏ దైవశక్తి అయినా, అందులో ప్రవేశించడానికి అనువుగా మారింది. మూడు నాలుగుసందర్భాలలో అది నిరూపణ అయింది. అయితే సంసారం కనుక, భార్యాభర్తల మధ్య చిన్న చిన్న విభేదాలు తప్పవు. పిల్లల విషయంలోనూ అంతే. వాళ్లకు చదువులు మాకు ముఖ్యం. నలుగురినీ ప్రయోజకుల్ని చేయాలి. మేం చేశామని కాదు. బిడ్డలు యోగ్యులు, ప్రయోజకులు కావడానికి తల్లిదండ్రుల నిష్ఠ, నియమం, ప్రేమ అవసరం. వాటిని పుష్కలంగా అందించడం తల్లిదండ్రుల బాధ్యత. ఆ విషయంలో నేను కాస్త అలసత్వం చూపించినా, కటువుగా వున్నా, తాను బాధ్యత వహించేది. ఇద్దరం పిల్లల విషయంలో కఠినంగా ఉండకూడదు. నా వంతు ప్రేమానురాగాలను సైతం తానే బిడ్డలకు అందించేది. నేను చూచీచూడనట్లు పోయేవాడిని. అంతగా పట్టించుకోవడానికి నా ఉద్యోగం అలాంటిది. బయటవ్యవహారాలు అనేకం. పుస్తకాలు రాయడం, ప్రచురణ, బిజినెస్, యోగా...ఎన్నో వ్యాపకాలు నాకు. అందుకే పిల్లల మంచి చెడ్డలు చూచేపని తనకు వదిలేశాను. అది కారణంగా నేను పిల్లల్ని ప్రేమించనని, కఠినంగా వుంటానని, ఎప్పుడు సీరియస్‌గా మొహం పెట్టుకుంటానని అపవాదులు వచ్చేవి. అయినా పట్టించుకున్నది లేదు. పై ఎత్తున గమనిస్తుండేవాడిని. దానివల్ల యామినీదేవి బాధ్యతలు పెరిగాయి. అందరినీ ప్రేమగా ఆదరించడం తప్పనిసరైంది. ఇంటికి బంధువులు వచ్చినా, వారికి మర్యాదలు అవీ తనే చూచేది. బంధువులతో ఎక్కువగా నేను కలవలేకపోయేవాడిని. అది నా బలహీనత కావచ్చు. వాళ్లు రావడం అయిష్టం కాదు. వాళ్లతో సొల్లుకబుర్లు చెప్పడం నాకు యిష్టం ఉండదు.

యోగాస్కూలు పెట్టిన తర్వాత, రోజూ ఎవరో సాధకులు రావడం, పోవడం జరుగుతుండేది. నేను సమయానికి ఇంట్లో వున్నా, లేకపోయినా, వారి యోగక్షేమాలు విచారించవలసినది ఇల్లాలిగా తనే. అప్పుడు ఆమెలో మానసిక పరిణతి కలిగింది. అందరితో ప్రేమగా ఉండడం అలవాటైంది. ఎవరు ఏ కులం అనే విచక్షణ లేదు. ఎవరు ఏ కులంవారైతే మాకేం? యోగం కోసం వచ్చేవారంతా మా బంధువులు. మాకు ఆత్మీయులు. ఆ భావన కలగడం అంత సామాన్యం కాదు. వాటిని ఆమె అలవోకగా సాధించింది. ప్రేమగా, అప్యాయంగా పలకరించడంతో మనుషుల్ని కొంతవరకు తృప్తిపరచవచ్చునని, తనను చూచే నేనూ గ్రహించాను. అలా నేను మారడానికి చాలా టైంపట్టింది. అసూయను పూర్తిగా వదిలివేస్తేగానీ ప్రేమ అంకురించదు. యామినీదేవిలో

ఆ విశాల దృక్పథం, ప్రేమ, జాలి ఎలా ఏర్పడ్డాయో నాకైతే తెలియదు. సాధారణంగా ఆడవారికి అసూయ ఉంటుంది. ఈమెకు అసూయ స్థానంలో ప్రేమ ఏర్పడ్డది. ఇంటికి ఎవరు వచ్చినా, కాఫీ ఫలహారాలు, భోజనాలు లేదనకుండా, సమయంకాని సమయంలో వచ్చినా, శ్రమ అనుకోకుండా ఆనందంగా చేసిపెట్టేది. ఏదీ నాతో చెప్పవలసిన అవసరం లేదు. కలిగినంతలో నలుగురినీ తృప్తి పరచడం ఆమె స్వభావంగా మారింది.

నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఒక్కొక్క సమావేశంలో, నాలుగైదురోజులపాటు వందలమందిని ఎలాసంబాళిస్తుందో! అంతమందికి టిఫిన్లు, భోజనాలు... టైంప్రకారం జరిగిపోతుండేవి. అన్ని పనుల వెనుక తన హస్తం ఉండేది. తన పర్యవేక్షణ ఉండేది. ఆ ప్రేమాదరాలు ఏడాదికేడాది పెరుగుతూ వచ్చాయి. అలా ప్రేమతో యోగశిఖరాల్ని చేరడం ఆడవారికే సాధ్యం. శారదాదేవి, అరవిందో ఆశ్రమంలోని మదర్, జిల్లెల్లమూడి అమ్మ.. ఇలా యోగం చేసిన స్త్రీ మూర్తులంతా కరుణామయులే, ప్రేమస్వరూపులే. సాధన ఒక శిఖరం వరకు సాగితే తప్ప, సద్గుణాలు అలవడవు. అంతస్సు మారుతుంది. మానసిక పరిపక్వత కలుగుతుంది. అది ఆమెకు సహజంగా, యోగం వల్ల అలవడింది. పుస్తకాల వల్ల మాత్రం కాదు. యోగశక్తి లేదా కుండలినీ శక్తి అనాహత కేంద్రాన్ని తాకినప్పుడు మాత్రమే మానవత్వం దివ్యత్వంగా మారుతుంది. ఆ గుండెలో ప్రేమ నెలకొంటుంది. విశ్వప్రేమి అవుతారు. యామినీదేవి జీవితం అనేక ఒడిదుడుకులకు లోనైందని నాకు తెలుసు. ఎన్నో అగ్నిగుండాలను గుండెలో దాచుకుంది. కనుకనే కన్నబిడ్డలవలె శిష్యులనూ ఆదరిస్తోంది.

మద్రాసులో ఉండగా అలాంటిస్థితి లేదని కాదు. అక్కడి వాతావరణం, పరిస్థితి వేరు. అది పరిమితం. ఇప్పుడది అపరిమితం - అనంతం. ఎప్పుడూ మా ఇంట ఆచారాలు, అంతగా మడి లేవు గానీ పూజలు గట్రా వుండేవి. యోగంలోకి వచ్చాక అవి పూర్తిగా పోయాయి. అంటే తనకుగానీ, నాకుగానీ పూర్తిగా మారడానికి యోగజీవనంలో కుదురుకొనడానికి పన్నెండు సంవత్సరాలు అవసరమైంది. యోగంలో చేరీ చేరగానే మార్పు రావాలంటే సాధ్యం కాదు. అలా మారిన వారు ఉండవచ్చు. సామాన్య కుటుంబీకులకు సాధ్యపడదు. పన్నెండు సంవత్సరాలు ఒక 'కాలగుళిక.' పూర్వకాలం లోనూ రాజులు, జిజ్ఞాసాపరులు అడవులకు వెళ్లి పండ్రెండు సంవత్సరాలు ఘోరతపస్సు చేసిన కథలున్నాయి. మనం అడవులు పట్టిపోకపోయినా, ఇంటిపట్టున ఉండి సాధన చేసినా సంపూర్ణ పరిణామానికి పండ్రెండు సంవత్సరాలు పడుతుంది.

0 0 0

నేను సావిత్రి రాసిన ఏడుసంవత్సరాల కాలం ఒక తపస్సు. ఒక అకుంఠిత దీక్ష. ఆ కాలంలో నేను సాధించినదాన్ని, యామిని అలవోకగా యోగసాధనతో సాధించింది. అంటే ఆమె అనుభవం నా రచనకు పుష్టినిచ్చింది. అర్ధాంగి సహకారం అనేది కుటుంబ నిర్వహణకే కాదు, పారమార్థికతకు, లక్ష్యసాధనకు ఎంతో అవసరం. దైవత్వం మనిషిలోకి దిగిరావడం అనే అరవిందయోగి తత్వం యామినీదేవిలో నేను దర్శించగలిగాను. అది సహజ యోగపరిణామం. అది పరిణతి. అది పూర్ణయోగపద్ధతి. అరవిందయోగికి మదర్ సహకారం లాంటిదే నాకు యామినీదేవి సహకారం. పూర్ణయోగానికి వారు ఇరువురు ఎలా సమభాగులో, నా యోగసిద్ధికి, యోగపూర్ణతకు యామినీదేవి సహభాగి, సగభాగి. ఆమెలో ఎప్పుడెప్పుడు దివ్యశక్తులు ప్రవేశించాయో నేను గమనించాను. కానీ తనకు చెప్పలేదు. గమనించి, అభివృద్ధికి సహకరించడం దానిని సద్వినియోగపరచేలా చూడడం నా అభిమతం.

సావిత్రికి మృత్యువు ప్రత్యక్షం అయింది. మృత్యువుతో ఆమె దెబ్బలాడింది. సత్యవ్రతం చేసింది. మృత్యుంజయ అయింది. మహాశక్తి సంపాదించుకున్నది. అదిరాసే సమయంలో నేను అగ్ని కీలాద్రి శిఖల్ని చూచాను. అలవికాని కోపోద్రేకాలకు, సంక్షోభాలకు గురైనాను. అనేక ప్రకృతిశక్తులు వికృతంగా నాపై దాడిచేశాయి. ఒంటరిగానే పోరాటం సాగించాను. అప్పుడే యామినీదేవిలో కాళికాశక్తి ప్రవేశించింది. నాకు తెలుసు. కనుకనే తలవొగ్గాను. శిరసావహించి, సాష్టాంగనమస్కారం చేసి 'దేవి'ని ప్రసన్నం చేసుకున్నాను. ఏ దైవశక్తినీ మనం ప్రతిఘటించకూడదు. మనకిష్టం లేకపోయినా, అవసరం లేకపోయినా, ఆ శక్తి మన దగ్గరకు వచ్చినప్పుడు, స్వీకరించవలసిందే. కొన్ని పనులు మనం అనుకున్నంత మాత్రాన కావు. సంకల్పం మాత్రమే మనది. తథాస్తు దేవతలంటారు. దైవికశక్తులు ముందు ప్రతిఘటించినా, తర్వాత మన సత్యదీక్షను మన్నిస్తాయి. మనతో సహకరిస్తాయి. మహాత్ముల, దివ్యశక్తుల సహకారం లేనిదే సత్కార్యాలు చేయలేం!

యోగానికి రెండు ముఖాలు... లేదా రెండు నాడులున్నాయి. యోగం పరిణతి చెందడానికి గుర్తుగా శక్తిపాతం జరుగుతుంది. 'ప్రేమ' విశ్వవ్యాప్తమవుతుంది. ప్రేమ, శక్తి అన్నవి వేర్వేరు కాదు. మగవారిలో శక్తి, ఆడవారిలో ప్రేమగా దర్శనమిస్తుంది. వినిమయమవుతుంది. మగవారు యోగాన్ని శక్తిగా మార్చుకుంటే ఆడవారు ప్రేమగా మార్చుకుంటారు. ఒకటి ఎక్కువ. రెండవది తక్కువ కాదు. ఈ రెండు కలిస్తే పూర్ణత్వం. కలిస్తేనే దాంపత్యం. భార్యభర్తలు కలిసి యోగం చేయాలనడంలో ఆంతర్యం అదే. అంతేగానీ, నిత్యం సంసారం చేయమని కాదు. ప్రేమ-శక్తి ఏకం కావాలి. ఒక్కటిగా ప్రవర్తిల్లాలి. ఇడ, పింగళలోని శక్తి, ప్రేమ వాహినులు కలిసి, అంతర్వాహినిగా సుషుమ్న

ద్వారా, ఊర్ధ్వస్థితికి చేరాలి. మాస్టర్‌గారి యోగశక్తికి ధీటైనది మాతృశ్రీ ప్రేమ. ఇద్దరి సాధన ఒక్కటే, గమ్యం ఒక్కటే, దిశ ఒక్కటే. మాస్టర్‌గారి యోగానికి మాతృశ్రీ అనుకూలత, సహకారం, అనురాగం పెట్టనికోటలు.

సూత్రం ఉన్నదిగానీ భార్యాభర్తలు కలిసి యోగజీవనం సాగించిన సందర్భాలు తక్కువ. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి దంపతుల్ని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. నాకు తెలిసిన సీనియర్ సాధకులలో చాలామందికి భార్యల సహకారం లేదు. దానిని ఒక లోపంగా చెప్పకపోయినా, యోగపూర్ణత్వానికి అది లోపమే. ఇప్పటికీ చాలామంది యోగసాధకుల భార్యలు యోగం చేయరు. 'యోగాటీచ్'కి బదులు 'ప్రేమా-ట్రీట్' అంటే బావుంటుంది. నా శ్రీమతి ఆ విషయంలో నాకు పూర్ణసహకారం అందించి యోగపూర్ణత్వానికి సహకరిస్తున్నదనే చెప్పాలి. మమ్మల్ని ఆదర్శంగా తీసుకోనవసరం లేదుగానీ, కనీసం ఇలాంటి సమయోగిత్వ, సహజీవనం యోగసహకారం పూర్ణసిద్ధికి అవసరమని నా యోగమిత్రులైనవారు గ్రహించగలిగితే చాలు. యోగక్రియ సజావుగా సాగిపోతుందని నా విశ్వాసం.

0 0 0

దిల్‌షుక్‌నగర్ నుండి వచ్చే వరలక్ష్మి ఒకరోజున ఒకామెను వెంటపెట్టుకు వచ్చింది. ఆమెకు చూపు సరిగా ఆనదు. దాదాపు గుడ్డిదానిలా వుంది. ఆమె తన ఆడ బిడ్డట. పేరు ఉష. గుంటూరు దిడుగు నారాయణరావుగారి శిష్యురాలు, అక్కిపెద్ది వేంకటేశ్వరశర్మ మరదలు. శర్మగారు సంస్కృత కాలేజీ ప్రిన్సిపాల్. యోగసమావేశాలు జరిపేవారు. ఈమె రవి కళాశాలలో టీచర్‌గా పనిచేసేది. చూపు తగ్గడంతో ఉద్యోగం పోయింది. కళ్ల ఆపరేషన్ కోసం వచ్చింది. వరలక్ష్మి నా వద్దకు తీసుకు వచ్చింది ఆశీస్సు కోసమని.

సాయంత్రం ప్రేయర్ పూర్తి అయ్యేసమయంలో ఉష వెక్కి వెక్కి ఏడ్వడం మొదలెట్టింది. అందరూ భయపడ్డారు. కారణం చెప్పదు. పెద్దగా ఏడుపు. మాట వినిపించుకోదు. కొంతసేపు క్రిందపడి దొర్లింది. మేమంతా బయటగదిలో కూర్చున్నాం.

ఉషకు ట్రీట్‌మెంట్ చేయండని వరలక్ష్మి వచ్చి అడిగింది.

"ఏడవనీయండి, అదే ట్రీట్‌మెంట్" ఒక గంటపైగా శోకాలుపెట్టింది.

"నేను ఇక్కడే వుండిపోతాను. భర్త వద్దు. పిల్లలు వద్దు. ఉద్యోగం వద్దు. ఏమీ వద్దు. నన్ను ఇక్కడ ఉండనివ్వండి మాస్టరుగారూ" అని బ్రతిమిలాడసాగింది హిస్టీరికల్‌గా.

"సరే.. అలాగే ఉందువుగానిలే. ఇంక ఏడుపు ఆపు" అని చెప్పాక, ఏడుపు ఆపింది. మాతోనే భోజనం చేసింది.

"ఆపరేషన్ కదా! ఇంటికి వెళ్లు ఉషా.." అన్నాను.

"నాకొక ప్రామిస్ చేస్తే వెడతాను" అన్నది.

"ఏమిటి?"

"మీరే నా కళ్లకు ట్రీట్ చేయాలి"

"అలాగే"

"ఆపరేషన్ టైంలో మీరు నా ప్రక్కనే ఉండాలి. వస్తారు కదూ?"

వస్తానని మాటిచ్చాను.

శనివారం ఆపరేషన్. సాధురాం ఆస్పత్రి మా ఆఫీసుకు దగ్గరే. వెళ్లవచ్చు.

నా మాటమీద నమ్మకంతో రాత్రి 11 గంటలకు వెళ్లిపోయింది.

ఆపరేషన్ రోజు వెళ్లి రావాలని అనుకున్నాను. ఆఫీసులో పని వత్తిడివల్ల మరచిపోయాను. వారం తర్వాత ఆమె ప్రేయర్‌కు వచ్చింది. వస్తూనే పాదాభివందనం చేసింది.

"థాంక్స్ గురువుగారూ" అన్నది. నేను గిల్టీగా ఫీలైనాను.

"సారీ ఉషా" అని జరిగింది చెప్పబోతుండగా...

'థియేటర్‌లోకి తీసుకు వెళ్లేంతవరకు మిమ్మల్నే ప్రార్థించాను గురువుగారూ. ఆపరేషన్ టైంలో మీరు, మాస్టరుగారు మాస్క్ వేసుకుని వచ్చారు. మీ యిద్దరే ఆపరేషన్ చేశారు. ఏమీ నొప్పి, బాధ అనిపించలేదు. హాయిగా, చల్లగా వుంది. రెండు కళ్లు ఒకేసారి ఆపరేట్ చేశారు. కళ్లపైన నందివర్ధనం పూలు పెట్టినంత చల్లగా అనిపించింది మాస్టారూ' అన్నది.

"థాంక్ యూ మాస్టర్" అనుకున్నాను. నేను మరచిపోయినా మాస్టరుగారు తనను విశ్వసించినవారిని విడిచిపెట్టరు. నేను చేస్తానని, చేయలేకపోయినపని, తానుచేశారు! అయినా నేను చేయడం ఏమిటి? ఆ పని మాస్టరుగారిదే వారితరపున నేను మాట యిచ్చాను. ఆయన మాట నిలబెట్టారు. అంతే కదా!

చూపు వచ్చాక ఉషకు ఉద్యోగం బెంగపట్టుకుంది. మళ్లీ ఉద్యోగంలోకి తీసుకోరన్న భయం.

"విశ్వనాథంగారితో నేను పంపానని చెప్పు. నీ ఉద్యోగం నీకు వస్తుంది" అని పంపాను.

ఆమెకు నమ్మకం లేదు. నా పేరు చెబితే ఉద్యోగం వస్తుందని.

వెళ్లి 'ధన్'తో చెప్పింది.

"శార్వరి నీకెలా తెలుసు?" అని అడిగాడుట.

"మా గురువుగారు" అని చెప్పింది.

మారుమాటాడకుండా ఉద్యోగంలో చేరమన్నాడుట.

రవి కాలేజీ డైరెక్టరు సి.వి.ఎన్. ధన్, నేను గుంటూరు ఏ.సి. కాలేజీలో క్లాస్‌మేట్స్. మంచి స్నేహితులం. ఆ విషయం నేను ఉషకు చెప్పలేదు. ధన్ ఆమెకూ చెప్పలేదు.

మరొకసారి గుంటూరు వెళ్లినప్పుడు ఉష తన కూతురికి ట్రీట్‌మెంట్ చేయించుకుంది.

0 0 0

గుంటూరులో మరొక కేసుచేయవలసి వచ్చింది. 'ప్రభ' పనిమీద గుంటూరు వెళ్లాను. డా.పరుచూరి రాజారాంగారి ఫ్రాయిడ్ జీవితచరిత్ర ప్రభ వీక్లీలో వేయాలని, కొన్ని మార్పులు, చేర్పులు చేయాలని, డా.రాజారాంతో చర్చించడానికి వెళ్లాను. నాలుగు రోజులు లాడ్జిలో మకాం. డా. పరుచూరి రాజారాం స్కిన్ స్పెషలిస్టు. పేరున్న డాక్టరు. అభ్యుదయ రచయిత. విరసంతో సంబంధం వుంది. కమ్యూనిస్టు. నన్ను గుంటూరు ఆహ్వానించింది వారే.

తెనాలి నుండి సౌజన్య అనే మిత్రుడితో కలిసి వెళ్లాను. డా. రాజారాం, లక్ష్మీనారాయణ వచ్చారు. లాడ్జిలో మకాం. టిఫిన్ ఆర్డరు చేస్తూ మాకు స్వీట్స్, అవీ చెప్పాడు. తాను స్వీట్ తినడట. ఏమంటే డయాబెటీస్ అన్నాడు. మనిషి చాలా శుష్కించిపోయి వున్నాడు. పది సంవత్సరాలుగా వరి అన్నం మానివేశాడు. పత్యపు భోజనం.

"మరేం ఫరవాలేదు. నాలుగుస్వీట్సు తెప్పిద్దాం. నాలుగు రవ్వదోసె, కాఫీ" నేనే ఆర్డరిచ్చాను.

ఆయన లబోదిబోమన్నాడు.

"డాక్టరుగారూ! నేను యోగం చేస్తానని తెలుసుకదా! ట్రీట్‌మెంట్స్ చేస్తానని తెలుసుకదా? మీకు ఈ స్వీట్‌తో ట్రీట్‌మెంట్ చేస్తున్నా. నాపై నమ్మకం పెట్టి తినండి. నేను వెళ్లేలోగా మీ డయాబెటిస్ నయం చేస్తాను" అన్నాను.

ఎంత డాక్టరైనా, అంత హామీ యిస్తే, నమ్మకపోడు కదా! మాతోపాటు స్వీట్ తిన్నాడు.

'ఇంకా తినాలనిపిస్తే స్వీట్స్ తెప్పించుకు తినండి.. ఈరోజు నుండి మీరు రైస్‌మీల్ తీసుకోండి. పత్యంలేదు. వేటికీ నిషేధం లేదు. నాన్‌వెజ్ మానివేయండి చాలు'

ఆరోజు ఇంట్లో శుభ్రంగా వరి అన్నం, కోరిన కూరలతో తిన్నాడు.

ఉదయం టెస్ట్ చేయించుకున్నాడు. సుగర్ చాలా వరకు తగ్గింది. ఆ రోజు సాయంత్రానికి నార్మల్‌కి వచ్చింది. మూడవరోజుకు పూర్తిగా తగ్గిపోయింది.

"ఇంకమీరు సుగర్‌గురించి మరచిపోండి. ఆ జబ్బుపోయింది. నాన్ వెజిటేరియన్ లోకి వెళ్లారో మళ్లీ సుగర్ వస్తుంది" అని హెచ్చరించాను.

వారి డయాబెటిస్ వ్యాధి మూడురోజుల్లో తగ్గిపోయింది.

ఆయన కమ్యూనిస్టు. "యోగాకి ఇంత పవర్ ఉంటుందా" అని ఆశ్చర్యపోయాడు.

0 0 0

హెచ్.ఎ.ఎల్‌లో పి.ఆర్.ఓ.గా పనిచేస్తున్న ప్రసాద్‌గారు స్టేట్‌బ్యాంకు ఆఫీసరు శాస్త్రిగారు మంచిస్నేహితులు. ఇద్దరు కలిసి ప్రేయర్స్‌కు వస్తుండేవారు. ప్రసాద్‌గారు మాస్టర్ ఇ.కె.గారి శిష్యుడు. ప్రేయర్‌కు వస్తామంటే "నాకేం అభ్యంతరం లేదు, కానీ ఇక్కడ నాపద్ధతులే పాటించాలి" అని చెప్పాను. సరేనన్నారు. గురుపూజలకు విశాఖపట్నం వెళ్లినా ఆదివారాల్లో నా వద్దకే వచ్చేవారు. యోగం కన్న భక్తి తత్పరత ఎక్కువ. భక్తి వుంటే చాలు యోగికావచ్చుననే భ్రమలో వున్నవాడు. ఎవరి అభిప్రాయాలు బలవంతంగా మార్చడం నాకిష్టం ఉండదు.

శాస్త్రిగారు మా ఇంటి ఎదురువీధిలో ఉంటారు. ఆయన భార్యకు గుండెనొప్పి వస్తే అర్ధరాత్రి హడావిడిగా వచ్చాడు. ప్రేయర్ చేసి కాస్త విభూతి యిచ్చాను.

"విభూది యిస్తే తగ్గుతుందా గురువుగారూ" అని ప్రశ్నించాడు.

"నాకు చేతనైంది నేను చేశాను. నేను చేసింది ట్రీట్‌మెంటల్ ప్రేయర్. మీకిచ్చింది విభూతి. ఆమెను నా వద్దకు తీసుకువస్తే ట్రీట్‌మెంట్ చేయడం మరోపద్ధతిన సాగేది. ఇంటివద్ద పేషెంటునుంచి వస్తే ట్రీట్‌మెంట్ ఇలానే చేస్తాం. అయినా 'విభూతి' అంటే వైభవం కలదని గదా. ఆ విభూతి 'టచ్' లోనే శక్తి వుంటుంది. నానుండి పేషెంట్‌లోకి వెళ్లడానికి ఇదొక మాధ్యమం. ఇదొక ఆధారం మాత్రమే. యోగావర్క్ పై లెవెల్‌లో జరుగుతుంది. అది ఎలా జరిగేది మీకు చెప్పకూడదు. పేషెంట్‌కు వెంటనే తగ్గడం వరకే మీ ప్రమేయం. మిగిలిన టెక్నికల్, మిస్టిక్ విషయాలు దయచేసి అడక్కండి' అన్నాను.

ఆమెకు పది నిమిషాలలో తగ్గింది గుండెనొప్పి.

0 0 0

ప్రసాద్‌గారికి ట్రీట్‌మెంట్ పద్ధతి నేర్చుకోవాలని వుండేది. ఒక ఏడాది పాటు దగ్గర కూర్చుని ట్రీట్‌మెంట్స్ గమనించారు. నాకో పద్ధతి లేదు. ఏ కేసు ఎలా ట్రీట్ చేస్తానో నాకే తెలీదు. ఆ క్షణంలో అందిన మాస్టర్ గారి డైరెక్షన్ ఫాలో అవుతుంటాను.

ఏడాది తర్వాత తన మనస్సులోని కోరిక బయటపెట్టాడు.

"నేర్చుకున్నారా? ఎంతవరకు వచ్చింది?" అని ప్రశ్నించాను.

"మీరు నేర్పితే నేర్చుకుంటాను" అన్నారు.

"ఇది నేర్పే విద్యకాదు. నేర్చుకునే విద్య. ఎవరికి వారుగా నేర్చుకోవలసిన విద్య. ఇది ఆత్మవిద్య" అన్నాను.

ప్రసాద్‌గారు, వైదికపద్ధతి అవలంబిస్తారు. నమకాలు, చమకాలు చదివేవారు. పురుషసూక్తం వల్లించేవారు. నా వద్ద అవన్నీ బంద్ చేయవలసి వచ్చింది.

"ప్రసాద్‌గారూ, మాస్టరుగారు ఎవరికి ఏ శక్తి అనుగ్రహిస్తారో తెలీదు. వారు ప్రసాదిస్తే తప్ప ఏదీ మనకు లభించదు. కోరితే ఏదీ ఇవ్వరు. మీ చేత మాస్టరుగారు ట్రీట్‌మెంట్స్ చేయించాలని నిర్ణయిస్తే మీకే ఆ శక్తి కలుగుతుంది. మీకా బుద్ధి పుడుతుంది. ఊరికే కూర్చుని పద్మాసనం వేసుకుని, కళ్లు గట్టిగా మూసుకున్నంత మాత్రాన వారిగేది లేదు. అయ్యేదీ లేదు" విడమరచి చెప్పాను.

ఆ క్షణంలో నిరుత్సాహపడినా, నా వద్దకు రావడం మానలేదు.

0 0 0

యోగరహస్యం తెలివిడి చేయడానికా అన్నట్లు అప్పుడొక కేసు వచ్చింది. ఒక అమ్మాయి. పెళ్లయింది. భర్తకు బ్యాంకులో ఉద్యోగం. ఆమెకు పూర్తిగా ఆకలి చచ్చిపోయింది. పిడికెడు అన్నం కూడా తినగలిగేది కాదు. అయినా మనిషి బాగానే వుంది. కాస్త నీరసం అనిపించింది అంతే. ఎన్నో మందులు వాడారు. వైద్యం చేయించారు. ఊహు... ఆకలి పుట్టలేదు.

"ప్రేయర్ చేసి ఈ అమ్మాయికి తీర్థం యిచ్చి, డైరెక్టుగా ట్రీట్ చేయవచ్చు. ఒక్కరోజులో వ..మూలు అవుతుంది. కాని అలా చేయను. మరొక రకం, ఇన్‌డైరెక్టు ట్రీట్‌మెంట్ చేస్తాను. గమనించండి. తాను సాధారణంగా తినేపాటి అన్నం, కూరలు అవీ ఏపాటివో ..జూ అయిదుగురికి అన్నదానం చేయాలి. అలా తొమ్మిది రోజులు చేయాలి. పదవనాటికి ఆమెకున్న అగ్నిమాంద్యం తగ్గిపోయి, విపరీతమైన ఆకలి పుడుతుంది. ఆ తర్వాత నార్మల్ అవుతుంది."

అలాగే జరిగింది. ప్రసాద్‌గారు ఆనందంగా వచ్చి "ఎలా పాజిబుల్ మాస్టరుగారూ... ఇట్స్ ఎ మిరకిల్" అన్నారు.

"మనకి అలవికానివన్నీ మిరకిల్స్ గానే కనిపిస్తాయి ప్రసాద్‌గారూ. అది మిరకిల్ కాదు, మిస్టరీ కాదు.అది మాస్టర్‌యోగా పవర్ - విల్‌పవర్" అన్నా

ఆ తర్వాత వారు ట్రీట్‌మెంట్ నేర్వడానికి ప్రయత్నించలేదు.

**యోగం చేసే వారంతా యోగానికి అంకితమైనట్లు నటిస్తారు.** ఇతరుల్ని నమ్మిస్తారు. యోగచైతన్యం పూర్తిగా తనలో నింపుకున్న వ్యక్తి డి.ఎన్.రావు. ఆ రోజుల్లో ఆయన చేయూత నాకు లభించి ఉండకపోతే, నా యోగాశ్రమ కార్యక్రమాలకు ఇంత ఊపు వచ్చేది కాదు. నా యోగజీవితం ఇలా మలుపు తిరిగేది కాదు. ఆయన లేని సమావేశం ఆ రోజుల్లో ఊహించలేను. ఒక్కొక్క వ్యక్తి, ఒక్కొక్క గొప్ప పనికి కారణభూతుడవుతాడు. ఒక సీతారామయ్య, ఒక దాసు, ఒక నారాయణరావు, ఒక నరసింహారావు వేర్వేరు దశల్లో యోగమార్గంలో నాతో కలిసి నాకు ప్రోత్సాహం అందించారు. బహుశా డి.ఎన్.రావు నాకు ఏ జన్మలోనో సోదరుడై వుంటాడు. యోగమిత్రు లందరూ మమ్మల్ని అపూర్వసోదరులు అనేవారు. మా కలయిక, కార్యనిర్వహణ అలా ఉండేది. వ్యక్తులు వేరైనా ఆత్మలు ఒక్కటిగా కలిసిమెలిసి తిరిగాం. నాకు స్ఫూర్తి ఆయన. ఆయనకు తోడు నేను. ఆయన కల్మషం లేని మనిషి. ఆయనది కపటం తెలియని మనస్సు.

ఆదివారం సమావేశాలకు కొత్తవెలుగు వచ్చింది. సీనియర్ సాధకులు రెగ్యులర్‌గా రాసాగారు. రాలేనివారిని రావుగారు దగ్గరుండి ఆటో ఎక్కించుకుని తెచ్చేవారు. ప్రేయర్‌కు జనం బాగా వస్తున్నారు. బయట ఊళ్ల జనం కూడా వచ్చి యోగంలో చేరసాగారు. అది మాకు ప్రోత్సాహం. ఒక ఆదివారం ఉదయాన వచ్చారు రావుగారు. ఆటో బయట నిలిపి లోపలకు వచ్చీరాగానే "శార్వరీ! బయలుదేరు, అర్జంట్" అన్నాడు. ఏదో రాసుకుంటున్నాను. రాతపని ఆపాను. ఎవరైనా వస్తే రాతపని సాగదు.

"అంత అర్జంటా?"

"మోస్ట్ అర్జంట్!! లైఫ్ అండ్ డెత్ ప్రాబ్లం"

ఆయనగారి హడావిడి అలాగే ఉంటుంది. ఊపిరి తీసుకోనివ్వడు. నేను యోగా ప్రాక్టీసుకు పరిమితం అవుదామని అనుకుంటే ఆయనే ట్రీట్‌మెంట్స్‌లోకి దింపుతారు. కేసులు చేయడం అయిష్టం కాదు గానీ, నాకంత శక్తి లేదని నా తటపటాయింపు. ఏ విషయంలోను పెద్దవారిని నొప్పించడం నాకు ఇష్టం ఉండదు. అందువల్లనే పెద్దవారికి నా పట్ల వాత్సల్యం కలుగుతుంది. వారి అభిమానాన్ని వదులుకోలేను. అది నాకు అలవాటు.

ఇంటినుండి బయలుదేరబోతుండగా ఆయన లోపలకు వెళ్లి యామినీదేవితో చెప్పారు, "అమ్మా, మీ ఆయన్ని ఒంటిగంటకు తిరిగి తీసుకు వస్తాను. పర్మిషన్

యిచ్చినట్లేనా?" అదో సరదా ఆయనకు. యామినీదేవి అంటే అమిత వాత్సల్యం. సోదరిలా చూచుకునే వారు. ఆటోలో ఎక్కి కూర్చోగానే కథనం ప్రారంభించాడు.

"ఆ అమ్మాయి ఎవరో నాకు తెలియదు శార్వరీ. మా వీధిలో ఒక లేడీ డాక్టరు వుంది కదూ! ఆమెకు ఈ అమ్మాయి కజిన్‌సిస్టర్. ట్రీట్‌మెంటుకు వచ్చింది. అయిదునెలల గర్భవతి. బ్లీడింగ్ కేసు."

"మీకేం సంబంధం?"

"మా ఇంట్లో టెంపరరీగా అద్దెకు దిగింది. లోగడ చాలాసార్లు అబార్షన్ అయింది. తనకు పిల్లలు కావాలని కోరిక. గర్భం నిలవదు. బ్లీడింగ్ ఆపడం డాక్టరువల్ల కావడం లేదు. నీవు ఆ అమ్మాయిని సేవ్ చేయాలి ఎలాగైనా."

ఇంటికి చేరాం. ఆ అమ్మాయి మంచంలో మెలికలు తిరిగిపోతూ ఎగిరెగిరి పడుతోంది. శరీరం చెమట్లు పోస్తున్నాయి. ప్రక్కన ఆమె తల్లిగారు ఏడుస్తూ నిలబడి వుంది. మేం లోపల అడుగు పెట్టగానే రావుగారు "డోంట్ వర్రీ. శార్వరి వచ్చాడు. నీకు తగ్గిపోతుంది" అని హామీ యిచ్చాడు.

ఆయన హామీలివ్వడంలో రాజకీయనాయకుల్ని మించిపోతాడు. యోగం పట్ల ఆయన విశ్వాసం అలాంటిది. ఆయన చెప్పిన కేసు చేయనంటే నాకు 'క్లాసు' తీసుకుంటాడు. శ్రీకృష్ణపరమాత్మ వలె గీతోపదేశానికి ఉపక్రమిస్తాడు. ఆ బాధ తప్పించుకోవాలంటే కేసు చేయడం ఒక్కటే మార్గం.

ఆ అమ్మాయి చేతులు జోడించి నమస్కారం చేసింది.

"మాస్టారూ! నన్ను రక్షించండి. ఐ యామ్ డయ్యింగ్" అని ఏడ్చింది. ఆ అమ్మాయికి తను తల్లిని కావాలన్న కోరిక బలంగా వుంది. అలాంటి కేసులు నాకు అలవాటు లేదు. అందునా ఆడవారికి ట్రీట్‌మెంట్ చేయడంలో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. మాస్టరుగారి 'పిలుపు' కాకపోతే రావుగారు నా వద్దకు రావడం జరిగేది కాదు. ఏవో ఆటంకాలు వచ్చేవి. నాకు కొన్ని నమ్మకాలు, కొన్ని గుర్తులు ఉన్నాయి. ఆ అమ్మాయితో 'నమస్కారం' చేయించి, కళ్లుమూసుకోమని చెప్పి, విభూది పెట్టి, నిలబడే ప్రార్థన కుపక్రమించాను. విభూది పెట్టగానే ఆమె నెమ్మది అయింది. ఏడుపు ఆగిపోయింది. అరుపులు, మూలుగులు లేవు. ప్రేయర్‌లో నా చేతివేళ్లనుండి 'ఎనర్జీ' ఆమెలోకి ప్రవహించినట్లు అనుభూతి చెందాను. నా చేయి అప్రయత్నంగా కదలి ఆమె తలను స్పృశించింది. అరగంటసేపు ట్రీట్‌మెంట్‌లో నాఎనర్జీని అందుకున్నది. ఒకగంట తర్వాత ఆమె కళ్లు విప్పి నవ్వి... 'యూ సేవ్‌డ్ మి మాస్టర్' అన్నది. అప్పటికి ప్రమాదం తప్పింది. వారం వారం రావుగారు వచ్చినప్పుడల్లా ఆమె ప్రొగ్రెస్ గురించి తృప్తిగా చెప్పేవారు.

రెండు నెలలు గడిచాయి. ఆమెకు ఎనిమిదవనెల. ఒకరాత్రి జోరున వర్షంలో రావుగారు వచ్చి, "ఆ అమ్మాయి గాంధీ ఆస్పత్రిలో వుంది. వెరీ క్రిటికల్.. డాక్టర్లు ఆశ వదిలేశారు. కమాన్ వెడదాం పద" అని తొందర చేశాడు.

"డాక్టర్లు ఆశ వదిలేస్తే మనం చేసేది ఏముంది రావుగారూ" అన్నాను "ఇంత రాత్రి వేళ మనల్ని ఎలా రానిస్తారు?"

ఆయన మొండి మనిషి. తన పంతం నెగ్గించుకుంటాడు. వర్షంలోనే వెళ్లాం. గేట్‌మన్ చేతిలో అయిదు రూపాయలు పెట్టాడు. స్పెషల్ రూంకి వెళ్లాం. ఇద్దరు డాక్టర్లు, ఇద్దరు నర్సులు ఆమె చుట్టూ వున్నారు. ఓహ్! కేకలు, పెడబొబ్బలు వేస్తోంది. రావుగారు ఏం చెప్పారో కానీ, డాక్టర్స్, నర్సులు నేను వెళ్లగానే తప్పుకున్నారు. ఆమె నా చేయి గట్టిగా పట్టుకుని ఏడవసాగింది. పాపం శ్వాస అందక ఎగిరెగిరి పడుతోంది. ఆ పరిస్థితిలోనూ నాకు నా కర్తవ్యం స్ఫురించింది. నేను వచ్చింది జాలిచూపడానికి, పరామర్శించడానికి కాదు. ఆ క్షణంలో నేను మామూలు మనిషిని కాదు. మాస్టర్ ప్రతినిధిని. దేవదూతను అనుకున్నాను. ఆమె తలపైన చేయి వుంచి ప్రార్థన చేశాను. వెంటనే తగ్గింది. ప్రశాంతంగా నిద్రపోయింది.

డాక్టర్లతో చెప్పాను. "అవసరమైతే ప్రిమెచ్యూర్ డెలివరీకి ఏర్పాటు చేయండి. డోంట్ హెజిటేట్" మర్నాడే ఆమెను నీలోఫర్ ఆస్పత్రికి బదిలీ చేసి డెలివరీ చేయించారు. తల్లి, బిడ్డ క్షేమంగా వున్నారు. రావుగారు నన్ను నీలోఫర్‌కు తీసుకువెళ్లారు. గ్లాసు గదిలో ఉంచారు అలాంటి బేబీలందరినీ. ఆమె ఆస్పత్రి నుండి డిశ్చార్జి అయేరోజుకు రావుగారు తన ఇంట్లో అలాంటి అద్దాలగది తయారుచేయించాడు. చాలా ఖర్చు పెట్టాడు! ఆమె ఈయనకి బంధువు కాదు,స్నేహం లేదు. జస్ట్. మానవతాదృష్టి. కరుణ, వాత్సల్యం. తను కన్నకూతురు ఆ పరిస్థితిలో వుంటే ఎంత శ్రద్ధగా చేసేవాడో, ఈ అమ్మాయికి అంతశ్రద్ధ గానూ సాయం చేశాడు.

బారసాల రోజున నన్ను భోజనానికి పిలిచారు. రావుగారే వచ్చి ఒంటిగంటకు తీసుకువెళ్లాడు. మేం సీతాఫల్‌మండిలో రావుగారింటి ముందు ఆటో దిగుతుండగా లోపల నుండి శోకాలు వినిపించాయి. మేడపై నుండి ఎవరో 'ఆటోను ఉంచండి.. ఆస్పత్రికి వెళ్లాలి' అని అరిచారు. మాకు మతిపోయినట్లయింది. లోపల గదిలోకి వెళ్లగానే, ఆ అమ్మాయి తల్లి వచ్చి కళ్లు తుడుచుకుంటూ చెప్పింది"బాబు పోయాడు" అని.

మేం అవాక్కయినాం. బారసాల రోజు. పొద్దుటి వరకు బాగానేవున్నాడు బాబు. రావుగారు మా ఇంటికి వచ్చి నన్ను తీసుకు వచ్చేంతలో ఏమైంది? శ్రీదేవి, రాజేశ్వర రావు ఇద్దరు డాక్టర్లు వచ్చి డిక్లేర్ చేసిపోయారు 'డెడ్' అని.

"నో..నో... ఇంపాసిబిల్. హిషుడ్ లివ్. హి షుడ్ లివ్" అని డి.ఎన్. రావుగారు వెర్రికేక పెట్టాడు.

నా చేతులు రెండుపట్టుకుని, "శార్వరీ! హి షుడ్ నాట్ డై. లెటజ్ ఫైట్ విత్ డెత్" అన్నాడు, కళ్లనీళ్లతో.

మేడపైకి వెళుతుండగా అన్నాడు, "శార్వరీ! మాస్టరుగారిచ్చిన అయిదు హామీలలో చనిపోయినవారిని బ్రతికించవచ్చు నన్న హామీ వుంది. ఇది మన యోగానికి పరీక్ష. నీవు ఎలాగైనా ఆ బాబుని బ్రతికించాలి" అని భుజం తట్టాడు. నాకు మతిపోయింది.

తల్లీబిడ్డ వున్న గదిలోకివెళ్లాం. ఆ అమ్మాయి ఏడుపు ఇంతా అంతా కాదు. 50, 60 మంది బంధువులు వచ్చి ఉన్నారు బారసాలకు. ఈ సంఘటనతో కొందరు నెమ్మదిగా జారుకుంటున్నారు. ఆ బాబు మృతదేహాన్ని మా కాళ్లవద్ద పెట్టి కుప్ప కూలిపోయింది కన్నతల్లి. రావుగారు బేబిని ఎత్తి నా చేతికిచ్చి, "మీరంతా వెళ్లిపోండి బయటకు" అందరినీ శాసించాడు.

"ఎవరి ఏడుపు, మాట మాకు వినిపించకూడదు. వెళ్లండి" అని చెప్పాను. బాబు ముత్తవను మాత్రం గదిలో ఉండమన్నాం. నేను మంచం మీద కూర్చుని, ముత్తవను బాబును ఒళ్లో ఉంచుకోమని ట్రీట్‌మెంట్ ప్రారంభించాను. పావుగంట, అరగంట... ముప్పావుగంట... గడిచింది. ప్రేయర్‌లో పైకి వెళ్లడం జరిగింది. కాని బాబులో చలనం లేదు. అప్పుడు సడెన్‌గా నా చేతికి స్పందన వచ్చింది. చేయి లేచి నెమ్మదిగా బాబుదిక్కుగా కదిలింది. నా వేలుపోయి అతని నోట్లో దూరింది. మరో అయిదు నిమిషాలు గడిచాయి. బాబు నా వేలు చీకడం తెలిసింది. పది నిమిషాలు బాబు నా వేలు చీకి చీకి కళ్లు విప్పాడు. అప్పటికి నా ట్రీట్‌మెంట్ ప్రేయర్ అయిపోయింది. నేనూ కళ్లు విప్పాను. బాబు నా వేపు చూచి నవ్వాడు.

"దటీజ్ మాస్టర్... శార్వరీ!" రావుగారి ఆనందానికి అవధి లేదు. తర్వాత గంటలో బారసాల తతంగం పూర్తి చేశారు. భోజనాలు చేశాం. నాలుగు గంటలైంది.

రావుగారింటి ప్రేయర్‌గదిలో దీపం వెలిగించి, ఆ అమ్మాయి చేత కొబ్బరి కాయ కొట్టించాం.

"శార్వరీ, నీవు వయస్సులో చిన్నవాడివి, బట్ యూ ఆర్ ఎ మాస్టర్. మాస్టరుగారు నిన్ను తనంతటి వాడిని చేశారు. నో డవుట్" అని పరవశించిపోయాడు.

ఇలాంటి కేసులు నన్ను పరీక్షించడానికే వస్తున్నాయని మొదట అనుకునేవాడిని. కానీ అవి నాయోగానికే పరీక్షలు. యోగపూర్ణత్వానికి నిదర్శనలు అనిపించేది. తర్వాత యోగంపట్ల నా విశ్వాసం పెరగడానికి, సాధకులకు యోగంపట్ల ఆసక్తి కలగడానికి అలాంటి సంఘటనలు, నిదర్శనలు అవసరం అనిపించింది. ఏదైనా, మాస్టరుగారు

నాకు నిర్దేశించిన పనులు నిర్వర్తించడమే నా కర్తవ్యం. ఇందులో నా శక్తి లేదు, నా గొప్పతనం లేదు. నేను ఎప్పుడూ శూన్యంలో మిగిలిపోతున్నాననే అనిపిస్తుంది నాకు. రావుగారు నా యోగాభివృద్ధికి కొండంత స్ఫూర్తినిచ్చేవారు. ప్రత్యక్షంగా నాచేత కేసులు ట్రీట్ చేయించి, నాలో ఆత్మవిశ్వాసం పెరగడానికి సహాయపడ్డారు.

వారి తల్లిగారికి జబ్బు చేసింది. ఆమె లోగడ బొంబాయిలో వుండేది. ఇక్కడకు వచ్చింది. ముగ్గురు కొడుకులు ఒకే ఇంట్లో, మూడు వాటాలలో వుంటారు. ఆమెకు కోడళ్లతో పడేది కాదు. ఆమెది పల్నాటి పౌరుషం. ఎం.ఎన్.గారి శిష్యురాలు ఆమె. రావుగారు పెద్దకొడుకు. ఈయనకు తల్లిగారంటే వల్లమాలిన ప్రేమ. ఆమెకోసం ఒక వంటమనిషిని పెట్టాడు. కోడళ్ల వంట ఆమె తినదు. ఆమె జబ్బుపడ్డప్పుడు డి.ఎన్.రావు నన్ను తీసుకువెళ్లాడు. నన్ను 'మాస్టర్'గా ఆమెకు పరిచయం చేశాడు. ఆమెకు బుస్సున కోపం వచ్చింది. "ఎవరు మాస్టర్లు? ప్రతివాడు మాస్టరుననే అంటాడు. ఆ మీసాలాయన ఒక పెద్దమాస్టరు. ఆ ఒంగోల్లు ఆయన ఒక మాస్టరు. వీడు ఇంకో మాస్టరా? చిన్న మాస్టరా?" అని ముగ్గురినీ వరసాగా వాయించి "ఏడీ ఈ చిన్న మాస్టరు మొహంచూడనీ' అన్నది. ఆయన నన్ను దగ్గరకు తీసుకు వెళ్లాడు. నా మొహంలోకి ఎగాదిగా చూచి, 'ఫరవాలేదు, మాస్టర్‌వే. చిన్నవాడివైనా, మాస్టరు లక్షణాలన్నీ వున్నాయి. ఆపెద్దాయనే 'నిన్ను' మాస్టర్‌గా గుర్తించి అంగీకరించాడు, పైకొస్తావ్. పో' అన్నది.

ఒకసారి ఆమెకు జబ్బు చేసింది. గాంధీ ఆస్పత్రిలో చేర్పించారు. ఒకరోజు సాయంత్రం రావుగారు వచ్చి "అమ్మను ఆస్పత్రిలో చేర్చాం. పరిస్థితి బాగా లేదు. నీవు వచ్చి ట్రీట్ చేయాలి. వెడదాం పద" అని గాంధీ ఆస్పత్రికి తీసుకువెళ్లాడు. స్పెషల్ రూం యిచ్చారు. నర్సుతో చెప్పి ఒక చాప తెప్పించాడు. ఆమె స్పృహలో ఉన్నదిగానీ, ఎగిరెగిరి పడుతోంది అస్థిమితంగా. మేం ప్రేయర్‌కు కూర్చున్నాం. పది నిమిషాలలో ఆమె లేచి కూర్చుని మాతో కలిసి ప్రేయర్ చేయసాగింది. జబ్బు తగ్గింది. బయటకు రాగానే అడిగాడు "అమ్మ ఎంతకాలం జీవిస్తుంది?" అని.

"మీ అమ్మగారు పూర్ణయోగిని రావుగారూ! ఎం.ఎన్.గారి శిష్యురాలు. సహస్రమాసజీవి. మన యోగం పూర్తిగా చేసినవారంతా 83 సంవత్సరాలు జీవిస్తున్నారు. మీ అమ్మగారు మరో మూడు సంవత్సరాల, మూడు నెలల, మూడు రోజులుంటారు" అన్నాను.

అప్పుడు ఆమె వయస్సు దాదాపు 80. ఆ విషయం ఆయన డైరీలో రాసి పెట్టుకున్నారు.

ఆ గడువు సమీపిస్తుండగా, ఆమెకు మళ్లీ జబ్బు చేసింది. మందులు తీసుకునేది కాదు. ఒకసారి నన్ను చూడాలని పిలిపించింది. వెళ్లాను. నమస్కారం చేశాను నన్ను తన కొడుకులతో సమానంగా చూచేది.

"నువ్వు నాకు నమస్కరించకూడదు నాయనా! ఆశీర్వదించు. నువ్వు మాస్టరువి. సి.వి.వి.గారు, ఎం.ఎన్.గారు, నీవూ మీ ముగ్గురూ మాస్టర్లే. నాకు మీరు త్రిమూర్తులు, యోగ త్రిమూర్తులు. "ఒక్కసారి నీ చేత్తో నా నుదురు తాకు నాయనా" అని నా చేయి తీసుకుని తన నుదుటికి ఆనించుకుంది.

"నరసింహా! ఈ జన్మలో ముగ్గురు మాస్టర్లను సేవించాను. ఇంక ఈ జన్మ చాలురా! నేను వెళ్లిపోతానురా" అన్నది.

ఆ రోజునే ఆమె కోమాలోకి వెళ్లిపోయింది. మరి తిరిగి రాలేదు.

ఒకరోజు డి.ఎన్. రావుగారు కవులూరి సీతారామయ్య, మన్నవ హనుమంతరావు, పున్నయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ, నన్ను తీసుకువెళ్లాడు. మా అయిదుగురి చేత ఆమె నోట్లో తులసి తీర్థం పోయించాడు.

"ఇదేం విడ్డూరం రావుగారూ" అంటే.

"...దిస్ ఈజ్ ది లాస్ట్ డే ఫర్ హర్" అన్నాడు గంభీరంగా.

మర్నాడు తెల్లవారుఝామునే ఆమె కన్ను మూసింది. చూడడానికి వెళ్లాను. 'నీ ప్రిడిక్షన్ కరెక్టు శార్వరీ' అన్నాడు. ఆస్పత్రిలో చెప్పిన మాట నేను మరచిపోయాను. ఆయనగారు దానిని పట్టుకున్నారు. ఎవరికీ అలాంటి ప్రిడిక్షన్స్ చెప్పకూడదని నిర్ణయించుకున్నాను ఆరోజు.

0 0 0

డి.ఎన్.రావుగారి కూతురు మీనాక్షి బొంబాయి నుండి వచ్చింది నాయనమ్మగారు పోయిన విషయం తెలిసి. ఆమెకు ఫ్లయిట్‌లోనే జ్వరం పట్టుకుంది. ఫ్లయిట్ దిగేసరికి 104 డిగ్రీల జ్వరం. ఇంటికి వచ్చినప్పటి నుండి మూసిన కన్ను తెరవ లేదు. ఇద్దరు ముగ్గురు డాక్టర్లకు చూపించారు. కర్మాంతరాలైన సాయంత్రం రావుగారు నా వద్దకు వచ్చి చెప్పారు 'మీనాక్షి' గురించి.

"నేను రాను, సారీ రావుగారూ!" అన్నాను.

"బాబ్బాబు ఈ ఒక్కసారికి రా... కర్మాంతరాలకు నిన్ను పిలవలేదని అలిగావు కదూ! కానీ నిజం చెబుతాను. కర్మకాండలు చేయడం నాకు ఇష్టం లేదు. కానీ నలుగురి కోసం చేశాం. బంధువులెవరినీ భోజనాలకు పిలవలేదు. అందరూ పెయిడ్‌గెస్ట్‌లు. ఒక్కొక్కడికి నూరు రూపాయల చొప్పున పదిమంది భోక్తల్ని పిలిచి భోజనాలు పెట్టి పంపాను. ఫార్మాలిటీ. నిన్ను పిలవకపోవడం తప్పే. కానీ నాకు మనస్కరించ లేదు. ఆ వాతావరణంలోకి నిన్ను తీసుకు వెళ్లడం యిష్టం లేదు" అన్నాడు సంజాయిషీగా.

మా ఆటో సికిందరాబాద్ జైలు ప్రాంతానికి వెళ్లేసరికి కరెంట్ పోయింది. ఇంటికి చేరేసరికి కటిక చీకటి. కాండిల్స్ వెలిగించి పెట్టారు.

"అమ్మాయి ఎక్కడ?" అడిగాను. చూపించాడు.

చెక్కబల్లపైన పడుకుని వుంది. చేయిపట్టుకుని చూచాను. కాలిపోతోంది. కళ్లు తెరిచే స్థితిలో లేదు. అలాగే నిలబడి ప్రేయర్ చేశాను ఓ అరగంటసేపు. టెంపరేచర్ తగ్గింది. నెమ్మదిగా కళ్లు విప్పింది. ఒళ్లంతా చెమట పట్టసాగింది. ఆయన తమ్ముడి కూతురు వచ్చి విసనకర్రతో విసరసాగింది.

'రావుగారూ! మీ అమ్మగారికి చేసిన కర్మకాండలో ఏదో లోపం జరిగింది. ఆమె ఆత్మ ఇక్కడే తిరుగుతోంది. ఈ అమ్మాయి అంటే ఆమెకు బాగా ఇష్టమనుకుంటాను?' అడిగాను.

"చాలా ఇష్టం. ఇష్టమే కాదు. మీనాక్షి అంటే ప్రాణం" అన్నారు రావుగారు.

"అంతగా ప్రేమిస్తే ఇలాగే అవుతుంది. మీ అమ్మగారి ఆత్మ ఈ అమ్మాయిని ఆవహించింది. ఎవరైనా భూతవైద్యుడికి చూపించండి" అన్నాను.

"భూతవైద్యుడికా! నెవర్. ఏం చేసినా నీవే చేయాలి. మాస్టర్ యోగంలో ఉన్నాం. మనం భూతవైద్యుల్ని ఆశ్రయించడం ఏమిటి తప్పుకదూ" అన్నారు రావు.

"సరే. రెండు కొబ్బరికాయలు, కర్పూరం, అగరువత్తులు తెప్పించండి. ప్రేయర్ గది సిద్ధం చేయించండి" అని చెప్పాను.

నిమిషాలలో అన్నీ వచ్చాయి. బల్లపైన పడుకున్న అమ్మాయికి దిష్టి తీసి, కర్పూరం వెలిగించి, గుమ్మం బయట కొబ్బరికాయ కొట్టించాను. లోపల గదిలో అందరం ఒక అరగంట ప్రేయర్ చేశాం. ఆ అమ్మాయిని స్నానం చేసి రమ్మన్నాను. ఆమె చేత కొబ్బరికాయ కొట్టించాను. ఇంట్లో అందరూ కొబ్బరికాయలు కొట్టారు.

అప్పుడు వచ్చింది కరెంట్. దీపాలు వెలిగాయి. ఆమెకు బాగైంది.

0 0 0

డి.ఎన్. రావుగారు తెచ్చిన కేసుల్లో మరొకటి చాలా విచిత్రమైంది ఆయనగారి మరదలి కేసు. తమ్ముడు సీతారాం పెద్ద జర్నలిస్టు, క్రానికల్‌లో స్పెషల్ రిపోర్టరు. ఆమెకు జబ్బేమిటో తెలీదు కానీ ఈయనగారు నన్ను నిజాం ఆస్పత్రికి తీసుకువెళ్లేసరికి ఆమె కోమాలోకి వెళ్లి ఇరవై రోజులైంది. మనిషిలో కదలిక లేదు. డాక్టర్లు మందులివ్వడం మానారు. ఇంజక్షన్లు ఇవ్వడం లేదు. ఏం చేయడానికి లేదు. శిలాప్రతిమలా పడుకుని ఉంటుంది. వెళ్లి చూచాను. "ఏం చేయమంటారు?" అని అడిగాను రావుగారిని.

"ఏమైనా చేయి, ఏం చేసినా నీవే చేయగలవు?"

ఈయన అన్నీ ఇలాంటి కేసులే నాకు అంటగడతాడు. కోపం వచ్చినా ఏమీ అనలేను. మిత్రుడు, నా యోగం, నా క్షేమం కోరే వ్యక్తి. నిజాం ఆర్థోపెడిక్ ఆస్పత్రిలో ఆరవ అంతస్తులో వున్నది పేషెంట్.

సరేనని పదినిమిషాలు కళ్లు మూసుకుని లేచి "రావుగారూ మీ మరదలి చెవిలో మాస్టరుగారి ప్రేయర్ పేరు చెప్పండి. సౌండ్-ఇంజక్షన్ చేయండి" అన్నాను.

చెవిదగ్గర నోరుపెట్టి మాస్టరు నామస్మరణ చేశాడు. ఇరవై ఒక్కసార్లు చెప్పాక ఆమె పెదవులు విచ్చుకున్నాయి. తనూ అలా చెప్పసాగింది అతి నెమ్మదిగా. ఆమె కళ్లు విప్పలేదు.నోరుపలికింది.మనిషిలోకి చలనం వచ్చింది.అంతలో డాక్టరు రౌండ్సుకి వస్తే చెప్పారు. "షి విల్ బి ఆల్‌రైట్.. కంటిన్యూ యువర్ ట్రీట్‌మెంట్స్" అన్నాడు డాక్టరు. మరోగంటలో కళ్లు విప్పింది. మర్నాటికి నార్మల్ అయింది. మూడవ రోజున డిశ్చార్జి చేశారు. మిరకిల్. అలాంటి మిరకిల్స్ చేస్తుంటే, కాదు, చూచినా నమ్మలేం. నేను చేసిన చాలా కేసులు అలాంటివే అవడం విశేషం. ఎలా నయమవుతున్నాయో నాకు తెలియదు. శాస్త్రీయంగా నేను నిరూపించలేను. అనవసరం కూడా. మాస్టరుగారు నాకు ప్రసాదించిన యోగశక్తి అలా వినియోగించడమే నాకు తెలిసింది.

0 0 0

నా యోగకార్యక్రమం పడుగుపేకల్లా తయారైంది. నా లక్ష్యం యోగసాధనవైపు ఆసక్తి కలవారిని రప్పించడం. మాస్టరుగారి యోగానికి మరింత వైభవం కలిగించడానికి కొంతయినా కృషిచేంయాలని. వచ్చేవారు తమ అవసరాలు తీరగానే మొహాలు తప్పిస్తుంటారు. అలవికాని రోగాలతో బాధపడుతూ మృత్యుముఖంలో వుండి యోగరక్షణ పొందిన తర్వాత అయినా యోగం చేస్తామని అనరు. ఒక గంటసేపు ధ్యానం చేసుకోడానికి తీరక లేనట్లు ప్రవర్తిస్తారు. నాటికి, నేటికి అదే వరస. అదే మనస్తత్వం జనంలో. బలవంతంగా ఎవరికీ యోగం నేర్పలేం. బహుకొద్దిమంది నిజమైన యోగాసక్తితో వస్తుంటారు. వారికి ఏ కోరికలు ఉండవు. చిన్నచిన్న అవరోధాలు ఉన్నా, వాటిని పెద్దకోరికలు అనడానికి లేదు. ట్రీట్‌మెంట్‌కోసం వచ్చేవారి విషయంలో పెద్దగా ఆశలు పెట్టుకోకూడదు. ఎప్పుడైనా వారు విరమించుకుంటారు. ఏరుదాటిన తర్వాత తెప్పతో, తెడ్డుతో అవసరం ఏమిటి? అలాంటివారితో అనుబంధం పెట్టుకోను, యోగబంధం ఆశించను. అలాంటివారు అమిత భక్తిశ్రద్ధలు ప్రదర్శిస్తారు. ఒక దేవాలయానికి వెళ్లి, తీర్థప్రసాదాలు తీసుకున్నంత తేలిక కాదు యోగం. వారి దృష్టిలో అంత తేలిక. యోగం గురించి ప్రాథమిక పరిజ్ఞానం లేని వారికి, యోగం ఎలా అబ్బుతుంది? ముసలితనంలో యోగం చేయాలిగానీ, ఇప్పుడే ఏమిటి అంటారు పైగా!

ఒకరోజు బి.ఎస్.కృష్ణారావు, వారి శ్రీమతి చిత్ర వచ్చారు. దిల్‌షుక్‌నగర్ నుండి వచ్చే వరలక్ష్మి, గుంటూరు నుండి వచ్చే ఉషకు వీరు దగ్గర బంధువులు. జవహర్‌లాల్ నెహ్రూ టెక్నికల్ యూనివర్సిటీలో పెద్ద ఉద్యోగి ఈయన. వరలక్ష్మి, ఉష నా గురించి చెప్పగా విని ఆసక్తితో వచ్చారు. వీరిని చూడగానే యోగార్హులు అనిపించింది. వరలక్ష్మి ఆరోగ్యం చక్కబడడం వల్ల, వీరికి నా యోగం గురించి ఆసక్తి కలిగిందట. అయినా బాగా చదువుకున్నవాడు. కొంత ఆధ్యాత్మిక దృక్పథం కలవాడు. మాట తీరును బట్టి, మాట వరసను బట్టి అర్థమైంది కొంతవరకు. మరొక ఆకర్షణ భార్యాభర్త లిద్దరిది ఒకేమాట -

ఒకే బాట. సాధారణంగా భర్త ఒకటి చెబితే భార్యామణి వేరొకటి చెప్పాలి. నూటికి 99 సంసారాల్లో అన్యోన్యత ఆపాటిదే. ఇద్దరూ ఒకేమాట మీద ఉండరు. ఆ విషయంలో వీరిని చూస్తే ముచ్చటేసింది. కృష్ణారావుగారు యోగాన్ని గురించి చాలా ప్రశ్నలు వేశారు. నాకు తెలిసినవి చెప్పాను. అవతలి వ్యక్తికి నచ్చటం, నచ్చకపోవడం నేను పట్టించుకోను. నా అభిప్రాయాలు నిష్కర్షగా చెప్పేస్తాను. నాకు నచ్చనివి కుండబద్దలు కొట్టినట్లే అనేస్తాను. అంత 'టెంపర్‌తనం' భరించలేనివాళ్లు, మళ్లీ నా దగ్గరకు రారు. రాకపోతేనే మంచిది. ఉత్తినే వచ్చి ప్రశ్నలతో వేధించేవారిని వదలించుకోవడం మా చెడ్డ కష్టం! ఊరికే పత్తాయిస్తారు కొందరు. వారి విజ్ఞానమంతా నా నెత్తిన రుద్దాలనుకుంటారు. ఏవైనా అడిగి సమాధానాలు రాబట్టవచ్చు. నచ్చకపోతే పోవచ్చు. చర్చలు అనవసరం. వారికి కావలసింది నా అభిప్రాయాలు, నా యోగం, సాధన. అంతకు మించిన చర్చలు అనవసరం. వారి పరిజ్ఞానానికి నన్ను బలిపెడతామంటే అంగీకరించను.

కేవలం యోగం నేర్చుకోవాలని వచ్చేవారు ఎలా ప్రవర్తించాలో అలా వుంది కృష్ణారావుగారి పద్ధతి. అయనకు సంప్రదాయం తెలుసు. సమర్పణ తెలుసు. అంకితభావంతో సాధన చేసే మనసున్నది. పైగా అనుకూలవతి అయిన ఇల్లాలు ప్రక్కన, కంటికి రెప్పలా చూచే స్వభావం గల అర్ధాంగి ఆమె. ఈ యోగం భార్యాభర్తలు కలసి చేయడం అనేది ప్రాథమిక సూత్రం. ఆ సూత్రం వీరి విషయంలో అన్వయిస్తుంది. అది గొప్ప అర్హత. యోగభాగస్వామ్యం అవసరం. ఇలా దంపతులు యోగంలో చేరడం నాకు యిష్టం. మద్రాసులో పెంచలయ్య, పార్వతమ్మ దంపతులై, యోగదంపతులైనారు. హైదరాబాదులో యోగకేంద్రం పెట్టిన తర్వాత వచ్చిన తొలిజంట చిత్రా కృష్ణారావులు.

నా రూల్సు అన్నింటినీ అంగీకరించారు. చివరకు తెలిసింది కృష్ణారావు ఒక్కరే యోగంలో చేరడానికి వచ్చినట్లు. చిత్రకు ఇంకా సందేహమే. నేను ఎలా కాదనగలను? ఆ రోజు కృష్ణారావుగారు ఒక్కరే యోగోపదేశం పొందారు. చిత్ర అన్నారు "ఇంత కాలంగా చేస్తున్న పూజలు అవీ వదలడం కష్టం కదండీ! ఆ దేవుళ్లకు కోపం వస్తుందేమో! పిల్లాపాప కలవాళ్లం. ఏ దేవుడికి ఆగ్రహం వచ్చినా కుటుంబంలో కష్టాలు వస్తాయి." అలా తన భయాలు సందేహాలు బయటపెట్టింది ఆమె. నిజమే! ధైర్యం ఉండాలి. ధైర్యం కలిగించవలసింది నేను కాదు. తన సంస్కారం, ఆలోచన. ఆ పాటి ధైర్యం వుంటేనే యోగంలోకి రావాలి. లేకుంటే లేదు. పిరికివాళ్లు ఏ పనీ చేయలేరు. యోగం అసలు చేయలేరు. "మీ ఇష్టం" అని వదలిపెట్టాను.

ఆమె అడిగారు, "నాకు కాళ్లనొప్పులు, కీళ్లనొప్పులు ఉన్నాయి. వాటిని తగ్గిస్తే యోగం చేస్తాను"

"అమ్మా ఇక్కడ కండిషన్లు పెట్టవద్దు. మీరు యోగం చేయకపోయినా ఫరవాలేదు. కానీ యోగానికి మోకాళ్లకు ముడిపెట్టకండి దయచేసి. కావాలంటే మీ

కాళ్లనొప్పులు, కీళ్లనొప్పులు తగ్గిస్తాను. తర్వాత మనసైతే యోగంలోకి రండి" అని ఆమెకు నా పద్ధతిన ట్రీట్‌మెంటు చేశాను. చిత్రంగా ఆమెకు నొప్పులు తగ్గిపోయాయి. రెండు నెలల తర్వాత ఇద్దరూ వచ్చారు.

'నేను ఈ రోజు యోగంలో చేరతాను" అన్నది చిత్ర. ఎవరైనా యోగం చేస్తామంటే సంతోషం. 'మానివేస్తాం' అంటే మరీ సంతోషం. యోగం చేయడం వల్ల వారు ఆశించిన సుఖాలు దక్కవు. ఆధ్యాత్మికంగా అభివృద్ధి కలుగుతుంది. అది ఎంతమంది ఆశిస్తారు? దేవుని ఆశ్రయించినా, మహాత్ముల్ని ఆశ్రయించినా, యజ్ఞాలు, పూజలు వ్రతాలు,ఉపవాసాలు ఏవి చేసినా ప్రాపంచిక సుఖభోగాల కోసమే కదా! స్వలాభం కోసమో, స్వప్రయోజనం కోసమో అవుతుంది. యోగఫలాన్ని నిష్కామ్యంగా పొందగలిగిన వారెందరుంటారు?

యోగంలోకి వచ్చేవారి అర్హతలు మాస్టరుగారే గమనించి, సెలెక్టు చేస్తుంటారని నా నమ్మకం. అప్పుడు, ఇప్పుడు నా నమ్మకం అదే. అందుకే మనసు పడి వచ్చేవారిని నేను కాదనను. మనసు నిలవక వెళ్లి పోయేవారిని ఆపడానికి ప్రయత్నించను. ఒక్కొక్కసారి మాస్టరుగారే కలలో కనిపించి నా అడ్రసు చెప్పి పంపిస్తుంటారు. ఆ పని తనే చేయ గలరు. కాని ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రతి సాధకునికి ఒక గురువు, భౌతికస్థాయిలో అవసరం. అందుచేత నా దగ్గరకో, నావంటి మరొక సాధకుని దగ్గరకో పంపిస్తుంటారు. నేను చేసేది ఆయన పనే. ఎక్కడ ఎవరు ఈ యోగంలో ఎవరి ద్వారా చేరినా, సుప్రీం కమాండర్ మాస్టరు ఒక్కరే. అది తెలిసిన వారు అహంకరించే అవసరం కలగదు.

యోగంలో చేరిన కొద్దినెలల్లోనే వాళ్ల అమ్మాయి పద్మజకు వివాహం కుదిరింది. అదొక శుభ సూచన. ఏదైనా మనకు అనుకూలంగా జరిగినప్పుడు నమ్మకం ఏర్పడుతుంది. ఎన్నో సంబంధాలు చూచారు లోగడ. స్వల్ప ప్రయత్నంతో ఈ సంబంధం కుదిరింది. వారు యోగంలో తొలినాళ్లలో స్థిరపడడానికి అదొక బలమైన కారణం. మధ్య మధ్య చిన్న చిన్న అవరోధాలు వచ్చినా వాటిని యోగానికి అన్వయించకుండా, పూర్వజన్మ కర్మ శేషంగా భావించి, యోగసాధన కొనసాగించడం విశేషం. పదిహేను సంవత్సరాలుగా, విడవకుండా యోగసాధన చేస్తున్న వారు కృష్ణారావు, చిత్ర. నా కేంద్రంలో వీరు సీనియర్స్‌లో ఒక జంట.

0 0 0

టి.తుకారాం మంచిర్యాలలో ఉద్యోగి. నేను మద్రాసులో యోగాసెంటర్ పెట్టినప్పుడే, 1972లోనే ఈయన యోగంలో చేరాడు. మా మధ్య పరిచయం లేదు. ఎప్పుడూ తను మద్రాసు రాలేదు. ఇక్కడకు వచ్చిన తర్వాత రెగ్యులర్ మెంబర్ అయినాడు. అతనిది కాగజ్‌నగర్. ఆ ప్రాంతం వారికి నాన్-వెజ్ అలవాటు ఎక్కువ. తాగుడు అలవాటు ఉంటుంది. ఆ రెంటినీ దూరం చేసుకుని యోగం చేస్తున్నవాడు

తుకారాం. అతని అలవాట్లు ఇంట్లో అందరూ గర్హించారు. చాలా మితభాషి. క్రమంగా వాళ్ల ఇంట్లో అందరూ యోగంలో చేరారు. మొదట వారించిన తల్లిదండ్రులు, ప్రతి ఘటించిన సోదరులు అంతా యోగసభ్యులు కావడం విచిత్రం. రెండుమార్లు మంచిర్యాల, మరో రెండుమార్లు సిర్పూర్ కాగజ్‌నగర్ వెళ్లాను వీరి ఆహ్వానంపైన. ఒక్కవ్యక్తి తన సన్మార్గ వర్తనతో చుట్టుపట్ల వారిని మానసికంగా మార్చవచ్చుననడానికి తుకారాం చక్కని ఉదాహరణ. అతనివల్ల పది పదిహేను మంది బంధువులు యోగంలో చేరారు.

అతను మంచిర్యాల మునిసిపల్ ఆఫీసులో పనిచేస్తూ ఒకసారి సమావేశం ఏర్పాటు చేశాడు. నూరుమందికిపైగా జనం వచ్చారు. అక్కడి జనాన్ని అబ్బురపరచిన ఒక కేసు గురించి చెబుతాను. ఒక పురోహితుని భార్య మాకు వంట చేయడానికి వచ్చింది. నాకు ఆ రిజర్వేషన్స్ ఎప్పుడూ లేవు. ఎవరింట్లో అయినా భోజనం చేస్తాను. వెజిటేరియన్ అయితే చాలు. శుభ్రంగా ఉండాలి. ఎవరు ఏ కులం, ఏ మతం అని చూడను. తెనాలి వెడితే నా ముస్లిం మిత్రుల ఇళ్లలోనే ఉంటాను. అక్కడే తింటాను. కుల, మతాలు అడ్డుకావడం నాకిష్టం ఉండదు. అసలు ఎవరినీ, వారి కులం ఏమిటని నేను ఇంతవరకు అడగలేదు. అది నా అలవాటు. కులం యోగానికి అనర్హత కారాదన్నది నా సిద్ధాంతం. ఒక్క కులంవారే యోగార్హులని ఎవరైనా అంటే వారినే అనర్హుల్ని చేసి బహిష్కరించాలి.

ఆ పురోహితుని భార్య భోజనం పెడుతూ ఒక చిన్న కోరిక కోరింది, వారి అమ్మాయికి ట్రీట్‌మెంట్ కావాలని. "అలాగే సాయంత్రం ప్రేయర్ టైంలో చేస్తాలే" అన్నాను. తర్వాత తుకారాం కేసు గురించి చెప్పగా నాకు గుండె పట్టేసినట్లయింది. అది నేను చేయదగిన కేసు కాదు. గైనకాలజిస్టులు, స్పెషలిస్టులు వదలివేశారుట. ఆ అమ్మాయి ఓ పిల్లతల్లి. పాలు విపరీతంగా కారుతున్నాయి. గంటకొకసారి రెండు చెంబులు పిండి పారపోస్తుంది. లేకుంటే నొప్పి భరించలేదు. బిడ్డకు అన్ని పాలు అవసరం లేదు. లేడీ డాక్టరు బిళ్లలు యిచ్చింది. ఇంజక్షన్స్ చేసింది. పాలపొంగు తగ్గడం లేదు. ఆ పిల్లతల్లి ఏడుస్తూ మొరపెట్టుకుంది. చేస్తానని మాట యిచ్చాను కానీ ఏం చేయాలో నాకు అర్థం కాలేదు. ప్రేయరులో ఆమెను కూర్చోబెట్టి, నుదుట విభూతి పెట్టి, 'టచ్' యివ్వగానే వెల్లకితలా పడిపోయింది. అరగంటసేపు అలా ఉండిపోయింది. లేచేసరికి ఆమె జబ్బు తగ్గిపోయింది. ఆ సంఘటన అయిదారుగురు డాక్టర్లు దగ్గరుండి చూచారు. ఎలా నయం చేశారని అడిగారు. ఏం చెప్పను? యోగాట్రీట్‌మెంట్ చెప్పేది కాదు, నేర్పేదీ కాదు. మంచిర్యాలలో చాలామంది మున్సిపల్ కౌన్సిలర్స్, డాక్టర్లు యోగంలో చేరారు.

0 0 0

వేదాలకు అంతం వేదాంతం అంటారు. కానీ వేదాంతానికి అంతం లేదు. అది అనంతం. ఎన్ని జన్మలవరకైనా లాగించవచ్చు. అది కదలదు. మనల్ని వదలదు. శనిపడితే వదలుతుంది కానీ వేదాంతం తలకెక్కితే ఒకపట్టాన వదలదు. శుష్కవేదాంత చర్చలతో

జీవితం గడపవచ్చు. సాధించేది ఏమీ ఉండదు. సాధన చేస్తే కదా ఏమైనా సాధించడానికి? ఏ చెత్తమాట్లాడినా వేదాంతంగా చలామణీ అవుతుంది. పనికిరాని వాగుడంతా వేదాంతంగా చలామణీ అవుతున్నది. జీవితంలో ఓడిపోయిన ప్రతివారు వేదాంతం చెబుతారు. ఓడి పోతున్న కొద్దీ, మనిషిలో నైరాశ్యం ఎక్కువైన కొద్దీ వేదాంతభావన ఎక్కువవుతుంది.

యోగం, ధ్యానం - అలాంటి శుష్కవచనాలకు లొంగవు. అందుకే వీటి జోలికి జనం రారు. ఇక్కడ మాటలతో పని ఉండదు. ఉపన్యాసాలు, నీతిబోధలు, సత్సంగాలు ఉండవు. కళ్లు మూసుకుని, గుండె లోతుల్లో చొరబడటమే. హృదయపు అగాధాల లోతులు చూడడమే. లోతు తెలియని నీళ్లలో ఈత రాకుండా దూకడం వంటిది ఇది. ఇక్కడ ఈత రానవసరం లేదు. ఇక్కడ ఈదులాడే ప్రశ్నేలేదు. పడ్డచోటునే లోతులకు వెళ్లిపోవడం ఒక్కటే పని. ముందుకు తోసేవాడు ఒకడు దొరికితే చాలు. ఏదో ఒక గురువులాంటివాడిని పట్టుకుని చెవిలో మంత్రం ఊదించుకుని ధ్యానం చేసేవారు మన దేశంలో లక్షలమంది ఉన్నారు. వారందరిలో ఏదో తపన వుంది. ఆ తపన తపస్సుగా పరిణమించదు. అదే చిక్కు. ఎంతకాలం చేసినా, ఏమీ సాధించలేరు. అంగుళం పాటి కూడా అభివృద్ధి కనిపించదు. దాంతో ధ్యానంపైన అపనమ్మకం. ఎవరికైనా సరైన గురువు లభించాలి. తను ఎన్నుకున్నది సరైన మార్గం అయివుండాలి. సాధన సక్రమంగా సాగే అవకాశం లభించాలి. ఈ మూడు సమకూరకపోయినపుడు శ్రమ నిష్ఫలమవుతుంది. చాలామంది ఒక గురువును కాదని, మరొక గురువును ఆశ్రయిస్తుంటారు. ఈ దేశంలో ఆరాటం, ఆసక్తిగల శిష్యులు చాలామంది వున్నారు. తగినంతమంది గురువులే లేరు. శిష్యులు గురువును వెతుక్కుంటారు. గురువు శిష్యుల్ని ఎంపిక చేసుకుంటాడు! బ్రహ్మభావన కలవారినే సద్గురువు తన శిష్యునిగా ఆమోదిస్తాడు. శరణాగతి ప్రధాన లక్షణం. దానికి పరీక్షలుండవు. హృదయస్పందన, ఆత్మ పులకింత అసలైన అర్హతలు.

యోగం గురించి ఆలోచన చేసేవారికి ఎంతో కొంత పరిజ్ఞానం వుంటుంది. పరిజ్ఞానం మాత్రమే జ్ఞానం కాదు. అదే జ్ఞానమని పొరపాటుపడి, తప్పులు చేస్తుంటారు చాలామంది. ఆ పరిజ్ఞానంతో వివేకంతో గురువును గుర్తించగలగాలి. ఈ కాలంలో చాలామంది మిడి మిడి జ్ఞానంతో గురువుకే పాఠాలు చెప్పేస్తున్నారు. గురువు కన్న తన అంతస్తు, స్థాయి, తెలివి గొప్పవనే వారు ఎన్నటికీ శిష్యులు కాలేరు. తనకు ఎంత తెలిసినా నోరు విప్పకూడదు. చెవులు పనిచేయాలిగానీ నోరు విప్పకూడదు. హృదయంతో స్పందనతో గ్రహించగలవారు శిష్యులు. మనదేశంలో ఉపనిషత్తులు, గీత, పురాణాలు విప్పితేచాలు ఈ శిష్యులు ఈగల్లా ముసురుతుంటారు. ఆ చెప్పేవాడిని అనవసరంగా అందలం ఎక్కించి, గురుభజన ప్రారంభిస్తారు. పాపం అతనికి ఆ శక్తి లేదని తెలియదు. గురువులు కావడం ఒక కాషాయ కల్చర్. అలాంటి రెడీమేడ్, ఇన్‌స్టాంట్ గురువులు మన దేశంలో మరీ ఎక్కువైనారు.

"నేనే కారణజన్ముడిని, నేనే అవతారపురుషుడిని, నా పేరే భగవాన్" అని ప్రచారం చేసుకుంటుంటే 'అవునుకాబోలు' అనుకునేవారే ఎక్కువ. ఈ అవతార పురుషులు, బాబాలు ఒక పథకం ప్రకారం కొందరు రాజకీయనాయకుల్ని మంచి చేసుకుంటారు. వీరి అవసరం వారికుంది. వారి అవసరం వీరికుంటుంది.

అలాంటి మగానుబాగుల్ని, వేదాంతబాధితుల్ని చాలామందిని చూచాను. నాలో వున్న తత్వజిజ్ఞాస వారిని చూచినపుడు, వారి ప్రవర్తన, పద్ధతి, నిర్వాకం గమనించినప్పుడు నీరుకారిపోయింది. చాలాకాలం శూన్యంలో ఉండిపోయాను. ప్రదోషకాలపు చిమ్మచీకటి అది. అలాంటి రోగులు నా వద్దకు రాసాగారు. ధర్మవరం వారికి గురువుగా, స్వామిగా చలామణీ అవుతున్న వ్యక్తి గుండప్ప. కళ్యాణదుర్గంలోనూ ఆ పరిసర ప్రాంతాలలోనూ అతనికి శిష్యపరమాణువులున్నారు. తన వద్ద చాలా శక్తులున్నాయని నమ్మిస్తాడు. వశీకరణ విద్య లున్నాయని చెప్పి అమాయకుల్ని తన వశం చేసుకునేవాడు. చాలా తిరిగాడు. చాలామందిని దర్శించాడు. కానీ ఈయనకు అబ్బింది ఏమీలేదు. ఇంగువకట్టిన గుడ్డముక్క. అలా ఒక గురువుగా చలామణీ అవుతున్న వ్యక్తి అహంకారం వదులుకొని మరొకచోటుకు రాలేడు. అతని పూర్వచరిత్ర ఎవరికీ తెలియదు. ఎవరి గతాన్ని త్రవ్వడం నాకు ఇష్టం ఉండదు. నేను పెట్టేవే చిన్నచిన్న నిబంధనలు. అవి అంగీకరిస్తే చాలు. ఇతరత్రా బీజాక్షర ఉపాసన చేయకూడదు. దేవతాపూజలు పనికిరావు. తమకు లోగడ తెలిసినదాన్ని వదలుకోవాలి. ఇది కొత్త యోగం, కొత్త పద్ధతి. పూర్వపు యోగపద్ధతులకు దీనికి పోలిక లేదు. సంబంధం లేదు కనుక ఎవరైనా తమకు తెలిసిన జ్ఞానాన్ని ఇక్కడకు తీసుకురాకూడదు. దేవుళ్లకు దూరంకావాలి. ఆత్మవిశ్వాసం కలిగి వుంటే చాలు. ఉదయం, సాయంత్రం ఆరుగంటలకు ప్రేయర్ చేయగలగాలి. ఈ నిమయాలు పాటిస్తే చాలు. నా యోగంలో చేరవచ్చు. అన్నింటికి తలవూపి, అప్లికేషన్ నింపి, సంతకం చేయడం కమిట్‌మెంట్. ఆ తర్వాత వక్రమార్గాన నడిస్తే, కలిగే దుష్ఫలితాలకు నేను బాధ్యుడిని కాను. యోగంలో అలాంటివారు నిలబడలేరు. అదే నిదర్శనం. తనమాటను తానే మన్నించ లేనివానికి యోగం అబ్బదు. అలాంటి కుహనా స్వాములు పరమభక్తి నటించి యోగంలో చేరినా కొద్దిరోజులకే వికటించి మానివేసిన సందర్భాలు అనేకం వున్నాయి. రూల్స్‌కు భిన్నంగా ప్రవర్తించిన వారంతా యోగానికి దూరం అవుతారు.

0 0 0

అనంతపురం హోటల్ - లాడ్జి గదిలో ఒకరాత్రి. అతను దైన్యంగా కూర్చుని ఉన్నాడు. లక్షల అప్పుల్లో మునిగి, ఆత్మహత్యకు సిద్ధమైనాడు. ప్రక్కగదిలో మరొకాయన దిగాడు. ఈయన ఆయనకు తెలిసినవాడు. ఇద్దరు కాస్సేపు కబుర్లు చెప్పుకున్నారు. అతను పొరపాటున తను ఆత్మహత్య చేసుకోదలచినట్లు చెప్పాడు. ఈయన అన్నాడు.

"నీవు ఎటుగూడి ఆత్మహత్యకు సిద్ధమైనావు కదా! రేపు నేను హైదరాబాదు వెళుతున్నాను మా గురువుగారి వద్దకు. నీవూ నాతో రా. వారిని దర్శిస్తే నీకు మేలు జరుగుతుందని నాకు అనిపిస్తోంది. అంతకాదంటే మళ్లీ వచ్చిన తర్వాతనే ఆత్మహత్య చేసుకోవచ్చు" అని నచ్చచెప్పాడు. ఇద్దరు బయలుదేరారు. బస్సు నాలుగింటికి హైదరాబాదు చేరింది. నాంపల్లి స్టేషన్ వద్ద లాడ్జీలో దిగారు. ప్రయాణం చేసివున్న మీదట ఇద్దరికీ బాగా నిద్రపట్టింది. ఏడు గంటలకు నిద్రలేచారు. ఆ మిత్రుడు ఈయనతో చెప్పాడు "మీ గురువుగారిని నేను చూచాను." గుండప్పకు ఆశ్చర్యం వేసింది.

"గురువుగారిని నీవు చూడడం ఏమిటి? ఎప్పుడు చూచావు?" అని అడిగాడు.

"ఇంతకుముందే కలలో చూచాను"

"ఎలా వుంటారు?" గుండప్ప ఆసక్తి. ఆయన వర్ణించి చెప్పాడు.

"కలలో గురువుగారి ఇల్లు కూడా చూచాను" అన్నాడట. అది మరీ ఆశ్చర్యం!

ఇద్దరూ స్నానం చేసి, బయలుదేరారు ఆటోలో.

"స్వామీ! నువ్వు కలలో గురువుగారిని చూచావు. వారి ఇల్లు చూచావు. ఆటోకి నువ్వే డైరెక్షన్ చెప్పు ఎట్లా పోవల్నో" అన్నాడు గుండప్ప

ఆ కొత్తాయన, ఆటో అతనికి సూచనలివ్వడం ప్రారంభించాడు. పబ్లిక్‌గార్డెన్స్, రవీంద్రభారతి, సెక్రటేరియట్, లోయర్ లాంక్‌బండ్ రోడ్డు, ఇందిరాపార్కు, అశోక్‌నగర్ బ్రిడ్జి తర్వాత అజాద్‌కేఫ్ టర్నింగ్ ఇలా చెబుతూ మా ఇంటి దగ్గర ఆటో ఆపించాడు.

"ఇంతవరకు కలలో చూచాను స్వామీ! కనుక గురువు గారిల్లు ఇక్కడ దగ్గరలోనే ఉంటుంది" అన్నాడు.

గుండప్పకు గుండె పట్టేసినట్లయింది. మాస్టరుగారు ఎంచక్కగా కలలో డైరెక్షన్ యిచ్చారు అనుకున్నాడు. ఆ సెంటర్‌లో ఎదురుగా వున్నదే మా ఇల్లు.

ఆ రోజు ఇద్దరు ప్రేయర్‌లో కూర్చున్నారు. అతనికి ఆత్మహత్య చేసుకోరాదని పించింది. రోజూ మాస్టర్‌గారిని తలచుకుని ధ్యానం చేసుకోమని చెప్పాను. రెండువారాలలో అతని సమస్యలు తీరాయి. అప్పుల్లోంచి బయటపడ్డాడు.

అలా మాస్టరుగారి యోగక్రియలు విచిత్రంగా వుంటాయి.

గుండప్ప పరిచయంతో నేను కొన్ని సూత్రాలు తెలుసుకున్నాను. భార్యాబిడ్డల్ని అలక్ష్యం చేసేవారు యోగంలో అభివృద్ధి సాధించలేరు. ఇష్టమైనవారిని అతిగా ప్రేమించి, తన కిష్టంలేని వారిని ద్వేషించేవారు, అనవసరంగా విమర్శించి, కించపరిచేవారూ యోగంలో ఫలితాలు పొందలేరు. పతితను పతివ్రతగా భావిస్తూ, భార్యను అనుమానించే వారు యోగార్హులు కాలేరు. శిష్యురాళ్లతో అక్రమసంబంధాలు పెట్టుకునేవారు ఆధ్యాత్మికంగా పతనం కాకతప్పదు. ఈ ఒక్కసూత్రంతో దేశంలో వున్న చాలామంది బాబాల పైన, భగవాన్లపైన అయిష్టం ఏర్పడ్డది.వారికి నేను దూరంగా ఉండాలని నిర్ణయించుకున్నాను.

కొందరు మాస్టరుగారి యోగం చేస్తున్నామని చెప్పుకుంటూ ఏవో తాంత్రిక పూజలు, క్షుద్రదేవతారాధనలు చేసి, క్షుద్రశక్తులు సంపాదించాలని వెంపరలాడేవారిని ఎరుగుదును. పైకి రాజయోగం, మాస్టరుగారి సత్యయోగం అంటారు. లోపల రహస్యంగా ఇలాంటివి చేసి ప్రాణాలకు ముప్పు తెచ్చుకున్న వారూ ఉన్నారు.

0 0 0

మొదటిసారి కళ్యాణదుర్గం వెళ్లినప్పుడు ఒక గుప్తా గారింట సాయంత్రం సమావేశం జరిగింది. గుండప్ప ఆహ్వానంపైన అక్కడకి వెళ్లాను. ఒక పెద్దాయన వచ్చాడు. మంచివాడు. భారీకాయం. అంతభారీ మనసున్నవాడు. గొప్ప వ్యాపారి. వచ్చి తన కొడుకును గురించి వాపోయాడు. అబ్బాయికి పెళ్లి చేశాడుట. భార్య అందంగా వుంటుంది. ఇతనూ అందగాడే. కానీ వ్యాపారం మీద బుద్ధి లేదు. యవ్వన విలాసాలు మరిగి డబ్బు ఖర్చుచేస్తాడు. ఒక్కడే కొడుకు. అతను బాగుపడాలని తండ్రి ఆవేదన.

"ఏడీ అబ్బాయిని తీసుకువచ్చారా" అని అడిగాను.

"అతను రాడు, మహా మొండివాడు. ఇలా అని చెబితే అసలు రాడు. తండ్రి చెపితే అసలు కదలడు" అన్నాడు గుండప్ప.

ఆయనతో అన్నాను "మీరే వెళ్లి చెప్పండి 'గురువుగారు రమ్మంటున్నారు' అని ఒక్కమాట చెప్పి వెనుతిరిగి వచ్చేయండి. సమాధానంకోసం ఎదురుచూడకండి. నేను రప్పిస్తాను" అని అతని తండ్రినే పంపాను.

నాకు విపరీతమైన నమ్మకం. అలాంటి మనుషులను విల్‌పవర్‌తో జయించవచ్చు. ఆయన వెళ్లి చెప్పి, చక్కా వచ్చాడు. అప్పటికి ప్రేయర్ టైం కాలేదు. పిచ్చాపాటీ చెప్పుకుంటున్నాం. మరో అయిదు నిమిషాలకు ప్రేయర్ అనగా ఆ అబ్బాయి వచ్చాడు. అందరూ ఆశ్చర్యపోయారు ఎలా తానుగా వచ్చాడా అని.

"ఇలా వచ్చి, నా దగ్గరగా కూర్చో" అని పిలిచాను.

వచ్చి కూర్చున్నాడు. మాట్లాడలేదు. ఆ రోజు నుండి అతనిలో మార్పు ఎరాసాగింది. చక్కగా యోగం చేశాడు. అలవాట్లు మానుకున్నాడు. గుణవంతుడైనాడు. వ్యాపారం చూసుకున్నాడు.

యోగంలోకి వచ్చేవారికి రకరకాల సమస్యలుంటాయి. ఏ సమస్య లేనివారు రావడం అరుదు. కొందరికి కుటుంబ సమస్యలు. కొందరికి ఆర్థిక సమస్యలు. కొందరికి దీర్ఘవ్యాధులు. యోగం వీటన్నింటిని పరిష్కరించదు. మనిషికి ఆత్మవిశ్వాసం కలిగిస్తుంది. సమస్యలు వాటంత అవే పరిష్కారం అవుతాయి. అలా జరగడానికి మనిషిలో ఆత్మవిశ్వాసం పెరగాలి. యోగం ఎవరినీ నిరాశ పరచదు. వెలుగు చూపిస్తుంది. మార్గం చూపిస్తుంది. మనిషిని మంచివేపు మళ్లిస్తుంది. ఇంతవరకూ నా వద్దకు వచ్చి యోగం అభ్యసించిన వారెవరూ నిరాశ పడలేదు.

నా చిన్నతనంలో మాల పిచ్చమ్మగారని ఒక యోగిని ఉండేది. పెద్దకళ్లేపల్లి అనుకుంటాను. తరుచూ రేపల్లె వస్తుండేది. అక్కడొక ఆశ్రమం. కొందరు భక్తులు ఉండేవారు. మా పెద్దమ్మ గారు పిచ్చమ్మగారి శిష్యురాలు. ఆమె కోసం వెళుతుండేది. ఆ పిచ్చమ్మగారు సంసారి. పూర్వాశ్రమంలో భర్త, పిల్లలు ఉండేవారు. అందరినీ వదలి సన్యసించింది. అంటే వైరాగ్యం చెంది, తపస్సు ప్రారంభించింది. చింతా దీక్షితులు, వేలూరి శివరామశాస్త్రి, గుడిపాటి వెంకటచలం, సౌరీస్ లాంటి పండితులు, రచయితలు ఆమె భక్తులు. ఆమె దిగంబరిగా ఉండేవారు. ఆమెకు శరీరస్పృహ ఉండేది కాదు. అనేకమంది సద్బ్రాహ్మణులు ఆమెకు భక్తులు. ఆమె పాదసేవ కోసం తపించేవారు. మా అమ్మగారు నన్ను పిచ్చమ్మగారి వద్దకు తీసుకువెళ్లారు. ఆమె ఆశీస్సులు పొందాను.

యోగంకోసం వచ్చే వారంతా నాకు సమానమే. ఎక్కువ తక్కువ లుండవు. ఎక్కువ కులం తక్కువ కులం అనేది లేదు. ఎవరైనా 'కులం' ప్రస్తావన చేస్తే ఆ రోజుతో వారిని డిస్మిస్ చేస్తాను.'పిడుగురాళ్ల' లో నేను పొందిన అవమానం నా కళ్లు తెరిచింది. ఆ రోజు నుండి యోగసాధనలో కులం ముద్రపడకుండా చూస్తున్నాను. భగవంతుని దృష్టిలో మనుషులంతా ఒక్కటే. గురువు భగవంతునితో సమానం. కరణంగారు యోగం చక్కగా చేస్తున్నా ఆయన మా ఇంట కాఫీ తాగేవాడు కాదు. మంచినీళ్ల పుచ్చుకునే వాడు కాదు. తాను సద్బ్రాహ్మణుడనని నమ్మకం. హోటల్‌లో భోజనం చేసేవాడు. అక్కడే రూం తీసుకుని వుంటూ ప్రేయర్‌కు వచ్చేవాడు. ఒకసారి ఆ కరణంగారు తన తల్లిగారిని తీసుకుని వచ్చాడు. ఆమె అంతకన్నా నిష్ఠాపరురాలు. మంచినీరు ముట్టలేదు. వారి మడి ఆచారాలను నేను మన్నించాలిట! ఎలా మన్నించను?!

తాను అధికుడినని, తన కన్న తన గురువు తక్కువవాడని అనుకునే వాడికి యోగం ఎలా అబ్బుతుంది? అతని అభివృద్ధిని గురువు కాంక్షించాలి! అతనికి మేలు చేయాలి! అందుకు గురువు ఆశీస్సులు కావాలి! ఏమని ఆశీర్వదించాలి? ఈ గొప్పకులం వాడు, నన్ను మరింత అవమానించే శక్తిని అనుగ్రహించమని మాస్టరుగారికి రికమెండ్ చేయాలా లేక నేనే అతనికి ఆ మహాశక్తిని ధారపోయాలా? ఈశ్వరుడు భస్మాసురునికి వరాలివ్వడం తప్పని తెలుసు. ఒక వ్యక్తిని గురువుగా స్వీకరించినప్పుడు అతనికి శరణాగతుడు కావలసిందే. అహం, ఆభిజాత్యం ఏమాత్రం పనికిరావు. గురువు పట్ల సంపూర్ణ విశ్వాసం, ప్రేమ, ఆరాధన లేనివారు యోగార్హులు కారు. వంకర మాటలతో అవమానించేవారు ఏమాత్రం లబ్ధిపొందలేరు. ఇంతకాలం ఈ దేశంలో ఆధ్యాత్మిక రంగంలోనూ కులానికే పెద్దపీట. ఆ పీటను విరిచి పారవేయాలి! కులాధిక్యత ప్రదర్శించే వారికి నా ఇంటిలో, నా యోగంలో స్థానం లేదు.

ఒక ఏడాది తర్వాత ఆమెకు చచ్చేంత జబ్బు చేసింది. రాజమండ్రి ఆస్పత్రిలో చేర్చారు. ఆశలు వదులుకున్న సమయంలో ఆంజనేయులుగారు నాకు టెలిగ్రాం

యిచ్చారు. చాలా పెద్ద టెలిగ్రాం. ట్రీట్‌మెంట్ చేయక తప్పలేదు. ఆమె బ్రతికింది. తర్వాత నా వద్దకు వచ్చింది. ఈసారి మనస్ఫూర్తిగా పాదాభివందనం చేసింది. యోగంలో ప్రవేశం పొందింది. ఇనీసియేషన్ కోరింది.

"నా ట్రీట్‌మెంట్‌తో మీరు మైలపడ్డారు" అన్నాను.

తన తప్పు తెలియచెప్పడానికే అలా అన్నాను ఆమెను కించపరచాలని కాదు. ఆ రోజునుండి అంజనేయులుగారు నాతోనే భోజనం చేసేవారు. తర్వాత ఆయన భార్యను తీసుకువచ్చి ఉపదేశం యిప్పించారు. అలా ప్రాణంమీదికి వస్తే తప్ప మన వాళ్ళు చాదస్తాలు వదలుకోరు. అప్పుడు మడి, ఆచారం అడ్డురావు. కారులో వచ్చే కోటీశ్వరుడి కన్నా కాలినడకన వచ్చే పేదలే నాకిష్టం. వారు స్వచ్ఛంగా, అమాయకంగా, అహంకారం లేకుండా మసలుకోగలుగుతారు.

ఒక విశ్వవిద్యాలయ వైస్ చాన్స్‌లర్ కన్న అక్షరం ముక్కరానివాడు యోగార్హు డవుతాడు. తండ్రికి అర్హత ఉండకపోవచ్చు, కుమారుడు అభివృద్ధి సాధించవచ్చు. భార్యాభర్తలలో భర్తకే ముందు అభివృద్ధి కలగాలని లేదు. చాలామందిలో గమనిస్తున్నాను. భార్యలు యోగంలో అభివృద్ధి సాధిస్తారు. భర్తలు ఆ చాయలకు రారు. కొన్నిచోట్ల భర్తలు అద్భుతంగా యోగం చేస్తారు. వారి భార్యలు, వ్రతాలు, పూజలు చేస్తుంటారు. ఎవరిష్టం వారిది! వారి పద్ధతి, నమ్మకం కాదనే హక్కు రెండవ వ్యక్తికి లేదు. మన విజ్ఞానంతో, ప్రాపంచికమైన కొలబద్దలతో ఎవరి అర్హతలు నిర్ణయించకూడదు. అనర్హులని వేలెత్తి చూపకూడదు.

యోగసాధనలో నేను గమనించిన విషయాలు :

వీలైనంతవరకు మానవ విలువల్ని కాపాడుకుంటూ, వాటిని పెంచుకుంటూ ఉండడం. మంచిని పెంచుకోవడం. వ్యసనాలకు దూరంగా ఉండటం. మనలో మనం గుర్తించిన తప్పుల్ని మనమే సరిచేసుకోవడం. ఇతరులు మనలోని లోపాలు ఎత్తిచూపినపుడు ఆగ్రహించకుండా, వాటిని చక్కదిద్దుకోగల ఓర్పు, నేర్పు సంపాదించడం. మన తప్పుల్ని ఒక్క గురువే గుర్తు చేయనవసరం లేదు. ఆయనే చక్కదిద్దనవసరం లేదు. మన తప్పుల్ని, లోపాల్ని మనమే చక్కదిద్దుకోగలగాలి. ఎవరి ఆత్మ వారిని హెచ్చరిస్తూనే వుంటుంది. ఆత్మవంచన చేసుకోకుండా ఉంటే చాలు. ఇతరులకు ద్రోహం చేయడం జరగదు. అప్పుడు ఆత్మకు ఔన్నత్యం సిద్ధిస్తుంది.

0 0 0

ధర్మవరం నుండి డి.ఎన్. గోవిందరాజులు వచ్చారు. ఆయన మాధ్వుడు. వారి కుటుంబంలోని వారంతా శంఖుచక్రాలు వేయించుకున్నారుట. గౌడీయ మఠానికి చెందినవారు. ఆయనకు యోగం చేయాలని వుంది. మాస్టరు జన్మదినోత్సవంనాడు వచ్చాడు. తనకు ఏదైనా నిదర్శనం చూపిస్తే యోగంలో చేరతానన్నాడు. ఆ రోజు చలి

విపరీతంగా వుంది. వర్షం వస్తోంది. నేను శాలువా కప్పుకుని కూర్చున్నాను. ఆయన నాకు ఎదురుగా కూర్చున్నాడు. సాధకులు చాలామంది ఉన్నారు. నా కళ్లలోకి చూస్తూ కూర్చోమన్నాను. ఆయన కళ్ల వెంట నీరు తిరిగింది. జవజవ వణికిపోసాగాడు. స్పృహ తప్పిపడిపోయాడు. ఒక గంట తర్వాత తెలివిలోకి వచ్చి, కాళ్లమీద పడిపోయాడు. ఆ రోజునే యోగంలో ఉపదేశం తీసుకున్నాడు. తర్వాత ధర్మవరంలో ఒక యాభైమంది వరకు సభ్యులైనారు.

0 0 0

హైదరాబాదులో పోస్టు మాస్టరు ఉద్యోగిని ఆశాలత. ముప్ఫయి అయిదేళ్లుంటాయి. అవివాహిత. ఆమెకు తలపోటు పది సంవత్సరాలుగా. కనీసం తల స్నానం చేయ వీలులేదు. తలపైన నీళ్లు పడితే పోటు పెడుతుంది. రెండురోజులు వరసగా ప్రేయర్‌కు వచ్చింది. ఆమెకు యోగంపైన నమ్మకం కలిగింది. ఎవరు వచ్చినా నా అలవాటు అది. కొన్నిరోజులు ప్రేయర్‌కు రమ్మని చెబుతాను. ఊరికే కళ్లు మూసుకుని కూర్చోవడమే వారి పని. నాలుగురోజుల్లో వారికి యిష్టం కలగాలి. ఇష్టమైతేనే యోగంలో చేర్చుకుంటాను. ట్రీట్‌మెంటు మనస్ఫూర్తిగా అర్థిస్తేనే చేయడం. వల్లమాలిన కరుణ పొంగిపోయి చికిత్స చేయను. నాకు దయ కలిగినా అవతలివారికి గురి కుదరాలి. లేకుంటే ట్రీట్‌మెంట్ ఫలితం ఉండదు.

ఆమెను మూడవరోజు తలస్నానం చేసి రమ్మన్నాను. తలస్నానం చేసినా తలనొప్పి రాలేదు. తగ్గిపోయింది. ఆ తర్వాత ఆమెకు ఎన్నడూ తలపోటు లాంటిది రాలేదు. అలా విశ్వాసం వున్నవారికి మాస్టర్‌గారి అనుగ్రహం తేలికగా కలుగుతుంది.

0 0 0

ఒంగోలులో మాస్టర్ ఎం.ఎన్.గారి తర్వాత అప్రయత్నంగా ఒక సమావేశం జరిగింది. మా కజిన్ నాగేశ్వరరావు అక్కడ తహసీల్‌దారు. వారింటికి పనిమీద వెళ్లవలసి వచ్చింది. ఒంగోలు దగ్గర కొప్పోలులో బెజవాడ వీరయ్య, నందూరి పార్థసారథి ఇద్దరూ నా యోగసభ్యులు. వారు నన్ను కలవడానికి వస్తూ ఇద్దరు సుబ్బారెడ్లను వెంట తెచ్చారు. మరొక సాధకుడు సి.హెచ్.వెంకటేశ్వర్లు. వీరంతా సాయంత్రం ప్రార్థనకు వచ్చారు. అలా రోజూ జనం రావడంతో ట్రీట్‌మెంట్స్ చేయడంతో వారం రోజులు అక్కడ ఉండవలసి వచ్చింది. ఒక సందర్భంలో శ్రీ ఎక్కిరాల భరద్వాజ ఇంటికి వెళ్లి పరామర్శించి వచ్చాను. భరద్వాజ సహృదయుడు, షిర్డీసాయి భక్తుడు. అన్నగార్లు ఎక్కిరాల కృష్ణమాచార్యకు, వేదవ్యాసకు ఈయన భిన్నం. చాలా నిరాడంబర జీవి. తన భార్య అస్వస్థురాలైన కారణంగా లెక్చరర్ ఉద్యోగం వదలి సాయిసేవ చేస్తున్నాడు. ఒంగోలులో ధారా రామనాథశాస్త్రిగారు మంచి మిత్రులు. కాలేజీ లెక్చరరు.

సోదరుడు వాసిలి నాగేశ్వరరావుగారింట్లో ప్రార్థనకు రోజూ జనం పెరగసాగారు. మాస్టర్ ఎం.ఎన్. గారిని స్మరించారు అంతా. నేను ఎం.ఎన్.గారి ఇల్లు చూచి వచ్చాను. ఏడవరోజు సమావేశానికి నూరుమంది వచ్చారు. ఎక్కడ యోగసమావేశం జరిగినా నూరుమందికి తక్కువ కాకుండా జనం వస్తుంటారు. మంచిర్యాల, బళ్లారి, ధర్మవరం, కళ్యాణదుర్గం... ఇలా ఎక్కడ సమావేశం జరిగినా నూరుమంది వచ్చేవారు.

మాస్టర్ ఎం.ఎన్.గారి హయాంలో ఒంగోలు గొప్ప యోగకేంద్రం. 35 సంవత్సరాల తర్వాత ఒక యోగసమావేశం జరగడం థ్రిల్లింగ్ అనుభవం. మా కజిన్ ఇల్లు ఒక యోగకేంద్రం అయింది. అతనికి ఈ యోగం పట్ల ఆసక్తి కలిగింది. కానీ ఆయన సతీమణి షిర్డీసాయి భక్తురాలు. ఒక ఇంట్లో రెండు రకాల యోగం హర్షనీయం కాదు.

చీజర్ల వెంకటేశ్వర్లు మాస్టర్ ఇ.కె. గారి శిష్యుడు. తన మేనమామ ఒకతన్ని ట్రీట్‌మెంట్‌కు తీసుకువచ్చాడు. అతను వ్యాపారంలో అయిదారు లక్షలు నష్టపోయాడు. స్త్రీ వ్యసనం బాగావున్నది. భార్యాబిడ్డల్ని అలక్ష్యం చేశాడు. అతనికి ట్రీట్‌మెంట్ ప్రారంభించిన నిమిషంసేపట్లో నాకు పూనకం వచ్చినట్లయింది. అతనిని పట్టుకుని బాదేశాను. అతను స్పృహ తప్పి పడిపోయాడు. ఆ వీరబాదుడుకు అంతా భయపడి పోయారు. నేను స్పృహలో వున్నా కంట్రోల్ లేదు. అతను మొదటి దెబ్బకే నేలకరిచాడు. దెబ్బలకు చచ్చిపోయినాడనే అనుకున్నారుట. ఓ పావుగంటకు నేను సమాధిలోకి వెళ్లిపోయాను. గంట తర్వాత లేచేసరికి అతనింకా స్పృహ తప్పి పడివున్నాడు. అందరూ ప్రాణాలు ఉగ్గబట్టుకుని కూర్చున్నారు. నాపైన నమ్మకం వుంది అందరికి. నాకు ఎనర్జీ అంతా ఖర్చయి, నీరసపడిపోయాను. కాస్త టిఫిన్ తిని, కాఫీ తాగిన తర్వాత ఓపిక కలిగింది. అప్పుడు అతనికి విభూది పెట్టి లేపాను. నవ్వుతూ, కళ్లు విప్పాడు. చిత్రం పావుగంటసేపు చావుదెబ్బలు తిన్నా అతనికేం తెలియదన్నాడు. నా చేయి తగలగానే అతనికి మైకం కమ్మిందట. తర్వాత ఏం జరిగిందీ తెలియలేదు. ఆ దెబ్బతో అతని రోగం పూర్తిగా తగ్గింది. నెలరోజుల్లో అప్పులన్నీ తీరిపోయి మంచిగా వ్యాపారం చేసుకోసాగాడు.

యోగంలోకి వచ్చేవారికి సాధారణంగా ప్రవేశద్వారం రోగం, అలవికాని జబ్బుచేసి, వైద్యం వల్ల కుదరకపోతే, ఇలా గురువుల్ని, స్వాముల్ని అన్వేషిస్తారు, ఆశ్రయిస్తారు. అప్పుడు మహాత్ములపైన, దివ్యశక్తులపైన విశ్వాసం కలుగుతుంది. లేదా ఏమైనా జటిలసమస్యలు తలెత్తితే నా వద్దకు వస్తారు. మనిషిలో నిగూఢంగా వున్న శక్తిని గుర్తించి, పైకి తెచ్చుకుని వినిమయం చేసుకోడానికే యోగం, సాధన. మన యోగసాధన మనకు మేలు చేస్తుంది. ఇతరులకు వీలైనంత మేలు సమకూర్చేదిగా వుంటుంది... ఉండాలి.

# 1986

## ఐక్యతారాగం

**యోగకార్యక్రమాలు ఉత్సాహాన్ని కలిగిస్తాయి.**

స్వీయానుభవాలు యోగంపట్ల ఆసక్తిని ఇనుమడింప చేస్తాయి. కానీ వచ్చేవారంతా పరమభక్తులని, యోగ్యులని అనుకోరాదు. వారిలో స్వార్థపరులు ఉంటారు. వారిని వెంటనే గుర్తించలేం. వారి నిజాయితీని శంకించలేం. కాలం అలాంటి లోభుల్ని, స్వార్థపరుల్ని, అహంభావుల్ని, గురుద్రోహుల్ని దూరం చేస్తుంది. అలాంటి వారి నిష్క్రమణ మన మంచికే అనుకోవడం ఉత్తమం. అలాంటివారుపోతే ఉత్తమ సాధకులుగా మిగిలిన వారికి అపకారం జరగదు.

ఈ సంవత్సరంలో 76 మంది సభ్యులుగా నమోదైనారు. ధర్మవరం, కళ్యాణదుర్గం, బళ్లారి పట్టణాలకు సాధకుల ఆహ్వానం మేరకు వెళ్లడం అక్కడ చిన్నచిన్న యోగసమావేశాలు జరపడం నాలో ఉత్సాహాన్ని నింపింది. కానీ నిర్వాహకుల స్వార్థం బాధ కలిగించింది. కళ్యాణదుర్గం నన్ను ఆహ్వానించిన వ్యక్తి గుండప్ప. అతనికి ప్రాపకం ఉంది. మిట్టే సిద్ధన్న అతనికి సహాయంగా నిలబడ్డాడు. గుండప్ప గారింటనే ప్రార్థన సమావేశాలు జరిగాయి. నేను వెళ్లిన రోజున ఒక విచిత్ర సంఘటన జరిగింది. మధ్యాహ్నం పన్నెండు గంటలకు ప్రేయర్ మేడపైన చిన్న గదిలో. పదిపన్నెండు మంది కూర్చోవీలుంది. అప్పటికి ఎవరూ నాకు తెలియదు ఒక్క గుండప్ప, సిద్ధప్ప, సిద్ధన్న మినహా. గదిలో మాస్టరుగారి ఫోటో పెట్టి అగరువత్తులు వెలిగించారు. ముందు వరుసల్లో స్థానికులు కూర్చున్నారు. నేను వెనక గోడవార కూర్చున్నాను. ఒకాయనకోసం గుండప్ప ఎదురు చూస్తున్నాడు. ఆయన చాలా గొప్ప వ్యక్తి అట. పుట్టపర్తి బాబాగారి అంతరంగికుడట. కోటీశ్వరుడు. ముందు బాబాగారి కారు వెడుతుంటే, వెనక ఈయనగారి కారు పోతుంది. ఆయన నన్ను చూడడానికి వస్తానని చెప్పాడుట. ఒకరికోసం ప్రేయర్ ఆపడం జరగని పని.

12 గంటలైంది. నేను ప్రార్థన ప్రారంభించాను. అందరూ కళ్లు మూసుకుని కూర్చున్న తర్వాత ఆయన వచ్చి నా ప్రక్కన కూర్చున్నాడు. ఎవరూ కదలలేదు. ఆయనను ఆహ్వానించలేదు. నా ప్రక్కన కూర్చున్న వ్యక్తికి చెమటలు పట్టసాగాయి. 'సాయిరాం' అనుకోవాలని ప్రయత్నించాడు. నోట మాటరాలేదు. 'సాయిరాం' మాట జ్ఞాపకం రాలేదు. సాయిరాం బదులు సి.వి.వి. అని నోటివెంట శబ్దం వెలువడింది. వెంటనే కళ్లు మూతలు పడ్డాయి. అరగంటసేపు ప్రేయర్ సాగింది.

"గుండప్ప స్వామీ! మీ గురువుగారు రాలేదా?" అని ప్రశ్నించాడు. గుండప్ప నవ్వుతూ నన్ను చూపాడు. ఆయన వెంటనే పాదాభివందనం చేసి "అపచారం అయి పోయింది స్వామీ... మిమ్మల్ని గురువుగా గుర్తించలేకపోయాను"

"ఫరవాలేదు. నేను మీకు గురువును కాదు. మీరు నన్ను గుర్తించకపోతే నష్టం లేదు" అన్నాను.

"ఏ ఆడంబరం లేకపోతే గురువుల్ని అయినా గుర్తించడం కష్టం కదా!"

"ఆడంబరాల్ని గుర్తించే వారి విషయం అది. ఇక్కడ నన్ను గుర్తించవలసిన వారు ఆత్మసంస్కారం కలవారు"

ఆయన తర్వాత క్షమాపణలు చెప్పి, నేను బళ్లారి అదీ తిరగడానికి, హైదరాబాదు చేరేవరకు, తన కారును డ్రయివరును ఉపయోగించుకోమని కోరాడు.

"నాకు ఆడంబరాలు లేవని గుర్తించారు. మళ్లీ కారు యిస్తున్నారు. వద్దులెండి. నేను బస్సులో వెడతాను"

అని తిరస్కరించాను సున్నితంగా. తాను హైదరాబాదు వచ్చి యోగంలో ఉపదేశం పొందుతానని మాట యిచ్చాడు. అలాంటివారు రారని, రాలేరని నాకు తెలుసు. అయినా బాబాగారికి అత్యంత ఆత్మీయుడుగా వున్న వ్యక్తి, వారిని వదలి నా వద్దకు రావడం అనవసరం. అలా ఒక గురువును వదలి రావడాన్ని నేను అంగీకరించను. అలా రావడం ఆ గురువును అవమానించడమే అవుతుంది. ఎవరికైనా అది మంచిది కాదు.

అప్పుడు కళ్యాణదుర్గంలో చాలామంది యోగంలో చేరారు. సోమనాధగుప్త, వీరేశప్ప, నిర్మల, ఎం.కె. అశ్వత్థనారాయణ, జె.ఎస్. ఆదినారాయణ, నారాయణగుప్త. సిద్ధప్ప, మిట్టే సిద్ధన్న, నాగరాజు...వీరంతా యోగంలో చేరగానే వారి భార్యలు చేరారు. మొత్తంమీద పదిమంది దంపతులు యోగసభ్యులైనారు. చాలా భక్తిశ్రద్ధలతో యోగసాధన చేస్తున్నవారే వీరంతా... చుట్టుపట్ల గ్రామాల నుండి చాలామంది వచ్చారు. గుండప్ప శిష్యులు ధర్మవరం, అనంతపురం, పెనుగొండల నుండి వచ్చారు. అప్పటికీ ఇప్పటికీ కళ్యాణదుర్గంలో పాతికమంది వరకు మంచిసాధకులు ఉన్నారు.

0 0 0

ధర్మవరం వెళ్లాను. పుట్టపర్తికి వెళ్లే త్రోవలో వుంది. అప్పటికే తోట నరసింహయ్య, డి.ఎన్. గోవిందరాజులు, సరోజమ్మ, కుల్లాయప్ప అక్కడ మా యోగసభ్యులు వున్నారు. అంతా వ్యాపారస్తులు. నరసింహయ్యగారింట సమావేశానికి చాలామంది వచ్చారు. అక్కడ ఒక విచిత్రం జరిగింది. అనంతపురం మామూలుగానే వర్షాభావం గల జిల్లా.

నాలుగుసంవత్సరాలుగా వర్షాలు పడలేదు. రాయలసీమలో వర్షాలు కురవడమే అంతమాత్రం. నాలుగు సంవత్సరాలుగా చుక్క చినుకుపడలేదంటే పొలాలు బీటలు వేశాయి. చెట్లకు ఒక పచ్చని ఆకు కనిపించలేదు. పైగా ఎండతాపం. వడగాడ్పులు. మైళ్లకొలదీ, చూపు ఆనినంత మేర ఎడారిలా ఉంది. నరసింహయ్యగారింటికి వచ్చినవారంతా అర్థించారు "వర్షం కురిపించండి గురువుగారూ!" అని.

"మీరంతా కలిసి మాస్టరుగారిని వేడుకోండి" అన్నాను.

పైకి అలా అన్నానే గానీ, వర్షం పడ్డాలని సంకల్పించి, మాస్టరుగారిని వేడుకున్నాను. ప్రేయర్ చేసుకున్నాం. కొన్ని కేసులకు ట్రీట్‌మెంట్ చేయవలసి వచ్చింది. ఏ ఊరు వెళ్లినా గురువుగారు ట్రీట్‌మెంట్ చేస్తారనే ప్రచారం సాగుతోంది. కాదనే కర్కశహృదయం నాకు లేదు. ఒకతను వచ్చాడు. ముగ్గురు, నలుగురు మోసుకు వచ్చారతనిని. పక్షవాతం. నడవలేడు. కాలు చేయి కదలదు. ఎత్తుకుని మేడపైకి తెచ్చారు. ఆరు సంవత్సరాలైంది పక్షవాతంతో మంచంపట్టి. మాస్టర్ గారి యోగం చేస్తే ఎలాంటి జబ్బులైనా నయం అవుతాయని ప్రచారం జరిగిపోయింది. గురువుగారు వస్తున్నారంటే అదో ఆకర్షణ. ఎలా వుంటాడో చూడాలని వచ్చేవారు, నమస్కారం చేసి ఆశీస్సులు పొందితే వ్యాపారంలో బాగా లాభాలు దండుకోవచ్చునని వచ్చేవారు కొందరు. గురువుల్ని, మాస్టరుగారి అనుగ్రహాన్ని, దేవుళ్లను సైతం వ్యాపారాభివృద్ధికి, స్వప్రయోజనాలకు వినియోగించుకోవాలనే వ్యాపారబుద్ధి చాలామందికి ఉంటుంది. యోగంపట్ల అభిరుచి, ఆసక్తి కలగాలంటే ఏవైనా మిరకిల్స్ చూపించాలి. సిద్ధులు గట్రా ఉన్నవారైతే వాటిని ప్రదర్శించి జనాన్ని ఆకర్షిస్తారు. వశపరచుకుంటారు. ఈ యోగంలో ఏం సిద్ధులు వస్తాయో నాకు తెలియదు. అలా కోరవచ్చునో లేదో కూడా తెలియదు నాకు.

అతనికి ట్రీట్‌మెంట్ ప్రారంభించాను. ఒక గంటసేపు ప్రేయర్ జరిగింది. ప్రేయర్‌లోనే నాలోంచి ఏదో శక్తి అతని లోకి ప్రవహించినట్లు తెలిసింది. నా చేతివేళ్లు అతని శరీర భాగాలను స్పృశించాయి చాలాసేపు. అంతసేపు అతను స్పృహలో లేడు. ఏదో యాస్ట్రల్ చికిత్స జరిగింది. నాకూ అలాంటివి అనుభవం లేదు. ఏ కేసుకు ఆ కేసు కొత్తగానే ఉంటుంది. ప్రేయర్ అయిన తర్వాత అతనిని లేవమన్నాను. ప్రక్కవారు సహాయం చేయబోగా వారించాను తనే పదినిమిషాలు కష్టపడి, ముక్కి, మూలిగి ప్రయత్నించాడు. నా చేయి ఆసరా యిచ్చాను. లేచి నిలబడ్డాడు. గోడపట్టుకుని నడవమంటే నడిచాడు. పదిహేను నిమిషాల. తర్వాత తనే అటు ఇటు నడిచి, గోడను వదలి, స్వయంగా నడిచాడు. వెళ్లిపొయ్యాడు. రాత్రి భోజనంచేసిన తర్వాత నరసింహయ్యను పంపాను అతనికి ఎలా వుందో చూచిరమ్మని. అతను ఇంటికి వెళ్లి, భోజనం చేసి,

ఆనందంగా సినిమాకు వెళ్లాడని చెప్పారు. ఆరు సంవత్సరాలుగా సినిమా చూడలేదు పాపం!

కొద్దిమంది యోగసాధకులు మరలా వర్షం ప్రస్తావన తెచ్చారు. "నేనేం దేవుడినా. వర్షం కురిపించడానికి?" అన్నాను. అయినా వారందరినీ కూర్చోబెట్టి ఒక గంటసేపు ఒక కోర్సు చేయించాను. తెల్లవారేసరికి వర్షం కుండపోతగా కురిసి, చెరువులు నిండి, వాగులు ప్రవహించాయి. అటు ధర్మవరం నుండి ఇటు పుట్టపర్తివరకు, అటు అనంతపురం వరకు మంచి వర్షం పడ్డది ఆ రాత్రి.

0 0 0

వాన కురవడంలో మాస్టరుగారి అనుగ్రహం కలిగినట్లే ప్రమాద సమయంలో నా అభ్యర్థన మన్నించి నిమిషాలలో తుపాను ఆపిన ఉదంతం ఒకటి ఉంది. మాస్టరుగారు మన ప్రార్థనను ఎంత త్వరగా ఆమోదిస్తారో! ఆశ్చర్యం.

ఒకరోజు రాత్రి భయంకరంగా వర్షం కురవసాగింది. ఇంట్లో నేను, మా అమ్మాయి పద్మప్రియ ఇద్దరమే ఉన్నాం. యామిని, మగపిల్లలు మద్రాసు వెళ్లినట్లు గుర్తు. వసంతకుమార్ కూతురు ప్రత్యూషను చూడడానికి వెళ్లారు. కుండపోతగా కురిసే వర్షానికి రోడ్లు జలమయం అయి, నీరు రోడ్లపై వేగంగా ప్రవహిస్తున్నది. లోతట్టు ప్రాంతాలు నీటమునిగిపోయాయి. గుడిసెలు కొట్టుకుపోయాయి. చాలామంది వచ్చి మా ఇంట్లో తలదాచుకున్నారు. ఇంతలో టాంక్‌బండ్‌కు గండిపడ్డదని, హుస్సేన్‌సాగర్ జలాలు నగరంమీద పడ్డాయని అరుపులు వినిపించాయి. బయటకు వెళ్లడానికి లేదు. ఇల్లు ఖాళీ చేస్తున్నారని అరుపులు. డాబాపైకి వెళ్లి చూచాను. నానా బీభత్సంగా ఉంది. ఇంట్లోకి నీళ్లు వస్తున్నాయి. పద్మ మంచంమీద కూర్చున్నది. డాబాపైన వర్షం. ప్రక్కింటి మేడవరకు వెళ్లే వీలులేదు. గుడిసె వాసుల ఆర్తనాదాలు.

మా పద్మ అడిగింది "నాన్నగారూ మాస్టరుగారి ప్రేయర్ చేయండి. ఈ వర్షం ఆపేయండి"

అప్పటిదాకా లోపల మథనపడుతున్నా, ట్యూబ్ వెలగలేదు. అమ్మాయి సలహా మేరకు కుర్చీలోనే కూర్చున్నాను. నేలపైన నీరుపారుతోంది. అంతే అయిదు నిమిషాలలో తుపాను, వర్షం నిలిచిపోయింది. బ్రతుకుజీవుడా అనిపించింది. మరొక గంటలో వీధిల్లో నీరు తీసింది. తెల్లవారుఝాముకు ఎక్కడి వారక్కడ వెళ్లిపోయారు.

మాస్టరుగారిని అవసరానికి అడిగాను. వారు వర్షం తగ్గించారు. ఇదంతా నా ప్రతాపం కాదు. "ప్రకృతి శక్తిని ఆపే హక్కు నీకెవరిచ్చారు?" అనిపించింది. శక్తి సంపాదిస్తాం మంచిదే. ప్రకృతి హక్కుల్ని హరించడానికి కాదు కదా శక్తి? ఎన్నడు

ప్రకృతితో తలపడరాదని అంతర్వాణి హెచ్చరించింది. శక్తులున్నవారు సాధారణంగా దుర్వినియోగపరచుకుని, వాటికి దూరం అవుతుంటారు.

ఒకనెల రోజుల అనంతరం ఒక విచిత్రం జరిగింది. మా ఇంటికి ఆఫీసుకు మహావుంటే రెండుకిలోమీటర్లు ఉంటుంది. మధ్యాహ్నం పైన గాంధీనగర్‌లో కుంభవృష్టి కురిసింది. మా ఆఫీసు దగ్గర చినుకుపడలేదు. కనీసం ఆకాశంలో మబ్బుతునక కనిపించలేదు. సాయంత్రం ఇంటికి వస్తుండగా చూస్తే వీధులు కాలవలుగా మారాయి. రాత్రి తొమ్మిదివరకు ఆ వీధిలో కాలుపెట్టడానికి వీలు కలగలేదు. సందుగొందులు దాటి ఇల్లు చేరాను.

అప్పుడు నా ప్రార్థన మన్నించి నిలిచిపోయిన వర్షం నెల తిరక్కుండానే కుమ్మరించింది. ఎంతశక్తి వున్నా మనం ప్రకృతి శక్తులను నిరోధించకూడదని తెలుసుకున్నా. ప్రజలకోసం వర్షాలు కురిపించవచ్చు, ప్రళయాలు ఆపవచ్చు. వాటివల్ల ఏ కొద్దిమందికో జరిగే నష్టం, కష్టం మనకు తెలుసు కాని, మరెన్ని విధాల మేలు జరుగుతుందో మనం అంచనా వేయలేం గదా! ప్రకృతి వైపరీత్యాలు జరుగుతాయి. బాధపడతాం. కష్టాలు, నష్టాలు అనుభవిస్తాం... అవి ఎందుకు జరుగుతాయో మనకు తెలియనప్పుడు మన స్వార్థం కోసం వాటిని నిరోధించ కూడదు. శక్తిని ఏ మంచిపనికైనా పరిమితంగా ఉపయోగించాలి.

0 0 0

బళ్లారిలో మా అబ్బాయి మాస్టర్ రమణ, తన బృందంతో నృత్యప్రదర్శన ఇస్తున్నాడు. రాఘవకళామందిర్‌లో ప్రదర్శన. రమణ మా అబ్బాయి అని కొండాచారి గారికి తెలుసు. ఆ సందర్భంలో యోగసమావేశాలు ఏర్పాటు చేశారు సూర్యనారాయణ గారింట. నృత్యప్రదర్శనతో బాటు నాకు సన్మాన కార్యక్రమం ఏర్పాటైంది. నేను. డి.ఎన్.రావుగారు వెళ్లాం. ధర్మవరంలో నా వద్ద యోగచికిత్స పొందిన సరోజమ్మ బళ్లారిలో వున్న తన అక్కకుమార్తె విషయం లోగడ చెప్పింది. చికిత్స అర్థించింది. నేను బళ్లారి వెళ్తున్నానని తెలిసి తనూ బళ్లారి చేరుకుంది ధర్మవరం నుండి. ఆ అమ్మాయి పేరు విజయలక్ష్మి. 30 సంవత్సరాలుంటాయి, డిగ్రీ చదివింది. తర్వాత చూపుపోయింది. ఇప్పుడు అంధురాలు. యోగం చేస్తున్నదట. ఆమెకు మాస్టరుగారు, వెంకమ్మగారు కనిపిస్తారుట. వివశురాలవుతుంది. వెర్రి ఆవేశానికి లోనవుతుంది. మదర్, మాస్టరు తనకు ఫోను చేస్తున్నారని 'హలో...హలో' అని లేని ఫోన్‌లో చిన్నపిల్లలా మాట్లాడుతుంది. వెంకమ్మగారు ఆదేశించారని, మాస్టరుగారు ఆర్డరు చేశారని, పదిమందికి భోజనాలు పెట్టిస్తుంది. మరో పదిమంది ముత్తయిదువులకు చీరలు పెట్టిస్తుంది. ఇలా నాలుగు

సంవత్సరాలుగా తల్లిదండ్రుల్ని ఇబ్బంది పెడుతోంది. నిజంగానే మాస్టరుగారు, మదర్ ఆమెపైకి వస్తారని వారి నమ్మకం. ఈ ఖర్చులతో దివాళా తీశారు.

నేను, డి.ఎన్. రావు, సూర్యనారాయణగారింట దిగాం. మధ్యాహ్నానికి సరోజమ్మ ఈ అమ్మాయిని తీసుకువచ్చింది. సూర్యనారాయణ ముఖం నల్లకప్పేసింది. చాటు చేసుకున్నాడు. లోగడ ఆ అమ్మాయికి తను ట్రీట్‌మెంట్ యిచ్చాడట. తగ్గలేదు. ఆయన చేయలేని కేసు ఆయన ఇంట్లో ఆయన సమక్షంలో నేను చేయడం ఆయనకు కష్టం కలిగించింది. రావుగారు, నేను వెంటనే లాడ్జికి మారిపోవాలని నిర్ణయించుకున్నాం. అసూయాద్వేషాలున్న సాధకుల ఇంట ఉండకూడదు. యోగం ప్రేమ నేర్పాలి తప్ప, అసూయలు రగిలించకూడదు.

భోజనం చేయబోయేముందు వాళ్లు వచ్చారు. సరే, ప్రయత్నం చేద్దామని విభూది తీసుకుని నుదుట పెట్టబోయేంతలో ఆమె ముఖం వికృతంగా, నల్లగా మారిపోయింది. అప్పటిదాకా కళకళలాడుతున్న మొహం క్షణంలో నల్లకప్పువేసింది. చేయి వెనక్కి తీసుకున్నాను. కేసు అర్థమైంది. ఏదో క్షుద్రశక్తి ఆవహించింది.

"ఇప్పుడు కాదు సాయంత్రం తీసుకురండి" అని పంపివేశాను. సాయంత్రం ప్రేయర్‌కు 50మంది వచ్చారు. నాకంటే సీనియర్స్ వచ్చారు. నన్ను చూడాలని వచ్చినవారు ఎక్కువ. నా ట్రీట్‌మెంట్ గమనించాలని వచ్చిన వారున్నారు. ప్రేయర్ పూర్తి అయిన తర్వాత విజయలక్ష్మికి ట్రీట్‌మెంట్ ప్రారంభించాను. విభూది నొసట పెట్టగానే ఆమె విరుచుకు పడిపోయింది. ఏదో క్షుద్రశక్తి ఆవహించిందని అందరి అనుమానం. మాస్టర్, మదర్ ఫోన్‌లో మాట్లాడడం అంతా యోగమహత్తు అనుకున్నారు అంతకాలం. అది నిజానికి... ట్రిక్‌వర్క్. యోగంలో ట్రిక్‌వర్క్ ఉంటుంది. మనకు వచ్చే సందేశాలు అన్నీ నిజాలు కావు. మనకు కనిపించేవి, వినిపించేవి నిజాలు కాకపోవచ్చు. ప్రజ్ఞ పనిచేస్తే, వాటిని విశ్లేషించగలం. కానివాటిని తిరస్కరించగలం.

ఆమె కాళ్లు చేతులు నేలకేసి బాదసాగింది. నేను, సరోజమ్మ ప్రయత్నించాం కానీ ఆపలేకపోయాం. డి.ఎన్. రావు, కొండాచారి ఇంకా పదిమందివరకు అమ్మాయి కాళ్లు చేతులు తొక్కిపట్టినా అందరినీ విదిలించి వేసింది. అందరినీ దూరంగా వెళ్లమని నేను ఒక్కడినే ప్రేయర్‌కు కూర్చున్నాను. ఆమెను ముట్టుకోలేదు. గంటసేపటికి ఆమె ఉన్మాదం తగ్గింది. లేచి కూర్చున్నది. విభూదిపెట్టి, లేచి నిలబడమంటే, కూలిపోయేది. అలా ఓ గంటపైగా, స్వాధీనంలోకి రాలేదు. తొమ్మిదిగంటల ప్రాంతంలో బయటకు నడిపించి, రిక్షాలో కూర్చోపెట్టిన తర్వాత స్వస్థురాలైంది. తెలివిలోకి వచ్చి, చప్పున రిక్షాదిగి, కాళ్లమీద పడ్డది "నన్ను క్షమించండి మాస్టారూ" అని. ఆ రోజుతో ఆమె ఆరోగ్యం కుదుటపడ్డది. మాస్టర్‌గారు, మదర్ ఫోన్‌లు చేయడం లేదు.

మర్నాడు ఉదయం 150 మంది వరకు వచ్చారు. వారిలో 40 మంది నా వద్ద ఇనీసియేషన్ తీసుకున్నారు. చాలామందికి ట్రీట్‌మెంట్ యిచ్చాను. ఆడవారు 40 మంది ఉన్నారు. వారిచే ఒక ప్రత్యేకమైన కోర్సు చేయించాను. మూడు గంటలు పట్టింది. అదే సూర్యనారాయణ గారింట నా చివరి సమావేశం. తర్వాత కొండాచారిగారు, మరికొందరు సీనియర్స్ వేరే సెంటర్ పెట్టారు. సూర్యనారాయణ, మాస్టర్, మదర్ ఫోటోల ప్రక్కన తన ఫోటో పెట్టి, ప్రార్థన చేయిస్తున్నాడని ఫిర్యాదు. ఆ కారణంగానే సీనియర్స్ అక్కడకు వెళ్లడం మానుకున్నారు. తర్వాత చాలాసార్లు బళ్లారి వెళ్లానుగానీ, లాడ్జిలోనే బస చేశాను. సూర్యనారాయణ మిగిలినవారితో సహకరించేవాడు కాదు.

0 0 0

మా అమ్మాయి పద్మప్రియకు వివాహం చేయాలని సంకల్పం కలిగింది. బందరులో మా మేనత్తగారింటికి వెళ్లినపుడు, ఆమె భర్త వీరభద్రరావు నరసరావుపేట సంబంధం సూచించారు. వారికి మాతో సంబంధం కలుపుకోవాలని ఉన్నట్లు, వెళ్లి చూచి రమ్మని చెప్పాడు. నరసరావుపేట వారు సంపన్నులు. మా కన్న స్థితిపరులు. అయినా ప్రయత్నం చేద్దామనుకున్నాను. మా మేనమామగారికి చుట్టుపక్కలు బాగా తెలుసు. తెనాలి వెళ్లి, ఆయనను తీసుకుని వెళ్లాను. సరాసరి వాళ్ల ఇంటికే వెళితే బావుండదని, పిడుగురాళ్ల డాక్టరు కందేపు సుబ్రహ్మణ్యంగారి కుమారుడు నరసరావుపేటలో ఉద్యోగం చేస్తున్నాడు, వారి ఇంటికి తీసుకువెళ్లారు మా మామయ్య. డాక్టరుగారంటే నా షద్రకుడు గాయత్రీప్రసాద్‌గారి పినతండ్రి. ఈయన పిడుగురాళ్లలో ఉంటున్నారని నా అంచనా. మేం వెళ్లేసరికి ఆయన అక్కడే వున్నారు. మామయ్యగారికి బాగా పరిచయం. ఆతిథ్యం యిచ్చారు. ఈ పనిమీద వచ్చామని చెప్పగా చాలా సంతోషించాడు. మంచి సంబంధం. కుర్రవాడు చాలా నెమ్మది, యోగ్యుడు అని చెప్పారు. పెద్దవాడు, యోగంలో వున్నవాడు. వారికి బాగా తెలిసినవాడు. మాకు దగ్గిరబంధువు. మేం వచ్చినట్లు సుందరంగారికి కబురు చేశారు ముందుగానే. మేం వెళ్లి పరిచయం చేసుకున్నాం. నన్ను పరిచయం చేశారు మా మేనమామ. ఆయన మనస్సులో వున్నా పైకి గంభీరంగా వున్నారు. వచ్చి అమ్మాయిని చూస్తామన్నారు.

సుందరంగారికి ఒకరైస్ మిల్లు, ఆటోమొబైల్‌షాపు, ఒక జీపు, ఇళ్లు వున్నాయి. సంపన్నులు. అయిదారుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. ఈ అబ్బాయి రెండవవాడు, ఎం.కాం. చదివాడు. అబ్బాయిని చూచివచ్చి, బందరు మామయ్యకు తెలియచేశాను. తను వెళ్లి కథ నడిపించగలడు. ఒక్క ఉద్యోగం లేదని తప్ప, ఎన్నదగిన సంబంధం. సుందరంగారు వచ్చి చూచారు. ఆయన అవునని, కాదని చెప్పలేదు. మళ్లీ వస్తాం అని

వెళ్లారు. తర్వాత అబ్బాయిని తీసుకుని తల్లిదండ్రులు వచ్చారు. సంబంధం కుదిరింది. నేను, యామినీదేవి, వసంత, శ్యాం వెళ్లి స్థిరపరచుకున్నాం. నిశ్చయతాంబూలాలు పుచ్చుకోవడం, లగ్నపత్రిక రాయడం వగైరా హైదరాబాదులోనే అనుకున్నాం.

పెళ్లి సింపిల్‌గా చేయాలనుకున్నాం కాని వియ్యంకుడుగారు ఘనంగా చేయాలన్నారు. అమ్మాయి పెళ్లి, నేను ఉద్యోగం చేస్తున్నాను. డబ్బులేకపోయినా, బంధుమిత్రుల బలగం బాగా వుంది. ఎవర్నని పిలవకుండా ఉండగలం! మేం చేసేది ఆ ఒక్క వివాహమే కద! ఆడపిల్ల పెళ్లికి ప్రావిడెంట్‌ఫండ్ లోన్ తీసుకోవచ్చు. అర్జీ పెట్టాను. ఇరవైవేలు వస్తుందనుకుంటే 15 వేలే వచ్చింది. లాంఛనాలు, పెళ్లిఖర్చులు యాభైవేల వరకు అవుతుందనుకున్నాం. కానీ చాలా ఎక్కువే అయింది. ఏడెనిమదివందల మంది వచ్చారు. ఎక్కడెక్కడి బంధువులు అంతా వచ్చారు. కొందరు అభిమానంతో కాక, 'నేను అమ్మాయి పెళ్లి ఎలా చేస్తానో చూద్దామని' వచ్చారు. అందరికీ తెలుసు నా వద్ద డబ్బు లేదని, పైగా పెద్ద సంబంధం చేస్తున్నానని.

పెళ్లి ప్రశాంతంగా, కాస్త ఆడంబరంగానే జరిగింది. యోగమిత్రులు నూరుమంది వరకు వచ్చారు. ఉత్తినే రావడం కాదు. ఆర్థికంగానూ, హార్థికంగానూ సహాయం అందించి, గురువుగారి పరువు నిలబెట్టారు. నా వారు అనుకున్నవారు వందమంది ప్రక్కన నిలబడితే కొండంతబలం, ధైర్యం వస్తుంది! నేను చేయవలసిన పెద్దపని, బాధ్యతగల పని అమ్మాయి వివాహం. తల్లిదండ్రులకు ఆడపిల్లల పెళ్లిళ్లు అయిపోతే పెద్దబరువు దించుకున్నట్లు అవుతుంది. మధ్యతరగతి కుటుంబాలలో అబ్బాయిల పెళ్లికి పెద్దగా తొందరపడరు.

0 0 0

"రండి...రండి"

"నమస్కారం...నాపేరు కృష్ణమూర్తి"

"తెలుసు.. కూర్చోండి"

"నేనెట్లా తెలుసు?"

"పేరు తెలియదుగానీ మీరు తెలుసు. చెప్పండి, ఏంకావాలి?"

"నాకు యోగం చేయాలని వుంది, పనికొస్తానా?"

"నేను యోగానికి పనికొస్తానో లేదో ఇంతవరకు నాకూ తెలియలేదు. మీరు పనికొస్తారో లేదో నేనెలా చెప్పగలను? ఒక్క విషయం చెప్పగలను. యోగం నాకు ఉపయోగపడుతోంది. మీకూ పనికొస్తుందనుకుంటా? ఏమంటారు?"

"నాకు అర్థం కాలేదు. వివరంగా చెప్పండి. నేను పెద్దగా చదువుకోలేదు"

"నేనూ పెద్దగా చదువుకోలేదు కృష్ణమూర్తిగారూ! మనకన్న ఎక్కువ చదువుకున్న వారున్నారు. వారంతా యోగం చేస్తున్నారా! లేదే. కనుక చదువు యోగానికి క్వాలిఫికేషన్ కాదు. మీలా ఇలా వచ్చి 'నాకు యోగం చేయాలని వుంది' అని అనగలగడం, అడగ గలగటం అసలైన క్వాలిఫికేషన్. 'పనికొస్తానా' అని అడిగారు. పనికిరాని వాళ్లుండరు. పనికిమాలిన వాళ్లుంటారు! మీరు ఆ రెంటిలో ఏ వర్గం?"

"నాకు తెలియదు"

"తెలిస్తే నాదాకా ఎందుకు వస్తారు లెండి"

ఈ సంభాషణ జరిగింది కృష్ణమూర్తితో. ఈయన ఆంజనేయులుగారికి వేలువిడిచిన మేనమామ. మేనల్లుడే వయస్సులో పెద్దవాడనిపిస్తాడు అది చిత్రం.

"నేను బ్రహ్మచారిని" అన్నారు కృష్ణమూర్తిగారు.

"మంచిది. అదృష్టవంతులు"

"మీయోగంలో బ్రహ్మచారులు పనికిరారని విన్నాను"

"బ్రహ్మచారులు అంటే స్త్రీలను ద్వేషించేవారు, సన్యాసులు. మీరు సంసార పక్షంగా వుంటున్నారు కదా. తల్లి, తమ్ములున్నారు. ఉద్యోగం చేస్తున్నారు. మీది బ్రహ్మచర్యం కాదు. మీరు పనికొస్తారు కృష్ణమూర్తిగారూ! ఏ రూల్సు అయినా, కాలాన్ని బట్టి మారుతుంటాయి. మనకు కావలసింది యోగం అయినప్పుడు రూల్సు పట్టుకుని కూర్చోనవసరం లేదు" అన్నాను.

"నాకు ఆరుగంటలకు ప్రేయర్ చేసుకోవడం కుదరదు, షిఫ్ట్ ఉద్యోగం"

"ఫరవాలేదు. ప్రేయర్ షిఫ్ట్ చేద్దాంలే, మీకు వీలైనట్లు. ఒక పనిచేయండి. యోగానికి కూర్చునే సమయంలో గడియారం ముల్లు ఆరుమీదికి తిప్పండి..."

"జోక్ చేస్తున్నారా?"

"కాదు, మనస్సులో వున్న అనుమానాన్ని షిఫ్ట్ చేస్తున్నాను. 'టైం' చూచుకోకుండా కూర్చోండి. మీకు ఎప్పుడు వీలైతే అప్పుడు ఆరుగంటలైందనుకోండి. అనుమానం ఉండదు"

"నాకోసం రూల్సు మారుస్తున్నారు"

"రూల్సు మనకోసం, మనం కల్పించుకున్నవే. మన అవసరం కోసం, నియంత్రించుకున్నవి నియమాలు. వేళకు భోజనం చేయవీలు కలగలేదు. ఒక గంట ఆలస్యం అయిందని భోజనం మానేస్తున్నారా? లేదే, ఆకలి ఎక్కువై ఇంకాస్త ఎక్కువగానే తింటారు. ఇదీ అంతేననుకోండి. కాస్త ఆలస్యమైతే, ఇంకాస్త ఎక్కువ ధ్యానంచేయండి సరిపోతుంది. అంతా మన మనస్సును బట్టి ఉంటుంది"

"చాలా విషయాలు అడగాలని వచ్చాను. మిమ్మల్ని చూచాక 'మైండ్' బ్లాంక్ అయింది. ఒక్కటీ జ్ఞాపకం రావడం లేదు."

"అంటే అవి నిజానికి అవసరంలేని అనుమానాలన్నమాట. నిజమైన విషయాలైతే జ్ఞాపకం ఉండేవి. ఉత్తి అనుమానాలు కనుక బయట పడలేదు. అసలు మీకు ఏ అనుమానాలు రావు."

'మైండ్' ఆబ్సెంట్ కావడం, శూన్యం కావడం, ఆలోచనలు కలగకపోవడం అన్నది యోగంలో మంచి లక్షణం. ఆలోచనలు ఆపడానికి మనవారు చాలా సంవత్సరాలు కష్టపడతారు. మీరు సహజంగా ఆలోచనల స్థాయి దాటి శూన్యమైనారంటే మీలో చాలా యోగం ఇప్పటికే ఉన్నట్లు. అదే అర్హత. నా దగ్గరకు రావడంతోనే మీలో జిజ్ఞాస కలిగింది. మనస్సు యోగంపై స్థిరపడ్డది. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేస్తే తప్ప, సాధించ వీలులేనిదాన్ని మీరు క్షణంలో సాధించినట్లయింది.

"నాలో లేని అర్హతలు నాకున్నట్లు పొగుడుతున్నారు" అన్నాడు.

"మిమ్మల్ని ఉత్తినే పొగిడితే నాకేం ఒరుగుతుంది చెప్పండి.నాకేమైనా సన్మానం చేస్తారా? ఇప్పటికీ మీ వద్ద ఒక 'టీ' కూడా తాగలేదే! అడగాలనుకున్న ప్రశ్నలు అడగక పోవడం, నా వద్దకు రాగానే వాటిని మరచిపోవడం మంచి లక్షణం. ఆ పని నేను చేయాలి. నేను చేయకముందే మీరు మారిపోయారు. అంటే మీకు, నాకు ట్యూన్ కుదిరింది. ఇంకపైన మీరు అడగరు, నేను చెప్పను. అయినా మీకు తృప్తి కలుగుతుంది" అది గురుశిష్య మౌనసంభాషణ.

అలా అమాయకచక్రవర్తిలా వచ్చినవాడు కృష్ణమూర్తి. మంచి సాధకుడు. అంతకుమించిన మంచి స్నేహితుడు. గురుశిష్యుల మధ్య ఉండవలసిన అనుబంధానికి 'స్నేహం' అని నిర్వచనం యిచ్చినవాడు కృష్ణమూర్తి. అలాంటి వారు కావాలి యోగానికి. అతను ఎప్పుడూ తనకు ఇది కావాలని కోరలేదు. అందరి అభివృద్ధిని కాంక్షిస్తాడు. మంచితనానికి మారుపేరు కృష్ణమూర్తి. నేను కోపిష్టినని గుర్తించిన వాడు అతను. నా కోపాన్ని హరించినవాడూ అతనే. గురువును ప్రసన్నం చేసుకోవడం కన్న, గురువు స్వభావాన్నే మార్చగలిగిన కృష్ణమూర్తి నిజమైన యోగమిత్రుడు. అతను యోగానికే మిత్రుడు.

0 0 0

చాలాకాలంగా యోగం చేస్తున్నవాడు తుకారం. మంచిర్యాలలో ఉద్యోగం. అతని చెల్లెలికి పెళ్లయింది. ఆ పెళ్లికి నేనూ వెళ్లాను. హైదరాబాదులోనే పెళ్లి జరిగింది. తుకారం కోసమే వెళ్లాను. ఈ మధ్య ఆ అమ్మాయిని కాన్పుకు కాగజ్‌నగర్ తీసుకువెళ్లారు.

నెలలు నిండాయి. బ్లీడింగ్ అవుతోంది. అక్కడి నుండి హైదరాబాదు తీసుకువచ్చి, ఒక ప్రైయివేట్ నర్సింగ్‌హోంలో చేర్చారు. ఆ పిల్ల పరిస్థితి ప్రమాదంగా వుంది. డాక్టర్లు ఏమీ చేయలేని స్థితిలో తుకారం నావద్దకు వచ్చి కన్నీరు పెట్టుకున్నాడు.

"అబ్బాయ్, పెళ్లికాని పిల్ల అయితే తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు ఎవరైనా ఫరవాలేదు. పెళ్లి అయిన పిల్ల, భర్తద్వారా ట్రీట్‌మెంట్ ఇవ్వవలసి ఉంటుంది. ఈ పూటకు ట్రీట్‌మెంట్ చేసి విభూతి యిస్తాను తీసుకుపో. మన ప్రేయర్ వర్కవుట్‌అయి, రాత్రికి ఆ అమ్మాయి బావుంటే రేపు మీ బావగారిని తీసుకురా. అతని ద్వారా టచ్ యిస్తాను. అది వేగం పనిచేస్తుంది" అని విభూతి యిచ్చి పంపాను.

అలాంటి సందర్భాలలో మొదటి ప్రేయర్‌వల్ల చాలా వరకు గుణం కనిపించాలి. తర్వాత నాలుగుసార్లు ప్రేయర్ ట్రీట్‌మెంటు చేస్తాను. నాలుగైదు సిట్టింగులలో ఎలాంటి జబ్బు అయినా, బాధ అయినా తగ్గిపోవాలి. ఇక్కడ ప్రేయర్ చేస్తున్న సమయంలోనే అక్కడ ఆస్పత్రిలో సంధ్యకు నెమ్మదించింది. విభూతి పెట్టిన తర్వాత బ్లీడింగ్ ఆగిపోయింది. మర్నాడు ఆమె భర్త వెంకటరత్నం వచ్చాడు. అతని ద్వారా ట్రీట్‌మెంట్ చేసి పంపాను. ఆ అమ్మాయికి తగ్గింది. ఆడబిడ్డను కన్నది. అప్పటి నుండి సంధ్య, వెంకటరత్నం ప్రేయర్ చేసుకోసాగారు.

0 0 0

కళ్యాణదుర్గం గుండప్ప ఒకతన్ని తీసుకువచ్చాడు. పేరు గుర్తులేదు. అతని కూతురు ఒక ముస్లిం కుర్రవాడితో లేచిపోయిందట. పోలీసు కంప్లయింట్ యివ్వడానికి భయం. ఆ కుర్రవాడి తండ్రి హెడ్‌కానిస్టేబుల్. పోలీసు ఇన్‌స్పెక్టర్‌కు ఫిర్యాదు చేస్తే అతను వాళ్లపక్షాన మాట్లాడి పొమ్మన్నాడుట. నా వద్దకు తీసుకువచ్చాడు.

ప్రేయర్‌లో కూర్చోబెట్టాను. నాకు పూనకం వచ్చినట్లయింది. ఆ వచ్చిన అతన్ని పట్టుకు బాదేశాను. పడిపోయాడు. అతన్ని కొడుతున్నానని తెలుస్తూనే ఉంది, నిగ్రహించుకోలేకపోయాను. ఓ అరగంట సేపు చావగొట్టి, నేను ప్రేయర్‌లోకి వెళ్లిపోయాను. అతను సొమ్మసిల్లిపోయి గంటతర్వాత లేచాడు. గుండప్ప భయపడిపోయాడు. ఇదేం ట్రీట్‌మెంట్‌రా భగవంతుడా అనుకున్నాడు. కాని అతనికి ఒక్క దెబ్బ తగలలేదు, అసలు నేను కొట్టినట్లే గమనించలేదు.

"ట్రీట్‌మెంట్ అయిపోయింది వెళ్లండి" అని పంపేశాను. మర్నాడు వీరు అక్కడకు చేరేసరికి, సబ్ ఇన్‌స్పెక్టరును, హెడ్‌ను బదిలీ చేసినట్లు ఆర్డర్లు వచ్చాయి. ప్రేమికుడిని క్రితంరోజు సాయంత్రం ఎవరో కుర్రాళ్లు చావగొట్టారుట. ఆస్పత్రిలో ఉన్నాడు. ప్రేమించిన నేరానికి ఆ కుర్రాడికి ఒంటినిండా బాండేజి. ఇరవై రోజులకు గానీ ఆస్పత్రి వదలిరాలేదు. ఆ పిల్ల వీరు వెళ్లేసరికి ఇంట్లో ఉంది.

ఇదంతా యోగమహిమ అని చెప్పను. అలా ఎందుకు జరిగిందో నాకూ తెలియదు. ఒక దైవశక్తి అలా చేయిస్తుంది. ఇలాంటి సంఘటనలకు ఆధారాలుండవు.

0 0 0

ఒకసారి తెనాలి వెళ్లడం జరిగింది మా అమ్మగారిని చూడడానికో, జబ్బుగా వుందని తెలిసి తీసుకురావడానికో వెళ్లాను. వెళ్లడం మా మేనమామగారింటికి వెళ్లాను. వెళ్లగానే అడిగారు.

"నఫీజ్ ఫోన్ చేశాడా?" అని.

"నఫీజ్ ఫోన్ చేయడం ఏమిటి? అమ్మకోసం వచ్చాను" అన్నాను.

ఎం.డి.సౌజన్య ఒక రచయిత, కాలీజీలో లెక్చరరు. ఎడిటర్స్‌కు రచయితలకు ఉండే సంబంధం మా మధ్య ఉంది. సాధారణంగా వాళ్ల ఇంట్లోనే ఉంటాను తెనాలి వెళ్లినప్పుడు. ముస్లింల ఇంట్లో ఉండడం, వాళ్ల తిండితినడం శ్రోత్రియుడైన మా మేనమామకు ఇష్టం ఉండదు. అయినా స్నేహితున్ని కాదనలేను. ప్రసాదార్కె, వడ్లమన్నాటి కుటుంబరావు, కె.వి. కృష్ణకుమారి, పోతుకూచి వెంకటేశ్వర్లు, కొత్తరవీంద్రబాబు, చివుకుల పురుషోత్తం అక్కడ నన్ను ఆత్మీయంగా చూచుకునే రచయితలు. ఒకప్పటి కొలీగ్ హితశ్రీగారు అక్కడే వుంటారు.

నఫీజ్ కొడుకు ఇస్మాయిల్ ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆమె వాళ్ల నాన్నగారి దగ్గరకు ట్యూషన్ కోసం వస్తుండేది. ఇద్దరు రహస్యంగా గుళ్లో పెళ్లి చేసుకున్నారు. ఆ పిల్ల హిందువుల అమ్మాయి. ఆ పిల్ల తల్లిదండ్రులు అమ్మాయిని కట్టడి చేశారు. ఈ కుర్రాడు కనిపిస్తే చంపేస్తామని బెదిరిస్తున్నారుట. ఇది కారణంగా మతకలహాలు చెలరేగవచ్చునని పట్టణం దద్దరిల్లి, భయపడుతోంది. నేను వచ్చానని తెలియగానే నఫీజ్ వచ్చి ఇంటికి తీసుకువెళ్లాడు. జరిగింది చెప్పాడు. ఇస్మాయిల్ మజ్ను లాగా వున్నాడు. నఫీజ్ భార్య, పిల్లలు దిగులుపడ్డారు. మైనారిటీ వర్గం. కాలేజీ లెక్చరర్. ఎటు తిరిగినా ఉద్యోగం పోతుంది. ఆ ఇంట్లో అందరికీ నేనంటే గౌరవం వుంది. నఫీజ అన్న ఒకప్పటి నా స్టూడెంట్. అతనూ లెక్చరరే. తమీజుద్దీన్.

"నేను వెళ్లి పిల్ల తల్లిదండ్రులతో మాట్లాడనా" అని అడిగాను.

"వద్దు గురూజీ. ఇంత జరిగిన తర్వాత కష్టం, కుర్రాడి పైకి ఎవరూ రాకుండా వుంటే చాలు" అన్నారు.

అర్ధరాత్రి 12 గంటలకు ఇస్మాయిల్‌కు ట్రీట్‌మెంట్ యిచ్చాను.

మర్నాడు ఉదయం నేను నఫీజ్ హోటల్‌కు వెళ్లి టిఫిన్ చేస్తుండగా, ఆ పిల్ల తరపువారు కనిపించారు. వారిని తనే నాకు చూపించాడు. నేను వెళ్లి పలకరించాను.

వారు నన్ను గుర్తించి, "రండి మాస్టారూ...హైదరాబాదులోనే ఉంటున్నారట" అని కుశలం అడిగారు.

వారితో అసలు సంగతి మాట్లాడాను. అతని జోలికి పోమని నాకు మాట యిచ్చారు. వీళ్లు కూడా ఆ అమ్మాయితో మాట్లాడ ప్రయత్నించకూడదు.

అలా చక్కబడ్డది. ఇప్పుడు ఆ కుర్రాడు దుబాయ్‌లో ఒక ఫైవ్‌స్టార్ హోటల్ మేనేజరు.

× × × ×

నాకు కాస్త సాముద్రికం తెలుసు. జ్యోతిషంపైన నమ్మకం వుంది. గురు మహర్దశలో కనకపుష్యరాగం ఉంగరం పెట్టుకున్నాను ఎవరో సలహాచెప్పారని. శని మహర్దశ ప్రారంభంలో నీలం పెట్టాను. తెనాలి వెళ్లినప్పుడు పి.ఆర్. కోటేశ్వరరావు అనే మిత్రుడు ఆ నీలంపై మోజుపడి తాను రెండురోజులు తన దగ్గర ఉంచుకుని టెస్ట్ చేస్తానని తీసుకున్నాడు. సాయంత్రానికి రెండు యాక్సిడెంట్లకు గుర్త్తై, నా ఉంగరం నాకు యిచ్చి వెళ్లాడు. నీలం ధరించడం అందరివల్ల కాదుట.

గాంధీనగర్‌లో ఉన్నప్పుడు ఒక రోజు ఉదయం సిగరెట్లకోసం పాన్‌షాపుకు వెళ్లాను. నేను సిగరెట్లు కొనేలోగా, ఒక సాధువు నా పాదాలు పట్టుకుని నమస్కారం చేశాడు.

"ఎవరు స్వామీ మీరు? నా పాదాలకు నమస్కారం చేశారు. నేను ఎవరనుకున్నారు?" అడిగాను.

"మీ చేతికున్న 'నీలం' మీరెవరో చెబుతోంది. మీరు మహాతపస్సంపన్నులో, యోగులో అయివుండాలి. లేకపోతే ఆ నీలం పెట్టుకోలేరు" అన్నాడు.

"నేను అతిసామాన్యమానవుడిని స్వామీ. అనవసరంగా ఒక నమస్కారం వేస్టు చేసుకున్నారు" అని నవ్వాను.

అతను నమ్మలేదు. మా ఇంటిదాకా వచ్చి, సాష్టాంగ నమస్కారం చేసి, ఆశీస్సులు తీసుకుని మరీ వెళ్లాడు.

ఎన్నో యోగసిద్ధులు, శక్తులున్నవారు మాత్రమే 'నీలం' ధరించడానికి అర్హులట?!!

0 0 0

తెనాలిలో మా ఇల్లు అమ్మిన సందర్భంలో నాకు జ్యోతిష్యం చెప్పిన వ్యక్తి షిర్డీసాయి భక్తుడు. ఒకసారి హైదరాబాదు మా ఆఫీసుకు వచ్చాడు. నా పేరు చెప్పగా, టైం కీపర్ లోపలకు కబురు చేశాడు. నేను వచ్చి చూచాను. అతనిని గుర్తించలేదు. బట్టలు మాసిపోయి, గడ్డంపెరిగి, బైరాగిలా ఉన్నాడు. తర్వాత గుర్తించి ఆయనకు టిఫిన్

పెట్టించాను. ాయంత్రం నా వెంట ఇంటికివచ్చాడు. షిర్డీ వెళ్లి నాలుగునెలలైంది. డబ్బులేదు. తెనాలి చేరడానికి ఓ యాభై రూపాయలు కావాలన్నాడు. యిచ్చాను. ఆ రాత్రి మా ఇంటనే భోజనం చేశాడు. సాయంత్రం మా ప్రెస్ దగ్గర కూర్చున్నప్పుడు సాయివాణి వినిపించాడు.

నేను యోగాశ్రమం రెండుమూడు అంతస్థుల భవనం కట్టిస్తానని. అందులోనే ప్రింటింగ్‌ప్రెస్, ప్రేయర్‌హాలు ఉంటాయని, భారతదేశంలోనే కాక, విదేశాలలో సైతం యోగం నావల్ల బాగా ప్రచారం చెందుతుందని వేలమందియోగంలో నాద్వారా చేరతారని లక్షలు ఖరీదు చేసే మూడు అంతస్తుల భవనం 'యోగాలయం' అవుతుందని చెప్పాడు.

...నేనేమిటి! బిల్డింగ్ కట్టడం ఏమిటి?! రిటైర్ అయితే ఒక లక్ష రూపాయలు రావు. ఆ డబ్బు బహుశా అప్పులకే సరిపోతుంది. అతని మాటలు నమ్మదగినవిగా లేవు.

అతను ఖండితంగా చెప్పాడు. "మీరు సంకల్పం చేస్తే చాలు పనులు నిరాటంకంగా జరిగిపోతాయి. మీ శక్తికాదు. మీ యోగబలం అలాంటిది. మీ గురువుగారు మీతోనే వుండి తన పనులు మీద్వారా చేయిస్తుంటారు. మీరు నిమిత్తమాత్రులు. రిటైర్ అయిన తర్వాత చిల్లర ఉద్యోగాలు చేయరు. యోగాన్ని ఆశ్రయిస్తారు. మీ ఇల్లే ఒక యోగాశ్రమం అవుతుంది. మీరు ఎక్కడ వుంటే అక్కడ వందలమంది యోగార్థులు చేరుతుంటారు. మీరు మొహాలు చూచి, భవిష్యత్తు చెప్పగలరు. మీ వాక్కు సత్యవాక్కు. మీ యోగకార్యక్రమాలకు సాయి అనుగ్రహం తోడవుతుంది."

ఆయన యిచ్చిన 'సాయిసందేశం' యిప్పటికి ఫలిస్తోంది.

0 0 0

ఇందుర్తి ప్రభాకర్ యోగంలో చేరి అయిదేళ్లవుతోంది.

ఒకరోజున అడిగాడు, "గురూజీ! కొత్తవారు ఎవరు వచ్చినా మీరే ఉపదేశం యిస్తుంటారు. నేను సీనియర్‌ని కదా! నాకూ ఎన్నో అనుభవాలు వస్తున్నాయి. నాకు ఒక చాన్స్ యివ్వకూడదా?"

ఆరోజు సాయంత్రం ఎవరో వచ్చారు ఇనీసియేషన్ కోసం.

"ప్రభాకర్! వీరికి ఇనీసియేషన్ కావాలట చేయండి? ఉపదేశం చేయాలని ఉబలాటంగా వుందికదా" అని అతనికి పురమాయించి. నేను సైలెంట్‌గా ప్రేయర్‌లోకి వెళ్లిపోయాను. ఎంత గింజుకున్నా ప్రభాకర్‌కి ప్రేయర్ జ్ఞాపకం రాలేదు. మాస్టర్ నమస్కారం అంటాడు తప్ప 'సి.వి.వి.' అనలేదు. తర్వాత ప్రేయర్ పై విదాటి రాలేదు. మనిషి కంగారు పడ్డాడు. చెమటల్లు పోశాయి. అతని అవస్థ గమనించి, నేనే అందుకున్నాను. తర్వాత చెప్పాను "ఇంకెప్పుడు ఎవరికీ ఉపదేశం చేయాలని ప్రయత్నించకండి"

మనకు అర్హత లేనప్పుడు, అలాంటి పనులు చేయకూడదు. మన అర్హతల్ని గుర్తించి ప్రోత్సహించేది మాస్టరుగారు.

0 0 0

వచ్చినవాడు తుకారాం తమ్ముడు. చూపులకు అడవిలోంచి పలకరించడానికి వచ్చిన అన్నలా ఉన్నాడు. పెరిగిన గడ్డంతో, టక్ చేసుకుని ఉన్నందున యాంగ్రీయంగ్‌మాన్ అనిపించాడు.

"మీరు యోగం చేస్తారటగా?" అని తీక్షణమైన ప్రశ్న.

"తెలియదు."

"యోగం ఎందుకుచేయాలి?"

"తెలియదు"

"దేవునిపూజల వల్ల ప్రయోజనం?"

"తెలియదు"

"అసలు దేవుడున్నాడా?"

"తెలియదు"

"మీరెందుకు యోగం చేస్తున్నారు?"

"తెలియదు"

"స్వామీజీలు, బాబాలు అంతా మోసం"

"నేను స్వామిని, బాబాను కాను"

"మరి మీరెవరు?"

"తెలియదు"

"నా ప్రశ్నలు ఒక్కదానికి మీరు సమాధానం చెప్పడం లేదు"

"అన్నింటికీ సమాధానం చెప్పాను. మీరు అర్థం చేసుకోలేదు"

తల గోక్కున్నాడు, జుత్తు పీక్కున్నాడు.

"నాకు అర్థం కాలేదు" మూతి ముడుచుకున్నాడు, కోపం వచ్చింది.

"నామాటలా! నేనా? ఏవి అర్థం కాలేదు"

"మీరూ, మీ పద్ధతి"

"నన్ను నేను అర్థం చేసుకోడానికి పదిహేను సంవత్సరాలు పట్టింది. నా పద్ధతి మీకు అర్థం కావడానికి మరో పదిహేను సంవత్సరాలు పట్టవచ్చు. అంతదాకా ఓపిక పట్టగలిగితే"

"నే వెడుతున్నా" లేచాడు

"ఎందుకు వచ్చినట్లు? ఎందుకు వెళుతున్నట్లు?"

"తెలుసుకుందామని, నా సందేహాలు తీర్చుకుందామని వచ్చాను"

'అనుమానాలు లేకుండా వస్తే సందేహాలు తీర్చుకోగలరు. బెటర్‌లక్ నెక్స్టైం' అన్నాను.

మూడు నెలల తర్వాత ఒక రోజున హటాత్తుగా వచ్చాడు.

"నమస్కారం" అంటూ పాదాభివందనం చేశాడు.

"బావున్నారా?"

"బాగుపడాలనే నిర్ణయంతో వచ్చాను."

"ఏమైనా అడగదలచుకుంటే అడగండి!"

"ఇంక ఏమీ అడగను. నూరు రోజులుగా అప్పటి మాటలే నాచెవుల్లో వినిపిస్తున్నాయి. నా సందేహాలన్నీ తీరిపోయాయి."

అలా యోగంలో చేరాడు కృష్ణమోహనరావు. అడగకుండా ధారణతో సమాధానాలు పొందగలిగాడు. ఉత్తమ శిష్యుల పద్ధతి అది. అది సిసలైన జిజ్ఞాస.

0 0 0

సింగరాయకొండ నుండి ఒకాయన భార్యను, కొడుకును వెంట తీసుకుని వచ్చాడు. కుర్రవానికి పదేళ్ళుంటాయి. కంటి ఆపరేషన్ కోసం శివారెడ్డికంటి ఆస్పత్రికి తీసుకువెడితే కుదరదన్నారుట. మద్రాసు అపోలో ఆస్పత్రిలో చూపించారు. అక్కడ చికిత్స జరగలేదు. నా వద్దకు కొప్పోలు మిత్రుడు బెజవాడ వీరయ్య పంపాడు. నేను మాత్రం ఎలా ట్రీట్ చేయగలను? అసలు ఎలాప్రమాదం జరిగిందీ చెప్పమన్నాను.

పిల్లలు నలుగురు బాడ్మింటన్ ఆడుకుంటున్నారు ఒకసాయంత్రం. ఈ కుర్రవాడు బంతిని గట్టిగా కొట్టాడు. అది అటుగా వెళుతున్న ఒక సాధువు కంటికి బలంగా తగిలింది. అతను కుప్పకూలిపోయి విలవిల్లాడసాగాడు. ఈ పిల్లలు జరిగిన పొరపాటుకు వెళ్ళి అతనికి సాయం చేయకపోగా, ఎగతాళి చేశారు. గేలిచేశారు. అతను కన్నెర్ర చేశాడు. మర్నాటి ఉదయానికి ఈ కుర్రవాని కన్ను ఎర్రగా వాచిపోయింది.

"ఇది డాక్టర్లవల్ల, చికిత్సవల్ల కాదు. మీరు వెళ్ళిపోయి పశ్చాత్తాపంతో,కనిపించిన సాధుసన్యాసులకు ఒక నెలరోజులపాటు దానధర్మాలు చేయండి. ఏ సత్రం అరుగుపైననో, గుడిమెట్లవద్దనో పడివున్న దిక్కులేని వారిని ఆస్పత్రిలో చేర్పించి, సాయం చేయించండి. అప్పటికి ఈ కుర్రవాని పాపం నశించి, కన్ను బాగవుతుంది" అని పంపాను.

ఒక నెలలో ఆ కుర్రాడి కన్ను బాగైంది.

# 1987

## శ్రావణ మేఘాలు

### యాభైసంవత్సరాలు దాటితే, పొద్దు పడమరకు వాలినట్లు!

జీవితంలో ఉద్యోగాలు చేసేవారికి, ఉద్యోగ విరమణ దగ్గరకొస్తున్నదంటే దిగులు, భయం. ఆపైన జీవించడం ఎలా! సంపాదన ఎలా! ఇప్పుడైతే ప్రతి ఉద్యోగికి పెన్షన్ సౌకర్యం వుంది. అప్పట్లో ప్రయివేట్ సంస్థల్లో ఉద్యోగాలు చేస్తున్నవారికి పెన్షన్ లేదు. గ్రాట్యుటీ తక్కువ. ఉద్యోగం నాలుగైదు సంస్థల్లో చేసినవారికి అసలేమీ వచ్చేది కాదు. జర్నలిజం ఒక వ్యసనం. కళాకారుల జీవితాల వంటివే జర్నలిస్టుల జీవితాలు. వృత్తి ఉంటుంది గానీ తృప్తి ఉండదు. భద్రత అసలు లేదు. నాకు రిటైర్మెంటు ముల్లు గుండెలో గుచ్చుకోవడం ప్రారంభమైంది. చాలామంది రిటైరైన జర్నలిస్టుల బ్రతుకులు చూస్తే భయం కాదు గదా గుండె ఆగి చావవలసిందే. నాకు మిగిలిన ఆసరా సాముద్రికం ఒక్కటే. కథలు, నవలలు రాయడం ఎప్పుడో మానివేశాను.

యోగం ఎవరి తృప్తి కోసం? ఆత్మసంతుష్టి కోసం చేసుకునేది తప్ప, భుక్తికి సహకరించేది కాదు. యోగంలో అభివృద్ధికి శిష్యబృందం, అనుయాయులు, అభిమానులు అవసరం లేదు. ప్రచారానికి వీరు కావాలి. ఎంత ఎక్కువమంది శిష్యులు పోగైతే గురువు అంత గొప్పవాడుగా చలామణి అవుతాడు. లోపలిశక్తి ముఖ్యం కాదు. వందిమాగదులు ముఖ్యం. ప్రచారం ముఖ్యం. గురువులకు ఊరూర ఏజంట్లు కావాలి. శిష్యవర్గం పెరగడం గురుస్థానంలో వున్న వారికి అవసరం ఒక విధంగా. శిష్యబృందం పెరిగితే గురువు తన శక్తి పెరిగిందనుకుంటాడు. గొప్పతృప్తి కలుగుతుంది. అంటే అహంకారం పెరుగుతుంది. కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. నా యోగం అలాంటిది కాదు. ఇక్కడ ప్రచారానికి అవకాశం లేదు. అభివృద్ధికి మాత్రమే ఈ యోగంలో అవకాశం వుంది. నా ఉద్దేశ్యం, ఏ యోగి తపస్సు అయినా విశ్వశ్రేయోదాయకం కావాలి. తను ఎంతకాలం తపస్సు చేసినా, ఎంత తీవ్రంగా యోగసాధన చేసినా, ఇతరులకు ఉపయోగించ నప్పుడు ఏం ప్రయోజనం? ఒక గుహలో కూర్చుని, నూరు సంవత్సరాలు ఘోర తపస్సు చేయవచ్చు. దాని ఫలితం సామాన్య మానవునికి అందాలి.

యోగుల, మహర్షుల సాధన, తపస్సు రెండువిధాల ప్రజలకు ఉపయోగిస్తుందని నాభావం. యోగులది సాధన. మహర్షులది తపస్సు. సాధన అంటే తాను సాధించి, ఇతరులకు పంచిపెట్టేది. తపస్సు, తాను చేసి తానుగా మోక్షం పొందేది. యోగసాధన

ఫలాలు అహానికి ఇహానికి ఉపయోగపడాలనుకుంటారు. పరం సంగతి మరచిపోతాం. ఈ ఆలోచన నా యోగసాధనను కొత్తమలుపు తిప్పింది. నాకు ముందు ఈ యోగం చేసిన వారంతా ఏదో తప్పుచేశారని కాదు. వారి లక్ష్యం వారిది. నా గమ్యం నేను నిర్ణయించుకున్నాను. సాధన అందరిదీ ఒక్కటే. వినిమయంలోనే తేడావుంది. ఒకడు కోట్లు సంపాదించి, ఆస్తిపాస్తులు పెంచుకుని, బ్యాంకుల్లో డిపాజిట్‌లు పెంచుకుంటాడు. మరొకరు కోట్లు సంపాదించి, దానధర్మాలు చేస్తాడు. వేలమందికి ఉద్యోగాలు కల్పించే పరిశ్రమలు నెలకొల్పుతాడు. యోగసంపదను నాకై ఏమీ మిగుల్చుకోదలచలేదు. నేను సంపాదించి పదుగురికి పంచిపెట్టడమే నాకు తృప్తి.

అరవిందయోగి లాంటివారు అజ్ఞాతంగా వుండి యోగసాధన చేసి, మానవ పరిణామానికి పరోక్షంగా సహకరించారు. మనం స్వార్థంతో యోగసాధన చేయనప్పుడు అది విశ్వకళ్యాణకార్యానికే ఉపయోగిస్తుంది. స్వామి వివేకానంద, సాయినాథుని వంటి వారి తపస్సు విశ్వకళ్యాణానికే ఉపయోగించిందని నా విశ్వాసం. ఎవరి ఆశయాన్ని వారు ఏర్పరచుకోవాలి. మన పూర్వుల ఆశయాలే మన ఆశయాలు కానవసరంలేదు. మాస్టరుగారి యోగాశయం ఏదైనా ఆ మార్గంలో సాధన చేస్తున్న నేను, నా గమ్యాన్ని నిర్దేశించుకున్నాను. కాస్త స్వతంత్రించక తప్పలేదు. ప్రతిఘటనలు, ప్రాతికూల్యం ఎదురైనప్పుడు, ఎక్కువైనప్పుడు మనిషి స్వతంత్రించక తప్పదు. ఎదురు తిరగక తప్పదు. నా స్థితి అలాంటిదే. సమకాలికులైన కొందరి ప్రవర్తన నన్ను అవమానపరచింది. అతలాకుతలం చేసింది. బాధించింది. వారి పద్ధతులూ, ఆచారాలు, సాంప్రదాయబద్ధత నాకు నచ్చక, మూలాన్ని అన్వేషించాను. మాస్టరుగారు మౌలికంగా ఆచరించిన పద్ధతులు గ్రహించి వాటిని అమలు పరచసాగాను.

యోగాన్ని, భక్తిని, నీతిని ప్రజలకు బోధించవచ్చు. వారిలో మానసిక పరిణామం కలిగి ఆచరించగలగాలి. ఆచరణలో పెట్టని ధర్మపన్నాలు ఎన్ని వున్నా నిరర్థకం. మనిషిలో పరిణామం కలగాలి. సామాన్యునిలో సైతం చైతన్యం రావాలి. ప్రతి హృదయం స్పందించాలి. మనస్సుకు స్ఫూర్తి కలగాలి. దేశంలోని ప్రజలందరినీ మార్చడం ఎవరి తరం కాదు. ప్రపంచం మొత్తాన్ని మార్చాలని కంకణం కట్టుకుని లాభం లేదు. ఏ మహాత్ముడైనా తన పరిసరాలను మాత్రమే ప్రభావితం చేయగలడు. కొందరిని మాత్రమే తన మార్గంలోకి తెచ్చుకోగలడు. ఇది చారిత్రక సత్యం. మహాయోగం ఆవిష్కరించిన మాస్టరుగారు సైతం పన్నెండేళ్ల కాలంలో ఎందరిని యోగంలోకి రప్పించగలిగారు! కనుక అత్యాశ పనికిరాదు. ఆర్భాటం కూడదు. అర్హులైనవారు, నిజమైన జిజ్ఞాస కలవారు ఏ కొద్దిమంది వచ్చినా చాలును. వారిని తీర్చిదిద్దగలిగితే నా ఆశయం సిద్ధించినట్లే, కృషి ఫలించినట్లే.

ఉపన్యాసాలవల్ల, సత్సంగాలవల్ల ప్రజల్ని మార్చగలమని నేను అనుకోవడం లేదు. జనం దగ్గరకు మనం వెళ్లడం మాత్రం జరుగుతుంది. వారే మనల్ని వెతుక్కుంటూ వచ్చిన రోజున మనల్ని వారు అర్థం చేసుకోగలరు. అది నిజమైన సత్సంగం అవుతుంది. అలా వచ్చినవారిలో కొందరైనా నిలబడతారు. సామాన్యునిలో సైతం జ్ఞానజ్యోతిని వెలిగించగల వారు మహాత్ములవుతారు. మనుషులలో మంచిని పెంచగలవారు మానవతను నింపగలవారు బహుకొద్దిమంది మాత్రమే. సాటిమనిషిని ప్రేమించలేనివారు, కరుణ లేనివారు... ఇతరులకు ఉపయోగపడరు. యోగస్ఫూర్తి ఏ కొద్దిమందిలోనైనా కలిగించగలిగితే వారి హృదయాలలో చిరుదీపాలు వెలిగించగలిగితే మన కృషి ఫలించినట్లేనని నా నమ్మకం. ఆ పనిచేయడానికి నేను ఒక మాస్టరును కానవసరం లేదు, గురువును కానవసరం లేదు. నాకు పీఠాలు అవసరం లేదు. సాటివారిని ప్రేమిస్తే చాలు. నాకు తెలిసింది వారికి అర్థమయ్యేట్లు చెప్పి, నా మార్గంలో నాతో వారినీ యోగసాధన చేయగలిగేట్లు ప్రోత్సహిస్తే చాలును.

అది నా ఆశయం. నా ఆశయంకోసం ఏర్పాటు చేసుకున్నదే నా ఆశ్రమం. నా ఆశ్రమానికి ఆశయానికి చిన్నచిన్న బాటలు వేసుకోసాగాను. అవి రహదారులు కాకపోవచ్చు. చిన్నచిన్న కాలిబాటలు. నా ఆశ్రమం చేరుకోడానికి ఈ చిన్నబాటలు చాలు. నా ఆశయం అర్థంచేసుకోడానికి, నాతో కలిసి యోగాన్ని పంచుకుంటేచాలు. ప్రతిసంవత్సరం చేరే సాధకుల సంఖ్య 75, 80 మాత్రమే. వీరెవరూ నేను బొట్టుపెట్టి పిలిస్తే వచ్చినవారు కాదు. మాస్టరుగారు ఎన్నికచేసి నావద్దకు పంపుతున్నవారు. ఎవరికి వారుగా వచ్చి, అడిగితే తప్ప ఎవరినీ యోగం చేయమని నేను పిలవను. అది నా నియమం. నాకొక రూల్ లేదు. మనస్సుకు నచ్చాలి. మాస్టరుగారు కనిపించి చెప్పారని, ఆజ్ఞాపించారని నేను చెప్పను. నిజాయితీగా వ్యవహరిస్తాను. ఇతరులు నన్ను అపార్థం చేసుకుంటే అది నా తప్పు కాదు.

0 0 0

ఎక్కడో మునిసిపల్ కమిషనర్‌గా వున్న ఒకాయనను హైదరాబాదు కార్పొరేషన్‌కు బదిలి చేశారు. ఆయన ఒకరోజున సిబ్బందితో మా వీధిలో నడుస్తూ మా ఇంటిముందరున్న బోర్డు చూచాడు. సాయంత్రం నేను ఆఫీసు నుండి వచ్చేవేళకు వచ్చాడు. తనను పరిచయం చేసుకుని, తన సమస్య వివరించాడు.

ఆయనకు ఒక కూతురుంది. ఎం.ఎ. చదివింది. చాలా అందంగా వుంటుందిట. పెళ్లి అయింది. అల్లుడికి మంచిఉద్యోగం. శోభనానికి ముహూర్తం పెడతారు. అల్లుడు, అన్ని ఏర్పాట్లతో వస్తాడు. ఈ అమ్మాయి సాయంత్రానికి బయట చేరుతుంది. శోభనం ఆగిపోతుంది. అలా అప్పటికి నాలుగుసార్లు జరిగిందట. అల్లుడుగారు ప్రాణం విసిగి,

లాయర్ నోటీసు పంపాడు విడాకులు కోరుతూ. ఎందరు గైనకాలజిస్టులకు చూపినా ఫలితం లేకపోయింది. అది అతగాడి సమస్య. కాళ్లపట్టుకుని, కన్నీరు కారుస్తూ "అమ్మాయి కాపురం ఎలాగైనా నిలబెట్టండి గురూజీ" అని ఏడ్చాడు.

ఆ స్థితి ఎవరికైనా బాధే! ప్రేయర్‌చేసి, విభూది యిచ్చాను. "పెళ్లి ముహూర్తం పెట్టుకోండి. ఈ విభూతి ఆ కార్యం నిర్విఘ్నంగా నెరవేరేవరకు అమ్మాయికి పెట్టండి."

సక్సెస్... ఆమె హాయిగా కాపురం చేసుకుంటోంది. ఎలా జరిగింది? నాకు తెలియదు. వాళ్లకు నాపైన ఏర్పడ్డ నమ్మకం. నాకు మాస్టరుగారిపైన వున్న విశ్వాసం... అంతే!

0 0 0

హరిహరశర్మ అని మరొక యోగసాధకుడు, కర్నూలు. యోగం బాగా చేస్తాడు. ఒకరోజుఫోన్‌చేసి, తన చెల్లెల్ని తీసుకువచ్చాడు ట్రీట్‌మెంట్‌కోసం. వారు కర్నూలు నుండి వచ్చేలోగా, ఇక్కడవున్న వారి బంధువులు వచ్చారు. వారికి తెలియపరచి వుంటారు. ఆమె బెంగుళూరులో ఉద్యోగం చేస్తుంది. ఇద్దరు పిల్లలు. భర్త అకస్మాత్తుగా చనిపోయాడు. వయస్సు 30, 35 ఉండవచ్చు. ఆమెకు మతి చలించింది. ఉద్యోగానికి రాజీనామా చేసింది. చచ్చిపోవాలని నిర్ణయించుకుంది. ఉన్మాదం ఎక్కువైంది. పిల్లల్ని దగ్గరకు రానీయదు. 'మీరు నా పిల్లలు కాదుపొండి' అని కసిరి కొడుతుంది.

శర్మ ఆమెను తీసుకువచ్చాడు. పరామర్శించడానికి వచ్చిన బంధువుల్ని ఆమె గుర్తించలేదు. మిడిగుడ్లు వేసుకుని ఎక్కడో చూపునిలిపింది. ఏదో ఆలోచిస్తుంది. వెక్కివెక్కి ఏడుస్తుంది. ఆరోజున కృష్ణమూర్తిగారు ప్రేయర్‌కు వచ్చారు. ఆమె కేసు ఎలా చేయాలో నాకు అర్థం కాలేదు. ప్రేయర్‌లో కూర్చోబెట్టాను. నేను, శర్మ, కృష్ణమూర్తి, ఆమె నలుగురం 'సియాన్స్' చేశాం. మధ్యలో కర్పూరంతో హోమం చేశాను. ప్రేయర్‌లోకి వెళ్లగానే ఆమె స్పృహ తప్పి పడిపోయింది. మంచిదే. ఒక గంట గడిచినా లేవలేదు. శర్మ బంధువుల్ని పంపడానికి బయటకు వెళ్లాడు. ఆ అమ్మాయిని లేపి, కబుర్లలో పెట్టాను. ఆమె మొహంలోకి తేజస్సు వచ్చింది. సాయంత్రం వచ్చినప్పటి విచారం లేదు. బెంగుళూరు వెళ్లి ఉద్యోగంలో చేరతానని, పిల్లల్ని తన వద్దనే ఉంచుకుని చదివిస్తానని నాకు 'ప్రామిస్' చేసింది. శర్మ బజారునుండి తిరిగి వచ్చేసరికి ఆమె నార్మల్ అయింది. అన్నగారిని ఆప్యాయంగా పలకరించింది. అందరి విషయాలు పేరుపేరున అడిగింది. ఆ రాత్రే వెళ్లిపోయింది. మర్నాడే బెంగుళూరు వెళ్లి ఉద్యోగంలో చేరిపోయిందిట.

0 0 0 0

బళ్లారి నుండి ఒకామె ఉత్తరం రాసింది. "అన్నయ్యగారూ మీ దర్శనానికి అనుమతిస్తారా" అని. అది ఏకవాక్య లేఖనం, క్రింద డా. పద్మావతమ్మ అని సంతకం.

నా జవాబు అందుకోకుండానే బయలుదేరి వచ్చింది. ప్రేయర్ చేసుకుని వాకిట్లోకి రాగానే ముగ్గుబట్టలాంటితల... చేతిలో ఒకబాగ్, 'పిచ్చిమాలోకం' అనిపించింది.

"ఎవరమ్మా మీరు" అడిగాను.

"బళ్లారి నుండి. నాపేరు పద్మావతమ్మ."

"రండి లోపలికి, మీ ఉత్తరం ... నిన్ననే పోస్టు చేశాను మీకు"

బళ్లారి రెండుసార్లు వెళ్లాను గానీ ఈమెగారిని చూచిన జ్ఞాపకం లేదు. తను సూర్యనారాయణగారికి సోదరి వరసట. ముందు ఆయన దగ్గరకే వెళ్లేది. ఆయన పద్ధతి నచ్చక వెళ్లడం మానుకుంది. బళ్లారిలో నా గురించి చెప్పారుట. వచ్చింది. ఆమె ఆప్తాలజిస్టు. ఎం.బి.బి.ఎస్., ఎం.ఎస్. అవివాహిత. మెడికల్ ఆఫీసరుగా ఉద్యోగం చేస్తున్నది. అయినా యోగం అంటే వల్లమాలిన యిష్టం. యోగం, ధ్యానం డాక్టర్లు నమ్మరు.. వాళ్లకి అన్నీ సైంటిఫిక్‌గా కనిపించాలి. ఈమెకు సైన్సు కన్న యోగశక్తిపై నమ్మకం జాస్తి. నాలుగురోజులు మా ఇంట గడిపింది. మాతో కలిసి యోగం చేసుకున్నది. చాలాకాలంగా యోగం చేస్తున్న వ్యక్తి. నేను ఇనీసియేషన్ చేయనవసరం లేదు. మా ఇంట్లో ఒక మెంబర్ అయింది ఆమె. "గురువుగారూ మీకు ఒక కూతురు కాదు. ఇద్దరు కూతుళ్లు. నేనూ మీ బిడ్డలాంటిదానిని" అనేది.

డా. పద్మావతమ్మ రాక నా యోగానికి కొత్తవెలుగు. ఆమె యోగానికి సంపూర్ణంగా అంకితమైన వ్యక్తి. ఆమె యామినీదేవిని మొదటినుండీ 'అమ్మా' అని పిలిచేది. ఆమెను చూచి మిగత యోగసభ్యులంతా 'అమ్మా' అని పిలవసాగారు. డి.ఎన్.రావు., ఆర్. నాగేశ్వరరావు, పి. గంగాధరరావు, కె.కృష్ణమూర్తి... వీరంతా అప్పటి రెగ్యులర్ మెంబర్లు. ఇంట్లో మనుషుల క్రింద లెక్క. ఏ రోజైనా పిలిస్తే వచ్చేవారు. పద్మావతమ్మ పిలుపులో అమ్మతనంలోని కమ్మదనం కనిపించేది.

డి.ఎన్.రావు, డా.పద్మావతమ్మ యోగసాధకులకు చక్కగా క్లాసులు తీసుకునే వారు. ఎలా ప్రవర్తించాలి? యోగం ఎలా చేయాలి? యోగసాధకుల ప్రవర్తన ఎలావుండాలి? వివరంగా చెప్పేవారు. వీరిద్దరి వల్ల సాధకుల మధ్య సామరస్యం, అంకితభావం ఏర్పడ్డాయి. ఒక డిసిప్లిన్ అలవాటైంది. నేను అంతగా పట్టించుకునే వాడిని కాను. వారిద్దరు మాత్రం కమాండర్లుగా వ్యవహరించేవారు. మా యోగాశ్రమానికి వీరిద్దరు ద్వారపాలకులైనారు. సాధకులలో అమ్మగారు, గురుపత్ని.అనే భావన నెలకొనడం వల్ల యామినీదేవి ఆలోచనలో మార్పు రాసాగింది. అందరినీ ఆత్మీయంగా, ప్రేమగా చూడ్డం సహజగుణంగా మారింది. అప్పుడు తనకు బాధ్యతలు పెరిగాయి.'యోగాటీచ్' అనేది నావంతు పాత్ర. 'లవ్-గాస్పెల్' తనవంతు పాత్ర అయింది. యోగంలో ప్రేమది గొప్ప పాత్ర. అత్యంత క్లిష్టమైన పాత్ర.

నాకు మా గురువుగారితో అనుబంధం అయిదారు సంవత్సరాలే సాగింది. డి.ఎన్.రావుగారితో నా యోగమైత్రి అయిదారుసంవత్సరాలే సాగింది. పద్మావతమ్మతో సాన్నిహిత్యం అంతేకాలం సాగింది. అప్పటికే వారంతా యోగపూర్ణులై మాస్టరుగారి సన్నిధికి చేరుకోవడం జరిగింది. నన్ను ఒంటరిచేసి వెళ్లిపోయారని అనుకోలేదు కానీ, నాపై బాధ్యలు పెట్టి, కర్తవ్యం పెంచి తప్పుకున్నారనిపించింది. మాస్టరుగారికి ఇక్కడ యోగా వర్క్ పై నివేదించి ఉంటారు. డి.ఎన్.రావుగారికి జిడ్డుకృష్ణమూర్తి, రమణమహర్షి అంటే గొప్ప అభిమానం. మాస్టర్ ఎం.ఎన్.గారంటే భక్తి. ఆయనకు భార్యబిడ్డలు దగ్గరలేకపోయినా, తాను వారి ప్రేమకు దూరమైనా, యోగానికి, మాస్టరుగారికి దగ్గరైనానన్న తృప్తి ఉండేది. అందుకే జీవిత చరమాధ్యాయం పూర్తిగా మాస్టరుయోగానికి కేటాయించారు.

0 0 0

ఒక విచిత్రమైన సంఘటన, మరచిపోలేనిది జరిగింది. వంటామె వండిపెట్టి వెళ్లిపోయింది. ఈయన ఒంటిగంటకు భోజనం చేస్తాడు. నేతిగిన్నె, స్టౌవ్ వెలిగించి పెట్టాడు. అంతలో ఎవరో బయటనుండి పిలిచారు. వెళ్లి వారితో కబుర్లు చెప్పి, తిరిగి రావడానికి గంటసేపు పట్టింది. వచ్చి భోజనానికి కూర్చోబోతూ నెయ్యి వెచ్చబెట్టడానికి స్టౌవ్ వెలిగించాడు. అంతే... గప్పుమని లేచాయి మంటలు. చేయి బాహుమూలం వరకు కాలిపోయింది. అరచేయినుండి పైవరకు కాలిపోయింది. గబగబ సీతాఫల్‌మండి సెంటర్లో డాక్టరు దగ్గరకు పరిగెత్తాడు. ఆయన ఏదో పౌడర్ చల్లి పంపాడు. సాయంత్రానికి చేయి మొత్తం ఎర్రగా రక్తపుముద్దలా తయారైంది. భుజాన ఒక టవల్ వేసుకుని ఆటోలో వచ్చాడు నావద్దకు. చూస్తే, నాకు కళ్లు తిరిగాయి. అలాంటి దృశ్యాలు డాక్టర్లు, నర్సులు చూడగలరు. తట్టుకోగలరు! సామాన్యులకు గుండె బేజారవుతుంది. జరిగింది చెప్పి, "నీవు ట్రీట్‌చేయి, నేనిక ఏ డాక్టరు దగ్గరకు వెళ్లదలచలేదు" అని కూర్చున్నాడు.

దీనికి నేను ట్రీట్ చేయడమా? ఎలా! ఏం చేయాలి? ఆయన తెచ్చే కేసులన్నీ నాకు పరీక్షలే!

సరే తీవ్రంగా చేశాను. మూడురోజుల్లో పెచ్చుకట్టింది. చీము పట్టలేదు. అదృష్టం. గాంధీ ఆస్పత్రికి వెళ్లవలసిన కేసు. 'ఇట్స్ ఎ ఛాలెంజ్‌టు యోగా!' అంటూ నన్ను రంగంలోకి దించాడు. తగ్గింది కానీ, ముంజేయివద్ద వంగేది కాదు. నరాలలో స్పందన పోయింది. స్పర్శ తగ్గింది. ఒక నెలరోజులకు బాగైంది.

"మాస్టరుగారు ట్రీట్‌మెంట్ పవర్ నీ ఒక్కడికే యిచ్చారు శార్వరీ! ఇలా ట్రీట్‌మెంట్ మన యోగంలో ఎవరూ చేయలేదు" అనేవాడు. అది వారి అభిమానం.. అభినందన కాదు. అంతటిస్ఫూర్తి, అంకితభావం డా.పద్మావతమ్మది.

ఒకరోజు సాయంత్రం డి.ఎన్.రావు హడావుడిగా వచ్చి 'గెట్‌రెడీ, సీతారామయ్య గారికి సీరియస్‌గా వుంది. చాలా క్రిటికల్'' అన్నాడు.

"ఆయన ఉండేది విజయవాడ! మనం కంగారు పడడం దేనికి?" నా ప్రశ్న.

"కాదు శార్వరీ...కింగ్‌కోఠీ ఆస్పత్రిలో చేర్చారు"

ఇక్కడ ఆయన కుమారుడు ఉన్నాడట చిక్కడపల్లిలో. అక్కడకు వచ్చి జబ్బు పడ్డాగట.

ఇద్దరం ఆస్పత్రికి వెళ్లాం. అది నైజాం నవాబు గారి అంతఃపు... ...ందులో ఆస్పత్రి పెట్టారని నాకు తెలియదు.

ఆయనకు చేతులు, కాళ్లుపోటు. భరించలేకపోతున్నాడు. 'ఇంతకాలం యోగం చేసినవాడికి ఈ బాధలెందుకు పెట్టాలి మాస్టరుగారు. హాయిగా, బాధలేకుండా తీసుకువెళ్ల వచ్చుగా' అనుకున్నాను. నా మనసులోని భావం గ్రహించారు సీతారామయ్యగారు అన్నారు, "శార్వరీ! మాస్టరుగారు యోగి. పరమాత్మస్వరూపుడు. ఆయన యముడు కాదు. మనుషుల్ని చంపేది యముడు. తర్వాత అజరామరత్వం కల్పించేది మాస్టరుగారు. ఈ మన బాధలు మాస్టరుగారు కల్పించినవి కావు ఆయన తీసివేయడానికి. మన కర్మ శేషమే ఇలా బాధల రూపేణా పట్టిపీడిస్తుంది" అంత బాధలోనూ ఆయన నాకు యోగరహస్యం బోధించారు.

"సీతారామయ్యగారికి ట్రీట్‌మెంట్ చెయ్ శార్వరీ" అన్నారు డి.ఎన్.రావు.

"వారు నాకు గురు సమానులు. వారికి నేను, ట్రీట్‌మెంట్ చేయడం తప్పు. అలాచేస్తే గురుద్రోహం చేసినట్లు. గురువుకంటే తాను అధికుడినని, అధికశక్తి సంపన్నుడనని అహంకరించిన... ...ి గురువుకు ట్రీట్‌మెంట్ యివ్వగలడు" అన్నాను.

"తప్పు శార్వరీ! అది గురుద్రోహం కానేకాదు. గురువు ఋణం తీర్చుకోవడం అవుతుంది. నాకు తెలుసు నువ్వు బాలసుందరరావుకు చాలారోజులు ట్రీట్‌మెంట్ చేశావు. అది నీవిచ్చిన గురుదక్షిణ. ఆ విధంగా నీవు ఋణ విముక్తుడవైనావు. గురువు ఋణం డబ్బిస్తే తీరేది కాదు. సేవచేస్తే తీరుతుంది. ఇప్పుడు మనకు సేవలు, శుశ్రూషలు చేసే అవకాశం లేదు. ఇలా అంతిమఘడియల్లో ప్రార్థన చేసి ఋణం తీర్చుకోవచ్చు."

గొప్ప ఉపదేశం యిచ్చారు.

నా అనుమానం తీరింది. డి.ఎన్. మీసం తిప్పాడు.

"చెప్పండి, సీతారామయ్యగారు ఏ బ్రీతింగ్ చేయాలో? నేను దగ్గరుండి చేయిస్తాను" అన్నాడు.

అంతబాధలోనూ సీతారామయ్యగారు నవ్వి, "నరసింహారావూ, నీకు మీసాలు పెరిగాయి తప్ప బుద్ధి పెరగలేదు. ట్రీట్‌మెంట్స్ బ్రీతింగ్స్‌తో కాదు చేసేది. మనస్సుతో,

సంకల్పంతో, ఆత్మబలంతో. శార్వరికి తెలుసులే. తను విజయవాడలో కొన్ని కేసులు చేశాడు, నాకు తెలుసు. ట్రీట్‌మెంట్ రహస్యం శార్వరికి తెలుసు. నీకు తెలియదు. నోరుమూసుకో"

అక్కడే ట్రీట్‌మెంట్ చేశాను. అయిదునిమిషాలలో ఆయనకు మంటలు, పోట్లు తగ్గాయి.

"శార్వరీ నా కొక స్పెషల్‌రూం యిచ్చే ఏర్పాటు చూడు. ఈ జనరల్‌వార్డులో ఇబ్బందిగా వుంది" అని అడిగారు.

అంతలో ఒక నర్సు వచ్చింది. "సిస్టర్, డాక్టర్ కె.వి.కె. డ్యూటీలో వున్నారా?" అడిగాను.

"ఏడుగంటలకు వస్తారు. నైట్‌డ్యూటీ" అన్నది.

నేను ఒక కాగితంపైన సంతకం చేసి ఆమెకిచ్చాను.

"డాక్టరుగారికి ఈ చీటీ యివ్వు. వీరికి స్పెషల్ రూపం ఎలాట్ చేయమని చెప్పు" అని వచ్చేశాం.

డాక్టర్ కె.వి. కృష్ణకుమారి తెనాలిలో నా ఫ్రెండ్. ఆమెకు ఒకసారి ట్రీట్‌మెంట్ చేశాను. ఆ కృతజ్ఞతతో ఆమె డ్యూటీకి వచ్చి, చీటీ చూడగానే స్పెషల్‌రూంకు మార్పించారు. మూడురోజులకే డిశ్చార్జి చేసి పంపారు.

చిక్కడపల్లిలో వారి కుమారుని ఇంట విశ్రాంతి తీసుకునేవారు. మేం ప్రేయర్‌కు అక్కడికి వెళ్లే వాళ్లం.

"సీతారామయ్యగారూ ఇంక విజయవాడ వెళ్లకండి. ఇక్కడే సెటిల్ అవండి. మీ ఆరోగ్యం బావుంటుంది. విజయవాడ వెళ్లారంటే ప్రమాదం" అని చెప్పాను. ...ఇంట్యూషన్.

మనవరాలికి పెళ్లిసంబంధం వచ్చిందని పై నెలలో విజయవాడ వెళ్లారు. వెళ్లిన కొద్దిరోజులకే జబ్బు పడ్డారు. మృత్యువును ఎవరం ఆపలేం!

0 0 0

నాకు అత్యంత ఆత్మీయుడు, బంధువు, హితైషి డాక్టరు కందేపు సుబ్రహ్మణ్యం గారు. ఒక డాక్టరుగారి దయవల్ల నేను యోగంలో చేరాను. మరొక డాక్టరుగారు నాకు యోగపరంగా ఎంతో సహాయం చేశారు. మా అమ్మాయి పద్మప్రియను నరసరావుపేట శ్రీ సుందరంగారి అబ్బాయి చి॥సర్వేశ్వరరావుకు యివ్వడం వల్ల తరచు నరసరావుపేట వెళ్లే అవసరం, అవకాశం కలిగింది. వెళ్లినప్పుడు ప్రేయర్‌కు-డాక్టరు సుబ్రహ్మణ్యం గారింటికి వెళ్లడం రివాజు. ఇద్దరం కలసి శ్రీ జొన్నలగడ్డ కృష్ణమూర్తి గారింటికి వెళ్లి

ముగ్గురం ప్రేయర్ చేసుకునేవాళ్లం. కృష్ణమూర్తిగారు సీనియర్ సాధకులు. పిడుగురాళ్ల మాస్టరుగారికి వీరిద్దరు ఆప్తులు, ఆత్మీయులు.. మా అమ్మాయికి నరసరావుపేట సంబంధం కుదరడం, నాకు ఇద్దరు సీనియర్ సాధకుల సన్నిహితమైత్రి కలగడం మాస్టరుగారి కరుణ వల్లనే అనుకుంటాను.

నా ఉద్యోగం చివరి అంచుకు చేరుతుండగా, సీనియర్ యోగమిత్రులు, 50 సంవత్సరాల పాటు యోగం చేసినవారు ఒక్కొక్కరే నిష్క్రమించసాగారు. వీరందరితో నాకు అయిదారు సంవత్సరాల యోగానుబంధం ఏర్పడ్డది. మా ఇంటికి సమీపంలోనే ఉండేవారు వేదాంతం లక్ష్మీనారాయణగారు. తెనాలిలో పెద్ద న్యాయవాది, ఎంఎన్.గారికి ప్రియశిష్యుడు. ఆయనకు జబ్బు చేసినప్పుడు డి.ఎన్.రావు, నేను వెళ్లాం. డి ఎన్. నన్ను ట్రీట్‌మెంట్ చేయమని వత్తిడి చేస్తే, వేదాంతం వారన్నారు, "వద్దు శార్వరీ! ఈ శరీరం కృశించి పోయింది పూర్తిగా. 90 సంవత్సరాలు పోషించాను దీన్ని. నాకు దీనిపై వ్యామోహం లేదు. బ్రతకాలన్న కోరిక లేదు. దయచేసి నాకు ట్రీట్ చేయవద్దు. నీ యోగశక్తిని నాకోసం అనవసరంగా వృధాచేయకు. నాకు మరొక జన్మలేదు. సరాసరి మాస్టరుగారి దగ్గరకే వెళ్లిపోతాను"

చివరి క్షణాలలో ఎంతటి ధీశక్తి! ఆత్మస్థైర్యం! ఆశ్చర్యం వేసింది. యోగం చేస్తున్నవారికి ఉన్నంతకాలం బ్రతుకుపై మమకారం ఉండదు. చివరిదశలో జన్మ రాహిత్యంపై గొప్ప ధీమా! అదీ యోగజీవనం అంటే!

0 0 0

నా వద్ద ఇనీసియేషన్ తీసుకోనివారితో నాకు'యోగాలింక్' ఉండదు గాక ఉండదు. ఎంతో సన్నిహితంగా మెలుగుతుంటాను. కలిసి ప్రేయర్ చేస్తాను. అయినా అవసరానికి వారి పిలుపు నాకు వినిపించదు. కలగవలసిన స్పందన కలగదు. ఫలితం ఉండదు. నా దగ్గర ఇనీసియేషన్ తీసుకున్నవారు, భక్తిశ్రద్ధలతో పిలిచినా అవసరానికి ప్రార్థించినా నాకు తెలుస్తుంది. ఆ క్షణంలో నాకు వారి గురించిన ఆలోచన వస్తుంది. వారి అభ్యర్థన నెరవేరుతుంది. ఇదొక చిత్రమైన స్పందన. మొక్కుబడిగా యోగం చేసేవారితో, విమర్శించేవారితోనూ నాకు 'లింక్' ఏర్పడదు. అంటే సాధకులు పూర్తి అంకితభావంతో ఉన్నప్పుడే గురువుతో వారికి ఆధ్యాత్మిక అనుబంధం ఏర్పడుతుందని తెలుసుకున్నాను.

యామినీసరస్వతి అని నాకో రచయిత మిత్రుడున్నాడు. అతనిది నంద్యాల. చక్కగా చదువుకున్నవాడు, సాధుస్వభావి. సద్గుణసంపన్నుడు. నంద్యాలలోఎవరివద్ద ఇనీసియేషన్ తీసుకున్నాడో తెలియదుగానీ యోగం చేస్తుంటాడు. నాతో పాటు ప్రేయర్ చేసిన గుర్తు లేదు. అతని నవలలు, కథలు ప్రభలో వేశానన్న గౌరవం నాపైన ఉండేదనుకుంటా.

ఒకసారి వాళ్ల అబ్బాయికి ట్రాక్టర్ ప్రమాదం జరిగింది. కర్నూలు ఆస్పత్రికి తీసుకు వచ్చారు. అక్కడనుండి టెలిగ్రాం యిచ్చారు. నాకు అందలేదు. మూడురోజుల తర్వాత అతని మేనమామ ఏదో పనిమీద హైదరాబాదు వచ్చి, నన్ను ఆఫీసులో కలిసి విషయం చెప్పాడు. నాకు టెలిగ్రాం అందనే లేదన్నాను. అయినా మిత్రుడు కదా అని అప్పుడే మధ్యాహ్నం 12 గంటలకు ఆఫీసులోనే ధ్యానంలోకి వెళ్లాను. చీకటి కనిపించింది.

"అంతా అయిపోయింది. ఇంక నేనేం చేయలేను" అన్నాను.

ఆ ఉదయమే ఆ కుర్రాడు చనిపోయాడు.

తర్వాత అతను భార్యాబిడ్డలతో వచ్చి నన్ను కలిశాడు.

"ఇది నీ జీవితానికి ఒక మలుపు సుబ్బారావుగారూ. ఇకపైన మీకు మహర్దశ పట్టబోతున్నది. ఈ విచారం మరచిపొండి. ఉజ్వలమైన జీవితం మీ ముందున్నది " అని ఊరడించాను.

రెండు మూడునెలల్లోనే అతనికి సినిమా రచయితగా అవకాశం వచ్చింది. యు. విశ్వేశ్వరరావుగారు మద్రాసు పిలిపించుకున్నారు. ఆగస్టు 4 మాస్టర్ జన్మదినోత్సవం నాటికి అతను మద్రాసులో వున్నాడు.ఇక్కడ యోగసమావేశం జరిగేవేళకు తను ప్రేయర్‌కు కూర్చున్నాడు. ఎంత ప్రయత్నించినా ప్రేయర్ జ్ఞాపకం రాలేదు. చివరకు 'మాస్టర్ శార్వరి నమస్కారం' అనుకుని కూర్చున్నాడు. యోగావర్కింగ్స్ విపరీతంగా వచ్చాయి. చాలా ఆనందించాడు.

తర్వాత హైదరాబాదు వచ్చినప్పుడు ఈ విషయం చెప్పాడు. నేనన్నాను. "మాస్టర్‌గారి ప్రేయర్ మరచిపోవడం అంటే మీరు యోగం మానివేస్తారని సూచన. డబ్బు, కీర్తి, వ్యామోహం మిమ్మల్ని యోగానికి దూరం చేస్తాయి. మాస్టరుగారి పేరు ఉచ్ఛరించకుండా 'శార్వరి' పేరు ఉచ్ఛరించడం తప్పు. ఇన్ని తప్పులు మీరు చేశారంటే. మార్గం తప్పుతున్నట్లే అర్థం." అది మందలింపు కాదు... ముందుసూచన.

0 0 0

కొందరు వ్యక్తుల్ని నేను శిష్యులుగా చూడను. చూడలేను. వారి స్థానం వేరు.

డాక్టరు పద్మావతమ్మను ఏనాడు నేను ఒక శిష్యురాలిగా చూడలేదు. కారణం వయస్సులో నాకంటే పెద్దది కాకపోయినా పెద్దామె. మెడికల్ ఆఫీసర్. అసలు కారణం ఆమె నావద్ద ఇనీసియేషన్ తీసుకున్న వ్యక్తి కాదు. ఒక అభిమానిగా భావించాను. ఆమె కూడా నన్ను 'గురువుగారు' అనేది కాదు. 'అన్నయ్యగారూ' అనేది. మాది అన్నాచెల్లెలు అనుబంధం. లింక్‌మాత్రం యోగం. ఆమెకు యోగంలో చక్కని అనుభవాలు కలిగేవి. 24 గంటలు యోగావర్కు సాగేది. నా కలా సాగదు. నా ధోరణి వేరు. నా పని వేరు. ఆమె యోగానికి సంపూర్ణంగా సమర్పణ చేసుకున్నది.

యోగసాధన చేసేవారిలో ఒక ఆకర్షణ ఉంటుంది. దానినే 'స్పిరిచువల్ ఆరా' అంటారు. శక్తివలయం లేదా తేజోవలయం కావచ్చు. జనాల్ని ఆకర్షించేది 'ఆరా.' ఒక వ్యక్తిపై మనకు ఆకర్షణ కలగడానికి కారణం ఆ కాంతివలయమే. యోగశక్తికి నిదర్శనం ఆరా. ఆమెలో ఆకర్షణ వుంది. సాధకులు ఆమె చుట్టూరా చేరేవారు. ఆరా ఏర్పడని వారు ఎంతగా ప్రచారం చేసుకున్నా, ఎన్ని ఉపన్యాసాలు యిచ్చినా, జనం దగ్గరకు రారు. కొందరు ఎంతకాలం యోగసాధన చేసినా గురుస్థానం పొందలేరు. కారణం ఈ కాంతివలయం ఏర్పడకపోవడమే. డాక్టరు పద్మావతమ్మలో, శ్రీమతి యామినీదేవిలో ఉన్నది కాంతివలయం కాదు. ప్రేమవలయం. అది అయస్కాంతంలాగా పనిచేస్తుంది. అది వేరే భూమికపై పనిచేస్తుంది. వారిలో సాధకుల్ని ఆకర్షించేది ప్రేమ, కరుణ, దయ, జాలి. అవి స్త్రీ సహజమైన గుణాలు. మగవారిలో అవి కనిపించవు. ఉన్నా పెద్దగా పనిచేస్తున్నట్లు అనిపించదు. అవి తెచ్చిపెట్టుకునే గుణాలు కావు. హృదయం రసప్లావితం అయినపుడు, ఉబికివచ్చే తరంగాలు... ప్రేమ, ఆప్యాయత.

డా. పద్మావతమ్మ, డి.ఎన్.రావు ఇద్దరూ యోగకార్యభారాన్ని నాతో కలిసి మోసేవారు. పద్మావతమ్మ వెనక ఉండి నడిపిస్తే, డిఎన్.రావు ముందు నిలబడేవారు. చిత్రంగా పద్మావతమ్మ రాకతో డి.ఎన్.రావు నిష్క్రమించినట్లయింది.

0 0 0

హైదరాబాదులో మా యోగకేంద్రం ప్రారంభించకముందు రెండుమూడుసార్లు రామకృష్ణమిషన్‌కు వెళ్లాను. అది మా ఇంటికి, ఆఫీసుకు మధ్యన వుంటుంది. పైగా కొత్తగా కట్టారు. దాని ఎదురుగా ఇందిరాపార్కు తయారైంది. ఆదివారాలలో స్వామి రంగ నాథానంద ఆంగ్లోపన్యాసం వుండేది. భగవద్గీత శ్లోకాలను వ్యాఖ్యానించేవారు. రామకృష్ణ పరమహంస పూజామందిరం చాలా ప్రశాంతంగా వుంటుందని విన్నాను. బేలూరురామకృష్ణ మఠం నమూనాలో, కన్యాకుమారి వద్ద , ఇక్కడ హైదరాబాదులో కట్టారు. ఎక్కడ కట్టినా రామకృష్ణ పరమహంస మందిరం అలాగే వుంటుంది.

ఒక ఆదివారం సాయంత్రం నేనూ మరొక సహోద్యోగి కలిసివెళ్లాం. మందిరం తలుపులు తెరిచే వున్నాయి. ఎవరూ లేరు. మెత్తని తివాచీలు పరచి వున్నాయి. విగ్రహం వద్ద ఒక దీపం వెలుగుతోంది. అక్కడ ప్రేయర్ చేసుకోవాలనిపించింది. నాకు ప్రేయర్ టైం, ఆరుగంటలైంది ఇంటికి వెళ్లే వ్యవధి లేదు. ఎవరూలేరు కదా అని అక్కడే ప్రేయర్ ప్రారంభించాను. మాకు ప్రేయర్ అంటే పైకి చదివే పద్యాలు, స్తోత్రాలు కాదు. సైలెంట్ మెడిటేషన్. ధ్యానం. ఎవరికీ ఇబ్బంది ఉండదు. కళ్లు మూసుకుని కూర్చోవడం వరకు ఇతరులకు తెలుస్తుంది. ఆ తర్వాత గంటసేపు ధ్యానంలో జరిగే వర్క్ బయటవారికి

తెలియదు. ప్రేయర్ ప్రారంభించగానే ముందు ఆవలింతలు వచ్చి, తర్వాత స్పందనలు కలిగాయి. వైబ్రేషన్స్ విపరీతంగా వచ్చాయి. తర్వాత అరగంటకు సమాధిస్థితికి వెళ్లాను. బాహ్యప్రపంచం గుర్తులేదు. చుట్టూ ఏం జరుగుతుందో తెలియని స్థితి. మరోగంటపైగా ఆ స్థితిలో వున్నాను. నా మెడిటేషన్ పూర్తియేసరికి హారతి కార్యక్రమం జరుగుతోంది. మందిరం నిండుగా ఆడ, మగ కూర్చుని వున్నారు భక్తిగా. నేను ఆడవాళ్ల మధ్యన ఉన్నాను. సిగ్గు వేసింది. అంతా నన్ను వింతగా చూడసాగారు.

అసలు జరిగింది; అక్కడ పూజా. కార్యక్రమం ఆరున్నరకు ప్రారంభం అవుతుందిట. నాకు తెలియదు. నేను ఆరుగంటలకు ధ్యానంలో కూర్చున్నాను. ఆరున్నరకు సమాధి స్థితికి చేరుకున్నాను. జనం రాసాగారు. ఆడవారు కూర్చునేవైపు నేను ధ్యానినిమగ్నమై వున్నాను. ఎవరో స్వామీజీ వచ్చి నన్ను లేపడానికి ప్రయత్నించాడట. ఆయన వల్ల కాలేదు. అయినా ధ్యానంలో వున్న వ్యక్తిని డిస్టర్బ్ చేయడం తప్పు గదా! ఆయన వెళ్లిపోయారు. ఆడవారు కొంచెం దూరంగా సర్దుకుని కూర్చున్నారు. హారతి సమయంలో రికార్డు పాట పెట్టారు. దీపాలు వెలిగించారు. ఈ రిట్యుయల్స్ రామకృష్ణ పరమహంస కోరారా? అవి అవసరమా! స్పిరిట్యుయల్ కేంద్రం రిట్యుయల్ కేంద్రంగా మారినందుకు నాకు మనసులో బాధ కలిగింది. తర్వాత ఎన్నడూ అక్కడికి వెళ్ల లేదు. నా యోగకేంద్రం పెట్టాక ఎక్కడికీ వెళ్లే తీరుబడి కలగలేదు.

యోగంలోకి వచ్చేవారు, ఎవరు ఎంతకాలం నిలబడతారో చెప్పలేం. చివరివరకు యోగం సాధన చేసేవారు బహుతక్కువ. ఆసక్తి ఉంటుంది. దానిపట్ల గౌరవం ఉంటుంది. కాని ఉద్యోగ, వ్యాపారాలకిచ్చిన ప్రాధాన్యం, ధనసంపాదన కిచ్చిన ప్రాముఖ్యత యోగసాధనకు ఇవ్వబుద్ధికాదు. ఉదయం ఆరుగంటలకు లేవడానికి బద్ధకం. సాయంత్రం ఆరింటికి షాపులు, వ్యాపారాలు. ఉద్యోగులకైతే ఆఫీసుపనులు. చాలాకొద్దిమంది మాత్రం కాలం విలువ గ్రహించి, ఆ వేళకు తీరికచేసుకోగలుగుతారు. అలా కాస్త కాస్తగా పెరిగిన ఉదాసీనవైఖరి, బద్ధకంగా మారి, చివరికి నిర్లక్ష్యం అవుతుంది. యోగం దారి యోగానిది మనదారి మనది అవుతుంది. నామకః యోగం చేస్తున్నామని చెబుతుంటారు చాలామంది.

అమాయకులు, ఏమీ తెలియనివారు బాగా యోగం చేస్తారు. అహంకారులు, అహంభావులు, స్వార్థపరులు, లాభాలుకాంక్షించే వారు క్రమంగా విరమించుకుంటారు. తమకు ఎంతోతెలుసునని ఫోజులు కొట్టేవారు, తమ అహంకారాన్ని మాటల్లో, చేతల్లో ప్రదర్శించేవారు, ఆధిక్యతను కోరేవారు యోగానికి దూరం అవుతుంటారు. నా అనుభవంలో ఎందరినో చూచాను. ఎందరినో గమనిస్తున్నాను. ఎంత చదివినా అసలు 'కీ'లకం గురువు

దగ్గరే ఉంటుంది. మన చదువులు , మన వివేకం, డిగ్రీలు ఆత్మజ్ఞానానికి సంబంధించినది కాదు. గురువునుండి పొందేది బ్రహ్మజ్ఞానం. అది మనలో చొరబడి ఆత్మజ్ఞానంగా రూపాంతరం చెందుతుంది. టోటల్‌గా శరణు అన్నవానికే 'గురుకృప' అందుతుంది. అభివృద్ధి కనిపిస్తుంది. అలా కపటంలేనివారు మాత్రమే యోగంలో నిలబడగలుగుతున్నారు. పది కాలాలపాటు యోగసాధన చేస్తున్నా వారు లబ్ధి పొందడం, లాభం పొందడం వారి మనస్సును బట్టి ఉంటుంది.

కళ్యాణదుర్గంలోని. సాధకుల ఆహ్వానంపై మరొక సమావేశం జరపవలసి వచ్చింది. జి.వి. చలం, ఎల్.ఎన్. గుప్తా, మల్లిఖార్జున, ఆదినారాయణ గుప్త, హనుమంత రెడ్డి, ఇంకాఎవరెవరో యోగంలో చేరారు. చుట్టుపట్ల గ్రామాల నుండి బళ్లారి, అనంతపురం, ధర్మవరం, పెనుగొండ నుండి నూరుమంది హాజరైనారు. అప్పుడే ఎం.టి.ఎ. కోర్సు చేయించాను. అయిదారుగంటలు పట్టింది. మాకొడికి నుండి పుష్పలత అనే ఆమె వచ్చింది. ఆమెకు చూపు తగ్గింది. యోగా ట్రీట్‌మెంటుతో ఆమెకు చూపు వచ్చింది. తర్వాత అనంతపురం జిల్లాలో చాలామంది యోగంలో చేరారు.

0 0 0

పి. వరలక్ష్మి అనే ఆమె ఉత్తరం రాసింది. ఆమె ఈతకోటలో హెల్త్ అసిస్టెంటుగా ఉద్యోగం చేస్తున్నది. అధికారి సత్యనారాయణ ఆ ఊరికి దగ్గర దేవరపల్లిలో ఉంటారు. వెళ్లి ఆయనగారిని కలవమని రాశాను. వెళ్లి కలుసుకున్నది. ఆయన చిన్నక్లాసు తీసుకున్నాడుట. నా యోగం గురించి ఇక్కడ నియమాల గురించి గట్టిగా చెప్పాడు. అప్పుడు నా వద్దకు వచ్చింది ఆమె.

గోదావరిలా గలగలమనే స్వభావం ఆమెది. నాన్‌స్టాప్‌లా మాట్లాడేస్తుంది. ఎదుటి మనిషిని మాట్లాడనివ్వదు. వచ్చీరాగానే "ఈ నైట్ ఇక్కడే ఉంటాను. నా చరిత్ర అంతా మీరు వినాలి" అన్నది. మధ్యమధ్య ఇంగ్లీషు పదాలు ఘోరంగా వాడుతుంది.

"వినక తప్పేదేముంది. అలాగే వినిపించు" అన్నాను.

అప్పటికి రెండుమూడు టీలు తాగిన గుర్తు... మధ్యమధ్య ఆమె కష్టాల్ని గుర్తించి లోపలి నుండి శ్రీమతి టీ పంపసాగింది.

పాపం! ఆమె మహాభక్తురాలట. వారానికి నాలుగైదు రోజులు ఉపవాసాలు, పూజలు చేస్తుంది. ఈమె భయంకర భక్తికి తట్టుకోలేకపోయాడు భర్తగారు. ఇద్దరు విడిపోయారు. ఇద్దరో, ముగ్గురో పిల్లలు. ఈమె దగ్గరే వుంటారుట.

రాత్రి పదిగంటలవరకు తన కథ చెప్పి అలసిపోయింది. "ఇంక నీవు చెప్పడం అయిందిగా, తిండి తిని పడుకో తల్లీ. రేపు ఉదయం నాతో ప్రేయర్‌లో కూర్చో. నీ నోరు కట్టి వేస్తాను" అన్నాను.

మర్నాడు ఉదయం ప్రేయర్‌లో కూర్చున్నది. అంతే వాగుడు తగ్గిపోయింది. అడగవలసిన ప్రశ్నలు మిగలలేదు. యోగంలో చేరింది. అంతకాలంగా చేస్తున్న పూజలు, వ్రతాలు, నేలపడకలు వదలిపెట్టింది. భర్తను అంతకుముందే వదలిపెట్టింది గదా! ఇప్పుడు ఆ భర్త తిరిగి రావాలని అమె ఏకైక కోరిక.

డా.పద్మావతమ్మ ఈమెకు క్లాసులు తీసుకునేది. ప్రతి సమావేశంలో వీరిద్దరిదే హడావిడి అంతా.

మంచివాడో, చెడ్డవాడో, ఆడదానికి మొగుడనేవాడు ఒకడు ఉండితీరాలని వరలక్ష్మి సిద్ధాంతం.

'అప్రయోజకుడైన మొగుడు ఉండడం కన్న లేకపోవడమే మంచిదని' పద్మావతమ్మ సిద్ధాంతం.

ఈ సిద్ధాంత విభేదం ఇద్దరినీ కలిపింది. ఇద్దరికీ యోగం అంటే ప్రాణం. అదివినా జీవితం లేదన్న నమ్మకం.

0 0 0

యోగం కోసం వచ్చేవారు తక్కువ. ట్రీట్‌మెంట్స్ కోసం వచ్చేవారు ఎక్కువ. ట్రీట్‌మెంట్ తర్వాత అయినా యోగంచేస్తారని ఆశ. కాని, చాలామంది తర్వాత మొహం కూడా చూపించరు. నిజానికి ఆజన్మాంతం కృతజ్ఞతగా ఉండవవలసిన వారుంటారు. ఒకసారి సత్యనారాయణ కొడుక్కి కళ్ల జబ్బు చేసింది. ఫాక్టరీలో పనిచేస్తాడు. లేత్‌వర్కు అనుకుంటాను. కళ్లలో ఏ నిప్పురవ్వలు పడ్డాయోమరి రెండు కళ్లు ఎర్రగా వాచిపోయాయి. కంటి డాక్టర్లకు చూపిస్తే ఇంకలాభం లేదు అన్నారు. ఆయన నా వద్దకు తీసుకువచ్చాడు కన్నీళ్లు పెట్టుకుని "అవసరమైతే నా కళ్లు యిస్తాను. వాడి కళ్లు బాగుచేయండి" అన్నాడు.

ఆ పని చేయవలసింది నేత్రవైద్యులు. ఒకరికళ్లు ఒకరికి అతికించగలరు. అదైనా చనిపోయిన తర్వాత వారి కళ్లను తీసి, గుడ్డివారికి అమర్చి చూపు తెప్పిస్తారు. ఇలా బ్రతికి ఉన్నవారు నేత్రదానం చేస్తామంటే చట్టం ఒప్పుకోదు. ఆ కుర్రవాడిని ముందు ఉద్యోగం మానివేయమని చెప్పి, ట్రీట్‌చేశాను. 'అయిదునెలల పాటు ఇంటివద్దనే ఉండాలి. నేనిచ్చిన ప్రార్థన అయిదునెలలు చేయాలి.' ఒకనెలరోజుల్లోనే అతని కళ్లు బాగుపడ్డాయి. మళ్లీ వేరే ఉద్యోగంలో చేరాడు.

విశేషం ఏమిటంటే ఆ ప్రబుద్ధుడు మళ్లీ నా వద్దకు రాలేదు. తర్వాత పెళ్లి అయింది. పిల్లలు కలిగారు. ఉండేది హైదరాబాదులోనేకానీ నా వద్దకు రాడు.

కొంతమంది మహాపిసినారులుంటారు. యోగం బాగా చేస్తారు. వాళ్లు 'టీ' కూడా సొంతడబ్బుతో తాగరు. చుట్టలు సైతం ప్రక్కవారు కొనిపెట్టాలి. వారు

యోగసమావేశాలకు లావాలన్నా ఎవరైనా ఖర్చు భరించి తీసుకురావాలి. అలా వ్యవహారం నడపగలరు. తమ చేతికి మట్టి అంటకూడదు. గెలుపు వారికి దక్కాలి.

పి. వరలక్ష్మి కొత్తపేటకు బదిలీ అయింది. యోగం బాగా చేయసాగింది. ఇప్పుడు భర్తతో కలిసి ఉండాలని కోరిక. పిల్లలు పెరుగుతున్నారు. తండ్రి నీడలో పిల్లలు పైకి వస్తారని ఆశ. నిజానికి తనకే భర్త కావాలని లోపలి కోరిక. కొత్తపేటలో చాలామంది అనుచరగణాన్ని పోగుచేసుకున్నది. అక్కడ అంతా సావిత్రులు, అనసూయలు. తాను అద్దెకున్న ఇంటామెను తీసుకువచ్చింది. ఆ అమ్మాయి పేరు విజయలక్ష్మి. ఉబ్బసం జబ్బు. చచ్చేట్టు దగ్గేది. ఆడప్రాణం కదా. వరలక్ష్మి జాలిపడి ఏవో మందులు వేసేది. చివరకు నా దగ్గరకు తీసుకు వచ్చింది. యోగంలో చేర్పింది. పదిసంవత్సరాలుగా వున్న రోగం పదిరోజుల్లో తగ్గిపోయింది. కుటుంబ పరిస్థితి ఆర్థికంగా మెరుగైంది. అంత్రమేలు జరిగిన తర్వాత ఆవిడ వరలక్ష్మితో దెబ్బలాడి ఇల్లు ఖాళీ చేయించింది. యోగానికి రావడం మానుకున్నది.

వరలక్ష్మి జాలిపడినవారంతా ఇలాంటివారే. ఒక సావిత్రిని తెచ్చింది. ఆమెకు పిల్లలు లేరు. మనిషి మండోదరిలా ఉండేది. పాండిచేరి కూడా వెళ్లి చూపించారుట. పిల్లలు కలిగే అవకాశం లేదన్నారట. నా వద్దకు తీసుకువచ్చింది. ట్రీట్‌మెంట్ చేశాను రెండు సంవత్సరాల కోర్సు యిచ్చాను. ఆమెకు రెండు సంవత్సరాల్లో కొడుకు పుట్టాడు. యోగం మానేసింది. వరలక్ష్మితో దెబ్బలాడి ఉంటుంది. కొత్తపేట నుండి ఎలాంటికేసులు తీసుకురావద్దని వార్నింగ్ యిచ్చాను వరలక్ష్మికి.

0 0 0

చాలామందికి క్షుద్రశక్తులు సంపాదించాలని కోరిక. ఎక్కడో చదువుతారు. నవలలు చదివి, సినిమాలలో చూచి, అలాంటిశక్తులు సంపాదిస్తే, వశీకరణ విద్యలు పొందితే, ఆడవారిని లోబరుచుకోవచ్చునని, ధనరాశులు సంపాదించవచ్చునని ఆశ. అందుకోసం మంత్రాలు, తంత్రాలు నేర్చుకుంటారు. స్మశానాలలో పూజలు చేస్తారు. శవాలపై కూర్చుని జపాలు చేస్తారు. ఆ సిద్ధులు కలగవు. ఈలోగా ఆరోగ్యం పాడవుతుంది. పాడుబడిన దేవాలయాలలో, స్మశానాలలో, చితిమంటల వద్ద పూజలు చేస్తే మంచి ఫలితాలు కలగవు. పైగా మనస్సు వికలమై పిచ్చివాళ్లవుతారు.

అలా క్షుద్రోపాసనలు చేస్తున్న ఒక కుర్రవాడిని తెచ్చింది వరలక్ష్మి. నిజానికి అతను ఏం చేస్తున్నాడో ఈమెకు తెలియదు. ఆకుర్రవాని తల్లి ఏడుపువిని. దయతలచి తెచ్చింది. వాడి ధోరణి భయంకరంగా ఉంది. నన్నే మింగేసేలా చూచాడు. నాపైన క్షుద్రమంత్రాలు ప్రయోగించాడు. వరలక్ష్మిని ట్రీట్‌చేయమన్నాను. తను భయపడిపోయింది.

చివరన చెప్పాను, అతనుచేస్తున్న ఉపాసనలు ఇవి. అవి మానివేస్తే బాగవుతాడు. ఏ రోగం లేదు అని పంపివేశాను. ఆ తర్వాత ఆమె ఎవరినీ తీసుకువచ్చే సాహసం చేయలేదు. కుర్రవాళ్లు ఏవో క్షుద్రోపాసనలుచేసి, వశీకరణశక్తులు సంపాదించాలని, తంత్రాన్ని ఆశ్రయిస్తారు. అది ఫలించదని తెలియదు. దొడ్డిదోవన గురువులైపోవాలని, జనాల్ని ఆకర్షించాలని తపన. విశాఖపట్నంలో ఓయువకుడు ఇలానే చేసి శృంగభంగమైనాడు.

0 0 0

నేను చేస్తున్నది సత్యయోగం. నా నమ్మకం నాది. అది చెదరదు. స్వప్రయోజనాలు ఆశించివచ్చే వారుంటారు. తప్పుకాదు. ఏవో కోరికలు ప్రతివారికీ ఉంటాయి. అవి తీరితేనే జీవితం సుఖంగా, సాఫీగా సాగుతుంది. కొన్ని కోర్కెలు తీర్చదగ్గవిగా ఉంటాయి. ఒకాయన వచ్చాడు. లాయర్. ఆ ఊళ్లో మరో నలుగురు లాయర్లు, పబ్లిక్ ప్రాసిక్యూటర్, అంతా యోగం చక్కగా చేసేవారే. ఇతనికి జడ్జి ఉద్యోగం కావాలి. లాయర్‌గా ప్రాక్టీసు లేదు. సంపాదన చాలదు. కుటుంబభారం ఎక్కువ. జడ్జిపోస్టుకు పరీక్షరాశాడు. తప్పాడు. రెండవసారి మళ్లీ పరీక్ష రాయడానికి వచ్చి, నన్ను అర్థించాడు. ఎలాగైనా తనకు ఉద్యోగం వచ్చేట్లు మాస్టర్‌గారిని ప్రార్థించమని, రికమెండ్ చేయమని. ఇలాంటి పిచ్చిపని చాలామంది చేస్తుంటారు. వారి అవసరాలు తీర్చమని నేను మాస్టరుగారికి రికమెండ్ చేయాలంటారు. వారే అడగవచ్చుగదా! మధ్యలో నేనెందుకు?

అతని పరిస్థితికి జాలి కలిగింది. మా ఇంట్లోనే నాలుగురోజులుండి పరీక్షకు వెళ్లమన్నాను. పరీక్ష బాగా రాశాడు. పాసైనాడు. ఇంటర్వ్యూ పిలుపు వచ్చింది. వచ్చాడు. ఇంటర్వ్యూలో కూడా పాసవుతాడని నాకు అనిపించింది. అతను ముప్ఫయివేలు, ఇంటర్వ్యూబోర్డులో లంచం యిచ్చి ఉద్యోగం సంపాదించుకున్నాడు. చేయబోయేది న్యాయమూర్తి ఉద్యోగం. లంచం యిచ్చి ఉద్యోగం కొనడం. ఇంటర్వ్యూ చేసినవాడు హైకోర్టు న్యాయమూర్తి. లంచం తీసుకుని ఉద్యోగం యివ్వడం . అది తెలిసిన రోజున చెప్పాను, "దయచేసి మీరింక యోగం చేయకండి. మీరు అర్హత కోల్పోయారు" అని. అతను మళ్లీ నా వద్దకు రాలేదు.

0 0 0

అప్పుడు చేరినవారు రామకృష్ణాపురం నుండి మోహనరావు, హైదరాబాదు నుండి గోవిందరాజశర్మ, భాస్కర్. వీరంతా మంచి సాధకులు. యోగంలో చేరినవారెవరూ చెడిపోరు. అందరు అన్నిరకాల బాగుపడ్డవారే. ఉద్యోగులకు ఊహించని ప్రమోషన్లు వచ్చాయి. వ్యాపారం చేస్తున్నవారు లక్షలు ఆర్జించారు.

యోగం నాకు ఇంత మేలు చేసింది అని తృప్తి పడినవారే తప్ప, యోగానికి నేనేం చేస్తున్నాను అని నిలబడి ఒక్కక్షణం ఆలోచించిన వారు లేరు.

0 0 0

నేను కుటుంబ విషయాలు పట్టించుకోనని ఓ మంచిపేరుంది. పట్టించుకుని చేయగల ప్రయోజకత్వం నాకులేదని నా గట్టినమ్మకం. బంధువుల ఇళ్లకి రానని, వారితో చనువుగా ఉండనని ఓ అపప్రథ. ఉద్యోగం మద్రాసులో కావటాన బంధువుల రాకపోకలు చాలా తక్కువ. బంధువులు చాలామందికి నా ఉద్యోగం అంటే చిన్నచూపు. వారుమాత్రం ప్రయోజకత్వంతో ప్రభుత్వోద్యోగాలు చేస్తున్నట్లు, అప్రయోజకుడిని కనుక నేను పత్రికలో పనిచేస్తున్నట్లు వారి దృఢవిశ్వాసం. జీవిత ప్రవాహానికి ఈ ఒడ్డున వారు, ఆ ఒడ్డున నేను. ప్రభుత్వోద్యోగం సుఖమయం. నాది కోరుకున్న ఉద్యోగం, నాకు తృప్తినిచ్చేది.

అమ్మాయి పద్మప్రియ వివాహం జరిగి ఏడాదైంది. అంతవరకు కుస్తీపట్లు పడుతున్న రెండవఅబ్బాయి శ్యాంసుందర్, సి.ఎ. పరీక్ష పాసైనాడు. అయిదు సంవత్సరాలు నిర్విరామంగా పోరాటం సాగించాడు. సి.ఎ. పూర్తికాకపోతే ఉత్త బి.కాం డిగ్రీతో చేసేదేమీ ఉండదు. జీవితంలో మనిషికి తనదైన లక్ష్యం ఉండాలి. శ్యాంసుందర్ లక్ష్యం సి.ఎ. చేయడం. మా వాళ్లలో ఎవరూ సి.ఎ. చేసింది లేదు. తనే మొదటివాడు. జర్నలిస్టులలో నేను మొదటివాడిని. వసంతకుమార్ ప్రెస్ పనులు చూచుకుంటూ తన పరిశోధనను పూర్తి చేశాడు. తనకు పిహెచ్‌డి. వచ్చింది. వచ్చి ఏం లాభం? లెక్చరర్ ఉద్యోగానికి ప్రాంతీయ భేదాలు, కులాల కుమ్ములాటలు. ప్రెస్ బాగా నడుస్తోంది. కనుక సమస్య కాదు. తనకు లెక్చరర్ కావాలని లేదు. ఎగ్జిక్యూటివ్‌గా అవకాశం వస్తే చేరాలని.

మూడవ అబ్బాయి వెంకటరమణ హైదరాబాదులో ఇంటర్, బి.ఎస్‌సి. ఆనర్సు చేశాడు. తనకు మొదటి నుండి డాన్సు అంటే ఆసక్తి. మద్రాసులో ఎస్.ఎస్.ఎల్.సి. చదువుతున్నప్పుడే వెంపటిచినసత్యం గారి వద్ద చేరి కూచిపూడి నృత్యం అభ్యసించాడు. హైదరాబాదు వచ్చాక, శోభానాయుడుగారి కూచిపూడి ఆర్ట్స్ అకాడమీలో మూడేళ్ల శిక్షణ పొందాడు. గవర్నమెంటు సంగీత నృత్యకళాశాలలో చేరి నాలుగు సంవత్సరాల డిప్లొమా చేశాడు. ప్రోగ్రామ్స్ యివ్వగల సత్తా ఏర్పడ్డది. కానీ అకడమిక్ చదువుల పట్ల అశ్రద్ధ లేదు. ఆనర్స్ ఫస్ట్‌క్లాసులో పాసై ఢిల్లీ యూనివర్సిటీలో ఎం.ఎస్‌సి. లో చేరాడు. అక్కడి వాతావరణం సరిపడక తిరుపతి వెళ్లి వేంకటేశ్వర యూనివర్సిటీలో ఎం.ఎస్‌సి.లో చేరి, డాన్సు స్కూలు పెట్టుకున్నాడు. సవ్యసాచిలా అటు ఎం.ఎస్‌సి. చదువు ఇటు నాట్యబోధన. దాదాపు 50 మంది పిల్లలకు నాట్యం నేర్పి వారిచేత ప్రదర్శనలిస్తుండేవాడు. తను స్వతంత్రంగా జీవించాలన్న ఆలోచన. ప్రతివ్యక్తికి అలాంటి ఒక ఆశయం ఉండడం

మంచిదే. తన ఎం.ఎస్.సి. అయింది. రీసర్చి చేయాలని కోరిక. 'నీ ఇష్టం' అన్నాను. తనకు తోచింది చేసి తీరతాడు, వద్దన్నా ఆగడు. కనుక నేను ఏదీ కాదనను. అసలు ఈ కాలం పిల్లలంతా అంతే. వారి నిర్ణయాలు తల్లిదండ్రుల చేత ఔననిపిస్తారు. తరం అంతరం గదా!

శ్యాంసుందర్, తన సహాధ్యాయులతో కలిసి ప్రాక్టీస్ ప్రారంభించాడు. మంచి ఉద్యోగమే వస్తుంది. తనకు సొంతంగా ప్రాక్టీసు చేయాలని. ప్రాక్టీస్ నిలదొక్కుకోడానికి టైం పడుతుంది. క్లయింట్స్ దొరకాలి. మంచికంపెనీలు దొరకాలి. మంచిపేరు రావాలి. ప్రొఫెషన్స్‌లో శక్తిసామర్థ్యాలకు అదృష్టం తోడుకావాలి. డాక్టర్లు, లాయర్లు, ఆడిటర్స్ ఈ మూడువృత్తులు విచిత్రమైనవి. ఎవరిని అదృష్టం వరిస్తుందో చెప్పలేం. ఓర్పు, సహనం చాలా కావాలి. మా శ్యాం సుందర్‌కు ఆ రెండు పుష్కలంగా ఉన్నాయి.

ఇప్పటికే చాలా ఆలస్యమైంది. పెళ్లి చేద్దామనుకుంటే చదువు పూర్తి అయితే తప్ప చేసుకోనన్నాడు.ఇప్పుడు ప్రయత్నం చేయాలి. సి.ఎ. పాసైన కుర్రాడికి సంబంధాలు రావడం కష్టం కాదు. మా వాళ్లలో సి.ఎ. అంటే ఏమిటో తెలిసినవాళ్లు తక్కువ. విద్యావంతులకు తప్ప చదువుల విలువ తెలియదు. బాగా చదువుకున్నవారికి పెద్ద చదువుల గురించి తెలుస్తుంది. హైదరాబాదులోనే ఒక సంబంధం కుదిరింది. అమ్మాయి ఎం.ఎ. పేరు అనూరాధ. తండ్రి రిటైర్డ్ ఇంజనీరు. అన్నగార్లు బాగాచదువుకున్నవారు. ఒకరు దుబాయ్‌లో ఇంజనీరు, ఒకరు ఇక్కడే కాన్సర్ స్పెషలిస్టు. ఒకరు యానిమల్ హజ్బెండ్రీ, మరొకరు ఎలక్ట్రానిక్స్. అందరిలోకి చిన్నపిల్ల ఈమె. సంబంధం వెంటనే కుదిరింది. పెళ్లి జరిగింది 87లో.

ఆ సంవత్సరం డిసెంబరులో మా అమ్మాయి పద్మప్రియకు మగపిల్లవాడు కలిగాడు. ప్రణవ్. అప్పటికి వసంతకుమార్‌కి ఒక అమ్మాయి, పేరు ప్రత్యూష. శ్యాం సుందర్ వివాహం తర్వాత ఇంటికి నిండుదనం వచ్చింది. ముగ్గురు పిల్లల పెళ్లిళ్లు అయ్యాయి. రమణ పెళ్లి ఒక్కటి మిగిలి ఉంది. అది ఒక్కటి అయితే నా బాధ్యత తీరిపోతుంది.

0 0 0

శ్రావణమేఘాల్లా రిటైర్‌మెంటు ఆలోచనలు భయపెట్టసాగాయి. వద్దన్నా ఆగదు. భయపడినా ఆగదు. తర్వాత ఏమిటన్న ప్రశ్న. ప్రెస్ బాగాసాగుతోంది. దానిపై సంపాదన వసంత కుటుంబానికి సరిపోతుంది. చూడడానికి గొప్పగా కనిపించినా, ప్రెస్ నిర్వహణ, బాధలు ప్రెస్‌వారికే తెలుస్తాయి. బాధ్యతలు జాస్తి. బాధలు ఎక్కువ. లాభాలు తక్కువ. వర్కర్లతో సమస్యలు. అందులో భాగం పంచుకోడానికి నాకు

మనస్కరించలేదు. శ్యాం సుందర్ ఇప్పుడు ప్రాక్టీసు మొదలుపెట్టాడు. తనకు నేను బరువు కాకూడదు. కన్నవారిలో తల్లిదండ్రుల పోషణ బాధ్యత ముందు పెద్దవాడిది. ఈ లెక్కలు వేయడం నాకు ఇష్టం లేదు. వీలైనంతవరకు స్వతంత్రంగా బ్రతకాలనీ, పిల్లలపైన ఆధారపడకూడదని నిర్ణయించుకున్నాను. మాస్టరుగారు ఏదో ఒక మార్గం చూపిస్తారని గట్టి నమ్మకం. తన సాధకుల్ని మాస్టరుగారు వదలిపెట్టరు. నాకు తెలిసినంతలో యోగసాధకులు ఎవరూ ఆర్థికంగా చితికిపోయి, అవస్థలు పడ్డవారు లేరు. పైగా మరొక ధీమా నాకు, ఇన్ని పత్రికలు వస్తున్నాయి. ఎందులో నైనా చేరవచ్చు. రెండువేలు ఇవ్వక పోతారా అని.

ప్రభ దినపత్రికలో సినిమా ఎడిటర్‌గా వున్న నేను ఎప్పుడూ స్టూడియోలకు వెళ్లింది లేదు. హైదరాబాదు వచ్చిన కొత్తలో ఒకసారి అన్నపూర్ణ స్టూడియోస్‌కి వెళ్లాను. అదీ శ్రీ అక్కినేని నాగేశ్వర రావుగారు తన చిత్రంలో ప్రెస్ మీట్ వున్నదనీ, ఆ షూటింగ్‌కు అసలు జర్నలిస్టులను  ఆహ్వానించారు ఆ సినిమాలో నటించడానికి, నటనకాదు. నాగేశ్వరరావుగారి సినిమా కోసం ఏర్పాటుచేసిన పత్రికా సమావేశంలో ఒక జర్నలిస్టుగా కెమెరా ముందు జీవించడానికి వెళ్లాను. మరోసారి రామానాయుడుగారి స్టూడియో చూడడానికి పిలిస్తే వెళ్లాను. ఆ రోజు వెంకటేశ్‌తో పరిచయం అయింది. దాసరి నారాయణ రావు డైరెక్టరు. మద్రాసులో నా నాటకాల రిహార్సల్స్‌కు వచ్చేవారు. జర్నలిస్టుగా నాకు పరిచయం.

"రిటైర్ అవుతున్నారట! తర్వాత ఏం చేస్తారు! సినిమా రచయిత అవుతారా" అని అడిగారు.

"నేను సినిమా రచనకు పనికిరాను నారాయణరావుగారూ"

"పోనీ మా ఉదయంలో చేరతారా! స్వాగతం... మీవంటి సీనియర్ జర్నలిస్టు మాకు అవసరం. ప్రభలో రిటైర్ కాగానే ఉదయానికి వచ్చేయండి. ఓపెన్ ఆఫర్" అన్నారు. ఆ మాట కొండంత బలాన్నిచ్చింది.

రిటైర్మెంట్ జ్వరం కాస్త తగ్గి, నార్మల్‌కి వచ్చింది.

0 0 0

తిరుపతిలో ఒకసారి యోగసమావేశం జరపాలన్న సంకల్పం మా రమణది. తిరుపతిలో శ్రీనివాసాచారిగారు సమావేశాలు జరుపుతుంటారు. లోగడ ఒకసారి వెళ్లాను. రమణ తను డాన్సుకోసం తీసుకున్న హాలు పెద్దది. అక్కడ సమావేశం జరపవచ్చునని చెప్పాడు. తనకోసం నేను 'కామాయని' నృత్యనాటకం రాసి యిచ్చాను. దానిని ప్రాక్టీసు చేయించాడు. డిసెంబరు 31న, యూనివర్సిటీలో శ్రీనివాస ఆడిటోరియంలో ప్రదర్శన

ఏర్పాటు చేశాడు. వైస్‌చాన్స్‌లర్, డి.ఎస్.పి. రావులపాటి సీతారామారావు, జిల్లా కలెక్టరు జె.ఎస్.శర్మలను ఆహ్వానించాడు. సందర్భం కదా అని డిసెంబరు సమావేశాలు తిరుపతిలో ఏర్పాటు చేశాను. ఏది ఎందుకు జరుగుతుందో చెప్పలేం. మాస్టరుగారి సంకల్పం ఏమిటో! సాధకుల కోసం టి.టి.డి వారి సత్రంలో గదులు బుక్ చేశాం.

0 0 0 0

డిసెంబరు 29, 30, 31 సమావేశాలు. 31 రాత్రి నృత్యనాటిక ప్రదర్శన. హైదరాబాదు నుండి కృష్ణమూర్తిగారు, బి.ఎస్.కృష్ణారావు, చిత్ర, మేము బయలుదేరాం. సాధకులందరూ వచ్చారు. సమావేశం అంటేచాలు అంతా వచ్చేస్తారు. ఎగనామం పెట్టడం అప్పట్లో నేర్చుకోలేదు. కాస్త సీనియారిటీ వచ్చిన తర్వాత అలాంటి తెలివితేటలు అబ్బుతాయి. అలక్ష్యం ఏర్పడుతుంది. అహం అనముగాని స్వతంత్రం ఎక్కువై ఇంక నాకేమిటి? అన్న ఆలోచన కలుగుతుంది. అప్పుడు అలా కాదు. అందరూ వచ్చారు. కొందరు లాడ్జీలలో దిగారు. కొందరు ధర్మసత్రాలలో దిగారు. డా.పద్మావతమ్మ, వరలక్ష్మి, నేను, రమణ డాన్సుహాలులో మకాం. యామినీదేవిఆ సమావేశాలకు వచ్చిన జ్ఞాపకం లేదు. భోజనాలకు ఇబ్బందిపడ్డా, సమావేశాలు బాగా జరిగాయి.

మా రమణకు తిరుపతి అంటే మొదటినుండి మోజు. యూనివర్సిటీలో ఎం.ఎస్‌సి. పిహెచ్.డి చేశానని కాదుగానీ తన కళాతపస్సు అక్కడే బాగా సాగిందని. చాలామంది విద్యార్థినులు చేరడం, అనేక ప్రోగ్రామ్స్ యివ్వడం డాన్సు మాస్టరుగా గుర్తింపు పొందడం జరిగింది అక్కడ. అందువల్ల తిరుపతి ఒక కళాక్షేత్రంగా మార్చాలను కున్నాడు. అక్కడే ఒక స్థలంకొని, ఆడిటోరియం కట్టాలని ఆలోచన. ఆర్థిక వనరులు లేవు. ఎవరిస్తారు లక్షలు చందాలు? బైరాగిపట్టెడ ప్రాంతంలో ఒక స్థలం కొనాలని నిర్ణయించుకుని అడ్వాన్సు యిచ్చాడు. డిసెంబరు 31 ఉదయం ఆ స్థలం చూడడానికి వెళ్లాం. ఊరికి చాలాదూరంగా, పొలాలలో వుంది. డాన్సు స్కూలుపెట్టినా అక్కడికి పిల్లలు రారు. రోడ్డు లేదు, బస్సులు రావు, ఆ స్థలం నచ్చలేదు ఎవరికి. తిరిగి వస్తుండగా, నాకు కళ్లు తిరిగి పడిపోయినట్లయింది. విపరీతంగా తలపోటు. ఎలాగో ఊళ్లోకి వచ్చాం. మిత్రులు చాలామంది సత్రాలకు వెళ్లిపోయారు. డాన్సుహాలులోకి రాగానే నేను పడిపోయాను. తలపోటు విపరీతంగా వచ్చింది. శరీరం చెమట పట్టింది. మూలుగు, స్పృహ లేదు. ప్రక్కన కృష్ణమూర్తి, పద్మావతమ్మ, వరలక్ష్మి, చిత్ర, కృష్ణారావుగారు ఉన్నారు.

డాక్టర్ పద్మావతమ్మ ఏవేవో మందులు తెప్పించి వేశారు. వరలక్ష్మి చాలా సేవ చేసింది. అందరూ భయపడ్డారు. సత్రానికి కబురు చేస్తామంటే వద్దని చెప్పాను. ఎవరు

వచ్చి చేసేది ఏముంది? డాక్టరు అవసరం గాని, పరామర్శించేవారు కాదు అప్పుడు కావలసింది. రమణ తన ప్రోగ్రాం హడావిడిలో వుండి, అప్పుడప్పుడు వచ్చి చూచి వెళ్లేవాడు.

సాయంత్రం మూడు గంటలకు స్పృహ వచ్చింది. అప్పుడు పద్మావతమ్మ, వరలక్ష్మి, నేను హోటలుకు భోజనానికి వెళ్లాం. నాకు తినబుద్ధి కాలేదు. కాఫీతాగి వచ్చేశాను. సాయంత్రం ప్రేయరుకు అంతా వచ్చారు. జరిగింది తెలుసుకుని బాధపడ్డారు. అందరం డాన్సు ప్రోగ్రాంకు వెళ్లాం. నేను రాసిన 'కామాయని' ప్రదర్శన.

తిరుపతిలో సెటిల్ కావాలని, అక్కడొక యోగకేంద్రం నెలకొల్పాలన్న ఆలోచన నాకెప్పుడూ లేదు. ఏనాడు అక్కడ ఉద్యోగం చేసింది లేదు. అక్కడ చెప్పుకోదగ్గ మిత్రులు లేరు. ఉదయం బైరాగిపట్టెడ ప్రాంతంలో స్థలం చూచి వస్తున్నప్పుడు నాలో కలిగిన వికారం సామాన్యమైంది కాదు. మృత్యువు ఆ రూపంలో వచ్చింది. మాస్టరు యోగశక్తి నన్ను రక్షించింది. అంతవరకు నాకు అర్థం అయింది. కేవలం రమణకోసం, అతని చదువు పూర్తికావడంకోసం, అతని భవిష్యత్ భద్రతకోసం తిరుపతిలో ఉండవలసి వచ్చింది. తనకు, తన కళాపోషణకు ఒక స్థలం, ఒక హాలు కావాలని అతని పట్టుదల. నా కంత శక్తి లేదు. తను వినడు. తన పట్టు సడలించడు. మర్నాడు ఉదయం మున్సిపల్ ఇంజనీరు శాస్త్రిగారు బైపాస్‌రోడ్డుమీద తనకొక స్థలం వున్నదని, స్కూటర్‌పైన తీసుకువెళ్లి చూపించారు. ఆయన శ్రీమతి సరస్వతి, రమణ డాన్సుకు వయొలినిస్టు, పద్మావతీ కళాశాలలో సంగీతం టీచర్. అప్పటికి బైపాస్‌రోడ్డు లేదు. బురదలో, మట్టిరోడ్డుపైన అవస్థపడి వెళ్లాం. ఆ స్థలం బావుందనిపించింది. దానిని అమ్మడానికి సరస్వతి వప్పుకుంటుందో లేదోనని ఆయన సందేహం. యోగమిత్రులు పదిమందికి చూపించాను. అందరికీ నచ్చింది. ఊరికి మరీ దూరం కాదు. ఒక కిలోమీటర్‌పైగా అటు బైపాస్‌రోడ్డు వేస్తున్నారు. కొండపైకి బస్సులు అటే నడుస్తాయిట.

ఆ రోజు శాస్త్రిగారు భోజనానికి పిలిచారు. భోజనం చేస్తూ సరస్వతిగారికి చెప్పాను. "అమ్మా బైపాస్‌రోడ్డు ప్రక్క స్థలం నాకు కావాలి. మీరు ఏం చేస్తారో నాకు తెలియదు" అన్నాను.

ఆమె నవ్వి ఊరుకుంది.

నాకు శకునాలపై నమ్మకం లేదు కాని మాస్టర్‌గారిచ్చే సిగ్నల్స్ అనుసరిస్తాను. అది సెంటిమెంటల్ కావచ్చు. నాకు తెలిసింది అంతవరకు. రిటైర్ అయినప్పుడు వచ్చే లక్ష రూపాయలతో ఒక ఇల్లు ఏర్పరచుకోవాలి ఎంత చిన్నదైనాసరే.

హైదరాబాదు వచ్చేసిన మూడు మాసాలలో ఆ స్థలం నా పేర రిజిస్టరైన డాక్యుమెంట్లు వచ్చాయి. వారాస్థలం నాకు అమ్మదలచారు. స్వంతఖర్చుతో రిజిస్టర్ చేసి

పంపారు. డబ్బు వచ్చినప్పుడే యివ్వండి ఫరవాలేదు అన్నారు. అలా జరిగింది తిరుపతి ఇంటి వ్యవహారం. వచ్చే లక్ష ఇంటిమీదపెడితే తర్వాత ఎలా గడుస్తుందన్న ప్రశ్న ఉండనే వుంది! తిరుపతిలోనే ఏదైనా ఉద్యోగం సంపాదించవచ్చు. ఈనాడు, జ్యోతి,ఉదయం పత్రికలు వున్నాయి. లేదా ఎక్స్‌ప్రెస్ రిపోర్టరుగా చేరవచ్చు. అడిగితే ఎవరైనా చిన్న ఉద్యోగం ఇవ్వకపోరని నమ్మకం. ఎవరూ ఇవ్వలేదు.

0 0 0

ఇక్కడ మరొక బలమైన సంఘటన నన్ను లొంగదీసింది. పైన చెప్పిన స్థలం చూడడం వగైరా అయినతర్వాత, మిత్రులంతా వెళ్లిపోయారు. మేం మరో నాలుగురోజులు అక్కడే వున్నాం. కె. కృష్ణమూర్తిగారు, డా.పద్మావతమ్మ నాకు తోడుగా వున్నారు. మేం ముగ్గురం ఆ ఉదయం ఏవో కబుర్లు చెప్పుకుంటుండగా ఒక కోయదొర ఒక ఉత్తరం చేతపట్టుకుని 'మాస్టరు రమణగారు' కావాలని వచ్చాడు. అలా కోయదొరలు రావడం సహజమే. తెనాలిలో కోయదొరలు వచ్చి నావద్ద రేఖాశాస్త్ర రహస్యాలు చెప్పించుకు వెళ్లేవారు. హైదరాబాదులోను కోయదొరలు ఆఫీసులకు వస్తుండేవారు. ఇతను ఆ ఊళ్లోనే విశ్వంగారి నుండి ఉత్తరం తెచ్చాడు. విశ్వం అంటే గుడిపాటి వెంకటచలంగారి బంధువు. అతనికి మా రమణకుస్నేహం. ఇతను బాగా జ్యోతిషం చెబుతాడని రికమెండేషన్ లెటర్ రాశాడు.

రమణ ఆ ఉత్తరం చదివి తనకు అలాంటి జ్యోతిషాలపైన నమ్మకం లేదు పొమ్మన్నాడు. నేను అతనిని పోనీయలేదు. ప్రొద్దుటే వచ్చాడు. పైగా ఒక స్నేహితుడు ఉత్తరం రాసి పంపాడు. అతనికి బాగా తృప్తి లేకపోతే ఎందుకు పంపుతాడు? కాదంటే పది రూపాయలు ఖర్చు. కోయదొరలు ముందు డబ్బు అవసరం లేదని చెప్పి తర్వాత తావీదులనీ, వేళ్లని వందలు గుంజుతారని మా వాడి భయం. అతనిని కూర్చోబెట్టి రమణకు చెప్పమన్నాను. మా అబ్బాయి అనీ తెలియదు అతనికి.

అత్యద్భుతమైన ఫలితాలు చెప్పాడు. ఆనాటినుండి ఏడాదిలోగా ఇల్లు కడతామన్నాడు. మళ్లీ జనవరి నాటికి గృహప్రవేశం జరుగుతుందన్నాడు. రమణ పిహెచ్.డి చేసి ఫారిన్ వెళతాడని చెప్పాడు. నృత్యం మానివేస్తాడన్నాడు. ఇల్లు కట్టిన తర్వాతనే తనకు పెళ్లి అవుతుందని చెప్పాడు. మా మధ్య చాలాసేపు చర్చ జరిగింది గానీ ముఖ్యమైన విషయాలివి. గృహప్రవేశానికి తాను వస్తానని, అప్పుడు నూటపదహార్లు యివ్వాలని అడిగాడు. ఇల్లే కట్టుకోవాలి గానీ నూటపదహార్లు కష్టం కాదు! మా మిగిలిన పిల్లల గురించి అడిగాను. వసంత, శ్యాం, పద్మ... అందరి గురించి మంచి విషయాలు చెప్పాడు.

అతనికి కాఫీ, టిఫిన్ తెప్పించి పెట్టాం.

"ఇన్ని అడిగింద్రు దొర, నీ గురించి అడగలేదు" అన్నాడు.

"నా గురించి అనవసరం... నాకు తెలుసుకోవాలని లేదు బాబూ" అన్నాను.

అతను కొంచెంసేపు కళ్లు మూసుకుని ధ్యానం చేసి...

"దొరా! నీ పాదాలకు ఒక్కసారి దండం ఎట్టుకోనా" అన్నాడు.

"ఎందుకు?"

"నువ్వు మామూలు మడిసివి కావు దొరా, దేవుడివి. మా కొండదేవర సెబుతుండు దొరా, నువ్వు గొప్ప సామివి. దేవుడివి. మా గూడేనికి రా దొరా, పులిచర్మం యేసి, మా కొండదొర సరసన కూకోబెట్టి కొలుచుకుంటాం. జాతర చేస్తాం."

"పులిచర్మం వేయడం ఎందుకు?"

"గూడెం ఆచారం." నలభై గూడేలు కలిసి జాతర చేస్తారుట. ఎత్తయిన దిబ్బమీద పులిచర్మం వేసి కూర్చోబెట్టి, నృత్యగానాలతో గౌరవిస్తారుట. అది వారి ఆచారం. నాకు చాలా మంత్రశక్తులు వున్నాయని, మహాఋషినని, భగవంతుని అంశ అని, పారవశ్యంతో చెప్పాడు. డబ్బులు ఇవ్వబోగా తీసుకోనన్నాడు. నా వద్ద డబ్బుతీసుకోవడం అపచారంట. అయినా ఇచ్చి పంపాము.

అలా చెప్పి వెళ్లిపోయే కోయదొరల జ్యోతిషాలు నమ్మం. అప్పటికి నమ్మినా జ్ఞాపకం పెట్టుకోము. జ్యోతిషాలు చెప్పించుకునేవారి బలహీనత అది. ఆ సమయంలో అనేక విషయాలు అడిగి తెలుసుకుంటారు. ఒక్కరోజులో అన్నీ మరచిపోతారు. ముఖ్యమైన విషయాలు ఒకటి రెండు జ్ఞాపకం పెట్టుకుంటారు. ఇక్కడ కోయదొర చెప్పినవన్నీ తు.చ. తప్పక జరిగాయి. ఊహించని రీతిలో, డబ్బు పంపకుండానే స్థలం నా పేర రిజిస్టర్ అయింది. ఆగస్టులో శంకుస్థాపన జరిగింది. జనవరి నాటికి ఇల్లు పూర్తి అయింది.

చాలా సంవత్సరాల క్రితం సాయిభక్తుడు చెప్పిన విషయాలు ఈ కోయదొర చెప్పిన విషయాలు చాలవరకు ఒక్కటైనాయి. ఒక దివ్యశక్తి ఏదో నన్ను నడిపిస్తున్నది. కనుక నా జీవితం నేను కోరినట్లు జరగదు. ఇంతకాలం నా కోసం జీవించాను. భార్యాబిడ్డల కోసం సంపాదించాను. ఖర్చుచేశాను. అంతే కాదు జీవితం అంటే. నా జీవితానికి మరేదో లక్ష్యం వున్నది. నన్ను నడిపించే శక్తులు వేరే ఉన్నాయి. అవి నా కోసం ప్రతీక్షిస్తున్నాయి. ఏదో దైవకార్యం నా వల్ల కావలసి వుంది. నేను ఎప్పుడు ఈ సంసారం, సంపాదన బాధ్యతల నుండి తప్పుకుని విముక్తుడినవుతానా అని, ఆశక్తులు ఎదురు చూస్తున్నాయనిపిస్తుంది. ఆ మహత్తరమైన ఆధ్యాత్మికకృషికి నాయోగం ఒక రాచబాట అయి ఉండవచ్చు. ఈ మార్గంలోనే నాకు దివ్య శక్తులు నిర్దేశించిన పనికి పూనుకోవాలి. శేషజీవితాన్ని యోగానికి, యోగకార్యక్రమానికి అంకితం చేసుకోవాలి.

# 1988

## సద్యోగం దిశగా.....

**జీవితం చిత్రమైన మలుపులు తిరుగుతుంది.**

మనం ఊహించం అలా జరుగుతుందని, జరగడానికి అవకాశం ఉందని. అలా అనూహ్యమైన మలుపులు తిరిగితేనే జీవితంలో థ్రిల్. ఎత్తుపల్లాలుండాలి. ఎదురుదెబ్బలు తినాలి. అవి అనుభవాలుగా మారాలి. అప్పుడే మనిషి రాటు తేలతాడు. తన గమ్యాన్ని అనుభవాల శిఖరాలపై నుండి లక్షిస్తాడు. నేను అతిపేదకుటుంబంలో, అతి సామాన్యుల ఇంట పుట్టాను. నాలుగు అక్షరమ్ముక్కలు నేర్చితే చాలు ఆ రోజుల్లో. పై చదువులు చదవడమే ఒక మిరకిల్. కాలేజీ ఉద్యోగం రెండవమలుపు. జర్నలిజంలో చేరడం మూడవమలుపు. స్వంతంగా పత్రికలు నడపడం, పుస్తకాలురాయడం నాల్గవ మలుపు. యోగంలో ప్రవేశించడం అయిదవ మలుపు. ఇప్పటికి మిగిలింది పుస్తకరచన, యోగసాధన.

ఈ సంవత్సరం జులైలో ఉద్యోగవిరమణ తప్పదు. మళ్లీ ఉద్యోగం యిస్తారన్న నమ్మకం లేదు. అనుభవం ఉన్నవారు సీనియర్స్ అప్రయోజకులైనట్లు ఎడిటర్స్ యువకుల్ని ప్రోత్సహించాలనుకుంటున్నారు. తాము మాత్రం ఎంత ముసలితనం వచ్చినా అప్రయోజకులైనా ఎడిటర్స్‌గా కొనసాగే రాజకీయం చేస్తున్నారు. ఒక్క ఎడిటర్ తప్ప మిగిలిన వారంతా యువతీయువకులే కావాలి. కనుక రిటైరైన సీనియర్ జర్నలిస్టులకు ఎక్కడా పనులు దొరకవు. జర్నలిస్టులు మరోపనిచేయలేరు. ఇంతకాలం పత్రికారచనతో దేశాన్ని సంస్కరించామని కలలుకంటుంటారు. ఇంతో అంతో రచనానుభవం, రచనపట్ల ఆసక్తి ఉన్నవారే పత్రికల్లో తలదూర్చుతారు. నార్లగారి హయాంలో మంచికవులు, పండితులు, రచయితలు జర్నలిస్టులైనారు. లేకుంటే శ్రీశ్రీ, బోయిభీమన్న, విద్వాన్‌విశ్వం, తిరుమల రామచంద్ర, తెన్నేటి సూరి, నండూరి రామమోహనరావు లాంటివారు పత్రికలకు వచ్చేవారా! మాతరంలోనూ, ఆంధ్రప్రభలో వేటూరి సుందరరామమూర్తి, గొల్లపూడి మారుతీరావు, నేను, బెల్లంకొండ రామదాసు, అవసరాల సూర్యారావు, రెంటాల గోపాలకృష్ణ, జొన్నలగడ్డ రాధాకృష్ణ, తిరుమల రామచంద్ర, పిలకా గణపతిశాస్త్రి ... ఇలాగ ఎందరో రచయితలు, దేవీప్రియ, నిజం, అజంతాలాంటి కవులు, నండూరి పార్థసారథి వంటి హాస్యరచయితలు ప్రభలో నాతో పనిచేశారు. పత్రికలలో ఉద్యోగంలో చేరాక, ఆయా రచయితలకు రచనావకాశం ఉండదు. ఏ పత్రికకు రాయకూడదని

నిబంధన. పనిచేస్తున్న పత్రికలో వేయరు. బయటివారిని ప్రోత్సాహించాలన్న ఆశయం ఒకటి. దానాదీనా, పత్రికలలో ఉద్యోగం చేస్తూ తమ రచనాప్రతిభను పెంచుకుందా మనుకునే కలం జీవులకు నిరాశ ఎదురువుతుంది. దాదాపు 'క్రియేషన్' మరచిపోతారు. వార్తలు, ఫీచర్స్ వండడం, వడ్డించడంతోనే తమ సాహితీవ్యసనం పరిమితం చేసుకోకతప్పదు. అంటే మంచిరచయితలకు, కవులకు పత్రికల్లో ఉద్యోగం ఆత్మహత్యాసదృశం.

ఆ ఊబిలోంచి బయటపడి అడపాదడపా ఏ రేడియోవారికోసమో కలం విదిలించడం తప్ప సీరియస్ రచన చేయడానికి తీరుబడి ఉండదు. ఆసక్తి ఏనాడో చచ్చిపోతుంది. ప్రోత్సాహం అసలు ఉండదనే చెప్పవచ్చు. నా వరకు నాకూ ఈ ప్రతిబంధకాలు కలగలేదని చెప్పను. అడపాదడపా అన్ని పత్రికలకు రాస్తుండేవాడిని. వీక్లీలో పనిచేసినంత కాలం యువ, స్వాతి, జయశ్రీ లాంటి మాసపత్రికలకు, డెయిలీలో పనిచేస్తున్నప్పుడు అన్నివీకీలకు, మంత్లీలకు రాసేవాడిని కనుక రచయితగా నా సమాధి నేను కట్టుకోలేదు. చివరివరకు నా రచనలు ప్రచురించబడేవి కనుక రచయితగా రెన్యూవల్ జరుగుతూ వచ్చింది. అది నా సొంత పుస్తకాలకు పనికి వచ్చింది. రచయిత, కవి అయినవాడు నిరంతరంగా రాస్తుంటాలి. కొన్నాళ్లు విశ్రాంతి తీసుకుంటే రచనాపాటవం తగ్గిపోతుంది. శైలి కుంటుపడుతుంది. ఆకర్షణ తగ్గుతుంది.

మనదేశంలో రచన ప్రవృత్తే కానీ వృత్తికాదు. కేవలం కథలు, నవలలు, నాటికలు, కవిత్వాలు రాసి డబ్బు సంపాదించి బ్రతికే అవకాశం లేదు. అది ఔత్సాహిక ప్రక్రియ. కళలన్నీ అంతే. కళాకారులందరూ ఆ యా కళలపైన జీవించడం జరగదు. వృత్తినాటకాలవారు, సినిమాలవారు కళను వృత్తిగా చేసుకున్నారు. వారి విషయం వేరు. నాట్యకారులు, నటీనటులు, సంగీతకారులు... నూటికి ఒకరిద్దరికి 'కళ' జీవనం అవు తుంది. పూర్తి తృప్తినిస్తుంది. మిగిలినవారు కలలు కనవలసిందే. రచయితల స్థితీ అంతే.

యోగం జీవనోపాధి కాదు. సన్యాసం ఇంకా గొప్పవృత్తి. ధనసంపాదనకు సన్యాసం బెస్టు. ఒక మఠం సృష్టించుకుని పీఠం పెట్టుకుంటే శిష్యులకు, సంపాదనకూ కొదవుండదు. రాజకీయనాయకులు, మహారాజపోషకులవుతారు. మంత్రుల నుండి రాష్ట్రపతివరకు వంగివంగి దణ్ణాలు పెడతారు. పాదాభివందనాలు చేస్తుంటారు. కనుక కాషాయబట్టలు కట్టి, గడ్డాలు పెంచితే, రాజకీయ నాయకుల వలె విలాసజీవితం గడపవచ్చు. కార్లలో, విమానాలలో తిరగవచ్చు. ఆత్మవంచన చేసుకోగలిగితే ఎన్ని మోసాలైనా చేయవచ్చు.

నేను చేస్తున్న యోగం నాకా సంస్కారం ఇవ్వలేదు. నిజాయితీగా బ్రతకటం నేర్పింది. సత్యసంధత నేర్పింది. నన్ను నేను మోసం చేసుకున్ననాడు ఇతరులను మోసం

చేయగలను. యోగంలో చేరేవారి సంఖ్య చాలా పరిమితంగా వుంటుంది. ఆసక్తి ఉన్నా అందరూ సాధన వరకు రారు. ఆ రోజుల్లో మాస్టరుగారి వద్ద పది పన్నెండు సంవత్సరాల వ్యవధిలో చేరినవారు వేయిలోపు. డైరెక్టు సాధకులు 750 మంది. అంటే సరాసరి సంవత్సరంలో 75మంది మాత్రమే చేరారు. మాస్టర్ ఎం.ఎన్.గారి వద్ద 450మంది చేరారని దాసుగారు చెప్పేవారు. నా వద్ద, సుమారు ఏడాదికి నూరుమందిలోపే యోగంలో చేరుతున్నారు. ఆ సంఖ్య ఎందువల్లనో పెరగడంలేదు. ఏదైనా అంతా మాస్టరుగారి మాస్టర్‌ప్లాను.

మే, డిసెంబరు సమావేశాలు తప్పక జరపడం అలవాటైంది. ఒక్కొక్క సమావేశానికి రెండువందలమంది వరకు వచ్చేవారు. నా వద్ద చేరినవారికే సమావేశం పరిమితం కాదు. యోగం చేస్తున్నవారు ఎవరైనా రావచ్చు. సమావేశాలు మూడురోజులు ఒక పద్ధతిగా కోర్సులు చేయించేవాడిని. మాస్టర్‌ఎం.ఎన్.గారి తర్వాత ఇంత రెగ్యులర్‌గా సమావేశాలు జరిపినవారు లేరు. పిడుగురాళ్ల, విజయవాడ, గుంటూరులో సమావేశాలు మాస్టర్‌గారి జన్మదినోత్సవం సందర్భంగా జరిగేవి. మాస్టర్ ఎం.ఎన్.గారి బర్త్‌డే కలిసి వచ్చేది. అలాగే తిరుపతిలో మాస్టర్‌గారి బర్త్‌డే శ్రీ వేటూరివారి బర్త్‌డే కలిపిచేస్తారు. మే, డిసెంబరు సమావేశాలు జరుపుతున్నది మేమే. ఈ సమావేశాలు జరిపే హక్కు, అధికారం ఎవరికీ లేవని కొందరు సీనియర్ సాధకులు సన్నాయినొక్కులు నొక్కినా నేను పట్టించుకోలేదు. ఇక్కడ హక్కు, అధికారం కన్న అవసరం గొప్పది. కోర్సులు చేయించే శక్తి గొప్పది. మాస్టర్‌గారు నాలో ఆ ఉత్సాహం కలిగించారు. నా మిత్రులు ప్రోత్సహించారు, సహకరించారు. వచ్చేవారిని రావద్దని చెప్పలేను కదా! ఎవరినీ నేనుగా ఆహ్వానించేది లేదు. ఇష్టమైన వారు వస్తున్నారు. అభిరుచి గలవారు, అవకాశం ఉన్నవారు సాధన చేస్తారు. నా దగ్గరకు ట్రీట్‌మెంట్‌కోసం వచ్చేవారు ఎక్కువ. డాక్టరు సుబ్రహ్మణ్యంగారి దయవల్ల ప్లానెటరీ కోర్సులు కొన్ని నా చేతికి అందాయి. కోర్సుల పుస్తకం మా మెంబర్ల కోసం ఒకటి ప్రింట్ చేయించాను. పత్రిక పడుతూ లేస్తూ నడుస్తోంది. 'యోగదర్శని' పేరు మారింది. "మాస్టర్ సి.వి.వి. యోగమార్గం"గా డిక్లరేషన్ వచ్చింది. సావిత్రి తొమ్మిది భాగాలు పూర్తిచేశాను. యోగం ఒక మలుపు తిరిగింది.

ఒక సమావేశానికి ఫోటోలు తీస్తానని మా ఆఫీసు ఫ్రెండ్ అమరేశ్వరరావు వస్తానన్నాడు. 'అమర్‌మోహన్' పేరుతో రచనలు చేసేవారు. అమరేశ్వరరావు, సూర్యదేవర రామ్మోహనరావు ఫోటోలు తీయడానికి వచ్చారు కాని వస్తామన్న టైంకు రాలేదు. ఆలస్యంగా వచ్చారు. అప్పటికి నేను ఎవరికో ట్రీట్‌మెంట్ చేస్తున్నాను. ట్రీట్‌మెంట్ సమయంలో నేను ఒక విధమైన సమాధికి వెళ్లిపోతాను. పేషెంట్ స్పృహలో ఉండరు.

ఇద్దరి భౌతికశరీరాలు బయటివారికి కనిపిస్తున్నా అవి పనిచేసేది యాస్ట్రల్ స్థాయిలో. అతను ఫోటోలు తీశాడు. నాలుగుసార్లు 'క్లిక్'మనిపించాడు. ట్రీట్‌మెంట్ చిత్రంగా ఉందనిపించిందిట. రీల్ మొత్తం తర్వాత పూర్తిచేశాడు. మొదటతీసిన నాలుగు ఫోటోలలో నా బొమ్మ, పేషెంట్ బొమ్మ మంచుముద్దల్లాగా వచ్చాయి. బ్యాక్‌గ్రౌండ్‌లో వున్నవారంతా చక్కగా పడ్డారు. మేం ఇద్దరం, తెల్లగా, దయ్యాల్లా పడ్డాం. అమర్ ఆశ్చర్యపోయాడు. చెప్పాను: "ఆ సమయంలో మావి యాస్ట్రల్ శరీరాలు. నీ కెమెరా లెన్స్ యాస్ట్రల్ రూపాల్ని బంధించలేదు. అందుకే దయ్యాలు, భూతాలు ఫోటోలకు చిక్కవు."

ఆ తర్వాత ముందుగా పర్మిషన్ తీసుకుంటేతప్ప, ట్రీట్‌మెంట్ సమయంలో ఎవరూ ఫోటోలు తీసేవారు కాదు.

0 0 0

కోయంబత్తూరు ఈరోడ్‌ల నుండి నలుగురు రైల్వే ఉద్యోగులు వచ్చారు యోగంలో చేరతామని. వాళ్లు కుంభకోణం వెళ్లారుట. యోగాస్కూలులో మాస్టరుగారిని గురించి అడిగితే, ఎవరూ ఏమీ చెప్పలేదు. యోగంలో చేరతామంటే "ఇక్కడ ఇనీసియేట్ చేసేవారు ఎవరూ లేరు. హైదరాబాదు వెళ్లండి, శార్వరిగారు ఇనీసియేట్ చేస్తారని" పంపారు. కుంభకోణంలో మాస్టరుగారింట్లో యోగాస్కూలులో మాస్టర్‌యోగం గురించి చెప్పకపోవడం నాకు చాలాబాధ అనిపించింది. అప్పటికి నేను కుంభకోణం వెళ్లలేదు, ఎంతోకాలంగా యోగంచేస్తున్నా.

0 0 0

మాస్టరుగారి ప్రేరణ ఒక్కొక్కరిలో ఒక్కోరకంగా కలుగుతుంది. ఒకాయన వచ్చారు. ఆయనకు మాస్టరుగారు కలలో కనిపించి నా పేరు, అడ్రస్ చెప్పి వెళ్లమన్నారుట. అతనికి అంతవరకు నా పేరు తెలియదు. పిఅండ్‌టి కాలనీ అంటే బస్సులో ఎవరో ఇక్కడకు దగ్గరేనని దిల్‌షుక్‌నగర్ బస్టాప్‌లో దిగమన్నారుట. ఆ పెద్దమనిషి అక్కడ ఎంక్వయిరీ చేసి. ఆ సమీపంలో వున్న పి అండ్ టి కాలనీలో విచారించాడు. నిరాశతో తిరిగి వస్తుండగా దిల్‌షుక్‌నగర్ బస్టాండు వద్ద ఒక పెద్దాయన కనిపించి, "నీవు వెళ్లవలసిన కాలనీ ఇక్కడ కాదు. చిక్కడపల్లి గాంధీనగర్‌లో వుంది. కోటీవెళ్లి అక్కడ నుండి ఫలానా బస్సెక్కి వెళ్లు. అక్కడి పిఅండ్‌టిలో 55 ఇల్లు" అని చెప్పి, మాయమైనాడు. ఆగంతకుడు వచ్చి నాతో చెప్పాడు.

"ఆ చెప్పినాయన ఎవరై ఉంటారు" అని ప్రశ్నించాడు.

"మాస్టరుగారే, వారి యాస్ట్రల్‌రూపాన్ని మీరు చూచారు" అన్నాను.

అలా మాస్టరుగారు ఎవరిలో ఎలాంటి ప్రేరణ కలిగిస్తారో ఎలా యోగంలోకి ఆకర్షిస్తారో మనకు తెలియదు.

జూలై 15న నా ఉద్యోగవిరమణ... అలా ఆఫీసులో ఎవరైనా రిటైర్ అవుతుంటే ఘనంగా వీడ్కోలు పార్టీ యిస్తారు. మేము అలా చేసేవాళ్లం. హైదరాబాదు ఆఫీసులో ఆ సంప్రదాయం లేదు. ఎడిటర్ అంతటివాడు రిటైర్ అయితేనే నిర్దయగా పంపివేశారు. నా కళ్లముందు నలుగురు రిటైర్ అయ్యారు. ఒక్కరికైనా చిన్న పార్టీ యివ్వలేదు. నా విషయంలో కొలీగ్స్ పట్టుబట్టారు. వర్కర్సు అంతా ఏకమైనారు. ఎడిటోరియల్ డిపార్టుమెంట్ సెండాఫ్‌పార్టీ యివ్వకపోతే తాము యిస్తామని చందాలు వసూలు చేయసాగారు. సంపాదకవర్గంలో వేడిపుట్టింది. "వర్కర్ల దగ్గర తీసుకోవద్దు. వారి పక్షాన ఎంత మొత్తంకావాలో చెప్పండి, నేనిస్తాను" అన్నాను.

"మీ అందరికీ నేను పార్టీ యిస్తాను, ఖర్చు నాది" అన్నాను.

ఎడిటర్‌గారు సెండాఫ్‌పార్టీ అరేంజి చేయమని మొహం తప్పించాడు. పనిమీద విజయవాడ వెళ్లాడు. ఇటు డెయిలీ, వీక్లీ, ఎక్స్‌ప్రెస్ బృందం వర్కర్లు అంతా పార్టీలో పాల్గొన్నారు. ప్రభలో నా ముప్ఫయి సంవత్సరాల అనుభవాన్ని చెప్పమని కొత్తవారికి 'సందేశం'లాంటిది యిమ్మని కోరారు. మిత్రుల కోరికమేరకు మొదటిసారిగా 'గళం' విప్పాను. ఎంతో ఉద్రేకంగా, ఉద్వేగభరితంగా మాట్లాడానన్నారు. ఒకగంటకు పైగా జర్నలిజం పోకడలపై, యాజమాన్యంపై, ఎడిటర్ల ప్రవర్తనపై విరుచుకు పడ్డానట. కంట్రోల్ చేసుకోలేకపోయానేమో! కొలీగ్స్ అంతా సంతోషించారు.

"ఈ ఒక్క ఉపన్యాసం రికార్డు చేస్తే, జర్నలిజానికి టెక్స్ట్‌బుక్ అవుతుంది" అన్నారు. ఆనందంతో చాలామంది కళ్లు చెమర్చాయి.

అదొక అనుభూతి. 30 సంవత్సరాల అనుబంధం, అంతకు ముందురోజున ఎడిటర్‌గారు పిలిచి చెప్పారు. 'రెండురోజులు గాప్ యిచ్చి, మీరు రండి. ఈలోగా మద్రాసు నుండి ఆర్డరు వస్తుంది. మిమ్మల్ని రీ ఇన్‌స్టేట్ చేయమని పైవారికి రాశాను" అన్నారు.

ఆ రోజు నా ఉపన్యాసం గురించి ఎవరో వెళ్లి ఆయన చెవిని వేశారు. అలా వేస్తారని నాకూ తెలుసు. కొందరు ఎడిటర్ల తొత్తులుంటారు. కొందరు మేనేజ్‌మెంటు వేగులుంటారు. అన్ని పత్రికలలో ఈ రాజకీయం మామూలే! నాకు ఆ రోజే అర్థమైంది. నాకు తిరిగి ఉద్యోగం యివ్వరని.

58 సంవత్సరాల జీవితం నాకు చాలా నేర్పింది. ఎన్నో అనుభవాలు నన్ను తీర్చిదిద్దాయి. ఉద్యోగపర్వం అయిపోవడం అంటే జీవితం 90 శాతం అయిపోయినట్లు చాలామందికి! నాకు అలా కాదు. నాకు మరొక జీవితం ప్రారంభం అవుతుందని నాకు తెలుసు. కొత్త ఉద్యోగంలో జీతభత్యాలుండవు, సెలవలు ఉండవు. విశ్రాంతి ఉండదు.



మాతృశ్రీ యామినీదేవి



మదర్ వెంకమ్మగారు

శ్రీమతి యామినీదేవి - శ్రీ శార్వరి



ప్రత్యూష, ప్రహాస



యశస్వి, యస్వంత్



ప్రణవ్



ఆదిత్య, అభిజిత్




'సావిత్రి' ఆవిష్కరణసభలో, డా.వి.వి.యల్. నరసింహారావు

డా. దాశరథి, డా. నారాయణరెడ్డి, శ్రీ శేషేంద్రశర్మ

తిరుపతి యోగసమావేశాలలో

హైదరాబాదు మాస్టర్ యోగాశ్రమంలో ప్రార్థనలు

అది ఉద్యోగం కాదు, సద్యోగం. జీవితంలో భుక్తికోసం కొన్నాళ్ళు, రక్తికోసం కొన్నాళ్ళు, పాటుపడ్డాను. వాటిపైన విరక్తి కలిగింది. చావో, సన్యాసమో లేక నిర్జీవపు బ్రతుకో దక్కుతుంది. నాది విరక్తి కాదు. నాకు వైరాగ్యం లేదు. ఇక పైన చేయవలసింది సద్యోగం. అది అనురక్తితో, అంకితభావంతో చేయాలి. డబ్బుకోసం కాదు, కీర్తి ప్రతిష్ఠల కోసం కాదు, భార్యాబిడ్డల పోషణకోసం కానేకాదు. అసలు ఏదో ఆశించి కాదు. ఇన్ని "కాని"పనులు 'ఎందుకోసం, ఎవరికోసం?'

నేను చేయవలసిన పని ఉంది! వ్యవహార ప్రపంచానికి దూరమై, అజ్ఞాతంగా కాకపోయినా, ఒకవిధమైన వానప్రస్థ జీవితం గడుపుతూ, ఇంతకాలంగా చేస్తున్న యోగసాధనకు పుష్టి, తుష్టి కలిగించాలి. అది ఎన్నుకున్న జీవితాశయం కాదు. జన్మాంతర సంస్కారం నను యోగంలోకి ఏనాడో నెట్టింది. ఇహ ప్రారంభం నా సద్యోగపర్వం.

0 0 0

"ఇల్లు కట్టి చూడు - పెళ్లి చేసి చూడు"

ఇల్లుకట్టినా, పెళ్లి చేసినా చూడవలసింది అప్పులిచ్చినవారిని. ఆ పనులు అయ్యాక కనిపించేది అప్పులవాళ్లే. స్థలం అంటూ ఒకటి కొనడం జరిగింది. చిన్నదో పెద్దదో ఒక ఇల్లంటూ ఏర్పడాలి. అద్దె ఇళ్లలో అవస్థ అని కాదు. సొంత ఇంటి తృప్తి వేరు. ఫస్టు వచ్చేసరికి అద్దె కట్టవలసిన అవసరం ఉండదు. 30 సంవత్సరాల ఉద్యోగపర్వంలో జీతం ఎంత తక్కువైనా ముందు అద్దెకట్టక తప్పేది కాదు. తర్వాత మిగిలిన దాంతో బ్రతకడం ప్రతి ఉద్యోగికి అలవాటే. వచ్చిన డబ్బు ఖర్చులకు చాలదు. ఆ కాస్త ఇంటిమీద పెడితే తర్వాత ఇల్లు గడిచేమార్గం ఏది? ఏదో మొండితనం. అదృశ్యహస్తం నన్ను ఆదుకుని నడిపించింది. ఎవరిమాట వినలేదు. ఇల్లు కట్టకపోయినా ఆ డబ్బు చేతిలో మిగలదు. మరొకరకంగా ఖర్చవుతుంది. నా జాతకం నాకు తెలుసు. నా చేతిలో డబ్బు నిలవదు. అవసరాలకు మించి ఎప్పుడూ రాదు. వస్తే గిస్తే కొత్త అవసరాలు కళ్లముందు నిలుస్తాయి. కనుక ఒక్కపనిచేయాలని నిర్ణయించుకున్నాను. అది మంచిదా, చెడ్డదా, లాభమా, నష్టమా... భవిష్యత్తు ఏమిటని లెక్కలు వేస్తూ కూర్చుంటే చేయగలిగింది లేదు. ఒక ఆలోచన వచ్చింది. వెంటనే కార్యరూపం దాల్చడం మంచిది. లాభం, ఫలితం ఆశించవద్దు, చూడవద్దు, అంతరాత్మ ప్రబోధం అనుసరించడం ఎవరికైనా మంచిది. కాని అదే కష్టం. మన ఆలోచన మోసం చేస్తుంది. అంతరాత్మ మోసం చేయదు.

ఇల్లు కట్టాలన్న ఆలోచన కొందరికి రుచించలేదు. అందునా ఎక్కడో తిరుపతిలో కట్టడం ఏమిటని మరొక ప్రశ్న! రమణ పట్టుదల. తనకు అమ్మ నాన్న తన దగ్గర ఉండాలన్న కోరిక. ఎం.ఎస్సి.కోసం ఢిల్లీ వెళ్లినప్పటినుండి తను మాతో ఉండడం లేదు.

తల్లిదండ్రులకు పిల్లలపైన ఎంత ప్రేమ ఉంటుందో పిల్లలకూ తల్లిదండ్రులపైన అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లపైన అంతే ప్రేమ ఉంటుంది. ప్రేమ చిక్కదనం, రుచి ఒక్కటే. పంపిణీలో, బట్వాడాలో, దానిని వ్యక్తం చేయడంలో తేడా ఉండవచ్చు. మా దగ్గర చాలాకాలంగా లేడు కనుక, మేం తనకు దగ్గరగా వెళితే, అయిదారు సంవత్సరాలు కలిసి ఉంటే, మా వంతు కర్తవ్యం తీరినట్లు అవుతుందని మా దంపతుల ఆంతర్యం. ప్రేమలు ఆప్యాయతలు ఋణాలు డబ్బుతో తీరవు. దగ్గిరతనం కావాలి. మనుషులు దగ్గరకావాలి. ఆప్యాయతల్ని కలసి పంచుకోవాలి. అందుకే తిరుపతిలో ఇల్లు ఏర్పడాలి. ఇంతవరకు నేను సంపాయించింది లేదు. పెద్దలిచ్చిన ఆస్తులు లేనేలేవు. ఎక్కడ వున్నా కొంతకష్టం తప్పదు.

తిరుచానూరులో ఒక నాటుజ్యోతిష్కుడున్నాడు. నాటు జ్యోతిష్యుడు ఏమిటి. నాటు వైద్యుడివలె?! అవును, అతనికి శాస్త్రం తెలీదు, సంప్రదాయం తెలుసు. అంగవికలుడు, పేరు గంగిరెడ్డి. కుర్చీ వదిలితే, చక్రాలబండి ఎక్కవలసిందే. అతను మా అబ్బాయి రమణకు తెలిసినవాడు. జ్యోతిషం చెబుతాడు, ముహూర్తాలు పెడుతుంటాడు. ప్రశ్నలు చెబుతాడు.

"మా గేదె తప్పిపోయిందిస్వామీ' ప్రశ్న చెప్పమని అడిగితే, 'ఆదివారం నాడు ఆవు దొరుకుతుంది పొండి' అని చెబుతాడు. పోయింది గేదె అయితే ఆవు దొరకడం ఏమిటి. అది అంతే. అదే నాటుజ్యోతిషం. అతని వద్దకు రమణ ముహూర్తానికి వెళ్లాడు. శంకుస్థాపనకు ముహూర్తం పెట్టమంటే ఆయన గృహప్రవేశానికి ముహూర్తం పెట్టాడు. "ఇల్లు కట్టలేదు, గృహప్రవేశం ఏమిటి" అంటే అప్పుడు శంకుస్థాపన ముహూర్తం నిర్ణయించి చెప్పాడు.

"ఈ ముహూర్తానికి శంకుస్థాపన చేస్తే, పై ముహూర్తానికి గృహప్రవేశం జరిగితీరుతుంది" అని రెండు ముహూర్తాలు రాసి కాగితాలు చేతిలో పెట్టాడు.

శంకుస్థాపన జరిగింది. ఇల్లు మొదలైంది. ఆగస్టులో శంకుస్థాపన చేశాం. పి.ఎఫ్. డబ్బు రావాలి కదా! గ్రాట్యుటీ డబ్బు స్థలం అమ్మినవారికిచ్చాం. అయినా డిసెంబరు నాటికి ఇల్లు కొంత అయింది. గృహప్రవేశం ముహూర్తానికి తలుపులు కిటికీరెక్కలు బిగించకపోయినా గృహప్రవేశం జరిగింది. యోగమిత్రులు, బంధువులు, వందలమంది వచ్చారు. చాలా గ్రాండ్‌గా జరిగింది. ఆ ఇల్లే ఒక కళ్యాణమండపం. అది విశ్వకళ్యాణవేదిక.

డబ్బుకు కటకట. లక్ష రూపాయలు ఏ మూలకు? ఇంటిపనికి మిత్రుల వద్ద అప్పులు చేయక తప్పింది కాదు. డా. పద్మావతమ్మ సెలవు పెట్టి వచ్చి కూర్చున్నది

తిరుపతిలో. చాలాసహాయం చేశారు ఆమె అవసరానికి. దగ్గర నిలబడి పని పర్యవేక్షించేది. అయిదారునెలలు మా రమణ నిద్రాహారాలు మాని కష్టపడి కట్టించాడు. డబ్బు సర్దుబాటు చేయడం ఒక ఎత్తు. దగ్గరుండి ఇల్లుకట్టించడం రెండవ ఎత్తు. నాకు అనుభవం లేదు బొత్తిగా. అంత బాధ్యత తనపైన వేసుకుని చేయించాడు రమణ.

మొత్తానికి ఒక పని అయిపోయింది. జీవితంలో నేనూ ఒక ఇల్లు ఏర్పాటు చేసుకోగలిగాను. ఒక ఇంటివాడినైనాను. స్వంత ఇల్లు కావాలన్న పట్టుదల నాకెందుకు కలిగింది? ఎక్కడున్నా గడిచిపోతుందికదా! నిజానికి అద్దె ఇళ్లలోనే హాయి అనే వారున్నారు. హైదరాబాదులో మా కజిన్ ఒకరున్నారు. చాలా పెద్ద ప్రభుత్వోద్యోగి. గ్రామంలో పొలాలు ఇళ్లు ఉన్నాయి. వస్తుతః స్థితిమంతుడు. కవిగా, పండితుడుగా పెద్దపేరుంది. అతని అమ్మగారికి జబ్బు చేసింది. పెద్ద వయస్సు. ఆస్పత్రిలోచేర్చారు. కాలం తీరింది. అద్దె ఇంట్లో ఉంటున్నాడు. ఆమె మృతదేహాన్ని ఇంటికి తీసుకురావడానికి వీల్లేదని ఇంటివారు అడ్డుపడ్డారు. ఆస్పత్రి నుండి సరాసరి స్మశానానికి తరలించవలసిన దుర్గతి. కర్మాంతరాలు ఇంటివద్ద జరపనీయలేదు ఇంటివారు. హైద్రాబాదులో సత్రాల సౌకర్యం లేదు. ఊరి చివరన ఒక కమ్యూనిటీ హాలులో బ్రతిమిలాడి కర్మాంతరాలు జరిపించాడు. అతని ఉద్యోగం, ఆస్తి, అంతస్తు ఏవీ మనశ్శాంతిని ఇవ్వలేదు. కన్నతల్లికి తృప్తిగా అంత్యక్రియలు జరపలేకపోయానే అన్న బాధతో అతను కృంగి, కృశించిపోయాడు కొంతకాలం. ఆ సంఘటన నా కళ్లతో చూచిన తర్వాత ప్రతివ్యక్తి చనిపోయేనాటికైనా ఒక ఇల్లు కట్టుకోవాలని స్వంతఇంటిలో చనిపోవాలని అనుకున్నాను. చచ్చిన తర్వాత స్వర్గమో, నరకమో ఎవరికి తెలుసు! డబ్బు మదంతో స్వర్గసుఖాలు అనుభవిస్తున్నామనుకునేవారికి ఈ స్థితి నరకం కన్న హీనం.

# 1989 కనకాభిషేకం

**తిరుపతిలో ఇల్లు కట్టినా ఉండడం హైదరాబాదులోనే.**

వెంటనే తిరుపతికి మకాం మార్చే అవసరం కలగలేదు. రమణ వివాహం కావాలి. బ్రతుకుతెరువుకోసం ఏదైనా చేయాలి. 'ఉదయం' పత్రికలో చేరలేదు. వారి కండిషన్సు నాకు సరిపడక చేరలేదు. మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్ వసంతకుమార్ నడుపుకుంటున్నాడు. అందులో మిగిలేది నా వరకు వచ్చే అవకాశం లేదు. ప్రెస్ ఎంత పెద్దదైతే బాధ్యతలు, ఇబ్బందులు అంత పెద్దగానే ఉంటాయి. అది నిర్వహించడమే కష్టంగా వుంది. శ్యాం సుందర్ ప్రాక్టీసు ప్రారంభించాడు గానీ, పార్టనర్ మోసంతో కాస్త దెబ్బతిన్నాడు. చాలా డబ్బు నష్టపడ్డాడు. ఉద్యోగాన్వేషణలో పడ్డాడు. స్వంత ప్రాక్టీసుపైన మనసున్నది. కలసి రావాలి కదా! నేను పిల్లలు ఎవరికీ భారం కాకూడదు. అప్పుడే ప్రెస్, శ్యాం ప్రాక్టీసు వున్న బిల్డింగు అగ్ని ప్రమాదానికి గురైంది. ప్రెస్ ఇంటికి మారింది. మా ఇంటికి దగ్గరలో వున్న సినీనటుడు సి. నాగభూషణంగారి ఇల్లు అద్దెకు తీసుకుని ప్రెస్ అక్కడ పెట్టాం. నా స్వంతానికి 20 వేలు పెట్టుబడితో నాలుగైదు కేసులు పెట్టుకున్నాను. విశాలాంధ్ర వారి పుస్తకాలు కంపోజ్ చేసి వసంత ప్రెస్‌లో ప్రింట్ చేయించేవాడిని. ఏమీ మిగిలింది లేదు. కాలక్షేపం... అంతే!

అంతలో రమణ పెళ్లి కుదిరింది. మా మేనమామ గారి మనవరాలు చంద్రప్రభతో వివాహం, హైదరాబాదులో బెంగాల్ అసోసియేషన్ హాలులో జరిగింది. తిరుపతిలో రమణ, చంద్ర సంసారంపెట్టారు. మేం హైదరాబాదులో. శ్యాం సుందర్ వేరే ఇల్లు తీసుకుని, మా ఇద్దరిని తనతో ఉండమని కోరాడు. విడిగా ఉన్నా, కలిసివున్నా ఒక్కటే. పిల్లల్లో ఒకరిదగ్గర ఉండడం వల్ల, వారికి సహాయంగా ఉంటుంది. మా ఇద్దరికయ్యే డబ్బు ఖర్చుపెడితే సరిపోతుంది. తనకు పెద్దగా ప్రాక్టీసు లేదు. ఒకరికొకరు సాయం అనిపించి శ్యాం వాళ్ల ఇంటికి చేరాం. నా చిన్నప్రెస్ పని నేను చూచుకునేవాడిని. ఇంటిఅద్దె శ్యాం చెల్లించేవాడు. మిగిలిన ఇంటిఖర్చులు నేను భరించేవాడిని. పుస్తకాలపైన రాబడి - అదే నా వ్యాపారం - అదే నా ఆదాయం.

అప్పటివరకు యోగం భక్తితోనే చేశాను. సాధకులు మెంబర్‌షిప్ సంవత్సరానికి నూరు రూపాయలు యిస్తే తీసుకునేవాడిని, లేకుంటే లేదు. అప్పటివరకు ట్రీట్ చేసినా ఎవరిదగ్గర డబ్బు తీసుకోవడం లేదు. ఇప్పుడు పరిస్థితి మారింది. ముక్తి కోసం

చేయవలసిన యోగాన్ని కాస్త భుక్తికోసం కేటాయించవలసి వచ్చింది. "యోగమార్గం" పత్రిక చందాలు పత్రికకే చాలేవి కావు. ప్రెస్ నిర్వహణ 'అజాగళస్తనం' లా మారింది. ఎంత పిండినా చుక్కరాలని పరిస్థితి. కాలం కలిసిరానప్పుడు మనిషి ప్రతిభ ఎందుకూ పనికిరాదు. అయిన వారు దగ్గరకు రారు, ఆప్తమిత్రులు ఆదుకోరు. జీవితంపై విరక్తి కలిగే క్షణాలు అలాంటివే. వైరాగ్యం మనిషిలో గూడుకట్టుకునేది అప్పుడే. నాకున్న మిగిలిన ఒకే ఒక్క ఆధారం నా పుస్తకాలు. నా సంపాదన పుస్తకాలే. అప్పటికే స్వంత పుస్తకాలు, స్వంత ప్రచురణలు ఉన్నాయి. పరిస్థితుల్ని బట్టి నాకు అవగాహన అయింది. నాకు గతి, మోక్షం, యోగం పుస్తకాలు మాత్రమేనని. నష్టాలు తెచ్చిపెట్టే ప్రెస్‌ను ఎంతకాలం భరించను? కష్టానికి ఫలితం లేదు! నెమ్మదిగా ప్రెస్ మూసివేద్దామనుకున్నాను. మా రమణ ప్రెస్ తిరుపతికి మార్చితే బాగుంటుందని సలహా యిచ్చాడు.

తిరుపతిలో ప్రెస్సులు తక్కువ. పుస్తకాలు అచ్చువేసేవారు లేరు. అయిడియా బాగున్నదనిపించింది. ప్రెస్ లారీకెత్తించి తిరుపతి పంపాము. ఒక ట్రెడిల్‌తో సహా. నా మకాం తిరుపతికి మారింది. తిరుపతిలో వర్కర్లు లేరు. నానా అవస్థ అయింది. ప్రెస్ మూలపడ్డది. మూసివేయవలసి వచ్చింది.

హైదరాబాదులో ఉన్నన్ని రోజులు నాకు మానసికంగా ధైర్యం చెప్పింది, ఊరడించింది శ్రీ కె. కృష్ణమూర్తిగారు. రోజూ నా వద్దకు వచ్చేవారు. ప్రేయర్ అయిన తర్వాత పొద్దుపోయేవరకు నాతోనే ఉండేవాడు. నా ఖర్చులు చాలావరకు తనే భరించేవాడు. స్వంత తమ్ముడిలాగా ఆదరించాడు. అంతకుముందు ఎందరో ఆత్మీయంగా తిరిగారు. ఉద్యోగం అయిన తర్వాత మిగిలిన ఒకే ఒక్క మిత్రుడు కృష్ణమూర్తి. ఆయనను కేవలం ఒక సాధకునిగా, శిష్యునిగా చూడలేదు. నా స్వంతమనిషి, నా మనిషి అనే భావన నాలో పాదుకొనేట్లు చేసిన సంస్కారం ఆయనది.

జీవితంలో వెన్నెలబాటలుంటాయి. చీకటికోనలుంటాయి. కొన్నాళ్లు వెలుగులు, కొన్నాళ్లు చీకట్లు, ఆనందాలు, నైరాశ్యాలు. ఆలోచనలపై చీకట్లు ముసురుకుంటున్న సమయంలో కృష్ణమూర్తి ఆశాదీపంలా కనిపిస్తారు. ఒక మెరుపు మెరుస్తుంది. కాస్తంత మార్గం కనిపిస్తుంది. కృష్ణమూర్తి తమ ఆఫీసులో పనిచేసే ఒక వ్యక్తిని ఆ మధ్య పరిచయం చేశారు. ఆయనపేరు సత్యనారాయణ. యోగం చేస్తుంటాడట. ఎప్పుడు నా వద్దకు రాలేదు. నా వద్దకు రానంత మాత్రాన యోగం చేయకూడదని కాదు. ఎవరైనా చేసుకోవచ్చు. మంచివ్యక్తి, మా వీధికి దగ్గర. ఆయన భార్యకు అస్వస్థతగా ఉందని "మీరు ట్రీట్‌మెంట్ యిస్తానంటే...పర్మిషన్ యిస్తే" తీసుకువస్తానన్నాడు. కృష్ణమూర్తిగారి పద్ధతి అది. ముందు పర్మిషన్ అడుగుతారు అమాయకంగా. నేను కాదనని తనకు తెలుసు.

"స్నేహితుని భార్య అయినా, మీ భార్య అయినా నాకు ఒక్కటే. వస్తానంటే, వారికి రావాలనిపిస్తే రమ్మనండి. ఎవరినీ బలవంతంగా తీసుకు రావద్దు" అన్నాను. అది నా పద్ధ

"వాళ్లే అడిగారు. సత్యనారాయణ భార్యకు......"

"ఏమిటి రోగం?"

"దయ్యం పట్టిందట. మూడీగా వుంటుంది"

ఆమెను తీసుకువచ్చాడు. పిచ్చిమాలోకం అనిపించింది. జుత్తురేగి వుంది. మనిషికి తనపై తనకే శ్రద్ధలేనట్లు తోచింది. ఆమెది దుగ్గిరాల. ఆ మధ్య ఒకసారి పుట్టింటికి వెళ్లినపుడు తెల్లవారుఝామున బస్సుదిగి, లాకుల దగ్గరనుండి ఊళ్లోకి వెడుతుండగా ఒక మర్రిచెట్టుక్రింద, చీకట్లో దడుసుకుందట. అప్పటినుండి సగం మనస్సు పనిచేస్తుంది. ఏదో ఆలోచిస్తుంది. ఏదో చేస్తుంది. పూర్తిగా తెలివిలో ఉండదు. ఉన్నా ఇంటిపని చేయదు.

ట్రీట్‌మెంట్ చేశాను. ఆమె మామూలైంది. రోజూ ప్రేయర్‌కి వచ్చేది.

"వాళ్లకు ఎంతచార్జి చేద్దాం?" కృష్ణమూర్తిగారి ప్రశ్న.

"చార్జి ఏమిటి?" అలవాటులేని ఔపోసన.

"ట్రీట్‌చేసినందుకు ఫీజు"

"అడిగితే ఏమైనా అనుకుంటారు. అయినా ట్రీట్‌మెంటుకు చార్జిచేస్తే ఏం బావుంటుంది కృష్ణమూర్తిగారూ!" ...నా అనుమానం.

"ఆస్పత్రులకు వెళ్లి బోలెడు ఖర్చు చేస్తారు. సత్యనారాయణే అడిగాడు ఎంత యిద్దామని. మొహమాటపడకండి గురువుగారూ"

"వద్దులే"

"అట్లాకాదు. ఇన్నాళ్లు ఉద్యోగం చేస్తున్నారు. ఇప్పుడు ఉద్యోగం లేదు. సంపాదన లేదు. ఇల్లు గడవాలి గదా! ఖర్చులకు కావాలి గదా! వాళ్లంతట వాళ్లే యిచ్చినప్పుడు తప్పేమిటి?" ఆర్ఘ్యం చేశాడు. నిజమే అనిపించింది.

"సరే నీ యిష్టం. ఆ అమ్మాయి ఇష్టం. ఎంతయిస్తే అంతే తీసుకో" అన్నాను.

ఆ సాయంత్రం పార్వతి వచ్చి రెండువేలు యిచ్చింది.

అదే యోగచికిత్సకు తీసుకున్న పెద్దమొత్తం... అదీ కృష్ణమూర్తి ప్రోత్సాహంతో.

"క్షమించండి. ఇది మాస్టరుగారు చూపించిన మార్గం అనుకోవచ్చు గదా. చిన్నవాడిని, సలహా చెప్పదగిన వాడిని కాను. కానీ..."

ఒక 'కీ' దొరికింది. ఒక మార్గం ఏర్పడ్డది.

యోగం కొరకు వచ్చేవారు భక్తిగా ఉంటారు. నిజాయితీగా ఉంటారు. వారికున్న శ్రద్ధ, భక్తి, ఆసక్తి ప్రత్యేకంగా కనిపిస్తాయి. ట్రీట్‌మెంట్‌కోసం వచ్చేవారిలో ఈ లక్షణాలు బొత్తిగా ఉండవు. ఒక క్లినిక్‌కు వచ్చినట్లు, ఒక డాక్టరును చూసినట్లు చూస్తారు. వారికి మాస్టరుగురించి, యోగం గురించి అవసరంలేదు. తెలుసుకోవాలని ప్రయత్నించరు. వారికి రోగం నయం కావాలి. కనీసం మనస్ఫూర్తిగా నమస్కారం చేయరు. ఎదురుగా మాస్టర్‌గారి ఫోటో వున్నా దానివైపు చూడరు. మేము ప్రేయర్ చేస్తుంటే వింతగా చూస్తారు. బలవంతంగా కళ్లు మూసుకుంటారు. అలాంటివారికి యోగం ఏం నేర్పుతాం. గురువు భక్తి, ఏమీ ఉండవు. అలాంటి వారి దగ్గర డబ్బు తీసుకోవడం వల్ల యోగానికి అపచారం చేసినట్లుకాదు. మాస్టరుగారికి ద్రోహం చేసినట్లు అంతకన్న కాదు. నిష్టగా యోగం చేసేవారు వేరుగా కనిపిస్తారు. వారి పద్ధతి వేరు, వారి ప్రవర్తన వేరు.

0 0 0 0

గూడూరు నుండి సంజీవరావు అనే టిచర్ వచ్చాడు. పెద్దవాడే కళ్లు కనిపించడం లేదు. ఉద్యోగం నుండి తీసేశారు. అతను, భార్య వచ్చారు. వారికి పిల్లలు లేరు. ఆ వయస్సులో పిల్లలు కలిగే అవకాశం లేదు. అతనికి ట్రీట్‌మెంట్ యిచ్చాను. నెలరోజుల్లో చూపు వచ్చింది. మళ్లీ ఉద్యోగంలో చేరాడు. వచ్చి అడగకుండానే రెండువేలు యిచ్చాడు. రిటైరైన తర్వాత తిరుపతి వచ్చి, అక్కడే చిన్న ఇల్లు కట్టుకుని ఉంటానని అన్నాడు.

మరొకతను ఎవరుచెప్పారోకానీ ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు. పేరు వి.ఎస్.కృష్ణ. కిడ్నీప్రాబ్లం అతనికి. వారానికి రెండుసార్లు డయాలిసిస్ చేయించుకుంటున్నాడట. వేనకువేలు ఖర్చవుతోంది. రెండువారాల ట్రీట్‌మెంట్‌తో కిడ్నీ పూర్తిగా బాగైంది. రక్తం ఎక్కించనవసరం లేకుండా పోయింది. అతను యోగచికిత్స తీసుకోవడం ఆయన భార్యకు ఇష్టం లేదు. అవసరం లేకపోయినా డయాలిసిస్‌కు పంపేది.

కొందరికి డాక్టర్లపైన వున్న నమ్మకం యోగంపైన ఉండదు. యోగంతో రోగాలు ఎలా నయమవుతాయి అంటారు. అలాగా పెద్దపెద్ద కేసులు చేయడం ఒక ఛాలెంజి అనిపించింది.

0 0 0

ఒకసారి తెనాలిలో ఒక సభలో ప్రసంగించవలసి వచ్చింది. సాధారణంగా నేను ఉపన్యాసాలు వప్పుకోను. అలవాటు తక్కువ. జర్నలిస్టుగా రచన అలవాటుందిగానీ వక్తృత్వం అలవాటు లేదు. రాతగాళ్లు మంచి కూతగాళ్లు కాలేరు. సంజీవదేవ్‌గారంటే నాకు అభిమానం. సావిత్రి పుస్తకానికి 'విశ్లేషణ' రాసిపెట్టారు. వారి పుస్తకాలు నాలుగు ఒకే సారి అచ్చయ్యాయి. ఆవిష్కరణ సభకు నన్ను ఆహ్వానించారు. నిర్వాహకులు

డా. కొత్త రవీంద్రబాబు. నాకు మంచి మిత్రుడు. కాదనలేక ఆమోదించాను. అంతకుముందర ఒకసారి తెనాలిలో లయన్స్ క్లబ్‌లో మాట్లాడాను. తెనాలి మేధావులు నన్ను మరచిపోయినా, నా ప్రసంగం మరచిపోలేదు. శార్వరి ఉపన్యాసం అంటే ఆసక్తి ఉంది. తమ ఊరివాడినని కొంత. జర్నలిస్టునని మరికొంత గౌరవం. రచయితగా కాస్త పేరుంది. ఆ రోజు సభకు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షులు. అధికార భాషాసంఘం అధ్యక్షుని హోదాలో డా.సి.నారాయణరెడ్డిగారు ప్రధాన అతిథి. ఇంకా అమరేంద్ర, చల్లా రాధాకృష్ణశర్మ, కొత్త లక్ష్మీరఘురాం ఉన్నారు. క్లబ్బులోని నన్నపనేని ఆడిటోరియంలో సభ. వేయిమందికి పైగా వచ్చారు సభకు. గోపాలరెడ్డిగారు,నారాయణరెడ్డిగారు గ్లామర్ వున్న వక్తలు. అందరి ప్రసంగాలు అయ్యేసరికి రాత్రి తొమ్మిదిగంటలు దాటింది. నేను చివరివాడిని. సభికులు ముప్పాతికమంది వెళ్లిపోయారు. ఆడిటోరియం మహాపలచగా వుంది. తనను ఉపన్యాసకునిగా పిలవకుండా నన్ను పిలిపించినందుకు, మా మేనమామ కన్నెర్రచేశాడు. తన అభిమానుల్ని కొందరిని వెంటతెచ్చుకున్నాడు. అల్లరి చేసి అవమానించాలని ప్లాన్. తొమ్మిదితర్వాత నాకు అవకాశం వచ్చింది. గోపాలరెడ్డిగారు నన్ను పరిచయం చేస్తూ "ఈయన పేరు శార్వరి అట. నేను ఎప్పుడు వీరిని వినలేదు. ఇప్పటికే కాలాతీతమైంది. అయిదు పది నిముసములలో ముగించాలి" అన్నారు.

పుస్తకాలు పరిచయం చేయవలసింది నేను. అసలు సభే ఆవిష్కరణ సభ. ఆవిష్కరణ అంటే రిబ్బన్ కత్తిరించి అరడజను పుస్తకాలు వేదికపైన వున్న ఆరుగురికీ పంచడం కాదు. పుస్తకాన్ని పరిచయం చేయడం. నేను మైక్ అందుకుని, నెమ్మదిగా ప్రారంభించాను. పావుగంట, అరగంట, గంటపైగా నా ఉపన్యాసం సాగింది. బయటకు వెళ్లిన జనం మైకులో నా గొంతు వినగానే తిరిగివచ్చారు. గంటసేపు అనర్గళంగా ఉపన్యసించాను. అక్కడివారికి ఆనందం కలిగించింది.

'తెనాలి పులి' అని అభినందించారు డా. గోపాలరెడ్డిగారు.

"ఇంతచక్కగా ఉపన్యసించే మా శార్వరి హైదరాబాదులో వుండీ, మమ్మల్ని ఇంతకాలం తప్పించుకున్నాడు ఇక ఊరుకోం" అన్నారు సి.నా.రె.

ఆటోగ్రాఫ్‌లు ఇవ్వడం అరగంటసేపు పట్టింది. పూర్వం నేను పనిచేసిన కాలేజీ కమిటి సభ్యులు, ఊళ్లో లాయర్లు, డాక్టర్లు, లెక్చరర్లు ఎందరో వచ్చి అభినందించారు. కొందరు నా ప్రసంగాన్ని టేప్ చేసుకున్నారు. ఉక్రోషంతో వచ్చిన మా మేనమామగారు గట్టిగా కౌగలించుకుని "ఇంతకాలం నేనే అనుకున్నాను. నా మేనల్లుని చూచి గర్విస్తున్నాను" అన్నాడు. అదే తెనాలిలో నా చివరి ఉపన్యాసం.

చివరగా సంజీవదేవ్ తుదిపలుకులు చెప్పాలి. వారి ఉపన్యాసం చాలా శ్రావ్యంగా, హాయిగా ఉంటుంది. దానికోసం సభ ఎదురుచూస్తున్నది. వారు లేచి "శార్వరి

ఉపన్యాసం తర్వాత నాకేం మిగలలేదు మాట్లాడ్డానికి. నా గురించి నా కన్న శార్వరిగారే బాగా చెప్పారు" అని నమస్కరించి సభ ముగించారు.

డా. రవీంద్రబాబు గారింట పెద్ద డిన్నర్ జరిగింది అందరికీ. డా. గోపాల రెడ్డిగారు నన్ను తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నారు. రవీంద్రబాబుగారి భార్య స్వీట్స్ వడ్డిస్తూ "శార్వరిగారూ! మా స్వీట్స్ మీ స్పీచ్ అంత స్వీటుగా ఉండవండీ" అన్నది. ఎంత అప్యాయత! ఎంత ఆనందం, తృప్తి ఆ మాటల్లో.

అప్పుడే గోపాలరెడ్డిగారు అడిగారు, "నెల్లూరులో ఒక సభలో నీవు ప్రసంగించవలె... తప్పకరావలె" అని.

0 0 0

నెల్లూరు వెళ్లక తప్పలేదు. పెద్దవాడు. డా.బెజవాడ గోపాలరెడ్డిగారి ఆహ్వానం. వారి చేతుల మీదుగా సన్మానం. ఆయన ప్రతి సంవత్సరం ఒకరిని అలా సన్మానిస్తారుట. విద్వత్ కవి పండితులకు కేంద్రం సింహపురి, నేను అరవిందులపై ప్రసంగం చేయాలని వారి ఆదేశం. డా. గోపాలరెడ్డిగారికి అరవిందయోగితో పరిచయం వుంది. అరవిందాశ్రమం దర్శిస్తుంటారు. నెల్లూరులో నా యోగమిత్రుడు ఎం.ప్రభాకర్‌కు ముందుగా ఉత్తరం రాశాను. వారు స్టేషన్‌కు వచ్చారు. గోపాలరెడ్డిగారు తన దూతను పంపారు కారిచ్చి. తమ ఇంట్లోనే బస ఏర్పాటు చేశారు. నేను లాడ్జిలో దిగాను మిత్రులతో కులాసాగా గడపవచ్చునని. గోపాలరెడ్డిగారింటికి సామాన్యులు రావడానికి భయపడతారు. ఆయన ముఖ్యమంత్రిగా, కేంద్రమంత్రిగా, గవర్నరుగా చేసినవాడు, కాకలుతీరిన కాంగ్రెసు నాయకుడు.

అక్కడ ఉపన్యాసానికి నెల్లూరు మేధావులంతా వచ్చారు. గోపాలరెడ్డిగారు సభకు పరిచయం చేస్తూ, నేను సంస్కృతపండితుణ్ణని, అదని, ఇదనీ చెప్పి ఇరుకున పెట్టారు. నేను సవినయంగా సభకు క్షమాపణ చెప్పు వలసి వచ్చింది. "నాకు సంస్కృతం రాదు. పండితుడిని అసలే కాను. అరవిందయోగి 'సావిత్రి'ని తెలుగు చేసిన కారణంగా ఈ చిన్న అర్హత లభించింది" అని. సభలో 55 నిమిషాలు ప్రసంగించమని, అయిదు నిమిషాలు చివరన తనకు కేటాయించుకున్నానని, మొత్తం గంటలో కార్యక్రమం ముగించాలని అన్నారు.

నేను ఒకగంటసేపు ప్రసంగించి "ఇంక ఆపేయనా రెడ్డిగారూ, మీరిచ్చిన గడువు దాటింది" అన్నాను.

"వీల్లేదు. మిత్రులు బాగా ఆనందిస్తున్నారు. ఇంకా కొనసాగించండి. మీ యిష్టం. మరొక గంట మాట్లాడినా మావారు కాదనరు" అన్నారు రెడ్డిగారు.

ప్రసంగం అయిన తర్వాత రెడ్డిగారు నా గురించి చాలాబాగా మాట్లాడారు. "ఈరోజు శార్వరిగారిలో మరొక 'అరవిందయోగి'ని దర్శించాను. అరవిందులతో నేను గడిపిన అనుభూతి ఈరోజు శార్వరి సమక్షంలో పొందాను. శార్వరి తెలుగువాడైనాడు. బెంగాల్‌లో జన్మించి వుంటే, రవీంద్రుడు, అరవిందుల సరసన నిలిచిఉండేవారు" అని ఆశీర్వదించి, అభినందించారు. దుశ్శాలువతో కప్పి సత్కరించారు.

అప్పుడు అన్నారు సభాముఖంగా, "శార్వరిగారు అంగీకరిస్తే తిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారికిచెప్పి గౌరవడాక్టరేట్ యిప్పిస్తాను, వారు డాక్టరేట్‌కు అర్హులు"

"దయచేసి ఆ పనిమాత్రం చేయకండి. నేను యోగంలో పూర్ణత్వం సంపాదించాలని తపస్సు చేస్తున్నాను. విశ్వవిద్యాలయాల డాక్టరేట్లు, ప్రభుత్వాలిచ్చే బిరుదులు నాకు అవసరం లేదు."

"అందరూ కళాప్రపూర్ణులు కావాలనీ, డాక్టరేట్స్ కావాలని మా వెంటపడి తిరుగుతారు. నీకు యిప్పిస్తానంటే వద్దంటావేమయ్యా మహాశయా!" అని నవ్వుకున్నారు.

నాకు సన్మానాలంటే ఇష్టం లేదు. ఇదీ గోపాలరెడ్డిగారు పిలిచారు కనుక అంగీకరించి వచ్చాను. ప్రయత్నిస్తే వస్తాయి చాలా బిరుదులు. కానీ వద్దు. గుర్తింపు అనేది రికమండేషన్ల వల్ల, డబ్బు ఖర్చుచేసి, కాకాలుపట్టి తెచ్చుకునేది కాదు. అలా తెచ్చుకున్నవారిని చాలామందిని నేనెరుగుదును. వారికి అవి కావాలి! అవే వారి ప్రతిభకు గుర్తింపు, నాకు అలాంటి గుర్తింపు అవసరం లేదు. సాహిత్యానికి దూరం అయినాను. నేను రాసిన సావిత్రి, తర్వాత రాసిన యోగగ్రంథాలు సాహిత్యం క్రిందికి రావా? కథలు, నవలలు, నాటకాలు, విమర్శలేనా సాహిత్యప్రక్రియలు? ఏమో!

## షష్టిపూర్తి ఉత్సవం

నాకు ఊహ తెలిసిన తర్వాత ఎన్నడూ పుట్టినరోజు జరుపుకున్న జ్ఞాపకం లేదు. అసలు చాలాకాలం నేను ఎప్పుడు పుట్టానో, కరెక్టుగా చెప్పినవారు లేరు. ఉజ్జాయింపుగా వేసిన స్కూలు రికార్డే ప్రమాణం. తిరుపతిలో ఉంటున్న రోజులు అవి. షష్టిపూర్తి ఉత్సవంగా కాకపోయినా, అదొక గుర్తుగా ఉంటుందని కొందరు యోగమిత్రులు సూచించారు. ఎటుగూడి ఏడాదికి రెండుసార్లు యోగసమావేశాలు జరుపుతూనే వున్నాం. ఇదొకటి అదనం. అదీ ఒక యోగ సమావేశంగా జరపాలని అనుకున్నాం. అగస్టు 4న మాస్టర్‌గారి జన్మదినోత్సవం జరిపినట్లు. ఆ నిర్ణయం హైదరాబాదులో వున్న మా పిల్లలు వసంతకుమార్‌కు, శ్యాంసుందర్‌కు చెప్పాం. రమణ తిరుపతిలోనే ఉన్నాడు. సరేనంటే సరే అనుకున్నారు.

ఆ సందర్భంగా ఒక జ్ఞాపిక ప్రచురిస్తే బావుంటుందని వసంతకుమార్ సూచన చేశాడు. ఆ బాధ్యత తనే తీసుకున్నాడు. నా పుస్తకాలన్నీ సేకరించి, వర్గీకరించి, అభిమాన రచయితలచే వ్యాసాలు రాయించాడు. కొందరు యోగమిత్రులు యోగపరంగా రచనలు చేశారు. సాహిత్యపరంగా రాసేవారు చాలామంది వున్నారు. అరవై వ్యాసాలు వేద్దామనుకున్నాం. కాని ఆర్థికంగా శక్తి లేదు. అప్పుడే ఇల్లుకట్టడం, ఉద్యోగవిరమణ. మరోగట్టి సంపాదన లేకపోవడం వల్ల ఓ 40 వ్యాసాలు మాత్రం సావనీరులో వేయగలిగాము. అదే గొప్ప అనిపించింది. అలాంటి సావనీర్లలో అడ్వర్‌టైజ్‌మెంట్లు తప్ప చదవదగిన రచనలు ఉండవు. నా సావనీరు ప్రకటనలకోసం కాదు. మంచి రచనల కోసం.

అది కేవలం షష్టిపూర్తి ఉత్సవంగా కాక, కనకాభిషేకంగా మార్చారు హైదరాబాదులోని యోగమిత్రులు. ఏర్పాట్లు అన్నీ వారే చేశారు. పూర్వకాలంలో చాలాకొద్దిమంది ఈ షష్టిపూర్తి ఉత్సవం చేసుకునేవారు. కనకాభిషేకం శ్రీనాథ కవి సార్వభౌముడిలాంటి వారికి జరిగినట్లు చరిత్ర. ఇటీవల కొద్దిమందికి స్వర్ణాభిషే కాలు, రాజులు, జమీందారులు జరిపారు. ఒక సామాన్యరచయితకు కనకాభిషేకమా! నేను ఏం ఘనకార్యం చేశానని? కేవలం యోగమిత్రుల సహృదయత కిది తార్కాణం. నా బ్రతుక్కి ఇదొక తులాభారం.

సహస్రచంద్రదర్శనం అనేదానికి ఒక ప్రత్యేకత వుంది. మనిషి వేయినెలలు జీవించాలి. అంటే 83 సంవత్సరాల నాలుగునెలలు పూర్తయితే ఆ ఉత్సవం చేస్తారు. అది పూర్ణాయుర్దాయం. వేయిపున్నములు దర్శించినవారికి మోక్షప్రాప్తి కలుగుతుందని అంటారు. అరవై సంవత్సరాలు బ్రతికి ఉండడమే గొప్పఅనుకుంటే, సహస్రమాసజీవిగా సన్మానింపబడడం ఉత్తమోత్తమం గదా!

నవంబరు 7వ తేదీ నా పుట్టినరోజు. నా రచనలు ఇప్పటికి 60 పుస్తకాలు వచ్చాయి. అంటే నా సాహిత్య వ్యాసంగానికి ఇది ఒక గుర్తు. పద్యరచనతో ప్రారంభమైన నా రచనా వ్యవసాయం కథలు, గల్పికలు, నవలలు, నాటకాలు, నాటికలు, గేయాలు పామిస్ట్రీ, యోగం, తత్వం... ఇలా అనేక సాహిత్యప్రక్రియలుగా సాగింది. వాటిపైన ప్రముఖసాహితీవేత్తల విశ్లేషణా వ్యాసాలు ప్రచురించారు సావనీరు 'అరవై వసంతాల శార్వరి'లో.

యోగపరంగా రచనలు చేసిన యోగమిత్రులు శ్రీయుతులు కె.రవీంద్రప్రసాద్, సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, జి.నారాయణరావు, సి. నారాయణాచారి, బి.ఎస్.కృష్ణారావు, డా.పద్మావతమ్మ, శ్రీమతి చిత్ర, ఆర్.సత్యనారాయణ, కె.రామేశం, బి.కొండాచారి బి.సి.తిప్పన్న - నా అధ్యాపకత్వ జ్ఞాపకాలను పి.ఆర్.కోటేశ్వరరావు, హితశ్రీ, ఎ.శ్రీదేవి రాసిపెట్టారు. రచయిత శార్వరిని వివిధకోణాలలో విశ్లేషించిన మిత్రులు డా.రావూరి

భరద్వాజ, మునిపల్లెరాజు, సదానంద శారద, మధురాంతకం రాజారాం, మంజుశ్రీ, డా.దేవరాజు మహారాజు, డా.వి. రామచంద్ర, డా.ఎం.వి.శాస్త్రి, పోరంకి దక్షిణామూర్తి, నసుమాసస్వామి, పిలకా గణపతిశాస్త్రి, సి.వి. కృష్ణ, - జర్నలిస్టుగా - జి. కృష్ణ, పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, పొత్తూరివెంకటేశ్వరరావు, -నా కవితపై - ఆర్. వసునందన్, డా.దాశరథి, రాంషా, ఏటుకూరి ప్రసాద్ - నా తాత్వికరచనలపై - టి.గౌరీశంకర్, బుర్రాసుబ్రహ్మణ్యం, డా.వి.వి.ఎల్.నరసింహరావు, డా. వేటూరి ఆనందమూర్తి రచనలు చేసి యిచ్చారు.

మా పిల్లలు శ్రీమతి పద్మప్రియ, మాస్టర్ రమణ, శ్యామ్‌సుందర్, డా. వసంతకుమార్ అక్షరాంజలి సమర్పించారు.

తిరుపతిలో మా ఇంటికి మరో పెళ్లి కళ వచ్చింది. ముసలి పెళ్లికళ కాదు. రమణ డాన్సు ప్రోగ్రాం పెట్టాడు. భజంత్రీలు, పీటలపైన మళ్లీ పెళ్లి వేడుకలు లేవు. పురోహితులు పూజా కార్యక్రమాలు నిర్వహించారు నాలుగైదు గంటలసేపు. బంధువులు, మిత్రులు శిష్యులు వందల సంఖ్యలో వచ్చారు. అది త్రివేణీ సంగమం. స్థానికంగా ప్రొఫెసర్ సరస్వతి, మహిళావిశ్వవిద్యాలయ వైస్‌చాన్సలర్ ప్రొ. రాజ్యలక్ష్మి, మద్రాసు నుండి ప్రొ. రామచంద్ర వేదిక నలంకరించారు. ఆరుగంటలపాటు ఉపన్యాసాలు, అభినందనలు, ఆశీస్సులు ... జరిగాయి. రమణ నాట్యమందిరంలో అలంకృతవేదిక, విద్యుద్దీపాలంకరణ. మొత్తంమీద అదొక భువనవిజయం, అదొక కవనవిజయం.

తిరుపతిలో జరిగిన కనకాభిషేకంలాంటిది హైదరాబాదులో సాహిత్యపరంగా జరపాలని సాహితీమిత్రుల ప్రోత్సాహం వల్ల చి॥వసంతకుమార్ అశోక్‌నగర్‌లోని లైబ్రరీహాలులో ఒక అభినందనసభ ఏర్పాటుచేశాడు. జంటనగరాలలోని రచయితలు, ప్రొఫెసర్లు, లెక్చరర్లు ఎంతోమంది వచ్చారు. డా.సి.నారాయణరెడ్డిగారు ముఖ్యఅతిథి. చిరకాలమిత్రుడు, బంధువు, నా హితైషి డా. రావూరి భరద్వాజ అధ్యక్షత వహించారు. అందరు మహాకవులు, రచయితలు, మిత్రులు జరిపిన అక్షరనీరాజనం శరీరం పులకింపచేసింది. ఒక కవి, రచయితకు మరోపదిమంది తన రచనలను అభినందించడం కంటే గొప్ప బహుమతి ఏముంటుంది. ఎందరో మహాకవుల, జ్ఞానమూర్తుల అభిమానం పొందిన నాకు వారి అభినందనలే అవార్డులు, రివార్డులు. పాఠకుల హృదయాలలో పది కాలాలపాటు నిలిచిపోయే రచనలు చేయడం, రచయితగా మనగలగడం సాహిత్య అకాడమీ అవార్డులకన్న మిన్న. నాకు ఏ అవార్డులూ రాలేదు. రాలేదన్న విచారం ఏనాడు లేదు. నా పుస్తకాలు ముందుతరాలవారిని ఉత్తేజపరచగలగాలి, వారిని చైతన్యవంతుల్ని చేయగలగాలి.

## 1990 గురువు ఒక వ్యక్తి కాదు శక్తి

**నాటకం అయిన తర్వాత తెరదించినట్లయింది షష్టిపూర్తి ఉత్సవం.**

అరవై పూర్తికావడం అంటే ఒకవిధంగా యాక్టివ్‌లైఫ్ పూర్తయినట్లే. బొత్తిగా సంపాదన లేదు. మేకపోతు గాంభీర్యం జీవితం. పిల్లలపైన ఆధారపడి జీవించడం బాధ అనిపించసాగింది. మానసిక క్షోభ, గుంజాటన. పుస్తకాలపై ఏదో వస్తుంది. షష్టిపూర్తి సమయంలో వేసిన 'అరవై వసంతాల శార్వరి' 'సత్యసంహిత' బాగా అమ్ముడవుతున్నాయి. 'సావిత్రి' ఫరవాలేదు. పత్రిక నత్తనడక నడుస్తోంది. చేసేపని లేదు. వేరే ఉండి వేయిరూపాయలు అద్దె కట్టుకునే శక్తి నాకు లేదు. మా ప్రెస్ పెట్టిన ఇల్లు సినీనటుడు సి. నాగభూషణం గారిది. ఆయనకు వేషాలు లేవు. సాయంత్రం నాలుగుగంటల నుండి ఆయన నాకోసం ఎదురుచూచేవాడు. రాత్రి ఎనిమిదివరకు కబుర్లు, సినిమాకబుర్లు, రాజకీయాలు. అప్పుడప్పుడు యోగంపైన విసుగుపుట్టేది, మానివేద్దామని అనిపించేది. వేళకు ఎవరో ఒకరు వచ్చేవారు. వారికోసం కళ్లుమూసుకుని ధ్యానం చేయడం. మానసికమైన విచారం వల్ల తలపోటు, కాస్త ఆరోగ్యం దెబ్బతిన్నది.

డా.బెజవాడ గోపాలరెడ్డిగారి సతీమణి లక్ష్మీకాంతమ్మతన కుమార్తెఅనూరాధను, మనవరాలిని వెంటబెట్టుకుని వచ్చింది. అన్నివిధాల కలవారు, హోదా కలవారు. మనవరాలికి మతిస్థిమితంగా ఉండదు. ట్రీట్‌మెంట్ కావాలి. ఆమెకు యోగంలో చేరాలని కోరిక. పాపకు ట్రీట్‌మెంట్ చేశాను. లక్ష్మీకాంతమ్మకు పుట్టచెవుడు. ఎంత అరిచినా వినిపించదు. ఆమె తనకు మహామంత్రం చెవిలో ఉపదేశించమని కోరింది. మాది అలాంటిపద్ధతి కాదు. ఇక్కడ చెవుల్లో ఊదేది లేదు. బట్టలు పెట్టి గురుదక్షిణ యిచ్చింది. 'అవసరం లేదమ్మా' అంటే వినలేదు. అది సంప్రదాయం, అలా చేస్తే తప్ప, గురుదక్షిణ సమర్పించుకుంటే తప్ప, మంత్రం ఫలించదట. రెడ్డిగారు ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా వున్న కాలంలో ఎవరివద్దనో ఉపదేశం తీసుకున్నదిట. ఆ గురువు పోయాడు. ఆమె మంత్రం మరచిపోయింది. ఆమెకోరిన విధంగానే తల్లి, కూతుళ్లకు ఉపదేశం చేశాను. ట్రీట్‌మెంట్‌కోసం తొమ్మిదివారాలు తిరుపతి రమ్మని చెప్పి పంపాను. అప్పటికి తిరుపతికి మారడం నిర్ణయం అయింది.

డా.గోపాలరెడ్డిగారి కొడుకు మతిస్థిమితం లేక తప్పిపోయినాడట. నలభైఏళ్లవాడు. రెడ్డిగారు పట్టించుకోరు. ఆయన హోదా ఆయనది. ఒకరోజు మధ్యాహ్నం టీ తాగడానికి

వెళ్ళి అటేపోయాడు.పదిసంవత్సరాలైంది అప్పటికి. అతని గురించి అడిగింది. ప్రేయర్‌లో కూర్చుని చెప్పాను. అతను సన్యాసుల్లో కలిసిపోయాడని, ప్రయాగప్రాంతంలో ఉన్నాడని, అఘోరీలతో తిరుగుతున్నాడని చెప్పాను, "ఆరునెలలు ఓపికపట్టండి. అతని మనస్సు మార్చి తిరిగి వచ్చేట్లు చేస్తాను" అని.

వీరు నాకు చెప్పకుండా అలహాబాదు వెళ్ళి, పోలీసుల సాయంతో వెతికారు. ఒక గుంపులో అతనిని గుర్తించారు. వీరు దగ్గరకు వెళ్ళేలోగా అతను పారిపోయాడు.

మిత్రుడు రావూరి భరద్వాజ తన కొడుకు బాలాజీని తీసుకువచ్చాడు. అతనికి భయంకరమైన సుగర్ వ్యాధి. ఫిట్స్ వస్తాయి. పెళ్ళయింది. సంసారానికి పనికిరాడు. తెలిసీ అతను కొడుకుపెళ్లి చేశాడు. కోడలు మంచిపిల్ల. నేర్పు, ఓర్పు గలది.రెండు మూడువారాలు ట్రీట్‌మెంట్‌కు రావాలని చెప్పాను. భరద్వాజ రాడని నాకు తెలుసు. అతనికి తీరదు. ఇలాంటివాటిపై నమ్మకం ఉండదు. ఏనాడు అతను పూజలు, గట్రా చేసిన గుర్తులేదు. ఎప్పుడూ గుడికి వెళ్లిన దాఖలాలు లేవు. పరమ నాస్తికుడు. ఒక్క డబ్బు విషయంలోనే భరద్వాజ ఆస్తికుడు.

రోజూ కొడుకును తీసుకువచ్చేవాడు. తను, కొడుకు, కోడలు వచ్చేవారు. ట్రీట్‌మెంట్ బాగా సాగింది. అతనికి చాలావరకు నయమైంది. అయిష్టంగానే మాతోబాటు యోగంలో కూర్చునేవాడు భరద్వాజ. కొద్దిరోజులకు తనకూ యోగంపై ఆసక్తి కలిగింది. మానసిక శాంతి లభించింది. భార్య కాంతమ్మ నుండి మనస్సుకాస్త యోగంవైపు మళ్లింది. అది తాత్కాలికమేనని నాకు తెలుసు. యోగంలో ఇనీసియేషన్ కోరాడు."ఇంకా నీకు టైం రాలేదు మిత్రమా. వచ్చినప్పుడు నేనే పిలిచి నీకు ఇనీసియేట్ చేస్తాను. అందాకా నిరీక్షించు" అన్నాను. అతనికి ఉపదేశం చేయలేదు.

అడిగిన వెంటనే ఎవరికీ ఇనీసియేషన్ చేయలేను. అవతలి వ్యక్తి సిద్ధంగా లేనప్పుడు, సిన్సియర్ కానపుడు వారిని యోగంలోకి తీసుకోవాలనే బుద్ధిపుట్టదు నాకు.

ఒకసారి మిత్రుడు, మహాకవి, బోయిభీమన్న మా ఇంటికి వచ్చారు. కబుర్లు, కాఫీలు అయినాక,"శార్వరిగారూ, నాకు యోగం నేర్పరూ!" అని అడిగాడు.

నేర్పవచ్చు. ఆస్థానకవి ఆయన. చాలాకాలంగా తెలుసు నాకు. కానీ ఆయన అలవాట్లు నాకు నచ్చవు. అవి యోగానికి సరిపడవు.

"మీ అలవాట్లు మానుకోవాలి! అందుకు మీరు సిద్ధమేనా?"

"ప్రయత్నిస్తాను" అన్నాడు.

మనిషికి కొన్ని బలహీనతలుంటాయి. వాటిని స్పృశిస్తే, గట్టిగా నొక్కితే వారు సహించలేరు. కాని తప్పదు. కత్తి పట్టుకుని కోయకుండా ఆపరేషన్ చేయడం ఎలా?

నొప్పి ఓర్చుకోలేరనే మత్తు యిస్తారు. ఎప్పుడు మత్తులో, మందులో మునిగేవారికి మత్తు వేసే యివ్వడం అసాధ్యం.

0 0 0

'సావిత్రి' రచనతో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారికి నాకు మైత్రి కలిసింది. వారి జ్ఞానబాగ్‌కు నాలుగు అయిదుసార్లు వెళ్లాను. వారి శ్రీమతి రాజకుమారి ఇందిరాధనరాజ్‌గిరి. జమీందారిణి. తెలుగురాదు. ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందీ భాషలలో గొప్ప కవయిత్రి. ఆమె నా సావిత్రి చదివించుకుని విని నాపైన అభిమానం పెంచుకుంది. ఆమెకు నేనంటే, నా రచనలంటే చాలా యిష్టం. నేను చేసే యోగం పట్ల మరీ గౌరవం.

ఒకసారి వారి ఇంటివద్ద ఉండగానే ఆరైంది. నేను లోపల ప్రేయర్ చేసుకుంటానని అడిగాను. ఇందిరాధనరాజ్‌గిరి, శేషేంద్రశర్మగారువచ్చి నాతో యోగంలో కూర్చున్నారు. ఒక గంటసేపు ట్రాన్స్‌లో గడిపారు. గొప్ప ఆనందానుభూతి చెందారు ఇరువురు.

"శేషేంద్రకు యోగంలో ఇనీసియేషన్ చేయరూ!" అని అడిగింది ఆమె.

"అమ్మా. మీరు రాజభోగాలు అనుభవిస్తున్న వారు. నాది ఒకవిధంగా సన్యాసి బ్రతుకు. యోగానికి కొన్ని నియమాలుంటాయి. ఆ కనీస నియమాలు పాటించేవారికే నేను ప్రవేశం కల్పిస్తాను. కనీస నియమ నిబంధనలు పాటించి, నోరుకట్టుకోలేనివారికి యోగం ఫలితాలివ్వకపోగా వికటిస్తుంది. గౌతముడు అన్నీ పరిత్యజించిన తర్వాతనే ఆత్మదర్శనం పొందగలిగాడు. తెలుసుకదా!"

ఒకసారి ఎస్వీ భుజంగరాయశర్మగారి అబ్బాయి వివాహానికి కావలి వెళ్లవలసి వచ్చింది. పెళ్లికి జవాహర్‌భారతి లెక్చరర్లు వచ్చారు. వారంతా శర్మగారిని అడిగారు. 'శార్వరిగారి చేత కాలేజీలో ఒక ఉపన్యాసం యిప్పించమని.' వారి అభీష్టం కాదనలేక పోయాను. నా ఉపన్యాసం కోసం, హోల్‌బెల్ కొట్టి సెలవిచ్చారు విద్యార్థులు, లెక్చరర్లు, అంతా రావటానికి వీలుగా. ఒక గంట సరదాగా చాలాకాలం తర్వాత విద్యార్థుల మధ్య గడిపాను. కవి పండితులు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి అబ్బాయి, తనూ లెక్చరర్, భానుమూర్తి వారింటికి తీసుకువెళ్లారు. వారి శ్రీమతి నన్నుచూడాలని కోరిందిట. ఆమె అరవిందుని అభిమాని. పూర్ణయోగం చేస్తున్నారు. ప్రతిసంవత్సరం అరవిందాశ్రమం వెళ్లి వస్తారు. ఆమెకు యోగంలో చాలా అనుభవాలు కలుగుతుంటాయి. తన అనుభవాలను అరవిందాశ్రమంలో పెద్దవారికి వినిపిస్తే వారికి అలాంటి అనుభవాలు లేక, తమ కేమీ తెలియదని త్రోసిపుచ్చారుట.

నా 'సావిత్రి' చదువుతున్నపుడు తన అనుభవాలన్నింటినీ అందులో దర్శించిందట. తన సందేహాలన్నింటికీ సమాధానాలు లభించాయి. ఆమె నా 'సావిత్రి'

నిత్యపారాయణ చేస్తుంది. అరవిందుల అనుభూతుల్ని అంతచక్కగా ఆవిష్కరింపచేసిన 'సావిత్రి' కర్తగా నన్ను ఒకసారి చూడాలని ఆమె కోరిక. ఇంటికి వెళ్లగానే సజలనయనాలతో స్వాగతించింది. అవి ఆనందబాష్పాలు. ఆమెకు అరవిందయోగిని దర్శించిన అనుభూతి కలిగింది. పరవశించింది. 'గురుదేవా' అంటూ పాదాభివందనం చేసి, తన హృదయంలో వున్న అరవిందుల మూర్తిని స్మరించింది. నేను ఆమెకు గురువును కాను. కాని ఆమె నాలో తన నిజ గురువును దర్శించగలిగింది. అది శిష్యతా లక్షణం.

ఒక శిష్యుని, సాధకుని మనస్థితి అలా ఉండాలనిపించింది. 'గురువు' అనేమాట ఒకవ్యక్తికి సంబంధించిందే అయినా దాని వెనుక ఉన్నది ఒక వ్యక్తి కాదు, శక్తి. గురువు యొక్క అనుగ్రహం, శక్తి. అందుకోగలవారు సమర్థులైన వారినుండి వాత్సల్యాన్ని, అనుగ్రహాన్ని అందుకుని అనుభూతి చెందగలరు. గురువు అనేది ఒక తత్వం...పరాశక్తికి గురువు ఒక ప్రతినిధి మాత్రమే.

# 1991

## మళ్లీ తెల్లవారింది

### కృష్ణమూర్తిగారు వచ్చారు.

డ్యూటీ లేనప్పుడు నా వెంట తిరగడమే వారి డ్యూటీ. కొద్దిరోజులుగా నా మనస్సు బాగుండడం లేదు. ఆ విషయం వారికీ తెలుసు. ఏదో అసంతృప్తి. పరిస్థితులు దారుణంగా మారాయి. ఇద్దరం కెనరా బ్యాంకుకు వెళ్లి నా పర్సనల్ ఎకౌంట్, శార్వరి పబ్లికేషన్స్ ఎకౌంటు మూసివేశాం. చాలాకాలంగా ఆ ఖాతాల్లో జమచేసింది లేదు బిజినెస్ లేక. వేలు వుండేవి ఇదివరకు. ఇల్లు కట్టడం, వ్యాపారం సన్నబడడం, కొత్తపుస్తకాలు రాయలేకపోవడం, రాసినా అచ్చువేసే శక్తి లేకపోవడం... ఇలా అనేక కారణాలు. రెండు ఎకౌంట్లు మూసివేస్తే 250 రూపాయలు వచ్చాయి. తిరుపతికి రెండు టికెట్లు తెప్పించాను. అప్పుడు టికెట్టు వెల నూరు రూపాయలే. మిగిలింది 50 రూపాయలు.

కొంతకాలం మనిషిని విధి నడిపిస్తుంది. అదృష్టం కలిసి వచ్చినట్లు అనిపిస్తుంది. కాని కాలంలో ఆ విధి మనిషిని వెక్కిరిస్తుంది. అప్పుడు దానిని 'కర్మ' అనుకుంటాం. పూర్వజన్మ పాపశేషం ఇలా అనుభవిస్తున్నాం అనిపిస్తుంది. మన స్వయంకృతమే కారణం కాదని స్పష్టంగా అనిపిస్తుంది. ఈసారి ప్రయాణ లక్ష్యం వేరు - యుద్ధంలో ఓడిపోయినవాడు, పారిపోతున్నట్లు. ఎక్కడ తలదాచుకోవాలో తెలియదు. 14 సంవత్సరాలు హైదరాబాదు జీవితం. ఇదొక మార్పు చివరిరోజుల్లో. ఉద్యోగరీత్యా మారడం బాధని పించదు. నిరుద్యోగ కారణంగా బ్రతకలేక పారిపోవడం దారుణం. సాయంత్రం ప్రయాణం. గుండెబరువు - లాంఛనమైన పలకరింపులు - బి.ఎస్.కృష్ణారావు, చిత్ర స్టేషనుకు వచ్చారు. కృష్ణమూర్తిగారు మా వెంటే ఉన్నారు. ఇంకా ఎవరెవరు వచ్చారో జ్ఞాపకం లేదు. మాస్టరుగారిపైన భారం వేసినా గుండెబరువు తగ్గలేదు. కన్నీరు ఆగడం లేదు. మా ఇద్దరి మనస్థితి ఒక్కలాగే వుంది. వీడ్కోలు చెప్పడానికి వచ్చినవారితో సంతోషంగా మాట్లాడడానికి, మాటలు కరువైనాయి. రైలు కదిలింది. మిత్రులు కన్నీరు తుడుచుకుంటూ ప్లాట్‌ఫాంపైన నిలిచిపోయారు.

ప్రతిజీవి ప్రపంచంలోకి ఒంటరిగానే వస్తుంది. తిరిగి ఒంటరిగానే పోతుంది. మనుషులూ అంతే. పుట్టేది ఒంటరిగా, పోయేది ఒంటరిగానే. మధ్యలో అనుబంధాలు, బాంధవ్యాలు ఎలా ఏర్పడతాయో, అలాగే దూరమై తెగిపోతుంటాయి. యవ్వనంలో ఒక స్త్రీ, ఒక పురుషుడు కలసి బ్రతకడానికి పెళ్లితో అనుబంధం ఏర్పరచుకుంటారు. అది

జంట ప్రయాణం. ఆ ప్రయాణంలో సంతానం వచ్చి కలుస్తుంది. కొంతకాలానికి వారు జంటలు కట్టి, వేరు ప్రయాణం సాగిస్తారు. మళ్లీ ఈ జంట ఒంటరిగా ప్రయాణం సాగించవలసి వస్తుంది. అప్పటికి వృద్ధాప్యం ముంచుకు వస్తుంది. యవ్వనం ఉండదు. కోరికలుండవు. భగవంతుడు కనికరించే వరకు బ్రతకడం ఒక్కటే చేయదగిన పని. చేయలేని పనికూడా అదే. చివరకు, ఎవరికాలం సమీపించినప్పుడు వారు నిష్క్రమిస్తారు. ఎవరూ రెండవవారికోసం ఆగరు. అనుబంధాలు ఎవరినీ బంధించి ఉంచవు.

ఇలాగ మనసులోని సుడులు, సుడిగుండాల్ని సృష్టించాయి. రైలులో ఏమీ తినబుద్ధి కాలేదు. గుంటూరు దాటి రైలు తెనాలి చేరుతుండగా, మనస్సు కాస్త తేరుకుంది. గతం గుర్తుకువచ్చింది. మా స్వగ్రామం వేజెండ్ల, గుంటూరు తర్వాత స్టేషను. పెరిగింది తెనాలిలో. గుంటూరు, తెనాలి జంట పట్టణాలతో నా అనుబంధం, సహవాసం చాలా ఎక్కువ. చిన్నప్పటి విషయాలు సినిమారీళ్లుగా తిరిగాయి మనోఫలకంపైన. ఒకప్పుడు 1958లో పొట్టచేతపట్టుకుని ఈ స్టేషనులోనే మద్రాసు రైలు ఎక్కాను. ఇప్పుడు తిరిగి తిరిగి ఇక్కడకు చేరుకున్నాను. జననీజన్మభూమి అన్నారు. నాకు అవీ లేవు. ఉన్న చిన్న ఇల్లు ఏ నాడో కర్పూరంలా హరించింది.ఆ ఊరిలో ఒకరిద్దరు పలకరించేవారున్నా, ఆదరించి రెండురోజులు ఆశ్రయమిచ్చే వారు లేరు. ఆనాటిబంధం అనాటిదే. ఈనాటి వరకు రాదు.

తెనాలి గాలి కాస్త మనస్సుకు ఊరట కలిగించింది. నాలో కొత్త ఊపిరి పోసింది. అరవైఏళ్లు నిండిన జీవితం. తిరుపతిలో గడపవలసి వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఒక ఇల్లు ఏర్పడ్డది. మాస్టరుగారు ముందుగానే ఆ ఏర్పాటు చేసి పెట్టారు కనుక, ఇది విధిలిఖితం అనుకున్నాను. ఏదో ఒక మార్గం మాస్టరుగారే చూపిస్తారన్న చిరు ఆశ లోలోపల. తిరుపతి పుణ్యక్షేత్రమే కానీ నాకు భక్తిలేదు. యోగం వచ్చి భక్తి స్థానాన్ని ఆక్రమించింది. భక్తిని తరిమివేసింది నాలోంచి, నా జీవితంలోంచి. నా మనస్సులో ఒక్క యోగానికి తప్ప మరిదేనికీ చోటులేదు. మునిగినా తేలినా యోగమే ఆధారం. పోతన్న రామపాదాలను ఆశ్రయిస్తే, అన్నమయ్య వేంకటేశ్వరుని పాదాలు ఆశ్రయించాడు. నేను గురుదేవుని ఆశ్రయించాను. అలాంటి క్లిష్ట సమయాల్లోనే మనిషికి తన మేధస్సుపై నమ్మకంపోతుంది. యోగం చేస్తాం, తపస్సు చేస్తాం, ఫలితం కనిపించనప్పుడు లేదా ప్రతికూలం అయినప్పుడు వాటిపైన నమ్మకం పోతుంది. ఏం చేసినా ఏదో సుఖపడాలనే చేస్తుంటాం! గురువును స్మరించినా, మాస్టరును స్మరించినా ఫలితం కనిపించకపోతే? ఊరట లభించకపోతే! వారిపైన వారిశక్తిపైన నమ్మకం సన్నగిల్లుతుందీ.

ఎవరో 'గురువుగారూ, మాస్టరుగారూ' అంటే నాకేం వొరిగింది. ఇవన్నీ భేషజాలు. సాగినంతకాలం బాగానే వుంటాయి ఈ గురు శిష్య బంధాలు. విధి

వక్రించినప్పుడు గురువులు తెరమరుగు కావలసిందే! 'గురువు' అనే మాటను నాకు అన్వయించుకోరాదని నిర్ణయించుకున్నాను. ఎన్నో బలహీనతలు నాలో ఇంకా మిగిలి ఉన్నప్పుడు, నేను గురువునెలా అవుతాను? అలా పిలిపించుకోవడం అనవసరం అనిపించింది. గురువు స్థానానికి, పిలుపుకు చాలా అర్హతలు కావాలి.

రైలు వెళ్లి... వెళ్లి... చీకట్లను చీల్చుకుని సూర్యునితో పయనించి, సూర్యోదయ సమయాన తిరుపతి స్టేషనులో ఆగింది. అది మా వరకు మాకు మరోప్రపంచం. నేనిప్పుడు యాత్రికుడిని కాను. మా యాత్రకు గమ్యం వేరు. స్వామివారి దర్శనం మా యాత్రకు గమ్యం కాదు. స్వంతఇంట బ్రతుకు సాగించటం. అదొక్కటే మిగిలిన తృప్తి. నా రాక ఎలా పసికట్టారో గాని, నాలుగురోజుల్లో నలుగురు ఆడవారు వచ్చారు. వారు నర్సు ఉద్యోగం చేస్తున్నవారు. ఒక్కొక్కరిది ఒక్కొక్క సమస్య. ఒకామె భర్తకు గుండెజబ్బు. మరొకామెకు భర్త సమస్య. యోగం ద్వారా ట్రీట్‌మెంట్ చేయమని అర్థించారు. అందరూ నర్సులే. వారికి డాక్టర్లు, మందులు అందుబాటులో ఉన్నా నా చికిత్సే కావాలి. నాపైన విశ్వాసంతో వచ్చారు. చాలా భక్తి ప్రపత్తులున్నవారు. నాతో కలిసి ప్రేయర్ చేసుకున్నారు.

వెళుతూ కొంతడబ్బు, మాస్టరుగారి ఫోటో దగ్గర పెట్టి వెళ్లారు. అది తిరుపతిలో తొలిసంపాదన. నా సంపాదనకు మాస్టరుగారు చూపించిన మార్గం. మళ్లీ ఉమాసుందరి వచ్చారు. ఆమె స్టాఫ్ నర్సు. సంస్కారవంతమైన కుటుంబం, భర్త, పిల్లలు ఉన్నారు. కర్నూలు హరిహరశర్మగారి వదినగారు. ఆమె భర్తకు మద్రాసులో ఉద్యోగం. ఆయన్ని తీసుకువచ్చి, గుండెజబ్బుకు ట్రీట్‌మెంట్ చేయించుకుని ఓ అయిదువందలు యిచ్చింది. ట్రీట్‌మెంట్స్ చేసి డబ్బుతీసుకోవచ్చునో, లేదో నాకు స్పష్టంగా తెలియదు. అడగకుండానే యిచ్చి వెళుతున్నపుడు తీసుకోవడంలో తప్పులేదేమో! ఇవ్వలేనివారిని పీడించి తీసుకుంటే తప్పు. డబ్బు యిస్తే తప్ప ట్రీట్‌మెంట్ చేయను అనడం తప్పు. ఆ రెండు తప్పులు చేయనప్పుడు, చేసింది ఒప్పే అవుతుంది. 'తప్పు' పనిని మాస్టరుగారు నాచేత చేయించరని నా నమ్మకం. ఇంక నా శేషజీవితం యోగానికి పరిమితం కావాలన్నది మాస్టరుగారి నిర్ణయం. ఆదాయానికి మార్గాలు ఆయనే చూపించారు.

0 0 0

పుస్తకాలు పంపడానికి పోస్టాఫీసుకు వెళ్లడం రోజూ ఉంటుంది. అక్కడ సుగుణమ్మ అనే ఆమె నాఅడ్రసు చూచి సాయంత్రం భర్తతో వచ్చింది ఇంటికి. ఆమెకు ఆస్మా. శ్వాస తీసుకోవడం కష్టం. సన్నగా, పీలగా ఉండేది. భర్త ఇన్సూరెన్సు ఆఫీసరు. వచ్చి ట్రీట్‌మెంటు తీసుకుంది. వారంరోజుల్లో ఆమె ఆరోగ్యం చక్కబడింది. మనిషి హుషారుగా తయారైంది. వారం తర్వాత వచ్చి రెండువేల రూపాయలు యిచ్చింది. "ఏడెనిమిది

సంవత్సరాలుగా ఈ జబ్బు క్రుంగదీస్తున్నది. ఎన్నిమందులు వాడానో లెక్కలేదు. ఇంక జీవితంలో నయం కాదనుకున్నాను. మీరు యోగంతో నాకు ప్రాణభిక్ష పెట్టారు" అంది ఆనందంగా చెప్పింది. సంతోషంగా యిచ్చిన డబ్బు. కాదనడానికి లేదు. ట్రీట్‌మెంట్ చేసిన తర్వాత డబ్బు తీసుకోకపోతే అదొక అపార్థం కల్పిస్తుంది. వారికి గిల్టీగా ఉంటుంది. 'అయ్యో, మనం మేలుపొందామే! తిరిగి కృతజ్ఞత ఏ రూపంలోనూ చూపలేకపోయామే' అనుకుంటారు అలాంటివారు. ఒకరు మనకు మేలుచేస్తే, ప్రత్యుపకారం చేయడం లేదా తగిన ప్రతిఫలం యివ్వడం మన సంప్రదాయం.

0 0 0

తిరుపతి చేరాక మనస్సు శూన్యం అయింది. సంపాదన లేదని కాదు. అదొక శూన్యస్థితి. అదీ యోగంలో భాగమేమో! తెలుగు విజ్ఞానసర్వస్వం వారి పని ఒకటి తగిలింది. ఆరునెలలు లేదా ఒక సంవత్సరం చేతినిండా పని. ప్రతిఫలం కూడా బాగానే వుంది. డబ్బుకోసం కాదు. అదొక నిర్వికారస్థితి. మనస్సు దేనిపైన లగ్నం అయేది కాదు. సహజ యోగ పరిణామక్రియ అనిపించింది. జీవితం ఎటుతిరిగినా దిగులు లేదు. అంతం అయినా చింత లేదు.

ఆగస్టు వచ్చింది. మాస్టర్స్ బర్త్‌డేకి నేను సమావేశం పెట్టడం లేదు. మే, డిసెంబరు సమావేశాలే నా పరిధి. అక్కడ ఎ.వి శ్రీనివాసాచారిగారు జయంతి బాగా జరుపుతారు. నాకూ ఆహ్వానం పంపారు. సాయంత్రం ప్రేయర్ వేళకు వెళ్లాను. నూరుమంది వరకు సాధకులున్నారు. ఇల్లంతా నిండిపోయారు. చిత్తూరు నుండి రాజుగారి బృందం ఎక్కువమంది. ఆచారిగారు నన్ను ప్రేమగా పిలిచి, సంతోషంగా తన సరసన కూర్చోబెట్టుకుని అందరికీ పరిచయం చేశారు. సాధనపద్ధతుల్లో తేడాలున్నా, వారు, నేను మంచిమిత్రులం. యోగవిషయంగా ఒకరిపట్ల ఒకరికి గౌరవాదరాలున్నాయి. కల్పవల్లిగారిని వారే పరిచయం చేశారు అప్పుడు.

ప్రేయర్ అయిన తర్వాత నేను, విజయవాడ నుండి వచ్చిన కె.ఎల్.రెడ్డి బజారులో నిలబడి మాట్లాడుకుంటుండగా సాధకులు నలభై, యాభై మంది బయటకు వచ్చి నాతో ముచ్చటించసాగారు. ఒక అరగంట తర్వాత ఆచారిగారు వచ్చి "లోపల మాట్లాడుకుంటే అందరికీ ఉపయోగం. రండి... శార్వరిగారు ఎక్కడవున్నా జనం చేరతారు" అన్నారు ఛలోక్తిగా.

కె. ఎల్. రెడ్డిగారు ఒక యువకుని పరిచయం చేసి, నా వెంట నడిచారు మా ఇంటివరకు. ఆ కుర్రవాడు బి.కాం. చదువుతున్నాడు. యోగం చేస్తాడు. శరీరం నుండి విపరీతంగా వేడిపుడుతుంది. ఆ వేడి అతనివరకు పరిమితమైతే ఫరవాలేదు. క్లాసులో

ముందు, వెనక బల్లలపైన పిల్లలు దూరంగా పోతారుట. అందరికీ దూరంగా, చివరన ఒక బెంచీపైన ఇతను ఒక్కడూ కూర్చుంటాడు. ఆ వేడి తగ్గించడం డాక్టర్లవల్ల కాలేదు. ఆ వేడి థర్మామీటర్‌కు అందదు. ప్రక్కవారికి సెగలు పుట్టిస్తుంది. ఆ అబ్బాయి కాలేజీకి వెళ్లడం మానివేశాడట. నన్ను ట్రీట్‌మెంట్ అడిగాడు. "అదేమిటి రెడ్డీ! 'మీరంతా నాకన్న సీనియర్స్. విజయవాడలో అంతమంది ఉన్నారు. ట్రీట్ చేయకపోయారా?' అన్నాను.

తానే యోగానికి మహాప్రతినిధినని రెడ్డికి గర్వం. ఎవరినీ లెక్కచేయడు. ఫోజులు కొడుతుంటాడు.

"మా వల్ల కాలేదు" నిస్సిగ్గుగా చెప్పాడు.

"ఆచారిగారు ఏమన్నారు?"

"మూడు రోజులుగా చేస్తున్నారు. ఏమీ కాలేదు"

"నేను చేస్తే ఆయనకి కోపం వస్తుందేమో, ఆలోచించండి!"

"కోపం ఎందుకు! తాను చేయలేని పని మరొకరుచేస్తే గర్వించాలి, అభినందించాలి"

ఇంటికి తీసుకుపోయి, ఆ కుర్రవాని తలపై చేయిపెట్టి, అయిదు నిమిషాలు ట్రీట్‌చేశాను. నార్మల్‌కు వచ్చింది. ఒకప్రేయర్ యిచ్చి, "ఇది చేసుకోమనండి. మరలా అంత వేడి పుట్టదు" అని అన్నాను.

"ఏం చేశావు శార్వరీ" అని రెడ్డి అడిగాడు.

"మీరు చేయలేని పని" అన్నాను.

0 0 0

సీనియర్ సాధకులకు ట్రీట్‌మెంట్ పట్ల ఎంతో ఆసక్తి కానీ చేయలేరు! ఆ ప్రాంతంలో శ్రీ కొత్త రామకోటయ్యగారు ఒక్కరే ట్రీట్‌మెంట్స్ చేస్తారు. ఒకరిని చూచి నేర్చుకునే విద్యకాదది. మాస్టరుగారి అనుగ్రహం పొందాలి. అంతే!

మర్నాడు ఉదయం శ్రీనివాసాచారిగారు, పెరికలయ్యగారు మా ఇంటికి వచ్చారు. అదే మొదటిసారి ఆచారిగారు నావద్దకు రావడం. 1987 డిసెంబరు సమావేశాల సమయంలో వచ్చారని చెప్పారు. నాకు కనిపించకుండానే వెళ్లిపోయారు. బజారుపనిమీద వెళ్లినప్పుడు తప్పక వారింటికి వెళతాను. వారు ఊరిలో వుంటే కాసేపు కబుర్లు. ప్రేయర్‌కు వారు పిలిచినా నేను వెళ్లను. ఎవరో ఒకరు నా వద్దకు ప్రేయర్‌కు వస్తారు.

"రాజమండ్రి నుండి కృష్ణయ్యగారని ఒక ఇంజనీరు నిన్ననో మొన్ననో మీ వద్దకు వచ్చాడు"

"ఆ వచ్చారు, మన చిత్తూరు రాజు గారితో కలిసి" అన్నాను.

"అతని కూతురు శైలజ. ఆ పిల్లకి నరాల వీక్‌నెస్. స్థిమితంగా ఉండదు. చదవలేదు. శరీరం చెమటపట్టి వణికిపోతుంటుంది. నిలబడలేదు. నడవలేదు. మీ శిష్యుడు పెంచలయ్యగారు ట్రీట్‌మెంట్ చేశాడట. తగ్గినట్లే అనిపిస్తుంది మళ్లీ వస్తుంది. ఆ కేసు మీరు చేయాలి" అని అడిగారు సీసా గారు.

"మీరు చేయవచ్చుగదా!" అన్నాను.

"చేస్తున్నాను, గుణం కనిపించడం లేదు."

"సరే పంపండి. రేపు ఉదయం రమ్మనండి"

"నేనే తీసుకువస్తాను వెంటబెట్టుకుని" అన్నారు.

"పెద్దవారు మీరు రానవసరం లేదు. ఆ అమ్మాయిని ఈ రోజు సాయంత్రం పంపండి. చూస్తాను" అని పంపాను.

సాయంత్రం ఆ అమ్మాయి, తండ్రిగారు వచ్చారు. కేసు గురించి వివరాలు చెప్పారు. మెడిసిన్‌లో చేరినప్పటి నుండి అదే జబ్బు రెండు సంవత్సరాలుగా. పెంచలయ్య ట్రీట్ చేసినా తగ్గలేదు. ఇప్పుడు మరీ ఎక్కువైంది. కాలేజీ మానుకున్నదిట

"ఆచారిగారు ఎన్నాళ్లుగా చేస్తున్నారు?"

'నెల పదిహేను రోజులైంది ఇక్కడకు వచ్చి, ఏం గుణం కనిపించ లేదు' అన్నారు.

నేను ప్రేయర్‌లో కూర్చోబెట్టాను. ట్రీట్‌మెంట్ యిచ్చాను. "రేపు ఉదయానికి చాలా వరకు తగ్గిపోతుంది. నాలుగురోజులు వరసగా రండి" అని చెప్పాను.

మూడవరోజుకే ఆమె హాయిగా నడవగలిగింది. ఆయాసం, నరాల బలహీనత అన్నీ పోయాయి. నాల్గవనాడు వచ్చి "మీరు పర్మిషన్ యిస్తే వెళ్లిపోతాం" అన్నారు.

"వెళ్లి కాలేజీలో జాయిన్ అవ్వమను. ఒక సంవత్సరం చదువు వృథా చేసుకోనవసరం లేదు. ఇంక ఆమెకు ఏ జబ్బు రాదు" అని పంపాను.

0 0 0

రేణిగుంట సమీపాన ఎర్రమాండ్యం అనే ఊరుంది. అక్కడ సుబ్రహ్మణ్యాచారి అనే రిటైర్డ్ హెడ్‌మాస్టరు జ్యోతిషం బాగా చెబుతాడని చెప్పగా వెళ్లాను. కాస్త జ్యోతిషం పిచ్చి, అందరికున్నట్లే నాకూ ఉంది. మద్రాసులో నాడీ జ్యోతిషాలు అనేకం చదివించాను. ఆ చెప్పేది అక్షరసత్యాలు కావు. అన్నీ జరగవు. అయినా ఎప్పటికప్పుడు ఆశ. తాత్కాలిక ఉపశమనం కోసం పనికొస్తాయి జ్యోతిషాలు. కొన్నికొన్ని నిజాలవుతాయి. పూర్తిగా కొట్టివేయడానికి లేదు, అని పూర్తిగా నమ్మడానికి ఉండదు. అదొక బలహీనత. కష్టాలలో ఉన్నవారికి అది ఊరటకలిగిస్తుంది. జ్యోతిష్కులు కఠోరనిజాలు కొన్ని చెప్పరు తెలిసినా.

సూచనప్రాయంగా చెప్పి దాటవేస్తుంటారు. అశుభాలు వారి నోట పలకడం ఇష్టం ఉండదు. కాస్త మంచివి, అనుకూలమైనవి కనిపిస్తే గట్టిగా, బలంగా చెబుతారు.

నేనూ చిన్నబ్బాయి రమణ ఎర్రమాండ్యం వెళ్లాం. తానే ఆ జ్యోతిష్కుని గురించి చెప్పింది. అతను నేను ఫలానా అని చెప్పగా మంచి మర్యాద చేశాడు. నా గురించి విని ఉన్నాడట. నేను ఏ పరిస్థితుల్లో హైదరాబాదు వదలి వచ్చిందీ కళ్లకు కట్టినట్లు, చూచినట్లు వర్ణించాడు. ఫలానారోజు రాత్రి పదిగంటలనుండి నా మనస్సు కుదట పడ్డదనీ చెప్పాడు. చాలా కరెక్టు. తిరుపతిలో శ్రీనివాసుని సన్నిధిలో ప్రశాంతంగా హాయిగా గడుస్తుందని చెప్పాడు. నా జాతకచక్రం చూచి మేం కట్టుకున్న ఇంటిని వర్ణించి చెప్పాడు. ఎటు సింహద్వారం వుంది, ఎన్ని గుమ్మాలు, కిటికీలు వున్నాయి, వాస్తు సైతం చెప్పాడు. అంత బాగా జ్యోతిషం చెప్పడం లోగడ నేను చూడలేదు.

అప్పుడే మా రమణ జాతకం చూచాడు. ఇతను కలలుకంటున్నట్లు కళాకారుడు కాలేడు. డాన్సుకు స్వస్తి చెప్పి సైన్సులో రీసర్చి చేసి, డాక్టరేట్ సంపాదించి, విదేశాలలో సైంటిస్టు అవుతాడు. గొప్ప భవిష్యత్తు వుంది సైంటిస్టుగా అని చెప్పాడు. తను అప్పటికి పిహెచ్.డి చేయలేదు. మూడేళ్లు చేసింది. ఏ కారణంగానో మళ్లీ మొదటికొచ్చింది. ఒక రెసిడెన్షియల్ కాలేజీలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా చేరాడు. ఇంక పిహెచ్.డిపై ఆశలు వదులుకున్నాడు. పెళ్లయింది. లెక్చరర్‌గా స్థిరపడి, పార్ట్‌టైంగా కళాపోషణ చేయాలని అభిప్రాయం. ఈయన తను టీచింగ్‌లైనులోనే ఉండడని సైంటిస్టు అవుతాడని ఖరాఖండిగా చెప్పేశాడు. మా అబ్బాయికి అతనిపై కోపం వచ్చింది. ఆయనకు జ్యోతిషం చెప్పడం రాదనేశాడు.

నెలరోజులు తిరగకుండానే లెక్చరర్ ఉద్యోగం మానివేసి ఎళ్లీ రీసర్చిలో చేరాడు. డాన్సులు కట్టిపెట్టాడు. మూడు సంవత్సరాలలో పిహెచ్.డి. చేసి వెంటనే అమెరికా వెళ్లి సైంటిస్టుగా స్థిరపడ్డాడు. ఇదంతా తర్వాత జరిగిన కథ. ఇప్పుడు ఆయన చెప్పిన జ్యోతిషం వరకు ప్రస్తుతం.

0 0 0

మాస్టర్ రమణ వద్దకు ఇస్మాయిల్ అనే ఒక టెలిఫోన్ ఉద్యోగి నృత్యం నేర్చుకోడానికి వస్తుండేవాడు. అతని కొడుకు 12 ఏళ్లవాడు అంధుడైనాడు కళ్లజబ్బు చేసి. హైదరాబాదు తీసుకువెళ్లగా సరోజినీ ఆస్పత్రిలో ఒక కన్నుపోయింది. మద్రాసు అపోలో ఆస్పత్రిలో రెండవ కన్నుపోయింది. రెండు కళ్లు ఇంతలావుగా ఉబ్బరించి, ఎర్రగా ఉండేవి. కూలింగ్ గ్లాసెస్ పెట్టుకునేవాడు. రమణ రికమెండేషన్‌తో ఆ కుర్రవానికి నలభైరోజులు ట్రీట్‌మెంట్ చేశాను. రోజూ ఉదయం ఆరింటికే సైకిల్‌మీద తీసుకు వచ్చేవాడు.

పదిహేను రోజులకే ఆ కుర్రవానికి కళ్లవాపులు, ఎరుపు తగ్గింది. మరొక 15 రోజులలో చూపు వచ్చింది. తర్వాత పదిరోజులు తానే ఒంటరిగా తండ్రి సాయం లేకుండా వచ్చాడు. 40 రోజులు పూర్తి అయ్యేసరికి అతనికి చూపు బాగా వచ్చింది. పుస్తకాలు చదవగలిగిన స్థితి ఏర్పడ్డది.

రెండుకళ్లు పెద్ద ఆస్పత్రులలో పోగొట్టుకున్న కుర్రాడికి రెండు కళ్లకు చూపు రావడం తిరుపతిలో పెద్దసంచలనం సృష్టించింది. ఇస్మాయిల్ నా యోగం గురించి ఎందరికో చెప్పాడు. అలా క్రమంగా నా 'యోగాశ్రమం' ప్రసిద్ధమైంది.

0 0 0

జీవితం అనేది షడ్రుచుల సంగమం. తీపి, పులుపు, చేదు, కారం, ఉప్పు, వగరు ఎవరైనా రుచిచూడక తప్పదు. ఆరోగ్యానికి అన్నీ అవసరం. జీవితానికీ ఇవన్నీ అవసరం. ప్రతివ్యక్తి తన జీవితం హాయిగా, తీయగా, జాలీగా గడపాలనే అభిలషిస్తాడు కానీ అలా ఎన్నటికీ జరుగదు. ఈ సంవత్సరం జీవితంలో అన్ని రుచులు అనుభవించాననే చెప్పవచ్చు. మంచివారు చేరారు. చెడ్డవారు చేరారు. మంచిచెడులను విశ్లేషించే శక్తి నాకు లేకుండా పోయింది. మంచి ఎంత అవసరమో జీవితంలో చెడు అంతే అవసరం అని సరిపెట్టుకోక తప్పలేదు.

ఈ సంవత్సరంలో 120 మంది యోగంలో చేరారు. ఒక్క సంవత్సరంలో అంతమంది చేరడం వల్ల నాలో కొత్త ఆశలు చివురించాయి. ఉత్సాహం ఉరకలు వేసింది. పత్రిక బాగాసాగింది. కొత్తగా ప్రచురించిన పుస్తకాలు లేవు. రాసే మూడ్ లేదు. అప్పట్లో ట్రీట్‌మెంట్స్, ఇనీసియేషన్ - ఇవే కార్యక్రమాలు. మాస్టరుగారు తనను పూర్తిగా నమ్ముకున్నవారికి ఏదో ఒక మార్గం చూపిస్తారు. మనకు ఆ నమ్మకమే కలగదు. తుపానులో చిక్కుకున్న పడవ ఒక ఒడ్డుకుపోతుంది. అంతమంది యోగంకోసం రావడంతో తిరుపతిలో మా 'యోగాశ్రమం' అని చెబితే చాలు, ఏ రిక్షా, ఆటో అయినా తీసుకు వచ్చేవారు.

ఎవరైనా యోగం చేసేది తమ అభివృద్ధికోసమే. తమ ఆత్మతృప్తి కోసమే. నా లక్ష్యం అది కాదు. నా కోసం నేను చేసుకోను. నా యోగం, నా సాధన పదిమంది కన్నీరు తుడిచి ఆనందం ఆరోగ్యం ప్రసాదించగలగాలి. ఇంత యోగం చేసి, ఇంత తపస్సు చేసి నేను పరలోకాలలో ఏం సాధిస్తానో అనవసరం. చేసినంత మేర ఇక్కడ ఉపయోగపడాలి. అది నా యోగసూత్రం. నా కృషికి ఇక్కడ ఈ లోకంలోనే ఫలితం కనిపించాలి.

మా ఇంటికి ఎదురుగా వుంది ఖాదీకాలనీ. అక్కడ ఆంధ్రాబ్యాంకు రీజినల్ మేనేజరు కె.ఎ.రావుగారుంటారు. వారి తండ్రిగారికి పక్షవాతం... వేటపాలెం స్వగ్రామం.

విజయవాడ రైల్వేలో ట్రాఫిక్ కంట్రోలర్‌గా చేశాడు. ఒక సాయంత్రం కారులో తీసుకు వచ్చాడు. ఇద్దరు జవానులు పట్టుకుని ఇంట్లోకి తెచ్చారు. ఆ జవాన్లను వెళ్లిపొమ్మని చెప్పాను.

'తిరిగి వెళ్లేప్పుడు రోడ్డుపైన కారువరకు తీసుకువెళ్లాలి కదా! ఉండనీయండి' అన్నాడు రావుగారు.

"అవసరం లేదు. ట్రీట్‌మెంట్ అయిన తర్వాత మీ నాన్నగారు స్వయంగా నడవగలరు. మీరు కాస్త చేయి ఆసరా యిస్తే చాలు" అన్నాను.

ఆయన నమ్మలేదు. ఒక్కగంటలో పక్షవాతం మనిషి ఎలా నడవగలడు?" అదీ ఆయన అనుమానం.

ట్రీట్‌మెంట్ తర్వాత ఆయన చక్కగా లేచి కూర్చున్నాడు. కాఫీ తాగాడు, స్వయంగా రోడ్డువరకు నడిచి కారెక్కాడు. తర్వాత నాలుగురోజులు కారులో వచ్చాడు. ఆ తర్వాత రోజూ మా ఇంటివరకు నడిచి వచ్చేవాడు. తిరిగివెళ్లేప్పుడు నేను తోడుగా, వాళ్ల ఇంటివరకు వెళ్లేవాడిని. వేటపాలెం వెళ్లినప్పుడు వారింటికి వెళ్లివచ్చాను. చక్కగా నయమైంది.

0 0 0

కొత్తగా యోగంలో చేరిన కొందరు అభిమానంతో విశాఖపట్నం ఆహ్వానించారు. అప్పుడు యోగంలో చేరారు జి.డి.పి.ఆర్. గురువురెడ్డి, కె. సూర్యారావుగారు. చాలామంది చికిత్సకు వచ్చారు. కొద్దిమంది యోగంలో చేరారు. ఒకమ్మాయి వచ్చింది. ఉద్యోగం చేస్తున్నది. ప్రేమవివాహం అనుకుంటాను. భర్తకు ఆమెకు సఖ్యత లేదు. చిన్న కుర్రాడు. ఎర్రగా, బొద్దుగా ఉన్నాడు. కానీ మాటలు రావు. అందుకే వచ్చింది. మూడురోజులు ట్రీట్‌మెంట్‌తో ఆ అబ్బాయికి మాటలు వచ్చాయి. ఆ కన్నతల్లి ఆనందం వర్ణనాతీతం! "మూకంకరోతి వాచాలం!" అలాంటి సందర్భాలలో యోగం నీడన ప్రేమకదలికలు.

మరొక అమ్మాయి వచ్చింది. బి.ఎస్‌సి. చదువుతోంది. చాలా అందంగా వుంది. ముగ్గురు అక్కచెల్లెళ్లు. ఈమె రెండవది. మూడు నెలలుగా జ్వరం. బాగా నీరసించింది. మేడమెట్లు ఎక్కలేక పోయింది. ట్రీట్‌మెంట్ యిచ్చాను. మర్నాటికి తగ్గలేదు. నా పద్ధతిన మర్నాటికే తగ్గాలి. రెండవరోజున ట్రీట్‌చేశాను. తగ్గలేదు. ఇదేదో నాకు పరీక్ష అనిపించింది. మూడవరోజున ప్రేయర్‌లో కూర్చోగానే, ఆమె మెడలో ఒక తాయెత్తు ఉన్నట్లు తోచి, కళ్లు విప్పి, "నీ మెడలో వున్నది ఏమిటి?" అని అడిగాను.

"తావీదు, ఎవరో యిచ్చారు"

"తీసివెయ్" తీవ్రస్వరంతో అన్నాను.

యోగచికిత్సలో తాయెత్తులు, మంత్రాలు పనికిరావు. మర్నాటికి ఆమె జ్వరం తగ్గింది. ఆనందంగా లేడిపిల్లలా పరుగుపరుగున వచ్చింది. ట్రీట్‌మెంటు రోగానికే అయినా అనేక సామాజిక రుగ్మతలకు, ప్రక్కప్రక్కనే చికిత్స అవసరం. కొన్ని వ్యక్తిగత సమస్యల పరిష్కారానికి యోగమే అవసరం లేదు. మానసిక విశ్లేషణ తోడుకావాలి! కేవలం కళ్లు మూసుకుని జపం చేస్తే కుదరదు. వారి మనస్సులోని కల్మషాలు, సందేహాలు కడిగివేయాలి. నివృత్తి చేయగలగాలి.

ఇంతకాలం ఈ యోగం 'నూతనయోగం' అని, సంప్రదాయాలు పాతపద్ధతులు అవసరం లేవని ప్రచారంసాగింది. మాస్టరుగారు యోగం ప్రారంభించి 70 సంవత్సరాలైంది. ఇంకా 'కొత్త' యోగం అనడం అర్థం లేదు. అప్పట్లో పూర్వపుపద్ధతులు, అలవాట్లు కూడదన్నారు. ఇప్పుడు మేము అనుసరిస్తోంది మాస్టరుగారి పద్ధతి కదా! అదీ ఒక సంప్రదాయంగా మారింది. ఒక తరంమారితే, పాతపడిపోయినట్లే. ఇప్పుడు యోగానికి ఒక ఒరవడి ఏర్పడ్డది. పూర్ణత్వం వచ్చింది. రెండు మూడు తరాలు గడిచిపోయాయి. యోగంలోనూ నాల్గవతరం నడుస్తోంది. ఇప్పుడు యోగానిది ప్రయోగస్థితి కాదు. సంపూర్ణ స్థితి. యోగఫలాలు సంపూర్ణంగా అనుభవించే సమయం ఇది. మాస్టరుగారు తన ప్రథమశ్రేణి మీడియమ్స్ కోసం ఏర్పరచిన నియమాలు, సాధనలు మారవలసి ఉంది. అప్పుడు మాస్టరు ఆనాటి శిష్యులకు, సాధకులకు, మీడియమ్స్‌కు ప్రత్యక్ష గురువు, మాస్టరు. ఇప్పుడు మాస్టరుగారు మనకు పరమగురువులు. వారి భౌతిక ప్రమాణాలు మనకు ముఖ్యం కాదు. యోగవిభూతి ముఖ్యం. ఈ కాలానికి, ఈ నాటి పరిస్థితులకు అవసరమైన రీతిలో కొన్ని మార్పులు చేయడం ద్రోహం కాదు.

ఆనాటి మీడియమ్స్ కొందరు నాకు తెలుసు. తాము తప్ప ఎవరూ యోగం చేయరాదన్న ఛాందసులు వారు. మాస్టరుగారు చేయించిన కోర్సులు, రెగ్యులేషన్స్ తాము తప్ప ఎవరూ చేయనవసరం లేదనీ, ఎవరికీ అర్హత లేదని చెప్పేవారు. గురువు అయ్యే అర్హత ఎవరికీ లేదని, ఎవరినీ మాస్టరుగారు తన వారసునిగా చెప్పలేదని అనేవారు. ఎవరూ వారసులు కానప్పుడు, ఎవరికీ యోగం చేసే అర్హత లేనప్పుడు అసలు యోగం ఎందుకు? ఎవరికోసం? ఆ విషయంలో నేను విభేదించాను. కోర్సులు సాధన చేశాను. ఎవరూ యోగసమావేశాలు నిర్వహించరాదన్నారు. నేను యోగసమావేశాలు ప్రారంభించాను. మే, డిసెంబరు సమావేశాలు మాస్టరుగారు నిర్వహించిన పద్ధతిలో నిర్వహిస్తూ, వారు చేయించిన క్రమంలో కోర్సులు, రెగ్యులేషన్స్ చేయిస్తున్నాను. అదే పద్ధతిలో 'యోగాస్కూలు' స్థాపించి సాధకులను 'ఎన్‌రోల్' చేస్తున్నాను. ఇదంతా మాస్టరుగారి ఆమోదం పొందినట్లేనని నా నమ్మకం.

గురుశిష్యపద్ధతి కూడదన్నవారే సీనియర్స్ చాలామంది అదేపద్ధతి పాటిస్తున్నారు. గురు - శిష్య సంబంధం చెడ్డది కాదు. అది అవసరం. ఒక గురువు అంటూ లేకపోతే శిష్యుడు లేడు. సాధన సక్రమంగా సాగదు. గురువు గైడెన్స్ శిష్యునికి అందదు. నా పద్ధతి నేను ఏర్పరచుకున్నాను. నాకు ఏది మంచిదని, అవసరమని తోస్తే అది పాటించాను. నా వద్ద యోగంలో చేరినవారిలో గురువురెడ్డిగారికి చక్కని అవగాహన వుంది. పూర్వానుభవం ఉంది. అవసరమైన లోకజ్ఞత వుంది. దార్శనిక దృక్పథం, దృష్టి వున్నాయి. గురుశిష్య సంప్రదాయమే కాదు. యోగవిషయాలలో అనేకం చూచినవారు, అనుభవం కలవారు. రెడ్డిగారి రాకవల్ల, వారి సాహచర్యం వల్ల నా యోగానికి పుష్టి కలిగింది. నన్ను నేను చక్కదిద్దుకొన వీలుకలిగింది.

యోగం ఒక్క గురువుతో కాదు. గురువును అర్థం చేసుకోగల సచ్ఛిష్యులు ఉండాలి. ఇరువురికి మధ్య సదవగాహన ఏర్పడాలి. ఆంతర్యాలు కలవాలి. అప్పుడు గురుశిష్యులది ఒకే బాట అవుతుంది. ఒకే గమ్యం అవుతుంది. అప్పుడు శిష్యులు గురువుకు సన్మిత్రులు కాగల్గరు. గురువు అయినవాడు తన శిష్యులను మిత్రులుగా భావించి, ఆదరించగలడు. అప్పుడు గురుశిష్యులు యోగమిత్రులు కాగలరు. అది అవినాభావ సంబంధం. అది సరైన అద్వైత దృష్టి. అది విశిష్ట యోగసాధనకు మార్గం అవుతుంది. సుగమం అవుతుంది.

గురువుకు అహంకారం కూడదు. అలాగే శిష్యులకు అత్యాశ కూడదు. స్వార్థం ఉండకూడదు. 'ప్రేమ' గురుశిష్యులను బంధించగలగాలి. దీక్షాదక్షతలు ప్రతి సాధకునికి అవసరం. గురువుకు శిష్యుడు కావడం నామమాత్రమే. సాధకుడు కావడం ప్రధాన లక్ష్యం. మంచి సాధకుడు తనలోకి తాను చూడగలడు. తనలోనే గురువును దర్శించగలడు. బయట కనిపించే గురువు నామమాత్రుడు. తన హృదయంలో స్థితుడైన ఆత్మగురువు బాహ్యగురువు యొక్క ఆత్మస్వరూపం, ప్రతిరూపం కావాలి. ఈ నేపథ్యంలో నేను నా యోగాశ్రమంలోకి సాధకులను ఆహ్వానించాలని నిర్ణయించుకున్నాను.

0 0 0

మే సమావేశాలు భారీగా జరిగాయి. ప్రక్కనే రమణ డాన్సు హాలు, సమావేశాలకు పనికి వచ్చింది. 150 మందికి పైగా వచ్చారు. అందరికీ భోజన, భాజనాలు అక్కడే ఏర్పాటు చేశాం. కొన్ని అపస్వరాలు వినిపించాయి. రూల్సుకు భిన్నంగా ప్రవర్తించేవారిని నా యోగంలో సహించేది లేదు. ఎవరి ఆధిక్యతలు, పెత్తనాలు ఉండవు. అందరూ సమానమే. అందరూ సాధకులే. రోజూ ఉదయం, సాయంత్రం అరుగంటలకు కనీసం అరగంట యోగం చేసేవారికే సభ్యత్వం. ఆరు రోజులు హోమియోవైద్యం చేసి, ఒక్కరోజు

మొక్కుబడిగా, పదినిమిషాలు ప్రార్థనలు చేస్తాం అనేవారికి యోగంలో తావులేదు. క్రమశిక్షణ పాటించనివారిని సహించేదిలేదు. కొందరు అతివినయం, అతిభక్తి ప్రదర్శించ సాగారు. వారు కొత్తగా వచ్చిచేరినవారు. ఇతరచోట్ల వాటికి విలువ ఉందేమో గాని నా దగ్గర మాత్రం ఉండదు.

డా.పద్మావతమ్మ సాధకుల ప్రవర్తనపై కృద్ధురాలైంది. కొందరిని తీవ్రంగా మందలించింది. గురువు దగ్గర చనువుగా మెలగరాదని, క్రమశిక్షణ మనంగా పాటించాలని భయభక్తులు అవసరమని బోధించింది. ఆమెను కొందరు వ్యతిరేకించారు. కొందరు అనుసరించారు. ఆమె సలహా రుచించని వారంతా యోగానికి దూరమైనారు. నా వద్దకు రావడం మానుకున్నారు. అయినా నాకు విచారం లేదు. అర్హత లేనివారికి పెద్దపీటలు వేసి, గౌరవించనవసరం లేదు. రెండువర్గాల మనస్పర్థలు నాకు మనస్తాపం కలించాయి. ఇంక సమావేశాలు జరపనని హెచ్చరించాను. వారి వారి ప్రవర్తనకు, విమర్శలకు నేను బాధ్యుడిని కాను. నా దగ్గరకు వచ్చినవారు కొందరు వెళ్లి శ్రీనివాసాచారితో చెప్పారు. వేగుచర్యలు క్షమార్హం కాదు. ఆయన దగ్గరవారిని నేను రానివ్వను. ఊరికే రావడం వేరు. నా దగ్గర చేరినవారు మరొకచోటికి వెళ్లడం క్షమార్హం కాదు. అలా గురువుల్ని మార్చుకుంటూ పోవడం తప్పు. ఒక గురువును ఆశ్రయించినప్పుడు, అతని తోడిదే యోగజీవితం. నాలుగుచోట్లకు పోవడం, ఇక్కడి విషయాలు అక్కడచెప్పి లబ్ధిపొందాలనుకోవడం ఆధ్యాత్మిక వ్యభిచారం అవుతుంది. అలా వ్యభిచరించేవారిని వదలించుకోవడంలో నష్టం లేదు. అలాంటివారు పోవడమే మంచిది. యోగం పాతివ్రత్యం వంటిది. ఒక గురువును ఆశ్రయిస్తే మరొక గురువువైపు చూడకూడదు.

0 0 0

గుంటూరు నుండి పూర్ణచంద్రరావు అని ఒకాయన వచ్చాడు. 80 సంవత్సరాల వయస్సు. తల, గడ్డం బాగా పెరిగిపోయాయి. చూడడానికి అరవిందయోగి వలె ఉన్నాడు. లోగడ చాలామంది గురువుల్ని సేవించాడు. శ్రియానంద సరస్వతి వద్ద తొలి ఉపదేశం. వారి ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారట. శ్రీశైలంలో మరొక ఆశ్రమంలో మరికొన్ని సంవత్సరాలున్నాడు. అరవిందయోగి వద్ద, రమణమహర్షి వద్ద పది సంవత్స రాలున్నాడు. ఆధ్యాత్మిక రంగంలో తలపండినవాడు. హైదరాబాదులో వసంతకుమార్‌ని కలిస్తే తిరుపతి సమావేశాలకు రండని ఆహ్వానించాడట. ఆయనకు కీళ్లవాతం, నడుంనొప్పి, మెట్లు ఎక్కలేడు. మేడపైకి, పాకుతూ దేకి వచ్చేవాడు. భోజనం చేయడం. బ్రెడ్, పాలు ఆహారం. ఇతరుల సహాయం తీసుకునేవాడు. సమావేశాలకు వచ్చాడు. కానీ, తనను నాకు పరిచయం చేసుకోలేదు. వసంతకుమార్ చెప్పాడు ఆయన ఫలానా అని. ఆయన

వచ్చి పరిచయం చేసుకోనిదే నేనెందుకు పలకరించాలని, నేనూ ఉదాసీనంగా వున్నాను. ఆయన నన్ను గుర్తించనట్లే ప్రవర్తించాడు. అవును గొప్పవారి వద్ద యోగాభ్యాసం చేసినవాడు. ఆయనకంటే నేను 20 ఏళ్లు చిన్న. నమస్కారం అనడం నామోషీ అనుకున్నాడు.

ప్రేయర్ హాలు మధ్యలో ఆయన కూర్చునే వాడు. చుట్టూ యువకులు చేరేవారు. ఆయన తెల్లగడ్డం వీరికి ఆకర్షణ. అప్పుడు మద్రాసునుండి థియోసాఫికల్ సొసైటీ సెక్రటరీ శ్రీ విరించి, అంటే, ఎన్.సి. రామానుజాచార్యులుగారు వచ్చారు. వారు నాకు రచయితమిత్రుడు, కథకుడు. ఇక్కడ నా సమావేశాలు చూడాలని అతిథిగా వచ్చారు. మా ప్రేయర్స్ వేడి భరించలేక ఆరుబయట కుర్చీవేసుకుని, కూర్చుని, గమనించేవాడు.

ఒరిస్సాలోని రాయగడ నుండి శ్రీ టి.వి. రామారావుగారు ఉత్తరం రాశారు వారి అమ్మాయికి ట్రీట్‌మెంట్‌ఇస్తూ. అమ్మాయిని తీసుకుని వచ్చారు తిరుపతికి. వారు లోగడ నన్ను చూడలేదు. హాలులో నేను ఒకప్రక్కన ట్రీట్‌మెంట్ చేస్తుండగా వచ్చి, హాలు మధ్యలో వున్న పూర్ణచంద్రరావుగారికి పాదాభివందనం చేశాడు. "ట్రెయిన్ లేటయింది, క్షమించండి" అని ఏదో చెప్పబోగా, "మీరు గురువుగారికోసం వచ్చారా! గురువుగారు అక్కడ" అని నా దిక్కు చూపించారు. సమావేశాలకు వచ్చిన ఏ వ్యక్తి గాని నా చూపు తప్పించుకోలేదు. వేయికళ్లతో గమనిస్తుంటాను. మనస్సుతో చూస్తాను. నోరు విప్పి చెప్పకపోయినా వచ్చినవారి మనస్సులో దాగిన విషయాలు తెలుస్తుంటాయి. ఎవరు కుటిలంగా వున్నారో, ఎవరు నిర్మలంగా వున్నారో ఇట్టే తెలుస్తుంది.

"గురువుగారిలో ఏముంది? ఆయన మనలాంటివాడే! ఆయనకంటే మనమే యోగం బాగా చేయగలం. ఇక్కడికి రావడం దండగ" అని బజారునపోతూ విమర్శించినవారి మాటలు నాకు వినిపించాయి. అలా విమర్శించినవారికి అదే ఆఖరిసమావేశం అయింది. తర్వాత నా వద్దకు రాలేకపోయారు. సాయంత్రం ఇష్టాగోష్టిలో అనేశాను. నాపైన నమ్మకంలేని వారు నా వద్దకు రానవసరం ఎంతమాత్రం లేదు. వచ్చి విమర్శించడం ఆత్మహత్యా సదృశం. ఎందరు వెళ్లిపోయినా, ఎవరు రాకపోయినా నాకు నష్టం లేదు. నేను ఏకాంతంగా యోగం చేసుకోగలను! మీరంతా నన్ను ఉద్ధరించడానికి వచ్చామనే భ్రమలో ఉంటే ఆ భ్రమల్ని తొలగించుకోండి. నిజాయితీ పరులైన సాధకులే ఇకపైన నా సమావేశాలకు వస్తారు."

ఆ వమావేశంతో చాలామంది అల్పబుద్ధులు యోగం నుండి విరమించుకున్నారు.

0 0 0

కొన్ని కారణాల వల్ల విశాఖపట్నం వెళ్లకూడదనుకున్నాను. మిత్రులు కొందరు ఆగస్టులో మాస్టర్ జయంతికి ఆహ్వానించారు. ఒక్కరోజు మాత్రం ఉండి రావాలనుకున్నాను. తిరుపతి నుండి నేను ఒక్కడినే బయలుదేరాను. హైదరాబాదు నుండి వసంతకుమార్, కె.కృష్ణమూర్తి, బి.ఎస్.కృష్ణారావుగారు వచ్చారు. శ్రీ కె.సూర్యారావుగారింట మాకు ఆతిథ్యం ఏర్పాటు చేశారు. వివేకానంద హాలులో సమావేశాలు ఏర్పాటు చేశారు. సూర్యారావు, మాధవరావు ప్రధాన హోస్టులు.

వివేకానంద హాలులో సమావేశానికి అయిదారువందలమంది వచ్చారు. ఉదయం నుండి రాత్రివరకు ప్రేయర్స్, కోర్సులు చేయించాం. రేపు సమావేశం అనగా ఆ రోజు సాయంత్రం హాలువద్ద బ్యానర్లు, స్వాగతం బోర్డులు కడుతుండగా ఒకాయన వచ్చి, "ఏమిటి విశేషం?" అని అడిగారుట.

"రేపు మాస్టరుగారి యోగసమావేశాలు" అన్నారు ఆ పనిమీద ఉన్నవారు.

"శార్వరి సమావేశాలా? శార్వరి వస్తున్నాడా" అని అడిగి - "రేపు నేనూ వస్తున్నాను" అని వెళ్లిపోయాడట. ఆ వచ్చి, అడిగిన వ్యక్తి అచ్చం మాస్టరుగారిలాగే ఉన్నాడట. నేను వెళ్లగానే చెప్పారు. 'ఆ వచ్చినవ్యక్తి ఎవరై ఉంటారని?' అడిగారు.

"ఇంకెవరు?! ... మాస్టరుగారే, మన సమావేశాలన్నింటికీ మాస్టరుగారు వస్తుంటారు. నాకు అది అనుభవమే, ఏదో రూపంలో కనిపిస్తుంటారు. సమావేశాలు అయ్యేవరకు మాస్టరుగారి ఆత్మశరీరం మన మధ్యనే తిరుగుతుంటుంది. కొందరు ప్రేయరులో ఉండగా, అలా నడచివెలుతున్నట్లు, వస్తున్నట్లు తెలుస్తుంది" అని చెప్పాను

"సమావేశ సమయంలో ఎవరు వచ్చినా, కొత్తవారిని కసురుకోకండి. మర్యాదగా పలకరించి, భోజనం పెట్టి, ప్రేమగా ఉండండి. ఎవరిలో మాస్టరుగారు పరకాయ ప్రవేశం చేసి వస్తారో తెలియదు. మనం అహంకారంతో ప్రవర్తించామా ఫలితం అనుభవిస్తాం. మాస్టరుగారు, మదర్ ఎప్పుడూ మనల్ని గమనిస్తూ ఉంటారు. సమావేశాలలో మనతోనే ఉంటారు" అని చెప్పాను.

0 0 0

ఒకమ్మాయి నా వెంట తిరుగుతుండేది, పేరు మాధవి. ఇంటర్ చదువుతోంది చలాకీ అయినపిల్ల, సరదా ఎక్కువ.

కాఫీ తాగుతుంటే, వచ్చి, "గురువుగారూ మీరు కాఫీ తాగుతారా?" అనేది అమాయకంగా, ఆశ్చర్యంగా.

సిగరెట్ కాలుస్తుంటే, "మీరు సిగరెట్ కాలుస్తారా? తప్పు కదూ?" అనేది మందలింపుగా. అది ప్రేమ మందలింపు.

"అమ్మాయి! నేను చేసేవి తప్పులో ఒప్పులో నాకూ తెలుసు. నేను కాఫీ తాగుతాను, సిగరెట్ కాలుస్తాను. గంగలో దూకుతాను. నీకు నా పనులు నచ్చకపోతే వెళ్లిపో. దొంగతనంగా వెధవపనులు చేసే గురువులు చాలామంది ఉన్నారు" అన్నాను.

ఆమె వెళ్లిపోయింది. సాయంత్రం ఆ అమ్మాయి కడుపునొప్పితో విలవిల్లాడి పడిపోయింది. రెండుమూడు సంవత్సరాలుగా మెన్సస్‌ట్రబుల్. ఆ పిల్ల తల్లి వచ్చి మొరపెట్టుకుంది. అసలు ఆ పిల్లను తీసుకువచ్చిందే ట్రీట్‌మెంట్‌కోసమని చెప్పింది. ఆమెను ఒక గదిలో పడుకోబెట్టి, ఫాన్ వేశారు. నొప్పి తట్టుకోలేక మెలికలు తిరుగుతోంది.

"ఏం మాధవీ...కాఫీ తాగుతావా?" అని అడిగాను.

"క్షమించండి మాస్టారూ, మీరిస్తే తాగుతాను" అన్నది.

"సిగరెట్ కాలుస్తావా?" నవ్వుతూ అన్నాను.

"మీరు కాల్చమంటే కాలుస్తాను"

"తప్పు కదా?"

"క్షమించమన్నానుగా" ఏడ్చింది.

కాఫీ యిచ్చాను. లోపల ప్రేయర్ చేశాను. నిమిషంలో ఆ పిల్ల కడుపునొప్పి తగ్గింది. "అయిదునిమిషాలు నిద్రపో. తగ్గిపోతుంది" అని చెప్పి వచ్చాను.

0 0 0

టి. లక్ష్మిగారి పినతండ్రి సీతారావుగారు శ్రీకాకుళం నుండి వచ్చారు. ఆయన పెద్దవారు. యోగ సభ్యుడు. ఉదయం నుండి ప్రేయర్సులో పాల్గొనడం వల్ల, బాగా వేడిచేసినట్లుంది.

'ఇంటికి వెళ్లి ఏదైనా మందువేసుకుని పడుకుంటాను. కూర్చోలేకపోతున్నాను' అన్నారు.

"ఏమిటి అస్వస్థత?"

"అవి, ఇవి తినడం, రాత్రి నిద్రలేకపోవడం, గిడ్డీగా వుంది"

"మీకు మందు అవసరం లేదు సీతారావుగారూ" అని ఒక గ్లాసు మంచినీరు తెప్పించి యిచ్చాను. "తాగండి అంతా సర్దుకుంటుంది. పదినిమిషాలు నిద్రపొండి చాలు" అన్నాను.

అయిదు నిమిషాలకే ఆయన లేచివచ్చారు హుషారుగా.

ట్రీట్‌మెంట్స్ అలా వుంటాయి. ఆ రోజు రాత్రి యదాలావంగా మొదలుపెట్టి యోగం గురించి, సాధన గురించి ఒక గంటన్నర సేపు చెప్పాను. చాలామంది ఆ ప్రసంగం రికార్డు చేసుకోలేకపోయినందుకు విచారించారు.

మాస్టరుగారి రూపంలో తెలియని ఒక ఆకర్షణ వుంది. ఆయన గురించి ఏమీ తెలియనివారైనా, ఒక క్షణం ఫోటో చూస్తే ఆకర్షింపబడతారు. 'ఎవరీయన?' అని ప్రశ్నించక మానరు. అది ఆ విగ్రహంలోని ఠీవి. కూర్చున్నతీరులో ఉట్టిపడే రాజసం. ఆ చూపుల్లోని లోతులు, వెలుగులు. రెండు నిమిషాలు ఆయన కళ్లలో మన చూపు నిలిపితే చాలు, కళ్లుమూతలుపడి ఒక విధమైన సమాధ్యవస్థ కలుగుతుంది. అలా ఆయన కళ్లలోకి చూస్తూచూస్తూ కళ్లు మూతలుపడడం, మనస్సు నిశ్చలం కావడం, మైకం క్రమ్మడం వరసగా జరిగే పనులు. మనకు నిమిషాలలో శరీరస్పృహ పోతుంది. ఏదో అయిపోతాం. ఎందుకలా వివశమై పోతున్నామో తెలీదు. శరీరస్పృహ కోల్పోయిన తర్వాత అరూపస్థితిలో మనస్సును సైతం విస్మరించడం శూన్యంలో కదలాడే ఒక ఆత్మలా మనల్ని మనం గుర్తిస్తాం. ఆ స్థితిలో భౌతికశరీరం బయటవారికి కనిపిస్తున్నా మనం భౌతికతకు చాలాదూరంగా వెళ్లిపోయి ఈథర్ లెవెల్ దాటి యాస్ట్రల్ శరీరంలో స్థితి పొందుతాము.

విశాఖపట్నంలో శ్రీ కె.సూర్యారావుగారి ఆతిథ్యంలో నాలుగు రోజులు ఉండవలసి వచ్చింది. వారి శ్రీమతి రాజ్యలక్ష్మి, టి.హెచ్. శాస్త్రిగారి అమ్మాయి జయశ్రీ అప్పుడే యోగంలో సభ్యులైనారు. ఇనీసియేషన్‌కు సిద్ధపడగానే ఏదో అవరోధం ఏర్పడ్డది. రాజ్యలక్ష్మికి ఏదో ట్రీట్‌మెంట్ అవసరం అని తోచింది.

"ఇనీసియేషన్ తర్వాత. ముందు మీ అస్వస్థత గురించి చెప్పండి. శరీరం అనారోగ్యంతో ఉన్నవారికి ఇనీసియేషన్ చేయను. ముందు ట్రీట్‌మెంట్ జరగాలి" అని చెప్పాను.

ఆమె తనకు చాలా సంవత్సరాలుగా విపరీతంగా తలపోటు అని చెప్పింది. ముందు ట్రీట్‌మెంట్ చేశాను. అది నా పద్ధతి. శరీరం, మనస్సు జబ్బుపడి ఉన్నంతకాలం ఉపదేశం యివ్వను. హెల్తీబాడీ,హెల్తీమైండ్ - యోగానికి అర్థం. రాజ్యలక్ష్మిగారి అక్కగారు ట్రీట్‌మెంట్ తీసుకున్నారు. అయిదు సంవత్సరాలుగా ఆమెకు 'నిద్రలేమి' ఒక జబ్బుగా పరిణమించింది.

ట్రీట్‌మెంట్‌లోనే నాలుగుగంటలు నిద్రపోయింది. అలాంటి జబ్బులు ఒక్కసిటింగ్‌లోనే తగ్గిపోతాయి. శ్రీకాకుళం నుండి సీతారావుగారు ఒక అబ్బాయిని తీసుకువచ్చారు. ఆ కుర్రవాని తల్లి టీచర్. భర్తలేడు. కుర్రవానికి కళ్లు కనిపించవుట. అయిదారు సంవత్సరాల వయస్సులో అంధుడైనాడు. ఆ తల్లికి ఒక్కడే కొడుకు ఆధారం. అప్పటికి అతని వయస్సు పన్నెండు సంవత్సరాలు. రోజూ ఉదయం సాయంత్రం ప్రేయర్‌కు వచ్చేవాడు. ప్రత్యేకంగా ఒక్కొక్కరికీ ట్రీట్‌మెంట్ యిచ్చేవాడిని. అయిదవరోజున

అతని తల నా ఒళ్లో ఉంచుకుని ట్రీట్‌చేశాను. చాలాసేపు వర్కు సాగింది. ఆ అబ్బాయి మాధవరావుగారింటికి వెళ్లిపోయాడు. యాదాలాపంగా కుర్చీలో కూర్చుని టేబిల్‌పైన ఉన్న దినపత్రిక చేతికి తగలగా తీసుకున్నాడు. చూపు వచ్చింది. పేపరు చదివాడు. ఆనందంతో పరుగెత్తుకు వచ్చాడు.'నాకు కళ్లు వచ్చాయి. నేను చూడగలుగుతున్నాను' అని పరుగున వచ్చాడు సూర్యారావుగారింటికి. ఆ రాత్రికి ఒక్కడే బస్సుమీద శ్రీకాకుళం వెళ్లిపోయాడు వాళ్ల అమ్మమ్మగారికి ఆ శుభవార్త చెప్పడానికి.

0 0 0

ఓ పాతికమంది యోగమిత్రులు బొర్రాగుహలకు ప్రయాణం పెట్టారు. అరకుమార్గంలో బొర్రాగుహలు ఉన్నాయ్టట. నాకు విహారయాత్రలకు వెళ్లే అలవాటు లేదు. చారిత్రక కట్టడాలు శిథిలాలు చూడాలన్న ఆసక్తి లేదు. ఆ గుహలు చూచిన మిత్రులు గొప్పగా చెప్పారు. ఇటీవలనే ఆ గుహలు బయటపడ్డాయి. బౌద్ధులు తలదాచుకున్న గుహలు అవి. లోపల మూడు నాలుగు కిలోమీటర్లు పొడవు. లోపలకు ఆముదపు కాగడాల వెలుగులో వెళ్లాలి. శిలాజాలు, శిలాజలాలు. లోపల మైనస్ టెంపరేచర్. చలికి వణికిపోతూ నీళ్లలో, అంధకారంలో నడిచాం. నరకం అలానే ఉంటుందేమో అనిపించింది. చివరంటా వెళ్లాక, అక్కడ గైడ్ కాగడాలు ఆర్పి చూడమన్నాడు. 150 అడుగుల ఎత్తున ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నట్లు కనిపించింది. తిరిగి వచ్చేటప్పుడు, ఒకచోట తలెత్తిచూస్తే కైలాసం దర్శనమైంది. శివపార్వతులు, ప్రమథగణాలు దర్శనమిచ్చారు.

ఒకరోజున చోడవరం వెళ్లవలసివచ్చింది. అక్కడ ఒక వృద్ధుల ఆశ్రమం వుంది. అందులో ఒక సన్యాసిని, వృద్ధురాలు వున్నది. ఆమె నన్ను చూడాలని కోరింది.ఆమె అంధురాలు. కళ్లు కనిపించవు. నన్ను చూడాలని కోరిక. తానే విశాఖపట్నం వస్తానని కబురుచేసింది. నేను బయలుదేరి వెళ్లాను నలుగురు మిత్రులతో. ఆమె తన ఆస్తి మొత్తం ఆశ్రమానికి యిచ్చి, అక్కడే తనూ ఉంటోంది. కారు ఆశ్రమం దగ్గర ఆగింది.ముందుగా ఆఫీసులో కాస్సేపు విశ్రాంతి తీసుకుని ఆమె ఉన్న చోటుకు వెళ్లాం. ఒక మిత్రుని ముందుగా వెళ్లి ఆమెను పలకరించమని నేను వెనకగా నడిచాను. మా వెంట పాతికమంది జనం ఉన్నారు. అతను వెళ్లి "హరిఃఓం" అని ఆమెకు నమస్కరించాడు. ఆమె అంధురాలు. అతనిచేతులు పట్టుకుని తడిమిచూచి "నీవు కాదు, నీవు గురుదేవునివి కాదు, ఫో" అని త్రోసివేసింది. ఆమె స్పర్శకు చూపు ఉంది.

నేను నిశ్శబ్దంగా ఆమె ముందు నిలబడి, చేయి చాచాను. నా చేతి స్పర్శ సోకగానే ఆమెకు కరెంట్‌షాక్ కొట్టినట్లయిందిట. నా రెండు చేతులు తన చేతుల్లోకి

తీసుకుని, కళ్లకు హత్తుకుని కన్నీరు ప్రవహిస్తుండగా, "తండ్రీ, గురుదేవా! వచ్చావా! ఇప్పటికి నన్ను కరుణించావా .మహాత్మా! ఇన్నేళ్లకు నీకు నా పిలుపు వినిపించిందా పరమాత్మా!" అని పరవశం చెందింది. బయటజనం ఈ దృశ్యాన్ని చూచి అవాక్కయినారు. వీధినిండా ఊరిజనం పోగైనారు.

ఆమె రామకృష్ణుని భక్తురాలు, "రామకృష్ణప్రభూ, శ్రీదత్తప్రభూ!" అంటూ స్తోత్రాలు చదివింది. అరగంటసేపు గురుపూజ చేసి, కర్పూరనీరాజనం సమర్పించింది. నా స్పర్శలో ఆమెకు రామకృష్ణ పరమహంస, శ్రీ దత్తాత్రేయుల దర్శనం లభించిందిట.

"అమ్మా ఏమిటి మీ కోరిక - చెప్పండి" అని అడిగాను.

"నాయనా, గురుదేవా! ఒక్కసారి మీ భౌతికరూపాన్ని దర్శించాలని కోరిక. చూడలేను. ఒక్కసారి మిమ్మల్ని చూచే అదృష్టం కలిగించు తండ్రీ" అని ఏడ్చింది.

ఆమె 'ఆజ్ఞపై' వేలుంచి, ప్రార్థన చేశాను. వెంటనే లోచూపుతో నా సూక్ష్మ రూపాన్ని దర్శించింది. అది మాస్టరుగారి అనుగ్రహం. భౌతికంగా గురువు ఏ రూపంలో ఉన్నా గురుతత్త్వం ఒక్కటే. శ్రీగురుఅనుగ్రహం ఒక్కలాగే ఉంటుంది. మనకు మహాత్ములు వేరు వేరు రూపాలతో, ప్రతిభలతో సాక్షాత్కరిస్తుంటారు. మహాత్ములందరికీ, సాధకులందరూ ఒక్కరూపంలోనే కనిపిస్తారు. అందరి ధ్యేయం ఒక్కటే. జిజ్ఞాస కలవారికి జ్ఞానం అనుగ్రహించడం, సాధన చేస్తున్నవారికి అభ్యుదయం కలిగించడం.

0 0 0

రామకృష్ణ పరమహంస మళ్లీ జన్మించి మాస్టరుగారికి అంతేవాసి అయినాడని, ఆయనే మహాదేవ అయ్యర్ అని నాడీ జ్యోతిషం చెప్పింది. చాలామంది మహర్షులు మళ్లీ జన్మించి మాస్టరుయోగం చేస్తున్నారని నాడీగ్రంథాలు చెప్పాయి. అది నిజమా కాదా అన్నది ముఖ్యం కాదు. ఈ యోగానికి అంతటి పూర్ణత్వం ఉన్నదని, ఎన్నిరకాల యోగాలు చేసినా, చివరకు మాస్టర్ యోగమార్గం ఎవరెస్టుశిఖరం వంటిదని విశ్వసించడానికే.

చాలామంది జీవితంలో ఓడిపోయి సన్యాసం స్వీకరిస్తారు. కొందరు చిన్నతనంలోనే వైరాగ్యం అలవడి పారిపోయి సన్యసిస్తారు. మరికొందరు జీవితం తాము ఆశించినట్లు సాగలేదనే నైరాశ్యంతో ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు. అలాగ ఆత్మహత్య చేసుకోవాలనుకున్నవారు అయిదారుగురు లోగడ నా వద్దకు వచ్చి, ఒక్కరోజు 'యోగం' తో మనస్సు మార్చుకున్నవారున్నారు. కొందరికే జీవితం వడ్డించిన విస్తరి. ఎక్కువమంది ముష్టివాళ్లు, బిచ్చగాళ్లు. అగర్భశ్రీమంతులు వేయిమందిలో ఒక్కరూ ఉండరు. ప్రతివ్యక్తి శ్రీమంతునిలా జీవించాలని కలలు కంటాడు. తపన చెందుతాడు. అంత నైరాశ్యంలో, చీకటి కోనల్లో కొట్టుకునేవారికి సుఖం ఉండదు. మనశ్శాంతి ఉండదు. జీవితంలో

వెలుగుబాటలు కనిపించవు. నా వరకు జీవితం నాకు సుఖాలనివ్వలేదు, అని అన్నీ కష్టాలేనని చెప్పలేను. జీవితం నాకు పోరాటం నేర్పింది. జయాపజయాలు పోరాటంలో సహజం. పోరాటం ముఖ్యం. పోరాడేవానికి ఆటుపోటు లుంటాయి. నిరాశ ఉండదు. అతనిని అపజయం క్రుంగతీయదు. నా వద్దకు వచ్చేవారు చాలవరకు నాలాంటివారే. అలాగ జీవితంలో ఓడిపోతున్నవారికే నా సహాయం అవసరం. అన్నీ బాగున్నవాడికి అసలు దేవుడితో పని ఉండదు. వైరాగ్యం వెన్నుచరిస్తే, అధైర్యపడి, నా వద్దకు పరుగెత్తుకు వస్తారు. చస్తానన్నవారిని నేను చావనీయను. చచ్చి సాధించేది లేదు. బ్రతికి, పోరాడి, సాధించాలి, విజయం పొందాలి. జీవితాన్ని మనబాటకు మళ్లించుకుంటే నిరాశకు అవకాశం ఉండదు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగపరచుకుంటే సామాన్యుడు సైతం మహాత్ముడు కావచ్చు. మాన్యుడు మహనీయుడు కావచ్చు.

0 0 0

ఆ యువకుని వయస్సు పాతికలోపే. నూనూగు మీసాల మిసిమి. కన్నీటిని రెండుగా విభజించడం నేర్వనివాడు. పట్టభద్రుడేగానీ జీవితానికి భద్రత లేనివాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నలభై ఏళ్లు పైగా పేరుకుపోయిన యువనైరాశ్యం అతనిలో ఘనీభవించింది. పుట్టకముందే ప్రపంచం పైన అసహ్యం పెంచుకున్నట్లున్నాడు. ఒక మిత్రుని అండదండలతో చాలీచాలనిబ్రతుకు సాగిస్తూ, కన్నవారి ప్రేమాదరణలకు దూరంగా జరిగి, ఏకాంతంలోఒంటరి బ్రతుకు సాగిస్తున్నవాడు. అతని అన్వేషణ లైబ్రరీలో. ఒక పుస్తకం నా అడ్రసు యిచ్చింది. అది పట్టుకుని తిరుపతి వచ్చాడు. తనను ముభావంగా, అయిష్టంగా, సగం పరిచయం చేసుకున్నాడు.

"మీ పుస్తకం ఒకటి చదివాను. నచ్చింది, వచ్చాను" అన్నాడు.

"ఎందుకు నచ్చినట్లు? ఎందుకు వచ్చినట్లు? ఏం కావాలి నీకు? నేనేం చేయగలను?"

"నన్ను నేను తెలుసుకుందామని." మంచి జిజ్ఞాస!

"ఎవరికి వారు 'తననుతాను' తెలుసుకోవడమే దర్శనరహస్యం. అదే ఉపనిషద్రహస్యం" అన్నాను సింపుల్‌గా.

"మీరు అంత సింపుల్‌గా చెప్పారు కనకనే ఇంతదూరం వచ్చాను... కానీ నన్ను తెలుసుకోవడం మీరు చెప్పినంత సులభం కాదేమో!" అన్నాడు సందేహంగా.

"కరెక్టు... సులభం కాదన్న జ్ఞానం ఉన్నవానికి అది సాధించడం సులభమే. ఇంతదూరం వచ్చినవారు మిగిలిన దూరం ప్రయాణం చేయగలరు. ఇదొక మజిలీ అంతే!!"

"మీరు అర్థం అయినట్లే వుంటారు కానీ అర్థం కారు"

"అర్థం చేసుకోవలసింది మాటలు, అర్థం కావలసింది ఆంతర్యం... తేడా వుంది కదా!" నా సమాధానం.

...ఈ ప్రశ్నలు అడిగిన కుర్రాడిపేరు రామకృష్ణ. ఊరు సిరిసిల్లా... లోతుగా ఆలోచించగల నేర్పు వుంది. అది అతని సహజలక్షణం. నేర్చుకుంటే వచ్చేది కాదు. అంత పిన్నవయసులో అంత జిజ్ఞాస కలగడం కష్టం... వచ్చినవారిలో సైతం నన్ను వెతుక్కుంటాను నేను. అది నా బలహీనత. అదే నా బలం. కొన్ని క్షణాలు ఆగి, కాళ్లపై బడి వెక్కివెక్కి ఏడ్చాడు. కన్నీరు కార్చేవారికి మాటల అవసరం ఉండదు! వారు చెప్పదలచిన విషయం కన్నీటి వేడి వాడిగా చెబుతుంది.

అలాంటివారే నాకు శిష్యులవుతారు. వారు మాట్లాడరు. భాషిస్తారు. నోరు విప్పరు, కళ్లతో అడుగుతారు. గుండెతో వింటారు, హృదయంలో దాచుకుంటారు. అలాంటి శిష్యులు కొద్దిమందే ఉంటారు. వారినే శిష్యులు అని తృప్తిగా చెప్పవచ్చు. గురువు నోరు విప్పి చెప్పని విషయాన్ని గ్రహించగలవాడే శిష్యుడు. నాకు అలాంటివారే మిగిలారు. అలాంటివారు నా శిష్యులమని చెప్పుకున్నా నాకు అభ్యంతరం లేదు. ఎందుచేతంటే నా ఆలోచనలకు వారు వారసులు. నా భావప్రపంచానికి వారు ప్రతినిధులు. నేను చూపించే శిఖరాల్ని, శూన్యంలో ప్రయాణించి, అధిరోహించగల సత్తా వున్నవారు. వేయిమందిలో అలాంటి అంతఃకరణ గలవారు ఒక నూరుమంది మిగిలినా చాలును. అలాంటి శిష్యులు లభిస్తే ఏ గురువు తపన వృధాపోదు. తపస్సు నష్టం కాదు. నేను ఏదో సాధించానని అనను. నేను ఆశించినది నా వారసులు సాధించగలిగితే చాలు. ఆ స్థాయికి వారిని ఎదగనీయడంలో నాకు తృప్తి ఉంటుంది. నా లక్ష్యం నెరవేరినట్లవుతుంది. ఒక దీపంతో మరొక దీపాన్ని వెలిగించగలం. ఒక కరెంట్ బల్బుతో మరొక బల్బును వెలిగించలేం. ఇప్పుడు ఎక్కడ వెదికినా, ట్యూబులైట్లే కనిపిస్తుంటాయి. మరొక చిన్న దీపాన్ని వెలిగించగల సత్తా ఈ ట్యూబులకు ఉండడం లేదు. యోగం సెల్ఫ్ జనరేటర్ వంటిది!!

0 0 0

డిసెంబరు సమావేశం 1991.

రెండువందల మందికి పైగా మిత్రులుసమావేశానికి వచ్చారు. మహబూబ్‌నగర్ నుండి బస్వరాజ్ మిత్రులు, కొత్తవారు వచ్చారు. ఆ నాలుగురోజులు తిరుపతిలో ఏ వీధిలో చూచినా మా యోగసాధకులే. స్థానికంగా అనేక యోగమార్గీయులున్నారు. సహజయోగం వారు, క్రియాయోగంవారు, మహేష్‌మార్గీయులు, విపస్సనులు, రజనీష్

అభిమానులు, బౌద్ధులు. ఎందరో నా యోగంపట్ల ఆకర్షితులై వచ్చారు. వారందరికీ యోగసమావేశాలలో చేయించే కోర్సులు కొత్త అనుభవం. అందరూ ఎవరిస్థాయిని బట్టి, వారివారి సాధనను బట్టి అనుభూతులు పొందసాగారు. సర్వమతసమ్మేళనంవలె ఇది సర్వయోగసమాహారం. తమిళనాడు నుండి, సింహళం నుండి కొందరు బౌద్ధులు వచ్చారు. తిరుమలపైన శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయం పూజారులు, అక్కడ వేదపఠనం చేసేవారు వచ్చి యోగంలో చేరారు. అనేక ప్రసిద్ధ యోగాశ్రమాల నుండి నాకు ఆహ్వానాలు రాసాగాయి. వచ్చి అక్కడ యోగోపన్యాసాలు యిమ్మని. ఋషీకేశ్‌నుండి విశ్వహిందూ పరిషత్తువారు అఖిల భారత సమారోహానికి వక్తగా ఆహ్వానించారు.

మాస్టరు యోగానికి కావలసింది ఈ గుర్తింపు, ఇలాంటి ప్రచారం కాదు. ఇదొక పీఠంగా మారడం నాకిష్టం లేదు. మిగిలిన యోగాశ్రమాలవలె ఇదీ ఒక సంస్థ అవడం నాకు నచ్చదు. ఇది స్వతంత్ర ప్రతిపత్తి కలది కావాలి. దీనిని అధ్యక్షుడు, కార్యదర్శి, కార్యవర్గంతో ముడిపెడితే యోగకార్యక్రమ నిర్వహణ కుంటుపడుతుంది. యోగం పలచబడుతుంది. ఇక్కడ ఎవరికీ పదవులు ఉండరాదు.అధికారాలు ఉండరాదు. ఇక్కడ ఉపన్యాసా లుండకూడదు. సత్సంగాలు పనికిరావు. ఎవరినీ ఉపన్యాసా లిమ్మని ఆహ్వానించ దలచలేదు. నేను పనికట్టుకుని ప్రసంగించేది లేదు. వీలైనంతవరకు మెడిటేషన్, కోర్సులు చేయించడం వరకే నా యోగసమావేశాలు పరిమితం. ఎవరూ రాజకీయాల గురించి, గుడులు గోపురాల గురించి, ఇతర యోగాల గురించి, కులాల, మతాల గురించి చర్చించడానికి వీల్లేదు. అది కండిషన్. ఎవరూ సినిమాలకు, దైవ దర్శనాలకు వెళ్లడానికి వీలుండదు. యోగసాధన లేని సమయంలో విశ్రాంతి తీసుకోవాలి. లేదా సాటి మిత్రుల అనుభవాలు పంచుకోవచ్చు. యోగాభివృద్ధికి అవసరమైన విషయాలు ముచ్చటించుకోవచ్చు. అవి చర్చలుగా, తర్జనభర్జనలుగా మారకూడదు. నా ఆశ్రమం ప్రశాంతంగా ఉండాలి. వచ్చినవారి సందేహాలకు వీలుచూచుకుని నాకు తెలిసినంతవరకు సమాధానాలు చెప్పేవాడిని. అవే ప్రసంగాలుగా మారి గంటలు గడిచిపోయేవి.

ఇతర యోగమార్గాలను విమర్శించదలచలేదు. ఇతరుల కన్న నేను గొప్పవాడిననే అభిప్రాయం కలిగించను. అందరు సాధకుల వంటివాడినే నేను. గురుస్థానం నాకు వద్దు. అందుకే అందరితో కలివిడిగా ఉండేవాడిని. కలిసిమెలిసి సరదాగా తిరిగేవాడిని. భేషజాలు నా కిష్టం లేదు. యోగం చేస్తున్నాను. మాస్టరుగారు నాకేం చేశారని నేను ప్రశ్నించుకోను. అసలు ఆలోచించను. నేను యోగానికి ఎంతవరకు ఉపయోగపడు తున్నానన్నదే నా తపన. యోగం ద్వారా సమాజానికి నేను ఉపయోగపడాలి. నా సేవలు యోగరూపేణ ఉపకరించాలి.

జాంధ్రపేట నుంచి వచ్చిన జితమోహనరావు అమాయకుడు. మంచిభక్తుడు, చిత్తుడు. యోగానికి చదువు, డిగ్రీలు ముఖ్యంకాదు. ఆత్మసంస్కారం ప్రధాన ఉపకరణం. కొన్నిరాళ్లను రత్నాలుగా భ్రమించి మోసపోతుంటాం. నిజంగా రత్నాలను రాయిముక్కలుగా పారేస్తుంటాం. రెండూసహజమే. పాలిష్‌చేసి కటింగ్ చేస్తేగాని ఏరత్నమైనా ఉపయోగంకాదు. దాని విలువ అప్పుడు తెలుస్తుంది, పెరుగుతుంది. దాని మెరుపు, తళతళలు అప్పుడు లోకం గుర్తిస్తుంది. నా దగ్గరకు వచ్చేవారు చాలా మంది 'సానపట్టని' వజ్రాలు. యోగాభిరుచి ఉన్నవారే. సాధనతో వారిని పరీక్ష చేయాలి. అది రత్నపరీక్ష. రత్నం అని తేలిన తర్వాత సానపట్టాలి. చెక్కాలి. అప్పుడు వారు యోగంలో సాధిస్తున్న అభివృద్ధి ఏమిటో వారు స్వయంగా గ్రహించగలుగుతారు.

0 0 0

మే సమావేశాలకు అభ్యాగతిగా వచ్చిన పూర్ణచంద్రరావు డిసెంబరు సమావేశాలకు అతిథిగా వచ్చారు. ఏడునెలలు ఆలోచించి నిర్ణయించుకున్నట్లుంది. ఇనిసియేషన్ తీసుకోవాలనే నిర్ణయంతో వచ్చారు. మాస్టరుగారి వద్ద సరస్వతీ స్వాముల వారొకరుండేవారు. ఆయన గడ్డంమీసం పెంచుకుని, కాషాయబట్టలు ధరించి ఉండేవారు. మాస్టరుగారు గృహస్తు. ఆయన సన్యాసి. మాస్టరుగారింట్లో అన్ని పనులు చేస్తూ, యోగంకోసం వచ్చేవారికి సహాయం చేస్తుండేవారు. మాస్టరుగారు అతను ఒక్కడినే సన్యాసిని, బ్రహ్మచారిని తన వద్ద ఉండడానికి అంగీకరించారు. పూర్ణచంద్రరావుగారిని చూస్తే మహర్షి అనిపిస్తారు. ఈయనకు నేను గురువు కావడం ఏమిటి? అరవిందయోగి, రమణ మహర్షి లాంటివారి వద్ద యోగం, తపస్సు నేర్చినవాడు. ఈసారి రాగానే 'గురువుగారూ' అని సంబోధించి తనకు ట్రీట్‌మెంట్ కోరాడు. రెండురోజుల ట్రీట్‌మెంట్‌తో ఆయనగారి కీళ్లనొప్పులు, నడుంనొప్పి తగ్గింది. యువకులతో పోటీగా నడవసాగాడు. అందరూ వెళ్లిపోయిన తర్వాత అప్పుడు అడిగాడు తనకు ఉపదేశం యిమ్మని.

"మీరు పెద్దవారు. నేను మీకు ఉపదేశం యివ్వడం భావ్యం కాదు" అన్నాను.

"జీవితంలో యాభై సంవత్సరాలుగా నేను వెళ్లని ఆశ్రమం లేదు. అందరు మహర్షుల్ని దర్శించాను. ఆయామార్గాలలో సాధన చేశాను. యాభై సంవత్సరాలు వృధా చేసుకున్నాను. ఈ వయస్సులో సరైనగురువును దర్శించాను. మాస్టరుగారి యోగం చేస్తున్నవారిని చాలామందిని ఎరుగుదును. కుంభకోణం వెళ్లాను. అక్కడ నాక్కు ఈ యోగం చేసేవారు కనిపించలేదు. గుంటూరులో దిడుగు నారాయణరావుగారు ఎంతో కాలంగా తెలుసు. అతనికి యోగసిద్ధి లేదు. ఎనభైఏళ్ల జీవితంలో యాభై సంవత్సరాల అన్వేషణలో సిద్ధయోగి, మీరు ఒక్కరే కనిపించారు. యోగం చేసేవారు చాలామంది

ఉంటారు. యోగం సిద్ధించినవారు, యోగసిద్ధి పొందినవారు లేరు. మీరు నన్ను అపార్థం చేసుకోకుండా నన్ను మీ శిష్యునిగా స్వీకరించండి" అని అర్థించాడు.

... పెద్దవాడు, అవును అనలేను, కాదనీ అనలేను.

"ఇనీసియేషన్ తతంగం మీకు అవసరం లేదు. ప్రేయరు యిస్తాను. చేసుకోండి" అన్నాడు.

"ప్రేయర్ నాకూ వచ్చు. పుస్తకాల్లో ప్రేయర్సు, కోర్సులు ఉన్నాయి. అవి వల్లిస్తే యోగం అబ్బదు గురువుగారూ. నాకు తెలుసు మంత్ర రహస్యాలు. పుస్తకాల్లో చదివినంత మాత్రాన మంత్రం కాదు. సిద్ధి పొందిన గురువు ఉపదేశిస్తేనే అది మంత్రం అవుతుంది. ఆ మంత్రానికి మహిమ ఉంటుంది. దయచేసి నన్ను కాదనకండి. జీవిత చరమాధ్యాయంలో మంచి యోగం చేశానని, మంచి గురువు లభించాడనే తృప్తి నాకు మిగలనీయండి"అని అర్థించాడు, ప్రార్థించాడు.

అర్ధరాత్రి 12 గంటలకు ఆయనకు 'కారణం' యిచ్చాను. ఇనీసియేషన్ అంటే మంత్రం చెవిలో చెప్పడం, ప్రేయర్ చెప్పడం కాదు నా పద్ధతిలో. మాస్టరుగారి అనుమతి పొందడం, వారి శక్తిని ఆవాహన చేసుకుని, దీక్షితునిలోకి దానిని పంపడం. ఆ క్షణం నుండి వారిలో యోగావర్కు నిరాటంకంగా సాగాలి, సాగుతుంది. యోగస్ఫూర్తి కలుగు తుంది. యోగచైతన్యం కలుగుతుంది.

ఆయన అన్నారు. "నేను క్రియానంద సరస్వతి, స్వామి శివానంద, అరవిందులు, రమణమహర్షి, శ్రీశైలంలో మరొకస్వామిని సేవించాను. అన్ని చోట్ల నాకు లభించని ఆత్మశాంతి మీ వద్ద లభించింది. వారితో పోల్చడంకాదు కానీ మీరు యోగసిద్ధులు. నేను పుట్టపర్తి బాబావారిని కూడా దర్శించాను."

ఇనీసియేషన్ అయిన తర్వాత ఆయన ఆశీస్సులు కోరి పాదాభివందనం చేస్తానని పట్టుబట్టారు. అవసరం లేదని నేను మొండికెత్తాను.

"గురువుకు పాదాభివందనం చేసి ఆశీస్సులు తీసుకోకపోతే ధ్యానం కుదరదు గురూజీ. ఇది నా స్వార్థం. కాదనకండి."

అంత పెద్దాయన - అన్నీ తెలిసినవాడు, గురుదంపతులకు, గురువందనం చేశాడు. సంప్రదాయం తెలిసినవాడు.

'గురువు అనుగ్రహంతో పొందేశక్తి, తానుగా ఎంత తపస్సు చేసినా లభించదు' అన్నాడు. ఆయన అనుభవం ముందు నా అనుభవం ఏపాటిది?

శ్రీగురుభ్యోన్నమః -

0 0 0

ఆ సమావేశం అనేక కొత్త వాకిళ్లను తెరిచింది... అనేకమందికి జ్ఞాననేత్రం ప్రసాదించింది. ప్రజ్ఞ ప్రభవించింది ఎప్పుడో కానీ అలాంటి అవకాశం లభించదు. ఎవరికివారు తమ గురించి తెలుసుకోగలిగారు. డా.పద్మావతమ్మకు యోగం పూర్తయింది. ఆమెలోని ప్రజ్ఞ విశ్వప్రేమగా రూపుదిద్దుకున్నది.

ఒక అమ్మాయి వచ్చింది. పేరు నివేదిత. ఆమెకు ట్రీట్‌మెంట్ ఇవ్వవలసి వచ్చింది. ప్రేయర్‌కు కూర్చున్న రెండు నిమిషాలలో నాకు యాస్ట్రల్ డిస్టర్బెన్స్ అయి కళ్ల తెరిచాను. మిత్రులు బి.ఎస్. కృష్ణారావుగారు ప్రేయర్ చేయలేక లేచిపోయారు. తర్వాత నివేదిత పడిపోయింది. ఏదో యాస్ట్రల్ వర్కింగు, తెలుస్తూనే వుంది. సీనియర్ సాధకులు చాలామంది వున్నారు. జి. నారాయణ రావు, కృష్ణమూర్తి, ఆర్. నాగేశ్వరరావు, వసంతకుమార్ మొత్తం తొమ్మండుగురు కూర్చున్నారు ట్రీట్‌మెంటుకు. ఎంతచేసినా ఆ అమ్మాయిలో చలనం రాలేదు. పద్మావతమ్మ లేచి అన్నారు "ఈ ట్రీట్‌మెంటు మీరు చేసేది కాదు లేచిపొండి అందరూ. అమ్మగారు చేయాలి. వెంకమ్మగారి ఆదేశం..." అని యామినీదేవిని ట్రీట్‌మెంటుకు ఆహ్వానించింది. మగవాళ్లంతా తప్పుకున్నారు. అప్పటివరకు యామినీదేవి పరోక్షంగా మంచి జరగాలని సంకల్పిస్తూ, ప్రేయర్ చేయడమేతప్ప, పేషెంట్ ప్రక్కన కూర్చుని ట్రీట్ చేసింది లేదు. ఆ రోజున తనకీ ఆ సంకల్పం కలిగింది. యామినీదేవి, పద్మావతమ్మ, వరలక్ష్మి... ఇంకా ఎవరెవరో ట్రీట్‌మెంట్‌కు కూర్చున్నారు. ఒక్క గంటలో ఆ అమ్మాయికి ఆరోగ్యం చక్కబడ్డది.

అలా ట్రీట్‌మెంట్ జరిగే సమయంలో విశాఖపట్నంనుండి వచ్చిన మూర్తిగారికి ఒక చక్కని అనుభవం కలిగింది. ఆయన శివానంద శిష్యుడు. కొంతకాలంగా నా యోగం చేస్తున్నాడు. అందరం ధ్యానం చేస్తుండగా, ఆకాశమార్గాన వచ్చి నూరుమందికి పైగా మహర్షులు, మహాయోగులు, మహాత్ములు మమ్మల్ని పర్యవేక్షించి అమృతం కురిపించారుట. ఆశీర్వదించారుట. ఆ దివ్యశరీరులు అందరినీ అతను గుర్తించలేదు. స్వామి శివానంద, రమణభగవాన్, అరవిందులు, షిర్డీసాయి, రామకృష్ణ పరమహంస, ఇలా కొందరిని గుర్తించగలిగాడు. యోగసమావేశాలకు ఇందరు మహాత్ములు హాజరై మమ్మల్ని ఆశీర్వదించడం కన్న కోరదగింది ఏముంది!

యోగసమావేశాలకు మాస్టరుగారు, మాతృశ్రీ వెంకమ్మగారు దివ్యశరీరాలతో హాజరై, మనల్ని నడిపిస్తారనడానికి, యోగచర్యల్ని గమనిస్తారనడానికి ఒక ఉదాహరణ ఇది. ఆ సమావేశంలో 'గురు రెగ్యులేషన్స్' ప్రారంభించాం. మూడు రోజులు చేస్తే అయిదారు వందలు దాటలేదు. స్క్రిప్టురూపంలో వున్న కోర్సును ఎలక్ట్రానిక్ టైప్ చేయించాం. అక్కడక్కడ టైప్ మిస్టేక్స్ దొర్లాయి. నేను వాటిని గమనించి, సరిచేసుకుంటూ

చదివేను. మూడవరోజున ఒక సాధకురాలు నా వద్దకు వచ్చి "మాస్టరుగారూ, మీరు మొన్న, నిన్న, ఇవ్వాళ చేయించిన కోర్సులో నాలుగుతప్పులు చదివారు, గుర్తించారా" అని అడిగింది.

నేను అవాక్కయినాను. నా వద్ద కోర్సులన్నీ శుద్ధ ప్రతులే ఉంటాయి. ముందుగానే తప్పులుదిద్ది, మేలు ప్రతిని సిద్ధం చేసుకుంటాను. మూడు రోజుల కోర్సులో నాలుగు తప్పులు దొర్లడం! ఈమెకు ఎలా తెలుసు! తప్పులు ఎన్నగలనారు మాస్టరుగారు, మదర్ లేదా సీనియర్ సాధకులు ఎవరైనా చెప్పగలరేమో! ఈమె నిన్నగాక మొన్న యోగంలో చేరింది.ఈమెకు ఏది తప్పో, ఏది ఒప్పో ఎలా తెలిసింది! ఆమెకు అంత ఇంగ్లీషు భాషాప్రావీణ్యం ఉన్నదని తోచదు. అదే అడిగాను.

"మీరు కోర్సు చేయిస్తున్నపుడు, మీరు చదివేదంతా నాకు నియోన్ లెటర్స్‌లో మాస్టరుగారు చూపించారు. మూడురోజులు అలాగే జరిగింది. మాస్టరుగారు చూపించిన వాటికి, మీరు చదివిన వాటికి నాలుగుచోట్ల ఒక్కొక్క మాట తేడా వచ్చింది" అన్నది.

నిజమే. నాలుగు తప్పులు నేనూ గుర్తించాను చదివేటప్పుడు. ముందుగా చదివిన తర్వాత అది తప్పని గ్రహించి, దిద్దుబాటు చేసుకున్నాను పుస్తకంలో. కానీ మళ్లీ పైకి చదవలేదు. మనస్సులోనే కరెక్షన్ చేశాను. అలా మనస్సులో అనుకున్నా సాధకులకు వైబ్రేషన్ సరిగా అందుతుంది. ఫలితం ఉంటుంది. అసలు కొన్ని కోర్సులు పైకి చెప్పనవసరం లేదు. సాధకులు కళ్లు మూసుకుని కూర్చుంటే చాలును. నేను లోలోపల చదివిన మాటల స్పందన తరంగాలుగా వెళ్లి వారిలో స్పందన కలిగిస్తుంది. అది ఉత్తమ పద్ధతి.

# 1992

## పరస్పరాశ్రితాలు

**తిరుపతిలో నాది ఒక విధంగా వానప్రస్థ జీవితం.**

ఆశ్రమ జీవితం కనుక వానప్రస్థాశ్రమం అనవచ్చు. గృహస్థాశ్రమం. కాస్త రూపు రేఖలు, గుణగణాలు మారితే వానప్రస్థాశ్రమం అవుతుంది. అది కాస్త రంగుమారి, వైరాగ్యం పులుముకుంటే యోగాశ్రమ జీవితం అవుతుంది. నా దృష్టిలో యోగాశ్రమం అంటే అడవిమధ్యలో ఒక పర్ణశాల వేసుకుని జీవించడం కాదు. ప్రపంచ వ్యవహారాలు చూస్తూ అందరిలో ఒకరుగా జీవిస్తూ, సాటి మనుషుల విలువల్ని పెంచే సత్కార్యాలు చేస్తూ, అత్యాశ, అహంకారం, అభిజాత్యం విడనాడి నిస్వార్థంగా జీవిస్తూ, యోగసాధన చేయడం. పరమాత్మసన్నిధికి చేరడానికి వీలైనంత తపస్సు లేదా ధ్యానం చేసుకోవడం. ఆ పని ఒంటరిగా ఏకాకిగా చేసుకోవడంకన్న ఆలుమగలు అన్యోన్యంగా ఉంటూ ప్రాపంచికతకు తక్కువ విలువనిస్తూ, లాలసకు లొంగిపోకుండా, ఉన్నతవిలువలతో జీవిస్తూ యోగసాధన చేయడం, అందరి మధ్య వుంటూనే ఏకాంతాన్ని సాధించవచ్చు. తనలోకి తాను దూసుకుపోవచ్చు. అదీ నా యోగపరమార్థం.

తిరుపతి చేరాక బయటి ఆహ్వానాలు అంగీకరించడం లేదు. ఎక్కడకు వెళ్లాలనిపించడం లేదు. ఉద్యోగం చేసినంత కాలం ఎక్కడికైనా వెళ్లాలంటే సెలవులు దొరికేవి కావు. సెలవు లభిస్తే డబ్బు ఉండేది కాదు. రిటైర్ అయిన తర్వాత సమయం వున్నా, ఆర్థిక దుస్థితి. రెండవది ఒంటరి ప్రయాణం అసాధ్యం. ఒకసారి కళ్యాణదుర్గం వెళ్లాను. మరొకసారి తుకారాం ఆహ్వానంపై సిర్‌పూర్ కాగజ్‌నగర్ వెళ్లాను. కాగజ్‌నగర్‌లో కొందరు యోగంలో చేరారు. తిరిగి వస్తుండగా కె.వి.రత్నంగారి భార్య సంధ్య అడిగింది, తనకు ప్రేయర్ కుదరడం లేదని. అసలు సంధ్య నా వద్ద ఇనీసియేషన్ తీసుకోలేదు. ప్రేయర్ ఎలా కుదురుతుంది? మర్నాడు బి.ఎస్.కృష్ణారావుగారింటికి రమ్మని చెప్పాను. తిరుపతి నుండి వస్తే కృష్ణారావుగారింట్లో మకాం అప్పట్లో అప్పుడప్పుడు. ఆ అమ్మాయికి టచ్ యిచ్చి, ఇనీసియేషన్ ఇవ్వగా, రెండుగంటలు ధ్యానం చేసింది. చాలా వర్కింగ్స్, నమస్కారాలు వచ్చాయి, అంతకు ముందు చాలాకాలంగా యోగం చేస్తున్నది. నేను ఇనీసియేషన్ చేసింది ఆ రోజునే.

ప్రార్థన తెలిసినంత మాత్రాన యోగం తెలిసినట్లు కాదు. రోజూ ప్రార్థన చేసినా యోగం చేసినట్లుకాదు. అభివృద్ధి కనిపించక పోవచ్చు. ఫలితం కనిపించక పోవచ్చు.

చేయగా, చేయగా ఎప్పుడో మాస్టరుగారి కరుణావీక్షణం సాధకునిపై ప్రసరిస్తుంది. అంతవరకు ఎలాంటి చలనం కలగదు, చైతన్యం కలగదు. ఎప్పుడో నావంటి సీనియర్ సాధకునికి బుద్ధి పుడుతుంది. మాస్టర్ ఎనర్జీ ఏదో మాలోంచి ఆ సాధకునిలోకి బదిలీ అవుతుంది. ఆక్షణంలో వారికి ఇనీసియేషన్ అయినట్లు. అంతవరకు చేస్తున్నది వృధా అని కాదు, అప్పటికి పక్వానికి వచ్చినట్లు. ముందు రెక్టిఫికేషన్ జరగాలి ఎవరికైనా. కొన్ని అడ్జస్టుమెంట్లు జరుగుతాయి. అంతవరకు వేచి ఉండక తప్పదు. తొందరపడితే ఎవరికీ యోగం అబ్బదు. కొందరి విషయంలో ఆలస్యం అనివార్యం అవుతుంది. కొందరికి మొదటిరోజునే యోగావర్కు ప్రారంభమవుతుంది. వారి వారి సంస్కారం అందుకు కారణం. పూర్వపుణ్యం అని, కర్మ అని నేను అనను. ఇప్పుడు అలవడవలసిన సంస్కారం అది. అవకాశం వున్నా కొందరు ఉపయోగించుకోలేరు. ఏవో అడ్డంకులు, అవాంతరాలు వారిని యోగానికి దూరం చేస్తాయి. యోగదూరుల్ని చేస్తాయి వచ్చిన తర్వాత, కొంతకాలం యోగం చేసిన తర్వాత పలాయనం చిత్తగించే వారుంటారు. ఎవరి యోగ్యత వారిది. మనం కర్తలం కాదు. ఎవరినీ నేను శాసించను. అభిశంసించను.

ట్రీట్‌మెంట్స్ చేయడంలో నా పద్ధతి నాది. మొదట్లో 'బ్రీతింగ్స్' ఉపయోగించేవాడిని. తర్వాత నాకు వాటి అవసరం లేక వాటిని ఉపయోగించడం లేదు. ట్రీట్‌మెంట్ చేస్తే రోగి బాధలు, రోగం, చేసినవ్వారు తమలోకి తీసుకుని బాధపడవలసి వస్తుందని చాలామంది నమ్మకం, భయం. అందుకే వీళ్ల కర్మలు తమ నెత్తిన వేసుకోవడం ఎందుకని చాలామంది సీనియర్స్ చికిత్సల జోలికి పోరు. తమవరకు యోగసాధన చేసుకుంటూ తృప్తిగా వుంటారు. ఎక్కడో నాలాంటి ఒకరిద్దరు ఈపనికి పూనుకుంటారు. బాధలు వచ్చినా, కష్టనష్టాలు ఎదురైనా భరించడానికి అనుభవించడానికి సిద్ధపడినవారే యోగా ట్రీట్‌మెంట్స్ చేయడానికి సిద్ధపడతారు. అందుకు చాలా ధైర్యం, సాహసం కావాలి.

కృష్ణారావుగారింట ఒక నెలరోజులు ఉండవలసి వచ్చింది. వారింట్లో ఒక నెలరోజులు ప్రత్యేక ప్రార్థనలు చేయాలని వారికి సంకల్పం కలిగింది. 'ప్రేయర్స్ పుస్తకం' అచ్చువేసే సమయంలో అక్కడ మకాం పెట్టాను. కృష్ణారావుగారి చిన్నబ్బాయి భాస్కర్, గోవిందరాజశర్మ, ఆనందకుమార్, ఆదిత్యకుమార్... ఇలా ఇరవై పాతిక సంవత్సరాల యువకులు యోగంలో చేరారు. శ్రద్ధాభక్తులున్నవారు. అప్పుడే భాస్కర్ తన మిత్రుడు వాసుని తీసుకువచ్చాడు. అతను ఇనీసియేషన్ జరిగిన మర్నాడే విరమించుకున్నాడు. అతని అక్క వాణి, మరో తమ్ముడు బాబు వచ్చారు. వాణికి గృహస్థజీవితం సరిగాలేక, పుట్టింట్లోనే ఉంటోంది. కృష్ణమోహన్ వచ్చి అక్క పరిస్థితి చెప్పి ఏడ్చాడు. అప్పటికి బాబు

కుర్రవాడు. డిగ్రీ చదువుతున్నాడు. యోగం అంటే వాళ్లకు పెద్దగా తెలీదు. కృష్ణారావు,చిత్ర చేస్తున్నారు కనుక వారికి నమ్మకం. వారంతా కుటుంబమిత్రులు. వాణి యోగంలో చేరింది.

"అమ్మాయ్, నా యోగం సర్వరోగ నివారిణి. కానీ అన్నిసమస్యలు పరిష్కరిస్తుం దని చెప్పను. యోగం చేసుకుంటే నీకు మేలు జరుగుతుంది. అంతవరకు చెప్పగలను – ఆ మేలు నీవు కోరుకున్న విధంగా ఉండకపోవచ్చు. నీకు ఏది మంచిదైతే, మాస్టరుగారు ఆ మార్గాన్నే చూపిస్తారు. సమస్య అలా పరిష్కారం అవుతుంది. మాస్టరుగారి తీర్పును నీవు ఆమోదించాలి. నీకు ఇష్టమైన రీతిలో, నీవు కోరిన విధంగా కాకపోతే నన్ను, యోగాన్ని, మాస్టరుగారిని నిందించవద్దు. జడ్జిమెంట్ నీ ఇష్టానికి వ్యతిరేకం కావచ్చు, నీకు అనుకూలంగా రావచ్చు, రాకపోవచ్చు. కాని తీర్పు తీర్పే. సుప్రీంకోర్టు తీర్పులాంటిది. ఆ పైన అప్పీలు చేసుకోడానికి వీలుండదు. భరించక తప్పదు" అన్నాను.

వాణి ఆడపిల్లే గాని మొండిపిల్ల. పైకి మెత్తగా కనిపిస్తుంది కాని గట్టిమనస్సు కలది. కొండంత బరువును భరించే స్థైర్యం వుంది. ఆ లక్షణాలు ప్రతివారికీ అవసరం. స్వతంత్రంగా జీవించదలచినవారికి మనోస్థైర్యం, ధైర్యం చాలా అవసరం. ఆమె యోగంలో కుదురుకున్నది. ఆమెలో యోగావర్చ్చ బాగా కనిపించింది. చిన్నచిన్న రుగ్మతలు. వెంటనే సమసిపోయాయి. చక్కని ఆరోగ్యం చేకూరింది. రెండవది ధైర్యం వచ్చింది. యోగబలమో, ఆమె సంకల్పబలమో గాని వాణిగారి మొగుడుగారు వచ్చారు. మళ్లీ కాపురానికి తీసుకువెళ్లాడు. ఆరునెలల సహవాసంతో వారు వీరవుతారంటారు. వీరు ఎవరికి వారుగానే మిగిలారు, 'కుక్కతోక వంకర' సామెత. ఆ అమ్మాయి తిరిగి పుట్టింటికి చేరింది. మళ్లీ కథ కంచికివెళ్లింది.

సాధారణంగా ప్రతివారు యోగంచేస్తే వారి సమస్యలన్నీ తీరిపోతాయన్న భ్రమలో ఉంటారు. అది తప్పు. యోగం చేయడం వల్ల కర్మ కొంత రహితం కావచ్చు. కొంతవరకైనా అనుభవించక తప్పదు. మహా మహా తపస్సు చేసినవారే అనుభవించారు. రామకృష్ణ పరమహంస, రమణమహర్షి, కంచి పరమాచార్య, శివానంద లాంటి ఎందరో మహాత్ములు రోగాలు అనుభవించారు. అంత తపస్సు చేసినవారికి అలాంటి భయంకర వ్యాధులు ఎందుకురావాలి అని ప్రశ్నించడం అనుచితం, అజ్ఞానం. ఎంతటివాడైనా కొంతయినా కర్మశేషం అనుభవించక తప్పదు. అది రోగాల రూపంలో ఆవహించకనూ తప్పదు. సమస్యలను మన వివేకంతో, సామాజిక న్యాయంతో పరిష్కరించుకోవాలిగానీ యోగానికి లేదా ఇష్టదైవానికి, భగవంతునికి ముడిపెట్టకూడదు.

తన సమస్య పరిష్కారమైన పద్ధతికి ఆమె దిగులుపడలేదు. క్రుంగిపోలేదు. నిరాశకు లోనుకాలేదు. ఈ రోజుల్లో యువతీ యువకులకు ఆపాటి విజ్ఞత, తెగింపు,

చొరవ, స్వతంత్రత చాలా అవసరమనిపిస్తోంది. సంసారాలు సాగించడమే నేటియువతకు ధ్యేయం అనిపించడం లేదు. ఇష్టం లేకుండా మొక్కుబడిగా సంసారాలు చేయాలని నేటి కాలపు యువత అనుకోవడం లేదు. స్వతంత్రంగా బ్రతకాలన్న తెగింపు కనిపిస్తోంది. పెద్దవారు, అయిష్టంతోనైనా అంగీకరించవలసి వస్తోంది. సమాజం ఆ తెగింపును గర్హించడం లేదు. మారుతున్నకాలంలో మారే విలువలను మన్నించడం పరిణామం, సంస్కారం. మాస్టరుగారిని పూర్తిగా నమ్ముకున్నవారికి వారి 'గైడెన్స్' ఉంటుంది. ఆ గైడెన్స్‌ను ఆమోదిస్తే మంచిఫలితాలు కలుగుతాయి. జీవితం నిర్విచారంగా, సుఖంగా సాగుతుంది. ఆత్మస్థైర్యం ఉండాలేగానీ ఆత్మతృప్తికి, ఆనందానికి, మార్గాలు అనేకం లభిస్తాయి. మనసున్న వానికి మార్గం దొరికితీరుతుంది.

0 0 0

నా పట్ల అభిమానంతో, యోగంపట్ల అభినివేశంతో వచ్చినవారు ఎన్నటికీ నన్ను నా యోగాన్ని వదిలిపోరు. పోలేరు. వారికీ నాకు మధ్య యోగాన్ని మించినబంధం మరేదో ఏర్పడుతుంది. అది జననాంతరసంబంధం. జన్మజన్మల ఆత్మానుసంధానం. నన్ను అర్థం చేసుకున్నవారికి నా యోగం అర్థం అవుతుంది. నా యోగాన్ని అర్థం చేసుకున్నవారు నన్ను అభిమానిస్తారు. ఆరాధిస్తారు, ప్రేమిస్తారు. యోగం పరస్పరాశ్రితం. యోగస్పందన పరస్పరాశ్రయం.

చిత్తూరు నుండి ఒకామె వచ్చింది. పేరు విమలమ్మ.ఆమె గుండెలో స్పందన, కళ్లలో తడి కలగలసి ఆత్మీయంగా మారింది. ఆమె పెద్దకోరికలు కోరలేదు. ఇది కావాలని, అది కావాలనీ అడగలేదు. గురుదంపతుల్లో తన కన్నతలిదండ్రుల్ని చూసుకోగలిగింది. అమ్మ, నాన్న అని పిలవసాగింది. ఆ పిలుపులో తొంగిచూచింది కన్నబిడ్డల ప్రేమ. అదిచాలును మనుషులను దగ్గర చేయడానికి, మనసులను ఏకం-చేయడానికి. అలాంటి అనుబంధం ఆ తర్వాత వచ్చిన చాలామందిలో కనిపించింది. అందుకే మాది యోగకుటుంబం అయింది. ఇది వసుధైక కుటుంబం. చిత్తూరులో ఒక యోగాసెంటర్ వుంది. చంద్రశేఖర్ నిర్వహణ. అక్కడికి విమల వెళ్లదు. ఆమెకు తిరుపతిలో మావద్దకు వస్తేనే తృప్తి. ఒక్కసారి పుట్టింటికి వచ్చిన ఆడపిల్ల పొందే అనుభూతి, తృప్తి ఆమెలో. అందరూ అలా ఉండగలగాలి. అప్పుడు యోగం ప్రేమపూర్ణమవుతుంది. అనురాగ రంజితమవుతుంది.

తన గురువు దగ్గరకు తప్ప, మరొక గురువు దగ్గరకు పోకూడదని ఆమె నిర్ణయం. కన్నతండ్రినే 'నాన్న' అనగలం. ఎవరిని పడితే వారిని 'నాన్న' అనం. కన్నతల్లిని, మరోతల్లినైనా 'అమ్మా' అని ఆప్యాయంగా పిలవగలం. గురువు తండ్రిలాంటివాడు.

నిత్యం గురునామ స్మరణ చేస్తే చాలు గురువు అనుగ్రహం అప్రతిహతంగా అందుతుంది. ఈ రహస్యం తెలుసుకోలేని సాధకుడు అహంకరిస్తాడు. అహంభావం పెంచుకుంటాడు. గురువు అనుగ్రహానికి దూరం అవుతుంటాడు. విమలది నేర్చుకుంటే అబ్బిన సంస్కారం కాదు. అది జన్మసంస్కారం.

0 0 0

డాక్టరు పద్మావతమ్మ బళ్లారికి పిలిచారు వారి ఇంట ఒక చిన్న సమావేశం జరపాలని. కళ్యాణదుర్గం నుండి సాధకులు చాలామంది వచ్చారు. బళ్లారిలో మూడు గ్రూపులు. సూర్యనారాయణగారి సెంటర్ ఒకటి. కొండాచారి గారి రాజయోగాశ్రమం రెండవది. మూడవది పద్మావతమ్మ సొంతం. ఈమె పై రెండుసెంటర్లకు వెళ్లదు. వారిపద్ధతులు ఈమెకు నచ్చవు. సూర్యనారాయణ మాస్టర్, మదర్ ఫోటోల ప్రక్కన తన ఫోటో పెట్టి ప్రేయర్ చేయిస్తాడని, సీనియర్స్ అక్కడికి వెళ్లడం మానుకున్నారు. తానే మాస్టరు సి.వి.వి. అవతారమని, తన భార్య మాతృశ్రీ వెంకమ్మగారని ఆయన ప్రచారం చేసుకున్నాడట. కొండాచారిగారు విద్యావంతులను, పెద్ద ఉద్యోగులను కూడగట్టుకుని సెంటర్ నిర్వహిస్తున్నారు. ఆయనతో పేచీలేదు. ఈయనకు కుంజు అయ్యర్ ఆదర్శం, గైడు. తన సమావేశాలకు అయ్యర్‌ను పిలుస్తుంటాడు.

కుంజు అయ్యర్‌ది మద్రాసు. రామానుజంగారి శిష్యుడు. కు[illegible]కోణంలో ఉంటాడు. ఆయన యోగం ఏపాటి చేస్తారో నాకు తెలియదు. పద్మావతమ్మగారి ఆహ్వానం మేరకు నేను, యామినీదేవి వెళ్లాం బళ్లారి. మా వ[illegible]ం పద్మావతమ్మగారి ఇల్లే. కొండాచారిగారింటికి వెళ్లి కలిశాను. "ఇద్దరు సీనియర్ సాధకులు ఒకేసారి బళ్లారి రావడం మహద్భాగ్యం" అని లాడ్జికి తీసుకువెళ్లి [illegible]ంజు అయ్యర్‌కు పరిచయం చేశారు. ఆయనగారు నన్ను గుర్తి నట్లే ప్రవర్తించాడు. తన దర్శనా[illegible]కి నేను తిరుపతి నుండి వచ్చినట్లు పోజు పెట్టారు. ఆయన మూడు రంగుల శాలువా, మెడలో రుద్రాక్షమాలలు, మొహాన విభూతిపట్టీలు చూడగానే జంగమదేవర అనిపించాడు.

సాయంత్రం పద్మావతమ్మగారింట ప్రేయర్‌కు కొండాచారిగారు కుంజు అయ్యర్‌ను తీసుకువచ్చారు. ఊళ్లో యోగసాధకులంతా నాకు తెలిసినవారే! నేను వచ్చానని తెలిసి యాభై, అరవై మంది ప్రేయర్‌కు వచ్చారు. చాలామంది నా ట్రీట్‌మెంటు తెలిసిన వారే. నేనంటే గురుభావన వారందరికి. ఒక్క కొండాచారిగారికి మాత్రం అయితే గియితే తాను గురువు, మాస్టరు అనిపించుకోవాలని లోపల ఆరాటం. పైకి అనడు కాని అందుకు అవసరమైన వాతావరణం సృష్టించి పెట్టుకున్నారు. మంచిదే! ఆయన మాస్టరు అయినా, గురువు అయినా మరొకరికి నష్టం లేదు.

క్రిక్కిరిసిన హాలులో అప్రయత్నంగా నాకు అయిదుగురికి ట్రీట్‌మెంట్ వచ్చింది. వారెవరో నాకు తెలియదు. ఎవరూ ముందుగా నన్ను కోరలేదు ట్రీట్‌మెంట్ కావాలని. అడగాలని అనుకుని ఉంటారు. ప్రేయర్ పూర్తిచేసి అయిదు విభూతి పొట్లాలు సిద్ధం చేసి పెట్టుకున్నాను. అందరి ప్రేయర్ అయిన తర్వాత వారివైపు చూచి "మీలో అయిదుగురికి ట్రీట్‌మెంట్ జరిగింది. వారు ఎవరో వచ్చి విభూతి తీసుకోండి" అన్నాను. నలుగురు వచ్చి 'టచ్' తీసుకున్నారు. అయిదవ వ్యక్తి రాలేదు. కానీ మరొకరికి ట్రీట్‌మెంట్ యివ్వడం అయితే జరిగింది అడగకుండానే.

ప్రేయర్ తర్వాత ఆరుబయట చాపలు వేసి కూర్చున్నాం. కొండాచారిగారు కుంజు అయ్యర్ ప్రత్యేకతను చాటిచెప్పడంకోసం వారిని మాస్టరుగారి గురించి యోగం గురించి ప్రసంగించమని కోరారు. ఆయనకు తెలుగు సరిగా రాదు. ఇంగ్లీషు అస్సలు రాదు. ఏదో పొడిపొడిగా చెప్పాడు. వచ్చినవారికి బొత్తిగా నచ్చలేదు... పద్మావతమ్మగారు "మా గురువుగారు మాట్లాడతారు" అన్నారు. నా సహజధోరణిలో ఒక గంటసేపు చెప్పాను కుంజుఅయ్యర్ అంతవరకు బిగదీసుకు కూర్చున్నవాడు వచ్చి 'క్షమాపణ' వేడుకున్నాడు.

"మీ గురించి వినడమేతప్ప ఎన్నడూ చూడలేదు. ఏ ఊరు వెళ్లినా యోగసాధకులు మీ గురించే చెబుతుంటారు. ఇందాక అయిదుగురికి ట్రీట్‌మెంట్ చేశారుగదా! ఎలా చేశారు?" అని ప్రశ్నించాడు.

అంతలో సరస్వతి వచ్చి ప్రక్కన కూర్చుని, తాను ట్రీట్‌మెంట్‌కోసం వచ్చానని చెప్పింది.

"నీకు ట్రీట్‌మెంట్ ఇందాకనే చేశాను. విభూతి తీసుకో" అని అయిదవపొట్లం ఇచ్చాను.

కుంజు అయ్యర్‌గారికి ఈ మతలబు అర్థంకాలేదు. నేను బళ్లారి వెళ్లడం అదే చివరిసారి "ఇంక నేను బళ్లారి రాను" అని ఆ రోజునే చెప్పాను.

0 0 0

అప్పుడప్పుడు కొన్ని అద్భుతాలు, నిదర్శనలు చూపిస్తే తప్ప జనానికి నమ్మకం ఏర్పడదు. అంధుకే అవసరం లేకపోయినా సిద్ధపురుషులు సైతం మిరకల్స్ చూపిస్తుంటారు. పద్మావతమ్మగారింట అలాంటి మిరకల్ ఒకటి జరిగింది. మేము ప్రేయర్ చేస్తుండగా, పక్కింటి ఆమె వస్తానని కబురు చేసింది కానీ రాలేదు. ఆలస్యంగా వచ్చింది. రెండు కొబ్బరికాయలు, అగరువత్తులు తెచ్చింది. వాటిని అక్కడ పెట్టింది. "మేమంతా బయటకు వెడుతున్నాం. అక్కడ ఉంచండి. వచ్చాక చూడవచ్చు" అని తాళం వేసి వెళ్లిపోయాం

తిరిగి వచ్చేసరికి ఆ రెండు కొబ్బరికాయలు పగలగొట్టినట్లు నివేదించబడి వున్నాయి. అగరువత్తులు అప్పుడే వెలిగించినట్లు ఘుమఘుమలాడుతున్నాయి. కొబ్బరికాయలు వాటంతట అవే ఎలా పగిలాయి?!! ఎవరూ వెలిగించకుండా అగరువత్తులు ఎలా వెలిగాయి?!! ప్రేయర్ సమయంలో అగరువత్తులు వెలిగించడం మరచిపోయినా గంటసేపు ప్రేయర్ హాలులో అగరొత్తుల గుబాళింపు రావడం మా ప్రార్థనల్లో సహజమే.

0 0 0

మే సమావేశాలకు కొద్దిరోజులు ముందుగా ఒకయువకుడువచ్చాడు. పాతికేళ్లలోపు వయస్సు. రావడమే చాలా తీవ్రంగా కోపంగా వచ్చాడు.

"శార్వరి అంటే మీరేనా?" అని అతని తొలిప్రశ్న. అతని 'యాస' తెలంగాణా వాడని పట్టించింది.

"మీది కరీంనగరా?"అడిగాను.

"అవును మీకెలా తెలుసు నేను. మీరేనా గురువుగారంటే?"

"నేనెవరికీ గురువును కాదు. నాపేరు శార్వరి, కొందరు శర్మ అని కూడా అంటారు. నేను గురువును కాను, అలా అని ఎవరికీ చెప్పలేదు"

"నేను శార్వరిగారిని కలుసుకోవాలని వచ్చాను"

"కలుసుకోవాలని వచ్చారా; మాట్లాడాలని వచ్చారా?"

"రెండింటికి తేడా ఏమిటి? రెండు ఒక్కటేగా"

"కాదులే... ఇప్పుడు మాట్లాడు, తర్వాత కలుసుకుందువు. కలుసుకోవడం అంటే నాలో నీవు కొంత కలిసిపోవడం. మాట్లాడిపోవడం అంటే పనితీరివెళ్లిపోవడం"

"నేను రామకృష్ణ ఫ్రెండ్‌ని" అన్నాడు.

"నీపేరు భాస్కర్, అవునా?"

"మీరు యోగం పేరుతో నా ఫ్రెండ్‌ని మోసం చేశారు. అతని భవిష్యత్తును పాడుచేస్తున్నారు. అతను నా మాట వినడం లేదు" అన్నాడు.

"నీ ప్రశ్నలకు సమాధానం ఇప్పుడు చెప్పను. మరొకసారి రండి భాస్కర్" అన్నాను.

అతను మొండిగా వాదనకు దిగాడు.

"యోగం తిండి పెట్టదు" అన్నాడు

"కానీ యోగం అతన్ని మనిషిగా మార్చవచ్చుగదా! అతని జీవితం ముందు ముందు ఎన్ని మలుపులు తిరుగుతుందో!"

అతను వచ్చినవిషయం ఎలా పసికట్టాడో అతని మిత్రుడు రామకృష్ణ వచ్చాడు.

అతని మొహం వివర్ణమైంది. ఇద్దరు మాట్లాడుకునే స్థాయి దాటిపోయింది. ఏదో గొడవ జరిగివుంటుంది.

అప్పటికి భాస్కర్ నాపై కోపంతో వెళ్లిపోయాడు.

మూడు నెలల తర్వాత తనంత తానుగా వచ్చాడు.

"నేను యోగంలో చేరాలని వచ్చాను" అన్నాడు.

"యోగం తిండిపెట్టదు కదా భాస్కర్" అన్నాను నవ్వుతూ.

'మీ పుస్తకాలు కొన్ని చదివాను గురూజీ! నాకు నచ్చాయి. మీయోగం మిగతా యోగాలవంటిది కాదని అర్థమైంది. మనిషికి అన్నివిధాల ఉపయోగించే యోగం మీది'

"యోగంలో చేరడం వల్ల నీకు లాభాలు ఉండకపోతే...?"

"... మూడు నెలలుగా ఇక్కడికి వచ్చి వెళ్లినప్పటినుండి నాలో ఎంతో మార్పు వచ్చింది. నా ఆలోచన మారింది. ఒక్కసారి మిమ్మల్ని కలిసి వెళ్లితేనే నాలో ఇంతమార్పు వచ్చిందంటే మీ యోగం చేస్తే ఇంకెంత మంచి జరుగుతుందోననిపిస్తోంది. అందుకే వచ్చాను" అన్నాడు వినయంగా.

అతను యోగంలో చేరాడు. చక్కగా యోగసాధన చేస్తున్న యువకులలో తానొకడు. నిర్మలంగా, నిదానంగా ఉండడం అతనికి యోగం నేర్పిన మొదటిపాఠం.

# 1993

## బాట అదే - నడక నాది

**ప్రతి డిసెంబరు సమావేశం ఒక సమీక్షా సమావేశం.**

ఆ సంవత్సరంలో చేసిన పని సింహావలోకనం చేసుకోవడం. అంతవరకు జరిగిన యోగావర్కుపై ఒక అవగాహనకు రావడం. కొత్తసంవత్సరంలో చేయవలసిన పనులు, ముందుముందు చేయవలసిన పనులు రూపొందించుకోవడం - కోర్సులు ఎన్ని పూర్తిచేశాం, ఇంకెన్ని చేయాలి అని లెక్కచూచుకోవడం. ఇవన్నీ బయటివారికి అనవసరం అనిపించవచ్చు కానీ నాకు అవసరమే. ప్రతి సమావేశం ఆరునెలల మత్తు వదలిస్తుంది. ప్రతిసాధకునిలో కొత్త ఉత్సాహం కలుగుతుంది. బ్యాటరీ రీఛార్జి అయినట్లు.

ఒకసారి మద్రాసులో ఉండగా మధురై విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ డా. తిమ్మావఝుల కోదండరామయ్యగారు ప్రేయర్‌కు వచ్చినప్పుడు వారన్న మాటలు జ్ఞప్తికి వస్తుంటాయి. "ఇలాంటి ప్రేయర్ ఒక్కరోజుసాగితే ఆరునెలలు ఆరోగ్యంలో ఎలాంటి ఢోకా ఉండదు. ఉత్సాహంగా పనిచేయగలను" అని. నిజమే సమావేశంలో మూడురోజులు పాల్గొన్నవారికి చిల్లరమల్లర అనారోగ్యాలు చెప్పకుండా పోతాయి. ట్రీట్‌మెంట్‌కోసం వచ్చినవారికి అడగకుండానే జబ్బులు సర్దుకుంటాయి. ప్రతి సమావేశం నవచైతన్యం కలిగిస్తుంది. నవ్యస్ఫూర్తిని కలిగిస్తుంది. ప్రతివారికి ఒక కొత్త అనుభవం కలిగిస్తుంది. నాలుగైదు రోజులు ఒక మునివాటికలో జీవించిన ప్రశాంతి, ఆత్మశాంతి కలుగుతుందంటారు సాధకమిత్రులు.

తిరుపతిలో కొన్ని యోగకేంద్రాలున్నాయి. దాదాపు అన్నిపద్ధతుల వారి శాఖలు ఉన్నాయని చెప్పవచ్చు. సహజయోగకేంద్రం మా ఇంటికి ఒక కిలోమీటరు దూరంలో వుంది కపిలతీర్థం సమీపంలో. దాని సంచాలకుడు 'బాబు' అని, మంచివాడు, అంకిత భావంతో సేవ చేస్తుంటాడు. వారికి రెండు మూడు వందల మంది సభ్యులున్నారు. సంవత్సరానికి ఒకసారి సమావేశం అవుతుంటారు. కపిలతీర్థం దగ్గర జ్ఞానానంద ఆశ్రమం ఉంది. దాని నిర్వాహకుడు కె.ఎస్వీ, నాకు మిత్రుడు.

– బాబు, వారి సెంటర్ నుండి ఊళ్లోకి వెళ్లాలంటే, మా ఇంటిమార్గంలోనే వెళ్లాలి. అతనికి మా ఇల్లు ఒక కిలోమీటర్ ఉండగానే, కాళ్లు తడబడేవి. శరీరంలో కంపనలు, ప్రకంపనలు పుట్టేవి. మా ఇంటి ఎదరకు వచ్చేసరికి మైకం కమ్మినట్లు అయ్యేది. ఒకసారి లోపలకు వచ్చి, తనను పరిచయం చేసుకున్నాడు. సహజయోగమార్గంలో

తాను ప్రిసెప్టర్. అంటే గురువు లాంటివాడు. "గురూజీ! మీ యోగం చాలా పవర్‌ఫుల్. రోడ్డున వస్తుంటేనే నేను ఫీల్ అవుతుంటాను. లోపల ఎనర్జీ కలుగుతోంది. మీతోపాటు నేనూ మెడిటేషన్ చేసుకుంటే మీకేమైనా ఇబ్బందా" అన్నాడు.

"నాకు ఇబ్బందీ లేదు, అభ్యంతరమూ లేదు. ఎప్పుడైనా రండి. ఏ మార్గమైనా సైనా నేను గౌరవిస్తాను" అన్నాను.

వయస్సులో నా కంటె చిన్నవాడు అయినా మంచివాడు. ఏ మార్గంలో సాధన చేస్తున్నా, అంకితభావం కలవాడు. అది ప్రధానం. పైగా స్నేహం కోరి వచ్చాడు. ఆ రోజు నాతో కలిసి ధ్యానం చేశాడు. ఒక గంటకు పైగా చేశాడు.

"అమ్మయ్య! ఎంతో రిలీఫ్ కలిగింది. కొద్దినెలలుగా ఏదో తెలియని బరువు మోస్తున్నాను. ఈరోజు మనస్సు తేలికైంది" అన్నాడు. తర్వాత అప్పుడప్పుడు ప్రేయర్‌కు వచ్చేవాడు. అతను అడవుల్లోకిపోయి కొండగుహల్లో నెలా రెండునెలలు ఏకాగ్రంగా ధ్యానం చేసి వస్తుంటాడు చాలాకాలంగా. నా వద్దకు రావడం మొదలైన తర్వాత ఏ గుహకూ వెళ్లడం లేదు. "ఇక్కడే ప్రశాంతంగా యోగం కుదురుతుంది" అనేవాడు.

ఒకనాడు అతనివెంట ఒక స్త్రీమూర్తి వచ్చింది. ఆమె సగం సన్యాసిని వేషంలో వుంది. నాకు వేషాలంటే యిష్టం ఉండదు. ఆమె సెమీ కాషాయం చీరకట్టింది. మెడలో రుద్రాక్షమాల వేసింది. నుదుట విభూది పెట్టుకుని, జుత్తు విరబోసుకుంది. సంతోష్ బాబు ఆమెను నాకు పరిచయం చేశాడు. ఆమె అతని కో-ప్రిసెప్టర్. పదిహేను సంవత్సరాలుగా యోగం చేస్తున్నది. సన్నగా చలాకీగా వుంది.

కొంచెంసేపు ఆమెతో చర్చ సాగింది యోగవిషయాలపైన. "మీరు కాషాయ బట్టలు కట్టారు. రుద్రాక్షమాల ధరించారు. పరమ పవిత్రంగా జీవిస్తున్నట్లు లోకం అనుకోవాలని మీ ప్రయత్నం. నేను మామూలు మనిషిని. వేషం మార్చను. నేను మీకు చేయగల సహాయం ఏముంది?" అని అడిగాను.

ఆమెకు చాలాకాలంగా కాళ్లతీపులు, వెన్నునొప్పి. దానికి ట్రీట్‌మెంట్ కావాలని అడిగింది.

"మీ యోగంలో మీరు చేసుకోలేరా?" నా ప్రశ్న.

"తెలియదు"

ఆమెను ప్రేయర్‌లో కూర్చోబెట్టి సహస్రారం పైన స్పృశించాను. పదినిమిషాలలో ఆమెకు బాధలు సమసిపోయాయి. సహస్రారం నుండి కుండలిని వరకు ఏదో శైత్యస్రవంతి ప్రవహించినట్లు అయిందట. ఏదైతేనేం రోగం కుదిరింది. అదీ ప్రధానం.

ఒక వారం తర్వాత ఆమె మళ్లీ వచ్చింది. ఈసారి కాషాయాంబరాలు ధరించలేదు.

చక్కని నేతచీర కట్టింది. రుద్రాక్షమాల తీసివేసి, బంగారు ఒంటిపేట గొలుసు వేసుకుంది. ముఖాన విభూతి లేదు. చాలా ఆనందంగా, హుషారుగా వుంది.

"ఏమిటి విశేషం... బాగున్నారా?" అడిగాను.

"పది సంవత్సరాల మధ్యకాలంలో ఈ వారంలో ఉన్నంత ఆనందంగా ఎన్నడూ లేను. మీ ట్రీట్‌మెంట్‌తో నాకు కొత్త జీవితం ప్రసాదించారు. ఇంతకాలం నేనూ యోగం ఎందుకు చేశానో తెలియదు. ఏం సాధించానో అర్థం కాలేదు. అంతా అయోమయం! ఇప్పుడు నేను ఏమిటో నాకేం కావాలో తెలుసుకున్నాను."

"కరెక్టు, మీ మెడలోని బంగారు గొలుసు చెబుతోంది మీకేం కావాలో! మీ డ్రెస్ చెబుతోంది మీరు ఇంతకాలంగా వేటిని త్యాగం చేశారో, ఎందుకు త్యజించారో? జీవితంలో సుఖాలు, ఆనందాలు వద్దనుకుని యోగం ఎంతకాలం చేసినా వాటిమీ: మనస్సు విరగదు. తీరనికోర్కెలు బుసకొడతాయి. తృప్తిగా జీవితసుఖాలు అనుభవిస్తూనే యోగం చేసుకోవచ్చు కదా"

0 0 0

యోగం చేస్తామని వచ్చేవారు తక్కువ. ఏవో సమస్యల పరిష్కారానికి వచ్చేవారు ఎక్కువ. పేర్లు ప్రధానం కాదు. సంఘటనలు, సందర్భాలు ముఖ్యం. ఆయనపేరు పి.వి. అనుకుందాం. ఆర్అండ్‌బి ఆడిటర్. తను గుండెజబ్బుతో వున్నట్లు, తనకు ఎప్పుడో హార్ట్‌అటాక్ వస్తుందని ఆయన నమ్మకం. గుండె చేత్తో పట్టుకుని వచ్చాడు. చేయి తీస్తే గుండె జారి క్రిందపడుతుందేమోనన్న భయం ఆయనకు. పది అడుగులు నడిస్తే ఆయాసం, రొప్పు. కాఫీ, టీ సిగరెట్ల అలవాటు బొత్తిగా లేదు. సద్గుణాలన్నీ తనవే అనుకుంటాడు. మజ్జిగ, పాలులాంటి ఆరోగ్యపానీయాలు సేవిస్తాడు. గట్టిగా మాట్లాడదు శక్తి ఖర్చయిపోతుందని. ఒక నెలరోజులు ట్రీట్‌మెంట్‌కు రావాలని చెప్పాను. ఆఫీసునుండి సరాసరి రిక్షాలో వచ్చేవాడు. ప్రేయర్ తర్వాత మాటల్లోపెట్టి ఆయన్ని లీలామహల్ సెంటర్ వరకు నడిపించేవాడిని.

ఒక నెల తర్వాత రిక్షాఎక్కడం మానేశాడు. ఇంటికి నడిచే వెళ్లేవాడు. ఆయాసం, రొప్పు అన్నీ పోయాయి. అంతా బాగున్న తర్వాత సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రికి వెళ్లాడు చెకప్ కోసం. అక్కడ స్పెషలిస్టులు పరీక్షలు జరిపి "అర్జెంటుగా నీ గుండెకు ఆపరేషన్ చేయాలి. రేపు వచ్చి జాయిన్ అవు" అన్నారు. ఆరోజు ఆఫీసులో సెలవుచీటి యిచ్చి, డబ్బు రెడీ చేసుకుని నా వద్దకు వచ్చాడు.

"రేపటినుండి ప్రేయర్‌కు రావడం లేదు" అన్నాడు.

"ఏమొచ్చింది. మీరు బాగానే వున్నారుగా?" అడిగాను.

"హార్ట్ ఆపరేషన్ చేయించుకోవాలట. డాక్టరు చెప్పారు. రేపు మద్రాసునుండి డా. చెరియన్ వస్తున్నారు. ఆయన చెక్‌చేసి ఆపరేట్ చేస్తారు. రేపు ఉదయం జాయిన్ అవుతాను"

కొంతమంది హార్ట్‌అటాక్ అంటే అదేదో గొప్పగా భావిస్తారు. గొప్పవాళ్లకే హార్ట్ అటాక్స్ వస్తాయని, తాము గొప్పవాళ్లం కనుక హార్ట్ అటాక్ వచ్చిందని గర్వపడతారు. ఈయన ఆ బాపతు.

"వెళ్లిరండి పి.వి.గారూ, రేపు సాయంత్రం మీరు ప్రేయర్‌కు వస్తారు" అన్నాను.

"ఉహు. ఒక నెల పడుతుంది రావటానికి" అన్నాడు.

మర్నాడు ఉదయం, హడావిడిగా వెళ్లి ఆస్పత్రిలో చేరాడు. డా. చెరియన్ వచ్చి చెక్ చేశాడు. అక్కడ వున్న సర్జన్స్‌ను చివాట్లు పెట్టాడు. "ఇతనికి ఏ జబ్బూ లేదు. ఎందుకు అడ్మిట్ చేసుకున్నారు. డిశ్చార్జ్ హిం ఇమ్మీడియెట్లీ" అన్నాడు.

సాయంత్రం మామూలుగా ప్రేయర్‌కు వచ్చి సిగ్గుపడ్డాడు. స్వీట్లు, పూలదండలు, పళ్లు తెచ్చాడు. జరిగింది చెప్పాడు.

"నెలరోజులుగా మాస్టరుగారు ట్రీట్ చేశారు కదా! నీకు నమ్మకం కలగలేదు. పోనీయండి, డెబ్బయివేలు ఆదా అయింది" అన్నాను.

0 0 0

మరొక రోజు ఆ పెద్దమనిషే దిగులుగా వచ్చాడు. ఏమిటంటే, వాళ్ల ఆఫీసులో ఒక గుమాస్తాకు అటాక్ వచ్చిందిట. ఇన్‌టెన్సివ్ కేర్‌లో పెట్టారు. చాలా మంచివాడట. ఆఫీసులో అంతా చందలు వసూలు చేశారుట ఆపరేషన్ ఖర్చులకు. నన్ను ప్రేయర్ ట్రీట్‌మెంట్ ఇమ్మని అర్థించాడు.

విభూతి యిచ్చి, వెంటనే ఆస్పతికి వెళ్లి అతనికి పెట్టమని పంపాను. తనే వెళ్లాడు. ఆ పేషెంటు బ్రహ్మచారి. ఏదో యోగం చేస్తాడట. ప్రమాదం అనుకున్న కేసు మర్నాటికి తగ్గింది. వారం రోజుల్లో అతన్ని డిశ్చార్జి చేశారు. ఆయన వచ్చి తాను చేస్తున్న యోగం మానుకుని నా మార్గంలోకి వస్తానని, ఉపదేశం యిమ్మని కోరాడు.

'నేను అలా ఇతర యోగం చేస్తున్నవారిని ఆకర్షించి నా యోగంలో పెట్టను. మీరు ఇంతకాలం చేస్తున్న యోగమే చేసుకోండి. నా మార్గంలోకి మీరు రానవసరం లేదు' అని పంపాను. అలా ఏదో ప్రయోజనం ఆశించి, ఆకర్షణకు గురై వచ్చేవారి వల్ల ఉపయోగం ఉండదు. అలాంటివారు నిలకడగా ఉండరు. ఈ పి.వి.గారు పుట్టపర్తి స్వామి వారి భక్తుడు. ఆయన ఇంటినిండా వారి కాలెండర్లు, ఫొటోలే ఉంటాయి. ఆయన నా యోగం చేస్తాడని, దీనిపైన విశ్వాసం ఉందని ఎలా చెప్పను. "అదే చేసుకోవయ్యా మహాశయా" అన్నాను.

యోగం పిన్నియర్‌గా చేసేవారికి ఇతర పూజలపైన ఇతర స్వాముల పైన మనసుండదు. ఇంట్లో పైతం పటాలు విగ్రహాలు తీసివేస్తారు. అంతవరకు పూజలు చేసినా, ఇప్పుడు అవి కొనసాగించాలనిపించదు. అన్నింటిని అవతల పెట్టి యోగం చేస్తారు. ఇతర స్వాముల ఫోటోలు పెట్టుకోరు. ఈయనకు పుట్టపర్తిబాబా అంటే చాలాయిష్టం. ఇంట్లో ఆ పూజలే చేస్తాడు. మా ఇంటికి వచ్చి పత్తిత్తు కబుర్లు చెబుతాడు. అలాంటివాడు నా యోగంలో ఉండలేరు. రెండు తెప్పలపై కాళ్లు పెట్టేవారు ఏటి పాలవుతారు. ఏ ఒక్కదానిపైన నిలబడలేరు. ఈ పి.వి. ఎప్పటికైనా జారుకునే మనిషే. నమ్మడానికి వీలులేని మనిషి.

0 0 0

మా యోగసమావేశాలప్పుడు పాలు సరఫరా చేసేవాడు కృష్ణమూర్తి రెడ్డి. అతనికి ఒక పాలడిపో వుంది. ఒకనాడు బజారునుండి వస్తుండగా, అపి దిగులుగా పలకరించాడు, 'ఏమిటి అలా ఉన్నావు?' అంటే చెప్పాడు. వాళ్ల నాన్నగారికి హార్ట్ అటాక్. ఆస్పత్రిలో వున్నాడట. నన్ను ట్రీట్‌మెంట్ అడిగాడు. అంతకుముందు తను ఆస్మాకు నా వద్ద ట్రీట్‌మెంట్ తీసుకున్నాడు. నమ్మకం వుంది. వెళ్లి తండ్రికి చెప్పాడుట. "గురువుగారు యోగంతో ట్రీట్ చేస్తారు వస్తావా?" అని. ఆయన వెంటనే ఆస్పత్రి నుండి చెప్పకుండా వచ్చేశాడు. పేషెంట్లు ఎట్లా పోయినా ఆస్పత్రివారు పట్టించుకోరు. రోగం తగ్గి ఇంటికిపోయినా, రోగం పెరిగి చచ్చిపోయినా వారు పట్టించుకోరు. డిశ్చార్జి కాకుండా పారిపోయినా పట్టించుకోలేదు. ఎప్పటికైనా ఎలా అయినా పోవలసినవారే గద అన్న తాత్వికత ప్రభుత్వ ఆస్పత్రి వారిది.

అతనికి ట్రీట్‌మెంట్ చేస్తుంటే, మైకంలోకి వెళ్లి కాసేపు మూలిగాడు, కాసేపు గురకపెట్టాడు. తర్వాత ముద్రలు వచ్చాయి. నమస్కార ముద్రలు వచ్చాయి. ఒక్కగంటలో అతను బాగైనాడు. మర్నాడు పల్లెకు వెళ్లిపోయి పొలం పనులు చూచుకోసాగాడు.

0 0 0

పివి. గారికి ఒక కొడుకున్నాడు. ఇంటర్ చదివాడు. అసలే తెలుగు మీడియం ఆపైన కామర్సు గ్రూపు, ఎకనమిక్స్‌లో తప్పుతున్నాడు. ఇంప్రూవ్‌మెంట్ పరీక్ష. స్పాట్ వాల్యుయేషన్‌లో పాస్‌మార్కులు వేయడానికి అయిదువేలు లంచం యివ్వడానికి సిద్ధమైనాడు. నా వద్దకు వచ్చాడు. డి.ఇ.ఓ. తరపు వ్యక్తికి డబ్బివ్వడానికి. అతను రాలేదు. మర్నాడు పరీక్ష. బిక్కమొహం పెట్టుకున్నాడు. నేను ఒక సూత్రం చెప్పాను. అది పాటించాడు. 50 మార్కులు వచ్చాయి. అయిదువేలు మిగిలింది. పాసైన రోజున వచ్చి "అంతా బాబా దయ" అన్నాడు.

"ఏ బాబా దయ మిత్రమా" అడిగాను.

"పుట్టపర్తి సాయిబాబా దయ. లేకపోతే మా అబ్బాయి పాసయ్యేవాడా" అన్నాడు.

"మహాశయా! ఇకపైన మీరు నా వద్దకు రావద్దు. నా యోగమూ చేయవద్దు. ఎంతచేసినా మీకు కృతజ్ఞత లేదు. పుట్టపర్తి బాబాపై అంత వల్లమాలిన భక్తి వుంటే అక్కడికే వెళ్లండి. నాదగ్గరకు రావద్దు" అని పంపాను.

సహాయం చేసింది ఒకరు. ఆ కృతజ్ఞత ఉంచకపోగా అది అంతా 'బాబాదయ' అనే వారిని ఎందుకు మన్నించాలి!

ఒక్క పుట్టపర్తి బాబా అని, సాయినాథుడని కాదు. ఎవరిపైన గానీ భక్తి ప్రపత్తులు ఉంచుకోవసిందే. ఎందరో మహాత్ములు. వారిని నా వద్దకు రమ్మని కోరను. ఇక్కడ యోగం చేస్తున్నట్లు నటిస్తూ నమ్మబలుకుతూ చాటుగా మాటుగా పుట్టపర్తి, షిర్డీ, బృందావనం మరొక చోటికి. మరొక చోటికి వెళ్లడం క్షమార్హం కాదు. చాటుగా మొక్కులు మొక్కి గుడులకు వెళ్లడం తప్పు. ఇది యోగానికి ద్రోహం చేయడం కాకపోయినా తనకు తాను ద్రోహం చేసుకోవడం. ఇష్టం లేనప్పుడు ఈ యోగంవైపు రానే రాకూడదు. వచ్చి ప్రయోజనం పొంది, నిర్లక్ష్యం చేయకూడదు.చాలామందిని గమని స్తుంటాను. వారి సమస్యలు తీరడానికి, రోగాలు తగ్గడానికి ఇక్కడకు వస్తారు. అవి తగ్గిన తర్వాత రావడం మానివేస్తారు. 'అపాత్రదానం ' అంటారు. అదే ఇది.

0 0 0

మరొక చిత్రమైన కేసు: ఆమె పేరు, ఊరు ముఖ్యం కాదు. కథాగమనం కోసం ఆమెను ఒక యూనివర్శిటీ లెక్చరర్ అనుకుందాం. యూనివర్శిటీ కాలేజీ లెక్చరర్గా అంటే జీతం బాగానే వస్తుంది! మొగుడు అడ్వొకేట్. సంపాదన లెక్కకు రాదు. చదువుకున్న వారు కనుక ప్రేమించి పెళ్లి చేసుకున్నారు. ఒక పాప ప్రేమఫలంగా. ఒక నర్సు వుంది. ఆవిడ ఒక డబ్బుగల పేషెంటును ప్రేమించింది. డబ్బునే ప్రేమించిందో వయస్సునే ప్రేమించిందో గానీ మొత్తానికి ఇద్దరు ప్రేమించుకున్నారు. కొన్నాళ్లు 'లవ్ లవ్' ఇంజక్షన్లు వాడారు. మొహం మొత్తింది. పెళ్లి చేసుకున్న పాపానికి విడాకులు తీసుకోవలసి వచ్చింది. అడ్వకేట్ను ఆశ్రయించింది. ఈయనగారు నర్సు - పేషెంట్ దంపతులకు విడాకులిప్పించి ఆ నర్సు ప్రేమలో తను బోర్లాపడ్డాడు. నర్సు వైట్ డ్రెస్లో నైటేంగేల్ లాగా అందంగా కనిపించిందట. ప్రేమ ఒలికించింది. చీరలో చీదరకలగవచ్చు. ఆ ఇద్దరు ఘోరాతిఘోరంగా ప్రేమించుకున్నారు. ఈ లాయరుగారు భార్యను చీదరించు కోసాగాడు. ఇంటికి రాడు. వచ్చినా పెళ్లాం అవసరాలు చూడడు. విడిపోవాలని ఆమె

కోరిక. మళ్లీ పెళ్లి చేసుకోవచ్చు కాని అడ్డుగా ఒక పాప ఉండిపోయింది. పిల్లమీద ప్రేమ తల్లికి సహజం! ఆ నర్సు. ఈ లెక్చరర్ బజారున పడ్డారు. సినిమాటిక్‌గా జుత్తూజుత్తూ పట్టుకుని కలియపడ్డారని పేపర్లలో వచ్చిన రిపోర్టు.

ఈ బిజీలో ఆ లెక్చరరమ్మ నా వద్దకు వచ్చింది. భర్త అంటే ప్రేమ. వదులుకోలేదు. ఆ నర్సును ఏమైనా చేయాలంటుంది. ఆవిడ ఎవరో నాకు తెలియదు. అయినా ఒకరికి మేలు చేయడం కోసం మరొకరికి కీడు చేయడం నాకు చేతకాని పని. వచ్చి ఏడ్చింది. ప్రేమ అంతఘాటుగా ఉంటుందని అప్పుడే తెలిసింది. ఒక నలభై రోజులు రోజూ సాయంత్రం ప్రేయర్ టైంకు రావాలన్నాను. ఒక రిక్షా మాట్లాడుకుంది .రోజూ రాసాగింది. యోగం బాగా అబ్బింది. చక్కని స్పందన వుంది. వైబ్రేషన్స్ నమస్కార ముద్రలు వచ్చాయి. గంటల కొలదీ ధ్యానంలో కూర్చునేది. పదిరోజులు అయ్యేసరికి ఆమెలో మార్పు కనిపించింది. మనిషి ఆరోగ్యం బాగైంది. గ్లామర్ పెరిగింది. ఆమెలో ఒక విధమైన ఆకర్షణ ఏర్పడ్డది. సదరు భర్తగారు ఏ అర్ధరాత్రో మైకంలో ఇంటికి వచ్చి ఈమెను చూచేవాడు. అతనికీ ఆకర్షణ పెరిగింది. నర్సుపట్ల మోజు తగ్గి నిజభార్య పట్ల ఆకర్షితుడైనాడు. ఎన్ని మాటలు చెప్పినా ఎంత పొగిడినా ఈమె చేరనిచ్చేది కాదు,"నేను నలభైరోజులు దీక్షలో వున్నాను" అని చెప్పి దూరంగా వుంచేది. ఆ జీవుడు నలభైరోజులు ఉగ్గబట్టుకున్నాడు. ఈమెపై రోజురోజుకు మరింత మోజుపెరగసాగింది. నలభై రోజులు పూర్తయ్యాయి. ఇద్దరు ఒకటైనారు. యోగం దూరంగా పారిపోయింది. మళ్లీ ఆ పతివ్రతామ తల్లి నా వద్దకు రాలేదు.

ఇలాంటి కేసులు నా వద్దకు చాలా వచ్చాయి. ఏ కారణంగానో భార్యాభర్తలు విడిపోతారు. యోగం వారిని కలుపుతుంది. ఆ ఆనందంలో యోగం మరచిపోతారు. ఫలితంగా ఇద్దరి మధ్య మళ్లీ పొరపొచ్చాలు వస్తాయి. మళ్లీ విడిపోతారు. రెండవసారి నా దగ్గరకు రాలేరు. యోగాన్ని ఆశ్రయించరు.

0 0 0

వరంగల్‌నుండి యోగమిత్రులు డిప్యూటీ డి.ఇ.ఓ. ఆర్.సత్యనారాయణ గారు ఒక కేసు పంపారు. వచ్చిన వ్యక్తి డెవెలప్‌మెంట్ ఆఫీసరు. భార్య కొడుకు వచ్చారు. ఆ కుర్రవానికి 14 సంవత్సరాలు. కానీ మూడు సంవత్సరాల పిల్లవానిలా ప్రవర్తిస్తాడు. అమ్మానాన్నల్ని కావిలించుకుని పడుకుంటాడు. ఎవరితో మాట్లాడడు. మందకొడిగా ఉంటాడు. ఒక్కరోజు ట్రీట్‌మెంట్‌తోనే ఆ కుర్రాడికి బాగైంది. మూడు రోజుల్లో మామూలైనాడు. అందరితో చనువుగా, సరదాగా మాట్లాడసాగాడు. సమావేశానికి వచ్చిన వారందరూ ఆశ్చర్య పడ్డారు. అసలు ఆ కుర్రవానికి బాగవుతుందని తల్లిదండ్రులు

అనుకోలేదు. ఒక్కగా నొక్క కొడుకు మెంటల్ అయితే ఏ తల్లిదండ్రులకు బాధగా ఉండదు. మూడురోజులు తర్వాత తిరిగివెళ్లే సమయానికి ఆ కుర్రాడు పూర్తి నార్మల్ అయినాడు. తర్వాత ఆర్. సత్యనారాయణగారు కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరం రాశాడు... ట్రీట్‌మెంట్ చేయించుకున్నవారు మ-ర-చి-పో-యి-న కారణంగా.

యోగంలో చేరిన ప్రతివారు తృప్తిగా, ఆనందంగా వుంటారు. అది కాస్త హద్దు మీరి ఇతరులకు యోగం గురించి చెప్పడం చాతకాక 'ప్రేయర్' చెప్పేస్తుంటారు. వాళ్ల దృష్టిలో ప్రేయర్ అంటే ఇదే కదా, చెబితే ఏమవుతుంది అన్న చిన్నచూపు. అది ఒక్కొక్కరిపై ఒకలాగ పనిచేస్తుంది. కొన్నిచోట్ల వికటిస్తుంది కూడ. కొందరికి విపరీత ఫలితాలు కలుగుతాయి. ప్రేయర్ సింపుల్ కావచ్చు. దాని వర్కు సింపుల్ కాదు! ఆ శక్తిని పరిమితం చేయలేనివారు, కంట్రోల్ చేయలేనివారు ఇతరులకు చెప్పకూడదు. ఇదివరలో ఎవరూ అలా చెప్పేవారు కాదు. లోలోపల చెప్పుకోవడమే. మంత్రంలోని మర్మం తెలిసిన వారెవరూ స్వతంత్రించరు.

ఎమ్మిగనూరు నుండి ఒక టీచర్ వచ్చింది ఎం.ఎ. బి.ఇడి., విద్యావతి. గుణవతి. ఆమెకు లోగడ ట్రీట్‌మెంట్ చేశాను. ఆరోగ్యం చక్కబడ్డది. చక్కగా యోగం చేసుకుంటోంది తనకు వీలైనంతవరకు. ఈమె అన్ని పూజలు వదలి యోగం చేయడం ఆమె తండ్రిగారిని ఆకర్షించింది. ఆయన పెద్దవయసు వాడు. స్వాతంత్ర్య సమరయోధుడు. తనకు యోగం చేయాలని ఆసక్తి కలిగింది. కూతురును అడిగాడు. ఈమె ప్రేయర్ చెప్పింది. ఆయన మెడిటేషన్ చేయగానే విపరీతంగా వైబ్రేషన్స్ వచ్చాయి. కంట్రోల్ చేసుకోలేక పోయాడు. మూడు నాలుగు గంటలు యోగావర్కు సాగితే ఎవరైనా డీలా పడిపోతారు. పాపం బసిరెడ్డిగారి పని అంతే అయింది. ఆమెకు ఏం చేయాలో తోచలేదు. నాకు ఉత్తరం రాసింది.

"అమ్మా భ్రమరాంబా! ఆయన ఎవరిదగ్గర ఉపదేశం తీసుకున్నారో నాకు తెలియదు. ఇంకెవరి దగ్గర ఇనీసియేషన్ తీసుకున్నా వారి విషయాలలో నేను చనువు తీసుకోను. అది తప్పు. ఆయన గురువుకే ఆయనను కంట్రోల్ చేసే శక్తి ఉంటుంది.అది ఆయన బాధ్యత. అంతా మాస్టరుగారే చూసుకుంటారు అని చాలామంది అంటుంటారు. మనం దారితప్పి, క్రమశిక్షణ లేకుండా చేసే పనులకు, అహంకారంతో చేసే పనులకు మాస్టరుగారిని బాధ్యుల్ని చేయడం క్షమార్హం కాదు. మీ నాన్నగారి విషయంలో నేనేం చేయలేను" అని రాసి విభూతి పంపాను. "దీనివల్ల ఆయనకు ఉపశమనం కలిగితే నా వద్దకు తీసుకురా. ఇనీసియేషన్ సక్రమంగా చేస్తాను. ఆయనను పరీక్షించిగాని మిగతా విషయాలు చెప్పను" అని రాశాను. ఆయనకు వెంటనే ఉపశమనం కలిగింది. నా వద్దకు

వచ్చాడు. ఆయన మనస్థితిని బట్టి యివ్వదగిన ప్రేయర్ యిచ్చాను. ఉపదేశి అర్హత, శక్తి గురువుకే ఎరుక.

చాలామంది చేసేది మాస్టరుగారి యోగమే అయినా, వారి గురువును బట్టి ఇంటెన్సిటీ వుంటుంది. గురువు యొక్క శక్తిని బట్టి యోగావర్కులో తేగా కనిపిస్తుంది. కొందరి దగ్గర ఇనీసియేషన్ తీసుకుంటే ఎన్ని సంవత్సరాలు యోగం చేసినా, ఎదుగుబొదుగు ఉండదు. కొందరివద్ద ఇనీసియేషన్ జరిగిన క్షణమే యోగావర్కు ప్రారంభమవుతుంది. ఫలితాలు అనూహ్యంగా ఉంటాయి. ఒక్కొక్క గురువు తన మార్గాన్ని తానే నిర్దేశించు కుంటాడు. స్వతంత్రంగా వ్యవహరిస్తాడు. అది అతని స్వీయప్రజ్ఞ. స్వతంత్రప్రతిపత్తి. దానిని అనుమానించడం, ప్రశ్నించడం అనవసరం. ఒకగురువు శక్తి వలయం విస్తరించిన కొలదీ శిష్యులసంఖ్య పెరుగుతుంది. అతని ప్రాభవం క్రింద యోగవిస్తృతి జరుగుతుంది. ఒకసారి ఆ వలయంలో ప్రవేశించినవారు బయటకు పోకూడదు. ఒకసారి బయటకు పోతే పునః ప్రవేశం లభించదు. అన్ని ద్వారాలు మూసుకుపోతాయి.

భ్రమరాంబ వచ్చి, తానే పొరపాటున నాన్నగారికి ప్రేయర్ చెప్పానని, అలా అవుతుందని తెలియక చేసిన తప్పుని క్షమాపణ కోరింది. ఆయన తర్వాత యోగం చక్కగా చేసుకుంటున్నారు.

0 0 0

తిరుపతిలో వున్న నాలుగైదు సంవత్సరాలలో పెద్దగా సాధించింది లేదు గానీ, నా వరకు యోగం అభివృద్ధికి సాధన బాగా సాగింది. కొందరు మంచిమిత్రులు యోగం ద్వారా పరిచయం అయినారు. అయినవారు దగ్గరలేరు అనుకోకుండా ఆప్తులు ఆత్మీయంగా దొరికిన వారు రైల్వే ఉద్యోగులైన రామకృష్ణ, పి.సుబ్బారావు. ఎస్.ఎం.రామకృష్ణ సహజ యోగి. పేరుకు తగినట్లే రామకృష్ణ పరమహంస రూపురేఖలు. గుణగణాలు, ఆధ్యాత్మిక చింతన పుష్కలంగా ఉన్నవాడు. పిల్లలు లేకపోవడం ఒక్కటే లోపం. చక్కని క్రమశిక్షణ, నియమనిష్టలు కలవాడు. మితభాషి. గుండెనిండా ప్రేమ నింపుకున్నవాడు. అప్పట్లో గురువురెడ్డిగారి తర్వాత ఎన్నదగిన శిష్యుడు.

రామకృష్ణ మాస్టరుగారి గురించి విని, చదివి ప్రత్యక్షంగా తెలుసుకుని, అనుభూతి చెందాలనే ఆశతో కుంభకోణం వెళ్లాడు. అక్కడ శార్వరి గురించి చెప్పి, వారు తిరుపతిలోనే ఉంటారు కలుసుకోండి అన్నారుట. తిరుపతిలో అడ్రసు తెలియక శ్రీనివాసాచారి దగ్గరకు వెళ్లాడు. ఆయన విమర్శలు భరించలేక పారిపోయి నా వద్దకు వచ్చాడు. అతని చూడగానే యోగార్హుడు అనిపించాడు. అతనిలోని ఆర్తి, జిజ్ఞాస అర్థమైంది. ఏ ప్రశ్నలు వేయకుండానే నాతో ప్రేయర్‌కు అనుమతించాను.

"వీలైనప్పుడల్లా వస్తుండండి. బలవంతం లేదు. మీకు నేను నచ్చాలి. నా యోగపద్ధతి నచ్చాలి. అప్పుడు ఇనీసియేషన్ చేస్తాను. అదీ మీకు మనస్ఫూర్తిగా యిష్టమైతే. ఎంత కాలమైనా, ఎన్ని రోజులైనా ప్రేయర్‌కు రావచ్చు. అడిగి తెలుసుకోవచ్చు' అని చెప్పాను. అలాగే వచ్చేవాడు.

ప్రతిమనిషికి కొన్ని కోరికలుంటాయి. కోరికలు లేని మనిషి ఉండడు. రామకృష్ణ కోరికలు ఏమిటో చెప్పలేదు. తాముగా చెప్పనివారిని అడిగీ ప్రయోజనం ఉండదు. తనకు యోగమే ప్రధానం అన్నాడు. ఆయనకు పిల్లలు లేక పోవడం ఒక తీరని కోరిక! అది తీరుతుందో లేదో నాకు తెలియదు. మాస్టరుగారి కరుణ కలిగితే పిల్లలు కలగవచ్చు. కర్మదోషం పరిహారం అయితే పిల్లలు కలుగుతారు. అందుకు యోగం చేస్తుండాలి. నేనుగా హామీ యివ్వలేను ట్రీట్‌మెంట్స్ చేయడం వరకే నా వంతు. రోగం నయం కావడం అన్నది వారి సుకృతం. వారి కర్మరాహిత్యంపై ఆధారపడి ఉంటుంది. రెండూ జతపడాలి. మాస్టరుగారి అనుగ్రహంతో, మార్గం ఏర్పడుతుంది. కర్మరాహిత్యం కొంతవరకు జరుగుతుంది. ఓర్పు వహిస్తే ఫలితంగా చాలావరకు అనుకూలంగా వారు కోరినట్లు కావచ్చు. ఒక్కొక్కసారి కాకపోవచ్చు. అది నా వైఫల్యం మాత్రంకాదు.

యోగం చేసినంత మాత్రాన మిరకిల్స్ జరగవు. మహాద్భుతాలు జరగాలని లేదు. ఎందుకు జరగాలి? కొందరు తమస్వార్థం కోసం అర్థిస్తే మిరకిల్ జరగాలా? ఆ మిరకిల్స్ వల్ల బహుళ ప్రయోజనం ఉండదు. విశ్వశ్రేయస్సు ఉండదు. ఒక వ్యక్తి కోరిక తీరుతుంది. నమ్మకం పెరుగుతుంది. అతని అహం చల్లబడుతుంది. అలా వ్యక్తిగత సమస్యల పరిష్కారానికి యోగశక్తిని ఉపయోగించడం నాకు ఇష్టం ఉండదు. వీరికి ఆ మేలు జరగకపోతే ఏమిటి? ప్రపంచానికి ఏంనష్టం? యోగం చేసినా, గురువును ఆశ్రయించినా అసంభవ కార్యాలు ఏవీ జరగవు. ఎవరికి ఎంత ప్రాప్తమో అంతే సమకూరుతుంది. యోగంవల్ల మరికొంత మేలు కలగవచ్చు. సామాన్యమైన సమస్యలు కష్టాలు వీరిని బాధించవు. ఇతరుల్ని చూచి అసూయపడితే, తనకు ప్రయోజనం కలగలేదని గురువుల్ని నిందిస్తే ఉన్నది కూడా పోతుంది. కష్టాలు కోరి తెచ్చుకున్నట్లు అవుతుంది.

0 0 ౦

ఒకరోజున ఒక పెద్దమనిషి సరాసరి లోపలకు వచ్చాడు. నేను ఏదో రాసుకుంటున్నాను. ఆయన అయ్యప్ప స్వామి దీక్షలో ఉన్నాడు. నల్లబట్టలు, మెడలో రుద్రాక్షమాల, ఉట్టిపడే అమాయకత్వం, ఆపాదమస్తకం దైన్యం మూర్తీభవించింది.

"నమస్కారం" అన్నాడు. అయ్యప్ప దీక్షలో ఉన్నవారు ఎవరూ నా వద్దకు రారు. వచ్చినా వారి నియమాలు పాటిస్తారు.

"కూర్చోండి స్వామీ!" అన్నాను. ఆ దీక్ష తీసుకున్నవారిని 'స్వామి' అనే పలకరించాలి. దీక్షాసమయంలో వారంతా అయ్యప్పస్వాముల క్రింద లెక్క.

"యోగం గురించి తెలుసుకుందామని వచ్చాను."

"యోగాన్ని గురించి ఏం తెలుసుకుంటారు? యోగం చేస్తే ఉపయోగం గానీ, తెలుసుకుని ప్రయోజనం లేదు. యోగం చేస్తే మనల్ని మనం తెలుసుకోవచ్చు. మీరు రివర్స్‌గా ఆలోచిస్తున్నారు. మీరేకాదు. చాలామంది అలా రివర్స్‌లో ఆలోచించి, యోగం దగ్గరికి రాలేకపోతున్నారు. యోగం గురించి ఎంత చదివినా, ఎంత తెలుసుకున్నా అది స్వల్పమే అవుతుంది. సాధన చేసినప్పుడు కలిగే అనుభూతి, అనుభవం ముందు, చదివినదంతా వ్యర్థం. సాధనవల్లనే సత్యం తెలుసుకోగలం. యోగశక్తి, స్ఫూర్తి తనంత తానుగా రివీల్ కావాలి." అని నాలుగుమాటలు చెప్పాను.

"నేను యోగానికి పనికొస్తానా?"

చాలామంది సాధారణంగా వేసే ప్రశ్న అది. దానికి సమాధానం నా దగ్గరలేదు. ఎవరికి వారే తమలో ఆ ప్రశ్నకు జవాబు వెతుక్కోవాలి.

"ఆ ప్రశ్న మీ హృదయానికి వేయండి. సమాధానం వస్తుంది. మీ గురించి మీకు తెలిసినంత, మీరు తెలుసుకున్నంత నాకెలా తెలుస్తుంది. యోగం ఆత్మపరిశీలన... మీ సంస్కారం ఆత్మను నిద్రలేపగలిగితే యోగానికి అర్హత పొందినట్లు. పనికి వస్తానా లేదా అనే గుంజాటన లేక యోగం చేయాలన్న తపన కలగడం ముఖ్యం" అన్నాను.

"మీ రూల్స్, రెగ్యులేషన్స్?"

"నేను రూల్సు పెట్టను. రెగ్యులేషన్స్ అన్నవి మీరు ఏర్పరచుకుని ఆచరించవలసినవి. మిమ్మల్ని మీరు చక్కదిద్దుకోడానికి ఉపకరించేవే రెగ్యులేషన్స్. నేను ఎవరికీ కండిషన్లు పెట్టను. మనస్సును అన్‌కండిషన్ చేయడమే నా యోగంలో తొలిప్రయోగం. ఇది ప్రాణాయామం కాదు. కాస్సేపు శ్వాస ఉగ్గబట్టి తర్వాత విడవడానికి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు శరీరానికి అవసరమైన వేగంలో సహజంగా జరుగుతుంటాయి. వాటిని క్రమబద్ధీకరించకూడదు. మేం ప్రాణాయామం చేయం. ఆసనాలు వేయం."

"మరి...ఇంకా యోగం ఎలా చేస్తారు?" అయన ప్రశ్నలో అనుమానం.

చాలామంది మీలాగే ఆలోచిస్తారు. అనుమానిస్తారు, ప్రశ్నిస్తారు. ప్రాణాయామం, ఆసనాలు మాత్రమే యోగం అనుకుంటారు. అవి రెండూ అసలు యోగం కాదని నా సిద్ధాంతం. మెడిటేషన్ ఒక్కటే యోగం. ధ్యానంలో ధ్యాని కావడం అంటే ప్రేయర్‌ఫుల్ కావడం నా యోగరహస్యం."

"మరీ బొత్తిగా నియమ నిబంధనలు లేకపోతే ఎలా?"

"లేవని కాదు, ఉన్నాయి. మీరు ఆచరించగలవాటిని మాత్రమే మీకు చెబుతాను. ఒకటి - ప్యూర్ వెజిటేరియన్ కావాలి. రెండు - డ్రింక్స్, అంటే మత్తు పానీయాలు నిషేధం. ఈ రెండు నియమాలు కనీసం పాటించలేనివారు నా యోగానికి పనికిరారు"

"నన్ను ఎప్పుడు రమ్మంటారు?"

"మీ దీక్ష పూర్తి చేయండి. ఈ మేకప్ మా యోగానికి సరిపడదు"

"ఏదో మనస్సు బాగులేక దీక్ష తీసుకున్నాను. ఇప్పుడే తీసివేయగలను" అన్నాడు.

"తప్పు మనస్సు అంత చంచలం కాకూడదు. ఒక నమ్మకంతో ఒక విశ్వాసంతో దీక్ష పూనారు. అది పూర్తి చేయలేకపోవడం మరొక బలహీనత. రేపు నావద్ద ఇలాగే మధ్యలో యోగం మాని మరొకదానికోసం వెళ్లరని నమ్మకం ఏమిటి? ఒక ప్రయోజనం ఆశించి, మంచిమనస్సుతో దీక్ష తీసుకున్నారు. మాల వేసుకున్నారు. అది పూర్తి చేయడం ధర్మం"

"నా పరిస్థితి అలాంటిది గురువుగారూ! ఎన్ని గుడులు తిరిగానో లెక్కలేదు. నాకు మిగిలింది మరణం ఒక్కటే"

"అసలు నా గురించి మీకు ఎవరు చెప్పారు?" అడిగాను.

"ఎవరూ చెప్పలేదు. ప్రొద్దున కొండపైకి వెళ్లాను. ఏదో నిరాశ. దైవదర్శనం చేసుకోవాలనిపించలేదు"

"ఏం? దేవునిపైన అలిగారా?"

"మనస్సు బాగా లేదు. స్వామివారి దర్శనం చేసుకోకుండానే వెనుతిరగాను. మనస్సు చాలా చికాకుగా వుంది. కపిలతీర్థం దగ్గరకు వచ్చేక కళ్లు విప్పాను. కాస్త ఆశ కలిగింది. ఇక్కడికి వచ్చేక అప్రయత్నంగా ఇటు తల తిప్పాను. బోర్డు కనిపించింది. 'మాస్టర్ యోగాశ్రమం.' ఆ పేరు చదివేసరికే నాలో ఏదో స్పందన కలిగింది. లీలామహల్ జంక్షన్‌లో దిగి చాయ్ తాగి ఇటు వచ్చాను. ఇక్కడకు వస్తుంటే నాకు ఏదో ఆనందం కలిగింది. నా సమస్యలు పరిష్కారం అవుతాయనిపించింది."

"మా యోగం చేసేవారు ఇతర పూజలు ఏవీ చేయరు. గుళ్లకు వెళ్లరు. చాలా అలవాట్లు మానుకోవాలి. అందుకు మీరు సిద్ధంగా వున్నారా?"

"మనశ్శాంతి లభిస్తే సముద్రంలో దూకమన్నా దూకుతాను."

"పొరపాటు. మనశ్శాంతి లభించాక సముద్రంలో దూకవలసిన అవసరం ఉండదు."

"నాకు జీవితంపైన వ్యామోహం లేదు. ఇది నా చివరి ప్రయత్నం. రేపుపై ఆశలేని జీవిని. మీరు నన్ను రక్షిస్తానంటే తప్ప మీ పాదాలు వదలను" గట్టిగా కాళ్లు పట్టుకున్నాడు.

ఆయనపేరు వెంకట రామరెడ్డిగారు. ఊరు గూడూరు. ఇంజనీరు. ఉద్యోగం పోయింది. ప్రస్తుతం చాలా కష్టాలలో క్లిష్ట పరిస్థితులలో ఉన్నాడు. ఆర్థికంగా చితికిపోయి వున్నాడు. సమాజంలో తలెత్తుకుని తిరగలేని పరిస్థితి.

"మీరు శబరిమలై యాత్రపూర్తి చేసుకుని రండి, చూద్దాం. వెంటనే ఏమీ చేయలేదని 'నిరాశ' పడినా తర్వాత రమ్మని చెప్పినందుకు 'ఆశ' కలిగింది. వాళ్లబ్బాయి గురించి చెప్పాడు. అతను ఇంటర్ చదివాడు. ఎంసెట్ తప్పాడు. చదువుపై శ్రద్ధ తగ్గి, సినిమాలపై ఆస్త పెరిగింది. సరిగా ఇంటికి రాడుట. స్నేహితులు, షికార్లు ఎక్కువైనాయి. ఆ కుర్రవానికి ఒక మార్గం చూపించమని అడిగాడు. అలాంటి కేసులు చాలా చేశాను. ఆ అబ్బాయిని తీసుకురమ్మని చెప్పాను.

మర్నాడే తీసుకువచ్చాడు. కుర్రాడికి వయస్సుకు మించిన శరీరసౌష్టవం. తండ్రిని మించిన అమాయకత్వం. ట్రీట్‌మెంట్ చేసి, ప్రేయర్ యిచ్చాను. పాటించదగిన నియమాలు చెప్పాను. ఆ రోజు నుండి శ్రీనివాసులు రెడ్డి సినిమాలు బంద్ చేశాడు. స్నేహితుల్ని కలవడం మానేశాడు. ఉదయం, సాయంత్రం గంటల తరబడి యోగం చేయసాగాడు. రకరకాల విన్యాసాలు, చలనాలు, వైబ్రేషన్స్ రాసాగాయి. చక్కని అనుభవాలు వచ్చాయి. యోగంపై గురి కుదిరింది. చదువుపై శ్రద్ధ కలిగింది. ఎంసెట్ రాశాడు. బెంగుళూరులో కెమికల్ టెక్నాలజీలో సీటు వచ్చింది.

## మా కుంభకోణ యాత్ర

. నా యోగమార్గం సంప్రదాయం కాదు. నా యోగం వారసత్వం కాదు. ఇది పరంపర. పూర్వపద్ధతుల్ని తు.చ. తప్పకుండా అనుసరించడం, అవే నమ్మకాలను పట్టుకు వేలాడడం సంప్రదాయం. ఒకరి తర్వాత మరొకరికి 'పీఠం' సంక్రమింపచేయడం వారసత్వం. ఇక్కడ ఆ రెండూ లేవు. ఎవరికివారు స్వతంత్రులు. యోగసూత్రం చెడదు. ఎవరికెవరూ గురువుకాదు. ఎవరికెవరూ శిష్యులు కారు. ఒక పద్ధతిని అనుసరిస్తాం. ఎవరి సాధనబట్టి, శక్తినిబట్టి వారు ఎదుగుతారు. మూలసూత్రం చెడదు. లక్ష్యం మారదు. కొత్తభావాలు వచ్చి కలుస్తుంటాయి. ఇది నదీప్రవాహం లాంటిది. ఇది పరంపర.

యోగంలో చేరిన 24సంవత్సరాలకు కుంభకోణం దర్శించే అవకాశం వచ్చింది. పరంపరలో ఇది అవసరం. శిష్యుడైనవాడు తరచు గురువును దర్శిస్తుండాలి. గురువులకు

గురువు, మూలగురువు జన్మస్థలిని ఒక్కసారైనా దర్శించాలి. మాస్టరుగారు మూలగురువు, వారి జన్మస్థలిని ఒక్కసారైనా దర్శించి రావాలి. అప్పుడే యోగం సంపూర్ణమవుతుంది. యోగపూర్ణతకు అవకాశం కలుగుతుంది. అద్వైతానికి ఆదిశంకరుల జన్మస్థలి కాలడి వంటిదే మాస్టర్ యోగమార్గీయులకు కుంభకోణం. మాస్టర్‌గారు తమ జీవితకాలంలో వేయిమంది శిష్యులను తయారుచేసింది కావేరీ తీరంలోనే. తాము విశ్వశక్తుల్ని గ్రహించింది, ఆత్మసాక్షాత్కారం పొందింది అక్కడనే. వారు పుట్టిన ఇల్లు, నివసించిన ఇల్లు, యోగాస్కూలు నడిపిన ఇల్లు అక్కడనే వున్నాయి. ఆ భగవద్ఘట్టాన్ని దర్శించే అవకాశం ఇంతకాలం కలగలేదు. 24 సంవత్సరాలకు మాస్టరుగారు నన్ను తన దగ్గరకు పిలుచుకున్నారన్న ఆత్మసంతృప్తి.

ఇప్పటికి నేను యోగంలో చేరి 24 సంవత్సరాలు పూర్తి కావస్తోంది. మద్రాసులో ఉన్నంతకాలం కుంభకోణం వెళ్లడం పడలేదు. నిత్యం మా గురువుగారి సన్నిధిలో సాధన. మా గురువుగారు మాస్టరుగారిని చూడలేదు. ఆయన ఎన్.ఆర్.బి.వి. గారి శిష్యులు. మాస్టరుగారు అక్కడ భౌతికంగా లేరు. సాధకులకు వారి ఆత్మరూపం దర్శనమిస్తుంది. అదొక తృప్తి. అదే ఆనందం. భౌతికంగా చూడలేదన్న అసంతృప్తి ఈ యోగంలో ఎవరికీ ఉండదనుకుంటాను. సంకల్ప మాత్రంచే దర్శనమిస్తారని అననుగానీ పూర్ణమనస్సుతో, అంకితభావంతో సాధన చేస్తున్నవారికి మాస్టర్ గారి దర్శనానుభూతి లభిస్తున్నది. పైగా కుంభకోణంలో యోగనిర్వహణ తృప్తిగా లేదని వినికిడి.

నేను గట్టిగా సంకల్పిస్తే ఎప్పుడో ఈ ప్రయాణం సాధ్యపడేది. లోపం నాది. నేను సాధనకిచ్చిన ప్రాముఖ్యత, కోర్సులు చేయించడంలో చూపే శ్రద్ధ, సత్సంగాలకు, క్షేత్ర దర్శనాలకు యివ్వలేదు. అది నా లోపం. ఆంధ్రనుండి యోగసాధకులు కుంభకోణం తరచు వెళ్లి వస్తుండేవారు. మా సెంటర్ సభ్యులు సంకల్పించారు కుంభకోణం వెళ్లాలని. నిమిషాలలో నిర్ణయం కార్యరూపం దాల్చింది. జనవరి 1 న అక్కడ ఉండాలి. డిసెంబరు 31న మధురై ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం. తిరుపతి రైల్వే ఉద్యోగులు, మా యోగమిత్రులు ఎస్.ఎం. రామకృష్ణ, పసుపులేటి సుబ్బారావుగారు ఆ భారం పైన వేసుకున్నారు. ఒక ప్రత్యేక బోగి ఏర్పాటు చేశారు. మొత్తం 75మందికి పైగా తిరుపతి నుండి ప్రయాణమైనాం. ముందుగా రామకృష్ణ ఉత్తరం రాశారు అక్కడ తెలిసినవారికి. అంతకుముందు కుంభకోణం వెళ్లి వచ్చినవారు కొందరు మాతో రాలేదు.

కుంభకోణం వెళుతున్నామన్న ఆనందంలో ఎవరికీ నిద్రరాలేదు. తిరువణ్ణామలై వచ్చేవరకు అందరు మేల్కొనేవున్నారు. విల్లుపురం స్టేషన్ రాగానే లేచారు. చిదంబరం దాటి కుంభకోణం రైలు చేరుతుందనగా అంతా రెడీ అయినారు. అందరిలో ఒక

పులకింత. ఒక గగుర్పు. శరీరంలో స్పందన. అవ్యక్తమైన ఆనందం. తెల్లవారుఝామున నాలుగు గంటలకు కుంభకోణం చేరాం.

రాత్రి బాగా వర్షం కురిసినట్లుంది. చలిచలిగా వుంది. ఇంకా సన్నపాటి జల్లు పడుతూనే ఉంది. ఆ చీకటిలో, వర్షంలో, కొత్తచోటుకు, అంతమంది వెళ్లడం కష్టం. రైల్వే రిటైర్మెంటు గదులు రెండు తీసుకున్నాం ఆడవారు కాస్త విశ్రమించడానికి. కాలకృత్యాలు తీర్చుకుని తెల్లవారిన తర్వాత వెళ్లాలనుకున్నాం. ఆరుగంటల ప్రేయర్‌కు అక్కడకు చేరాలి. నేనూ, రెడ్డిగారు, రామకృష్ణగారు స్టేషన్ బయటకు వెళ్లాం. ఆటోలు, చాలా చెప్పారు. అసలు డబీర్‌వీధి అంటే ఎవరికీ తెలియలేదు. తెలిసినవాడు రామకృష్ణ ఒక్కరే. నేను, రెడ్డిగారు స్టేషన్ దాటి సెంటర్ వరకు నడిచాం టీ తాగాలని. అక్కడ ఒక యువకుడు మా వద్దకు వచ్చి "శార్వరిగారంటే మీరేనా" అని అడిగాడు.

"ఇక్కడ నా పేరు తెలిసినవారు ఎవరుంటారు?"

"అవును" అన్నాను.

"నా పేరు మహేష్. మాస్టరుగారి మనవడిని. మీకోసమే వచ్చాను" అని తనను పరిచయం చేసుకున్నాడు. అతను మంజుల గారి కుమారుడు. అతని తండ్రిగారు వేణుగోపాల్ నాకు తెలుసు. అతనే ఆటోలు మాట్లాడి, టాక్సీలు మాట్లాడి అడ్రసు చెప్పి, అందరినీ పంపించాడు. నేను రెడ్డిగారు ఒక ఆటోలో వెళ్లాం. డబీర్‌వీధి ఈ చివరన ఆపాడు. రోడ్డు బురదగా వుంది. అదే వీధి కనుక, చీకట్లో దిక్కులు చూస్తూ నడక సాగించాం. ఒక ఎత్తు అరుగుల పెంకుటింటి దగ్గర నా కాళ్లు ఆగిపోయాయి. ఇంటిలోపల నుండి ఒక చిన్న దీపం కనిపించింది. రోడ్డుకు ఇటుగా శంకరమఠం. తర్వాత తెలిసింది ఆ ఇల్లే మాస్టరుగారు జన్మించిన ఇల్లు అని. దీపం వెలుగుతున్న ఆ గదిలోనే మాస్టరుగారు భూమిపైన అవతరించారుట. "మాస్టరుగారి జీవితకథ" రాయాలన్న సంకల్పం ఆ క్షణంలోనే కలిగింది. ఆనాటి బ్రహ్మముహూర్తంలో నా రాయని పుస్తకానికి శ్రీకారం చుట్టాను. మరికొంత దూరం నడిచాం. కూరగాయల లారీల హడావుడి. అదే మాస్టరుగారి ఇల్లు. దాని ఎదురుగా ఉన్నది యోగాస్కూలు. లోపల జనం చాలామంది నిద్రపోతున్నారు. లోపలకు వెళ్లి చూడగా కాలుపెట్టడానికి జాగా లేదు.

డిసెంబరు సమావేశాలకు వచ్చిన యోగమిత్రులు వారు. ఆ పూట వెళ్లిపోతారని మహేష్ చెప్పాడు. కుంజు అయ్యర్ యోగాస్కూలులో ఉన్నాడని తెలిసి, లోపలకు వెళ్లాను. నిద్రలేపాను. ప్రేయర్‌కాగానే అంతా వెళ్లిపోతారని, అప్పుడు మాబృందం అక్కడ ఉండవచ్చని చెప్పాడు. మహబూబ్‌నగర్‌నుండి బస్వరాజ్ బృందం వచ్చారు. అందరూ వెళ్లిపోయే హడావుడిలో ఉన్నారు.

మా సభ్యులంతా స్నానాల హడావిడిలో వున్నారు. కావేరిలో స్నానం చేద్దామనుకున్నారు కొందరు. వెళ్లి చూస్తే నీరు బురదగా వుంది. పైగా చికటి. అంతా వర్షపు నీరు. ఆ ప్రయత్నం విరమించి బావివద్దనే స్నానాలు చేయసాగారు. బస్వరాజ్ నా వెంట వచ్చాడు. కాఫీ తాగి వచ్చాం. స్నానం చేయాలి. ప్రేయర్‌కు టైం అవుతోంది. ఒక టవల్ తీసుకుని మాస్టరుగారింట్లో ప్రవేశించాం. బావివద్ద స్నానాలు చేస్తున్న చప్పుడు. పైన బాత్‌రూంలు ఉండకపోతాయా అనుకుని మెట్లెక్కి పైకి వెళ్లాను. ఎక్కడ గుమ్మం ఉందో తెలియదు. ఎటు వెళ్లాలో తెలియదు. అగ్గిపుల్ల వెలిగిస్తే ఆరిపోయింది. అంతలో నా ఎదురుగా వున్న తలుపు కిర్రుమని శబ్దం చేస్తూ తెరుచుకుంది జానపదసినిమాలో వలె, గుండె గుభేల్ మన్నది ఒక్క క్షణం. ధైర్యంగా ముందుగా నడిచాను. అక్కడ బాత్‌రూం గానీ, నీళ్లుగానీ లేవు. క్రింద వెనకాల బావి వుంది. అక్కడ స్నానం చేయవచ్చు అన్నాడు బస్వరాజ్. స్నానం చేసి, టవల్‌తో బయటపడ్డాను. ముందుగది తెరచి వుంది. లోపల లైటు వెలుగుతోంది. మాస్టరుగారి ఫోటో దగ్గర అగరువత్తులు వెలిగించి వున్నాయి. అక్కడ నిలిచిపోయాను. లోపల ఎవరూ లేరు. అక్కడ ప్రేయర్ చేయాలన్న సంకల్పం కలిగింది. యోగాస్కూలుకు వెళ్లి, కొత్తబట్టలు కట్టుకుని యామినీదేవికి చెప్పాను. "ఎదురిల్లు మాస్టరుగారిల్లు. అక్కడ ప్రేయర్ చేసుకుందాం రండి. ఇప్పటికే ప్రేయరులో కూర్చున్న వారిని లేపవద్దు. ఇంకా కూర్చోనివారు అక్కడకు రండి" అని.

అది మాస్టరుగారు ప్రేయరు చేసుకునే గది. అక్కడ స్థానికుడైన ఒక యువకుడు కూర్చుని ఉన్నాడు - శ్రీనివాస గాంధీ ఉన్నాడు. నేను, నా వెంట రెడ్డిగారు అక్కడకు చేరుకున్నాం. 'యత్రయోగీశ్వరః కృష్ణో తత్ర పార్థో నసంశయం' అన్నట్లు నేనెక్కడ వుంటే గురువురెడ్డి అక్కడ వుంటారు. మా ఇరువురి గురుశిష్య సంబంధానికి మరోముడి పడ్డది అక్కడ ఆ క్షణంలో. నేను, రెడ్డిగారు వెళ్లిన కాస్సేపటికి వసంతకుమార్, బుల్లెయ్య, సూర్యారావు, కృష్ణారావు, యామినీదేవి, వరలక్ష్మి, చిత్ర, రాజ్యలక్ష్మి వచ్చారు. అంతకుమించి ఆగదిలో పట్టరు. కొంతసేపు ప్రేయర్ జరిగింది. వసంతకుమార్‌లో మాస్టర్ చైతన్యం ప్రవేశించింది. తాను ట్రాన్స్‌లోకి వెళ్లిపోయాడు. అలా ఎవరైనా ట్రాన్స్‌లోకి వెళ్లినప్పుడు మాస్టర్ ప్రజ్ఞ వారిలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ప్రజ్ఞ పనిచేస్తుంది. అంటే మాస్టరుగారి ఆత్మశక్తి వారిలో ప్రవేశిస్తుంది. అది వసంతకు అలవాటు. తనలోంచి ఒక శబ్దం బయలుదేరి, ప్రతిధ్వనించింది. అది ఓంకారం కాదు. అలాంటిది. అక్కడ ప్రేయర్‌కు కూర్చున్న పదిపన్నెండుమంది సాలభంజికలే అయినారు. ఎవరికి భౌతికస్పృహ లేదు. మాస్టర్ చైతన్యం నిండిపోయింది ప్రతి ఒక్కరిలో. ఒక గంటసేపు సాగింది ధ్యానం. ఏవేవో లోకాలలో పయనించాం.

వసంతకుమార్ తేజస్వంతుడై ఆ కొత్తవానికి 'టచ్' యిచ్చి, మంత్రోపదేశం చేశాడు. తర్వాత బుల్లెయ్య రెడ్డిగార్ల చేత సాష్టాంగప్రణామం చేయించి, మరోసారి మాస్టర్‌గారి మంత్రం ఉపదేశించాడు. అలా ప్రతి ఒక్కరికి ఒక్కో సందేశం అందించినట్లయింది. ఒక గంటసేపు అక్కడి యోగాలయం పూర్వవైభవాన్ని సంతరించుకున్నది. శ్రీనివాస్‌గాంధీ ఆనందంతో పులకించాడు. ఇలాంటి అనుభవం అతను ఎరగడు. ఇలాంటి ప్రార్థన ఎన్నడూ చూడలేదుట. మేము ఫలాన అని చెప్పినప్పుడు సాష్టాంగ నమస్కారం చేసి తనకు 'ఉపదేశం' యిమ్మని కోరాడు. శ్రీనివాస్‌గాంధీ యామినీదేవిని, వసంతను గొప్పగా అభిమానించాడు. అతని దృష్టిలో వసంతకుమారే మాస్టరుగారు. అంత లోతుగా అనుభూతికి లోనైనాడు. ప్రేయర్ పూర్తిచేసుకుని బయటకు వచ్చేసరికి, ఎన్నో సంవత్సరాలు ఒకగుహలో తపస్సు చేసి బయట ప్రపంచంలో కాలుపెట్టినట్లు అనిపించింది.

వసంతకుమార్ తెల్లవారుఝామున కొందరు మిత్రులతో కలిసి కావేరీ స్నానం చేసి, భగవద్ఘట్టంలో మాస్టరుగారు అనుష్ఠానం చేసిన రావిచెట్టుక్రింద అరుగుపైన కొంతసేపు ధ్యానం చేసుకుని విచిత్రమైన అనుభూతులు పొంది వచ్చాడు. ఆ విషయం మాకు ఎవరికీ చెప్పలేదు. ప్రేయర్ పూర్తి చేసుకుని బయటకు వచ్చేసరికి మహేష్ హోటల్ వాడిని పిలిపించాడు. అందరికీ టిఫిన్లు భోజనాలు ఆర్డరు చేశాం. ఫలానా టైంకు హోటల్‌కు వస్తామని చెప్పి పంపాం. నేను లోపలకు వెళ్లేసరికి మహబూబ్‌నగర్ వారంతా వెళ్లడానికి సిద్ధంగా వున్నారు. నా కోసం ఎదురుచూస్తున్నారు. అందరూ వరసగా నమస్కారాలు ప్రారంభించారు.

"అందరం మాస్టర్‌గారి ఆశీస్సుల కోసం వచ్చినవాళ్లం. ఇక్కడ అందరం నమస్కరించవలసింది ఒక్క మాస్టర్ గారికే" అని చెప్పినా వినలేదు.

"మీరు మాకు గురువులు. మీకు నమస్కరించి, సెలవుతీసుకుంటాం" అని పట్టుబట్టారు. ఆ తతంగం ఒక అరగంటసేపు పట్టింది. యోగాస్కూలులో వున్న పెద్దలకు 'నేనెవరో' అప్పుడు తెలిసింది. నాకు ప్రత్యేకమైన మర్యాదలు చేయసాగారు.

"మీరు ఉన్నంతకాలం ఈ హాలు, గదులు మీవి. యధేచ్ఛగా ఉండండి. మీరు ఎలా ప్రేయర్స్ చేసుకున్నా మాకు సంతోషమే" అన్నారు.

అందరూ బయట హోటల్‌కు వెళ్లి అరగంటలో టిఫిన్ పూర్తి చేసుకుని ఎనిమిదిగంటలకు వస్తే ఒక కోర్సు చేసుకుందాం అని చెప్పాను. మా బృందం డిసిప్లిన్ అలాంటిది. ఖచ్చితంగా ప్రేయర్‌కు, కోర్సులకు హాజరవుతారు. ఎవరూ ఎవరికోసం ఆగరు. ఠంచన్‌గా ప్రేయరు చేస్తారు. కోర్సులు చేస్తుంటే ఎన్నిగంటలైనా కదలరు. వందమంది ఉన్నా, కోర్సులు చేస్తుంటే అంతా నిశ్శబ్దమే.

ఆ రోజు శనివారం. శని రెగ్యులేషన్స్ చేయించాను. రెండుగంటలసేపు పట్టింది. మధ్యాహ్నం పన్నెండుగంటలకు మాస్టరుగారింట్లో మేడపైన మెరిడియన్ స్పెషల్ చేద్దామని వసంత ప్లాన్ చేశారు. మహేష్, అతని భార్య ఉష మేడపైన చాపలు, పట్టాలు ఏర్పాటు చేశారు. అక్కడ ప్రిలిమినరీ కోర్సులన్నీ చేశాం. బుల్లెయ్య ట్రాన్స్‌లోకి వెళ్లి గొప్ప అనుభూతి చెందాడు. వసంతకుమార్ మాస్టరుగారు హాలీస్‌నుండి విశ్వశక్తిని తనలోకి తీసుకున్న ప్రదేశాన్ని గుర్తించి అక్కడ ప్రేయర్ చేశాడు. సుందరం, మదర్ చందుకోసం మహాప్రాణను తెచ్చింది అక్కడనే. మాస్టరుగారు చేసిన అనేక ప్రయోగాలు అక్కడే. వసంత ట్రాన్సులో అనేక యోగరహస్యాలు గ్రహించాడు.

అక్కడ ఎవరూ యోగం చేయకపోవడం మాకు ఆశ్చర్యం కలిగించింది. మహేష్ దంపతులు యోగం చేయరు. యోగాస్కూలులో వున్న నలుగురు పెద్దలు యోగా స్కూలు ట్రస్టీలుగా వ్యవహరించారు తప్ప, సాధకులనిపించలేదు. అక్కడికి వచ్చే సాధకులే భక్తిశ్రద్ధలు మెండుగా కలవారు. స్థానికులకు మాస్టరు యోగంపై విశ్వాసం తక్కువనిపించింది. మాస్టరుగారి ఇల్లు పూర్వవైభవాన్ని నిలుపుకోవాలంటే అక్కడివారిలోనూ యోగాసక్తి పూర్తిగా ఉండాలి. తర్వాత శ్రీనివాసగాంధీ వారెవరికీ ఉపదేశం జరగలేదని, అందువల్ల యోగం చేయడం లేదని చెప్పాను.

మహేష్, ఉష వారి అబ్బాయికి ట్రీట్‌మెంట్ కోసం తిరుపతి వచ్చి పదిరోజులున్నారు. అప్పుడు ఉష ఇనీసియేషన్ తీసుకుంది. మూడు రోజుల్లోనే ఆమెకు మంచి వర్కింగ్స్ వచ్చాయి. మహేష్‌కు ఇనీసియేషన్ ఇవ్వాలనిపించ లేదు. అప్పటికి మాస్టర్‌గారి అనుమతి లభించలేదు. మాస్టర్‌గారి కూతురి కొడుకు మహేష్ అయినా అప్పటికి యోగంలో ప్రవేశానికి మాస్టర్‌గారు అనుమతించలేదు. కుర్రవానికి మాత్రం వెంటనే ట్రీట్‌మెంట్ జరిగింది.

ఎవరికి యోగార్హత ఉందో నాకు తెలియదు. అదొక చిత్రమైన పద్ధతి. "మాస్టరుగారికి నమస్కారం చేసుకుని కూర్చోండి. అదే ప్రేయర్" అంటారు చాలామంది. నా పద్ధతి అది కాదు. ప్రేయర్‌లో అందరితో పాటు కూర్చుంటాను. మాస్టరుగారి నుండి అనుమతి వచ్చినట్లు నాకు అనిపిస్తుంది. అప్పుడు వారికి ప్రేయర్ చెప్పి, కూర్చోపెడతాను. కొంతసేపటికి ఒక శక్తి పై నుండి నాలో ప్రవేశించి వారిలోకి వెళుతుంది. అదొక చిత్రమైన పద్ధతి. అలా జరిగినప్పుడే అవతలి వారికి శరీరంలో యోగస్పందన కలుగుతుంది. కొత్తగా ఏదో శక్తి తమలోకి వచ్చినట్లు వారికి అనుభూతి కలగాలి. సహస్రారంలో ఒక వత్తిడి తెలుస్తుంది. శరీరంలో శక్తిపాతం జరుగుతుంది. ఇంత తతంగం ఇనీసియేషన్‌కు ఉన్నదా? నాకు తెలియదు. నా వద్ద జరిగే క్రియ అది. అలా జరిగితేనే నాకు తృప్తి. నా వద్ద ఇనీసియేషన్ తీసుకున్నవారికీ తృప్తి.

అడిగిన వెంటనే మాస్టరుగారి పర్మిషన్ రాదు. అలాంటప్పుడు వాయిదా వేయక తప్పదు. కొందరి విషయంలో నెలలు పట్టవచ్చు. అంతకాలం నిరీక్షించగలిగితేనే నావద్ద ఇనిసియేషన్. నా ట్రీట్‌మెంట్స్ కూడా అంతే. ఏదో మొక్కుబడిగా 'నమస్కారం చేసుకుపొండి' అనను. ట్రీట్‌మెంటుకు అవసరమైన ప్రాణశక్తిని నేను అందుకోగలగాలి. అది నాలోంచి అవతలి వ్యక్తిలోకి ప్రవహించాలి. అణువణువును పులకింపచేయాలి. ప్రతిఅణువును రెక్టిఫై చేయగలగాలి. అప్పుడే ట్రీట్‌మెంట్ సాగినట్లు.

మర్నాటికి తిరుపతి చేరుకున్నాం. ఆదివారం కావడాన ఆరోజు 'సన్ బోరింగ్స్' చేశాం. ఇప్పటికి అన్నికోర్సులు, రెగ్యులేషన్స్ పూర్తిచేశాం. ప్లానటరీ కోర్సులు ఆరు పూర్తి చేశాం. ఒక్క శుక్ర రెగ్యులేషన్స్ మాత్రం వదలిపెట్టి, దాని బదులు ఎక్లిప్స్ కోర్సు. మాస్టర్స్ ఎడ్జెస్టుమెంట్స్ చేశాం. పన్నెండు సంవత్సరాలలో మాస్టరుగారు చేయించిన కోర్సులు, రెగ్యులేషన్స్ అన్నీ తిరిగి మా కేంద్రంలో చేయడం జరిగింది. ప్రతి సమావేశానికి నూరు నుండి రెండు వందల మంది సాధకులు హాజరయ్యేవారు. నా వరకు తృప్తి. యోగంలో నేను చేయవలసిన పని ఒకటి పూర్తి అయింది - కుంభకోణం దర్శించి రావడంతో.

# 1994

## నరకానికి షికారుగా

**అప్పుడప్పుడూ మృత్యువు జ్ఞాపకం వస్తోంది.**

గుమ్మం వరకు వచ్చి తలుపు తట్టడం లేదు కానీ తానున్నానని హెచ్చరిస్తోంది. యాభై సంవత్సరాలు దాటితే పొద్దు వాలినట్లే. జీవితంలో వాడి, వేడి తగ్గుముఖం పడతాయి. 64 సంవత్సరాల జీవితం ఏం నేర్పింది? తెలియదు! ఏమి సాధించాను? అదీ తెలియడం లేదు! జీవితం వ్యర్థంగా సాగిందా? ఉహు ... లేదు. ఏదో జరిగింది. జీవించడం అంటే తృప్తిగా బ్రతకడమా? ప్రయోజనం వుంటేనే బ్రతకడమా! బ్రతుకులో నిత్యం జీవం తొణికిసలాడితేనే విలువ ఉంటుందేమో! జీవితం చైతన్యంతో నిండితే ఏదైనా విలువ కనిపిస్తుందేమో! అసలు బ్రతుకులో మధురక్షణాలు ఎన్ని? తృప్తిగా జీవించిన రోజులు ఎన్ని? వెనుతిరిగి చూస్తే ఖాళీ పుటలే ఎక్కువ కనిపిస్తున్నాయి. వ్యర్థంగా గడిచిన రోజులే ఎక్కువ. జీవితం కాన్వాసు పెద్దది. తళుక్కుమనే మెరుపులు తక్కువ. మెరుపుల మరకలు ఎక్కువ. ఏ మహాత్ములనో మినహాయిస్తే, సాదాసీదాగా బ్రతికేవారి జీవితచిత్రాలన్నీ ఇలా రంగులువెలసిపోయేవే ... అసంపూర్ణచిత్రాలే.

అప్పుడే "మృత్యువు తర్వాతి జీవితం" ఏమిటి? అన్న ఆలోచన వెంటాడగా, కలం సాగించాను. కలల్ని విశ్లేషించసాగాను. యోగభూమికలలో పయనించడం నేర్చుకున్నాను. మృత్యు రహస్యం తెలుసుకోవాలి. మృత్యువు తర్వాత జీవితం ఎలా ఉంటుందో గ్రహించాలి. భయపడి, పారిపోతే అయ్యేపని కాదు. యోగం చేసేవారికి స్వర్గాలు దక్కవు. నరకాలు స్వాగతించవు. వీరు ఆ రెండు లోకాలు తప్పించుకుని సత్యలోకాలకు చేరుకుంటారు.

నరకం ఎలా వుంటుందో చూడాలనిపించింది. 'సావిత్రి' రాస్తున్నప్పటి అనుభవం కొంత వుంది. అక్కడ పధ్నాలుగు లోకాల వర్ణన వుంది. అది అరవింద దర్శనం. నేను నరకాన్ని చవిచూడాలనుకున్నాను. మృత్యుద్వారం దాటిపోతే గదా స్వర్గమో, నరకమో! అది మామూలు మనుషులకు. నాకు భౌతికశరీరం వదలి, భూతశరీరం ధరించడం తెలుసు. యాస్ట్రల్‌బాడీతో నరకాన్ని చూచిరావాలనిపించింది. యాస్ట్రల్‌తో పోయివస్తే ఫిజికల్ బాడీకి నష్టం లేదుకదా! ఎవరికీ చెప్పకుండా 'డెత్‌కోర్సు' సాధన చేయసాగాను. ఒక నెలరోజులు చేశాను. అర్థరాత్రి 12 గంటలవేళ, మృత్యువంటే భయంలేనివాడు చేయవలసిన కోర్సు అది.

నా ప్రయోగంలో నా అనుభవం ఇది : ఒక యాక్సిడెంట్ జరిగింది. నేను చనిపోయాను. ఉహు ... చనిపోలేదు. నా శరీరం అక్కడే వుంది. నేను వేరై పైకి లేచాను. క్రింద వున్నది నేనే. పైకి లేచింది నేనే. నా ఈ కొత్తరూపం గమ్మత్తుగా వుంది. తేలిగ్గానూ వుంది. క్రింద యాక్సిడెంట్ జరిగిన చోట జనం గుమిగూడారు. కొందరు నన్ను బయటకు తీశారు. నేను కదలడం లేదు. మెదలడం లేదు. రక్తం ... నేను పైనుండి ఒక్కసారిగా ఒక చిన్ని ద్వారంలో దూరాను. లోపల పెద్దగుహ. చీకటిగా వుంది. మెట్లు దిగుతున్నాను. చీకటి మెట్లు ... శూన్యం మెట్లు అవి. కొంత శూన్యంలో మరికొంత అంధకారంలో. భయంలో పయనించాక, ఒక తలుపు తెరచుకున్నట్లయింది. నిజానికి అది తలుపు కాదు. దానికి ద్వారం లేదు. అలా పూరేకుల్లా విచ్చుకుని, నన్ను లోపలకు లాగి, రేకలు ముడుచుకున్నాయి. అక్కడ గుమ్మం కనిపించలేదు. అక్కడ రకరకాల వాళ్లు, నాలాంటి వాళ్లు హాయిగా, ఆనందంగా తుళ్లుతూ గెంతుతున్నారు. ఏవేవో తాగుతున్నారు. అడమగ జల్సాగా వున్నారు. వారు నా రాకను గుర్తించలేదు. నాకు ఆహ్వానం పలకలేదు. వారి ప్రపంచం వారిది. వారి ఆనందం వారిది. అలా నడుస్తూ, కాదు ... తేలి సాగుతూ పోయాను. ఎంతదూరం పోయినా అదే ప్రపంచం. అవే రూపాలు, ఆకారాలు. అక్కడ నుండి కదలాలని ఎవరికీ అనిపించదు. మరో ప్రపంచం వుందనీ అక్కడి వారికి తెలియదు. మన మనుషుల్లా ఆలోచించడం వారికి తెలియదు. సంవత్సరాలు, శతాబ్దాలు అలా వుండిపోగలరు అక్కడ. అసలు అక్కడ కాలంతో పనిలేదు. మనస్సు వుంటే కదా. హడావుడి పడడానికి! కష్టపడి శ్రమిస్తే కదా విశ్రాంతి కావాలనుకోడానికి! నిద్రించడానికి! అదొక చిత్రమైన ప్రపంచం.

మనస్సు పనిచేస్తున్న నేను అక్కడినుండి తప్పించుకోవాలనుకున్నాను. అనుకున్న మరుక్షణం మరో లోకంలోకి వెళ్లిపోయాను. క్షణంలో జరిగిన పని. అది భయంకరంగా వికారంగా వుంది. ఎవరికీ బట్టల్లేవు. అసలు బట్టల అవసరం లేదు. అంతా వికారమే, అసహ్యమే. నల్లగా వున్నా తెల్లగా వున్నా వారివి వికారపు చేష్టలు. పైశాచికపు అలవాట్లు. వారిని చూస్తే జుగుప్స కలిగింది. ఒళ్లు గగుర్పొడిచింది. వారితో కలిసి బ్రతకలేననిపించింది. అక్కడనుండి తప్పించుకున్నాను.

ఈలోకం నాకు తెలిసిన నరకలోకం. సలసలకాగే ద్రవాలు, మధుమాంసాలు, వినోదాలు, నృత్యాలు అహ! ఆఫ్రికా జాతుల జీవనంలా వుంది. వావి వరసలు లేవు. ఎడతెరిపిలేని శృంగారం. వికారంగా ఉన్నవారు, చాలా అందంగా ఉన్నవారు - అక్కడ సెక్సు తప్ప మరోపనిలేదు. కొన్ని వందల, వేల మైళ్ల పొడవు. సముద్రతీరంలా అది శృంగార రసార్ణవం. కేళీ విలాసాలు ... ఎంతకాలం అక్కడ వున్నా వదలిపెట్ట బుద్ధి కాదు.

నాకు అక్కడా ఉండాలనిపించలేదు. అక్కడివారు కోరితే కాదనరు. కోరికలు తీరనివారే వారంతా. కోరికలే లేనివారు అక్కడ ఉండలేరు. అలాంటివారిని వారు ఉండనీయరు. కోరికలు లేని నన్ను తరిమి వేశారు. అరక్షణంలో మరో లోకంలో ప్రవేశించాను.

అది స్వర్గం అనుకుంటా. చల్లని గాలులు, తోటలు, వెలుతురులు. ఎవరూ కనిపించలేదు. అక్కడివారు సంకల్పం చేస్తే కనిపిస్తారు. లేకుంటే కనిపించరు. బహుశా కామరూపులేమో! వారు కోరినరూపాలు ధరించగలరు. ఎంతదూరమైనా గాలిలో కొట్టుకుపోతున్నారు. ఆడ మగ కౌగిలింతలతోనే ప్రయాణం. అనుక్షణం చుంబనాలు, ఆలింగనాలు. అలుపుసొలుపు లేని ప్రేమశృంగారం. బావుంది. ఈలోకం హాయి. ఇది స్వర్గం. పోనీ అలాంటిది. కొంతకాలం అక్కడ గడిపాను. నాకు బోర్ కొట్టింది. మెదడు లేకుండా, ఆలోచన లేకుండా జీవించడం ఎలా? నేను మనిషిని. మనిషి మాత్రమే ఆలోచించగలడు. తను కోరినవి సాధించగలడు. తిరిగి ఈ లోకంలోకి వచ్చాను.

ప్రతి మనిషిలో ఈ కనిపించే భౌతిక శరీరం కాక మరో ఆరు శరీరాలు ఉంటాయి. ఈథరిక్ బాడీ మనలోపల ఉంటుంది. సాధనవల్ల, కొన్ని ఇతర కారణాల వల్ల ప్రేరణల వల్ల భౌతిక శరీరాన్ని వదలి అది బయటపడుతుంది. తర్వాత య్యాస్ట్రల్ బాడీ వుంటుంది. తర్వాత రూప, అరూప శరీరాలు, ఆత్మశరీరం. యోగసాధనతో మనం ఈ శరీరాలను పొందవచ్చు. భౌతికశరీరం వదలి మిగిలిన శరీరాలలో సంచరిస్తే అనేక రహస్యాలు తెలుసుకోగలం. నేను పైవాటిలో నాలుగు శరీరాలతో సంచరించడం సాధ్యపడింది కనుక నాలుగు లోకాలు తెలుసుకోగలిగాను. ఆత్మ శరీరం ధరించాక ఈ క్రింది వాటితో సంబంధం తెగిపోతుంది. ఈ అనుభవంతోనే 'మృత్యువు తర్వాతి జీవితం' రచన సాగింది.

0 0 0

యోగంలో నా అనుభవం ఒకటి వుంది. చెట్టుకు ఎన్నో మొగ్గలు తొడుగుతాయి. కానీ అన్నీ పూవులుగా వికసించవు. చాలా మొగ్గలు రాలిపోతాయి. వికసించే అవకాశం వున్నా కొందరు మొగ్గలుగానే రాలిపోతుంటారు. యోగంలో చేరిన మరుక్షణమే తమకెంతో తెలిసిపోయిందని, శక్తులు వచ్చాయనీ వేగిరపడి, తమ అభివృద్ధికి ఆటంకం కలిగించుకుంటున్నారు. పది సంవత్సరాలపాటు, స్థిమితంగా యోగం చేసేవారే తక్కువైనారు. అసలు పది సంవత్సరాలు నియమనిష్టలతో యోగం చేస్తే తప్ప తొలిమెట్టు ఎక్కినట్లు కాదు. 35 సంవత్సరాలు చేస్తే తప్ప 'యోగి' అనే పదానికి అర్హులు కాలేరు. అనేకమంది సమర్థత ఉండీ ఇలాగ గుంటపూలుగా రాలిపోతున్నారు. ప్రతిమొగ్గ వికసించడానికి కొంత వ్యవధి కావాలి. వికసిస్తే తప్ప పూవుగా మారదు, పరిమళాలు

వికసించి, పరిమళాలు పంచేవరకు చెట్టును అంటిపెట్టుకోవడం.

0 0 0

ఇచ్చినమాట నిలబెట్టుకున్నారు వెంకటరామరెడ్డిగారు. అయ్యప్ప దీక్ష పూర్తి చేసుకుని జనవరి చివరలో వచ్చారు. ఆ నెల రోజుల్లో తన కొడుకు శ్రీనివాసులులో వచ్చిన మార్పుకు ఆయన ఆశ్చర్యపోయారు. కుర్రవాడు ఎంతమారిపోయాడు! ఇదెలా సాధ్యమైంది? తాను వచ్చి ఉపదేశం తీసుకున్నాడు. తర్వాత ఇద్దరు ఆడపిల్లలు, భార్య. అంతా యోగం చేసుకోసాగారు. అలా కుటుంబంలో ప్రతిఒక్కరు ఆసక్తిగా యోగం చేయడం సకృత్తుగా జరిగే పని. ఆయనకు ఎంత నమ్మకమో వారి కుటుంబంలో ప్రతిఒక్కరికి అంతే విశ్వాసం! ఏడాదిలో ఆయనపై మోపబడిన కేసు కొట్టివేశారు. మళ్లీ ఉద్యోగం వచ్చింది. పిల్లల చదువులు బాగా సాగుతున్నాయి. అందుకే వారికి అచంచల విశ్వాసం.

0 0 0

గత అక్టోబరులో అనకాపల్లి నుండి ఒకామె ఉత్తరం రాశారు. విశాఖపట్టణంలో ఉన్న ఒక యోగా టీచర్ రికమెండ్ చేశారుట. ఆమె ఒక యోగాటీచర్ అయివుండి నా గురించి చెప్పడం ఏమిటి! నావద్దకు పొమ్మనడం ఎందుకు? తానే చేయవచ్చు గదా! ఇది నన్ను పరీక్షించడానికా? ఆ ఉత్తరం రాసిన ఆమె చాలాకాలంగా క్రియాయోగం చేస్తున్నదట. ఏ యోగం చేసినా యోగశక్తి ఒక్కటే గదా. విద్యుచ్ఛక్తి ఏదేశంలో అయినా ఒక్కలాగే వుంటుంది. ఉత్పత్తి విధానం వేరు కావచ్చు. వినిమయంలో భేదం ఉండదు.

ఆమెకు జవాబు రాశాను. "మీ విశాఖ యోగా టీచర్ చేతనే చేయించుకోండి, వారికి లేని శక్తి నాలోనూ ఉండదు" అని. ఆమె కాస్త మొండిమనిషిలా వుంది. పట్టువీడని విక్రమార్కిలా మళ్లీ రాసింది - తన శ్రీవారిని పంపిస్తున్నానని, పి.ఎ. తోడు వస్తున్నాడని. వారు ముందుగా కొండపైకి వెళ్లి స్వామివారి దర్శనం చేసుకుని వస్తారుట. అప్పుడు నేను సాయం చేయాలట. కొండపైన ఉన్న కోనేటిరాయుడే సాయం చేయవచ్చు! భగవంతుడు చేయలేని పని, ఒక మామూలు మనిషి నాలాంటి సామాన్యుడు - ఎంత యోగం చేసినా- ఎలా చేయగలడు? దేవుడు దేవుడే, మనిషి మనిషే.

గురువును అసమర్థునిగా భావించే శిష్యులంటే నాకు అసహ్యం. కోపం! అందుకే గురువుల్ని మార్చడం అంగీకరించను. ఒక గురువును వదలడం అంటే అతను అసమర్థుడు, అయోగ్యుడని నిర్ణయించడమే. మరొకర్ని ఎన్నిక చేసుకోవడం ఏమిటి?

నవంబరులో రావలసిన ఆ ఎం.డి.గారు, అంటే ఆ లేఖిని భర్తగారు రాలేదు. రావడం రాకపోవడం వారి ఇష్టం. చాలామంది ఉత్తరాలు రాస్తారు. అపాయింట్‌మెంట్ తీసుకుంటారు. రారు. అంటే రాలేరు. అలా చాలామంది నావద్దకు రారు. యోగ్యత, అర్హత ఉన్నవారు తప్ప రాలేరు. వచ్చినా నిలబడలేరు. అది నా గొప్పతనం కాదు. మాస్టరుగారు ఆ స్టేజిలో, స్క్రీన్ చేస్తారు. అయోగ్యుల్ని, అనర్హుల్ని యోగంలోకి రానీయరు. అది నానమ్మకం మాత్రమే. అందుకే నేనుగా ఎవరినీ ఆహ్వానించను. నేనుగా స్వాగతం చెప్పను. వచ్చినంతమాత్రాన పొంగిపోను. నిలబడాలి, సాధన చేయాలి. నమ్మకం ఏర్పడాలి. ఎన్ని మెట్లు ఎక్కాలి? ట్రీట్‌మెంట్స్‌కోసం వచ్చేవారికి సైతం నేను ఎలాంటి భరోసా ఇవ్వను. హామీలు ఇవ్వను. మాట అసలు ఇవ్వను. ఖచ్చితంగా తగ్గుతుందని చెప్పను. తగ్గించడానికి, మాట ఇవ్వడానికి నేను దేవుడినా? నాశక్తి ధారపోస్తే తగ్గుతుందా? వారి అదృష్టం! మాస్టరుగారి దయ, అనుగ్రహం. ఎన్నో జతపడాలి. అంచేత సాధకులతో నాకు ఒప్పందాలు లేవు. ఉండవు. పెట్టుకోను. ఎవరైనా స్వసంకల్పంతో, స్వీయప్రేరణతో రాదలిస్తే, వస్తే, రాగలిగితే అది కొంతవరకు మేలు. అది కొంతవరకు అర్హత. అలా రప్పించడంలోనే మాస్టరుగారి ఆమోదం వుంటుందని నా నమ్మకం. అంచేత నేనుగా ఆహ్వానించను. ప్రోత్సహించను. యోగంలో చేరాలని వచ్చేవారిని మాత్రం ప్రేమపూర్వకంగా స్వీకరిస్తాను. నా చేతనైన సహాయం చేస్తాను. కృతజ్ఞత లేకుండా వెళ్లిపోయేవారి గురించి అసలు పట్టించుకోను, విస్మరిస్తాను.

కొందరు పిచ్చిపిచ్చి ప్రశ్నలు వేసి వేధిస్తారు. తమ తెలివి, ప్రజ్ఞ నాపైన ప్రయోగిస్తారు. నన్ను పరీక్షకు పెడతారు. అలాంటివారిని అమాయకంగా వదలించు కోగలను. టోటల్‌గా సరెండర్ అయినవారికే నాద్వారా యోగంలో ప్రవేశం. విధేయత లేనివారు నావద్ద ఉండలేరు. అహంకారం, అభిజాత్యం, గర్వం ఉన్నవారిని నేను అసలు భరించలేను. నాతో స్నేహంగా ఉండమనండి ... తప్పులేదు. నన్ను డామినేట్ చేయాలనుకునేవారికి - అంతే సంగతులు.

జనవరిలో అనకాపల్లి నుండి ఆయనగారు సతీసమేతంగా వచ్చారు. కాదనుకుంటా. ఆ క్రియాయోగిని పతీసమేతంగా వచ్చారనడం భావ్యం. ఆమె ఆయనకు పి.ఎ. కాదు. సతీమణి. కొండ దిగివచ్చినట్టున్నారు. ఎవరైనా కొండదిగి రావలసిందే. మొక్కుబడులవారు నావద్దకు రారు. దేవుళ్లకు మొక్కుబడులు, బాకీ ఉన్నవారు ఆబాకీలు తీర్చుకుని రావలసి వుంటుంది. ఇక్కడ మొక్కుబడి వ్యవహారం ఉండదు. సాగిలపడి, సర్వ సమర్పణం చేసుకోవలసి ఉంటుంది. అరకొర మనస్సుతో వచ్చేవారు యోగంలో నిలబడరు. ఆ ఇల్లాలికి సంప్రదాయం తెలును, సమర్పణ చాతుర్యం ఉంది.

ఏదో యోగం చేస్తున్నది కనుక పద్ధతిగా నమస్కరించింది. ఆయన, ఆమెగారి భర్తగారే అయినా, నోటితో నమస్కారం అన్నాడే గానీ, చేతులు కదల్చ లేదు. నమస్కారాలు ముఖ్యం కాదు. అవి లాంఛనాలు. కొందరు అహంకారంతో ఎవరికీ తలవంచరు. నమస్కారం చేయడం అంటే ఎదుటి వ్యక్తికి లొంగిపోయినట్లు భావిస్తారు పాపం.

ఈ వచ్చిన ఎం.డి. గారికి అదేం లేదుగానీ, "ఈయనేం గురువు!" అనిపించి బోల్డు ఆశ్చర్యపడిపోయారు. ఆయన మనస్సులోని భావాలు మొహంపైకి అనువదించ బడ్డాయి. నేను అది గ్రహించి, మితంగానే పలకరించాను. శైలజ ఏదో చెప్పాలని ప్రయత్నించి, శ్రీవారికి ఆగ్రహం వస్తుందేమోనని అనుమానించింది. ఆయనే అడగాలి తన ఆత్మకథ తను చెప్పుకుంటేనే కొంతయినా నిజం తెలుస్తుంది.

"చెప్పండి ... ఏంకావాలి? నేనేం చేయగలనని మీ అభిప్రాయం?" అవతలి వ్యక్తిని క్రిందికి దించడమే నాకు యిష్టం. జారిపడకూడదు. ఒక్కొక్కమెట్టు దిగి రావాలి. నా లెవల్‌కు రావాలి. నాదగ్గరకు వచ్చేవారు మొదట తాము చాలా గొప్పవాళ్లమని, నేను మాత్రం సాదాసీదా అనీ అనుకుంటారు.

"ఈవిడ చెప్పింది మీగురించి" ఆయన ప్రారంభించారు.

"ఆమెకు మరెవరో చెప్పారు నాగురించి ... నిజానికి ఆమెకూ తెలియదు నేను ఎవరో, ఏమిటో ... అవునా" నా ప్రశ్న.

"మీ యోగం గురించి చెప్పండి" అడిగాడు.

"యోగం గురించి హరికథ చెప్పడం కుదరదు. నాయోగం పైన నమ్మకం ఉండాలంటే ముందు నాపైన నమ్మకం కుదరాలి. కాస్త వ్యవధిలో మీకు నచ్చేట్లు యోగం గురించి చెప్పలేను. నాకంత శక్తి లేదు. నాదృష్టిలో ధ్యానం చేస్తే యోగం తెలుస్తుంది. నేను పురాణం చెప్పను. మీరు నమ్మినా నమ్మకపోయినా నాకు ఒక్కటే."

"నాకు నమ్మకం కలిగితే యోగం చేస్తాను." అన్నాడు, ఎం.డి. కదా!

"మీకు నమ్మకం కలిగిన తర్వాత గానీ నేను యోగం చెప్పను"

"ఎలా అయితే"

"విత్తు ముందా, చెట్టు ముందా" అన్నట్లుంది కదూ. వస్తువులు అన్నీ ఉన్నాయి. వంట చేయటం రాదు. వంట చేయడం అర్థు. ఇక్కడ వంటచేయడం లాంటిదే యోగం చేయటం. అన్నీ మనమే అమర్చుకోవాలి. ఏ వస్తువులు రెడీమేడ్‌గా దొరకవు. చివరికి నాలెడ్జి సైతం సెకండ్‌హాండ్ కాకూడదు. అరువు ఎప్పటికీ బరువే. నాయోగంలో అరువు లేదు. కనుక బరువు ఉండదు. అంతా ఎవరికి వారు సొంతంగా సంపాదించుకోవలసిందే.

"నా అలవాట్లు?" అసలు ప్రశ్న చివరన అడిగాడు,

"నేను అడగలేదు. అనుమానించలేదు. ప్రశ్నించలేదు. మీరెందుకు ఉలిక్కి పడతారు?"

"అవి మానడం కష్టం"

"మార్చడం తేలిక. మీరుగా మానడం కష్టం కావచ్చు. మార్చవలసింది నేను కదా! మీకెందుకు అనుమానం. మిమ్మల్ని బలవంతంగా ఏవీ మానమని నేను చెప్పను. ఒక్క నెలరోజులు నేను చెప్పినట్లు చేయండి. నచ్చితే రండి, నచ్చకపోతే మీ పూర్వాశ్రమ స్వీకారం చేయవచ్చు."

ఆయన సరే నని గట్టిగా అనలేదుకానీ, లోపల అనుకున్నట్లు నాకు వినిపించింది.

"రావుగారూ, సాయంత్రం వరకు టైం ఇస్తున్నాను. ఇష్టమైతే సాయంత్రం ఆరుగంటలకు రండి. లేకుంటే ఆరుగంటలకు తిరుమల ఎక్స్‌ప్రెస్ ఉంటుంది హాయిగా వెళ్లిపొండి"

ఆరోజు మాతో భోజనం చేశారు. యోగం చేసినా, చేయకపోయినా మా ఇంటికి వచ్చినవారికి అతిథిమర్యాదలు జరుగుతాయి. నాతో కలిసి భోజనం చేస్తారు. మాకు బంధువులు, స్నేహితులు, అతిథులు, యోగసాధకులు అంతా సమానమే.

ఆయనకు నేను యోగం చేస్తానన్న నమ్మకం కలగడం లేదు. నన్ను గురువుగా అంగీకరించలేదు. నాకు కావలసిందీ అదే. అలా విప్లవాత్మక భావాలు కలవారే కావాలి నాకు. గొర్రెదాటు మనుషులు కాదు. మనస్సు ఎదురుతిరిగితేనే మనిషికి తన శక్తిపైన నమ్మకం కలుగుతుంది. యోగంపైన గురి కుదురుతుంది. తనను తాను దిద్దుకోవడానికి సిద్ధపడతాడు. ఈ పద్ధతి కష్టం కనుక ఎవరూ అనుసరించరు. మనస్సు మారడం కష్టం కాదు. ఒక్కసారి ప్రేయర్‌లో కూర్చుంటే యోగం తన పని తాను చేసుకుపోతుంది. యోగశక్తి వలయం నుండి ఎవరూ అంత సులువుగా బయటపడలేరు, పారిపోలేరు.

రావుగారికి ప్రేయర్ చెప్పలేదు. ఊరికే కూర్చున్నాడు. కళ్లు మూసుకుని కూర్చుంటే చాలు ... ఒక గంట సేపు శరీరం మరచిపోయారు. కళ్లు తెరిచేసరికి ఆయన కళ్లలో ఒక కొత్తవెలుగు కనిపించింది.

"నేను రెడీ గురువుగారూ" అన్నాడు ఆనందంగా, తృప్తిగా.

నేను కోరేది ఆ మార్పు. నాకు కావలసింది అలాంటి సంసిద్ధత.

"అయితే ఒక కండిషన్. 40 రోజులపాటు మీ అలవాట్లు అన్నీ ప్రక్కనపెట్టాలి. నేను చెప్పినట్లు చేయాలి."

"40 రోజుల తర్వాత నా ప్రపంచంలోకి వెళ్లడానికి పర్మిషన్ యిస్తారా?"

"వెళ్లాలనిపిస్తే నా అభ్యంతరం ఉండదు. ఎటుగూడి ఆతర్వాత నాదగ్గరకు రారు కనుక నా పర్మిషన్ అవసరం లేదు"

శైలజతో అన్నాను "నాకు నీ సహాయం కావాలి. నీ సహకారం లేనిది నేనేం చేయలేను. నీవు మడికట్టుకుని దూరంగా కూర్చుంటే లాభం లేదు. మీవారు మారాలంటే మీరూ మారాలి. మీరూ దీక్ష వహించాలి."

"ఏం చేయమంటారు?"

"ఆయనకోసం మీరూ యోగం చేయాలి. తప్పదు. ఆయనగారు అటుఇటుగా ఊగిసలాడుతున్నాడు. మీరు ఆయినతో కలిసి యోగం చేయండి. తనకు మేలు జరుగుతుంది."

"నేనే అడగాలనుకున్నాను మాస్టారూ! విశాఖపట్టణంలోని మా యోగాటీచర్ మీవద్దకు వెళ్లి యోగం నేర్చుకోమని చెప్పారు."

"ఆమెకు నాగురించి తెలుసా?"

"ఆ ... మిమ్మల్ని చూచారట. ఆమెకూ ఇక్కడికి రావాలని ఉంది. మేం క్రియాయోగం చేస్తాం. కానీ డెవలప్‌మెంట్ లేదు."

మొత్తంపైన శైలజ యోగానికి రెడీ అయింది.

"మీరు లోగడ చేసినవన్నీ మరచిపొండి. నేను కొత్తగా ఏమీ చెప్పను. పాతవాటిని వదలివేస్తే చాలును. నాయోగం మీరు చేయగలరు."

ఇద్దరికీ ఇనీషియేషన్ చేశాను. 40 రోజులలో రావుగారు పదికిలోల బరువు పెరిగాడు. ఆరోగ్యం చక్కబడ్డది. అలవాట్లు పోయాయి. తన తప్పులు తెలుసుకుని మంచిమార్గానికి వచ్చారు. ప్రతిమనిషికీ సమస్య లుంటాయి. కమిట్‌మెంట్స్ వుంటాయి. అంతమాత్రాన వ్యసనాలకి బానిసలు కాకూడదు. అన్ని సమస్యలు ఒక్కరోజులో పరిష్కారం కావు. అవి ఒక్కరోజున వచ్చినవి కావు. కాలం సమస్యల్ని పరిష్కరిస్తుంది. రావుగారు పట్టుదలతో మారారు. ఆయనలో మార్పు రావాలని శైలజ ఆశించింది. అందుకోసం తను కొంత త్యాగం చేసింది. ఫలితం సాధించింది. అలా భర్త కోసం, భర్త మేలు కోసం తపస్సు చేసినవారు ఎందరో వున్నారు. ప్రతివ్యక్తి తనకోసం, తనవారికోసం యోగం చేయవచ్చు. ఫలితం తప్పక ఉంటుంది.

0 0 0

మా మూడవ అబ్బాయి రమణ పిహెచ్.డి. కాగానే ఇంటర్నేషనల్ సైన్స్ కాంగ్రెస్ సమావేశాలకు ఇండియా నుండి ప్రతినిధిగా అమెరికా వెళ్లాడు. డాక్టరేట్ పూర్తయింది కనుక అక్కడే ఉద్యోగం ప్రయత్నించాలనుకున్నాడు. వెంటనే సైంటిస్టుగా

ఉద్యోగం వచ్చింది. అతను నెమ్మదిగా అక్కడ సెటిల్ కావాలని ఆలోచన. వెళ్లి ఏడాది అయింది. పిహెచ్.డి. వైవా కోసం ఇండియా వచ్చాడు. రెండవ అబ్బాయి శ్యాంసుందర్ సౌదీ వెళ్లాడు. దోహాలో ఉద్యోగం. రెండు సంవత్సరాల కాంట్రాక్టు. అతనికా ఉద్యోగం నచ్చలేదు. తిరిగి రావడానికి వెంటనే వీలుపడలేదు. భార్యా పిల్లలు తిరుపతి వచ్చి మాతో ఉండసాగారు. నాకు బరువులు తగ్గినా బాధ్యతలు పెరిగాయి. అనవసరంగా పిల్లల కుటుంబాల గురించి ఆలోచన. చేయగలిగింది, సహాయపడగలిగింది లేకపోయినా చికాకు, వేదన తప్పలేదు. హైదరాబాద్‌లో వసంతకుమార్ ప్రెస్ వదలి ఉద్యోగాన్వేషణలో ఉన్నాడు. అందరూ పెద్ద చదువులే చదివారు. ఎవరికీ స్థిమితం లేదు. తృప్తి కలిగించే సంపాదన లేదు. వారికోసం మా దంపతులకు ఆరాటం. ఇంకా నయం మా బ్రతుకులు వారిపైన ఆధారపడి లేవు. మాస్టరుగారు చల్లగా చూస్తారనే ఒక నమ్మకం, ఆశ మమ్మల్ని వదలిపోవడం లేదు. అదొక్కటే చీకటిలో చిరువెలుగు.

యోగంలో చేరినంతమాత్రాన ఎవరూ మహాయోగులైపోరు. చాలామంది అలాంటి భ్రమల్లోనే ఉన్నట్లు తోస్తుంది. పూర్వంనుండికూడా సాధకుల అభిప్రాయం అదే. "మాస్టరుగారికి నమస్కారం అనుకుని కళ్లు మూసుకుని కూర్చుని, లోపల జరిగేదాన్ని గమనించడమే!" ఎంత సింపుల్ అనిపిస్తుంది. అదే చేస్తూ వచ్చారు. నాలాంటి మొండివాళ్లు కోర్సులు చేస్తున్నారు. అదికూడా కాదు యోగం అంటే. ఆ కోర్సులలో అనేక రహస్యాలు ఉన్నాయి. యోగం చేస్తున్నప్పుడు కలిగే అనుభవాలు, అభివృద్ధికి సూచనలు ఉన్నాయి. ఒక్కొక్క పదం ఒక అనుభవానికి, అభివృద్ధికి మైలురాయి. కోర్సులలోని పదాలన్నీ మనం అభివృద్ధిలో అనుభవించవలసిన స్థాయిలు, చేరవలసిన భూమికలు. వాటిని ఎవరూ అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం లేదు.

ఈ యోగం నడుస్తూ నడుస్తూ ఎక్కడో గాడి తప్పింది. బండి నడుస్తూ ఉండగానే రిపేరు చేయాలన్నారు. అసలు ఎక్కడ క్రాక్ యిచ్చిందో, ఎక్కడ లోపం జరిగిందో తెలుసుకుంటే గదా రిపేరు చేసుకోవడం! అందుకు ఎవరూ ప్రయత్నించలేదు. చెక్ చేసింది ఎక్కడ! అందువల్లనే ఈ బండి స్లోగా, గతుకుల్లో పడి నడుస్తోంది. శరవేగంతో పోవలసిన బండి ఇంత నెమ్మదిగా పోవడానికి కారణం ఏమిటి. లోపం ఎక్కడ వుంది? ట్రాంబండిలా నడుస్తున్న దీనిలోకి ఎక్కేవారు ఎక్కుతున్నారు, దిగేవారు దిగుతున్నారు. ఇది డ్రయివర్‌లేని బండి. సుశిక్షితుడైన చోదకుడు లేకుండా ప్రయాణం ఎంత ప్రమాదం!

అప్పట్లో మాస్టరుగారు కోర్సులు కొందరికే ఇచ్చారు. మాస్టరుగారి పేరు కనీసం అయిదు నెలలు ప్రాక్టీసు చేయాలి. తర్వాత దానిని రెండేళ్లు పొడిగించారు. మనుషుల్నిబట్టి వారి సిన్సిరిటీనిబట్టి రూల్సు మారుతుండేవి. అందరికీ ఒకే రూలు కాదు.

రెండు సంవత్సరాలు ప్రిపరేటరీ కోర్సులు. తర్వాత మిగతా కోర్సులు. అన్నీ చేయడానికి పది సంవత్సరాలు పట్టేది. అంత డిసిప్లిన్‌గా ఇప్పుడు చేస్తున్నవారు లేరు. ఎప్పుడో పదినిమిషాలు కూర్చుని లేచిపోతూ యోగులమని చెప్పుకుంటారు.

0 0 0

మనుషుల్లో శిక్షణారాహిత్యానికి ఒక ఉదాహరణ చెబుతాను. ఒకాయన వచ్చాడు. అడ్వొకేట్. ఉదయం నేను మేడపైన ప్రేయర్ చేసుకుంటున్నాను. తను వచ్చి బయట కుర్చీలో కూర్చున్నాడు. నేను ప్రేయర్ పూర్తి చేసుకుని బయట ఏదో పనిచేసుకుంటున్నాను. అతను నన్ను గమనించి పలకరించలేదు ... పరిచయం చేసుకోలేదు.

"ఎవరు మీరు, ఎవరికోసం వచ్చారు?" అని అడిగాను తర్వాత.

"యోగం చేయాలనుకుంటున్నాను. ఇనీషియేషన్ కావాలి" అదీ ఆయన సమాధానం. నేను నిలబడే వున్నాను. ఆయన కుర్చీలోంచి లేవలేదు. ఎంత పొగరు! అహం! 'నమస్కారం' అనే సంస్కారం కూడా లేదు మనిషికి.

"సాయంత్రం రండి" అన్నాను.

"సాయంత్రం వరకు ఉండటం కుదరదు. మధ్యాహ్నం భోజనానికి వెళ్లిపోవాలి.'

"మీ ఇష్టం. ఎప్పుడంటే అప్పుడు ఇనీసియేషన్ యివ్వను. పోనీ మరోసారి రండి" అన్నాను.

"రాత్రికి నాభార్య ఒంటరిగా ఉంటుంది. చీకటిపడేలోగా వెళ్లాలి"

ప్రేయర్ అయిన తర్వాత వెళ్లినా రాత్రి పన్నెండు లోపు వెళ్లగలడు. తనకు కొత్తగా పెళ్లయిందట. భార్యపైన చచ్చే అనుమానం.

లోపల హాలులో నుండి ప్రేయర్ పుస్తకం తెచ్చి చదువుకోసాగాడు. "మీరు ఇనీసియేషన్ చేసినా చెప్పేది ఇదే కదా ఈ పుస్తకం ఇవ్వండి. తీసుకుపోతాను. వేరే ఇనీసియేషన్ ఎందుకు దండగ" అన్నాడు.

నాకు తిక్క తలకెక్కింది. "దయచేసి ఆ పుస్తకం ఎక్కడ తీశారో అక్కడ పెట్టండి ముందు" తీవ్రంగా అన్నాను.

లోపలపెట్టి వచ్చాడు. "ప్లీజ్ గెటవుట్. ఇంక ఎప్పుడూ నా వద్దకు రాకండి. ఇనీసియేషన్ ఇవ్వను కాక ఇవ్వను. మీకు ఈ పుస్తకం యివ్వను" అని పంపివేశాను.

అలా వుంటారు మనుషులు. ఎంత చులకన! మనుషులపై గౌరవం ఉండదు. మర్యాద తెలియదు.

0 0 0

ట్రీట్‌మెంట్ కేసుల్లో పరిశీలన చిత్రంగా వుంటుంది. వచ్చిన ప్రతి కేసు చేయలేను. స్పష్టంగా చెబితే వచ్చినవారికి క్షోభ కలిగించినట్లవుతుంది. అనేక సందర్భాలలో

'ప్రమాదం' సూచించినా, అవతలివారు పట్టుపడతారు. దయచూపించవలసి వస్తుంది. ఆ దయను, సానుభూతిని అవతలివారు అపార్థం చేసుకుని, మన అసమర్థతగా చిత్రీకరిస్తుంటారు. కేన్సర్ లాంటి కేసులు నయం కావు. తాత్కాలిక ఉపశమనం కలగవచ్చు. తమకు మేలు జరగనప్పుడు కొందరు అపకారం చేయడానికి సిద్ధపడతారు.

ఒకసారి బళ్లారి వెళ్లినప్పుడు అనంతపురం సాధకుడు ఒకరు ఒకకేసు ప్రస్తావించాడు. కారు మాట్లాడి తాడిపత్రి తీసుకువెడతానన్నాడు. నాకు ఫీలింగ్ అనుకూలంగా లేదు. ప్రేయర్‌లో కూర్చుని విభూతిపొట్లం చేతికి తీసుకున్నాను. అరగంటలో నాశరీరం బిగుసుకుపోయింది. చలనం లేదు. చేతిలోని విభూతిపొట్లం నేలజారిపోయింది. లోదృష్టికి ఒక శవం కనిపించింది. ఫలితం ఇది అని తెలిసింది. వెళ్లి ట్రీట్‌చేయడం అనవసరం. కష్టపడి అంతదూరం వెళ్లినా అతను బ్రతకడు.

"విభూతి తీసుకువెళ్లి పెట్టండి. పదిరోజులు గడిస్తే అతను బ్రతికినట్లే. అప్పుడు వస్తాను. ఈ లోపల నేను రావలసిన పనిలేదు" అని చెప్పాను.

తొమ్మిది రోజుల్లో అతని పరిస్థితి చాలా మెరుగైంది. లేచి తిరిగాడు. మర్నాడు తిరుపతి రావాలని ఏర్పాట్లు చేసుకున్నాడు. పదవనాటి రాత్రి సడెన్‌గా చనిపోయాడు. యోగం రక్షిస్తుంది అనుకుంటారు. కాలంతీరినవారిని యోగం రక్షించదు. ఏ గురువు, ఏ దేవుడు రక్షించలేడు.

0 0 0

చాలామంది అడుగుతుంటారు "మీరు నాస్తికులా" అని.

"ఆస్తులేమీ లేనివాడిని కదా! నాస్తికుడినే"

"దేవునిపూజ చేయరా?"

"ఇదివరకు చేశాను. ఇప్పుడు చేయను"

"దేవుడంటే నమ్మకం లేకనా?"

"కాదు, కొంతకాలం నమ్మినదానిపై ఇప్పుడు నమ్మకం లేక."

"నాస్తికులైతే ధ్యానం చేయడం ఎలా?"

"దేవుళ్లను నమ్మను కనుకనే యోగం చేస్తాను. ధ్యానం చేయడానికి, యోగం చేయడానికి దేవుళ్లతో పనిలేదు. వారు యోగానికి అవరోధం కూడా"

ఇలాంటి అనుమానాలు, సందిగ్ధస్థితి చాలామందికి ఉంటుంది. కొత్తగా యోగంవైపు వచ్చినవారికి మరీ ఎక్కువ.

మా ఇంట్లో ఏ దేవుని పటాలు లేవు. ఫోటోలు ఉండవు. విగ్రహాలుండవు. పూజలు చేయం, వ్రతాలు చేయం. మాస్టర్, మదర్ ఫోటోలు మాత్రం ఉంటాయి. యోగానికి వారి ఫోటోలు అవసరం లేదు నిజానికి. కాని గురువుగారిపట్ల భక్తికి గుర్తులు.

ఇతర ఫోటోలు పెట్టను. అసలు దేవుడంటే ఏమిటి? భగవంతుడంటే ఎవరు? ఎదురు ప్రశ్నిస్తే ఎవరూ సరిగా సమాధానం చెప్పరు. భగవంతుని గురించి, దేవుని గురించి నిర్వచనాల్లేవు. పురాణకథలు నేను నమ్మను. వినను. రుజువుల్లేని పూజలు, కూలిపోయిన కోట బురుజుల్లాంటివి. పూజ చేయాలి. అది మానసపూజ కావాలి. నిరాకార నిర్గుణతత్వంపై మనసు నిలిపాలి. ఆ మనస్సు సైతం భావన దాటిపోవాలి. ఆత్మలో లయం కావాలి.

గుడికివెళ్లరా? ఒకప్పుడు వెళ్లాను. ఇప్పుడు వెళ్లాలనిపించదు. వెళ్లను. దేవునికి సుప్రభాతాలు చదివితే మురిసిపోయాను. పరవశించాను. దేవుడు నిద్రపోతాడా! మనం మేల్కొలపకపోతే నిద్రలేవడా? అంత మొద్దునిద్రా దేవుడిది. దేవుడిని గుడిలో పెట్టి తాళాలు వేయడం ఎందుకు? పారిపోతాడనా? దేవుడిని మనం రక్షించడం ఏమిటి? ఆయన మనల్ని రక్షించాలి కాని. దేవుడు ప్రసాదాలు, లడ్లు తింటాడా? మన డబ్బు దేవుడికెందుకు! బంగారాలు ఎందుకు? ముడుపులు చెల్లించకపోతే శపిస్తాడా? ఇలాంటి పిచ్చి ప్రశ్నలు నాలో కలిగి, దేవున్ని నాకు దూరం చేశాయి.

దేవాలయాలకు వెళ్లలేదని అబద్ధం చెప్పను. చిన్నతనంలో మా ఇంటి ప్రక్కన వేణుగోపాలుని ఆలయం వుంది. కాలవదగ్గర శ్రీరామాలయం వుంది. దగ్గరలో సంగమేశ్వరాలయాలుండేవి. తెనాలిలో శివాలయం, ఆంజనేయుని ఆలయం, రాములవారి గుడి అనేకం వున్నాయి. విజయవాడ కనకదుర్గాలయం, కాశిలో విశ్వేశ్వరాలయం , అన్నపూర్ణాలయం, శ్రీశైలం, కంచి, తిరుపతిలో ఆలయాలు చూచాను. చిదంబరం సైతం వెళ్లి వచ్చాను. అన్ని దర్శించాను కనుకనే వాటిపైన మోజు లేదు. దేవుళ్ల జోలికి పోకూడదనుకున్నాను. మనం పిలవకపోతే వాళ్లు రారు. మనల్ని పట్టించుకోరు. పిలిచి, మనంకోరే గొంతెమ్మకోరికలన్నీ తీర్చడం వాళ్లకీ కష్టమే. మతాలను, మతాల ముసుగులో దాగిన దేవుళ్లను వదలిపెట్టాను. ఎవరు ఏ స్వామికి భక్తుడైనా, బాబాలకు భక్తులైనా ఫరవాలేదు. చేయవలసింది సాధన, ధ్యానం, యోగం. అంతవరకు ఎవరితో నాకు పేచీలేదు. నా మతం గొప్పది, వాడి కులం తక్కువ, నేను ఎక్కువ, ఈ దేవుడు గొప్ప అనే దరిద్రం లేకుండాపోతే చాలు.

"ఇంతమంది మహాత్ములు, యోగులు ఉన్నారు, వారి ఆశ్రమాలకు వెళ్లలేదా?" అడుగుతారు కొందరు.

"ఉన్నారు. కాని వెళ్లే అవకాశం కలగలేదు. ఇప్పుడు ఎక్కడికీ వెళ్లవలసిన అవసరం కనిపించదు. షిర్డీ, రమణాశ్రమం, పుట్టపర్తి, బృందావనం... చాలా వున్నాయి. ఎక్కడికీ వెళ్లలేదు. కారణాలు ఏవీ లేవు. సమయం, సందర్భం కలిసిరాలేదు. అంతే. వారంతా మహాత్ములు... ఒక గురువును నమ్మాను. ఒక మార్గం అనుసరిస్తున్నాను. ఇదే నాకు పరిమితం. ఎవరైనా ఒక్కబాటలో నడవాలిగానీ, ఒకేసారి అనేక బాటలలో నడవగలరా? ఆ ప్రయత్నం తప్పు. ఆచరణలో అసాధ్యం.

మద్రాసులో ఉండేకాలంలో ఒక చిత్రమైన కేసు వచ్చింది. పోస్టల్ సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్న ఒకాయన భార్యకు ఆరుసంవత్సరాలుగా పక్షవాతం. మంచం మీద నుండి లేవలేదు. పిల్లలున్నారు, సేవలు చేస్తున్నారు. పనిపిల్లల్ని పెట్టుకున్నారు. ఎక్స్‌ప్రెస్ కాంపస్‌లో వెంకటరెడ్డిగారు యోగాక్లాసులు నడుపుతున్నారు. ఈయనను ట్రీట్‌మెంట్‌కు తీసుకువెళ్లారు. ఆసనాలు వేయిస్తే తగ్గుతుందని పాపం. పెరాలిసిస్‌తో మంచానికి అంటుకుపోయిన మనిషి చేత ఆసనాలు ఎలా వేయించగలడు! వెంకటరెడ్డి నా గురించి విన్నాడట. నా దగ్గరకు వచ్చాడు ఆమెకు యోగాట్రీట్‌మెంట్ ఇమ్మని.

వారింటికి తీసుకువెళ్లాడు. ఆమె పుట్టపర్తిబాబాగారి భక్తురాలు.

"అమ్మా! మీరు బాబాభక్తులు మంచిదే. ఆ ఫోటో ఎదురుగా వుండగా నేను ట్రీట్‌మెంట్ ఇవ్వలేను. ప్రేయర్‌గదిలో ఏ ఫోటోలు ఉండకూడదు" అన్నాను.

బాబాగారి ఫోటో తీయడం వారికి ఇష్టం లేదు. "వేరేగదిలో కూర్చుందాం" అన్నాను.

వేరేగదిలో ట్రీట్‌మెంట్ చేయసాగాను. పదిరోజులు వరసగా వెళ్లి చేశాను. రోజురోజుకు ఆమెలో మార్పు రాసాగింది. ఒక నెలరోజులు నేను అటు వెళ్లలేకపోయాను. తర్వాత వెళ్లగా ఆమె స్వయంగా లేచివచ్చి తలుపుతీసింది. చక్కగా నడుస్తోంది. మాట్లాడుతోంది.

"ఇక మీ సత్యసాయి పూజ చేసుకోండి. నాకోసం ఇంతకాలం చేస్తున్న పూజలు అవసరం లేదు. ఏదో ఒక గురి ఉంటే చాలు" అన్నాను.

"బాబాగారివల్ల కాలేదు కదండీ" అన్నది.

"బాబా వల్ల అయిందా, నావల్ల అయిందా అని కాదు. ఇప్పటికి మీ కర్మశేషం తీరింది. బాగైంది. కర్మ అనుభవించవలసినంతకాలం బాబా ఏమీ చేయరు. నేనూ ఏమీ చేయలేను. కర్మరహితం అయ్యే సమయంలో నేను వచ్చాను. ఇది నా గొప్పతనం కాదు. యథావిధిగా బాబాపూజలు చేసుకోండి. ఆ మార్గం వదలి నా మార్గంలోకి రమ్మని నేను చెప్పను." అలా ఎవరికీ చెప్పను.

ఎవరైనా ఒక మహాత్ముని పై నమ్మకం ఏర్పడినప్పుడు ఆ మార్గం వదలకూడదు. మరీ తనకు ప్రయోజనం కనిపించకపోతే, అంతకన్న ప్రత్యక్షంగా ఒక మంచి గురువు లభించిన పక్షంలో మారవచ్చు. ఎవరికైనా అభివృద్ధికి ఒక గురువు మార్గదర్శకత్వం అవసరం. "అలా అవసరం లేదు. మేము స్వతంత్రంగా యోగం చేస్తాం" అంటే నేను నమ్మను. సాధన స్వంతంగా చేస్తాంగానీ గైడెన్స్ సద్గురువు నుండి లభించవలసిందే.

# 1995

## గుడ్ బై టు తిరుపతి!

**జీవితమే మనిషికి మంచిపాఠాలు నేర్పుతుంది.** గుణపాఠాలు నేర్పుతుంది. అనుభవాలను మించిన పాఠాలు లేవు. వయస్సు పరుగులు తీస్తుంటే, ఆత్మీయులు, బంధువులు, తెరవెనక్కి పోతారు. ఎవరూ పట్టించుకోరు. ప్రేమలు, అభిమానాలు గాలిలో కలిసిపోతాయి. వయస్సు పైబడుతున్న కొద్దీ ఒంటరితనం క్రమ్ముతుంది. ఎవరు బంధువులు, ఎవరు అయినవాళ్లు! ఎవరు స్నేహితులు? వెనుతిరిగి చూస్తే ఎందరు మిగులుతారు! చాలా మంచి బాంధవ్యాలు, స్నేహాలు ఫేడవుట్ అయిపోయినట్లు అనిపిస్తుంది. రంగులన్నీ కలగాపులగమై, చెదిరిపోయిన బొమ్మ జీవితం. వేటికీ విలువలు కనిపించడం లేదు.

చిన్నబ్బాయి రమణ అమెరికాలో సెటిల్ కావాలనుకున్నాడు. భార్యను, కొడుకును తీసుకువెళ్లాడు. తిరుపతిలో ఒంటరిగా జీవించడం ఎందుకు? ఇక్కడ బంధువులు,స్నేహితులు అంతగా లేరు. కనీసం అవసరానికి వచ్చేవాళ్లు లేరు. పెద్దపిల్లలు వసంతకుమార్, శ్యాంసుందర్‌లు హైదరాబాదులో వుంటారు. మాకోసం వారిని ఇక్కడకు రమ్మని అడగలేం. వారి ఉద్యోగ వ్యవహారాలు వారివి. ఎవరి సంసారాలు వారివి. ఈరోజుల్లో ఎవరూ ఒకరికి బరువు కారాదు. పెద్దరికం నిలబడాలంటే ఏ మాత్రం ప్రేమానురాగాలు మిగలాలంటే, వేరుగానే ఉండాలి. ఎవరితో కలసి ఉండకూడదు. తిరుపతి వచ్చిన పని అయిపోయింది. మాస్టరుగారు ఏ ప్రయోజనం కోసం ఇక్కడకు రప్పించారో ఆపని పూర్తి అయి వుంటుంది. అందుకే ఇల్లు అమ్మేయాలనే ఆలోచన కలిగింది. తిరిగి హైదరాబాదు వెళ్లిపోవాలి.

తిరుపతి వచ్చి యోగంలో సాధించింది, యోగానికి చేసింది ఏమీ లేదు. ఇక్కడ యోగంలో చేరినవారు వేళ్లమీద నిలుస్తారు. ఒక ఏడాది క్రితం చేరిన రామకృష్ణ, సుబ్బారావు మంచిమిత్రులు. యోగంపట్ల ఆసక్తి ఉన్నవారు. కానీ వారి ఉద్యోగవ్యాపకాల వల్ల ఎక్కువ కాలాన్ని యోగానికి కేటాయించలేకపోతున్నారు. తిరుపతి వచ్చాక యోగంలో చేరినవారికంటే యోగం విరమించుకున్నవారే ఎక్కువ. అసూయలు, ద్వేషాలు, స్వార్థాలు మనుషుల్ని విడదీస్తాయని అనుభవంతో గ్రహించాను. యోగసాధకులలో ఏ లక్షణాలు ఉండకూడదో అవే కొందరిలో ప్రబలుతున్నాయి. కొత్తగా వచ్చి చేరేవారు

పాతవారిని ఆదర్శంగా తీసుకోవాలి! సీనియర్స్ ఎలా ట్రెయినింగ్ యిస్తే కొత్తవారు అలా తయారవుతారు. కొత్తసాధకులలో అసూయా ద్వేషాలకు, అనుమానాలకు కారకులు సీనియర్సు. కానీ ఎవరినీ వేలెత్తి చూపలేము. ఎవరినీ మార్చలేం. తమ పద్ధతే మంచిదని వారి నమ్మకం. ఎలా మార్చగలం! నా వరకు నేను యోగం సాధన చేయడం తప్ప ఎవరినో ఉద్ధరించాలని కంకణం కట్టుకోలేదు.

యోగమిత్రమండలి అంటారు. యోగంలో అంతా మిత్రులుగా ఉండాలంటారు. అలా మిత్రులుగా ఉన్నవారు నాకు కనిపించలేదు. అనేక సెంటర్లు ఉన్నాయి. ఒక సెంటర్ వారికి మరొక సెంటర్‌తో సంబంధం లేదు. సఖ్యతగా ఉండరు. స్నేహం లేదు. మంచిగా, స్నేహంగా ఉండడానికి ఏమిటి అవరోధం? ఆ పాటి సంస్కారం కనిపించడం లేదు. చాలా బాధ వేసింది. అందరూ కలవాలని ఒక కనీస కార్యక్రమం రూపొందించుకోవాలని అనేవారే గాని కలిసి వచ్చేవారు లేరు. ఈ యోగంలో ఇన్ని గ్రూపులా అని బయటివారు ఆశ్చర్యపోతున్నారు.

అందువల్ల నా పంథా మార్చుకోవలసివచ్చింది. కామన్ ప్లాట్‌ఫాంగా వుంటుందని యోగమార్గం నడుపుతూ వచ్చాను. దానికి ఆదరణ లేదు. ఎవరికోసం పత్రిక? నాకోసం కాదు. నా సర్కిల్ కోసం కాదు. నా సర్కిల్ వరకు నా సమావేశాలు, చర్చలు, గోష్ఠులు చాలు. పత్రిక అవసరం లేదు. తిరుపతిలో యోగాసెంటర్ బాగా అభివృద్ధి చెందుతుందని ఆశించాను. నాది అత్యాశ అయింది. హైదరాబాదులో అయితే కనీసం సాహిత్యపరమైన మిత్రులైనా ఉంటారు. సభలు, సమావేశాలు, రేడియో, టి.వి.ల కాలక్షేపం వుంటుంది.

నా షష్టిపూర్తి ఉత్సవం తిరుపతిలోనే జరిగింది. ఆ పండుగ మా స్వగృహంలో జరగాల్సి వుంది. ఈ మార్చికి యామినీదేవికి అరవై సంవత్సరాలు నిండుతాయి. ఆ ఒక్క కార్యక్రమం తిరుపతిలో జరిపి మకాం ఎత్తి వేయాలి. అయితే ఆడవాళ్లకు షష్టిపూర్తి జరపవచ్చా? ధర్మసందేహం. అరవైఏళ్లు నిండితే మగవారికైనా, ఆడవారికైనా షష్టిపూర్తి అవుతుంది. ఉత్సవానికి అర్హత వుంటుంది. నిజానికి అరవై సంవత్సరాలు నిండడం ఒక్కటే అర్హత కాదు మగవారికైనా ఆడవారికైనా. అరవైఏళ్లలో లోకం మెచ్చే పనులు చేసి ఉండాలి. లోకానికి పనికివచ్చే పనులు చేసి ఉండాలి. నా సహచరిగా, గురుపత్నిగా యామినీదేవి నిర్వహించిన పాత్ర పెద్దది. నేను నిర్వహించిన అన్ని పనులలో సగం వాటా తనది. ఇది కాదనలేని కఠినసత్యం. ప్రతిభర్త విధినిర్వహణలో సగం భాగం భార్యది. తనను కాదని నేను చేసిన యోగం లేదు. జీవితంలో ఇద్దరం సమభాగులం అయినట్లే యోగంలోనూ ఇద్దరం సమభాగులం. శిష్యబృందం నన్నెంతగా అభిమానిస్తారో, ప్రేమిస్తారో ఆమెను అంతగానే ప్రేమిస్తారు, అభిమానిస్తారు. నిజం చెప్పాలంటే శిష్య బృందం

ప్రేమాభిమానాలు తనే కాస్త ఎక్కువగా పొందింది. పూర్వకాలంలో విదుషీమణులు షష్టిపూర్తి ఉత్సవాలు జరుపుకునేవారు. ఇటీవలి కాలంలో పురుషాధిక్యత కారణంగా, వారి ప్రాధాన్యతను గుర్తించడం లేదు. ఇది ఒక సత్సంప్రదాయం అవుతుంది. ఒకరు చేస్తే మరొకరు అనుసరిస్తారు. పదిమంది చేస్తే సంప్రదాయం అవుతుంది.

సామాన్యగృహిణిగా కాకున్నా ఒక యోగినిగా యామినికి ఆ హక్కు ఏర్పడ్డది. వేలమంది యోగసాధకుల చేత 'అమ్మా' అని పిలిపించుకున్న మాతృహృదయిని. ఈ ఆలోచన డిసెంబరు సమావేశాలలో బయట పడ్డది. శిష్యులంతా తప్పక చేయాలి అని పట్టుబట్టి రంగంలోకి దిగారు. మార్చి 20 తన పుట్టిన రోజు. 1935లో జన్మించింది. ఆ సందర్భంగా ఒక 'జ్ఞాపిక' ప్రచురించే బాధ్యతను డా॥వసంతకుమార్ తీసుకున్నాడు. చాలామంది యోగమిత్రులు రచన చేశారు. చక్కని చిన్న సావనీర్ తయారైంది. ఆ సావనీరులో యోగమిత్రులు రాసిన వ్యాసాలు ఒక ఎత్తు, మా అమ్మాయి చి॥సౌ॥పద్మప్రియ రాసిన ఒక్కవ్యాసం ఒక ఎత్తు. పద్మప్రియలో ఒక గొప్ప రచయిత్రి ఇంతకాలం అజ్ఞాతంగా నిద్రపోతోంది. ఇప్పుడు నిద్రలేచింది. తను ఎప్పటికైనా చక్కని రచయిత్రి కాగలదని నాకనిపించింది. డా. వసంతకుమార్ 'అమ్మ'లో 'సావిత్రి' ని దర్శింపచేశాడు. మా పెద్దమనవరాలు చి॥ ప్రత్యూష, మా రెండవకోడలు చి॥సౌ॥ అనూరాధ చక్కని ఇంగ్లీషు వ్యాసాలు రాశారు. మొత్తం 27 మంది రచనలతో ఆమెకు అక్షరనీరాజనం సమర్పించారు. అలాంటి షష్టిపూర్తి సావనీరు ఇంతవరకు తెలుగులో రాలేదంటే అతిశయోక్తి కాదు.

నా షష్టిపూర్తి సందర్భంగా జరిగిన కనకాభిషేకంలో తనది రెండవస్థానం. ఇప్పుడు తన షష్టిపూర్తి ఉత్సవంలో తనది ప్రథమస్థానం, నాది ద్వితీయస్థానం. భర్త ప్రక్కన భార్య ఎడమవైపున కూర్చోవడం ఆచారం. ఈ ఉత్సవంలో తనకు కుడివైపు స్థానం కేటాయించాం. భజంత్రీలు లేవు, మేళతాళాలు లేవు. బంధువులు, స్నేహితులు, యోగసాధకులు రెండువందలమంది సమర్పించిన అభినందనపుష్పాలు, అక్షరాంజలులు. ఎందరో ఉపన్యసించారు. వచ్చినవారిలో ఆసక్తి వున్న ప్రతిఒక్కరూ నోరువిప్పి, హృదయపూర్వకంగా మాట్లాడారు. ఏ సభలోగానీ, సమావేశంలోగానీ అంతమంది వక్తలు పాల్గొనడం జరగదు. ఇది ప్రత్యేకం. అయిదారుగంటలసేపు కార్యక్రమం జరిగింది. అదొక భువనవిజయం. ప్రేమతో ప్రసంగించేటప్పుడు ఎవరికీ సభా పిరికితనం ఉండదు. ఏనాడూ వేదిక ఎక్కనివారు, మైకు ముందర నిలబడనివారు సైతం ప్రేమసందేశాలు అందించగలిగారంటే అది యామినీదేవి పట్ల వారికి ఉన్న ప్రేమ, ఆదరణ కారణం.

0 0 0

అవే తిరుపతిలో చివరి సమావేశాలు. సికింద్రాబాద్‌లోని తిరుమలగిరి ప్రాంతంలో ఒక స్థలం కొనడం జరిగింది. తిరుపతిలో ఇంటిఅమ్మకం ఒకరకంగా జరిగినట్లే. రమణ మరల అమెరికా వెళ్లాలనే ఆలోచనలో ఉన్నాడు. దగ్గిరుండి ఇల్లు కట్టించుకోవాలి. యోగసమావేశాలకు అనుకూలంగా ఉండేటట్లు. హబ్సిగూడ నుండి వసంతకుమార్ మకాం మారింది. తిరుమలగిరిలో ఒక అద్దెఇంటికి మారాం. దగ్గిరగా ఉండి ఇల్లు కట్టించుకోవాలి.

హైదరాబాదు వచ్చినప్పుడు గోవిందశర్మ ఒకక్రియాయోగిని పరిచయం చేశాడు. ఆమె చాలాకాలంగా నిరాహారంతో తపస్సు చేస్తున్నారు. అమెకు నా గురించి చెప్పగా ఆమెకు నన్ను చూడాలనిపించింది. మేమే వాళ్ల ఇంటికి వెళ్లాం. ఆమె భర్త నన్ను గుర్తించారు. మద్రాసులో పరిచయం మాది. ఫలానా అని తెలియదు. తీరాచూస్తే వారికి మాకు రెండురకాల బాంధవ్యం కలిసింది. ఆమె క్రియాయోగం చాలాకాలంగా చేస్తు న్నారు. నేను తనను చూడడానికి వెళ్లినందుకు ఎంతో సంతోషించింది. హబ్సిగూడా వసంతకుమార్ గారింటికి వచ్చారు. ఒకసారి బి.ఎస్.కృష్ణారావుగారింట్లో యామినీదేవి, జయదేవి కలుసుకున్నారు. ఒకరు సత్యయోగిని, ఒకరు క్రియాయోగిని. రెండు యోగ హృదయాల సమాగమం గొప్పస్ఫూర్తిని కలిగిస్తుంది. ఎంతోప్రయోజనం సాధిస్తుంది. వారిద్దరు మంచి స్నేహితులైనారు. ఎవరిలోనూ స్వార్థం లేదు. ఇద్దరిలో అహంకారం లేదు. ఇరువురు మాతృప్రేమను పంచినవారే. అలా ఆడవారు ఆధ్యాత్మికప్రగతి సాధించడం ఎంతో ఉపయోగం. ఒకస్థాయికి వచ్చినవారిలో, ముఖ్యంగా ఆధ్యాత్మిక రంగంలో పవిత్రమైన నిష్కల్మషమైన ప్రేమ తప్ప, అసూయలు ద్వేషాలు ఉండవు.

క్రియాయోగం సాధన చేస్తున్న సాహితీమిత్రులు నాకున్నారు. డా.అరిపిరాల విశ్వం, డా. పోరంకి దక్షిణామూర్తి పరమహంస యోగానంద అనుయాయులు వీరంతా. జయదేవిగారు గృహిణి. భర్త, పిల్లలు, సంసారపక్షంగా జీవిస్తున్నారు. భోజనం చేయరు. పర్ణశాలలో, మునివాటికలో జీవిస్తున్న ఒక తపస్విని అనిపిస్తారు. ఆ తర్వాత మేము ఎప్పుడు కలిసినా చక్కని యోగవిషయాలే సంభాషణలో దొర్లుతాయి. ఆమెకు మా యోగంపట్ల గౌరవం ఏర్పడింది.

'నమ్మిచెడినవారు లేరు.' యోగంలో చేరి ప్రయోజనం పొందనివారు ఉండరు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా ప్రయోజనం కలుగుతుంది. కొందరికిఉద్యోగాలు, కొందరికి వ్యాపారాలు కలిసివస్తాయి. కొందరికి గృహసమస్యలు ఒక కొలిక్కి వస్తాయి. కొందరికి మనశ్శాంతి లభిస్తుంది. కొద్దిమందికి ఆత్మశాంతి, ఆధ్యాత్మికాభివృద్ధి సాధ్యమవుతుంది. యోగం సక్రమంగా చేయడం అంటే గురువు అనుగ్రహం పొందడం. గురువు ఆగ్రహానికి

గుర్తైనవారు, గురువును దూరం చేసుకున్నవారు ఉంటారు. అహంకారంతో, స్వార్థంతో ఏదో కండూతితో గురువును అలక్ష్యం చేస్తారు. స్వతంత్రిస్తారు. అంతమాత్రాన గురువుకు కలిగే నష్టం ఉండదు.

పూర్వకాలంలో ఋష్యాశ్రమాలలో సైతం గురువుగారివద్ద విద్య, యోగం తపస్సు నేర్చుకున్నా గురుపత్ని ప్రేమను పొందిన వారే పరిపూర్ణ విద్యావంతులయ్యేవారు. ప్రతి గొప్పవ్యక్తి వెనుక ఒక స్త్రీ ఉంటుందంటారు. మాస్టరుగారి యోగం చేస్తూ మాతృశ్రీ వెంకమ్మగారిని అలక్ష్యం చేసిన వారెందరో ఉన్నారు. అమ్మగారిని గుర్తించనట్లు, అసలు ఆమెకు, యోగానికి సంబంధం లేనట్లే భావిస్తారు. ప్రేయరు గదిలో మాస్టర్‌గారి ఫోటో ప్రక్కన మాతృశ్రీ వెంకమ్మగారి ఫోటో ఉండితీరాలని పట్టుబట్టింది యామినీదేవి. చాలామంది సాధకుల ఇళ్లలో మాస్టరుగారి ఫోటో మాత్రమే ఉండడం నేను గమనించాను. మాస్టర్‌గారి ఫోటో ప్రక్కన సమానస్థాయిలో మాతృశ్రీ వెంకమ్మగారి ఫోటోసైతం ఉంచి యోగం చేయడం మా సెంటర్‌లోనే మొదలు. ఆ క్రెడిట్ యామినీదేవిది. యోగసాధకులు సైతం గురుపత్నిని గురువుతో సమానంగా గౌరవించాలి. అంతకన్న ఎక్కువగా ప్రేమించాలి. మాస్టర్‌గారి హయాంలో సాధకులు ఎవరూ అమ్మగారిని అలక్ష్యం చేయలేదు. అది నేటి సాధకులు గుర్తించడం లేదు.

డా.పద్మావతమ్మకు యోగాసెంటర్‌కు విడదీయరాని సంబంధం ఏర్పడ్డది. నా యోగాశ్రమం మూలస్తంభాలలో ఆమె ఒకరు. డి.ఎన్.రావు రెండవవారు. రెండవవారు తొలిప్రేరణ అయితే, మొదటివారు నిర్మాత. ఆమె అమాయకంగా కనిపించినా ఆవులిస్తే పేగులు లెక్కించగల ప్రతిభ కలది. ఆమెకు అందరినీ ప్రేమించడం మాత్రమే కాదు అయోగ్యులను ద్వేషించడమూ తెలుసు. దొంగనమస్కారాలు చేసేవారిని, అతివినయం నటించేవారిని, ఓవర్‌యాక్షన్ చేసేవారిని ఇట్టే పట్టేసేది. 'వీడు దొంగ, నమ్మకూడదు' అనేది. 'దీనిదంతా కపటం, దీని భక్తి నటన, నమ్మకండి' అని హెచ్చరించేది. అలాగా ఆమె అనర్హులుగా ముద్రవేసినవారంతా యోగం నుండి క్రమంగా తప్పుకున్నారు.

ఆమె సాధకులందరికీ పెద్దక్క. అందరికీ సలహాలు చెప్పేది. పాఠాలు చెప్పేది. గుణపాఠాలు నేర్పేది. 'అమ్మ'ను నిర్లక్ష్యం చేయకండి, పుట్టగతులుండవు అని హెచ్చరించేది. 'అమ్మను అవమానించినవాడు, అమ్మప్రేమను గుర్తించనివాడు పైకిరాడు' అనేది. యామినీదేవి లోని యోగశక్తిని, పూర్ణత్వాన్ని మొదట గుర్తించింది, పదిమందికి తెలియచెప్పింది డా. పద్మావతమ్మ. పెద్దవయస్సు అయినా తనే 'అమ్మా' అని గారాబాలు పోయేది. మురిసిపోయేది. యామినీదేవిలో మాతృశ్రీ వెంకమ్మగారి యోగప్రజ్ఞ ప్రవేశించి, పనిచేస్తున్నదని, తన యోగబలిమితో గుర్తించి ఆమెలో అమ్మను దర్శించింది.

ఒకసారి అన్నామలై వర్శిటీలో పనిబడి చిదంబరం వెళ్లాను. నాకు సాయంగా మిత్రుడు ఎస్.ఎం.రామకృష్ణ వచ్చారు. అక్కడ దేవాలయం చూచాం. తిరిగివస్తుండగా జరిగిన ఒక సంఘటన. ఆరోజు వర్షం కురుస్తోంది. అయిదుగంటలకు రావలసిన మధురై-తిరుపతి రైలు రెండుగంటలు లేటైంది. ప్రేయర్ టైం దాటిపోవడంతో మనస్సు చికాకుగా వుంది. పగలంతా యూనివర్సిటీ చుట్టూ తిరగడంవల్ల తలనొప్పిగానూ వుంది. రైలులో మా బోగీలోకి ఇద్దరు ఆడవాళ్లు ఎక్కారు. మా ఎదురుసీట్లువారివి. ఇద్దరూ యువతులే. అందంగా ఉన్నారు. అందాన్ని చూచి లొట్టలు వేసే వయస్సు మా ఇద్దరిదీ కాదు. స్వాములార్లుగా కూర్చున్నాం. రైలు బయలుదేరగానే, నేను ప్రేయర్‌కు కూర్చున్నాను. రిజర్వ్‌డ్ బెర్తులు కనుక జనం బాధలేదు. ట్రెయిన్ చాలాదూరం వచ్చేవరకు నా ప్రేయర్ సాగింది. చాలా డీప్‌గా వెళ్లింది. మనస్సు, శరీరం అలసిపోయినందున ప్రేయర్ బాగా సాగింది. నేనుకళ్లు విప్పేసరికి రామకృష్ణ వాళ్లతో మాట్లాడుతున్నారు. ఆయనకు తమిళం వచ్చు. వాళ్లు తమిళంలో మాట్లాడుకుంటున్నారు.

"ఎక్స్‌క్యూజ్‌మి" అందులో ఒకామె నా వైపు చూచి అన్నది.

ఏమిటన్నట్లు చూచాను. ఆమె అరవంలో అడిగింది.

"సారీ, నాకు తమిళం పెద్దగా రాదు. ఇంగ్లీషులో అడగండి."

వాళ్లకు ఇంగ్లీషు వచ్చి ఉండాలని నా ఊహ. తమిళదేశంలో ఆడ, మగ అందరికీ ఇంగ్లీషు చక్కగా వచ్చి ఉంటుంది.

"మీరు యోగం చేస్తున్నారు! ఆ యోగం గురించి తెలుసుకోవచ్చా?"

మా సంభాషణ ఇంగ్లీషులో సాగింది. రామకృష్ణ వింటూ కూర్చున్నాడు. ఆ ఇద్దరు యువతులు చక్కగా ఆసక్తిగా అనేక విషయాలు అడిగారు. బోగీలోని మరికొంతమంది జనం వచ్చి మా సంభాషణ ఆలకించసాగారు.

"నా యోగం గురించి తెలుసుకుని ఏంచేస్తారు? మీకేమిటి ప్రయోజనం" నాప్రశ్న.

మేం కాఫీతాగి చర్చ ప్రారంభించాం.

"నాకు రెండు సంవత్సరాలుగా తలపోటు. నేనూ యోగం చేస్తాను" అన్నది.

"ఏ యోగం?"

"విపస్సన"

"ఏ విపస్సన? బౌద్ధపద్ధతా, జపాన్‌పద్ధతా? లేక రజనీష్ పద్ధతా?" ప్రశ్నించాను.

"మీకు విపస్సన తెలుసా?" ఆమె ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"మీకు తలనొప్పి వస్తున్నదంటే 'ఓషో' పద్ధతి అయివుండాలి. గురువులేకుండా, గైడ్ లేకుండా సాధన చేస్తూ ఉండాలి. అవునా?" అన్నాను.

అవునని అంగీకరించింది. విపస్సనలో భేదాలగురించి, సారూప్యతల గురించి వివరంగా అడిగింది. చెప్పాను.

"మీరూ విపస్సన చేస్తారా?"

"చేయను. నా యోగం నాది! ఇతరాలు ఏమీ చేయనవసరం లేదు. నాకు తెలుసు. తెలియకపోయినా తెలుసుకోగలను. చెప్పగలను."

నా యోగం గురించి చాలా చాలా అడిగింది.

"నా తలనొప్పికి యోగంతో ట్రీట్‌చేయగలరా?" అడిగింది.

"అలా అడగకూడదు. మీప్రశ్నలోనే సందేహం, అనుమానం ఉంది. 'ట్రీట్‌చేయండి' అని సర్టెన్‌గా అడిగితే చేస్తాను. చేయగలను అని చెప్పను. చేస్తాను. ప్రొవైడెడ్ మీకు నాపై పూర్తి విశ్వాసం వుంటే."

"రేపు వస్తాను మీ ఆశ్రమానికి... మీ దర్శనానికి."

"తప్పు. ట్రీట్‌మెంట్‌కోసం వస్తున్నారు. నా ఆశ్రమం అంటే నేనే...నేనే ఒక ఆశ్రమం. నా ఆశ్రమమే నేను. వచ్చినవారికి శ్రమ తగ్గించడం ఆశ్రమ ధర్మం. 'ఆ-శ్రమం-ఆశ్రమం. ఆమె డాక్టర్ సత్య. మధురై వద్ద చిన్న పట్టణం . రెండవ ఆమె బ్యాంక్ ఆఫీసర్. ఇద్దరు అవివాహితలే. వేంకటేశ్వరస్వామి దర్శనానికి బయలుదేరారు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు మాతోపాటు తిరుపతిలో దిగారు.

మధ్యాహ్నం పన్నెండుగంటలకు ఇద్దరూ నావద్దకు వచ్చారు.

"ఇంత వేగిరం దర్శనం అయిందా?"

"మీ దర్శనానికి రావాలనుకున్నాం. దేవుని దర్శనం తొందరగా అయింది. సాయంత్రం రైలుకు వెళ్లిపోవాలి"

ట్రీట్‌మెంట్ అడిగింది. చాపపైన కూర్చోపెట్టి 'టచ్' యిచ్చాను. అరగంటసేపు ట్రాన్స్‌లోకి వెళ్లిపోయింది. ట్రీట్‌మెంట్ జరిగింది.

"మళ్లీ ఎప్పుడు రమ్మంటారు?" అడిగింది.

"ట్రీట్‌మెంట్ అయిపోయింది. ఇంక మీకు తలనొప్పి రాదు. యోగం చేయదలిస్తే ఎప్పుడైనా రావచ్చు. మీ ఇష్టం."

ఓ నెలరోజులకు డా.సత్య ఉత్తరం రాసింది. తలనొప్పి పూర్తిగా తగ్గిపోయిందని. ఆరోగ్యం చాలా బాగా ఇంప్రూవ్ అయిందని.

0 0 0

మాష్టరుగారి అనుగ్రహం వల్ల ట్రీట్‌మెంట్స్ విషయంలో నాకు అనుమానం ఉండదు. అపజయం లేదు. నా ఫీలింగ్‌కు ముందుగానే తెలుస్తుంది, అయ్యేది కానిది.

కానప్పుడు ఏ మాత్రం అనుమానం వున్నా, ముందే చెప్పేస్తాను, ఈ కేసు చేయడం అనవసరం అని. ఒక కేసు గురించి చెపుతుండగానే ఫలితం తెలుస్తుంది. నా వల్ల కాదంటాను. మొండికెత్తితే వారి తృప్తి కోసం చేస్తాను. అయినా ముందే చెప్పేస్తాను. నయం కాదు, ఫలితం ఉండదు, నేను ఎంతచేసినా తాత్కాలిక ఉపశమనం మాత్రమే యిస్తుందని. కర్మను తగ్గించవచ్చుగానీ మృత్యువును ఎవరం తప్పించలేం. మృత్యువుకు అడ్డునిలిచి మన ప్రతాపం చూపించకూడదు. యోగం అయినా యోగా ట్రీట్‌మెంట్స్ అయినా ప్రకృతికి భిన్నంగా ఉండవు. కొంతవరకు ప్రకృతిని మనకు అనుకూలం చేసుకోగలం. కానీ ప్రకృతిని లొంగదీసుకునే ప్రయత్నం చేయకూడదు. కర్మ అనేది మనం చేసుకున్నది. విధి భగవంతుని నిర్ణయం. రెండూ ఒకటి కాదు. కనుక విధిని పూర్తిగా మార్చలేం. యోగంతో కొంత సుముఖం చేసుకోవచ్చు. కర్మను తగ్గించుకోవచ్చు. రహితం చేసుకోవచ్చు. యోగం కర్మరాహిత్యానికి ఉపకరిస్తుంది. ఆపైన ఆత్మజాగృతికి, ఆత్మవికాసానికి దోహదపడుతుంది.

యోగం చేసేవారందరికీ ట్రీట్‌మెంట్స్ ఒక ఆకర్షణ. ప్రతివారు చేయాలని ప్రయత్నిస్తారు. ట్రీట్‌మెంట్స్ చేసి కీర్తి గడించాలని ఆశిస్తారు. యోగం చేసి, ఎంత శక్తిని పొందినా లోకానికి వొరిగేదేముంది? మన యోగం లోక క్షేమానికి, మానవకళ్యాణానికి కొంతవరకైనా ఉపయోగించాలి. యోగం చేయడంవల్ల మనకు తృప్తి సరే, ఇతరులకు మేలు కలగాలి. నా లక్ష్యం అదే. నా గమ్యం నాకు తెలీదు. ఈ ట్రీట్‌మెంట్ పద్ధతి మాస్టర్‌గారు అందరికీ నేర్పారు. నేర్పారంటే చికిత్స చేయడానికి ఎంతోమందికి అవకాశం కల్పించారు. వారిలో కొందరే నిస్వార్థంగా, ప్రేమగా చేయగలిగారు.

నేనేదో మహాప్రేమతో చేస్తున్నానని చెప్పను. ఇది నా ఒక్కనివల్లే అవుతుందనీ చెప్పను. ప్రతివారికి ఆ శక్తిని మాస్టరుగారు యిస్తారు. యోగసాధనకు ప్రతి ఒక్కరూ ఎలాగ అర్హులో యోగాట్రీట్‌మెంట్‌కు ప్రతిసాధకుడు అర్హుడే. ఎందుకు చేయరు అంటే కారణం వారి పిరికితనం. కప్పిపుచ్చుకున్న ఏదో లోపం కారణం కావచ్చు. చికిత్స చేస్తే తమ_యోగశక్తి ఖర్చయిపోతుందని భయపడేవారు, అనుమానం ఉన్నవారు చికిత్సలు చేయలేరు. వీరికి చేస్తే నాకేం ఒరుగుతుంది అనుకునేవారు చేయలేరు. చాలామంది తగినంత యోగశక్తి, యోగబలం ఉండీ ట్రీట్ చేయరు.

నాకు మొదటి నుండి మాస్టరుగారు ఆ అవకాశం కల్పిస్తూనే వున్నారు. అందుకు అవసరమైన శక్తిని నాకు ప్రసాదిస్తూనే వున్నారు. మనస్సు, హృదయం ప్రేమతో నిండాలి. రోగిపట్ల అవ్యాజమైన ప్రేమ ఏర్పడాలి. నేను సీరియస్‌గానే ఉంటాను. అది నా స్వభావం. యోగం చేసేవారంతా సీరియస్‌గానే వుంటారు. నవ్వుతూ, తుళ్లుతూ

ఉండడానికి గలకారణాలు వారిని చలింపచేయవు. సీరియస్‌గా ఉన్నంతమాత్రాన ప్రేమ లేదని కాదు. భగవంతుని సీరియస్‌గా ప్రేమించమా! భగవంతునిపై జోకులు వేసి, నవ్వుకుంటూ ప్రేమిస్తారా ఎవరైనా?

నా నమ్మకం నాది. మాస్టరుగారు నాకు ఏ పనులు కేటాయించారో అవే నేను నిర్వహిస్తున్నాను. నాకు ఇచ్చిన పనులు సిన్సియర్‌గా చేయడం వరకే నా డ్యూటీ. యోగం గురించి లోకానికి పరిచయం చేసే శక్తి నిచ్చారు. రాయమన్నారు. నాకు తెలిసినంత వరకు రాస్తున్నాను. పాఠకులలో యోగంపట్ల జిజ్ఞాస కలుగుతోంది. యోగసాధనపట్ల ఆసక్తి పెరుగుతోంది. నా పాఠకులంతా నేను చేసిన యోగమే చేయాలని, ...స్తారని నేను అనుకోవడం లేదు. వారికిష్టమైనది, వారికి నచ్చింది చేస్తారు. వారు యోగమార్గంలోకి రావడం ముఖ్యం. యోగం చేయడం ముఖ్యం. యోగ చైతన్యం పొందడం ముఖ్యం. ఇవే యోగం నాకు నేర్పిన అంశాలు.

0 0 0

కొన్ని కొన్ని చిన్నసంఘటనలు జీవితంపైన బలమైన ముద్రలు వేస్తాయి. వాటిని విస్మరించలేం,1994 నవంబరులో ఒకసారి హైదరాబాదు వచ్చాను. నా చిరకాల మిత్రుడు, ప్రముఖ జర్నలిస్టు జి.కృష్ణగారిని చూడటానికి వెళ్లాను. వారికి నాకు నలభై సంవత్సరాల పరిచయం. చిత్తూరులో, మద్రాసులో ప్రభలో వారిదగ్గర నేను పనిచేశాను. హైదరాబాదులో ఇద్దరం రిటైర్ అయ్యేవరకు ప్రభలో, ఎక్స్‌ప్రెస్‌లో ఉద్యోగులం. వారికి జ్యోతిషం బాగావచ్చును. తెలుగు విజ్ఞాన సర్వస్వం జ్యోతిష గ్రంథానికి వారు వ్యవహర్తగా, సంకలనకర్తగా పనిచేసినప్పుడు నా చేత హస్తసాముద్రికంపైన బృహత్ వ్యాసం రాయించుకున్నారు. వారు ప్రొఫెషనల్ జ్యోతిష్కులకు భిన్నంగా ఫలితాలు చెబుతారు. నా జాతకచక్రం చూచి చిత్రమైన ఫలితాలు సూచించారు. జర్నలిస్టుగా రిటైర్ అయినవాడు బ్రతకడం కష్టం. తర్వాత ఆదాయం ఉండదు. మరో ఉద్యోగానికి పనికిరాడు. ఉన్న పత్రికలు సీనియర్ జర్నలిస్టుల సేవల్ని ఉపయోగించుకోవు. వారికి యువకులు కావాలంటారు. అనుభవానికి విలువనివ్వరు. తను, నేను రిటైర్ అయిన తర్వాత ఒకే స్థితిలో వున్నాం. నా జీవితం ఎలా సాగుతుందో, పరిస్థితి ఎలా వుంటుందో చెప్పమని వారిని కోరాను. ఆయన కొత్త గ్రహాలు నెప్ట్యూన్, హెర్క్యులస్, ప్లూటోల ప్రభావం జీవితాలపై ఎలా ఉంటుందో అధ్యయనం చేశారు. పన్నెండు రాశులు - పన్నెండు గ్రహాలు - వారి జ్యోతిషపద్ధతి. నా జాతకం చూచి, యోగవిషయంగా చాలా బాగా ఉంటుందని చెప్పారు. అదొక ఊరట. పది సంవత్సరాల పాటు రిటైర్ అయిన తర్వాత యోగం, శిష్యులు, చక్కగా సాగుతుందని ఆ తర్వాత శిష్యులరాక తగ్గుతుందని,

'కమ్యూనికేషన్ వర్కు' ఎక్కువగా జరుగుతుందని చెప్పారు. అంటే ఏమిటో వివరించలేకపోయారు. మరొక విచిత్రమైన ఫలితం చెప్పారు. 95 మార్చిలోగా హైదరాబాదులో స్థలం కొంటానని, ఇల్లు కట్టిస్తానని చెప్పారు. తిరుపతిలో ఒక ఇల్లు వుంది కదా మరొక ఇల్లు కట్టించడంఎలా సాధ్యం? అది నమ్మశక్యం కాలేదు. నాకా అవసరం లేదు, అవకాశం లేదు.

జి. కృష్ణగారు చెప్పినట్లు మూడునెలల్లో హైదరాబాదులో జాగా తీసుకోవడం జరిగింది. వెనువెంటనే ఇల్లు ప్రారంభించడం జరిగింది. ఆరునెలల్లో ఇల్లు పూర్తయింది. 1995 చివర్లో గృహప్రవేశం జరిగింది. మకాం తిరుపతి నుండి హైదరాబాదుకు మారింది. వారు చెప్పినట్లే యోగసభ్యుల రాక కొంతవరకు తగ్గింది. 'కమ్యూనికేషన్' అనే పదానికి అర్థం తెలిసింది. అయిదారు సంవత్సరాలలో నేను రాసిన పుస్తకం లేదు. ఈ మధ్య రాయాలన్న సంకల్పం కలిగింది. 'మహాచైతన్యం' ప్రారంభించాను. హైదరాబాదు మారిన తర్వాత రచనపై దృష్టి మళ్లింది. మంచి పుస్తకాలు రాయాలనే తపన పెరిగింది.

0 0 0

తిరుపతి వదలినా, అక్కడి జ్ఞాపకాలు కొన్ని మిగిలాయి. ట్రీట్‌మెంట్‌కోసం వచ్చేవారి విషయం కాదు. అలా వచ్చేవారు వేలు ఉన్నారు. వస్తుంటారు, చికిత్స చేయించుకుని పోతుంటారు. అలా వచ్చేవారికి యోగాశ్రమం ఒక ఆస్పత్రి, గురువుగారంటే ఒక డాక్టరు. వారి బుద్ధి అంతవరకే పనిచేస్తుంది. అలాంటివారిని ఏమీ చేయలేం!

ఆ మధ్య రాయలసీమ సేవాసమితి కార్యదర్శి, నా మిత్రుడు జి. మునిరత్నం నాయుడుగారికి వారి'రాస్' కార్యకలాపాలపై ఒక డాక్యుమెంటరీ తీయాలని సంకల్పం కలిగింది. దానిని తెలుగులోను, ఇంగ్లీషులోను తీయాలని, స్క్రిప్టుపని నాకు అప్పగించారు. మద్రాసు నుండి ఒక డైరెక్టరును పిలిపించారు. మా ఇద్దరికీ ఒక జీపు యిచ్చి, ఒక అసిస్టెంటును యిచ్చి, లొకేషన్ ఎన్నికకు పంపారు. నాలుగురోజులు చిత్తూరుజిల్లాలోని వాళ్ల సేవాసమితి సెంటర్లను చూచి, అక్కడి కార్యకలాపాలన్నీ పరిశీలించాం. తిరిగి తిరుపతి చేరుకున్నాం. ఆ డైరెక్టరుగారికి దైవభక్తి ఎక్కువ. కొండపైకి వెళ్లాలని పట్టు బట్టాడు. నేను వెంట వెళ్లక తప్పలేదు. జీపులో తిరుమలకు వెళ్లాం. వెంటనే దర్శనానికి ఏర్పాట్లు జరిగాయి. ఎంతటి వారైనా క్యూలో నిలబడక తప్పదు కదా!

కొంతదూరం నడిచేసరికి పరకామణి మండపంలో ఉన్న ఒకాయన నా వద్దకు వచ్చి నమస్కారం చేశాడు. ఆయన అక్కడ ఇంజనీరు. నేను తెలుసునట. కొండపైన ఉద్యోగులు చాలామంది నా వద్దకు వస్తారు. ఇంజనీర్లు, అర్చకస్వాములు, వేదపండితులు వచ్చిపోతుంటారు. ఆయన బంగారువాకిలి ముందు క్యూ ను ఆపించి మమ్మల్ని

రమ్మన్నాడు. స్పెషల్‌గా దర్శనం, అర్చన చేయించాడు. పది నిమిషాలు మా కోసం క్యూ ఆగింది. తర్వాత అటు ఒకచోటుకి తీసుకువెళ్లాడు. ఆ గది తాళం తీశారు. ...లోపల మాకు స్వామి వారి శేషవస్త్రాలు, భుజంమీద కప్పి, చేతుల్లో ఉంచారు.

"ఏమిటి ఇవి?" అమాయకంగా అడిగాను.

'ఇవి శేష వస్త్రాలు. ప్రతి శుక్రవారం స్వామివారికి కట్టబెడతారు. రాష్ట్రపతి, ప్రధాని, పీఠాధిపతులు ఎవరైనా వస్తే వీటిని ఇలా బహూకరిస్తారు... అది ప్రత్యేక గౌరవం'

"నేను ఏమీ కాదు, నాకెందుకీ మర్యాదలు?" అడిగాను.

'మీరు సత్యయోగులు, పీఠాధిపతుల కన్న ఎక్కువే. మిమ్మల్ని చూడగానే శేషవస్త్రాలను సమర్పించి గౌరవించాలనిపించింది. ఇది స్వామివారి సంకల్పం కావచ్చు' అన్నారు.

తర్వాత బంగారుఊయల, ఇంకా ఏవేవో ప్రత్యేకస్థలాలు చూపించి, ఇరవై స్పెషల్ లడ్లు తెచ్చి సమర్పించుకున్నాడు.

తిరుమలపై ఇలాంటి మన్నన అనూహ్యం. నేను రాజకీయంగా ఏమీ కాను. మతాధిపతిని కాను. పీఠాధిపతిని కాను. ఒక సామాన్య యోగసాధకుడిని. ఇంతటి భగవత్ప్రసాదానికి నేను అర్హుడినా అనిపించింది.

0 0 0

మరొకమారు కొండకు వెళ్లాం మా అమ్మగారు పోయినప్పుడు. కర్మ చేసినపుడు ఎక్కడైనా ఒక నిద్రచేసి రావాలన్నారు. యోగం చేస్తున్నా, నేను కర్మకాండల్ని వ్యతిరేకించను. కర్మవశాన కర్మఫలంగా జన్మించినవారం అనే నమ్మకం వున్నవారికి కర్మలు చేయాలి. లేకుంటే వారికి ఆత్మశాంతి లభించదు. నాకున్న నమ్మకం నా తల్లిదండ్రులకు లేదు గదా! వారు నా యోగం చేయలేదు. కనుక వారికి యథావిధి కర్మలు చేశాను. ఎవరైనా దేవాలయాలకు, ఆశ్రమాలకు వెడతామన్నా కాదనను. కర్మశేషం లాగే సంస్కారశేషం కొంత ఉంటుంది. అది అలా దేవాలయ దర్శనాల వల్ల, తీర్థయాత్రల వల్ల తీరిపోతుంది. మనస్సులో ఏ మాత్రం వాటిపైన మమకారం, కోరిక లేకుండా పోవాలంటే ఒకసారి దర్శించిరావడమే మంచిది. దైవదర్శనం అంటే అక్కడ దేవుడున్నాడనికాదు. అవి కొన్ని శక్తుల పీఠాలు. దైవ శక్తులన్నీ పరమాత్మ అధీనాలే! వాటిపై పిచ్చి నమ్మకాలు కూడదు గాని సంస్కారయుతంగా దర్శించడంలో, అనుభూతి చెందడంలో తప్పులేదు. ఆశ్రమాలకు వెళ్లినా, శక్తిపీఠాలైన దేవాలయాలకు వెళ్లినా మనలోని ఆత్మశక్తి ఉద్దీప్తమవుతుంది. ఉత్తేజం కలుగుతుంది. ఆత్మవికాసానికి, చైతన్యానికి మార్గం సుగమమవుతుంది.

నేను యామిని, పి. వరలక్ష్మి, పి. సుబ్బారావు, రామకృష్ణ కారు చేసుకుని వెళ్లాం. ముందుగానే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌నుండి లెటర్‌తీసుకుని నారాయణాద్రి గెస్ట్

హవుస్‌లో వి.ఐ.పి. సూట్ బుక్ చేసుకున్నాం. మాకు స్వామిదర్శనం ప్రధానం కాదు ఒక రాత్రి అక్కడ గడపాలి. సాయంత్రానికి కొండపైకివెళ్లాం. నారాయణాద్రి గెస్టుహవుస్‌లో రూం. స్నానాలు చేసి, టిఫిన్ తిని, సరదాగా అలా వనాలు, పార్కులు చూద్దామంఇన బయలుదేరాం. ఏ పార్కులోనో ప్రేయర్ చేసుకోవాలని ఆలోచన. కొంతదూరం నడిచేసరికి ఎం.సి.వి.వి. పార్కు కనిపించింది. ఇక్కడా మాస్టర్ సి.వి.వి.పార్కు ఉందేమిటి? అని జోక్ వేసుకున్నాం. మరో పది అడుగులు నడిచాం. ఒక అర్చకస్వామి వేగంగా మావైపు వచ్చి, "త్వరగా వెళ్లండి, డైరెక్టు లైన్. నిమిషంలో దర్శనం అవుతుంది. టికెట్లు కొననవసరం, లేదు. క్యూలో నిలబడనవసరం లేదు" అని నవ్వుతూ చెప్పి వెళ్లిపోయాడు.

మాకు స్వామివారి దర్శనం చేసుకోవాలని లేదు. రాత్రికి కొండపైన నిద్ర చేయాలి. సరే ఇదీ మాస్టరుగారి సంకల్పమేమో అనుకుని నెమ్మదిగా వెళ్లాం. క్యూ లేదు. జనం లేరు. గర్భాలయంలో అడుగుపెట్టి స్వామిదర్శనం చేసుకున్నాం. ఆ కుడిప్రక్కనే ప్రేయర్ చేసుకుందామని అయిదుగురం కూర్చున్నాం కాని అయిదు నిమిషాలు ప్రేయర్ కుదరక లేచి వచ్చేశాం.

మేం వెళ్లిన టాక్సీవాలా ఉదయం ఏడుగంటలకు వస్తానన్నాడు. రాలేదు. యామినీదేవికి క్షేత్రదర్శనాలు, ఆశ్రమ దర్శనాలంటే యిష్టం. ఆకాశగంగ, పాతాళగంగ చూచివద్దామని వేరేటాక్సీ మాట్లాడుకుని బయలుదేరాం. శిలాతోరణంతో ప్రారంభమైంది మా దర్శన యాత్ర. పాతాళగంగ, ఆకాశగంగ అవీ ఇవీ చూచి తిరిగి వస్తుండగా, టాక్సీవాలా ఓ మలుపుతిప్పి కొంతదూరం తీసుకుపోయి గుట్టలదగ్గర నిలిపాడు టాక్సీ.

"ఇక్కడ ఏముందయ్యా?" అని అడిగాను.

"ఇక్కడ ఏదో ఉందండీ నాకూ తెలియదు. కొంతమంది మీలాంటివారు వెడుతుంటారు" అన్నాడు.

"మాలాంటివారా?!" అంటే మాలో ప్రత్యేకత ఏముంది? ఏమో అతనికేం కనిపించిందో!

దిగి కాలిబాటన నడిచాం. వాగులు, వంకలు దాటాం. రాతిగుట్టలు ఎక్కి దిగాం. అక్కడ ఉన్నదొక చిన్నగుడి. పంచపాండవుల గుడి అట. నా మొహంలా వుంది. దీనిని చూడడం ఏమిటి? నేను, రామకృష్ణ, నీటి వాగుదాటి అవతలికి పోయాం. అక్కడొక గడ్డపాయన, బ్రహ్మంగారి గుడిలో పూజారిగా వున్నాడు. రామకృష్ణ అతనితో మాట్లాడుతుండగా, నేను చాపల్యం కొద్ది గుట్టలు ఎక్కి దిగాను. అక్కడొక చిన్న గుహ కనిపించింది. లోపల ఒక దీపం వెలుగుతోంది. అక్కడ రాసి వుంది 'శ్రీమళయాలస్వాముల వారు పండ్రెండు సంవత్సరాలు తపస్సు చేసి సిద్ధిపొందిన గుహ' అని. నాకు ఒళ్లు

పులకరించింది. ఒక మహర్షి తపస్సు చేసి సిద్ధిపొందిన క్షేత్రం అది. అక్కడ కొంతసేపు ధ్యానం చేసుకోవాలనిపించింది. వెళ్లి బ్రహ్మంగారి గుడి పూజారిని అడిగాను 'ఆ గుహకు తాళం వేసి వుంది. దాని చెవి ఎవరి దగ్గర ఉంటుంది. అందులో ధ్యానం చేసుకోవాలని కోరికగా వుంది' అని.

ఆయన "కొండపైకి వెళ్లండి. ఏర్పేడు ఆశ్రమం స్వామి పైన ఉంటారు. వారి ఆధీనంలో వుంటుంది కీ" అన్నారు. వెళ్లి విచారించగా, ఆయన ఉదయమే ఏర్పేడు వెళ్లారని, రెండురోజుల వరకు రారని చెప్పారు. ఆ స్వామి నన్ను గుర్తించారు.

"మీరు శార్వరిగారు కదూ" అని అడిగారు.

చాలా ప్రేమగా పలకరించి, "మరోసారి దయచేయండి. మీకు ఎప్పుడూ ఇక్కడ స్వాగతం లభిస్తుంది. మీరు ఎప్పుడు వస్తామంటే అప్పుడు మేమే వచ్చి తీసుకువస్తాం. మీ ఆశ్రమం త్రోవనే మేం వస్తుంటాం గద" అన్నారు. వారికి నా గురించి, నా ఆశ్రమం గురించి తెలుసు.

తిరుపతిలో ఉన్న సమయంలో ఇది ఒక మరపురాని సంఘటన. నాకు బాల్యం లోనే మళయాళస్వామిగారితో సంబంధం వుంది. నాలో ఆధ్యాత్మిక బీజం చిన్ననాటనే నాటింది మళయాళస్వామియే.

0 0 0

తిరుపతి పుణ్యక్షేత్రం. ఈదేశంలో వున్న అన్ని పుణ్యక్షేత్రాలలో ప్రసిద్ధమైనది. ఈ పుణ్యక్షేత్రాలన్నీ హిందూ మతోద్ధరణకు నిర్దేశించినవి. అక్కడ మార్పు రాదు. అక్కడి సంప్రదాయాలు మారవు. భక్తిపేర ప్రజల్ని ఆకర్షిస్తారు. అది కొంతవరకు అవసరమే. కాని మతం మత్తులో మనుషుల్ని పడవేయడం మంచిది కాదు. దేవుళ్లకు మనిషిని బానిస చేయడం అన్ని మతాలు చేస్తున్న పనే. తిరుపతిలో చాలా యోగకేంద్రాలున్నాయి. ఏ ఒక్కదానికి మనుగడ లేదు. మాస్టరుగారు కొంతకాలం తిరుపతిలో ఉన్నారుట. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చాలాకాలం ఇక్కడే వున్నారు. వారిలో దైవభక్తి కన్న యోగశక్తి ఎక్కువ. మంత్రశక్తుల కన్న యోగశక్తిపై అభిమానం హెచ్చు. నా వరకు నేను తిరుపతిని ఒక యోగకేంద్రం చేయాలని కలలు కన్నాను. అవి అన్నీ పగటి కలలే అయినాయి. అటు తమిళనాడు, ఇటు కర్ణాటక, ఇటు ఆంధ్ర మూడింటికి సెంటర్‌గా ఉంటుందని తిరుపతిపై మోజుపడ్డాను. ఏమీ చేయలేకపోయాను. సాధించడం అన్నది అసలు లేదు. ప్రస్తుత పరిస్థితిలో తిరుపతి యోగకేంద్రం కాదు అనిపించింది. ప్రభాకర శాస్త్రి గారంతటి వారే చేయగలిగినంత చేయలేకపోయారు. నేనెంత?

0 0 0

ఆమె సత్యసాయి ప్రియభక్తురాలు. టి.టి. దేవస్థానంలో ఆస్థాన గాయనీమణి. ఆమె శ్రీమతి శోభారాజు. ఒకరోజున నా వద్దకు వచ్చింది. ఆమె అక్కగారు పద్మావతీ కాలేజీ లెక్చరరు. నా వద్ద ట్రీట్‌మెంటు తీసుకున్నారు. ఆమె వెంటబెట్టుకు వచ్చారు. శోభారాజు అన్నమయ్య కీర్తనలను బహుళప్రచారం చేసింది. ఆమెకు గొంతుకు జబ్బు చేసింది. పాడడం కష్టంగా ఉంటోంది. డాక్టర్ల వైద్యం వల్ల గుణం కన్పించలేదు. పుట్టపర్తి వెళ్లింది. బాబా ఆశీస్సులు తీసుకున్నది. తిరుపతి వచ్చింది. నా గురించి విన్నది. ఆమె స్పష్టంగా చెప్పింది, తనకు బాబా అంటే వల్లమాలిన భక్తి, ప్రేమ అని. శ్రీ వేంకటేశ్వర స్వామికీ భక్తురాలే, అక్కడ ఆస్థాన విదుషీమణి! కోరి వచ్చింది. ఎలా కాదనగలను?

"మీ ఇష్టం! బాబాగారి పైన మీకున్న భక్తిని వదులుకో నవసరం లేదు. శ్రీ వేంకటేశ్వరునిపై భక్తిని వదులుకోవద్దు. పదిరోజులు నా వద్దకు రండి. నేను చేయగలిగినంత చేస్తాను" అన్నాను.

రోజూ ప్రేయర్‌కు వచ్చేది. చాలాభక్తి. అలా మేము మెడిటేషన్ ప్రారంభించగానే తను ట్రాన్సులోకి వెళ్లిపోయేది. వర్కింగు చక్కగా వచ్చింది. ఆమె ట్రాన్స్‌లో ఉండగా, ఒకసారి విభూది పెట్టబోగా ఉలిక్కిపడింది. భయపడ్డది. వణికిపోసాగింది. ఆ స్థితిలో ఆమెకు 'టచ్' యివ్వకుండాఉండవలసింది. థాట్ ట్రీట్‌మెంట్ యిస్తే సరిపోయేది. నేనే పొరపాటు పడ్డాను. ఆమె రెండుమూడు రోజులు రావడానికి భయపడ్డది. కళ్లు మూసుకుంటే వణికిపోయేది. ఆమెను చాలాదూరంగా కూర్చోమని ట్రీట్ చేశాను. పదిరోజుల్లో గొంతుక జబ్బు తగ్గింది

ఈసారి పుట్టపర్తి వెళ్లినప్పుడు బాబాగారికి నా నమస్కారాలు తెలియచేయండి' అని పంపాను. బాబా నా సేవల్ని గుర్తిస్తారు. అభినందిస్తారని నాకుతెలుసు. ఆధ్యాత్మికంగా ఒక స్థాయి దాటినవారికి అసూయాద్వేషాలు ఉండకూడదు.

0 0 0

జీవితంలో సుఖదుఃఖాల వలె, మిట్టపల్లాల వలె, స్తబ్దత, చైతన్యం కలిపి వుంటాయి. స్తబ్దతలోంచి చైతన్యం ప్రభవిస్తుంది. నైరాశ్యంలోకి ఆశ చివురిస్తుంది. అది ఒక మంచికి పురిటినొప్పులు . నైరాశ్యంలోంచి తెలివిగా బయటపడితే ప్రజ్ఞను అందు కోవచ్చు. జ్ఞానం అంచులకు చేరుకోవచ్చు. రేపు మీద ఆశలేనివాడు బ్రతకలేడు. అసలు ఆశలేనినాడు బ్రతకడం దండగనిపిస్తుంది. బ్రతకడం ఒక్కటే జీవిత లక్ష్యంకాదు. ఒక గమ్యం ఏర్పరచుకుని, ఆ గమ్యం దిశగా పురోగమించాలి. నిరాశ మనిషిని ఒకవిధంగా చంపుతుంది. మరొకవిధంగా కొత్త జీవితాన్నిస్తుంది.

నాకు మొదటినుండిస్నేహితులు తక్కువ. దాదాపు అసలు లేరనే చెప్పవచ్చు. ఇప్పటికీ వీరు నా స్నేహితులని చెప్పదగ్గవారు వేళ్లపైకి రారు. నా అభిమానుల్లో స్నేహితుల్ని చూడడం అలవాటుచేసుకున్నాను. అభిమానులంటే సాహిత్యాభిమానులు కారు. నా యోగాన్ని అభిమానించి, యోగమార్గంలో నడుస్తూ నన్ను అభిమానిస్తున్నవారు. అందుకే నాకు యోగంలో మిత్రులు అనుకున్నవారంతా మిత్రులు కాలేకపోయారు. కొందరు అకారణంగా వైరం, అయిష్టం పెంచుకుని దూరం అయినారు. అది వారి నిర్ణయం. నాకు ఎవరిపట్ల ద్వేషం, అయిష్టం లేదు. నాకు శత్రువులు లేరు. ఎవ్వరైనా నన్ను అకారణంగా శత్రువుగా భావిస్తే, అలా అని ప్రచారం చేస్తే తప్పు నాది కాదు. దాని ఫలితం నాకు రాదు. చెడు నన్ను తాకదు. మనం ఎవరినీ ద్వేషించనప్పుడు వారి ద్వేషం తాలూకు వేడిసెగలు మనవరకు రావని నా నమ్మకం.

యోగంలోకి వచ్చినవారిని శిష్యులని నేను ముద్ర వేయను. నాది మిత్ర దారిద్ర్యం. వారిలో స్నేహితుల్ని వెతుక్కుంటాను. నాకు లేనిది కోరడం తప్పు కాదు. ఎవరైనా అంతే. నాకు మంచి స్నేహితులు లేరు కనుక, నన్ను నమ్మినవారిలో, నాకోసం వచ్చినవారిలో మంచిస్నేహితుల్ని వెతుక్కుంటాను. వారిని స్నేహంగానే చూస్తాను. ఏ పేరుతో పిలిచినా, ఇష్టంగా కలిసిమెలిసి, పొరపొచ్చాలు లేకుండా జీవించడం ముఖ్యం.

అందువల్ల నిష్క్రమించిన వారిని గురించి విచారించను. వారి పాత్రపోషణ అయిపోయింది. తెరవెనక్కి వెళ్లిపోయారు. కథ నడవడానికి అవసరమైన కొత్త పాత్రలు రంగప్రవేశం చేస్తాయి. ఎవరైనా తన పాత్ర పోషించేవరకు రంగంపైన ఉంటాడు. దర్శకుడు రంగంపైకి రానవసరం లేదు. బాధల్లో వున్న వెంకట్రావు నాకు దగ్గిర అయినాడు. శైలజ యోగహృదయిని. వారిద్దరిదీ అమాయకత్వంతో కూడిన యిష్టం. మాఇంట్లో మా పిల్లల వలె మసలుకొనేవారంటే నాకిష్టం. యోగం కోసం వచ్చి గురువుకు దూరంగా ఉండాలని, చనువుగా ఉండకూడదని, మితంగా మాట్లాడాలని, వినయం నటించాలని, ఇలాంటి లిమిటేషన్స్ పెట్టుకున్నవారు ఫ్రీగా ఉండలేరు. నేను కోరేది ఫ్రీడం, ఇండిపెండెన్సీ. భక్తి, భయం అవసరం లేదు. మైత్రి, ప్రేమ పెంపొందించుకుంటే చాలు. పై పెచ్చు నిజాయితీ కావాలి. తమని తాము మోసగించుకోకుండా వుంటే, మమ్మల్ని మోసం చేయరు. కృత్రిమత్వం వదలుకుంటే, సత్యానికి చేరువ కావచ్చు.

ఒకరోజున మిత్రుడు వెంకట్రావు అన్నారు, "గురూజీ మీరు యోగదర్శనం వ్రాసి చాలా సంవత్సరాలైంది. 'యోగాశ్రమ లేఖలు' యోగాన్ని పరిచయం చేయడానికి పనికొస్తుంది. 'సావిత్రి' లాంటి మహాకావ్యం వ్రాశారనుకోండి. దాని లక్ష్యం వేరు. మన యోగానికి పనికి వచ్చే రచన ఒకటి చేయండి. ఇరవై అయిదు సంవత్సరాల అనుభవం రంగరించి మరో పుస్తకం రాస్తే సాధకులకు బాగా ఉపయోగిస్తుంది."

వారి సలహా బావుంది కానీ యోగం గురించి ఏం రాయగలను. యోగం చేయబట్టి ఏవో అనుభూతులు, అనుభవాలు కలుగుతున్నాయి. వాటిని 'రివర్స్' చేసి యోగానికి అన్వయించడం సబబా!

ఆలోచించాను. "ఏదైనా రాయాలనే వుంది వెంకట్రావుగారూ! కానీ రాసేశక్తి లేదు. బుర్రపనిచేయడం లేదు. పరిస్థితులు అనుకూలిస్తే, మీరు అన్నట్లు యోగదర్శని రెండవభాగం రాయాలి."

వెంకట్రావు ఏ ముహూర్తంలో అన్నాడో కానీ అది బీజంలా మనస్సులో నాటుకుంది. ఆ రోజునే మొదలుపెట్టాను. గాసిప్‌లాగా అనిపించినా నా అనుభవాలు, ఆలోచనలు రచనలో చొరబడసాగాయి. బాగానే ఉన్నదనిపించింది. ఏదైనా రాయడం అంటూ మొదలుపెడితే పూర్తి అయ్యేవరకూ ఊపిరాడదు నాకు. వేరే పనులు, వ్యాపకాలు పెట్టుకోను. ఒకే దీక్ష, పట్టుదల. రెండు మూడు నెలల్లో రాయడం పూర్తి అయింది. ఒక పుస్తకం రాయడానికి నాకు నూరురోజుల వ్యవధి చాలు. ఆ రాసినదానిని వసంతకుమార్ తను పనిచేస్తున్న 'ఉషోదయం'లో ప్రతిరోజు సీరియల్‌గా ప్రచురించసాగాడు. ఆ చిన్న పత్రికలో ప్రచురించినా దానికి పెద్ద ఆదరణ లభించింది. అప్పుడే 'కుండలిని' రాయడం ప్రారంభించాను. మహాచైతన్యం, కుండలిని రెండు పుస్తకాల స్క్రిప్టు చేతిలో వుంది.

యోగం చేయదలచినవారికి సాధన ముఖ్యం గాని, పుస్తకాలు చదవడం కాదని నేనే సలహా యిస్తుంటాను. అలా చెప్పి, నేను పుస్తకాలు రాయడంలో అర్థం ఏమిటి? పుస్తకాలు చదివితే యోగంపట్ల ఆసక్తి కలుగుతుంది. అభిరుచి పెరుగుతుంది. రెండు అవసరమే! ఆ రెండు కలిగినప్పుడు యోగం సాధన చేయడానికి సంకల్పం కలుగుతుంది. కనుక ప్రాథమికంగా పుస్తకాలు చదవడం వల్ల ఒక ప్రయోజనం వుంది. రెండవది : సాధన చేస్తున్నంత మాత్రాన అంతా తెలియదు. అంతటి ఆత్మజ్ఞానం కలిగినప్పుడు చదవనవసరం లేదు. అంతవరకు సాధనలో అభివృద్ధికి చదవటం అవసరం. పైమెట్టు ఎక్కుతున్నా, అలసట లేకుండా ఉండడానికి మంచిరచనలు పనికొస్తాయి. అవే టానిక్కులు. అదే ఆహారం. కనుక యోగానికి సంబంధించిన మంచిపుస్తకాలు రాయడం అవసరం. మంచిపుస్తకాలని నన్ను నేను పొగుడుకోవడం, అభినందించుకోవడం, నా మిత్రులు నన్ను అభినందించడం కాదు కావలసింది. యోగంలో లేనివారు, సరికొత్తవారిలో సైతం పుస్తకం చదివితే యోగచైతన్యం కలగాలి, స్ఫూర్తి కలగాలి. అలాంటివి నా దృష్టిలో మంచి పుస్తకాలు, ప్రయోజనకరమైన పుస్తకాలు. బాగా లాభాలు గడించిపెట్టేవే మంచిపుస్తకాలైతే నావి అలాంటి మంచివి కావు. నా పుస్తకాలు లాభాలు గడించిపెట్టవు. వాటిని చదివి పాఠకులు ప్రయోజనం పొందగలిగితే నాకు లాభం కలిగినట్లే.

ప్రతివారు 'మీ అనుభవాలు ఏవైనా చెప్పండి' అని అడుగుతారు. నేను బిక్కమొహం వేస్తాను. అనుభవాలు ఏం చెబుతాం. ఏం బావుంటుంది. చాలా బావుంటుంది అని ఆనందంగా చెబుతాం. అది అవతలి వ్యక్తికి ఆనందం కలిగిస్తుందా! లేదు. మనం పొందిన అనుభూతిని పాఠకునిలోకి బదిలీ చేయగలగాలి, కొంతవరకైనా. అది రచనకు లక్ష్యం కావాలి. ఇకపైన రాసే పుస్తకాలు అలాంటివే రాయాలని నిర్ణయించుకున్నాను. నిర్ణయం తేలికగానే చేయవచ్చు. అలా రాయడం అంత తేలిక కాదు! నా అంతరంగం ఒక అనంతసాగరం. ఎన్నో తరంగాలు, అంతరంగాలు, అంతరంగతరంగాలు ... ఎన్నింటి నని పట్టుకోను!! సముద్రం ఒడ్డున నిలబడి తరంగాల్ని పట్టుకోగలమా! కనీసం లెక్కించగలమా! లేదు. ఇదీ అంతే. ఇవి భావ తరంగాలు. పట్టుకోవడం అసాధ్యం. పట్టుకుని మాటలతో మూటకట్టడం అసాధ్యం. యోగంలో లోతుకు వెళ్లినకొద్దీ ఆలోచన లుండవు. భావాల బాటలు కనిపించవు. అంతాశూన్యం. అంతా నిర్మలత్వం. మహాశూన్య కాసారంలో భావతరంగాల కోసం వెతకనా? శాంతిని, ప్రశాంతిని, ఆత్మశాంతిని భాషలోకి ఎలాగ అనువదించను? అనువర్తించగలను? అయినా రాయాలి! రచనకు ప్రయోజనం ఉంది. ప్రతి రచనా, ప్రతి పుస్తకం కొన్ని వేల గుండెల్ని తట్టిలేపుతుంది. నిద్రిస్తున్న వారిపై చైతన్యం చిలకరిస్తుంది. అంతర్ముఖుడైతే తప్ప, ప్రజ్ఞ ప్రభవించదు. పరేంగిత ప్రజ్ఞ మాత్రమే రచనను బ్రతికిస్తుంది.

"యోగానికి ప్రచారం అవసరం లేదు. యోగంపైన పుస్తకాలు రాయనవసరం లేదు. మాస్టరుగారు రాయవద్దన్నారు" అనే పిల్లికూతలకు నేను బెదిరిపోను. అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి పరిస్థితులు వేరు. ప్రచారం కావలసిందే. ప్రచారం శాపం కాదు. వివేకానందులు దేశవిదేశాలలో రామకృష్ణ వాణిని వినిపించకపోతే రామకృష్ణ ప్రభలు ఏమయ్యేవి? అరవిందుల పూర్ణయోగం, పుస్తకాల రూపంలోనే ప్రచారం పొందింది. జిడ్డుకృష్ణమూర్తి భావవిభావరికి పుస్తకాలే ఆధారాలు. వారి ప్రసంగాలే పట్టుగొమ్మలు. ఈనాడు ప్రచారం లేనిది దేనికీ ప్రాచుర్యం లభించదు. మడికట్టుకుని కూర్చుంటే జరిగేది లేదు, ఒరిగేదీ లేదు. ఒక లక్ష్యంతో, ఒక ప్రయోజనంతో రాసిన పుస్తకాలకు ఆదరణ లభిస్తుందని నా విశ్వాసం. రచనలో సిన్సియారిటీ చాలా అవసరం. పత్రికలలో అచ్చు పడడం ఒక్కటే లక్ష్యం కాదు, కారాదు రచయితకు. ఇవి కథలు, నవలలు కాదు తాత్కాలికంగా మానసిక తృప్తి కలిగించడానికి. వాటికి సామాజిక ప్రమాణం, ప్రయోజనం ఉంటుంది. తాత్విక, యోగ రచనలకు సామాజిక ప్రయోజనం తక్కువ. ఇవి దర్శనాలు కావాలి. ఈ రచనలకు దర్శనాల స్థాయి, ప్రతిపత్తి లభించాలి. ఒక్కొక్క పుస్తకం ఒక ఉపనిషత్తు కావాలి.

- నానృషిః కురుతే కావ్యమ్ -

# 1995

## యోగప్రస్థం

**అక్టోబరులో తిరుపతి నుండి సికిందరాబాదుకు మారాము.**

ఇది అనూహ్యం కాదు. అప్రయత్నంగా జరిగిన మార్పు కాదు. పరిణామం. మానసిక పరిణామానికి భౌతిక పరిణామం ఎప్పుడూ తోడవుతుంది. అది ప్రకృతిసూత్రం. దానిని మనం గమనించం. మన అవసరం ఉన్నచోటుకే విధి మనల్ని బదిలీ చేస్తుంది. మనిషి ప్రపంచానికి ఏ విధంగానూ పనికిరానప్పుడు విధి కనికరించదు. కరుణించదు. ప్రయోజకుని మృత్యువు కబళించదు. అయోగ్యుడు, అప్రయోజకుడు అయిన ప్రతివ్యక్తిని మృత్యువు వెన్నంటి తిరుగుతుంది. మన బదిలీలకు, మజిలీలకు అర్థం వుంటుంది. నా వరకు నాకు అర్థం ఉన్నదనే అనిపిస్తుంది. సాధారణంగా అర్థాల కోసం వెతకం.

మనిషిని జీవితం కనీసం ఏడుసార్లు మలుపుతిప్పుతుంది. ఏడు మలుపులు తిరుగుతుంది. ఒక్కొక్క మలుపులో ఒక్కొక్క మెట్టు పైకి నెడుతుంది. నా జీవితమే కాదు, ప్రతిమనిషి జీవితమూ అంతే. ఇక్కడ నాకో సూత్రం జ్ఞాపకం వస్తుంది.'పునరపి మరణం-పునరపి జననం' ముందు మరణం అన్నారు. జననం ముందు కదా, తర్వాత మరణం కదా! అని ఆలోచించకండి. పూర్వసూత్రం అదే 'పునరపి జననం- పునరపి మరణం' అని. నాకు అనిపిస్తుంది మరణం ముందరిదని. ప్రతి మరణం మనిషిని ఒక్కో మెట్టు పైకి ఎక్కిస్తుంది. ప్రతి మరణం మంచిజన్మకు కారణం అవుతుంది. మనిషి నిత్యం బ్రతుకుతున్నాడా. ఊహు. లేదు. నిత్యం మరణిస్తున్నాడు. ఒకరోజు గడిస్తే ఆయుర్దాయంలో ఒకరోజు తరిగిపోయినట్లే. మృత్యువుకు మరొకరోజు దగ్గరగా వెళ్లినట్లు. అంటే నిత్యం మనిషి కాస్త కాస్త మరణిస్తూ ఉన్నాడని చెప్పవచ్చు. మళ్లీమళ్లీ మరణించడమే పునరపి మరణం. మరణిస్తున్న మనిషి, మరణానికి దగ్గరగా వెడుతున్న మనిషి, మరణించాలని కోరుకోడు. బ్రతకాలని, జీవించాలని కోరతాడు. అది పునరపి జననం. జీవించాలన్న కోరిక జననం వైపు తీసుకుపోతుంది.

అలా మృత్యువును జయించి మృత్యుంజయుడు కావాలనే ఆశ, ఆకాంక్ష ఉండడం చాలా అవసరం. అయినా అందుకు తగిన కృషి చేయం. అది అసహజం. అమృతత్వ సిద్ధికి ఆరాటమే చాలదు. పోరాటం జరపాలి. మృత్యువుతో పోరాడటం వల్ల ప్రయోజనం ఉండదు. పరమాత్మపట్ల ఆరాటం పెరిగితే, మృత్యుపోరాటంలో విజయం సాధించవచ్చు.

ఇవి నా యోగప్రస్థ భావనలు. జీవితం నాలుగింట మూడు వంతులు అయినట్లే. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం దాటి మూడవది అయిన వానప్రస్థాన్ని యోగప్రస్థాశ్రమం చేసుకున్నాను. వానప్రస్థం అంటే పూర్వకాలంలో అరణ్యాలకు పారిపోయి, ఒక పర్ణశాల నిర్మించుకుని, ప్రశాంతంగా శేషజీవితాన్ని గడపడం. లౌకిక వ్యవహారాలకు దూరంగా జరగడం. ధన, కనక, వస్తు వాహనాలపై మోజువదలించుకోవడం. నేటి పరిస్థితిని బట్టి సంసారం, ఉద్యోగం, సంపాదన, డబ్బు వ్యవహారం పూర్తిగా తగ్గించుకోవడం అనుకుందాం. మనం అరణ్యాలకు వెళ్లే అవకాశం లేదు. మనస్సునే వానప్రస్థం చేసుకుంటే చాలును. వానప్రస్థం అంటే మరొక అర్థం వుంది. సన్యాసి అని, పరివ్రాజకుడు అని, యతి అని. ఈ మూడింటి అంతరార్థం ఒక్కటే. ప్రపంచ వ్యవహారాలపట్ల ఆసక్తి తగ్గడం, భగవంతుని వైపు దృష్టి సారించడం, పరంవైపుగా మనస్సును పయనింపచేయడం. అందుకే నాది యోగప్రస్థం.

ఈ నేపథ్యంలో నా ప్రస్థానం యోగాశ్రమానికి మారింది. యోగాలయం' అని నా ఆవాసానికి నామకరణం చేసుకున్నాను. మాస్టరుగారు యోగం ప్రారంభించిన తొలినాళ్లలో తమ ఇంటిని 'యోగాలయ' అన్నారు. తర్వాత యోగాస్కూలు, యోగమిత్రమండలి ఏర్పడ్డాయి.'యోగాలయం' లో మాస్టరుగారు పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశారు. అనేక అపూర్వ ప్రయోగాలు చేశారు. అలాంటి ప్రయోగాలు ఏవీ నేను చేయను. చేయలేను. మాస్టరుగారి యోగం నీడలో సేద తీరాలన్నది, విశ్రమించాలన్నది నా చిరుకోరిక, చిరకాల వాంఛ.

యోగంలో చేరి 25 సంవత్సరాలు దాటింది. యోగులకు రజతోత్సవాలు జరపరు. ఈ పాతికేళ్లలో ఏం సాధించాను అన్నది ప్రశ్న? అన్నింటిపైన అభిరుచి చంపుకొని, యోగం చేయడం వల్ల ఏం ఒరిగిందన్న ఆలోచన?! ఏమీ తెలియటం లేదు. అంతా శూన్యం అనిపిస్తున్నది. అయితే ఒక్కటి మాత్రం నిజం. కొందరికైనా యోగం పట్ల ఆసక్తి కలిగింది. ఒక వేయిమంది నా వద్దకు రావడం, యోగసాధన ప్రారంభించడం జరిగింది. పరోక్షంగా ప్రభావితులై యోగం చేస్తున్నవారు కనీసం మరో రెండువేలమంది వరకు ఉంటారు. కొన్ని వేల మంది ట్రీట్‌మెంట్స్ తీసుకుని ఆరోగ్యం పొందారు. అది ఒక్కటే 'కనిపించే' ఉపయోగం. నా వరకు అది తృప్తి. స్వంతంగా యోగం చేసుకుంటున్న వారు అప్పుడప్పుడు సలహాలకు, సంప్రదింపులకు వస్తుంటారు. ఏ కొంత యోగం చేసినవారికైనా ఆత్మతృప్తి ఉంటుంది. మనశ్శాంతి కలుగుతుంది. ఆరోగ్యం సమకూరుతుంది. అంతవరకు చెప్పగలము. యోగంలో చేరినంత మాత్రాన అందరూ మహాయోగులైనారని, మృత్యుంజయులవుతారని చెప్పను. యోగి తన సాధనలో ఎక్కవలసిన మెట్లు

అనేకం ఉన్నాయి. దర్శించవలసిన శిఖరాలు చాలా వున్నాయి. యోగాగ్ని కీలలు తట్టుకో గలవారు కొందరే. ఆ యోగాగ్ని శిఖరాలను దర్శించగలవారు మరీ తక్కువగా ఉంటారు.

యోగంలో ఎంతమంది చేరారన్న ది ముఖ్యం కాదు. ఎంతమంది యోగాన్ని సాధన చేస్తున్నారు. చేరిన నాటి నుండి నేటివరకు అప్రతిహతంగా సాధన చేస్తున్నారు అన్నది ముఖ్యం. ఒకరోజు చేసి, ఆరు రోజులు మానివేసేవారి గురించి ఆలోచించనవసరం లేదు. నా వద్ద ఈ పదిహేను సంవత్సరాలకాలంలో చేరినవారు అతిరథులున్నారు, అర్ధరథులున్నారు. ఎవరి దీక్ష వారిది. ఎవరి సాధన వారిది. ఎవరి సాధనబట్టి వారికి శక్తి అందుతుంది. అందులో నా ప్రమేయం లేదు. ఆర్జిత శక్తులు వారి స్వంతం. కొందరు గురువులై పోయారు. సంతోషం. మాస్టరుగారు తనంతటివారిని చేస్తానన్నారు కనుక ఎవరి అభివృద్ధిని ఎవరూ అనుమానించకూడదు.

నాటికీ నేటికీ నన్ను వదలక, నాతో నడుస్తున్నవారు ఉన్నారు. వారు నాకంటే తక్కువని, నేను వారికంటే ఎక్కువని అనుకోను. అందరం యోగమార్గంలో బాటసారులమే. ఓపిక, శక్తి, వయస్సు ఉన్నవారు ముందుకు పరుగుతీస్తారు, వేగంగా నడుస్తారు. కొందరు నెమ్మదిగా నడుస్తుంటారు. అందరి గమ్యం ఒక్కటే. అందరి మార్గం ఒక్కటే. కాదంటే కాస్త ముందు వెనుకలు. కొందరు నన్ను దాటిపోయినవారూ ఉండవచ్చు. ఎవరు ముందుకు పోతున్నారా, ఎవరు వెనుక బడ్డారా అని, నిలిచి చూచేది లేదు. నా నడక నాది. ఒక్కక్షణం అయినా విశ్రమించను. కొందరు యోగం పూర్తిగా తమకు వచ్చిందనుకుంటారు! యోగం రావడం అంటే ఏమిటో నాకు అర్థం కాదు. నావరకు ఎన్నిమెట్లు దాటినా ఇంకా ఎక్కవలసిన మెట్లు చాలానే ఉన్నట్లు తోస్తున్నది. ఎన్ని శిఖరాలు ఎక్కినా, ఆపైన ఇంకా చాలా శిఖరాలు కనిపిస్తున్నవి. కనుక ఇది అనంతయాత్ర. పోయిన కొద్దీ గమ్యం మారుతున్నది. సరిహద్దులు చెరిగిపోతున్నాయి. ఆద్యంతాల మధ్యన ఒక పరమాణువులా నిలబడ్డాననిపిస్తుంది. అణువులా కాక 'ఆత్మ' వలె నిలిచిపోతే చాలును. నా అన్వేషణ పూర్తి అవుతుంది. నా జిజ్ఞాస ఒక తీరం చేరుతుంది. ఇదొక మహార్ణవం. ఇది అనంతరోదసి. రోదసిలో ఎంత దూరం వెళ్లినా గమ్యం అగమ్యంగానే ఉంటుంది.

యోగప్రస్థం నా వ్యక్తిగతం...పర్సనల్. నా తృప్తి కోసం నేను పెట్టుకున్న పేరు. యోగాలయ కట్టుకున్న మందిరం. ఇది నా మిత్రసాధకుల ఆశయం, వారికి ఆశ్రయం. ఇది మాస్టర్ యోగాశ్రమం. అందరికోసం ఇది యోగాశ్రమం. నా వరకు యోగాలయం.

ఇక్కడ మాస్టర్ యోగాశ్రమం ప్రచురించిన తొలిగ్రంథం 'మహాచైతన్యం.' ఇది నా రచనల్లో ఒక కొత్తమలుపు. లోగడరాసిన పుస్తకాలకు మహాచైతన్యానికి చాలా తేడా వుంది. దీనిలో ఏమున్నదో నేను చెప్పలేను. ఏదో వుంది. చాలా వుంది. జిజ్ఞాసులకు

కావలసిన సమాచారం వుంది. యోగసాధనలో అనుభవాలు కొత్తచివుళ్లు వేస్తుంది. ఇది మహాచైతన్యం. రచయితగా నాకు పూర్తి తృప్తి కలిగించింది. 'మహాచైతన్యం'లో నేనున్నాను. నా యోగం వుంది. నా జిజ్ఞాస వుంది. నా సాధన వుంది. నా అనుభూతి వుంది. నా అనుభవం కలగలసి వుంది. చదివేవారికి తృప్తినిస్తుంది. అనుభూతిని మిగుల్చుతుంది. ఇది ఒక సమగ్రరచన అనిపిస్తుంది. చాలామంది చాలా పుస్తకాలు రాస్తారు. వారి పుస్తకాల పేర్లు కూడా వారికి జ్ఞాపకం ఉండవు! ఇంక చదువరులు జ్ఞాపకం పెట్టుకునే అవసరం ఎక్కడ! 'సావిత్రి' పదేళ్ల క్రితం ఒక సంచలనం కలిగించింది. మళ్లీ పదేళ్లకు ఇప్పుడు నా ఆలోచనలో మార్పు వచ్చింది. ఈ భావపరంపరలో మొదటి తరంగం 'మహాచైతన్యం', దీని తర్వాత 'కుండలిని' రాశాను. తర్వాత 'శక్తిపాతం.' ఈ మూడూ సాధకులకు ఉపయుక్తమైనవేనని నా విశ్వాసం. యోగంలో నన్ను తీర్చిదిద్దింది శ్రీ అరవిందుల ఆలోచన, మాస్టర్‌గారి అంతర్వీక్షణ. రెంటినీ విడదీయలేను. జిడ్డు కృష్ణమూర్తిగారి తాత్విక దృష్టి కొంత నా రచనలకు పైపూత అయివుండవచ్చు.

ఈ కొత్తపుస్తకాలు రాసింది నేను అయినా, నాలో ప్రేరణ కలిగించి, నాచే రాయించిన మహాత్ములు, మాస్టర్లు, మహాయోగులు ఎందరో నా వెనక ఉండి ఉంటారు. ఇవి సత్యసమ్మతాలు కావడం ముఖ్యంగానీ ఏ ఆలోచన ఎవరిదీ అన్నది ముఖ్యం కాదు. వారి వారి తపస్సు, మనలో ప్రేరణ కలిగిస్తుంది. నాలో వైబ్రేషన్ కలిగిస్తుంది. నేను ఎదగడానికి వీలు కల్పిస్తుంది. మహాచైతన్యం, ఆ తర్వాత రాసిన పుస్తకాలు ఒక్కసారిగా రాసినవి కావు. ఒక్క జీవితకాలంలో రాయగలిగినవి కావు. అనేక జన్మల సంస్కృతి, ఆర్జితజ్ఞానం, చేసిన తపస్సు, సాధన... ఎన్నో, ఎంతో వాటికి అండగా వున్నాయి. వాటిలో అంతర్లీనంగా కదలాడతాయి.

ఈ మధ్యలో ఒక చిన్న సంఘటన జరిగింది.ఉస్మానియా యూనివర్సిటీలో ప్రొఫెసర్ డా.బి. రామరాజుగారు ఒకరోజున ఫోన్ చేశారు, తాను ఆంధ్ర యోగులపైన ఒక పుస్తకం రాస్తున్నట్లు, అందులో మాస్టర్ సి.వి.వి.గారిపై రాయడానికి సహాయం చేయమని. అంటే మాస్టరుగారిని గురించి వారికి చెప్పాలి. వారి జీవితం కావాలట. నేను యోగం గురించి కాస్త చెప్పగలనేమో గానీ మాస్టర్‌గారి జీవిత విశేషాలు చెప్పలేను. "సరే... కలుసుకుందాం!" అన్నాను. ఆ ఫోన్ వచ్చినప్పుడు శ్రీ కె. కృష్ణమూర్తిగారు ప్రక్కనే వున్నారు. "మీరే మాస్టర్‌గారి జీవిత చరిత్ర రాయండి. రామరాజుగారు మన యోగం చేయరు గదా! వారి వల్ల ఏమవుతుంది" అన్నారు. ఆ రాత్రి నిద్రపట్టలేదు. కృష్ణమూర్తిగారి మాట నన్ను నిద్ర పోనివ్వలేదు. నాలుగు రోజులు ఆలోచించి, రాతకు ఉపక్రమించాను. "మాస్టర్ సి.వి.వి. జీవితకథ" ప్రారంభించాను. రెండు నెలల్లో రాయడం పూర్తి చేశాను. వెంటనే సమావేశాల నాటికి అచ్చువేయడం జరిగింది.

మాస్టర్ గారి జీవిత విశేషాలు కావాలని అడిగిన ప్రొఫెసర్ రామరాజుగారు మళ్లీ ఫోన్ చేయలేదు. బహుశః రచనా కార్యక్రమంలో నిమగ్నులై ఉంటారు. ఈలోగా నేను పుస్తకం రాయడం, అచ్చుకావడం, వేసిన కాపీలన్నీ అమ్ముడుపోవడం జరిగింది. శ్రీ రామరాజుగారు ఏదో పత్రికలో సమీక్ష చూచి ఆ పుస్తకం ప్రతి ఒకటి తనకు కావాలని ఉత్తరం రాసేసరికి కాపీలు అవుట్ ఆఫ్ ప్రింట్. వారు వరంగల్‌లో ఆ పుస్తకం సంపాదించి, తమ ఆంధ్ర మహాయోగులు గ్రంథంలో మాస్టర్‌గారి గురించి రాశారుట.1996లో నావి నాలుగు పుస్తకాలు వెలువడ్డాయి. ఒక్క సంవత్సర కాలంలో నాలుగు పుస్తకాలు వేయడం అపూర్వ సంఘటన. అలాగే ఆ నాలుగు పుస్తకాలు ఏడాదిన్నర కాలంలో పునర్ముద్రణకు రావటం మరో అపూర్వ సంఘటన.

ఇప్పుడు అనిపిస్తుంది. మనిషి సాధనలో ఒక స్థాయికి వస్తే తప్ప యోగవిషయాలు రాయలేడు అని. విషయ సేకరణతో ఏవో రాయవచ్చు. రాతకు అనుభవం ముఖ్యం. మనంగా సాధన చేసి, అనుభూతి చెంది, అనుభవంతో రంగరించి రచన చేస్తే పాఠకుల హృదయాలకు హత్తుకుంటుందని అనిపిస్తుంది. రచన జీవితంలోంచి, అనుభవంలోంచి పుట్టుకురావాలి. అప్పుడే అది పాఠకులలో అనుభూతి కలిగిస్తుంది. గొప్ప తృప్తిని మిగుల్చుతుంది. ప్రతి ఆధ్యాత్మిక రచన ఆ దివ్యధామానికి ఉన్న బంగారు వాకిళ్లను తెరవగలగాలి.

## నేనెవరు??

ఆత్మాన్వేషణలో ప్రతివారికి ఎదురునిలిచే ప్రశ్న 'నేనెవరు?' దానికి సమాధానం లభిస్తే ఆత్మదర్శనం అయినట్లే. ఆ ప్రశ్న కలగడమే జిజ్ఞాస. అన్వేషణే తపస్సు. ఆరాటమే సాధన. పూర్వాశ్రమంలో నేనొక కవిని, రచయితను, జర్నలిస్టును - అది బ్రతుకుబాట - జీవిక కోసం వెంపర్లాట. ఇప్పుడు నేను యోగాశ్రమ వాసిని. కవిని కాను, రచయితను కాను. జర్నలిస్టును కాను. అయినా కాకుండాపోను - ఒకనాడు నేను అయి, ఈనాడు కాకుండా ఎలా పోతాను! నాలో ఆ మూడు ముఖాలు ఉన్నాయి. ఉంటాయి.

ఇప్పుడు నేనెవరు?!

యోగినా, తత్వవేత్తనా, దార్శనికుడినా? అప్పుడు మూడు ముఖాలు, ఇప్పుడూ మూడు ముఖాలు. కనిపించేది ఒకే ముఖం. కనిపించని ముఖాలు మూడు బహుముఖాలా? యోగి అయినా, తత్వవేత్త అయినా, దార్శనికుడైనా చేసేపని ఒక్కటే సత్యాన్వేషణ. సత్యంకోసం సాధన. సాధనకోసం ఆరాధన. సాధన పూర్ణవికాసం చెందినప్పుడు సాధకుని ప్రజ్ఞ ఏ రూపంలో వికసిస్తుందో చెప్పలేం. నేనెవరో నాకు తెలియక, ఇంకా నన్ను నేను వెతుక్కుంటున్నాను. నాలో నన్ను అన్వేషిస్తున్నాను.

ప్రతి మనిషికి ఒక గమ్యం వుంటుందని చెప్పలేం. ప్రయత్నించి ఏర్పరచుకున్న వారికి గమ్యం వుంటుంది. కొందరు ఏ గమ్యం లేకుండా పరుగులు తీస్తుంటారు. అలసి పోతుంటారు. గమ్యం ఉన్నవారు పరుగులు తీయరు - అలసిపోరు. ఒక గమ్యాన్ని ఏర్పరచుకోవడంలోనే మనిషి విజ్ఞత వుంది. జీవితలక్ష్యం అలాంటిదే. నదికి గమ్యం సాగర సంగమం. మధ్య ఎన్నో ఉపనదుల్ని తనలో కలుపుకుంటుంది. చివరికి తనూ లేకుండా సాగరంలో కలిసిపోతుంది. తన ఉనికిని సైతం కనిపించకుండా చేసుకోవడం నది లక్ష్యం. జీవుడూ అంతే, మహాసాగరం వంటి పరమాత్మలో కలిసిపోవడం జీవుని లక్ష్యం. ఆత్మకు పరమావధి.

నా జీవితం ఒక చిన్ననది లాంటింది. ప్రతి నది కొండల్లో, కోనల్లో, పది చినుకులతో ప్రారంభమవుతుంది. ఈ జీవితనది కొండలు, కోనలు దాటింది. అనేక కష్టాలు పడి, నష్టాలు భరించి, చిన్నచిన్న ప్రవాహాలను తనలో చేర్చుకుని, కొంత

విస్తరించి, ప్రవహిస్తున్నది. ఇంక వెనుతిరిగే ప్రసక్తి లేదు. మహాసాగర సంగమమే లక్ష్యం. ఇది చైతన్య ప్రవాహం. ఇది జీవనది.

నా జీవితాన్ని నేను ఎన్నడూ శాసించలేదు. ఇలా సాగాలని నిర్దేశించనూ లేదు. విధికి తలవంచినా, తల ఎత్తుకునే తిరిగాను. అవసరమైనపుడు విధికి సైతం ఎదురుతిరిగాను. విధికి ఎదురు నిలిచాను. అలాగే కర్మశేషాన్ని కొంతలో కొంత అనుభవిస్తున్నట్లు వినమ్రంగా వుంటూ, కర్మను సైతం ధిక్కరించాను. నెమ్మది నెమ్మదిగా, నా భవిష్యయాత్రకు, ఈ జీవనరథానికి నేనే సారథ్యం వహించాను. స్టీరింగు నా చేతిలోకి తీసుకున్నాను. నన్ను నడిపిస్తున్నది నా శక్తి కాదు. మరేదో అజ్ఞాతశక్తి. అదేదో ఉన్నదని తెలుసుగానీ, అది నాలోనే ఉన్నదని తెలియదు.

నేనెవరు? అన్న ప్రశ్నకు సమాధానంగా ఒక సత్యయోగి ఆత్మకథా కథనం రాసి, 'ఆత్మయోగి సత్యకథ'గా దానిని తీర్చిదిద్దుకున్నాను. ఇది నాకథా? కావచ్చు, కాకపోవచ్చు! అందులో నేను కనిపిస్తాను కనుక అది నా కథే అయి ఉండవచ్చు. కనిపించని నేను పెక్కుచోట్ల ఉంటాను కనుక అది నా కథ కాకపోవచ్చు. అందుకే దానికి 'ఆత్మయోగి' పరంగా సత్యాన్ని ఆశ్రయించినవాని కథగా, సత్యకథగా మలిచాను. ఎన్నో పుస్తకాలు రాశాను. ఇంకా ఈ రంధి ఏమిటి అనిపిస్తుంది. అవి రాసింది ఇతరుల కోసం, ఇది రాసుకున్నది నా కోసం! నా గురించి నాకు తెలియాలి కదా! లేకుంటే నేనెవరో నాకెలా తెలుస్తుంది. ఇది ఆత్మ పరిశీలన, ఆత్మ విశ్లేషణ. ఈ పుస్తకంలో 'నా' వెనుకనున్న శక్తిని గుర్తిస్తే నన్ను నేను గుర్తించినట్లే ... నన్ను నేను తెలుసుకున్నట్లే.

యోగం నన్ను మార్చింది. మనస్సు మారడం వల్లనే యోగంలోకి వచ్చానేమో! ఏదైతేనేం, నేను నేను కాకుండా పోయాను. నేను మరొక 'నేను' గా మారాను - నన్ను నేను తెలుసుకోగలిగాను. యోగం నన్ను మార్చింది అనడానికి నిదర్శనం – గొప్పగా ఊహించిన సాహిత్య రచనపై మక్కువ సన్నగిల్లిపోవడం - కథలు, నవలలు, కవితలు రాయకపోవడం రచయిత అయినవాడికి ఆత్మహత్యాసదృశం. అని అసలు రాయడం మానలేదు. కలం పాళీ మారింది. కలంలో సిరా మారింది. రంగు మారింది. రచనలో రుచి మారింది. రచనా లక్ష్యం మారింది. నేను మారాను. నా ప్రపంచం మారింది. మరో ప్రపంచం నాదైంది. నాదైన కొత్త ప్రపంచంలో బ్రతకడం కాక జీవించడం అలవాటైంది. ఈ కొత్త అలవాటు గొప్ప తృప్తిని, ఆనందాన్ని యిస్తోంది. ఇది సత్యం.

సత్యం చాలా కఠోరమైనది. కఠినమైనది. వజ్రం కఠినమే. కాని వజ్రం విలువ వజ్రానిదే! వజ్రాన్ని వజ్రంతోనే ఛేదించాలంటారు. సత్యాన్ని సత్యంతోనే దర్శించాలి. మనం సత్యపథాలలో లేకుండా, సత్యమైన యోగసాధన చేయకుండా సత్యాన్ని దర్శించలేం.

సాధకునికి సత్యం అందినట్లే అనిపిస్తుంది కానీ అందదు. చేతికి అందదు. స్ఫూర్తికి అందుతుంది. అనుభూతికి అందుతుంది. అంచేత సత్యాన్వేషికి గమ్యం ఉండదు. దానిని అందుకోవాలన్న తపన ఉండదు. ఆశ ఉండదు. ఆవేశం ఉండదు. అందనంత మాత్రాన నిరాశపడడు.

యోగంలో సైతం అనేకమెట్లు ఎక్కడం, దిగడం జరిగింది. కష్టాలు, నష్టాలు తప్పలేదు. అన్నింటినీ భరించగల శక్తి యోగసాధన యిచ్చింది. అవమానాలు భరించినా కన్నీరొలకలేదు. అన్నీ మాష్టరుగారే అన్న నమ్మకం, నన్ను, నా వారిని నడిపిస్తోంది. యోగం నాకే మిచ్చిందని నేను ప్రశ్నించుకోలేదు! యోగానికి నేనేం చేశాను? చేయగలిగానని ప్రశ్నించుకుంటాను. దానికి సమాధానం... నా జీవితం...నా సాధన... నా యోగం. ఏదో సాధించాలనుకోవడం, సాధించానని తృప్తిపడడం కూడా అజ్ఞానమే అవుతుంది.

ఇది నేను రాసుకున్న ఏడుపదుల నా ఇష్టపది.
ఇది నేను ఆలపించిన ఏడు దశాబ్దాల జీవనగానం.
ఇది నేను మనసుపడి కట్టుకున్న ఏడురంగుల హరివిల్లు.
ఇది నేను అల్లుకున్న పూరిల్లు - ఇదే నా పొదరిల్లు...
నేను వినిపించిన రాగాలు కొన్ని - వినిపించనివి మరికొన్ని...
గుండెలో పదిలంగా దాచుకున్నవి మరిన్ని...
ఎన్నని చెప్పను? ఎన్నని విప్పను?
ఎన్నదగినవి, విన్నవించదగినవి - ప్రతి వ్యక్తి జీవితంలో కొన్నే ఉంటాయి.
ఆలించదగినవి, అనుభవించదగినవి కొన్నే ఉంటాయి.
ఇవి నేను కట్టుకున్న రంగురంగుల తోరణాలు
కొన్ని వెలిసిపోయాయి. కొన్ని మాసిపోయాయి.
మరికొన్ని రంగులు కాలంతో కరిగిపోయాయి.
కరిగిపోగా, మిగిలినవి ఇవే-
కనలిపోగా, మనస్సుకు తగిలినవి ఇవే-

ఈ రంగులు, ఈ రాగాలు పోనీ ఇలాంటివి మీలోనూ, మీ జీవితాల్లోనూ ఉంటాయి. వాటిని చూసుకోడానికి, చూచి మురిసిపోవడానికి, నా బ్రతుకు అద్దంలా పనికొస్తే అదే పదివేలు - అందుకే నా వేడికోలు.

... ఇప్పటికింతే -